మక్సీమ్ గోర్కీ

# అమ్మ





విశ్వ విఖ్యాత రష్యన్ రచయిత మక్సీమ్ గోర్కీ (1868–1936) నవల "అమ్మ" తెలుగు పాఠకుల అపారాభిమానాన్ని చూరగొంది. ఈ అభిమానాన్ని పురస్కరించుకొని ఈ నవలయొక్క ఈ మూడవ ముద్రణ వెలువడుతూంది.

సుప్రసిద్ధ గోర్కీ రచనా విజ్ఞాన వేత్త, డాక్టర్ ఆఫ్ ఫిలోలజీ, ప్రొఫెసర్ బోరిస్ బ్యాలిక్ ఈ ముద్రణకు ఉపోద్ఘాతం రాశాడు.

*

"గోర్కీని నేను వ్యక్తిగతంగా ఎరుగుదును, యూరపియన్ రచయితల్లో ప్రజ్ఞావంతుడైనట్టే, ఘనుడైనట్టే రచయితగానే కాకుండా, బుద్ధిశాలి, దయాళుడు, సానుభూతిపరుడైన మానవునిగా కూడా నేనతన్ని అభిమానిస్తాను."

లియో టాల్‌స్టాయ్. డైరీనుండి

*

"గోర్కీ ప్రతిభా భాండారానికి ఒకటే పేరు — సత్యం."

స్టెఫాన్ జ్వైగ్

*

"మానవ సారస్వత పతాకాన్నైన చిత్రించివుంది — గోర్కీ హృదయం, మరి ఈ హృదయంలో వుంది — సర్వ ప్రపంచ శాంతి."

కృష్ణచంద్ర

అనువాదం: క్రొవ్విడి లింగరాజు
ఉపోద్ఘాతం, మలిపలుకుల అనువాదం:
పుప్పల లక్ష్మణరావు

ముఖచిత్రం: వి. ఇల్యూష్చెంకో

ప్రథమ ముద్రణ 1969
ద్వితీయ ముద్రణ 1976
తృతీయ ముద్రణ 1981
సంపాదకులు : విదమర్తి ఉమారాజేశ్వరరావు

М. Горький
МАТЬ
*На языке телугу*

M. Gorky
MOTHER
*In Telugu*

సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

$\Gamma \frac{4702010200-002}{031(01)-88} 347-88$

ISBN 5-05-002034-4

# ఉపోద్ఘాతం
# మరి అతని యాత్రకు అంతు లేదు

1892లో మక్సీమ్ గోర్కీ అనే కలంపేరుతో అలెక్సేయ్ మక్సీమొవిచ్ పేష్కొవ్ తొలి రచన వెలువడింది. నీజ్నీ నోవ్‌గొరొద్‌లోని ఒక కర్మాగారంలో పనిచేస్తూన్న అలెక్సేయ్ పేష్కొవ్ వయస్సు అప్పుడు ఇరవైనాల్గేళ్లు. కాని అతడప్పటికే ఎన్నో బాధలు భరించి జీవితానుభవ భాగ్యాన్ని ఎంతగా సముపార్జించాడంటే, ఈ విషయంలో అతనికంటె ముందరి రచయితలలోనూ, అతని సమకాలిక రచయితలలోనూ కొద్దిమంది మాత్రమే అతనితో సరితూగగలరు. అంతేకాదు, జీవితపు అట్టడుగు లోతులనుండి పైకివచ్చి, ప్రపంచ సంస్కృతి ఉన్నతోన్నత శిఖరాలను అంత త్వరగా అందుకున్న మరొక రచయితను పేర్కొనడం దుస్సాధ్యమే.

గోర్కీ జీవితకథ అందరికీ తెలిసినదవడంచేత దానిని వివరించడం చర్వితచరణమే అవుతుంది. అయినప్పటికీ ఒక విషయాన్ని జ్ఞప్తికి తేవాలని నాకుంది. అదేమిటంటే: తన ఖ్యాతి దిగంతమూ వ్యాపింపజేసిన సాహితీవ్యాసంగ ప్రారంభానికి కొద్ది యేళ్లకు ముందు, కజాన్ నగరంలో బ్రెడ్డు తయారుచేసే బేకరీలో పంధొమ్మిదేళ్ల అప్రెంటిస్ బేకర్ కుర్రవాడు ఆత్మహత్య చేసుకుందుకు ప్రయత్నించాడు. ఎటువంటి బాధలు అతనిని ఈ ఘోర కృత్యానికి పురిగొల్పాయి? జైల్లోని చీకటికొట్టును జ్ఞప్తికి తెచ్చేటంత అంధకారంగా ఉక్కగా వున్న నేలమాళిగలో నిరాశానిస్పృహల దరికి లాక్కుపోయేటంతటి దుర్భరమైన గొడ్డు చాకిరీ అతనిని బహుశ ఇందుకు లాక్కుపోయిందేమో? ఇదే "కనొవాలొవ్," "ఇరవై ఇద్దరు మొగాళ్లూ, ఒక ఆడదీ," తదితర రచనలలో గోర్కీచే సవివరంగా స్మృతిపథంలో చెరగని ముద్రగా నిలిచిపోయేటట్లు వర్ణించబడింది. కాదు, కాదు. ఈ యువకుడు అంతకుముందే రేవు కళాసీగా, వ్యవసాయ కార్మికునిగా, ఓడను ఈడ్చుకొనిపోయే కూలివానిగా రోజులతరబడి పనిచేసి, నికృష్టమైన కాయకష్టాన్నీ, భరించనలవికాని శ్రమనూ ఓర్చి, దుర్భరదారిద్ర్యాన్ని చిన్ననాటినుండీ అనుభవవేద్యంగా ఎరిగినవాడే. అతనిని ఈ దారుణకృత్యానికి ప్రేరేపించిన కారణం వేరు. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను తెలుసుకునే శక్తిసామర్థ్యాలు ప్రజలకున్నాయని తెలియజేసే గ్రంథాలనెన్నింటినో అప్పటికే అతడు అధ్యయనం చేయగల్గాడు, ఆ విషయాన్ని అతడు మనసారా నమ్మాడు. ఆ నేలమాళిగ కారాగృహంలో తనతో కలిసి పనిచేసినవారి మనస్సులలో తాను ఈ భావాలను నాటగల్గినట్టు కూడా అతనికి అనిపించింది. కాని కజాన్ నగరంలో (భావి సంవత్సరాలలో గోర్కీకి గొప్ప మిత్రుడు కానున్న యువకుడు వి. ఐ. లెనిన్ ప్రధానపాత్రను వహించిన) విద్యార్థి ఆందోళన ప్రజ్వరిల్లిన రోజుల్లో, విద్యార్థుల పైబడి వారిని చితకకొట్టవలసినదిగా అతని తోటిపనివారే అతనిని ఒప్పించబోయారు. మరి అతడో — వీరి ప్రయత్నాలను చూచి అతడు ఎంతటి ఆశ్చర్యంపొంది, ఎంతటి తీవ్ర

మైన మానసికక్షోభను అనుభవించాడంటే, అది ఎంతటి ఘోరమైన పనో వాళ్లచేత నమ్మింప జేసేందుకు అతడు కనీసం ఒక్క మాట అయినా చెప్పలేకపోయాడు. నిరాశానిస్పృహాలు అతన్ని ఆవరించిన ఈ తరుణంలో కజాన్క నదీతీరాన వున్న కొండచరియ పైనుండి తుపాకి కాల్పు చప్పుడు మారుమోగింది.

సరాసరి గుండెకి గురిచేయబడిన ఆ తుపాకిగుండు తన లక్ష్యాన్ని చేరుకొని వుంటే అలెక్సేయ్ పేష్కొవ్ గురించి మనకి తెలిసివుండేదే కాదు, రచయిత మక్సీమ్ గోర్కీ మనకి దక్కివుండేవాడు కాదు. కారుచీకట్లు అలముకొన్న ఆ దినాల్లో అనేక యువ జీవితాలు హఠాత్తుగా అంతమొందినట్టే అతని జీవితం కూడా అంతమయ్యేది. కాని ఆ తుపాకిగుండు గుండెకు పక్కగా దూసుకుపోయి ఊపిరితిత్తిని గాయపరచింది. స్మారకం వచ్చేసరికి తాను ఆస్పత్రిలో వున్నట్టు తెలుసుకున్నాడు. తన మనస్సుకు అంత తీవ్రంగా బాధకల్గించిన తన బేకరీ మిత్రులందరివైపూ కన్నెత్తిచూశాడు. వారి ముఖాల్లో తన స్థితిపట్ల ఆందోళనమూ ప్రేమపూరితమైన మందలింపులనూ అతడప్పుడు చూచాడు. ఈ మనుషులు స్వతహాగా చెడ్డవాళ్లుకారు, చెడ్డ అనేది పరిస్థితులలోనే — అజ్ఞానాంధకారంలో మీరు పడివుండాల్సిందని శాసించిన పరిస్థితులలోనే — వుందని అతడప్పుడు గ్రహించాడు. అటువంటప్పుడు, నిరాశా నిస్పృహాలలో పడడం సిగ్గుచేటవుతుంది. జీవితాన్ని పునర్నిర్మించడం సాధ్యం, పునర్నిర్మించి తీరాలి కూడా. కాని ఇందుకు జీవితాన్నీ, ప్రజనీ, తన జన్మభూమినీ బాగా తెలుసుకోవడమూ, ఏ మాటలూ, ఏ భావాలూ, ఆదర్శాలూ మనుష్యులను పోరాటానికి లేవనెత్తుతాయో ఆ మాటలనూ, ఆ భావాలనూ ఆదర్శాలనూ వెతకి కనుగొనడమూ అవసరం.

ఆనాటినుండి ఏ కాయకష్టమూ గోర్కీ మనస్సును కుంగదీయలేకపోయింది. మరి కష్టాలూ, బాధలూ, ప్రమాదాలూ — ఒకటీ రెండూ కాదు, ఎన్నిటినో అతడు ఎదుర్కొన్నాడు — ఆ బాధలూ, ఆ కష్టాలూ వందమందికి పంచిపెట్టినా ఇంకా మిగిలిపోతాయి. 1891–1892 సంవత్సరాలలో రష్యాలో ఘోరమైన కాటకం విలయతాండవంచేసింది — క్షామదేవత లక్షలాది రైతులను తమ కుటుంబాలతో గ్రామాలకు గ్రామాలుగా జన్మస్థలాల నుండి నిర్దాక్షిణ్యంగా వలసపట్టించింది. లియో టాల్స్టాయ్, చేహొవ్, కొరొలేంకొ, తదితర రష్యన్ రచయితలూ క్షామబాధితులకు సహాయాన్ని సంఘటితపరచడంలో శక్తివంచనలేక పాటుపడ్డారు. గోర్కీ అప్పటికింకా రచయిత కాలేదు కాని, క్షామబాధితులలో ఒకడయాడు. ఇతర క్షామబాధితులతో కలసి అతడు కూడా ఉక్రైన్, క్రైమియా, కాకసస్ రాష్ట్రాలగుండా తిండికోసం తిరిగాడు. ఈ ప్రస్థానంలో అతడు అనేక పర్యాయాలు చావు పర్యంతం దెబ్బలు తిన్నాడు, పలుపార్లు "అనుమానాస్పదుడు"గా పోలీసులకు పట్టుబడి, ఎన్ని బాధలు అనుభవించాడంటే, నిజంగా అతడు ప్రాణాలతో ఎలా బయటపడ్డాడో ఊహించుకొనడమే కష్టమవుతుంది. కాని ఇవన్నీ కూడా అతనిలో వెనుకటిలా నిరాశానిస్పృహాలను పుట్టించడం

బదులు తీవ్ర విరసన భావాన్ని రేకెత్తించి, ఇదివరకెన్నడూ లేని అపూర్వ శక్తి వెల్లువను అతనిలో ఉదయింపచేశాయి. సరిగా ఆ సమయంలో అతడు రచయితగా వెలిశాడు.

కొన్ని సంవత్సరాలపాటు యువ గోర్కీ తన రచనలను వోల్గా ప్రాంతపు పత్రికల్లోనే ప్రధానంగా ప్రచురిస్తూ వచ్చాడు. నవీనమూ అపూర్వమైన అతని సాహితీ ప్రతిభ ప్రఖ్యాత రచయితల దృష్టిని ఆకర్షించి వారి ప్రశంసలను పొందినప్పటికీ, అతని పేరు మాత్రం విశాల సాహితీవర్గాల వరకు వ్యాపించలేదు. కాని 1898లో పరిస్థితి మారిపోయింది. ఆ సంవత్సరంలో అతని తొలి రచనా సంపుటాలు – "వ్యాసాలూ, కథలూ" అనే చిన్న గ్రంథాలు – వెలువడి, అతనికి బ్రహ్మాండమైన జయాన్ని చేకూర్చి, అనాటి ప్రముఖ రచయితల అగ్రశ్రేణిలో అతనికి సముచితస్థానం సంపాదించిపెట్టాయి. మరుసటి ఏడాది గోర్కీ నవల "ఫోమా గోర్దేయెవ్" వెలువడి, అదేసమయంలో వెలువడిన లియో టాల్‌స్టాయ్ నవల "పునరుత్థానం" ఎంత విస్తృతమైన ఉత్సుకతను రేకెత్తించిందో అంత ఉత్సుకతనూ రేకెత్తించింది. ఇక దీని తరువాత గోర్కీ నవలిక "ముగ్గురు" వెలువడి, ఆ తర్వాత అతని నాటక రచనలు (వాటిలో ముఖ్యంగా "అధోజనం" అనే తాత్వికచింతనతో నిండిన నాటకం ఘన విజయం సాధించింది) ప్రచురణ కావడంతో అతని ఖ్యాతి తన స్వదేశ పరిధులను అధిగమించి, సముద్రాలను లంఘించి ప్రపంచమంతటా విస్తరించింది.

అయినప్పటికీ గోర్కీ తొలి విజయాలు అతని గూర్చిన గాథలను కూడా ప్రచారంలోకి తెచ్చాయి – అతని ఖ్యాతి ఎంత త్వరగా అధికమవుతూ వచ్చిందో, ఆ గాథలు కూడా అంత త్వరగానూ పెరుగుతూ వచ్చాయి. యువ రచయిత చూరగొన్న అపూర్వ ప్రజాదరణకు అతని బుద్ధిబలం కారణం కాదనీ, అతని అపూర్వ జీవితచరిత్ర పాఠకుల్లో రేకెత్తించిన ఉత్సుకతే కారణమనీ విమర్శకులనేకులు ప్రకటించారు. ఇది సత్యంకాదు. పంథొమ్మిదవ శతాబ్ది అంతిమ సంవత్సరాలలో అతని జీవితచరిత్రకు సంబంధించిన సమాచారం ప్రచురింపబడింది. దీనికి అతని ప్రఖ్యాతే కారణం. అంతటి కష్టసహితమైన జీవితచరిత్ర కల్గి, "ధైర్యవంతుల ఉన్మత్తత"ను అంత వీరోచితంగానూ కీర్తిస్తూన్న రచయితకే ఆశ్చర్యము గొలిపేటంతటి కాంతివంతమైన వర్ణాలతో నిర్భయమైన వాస్తవవాద సత్య సంధతను సంయుక్తంచేసిన అతని తొలి రచనలు మహనీయములూ కళాప్రపూరితములైన ఆవిష్కరణలకు కావలసిన పూర్వకాంక్షితములన్నిటినీ తమలో అప్పుడే ఇముడ్చుకొన్నాయి. కాని అప్పటికింకా గోర్కీకి సోషలిస్టు చైతన్యం కల్గలేదు, శ్రామికవర్గ ప్రాముఖ్యతను అప్పటికింకా అతడు గ్రహించలేదు. కార్మికవర్గాన్ని కేవలం దోపిడీ పాలవుతూన్న వర్గంగా, పీడిత తాడిత వర్గంగానే, బాధలననుభవిస్తూన్న వర్గంగానే అతడు చిత్రించాడు కాని, బానిసతనంనుండి తనకే గాక సర్వ శ్రామికప్రజల విముక్తిని కూడా సిద్ధింపజేసే ప్రచండశక్తిగా చిత్రించలేదు. గోర్కీ చైతన్యంలో తిరుగుబాటును కల్గించేందుకు గట్టి ప్రేరణ ఒకటి అవసరమైంది. ఆ ప్రేరణ దేశవ్యాప్తమైన విప్లవ వెల్లువ. ఈ వెల్లువకు ప్రత్యుత్తరంగా ఉత్తేజపూరితమైన

"ఝంఝూతరంగ గీతం" అనే కృతిని రచయిత వెలయించాడు. అంతే ప్రాధాన్యతను కల్గినది — అతని జీవితపథం వి. ఐ. లెనిన్ పథంతో ఏకంకావడం. మొదట్లో లెనిన్ రచనలతోనూ, ఆయన భావాలతోనూ, ఆ తర్వాత తనకు మిత్రుడు, గురువు, నాయకుడైన ఆయనతోనే ఐక్యమైపోయింది.

మానవతావాద సమస్యలపట్ల ప్రగాఢంగా చలించిన కళాపిపాసిగా గోర్కీ లెనినిజం అభిముఖంగా తన సొంత రీతినే పయనించాడు. 1901 నాటికే, "మధ్యతరగతులు" అనే నాటకంలోనే సోషలిస్టు చైతన్యాన్ని అందుకున్న కార్మికుని, నీల్ అనే శ్రామిక విప్లవకారుని పాత్రను గోర్కీ తొలిసారిగా చిత్రించాడు. గోర్కీ యథార్థ మానవతావాద, కుహనా మానవతావాద సమస్యను మరింత లోతుగా "అధోజనం" అనే నాటకంలో పరిశీలించాడు. యావత్తు తత్వశాస్త్రాన్నీ మథించగా నిగ్గుదేల్చిన "నీకు నమ్మకం కల్గించింది గనక అది ఉంది" అనే ఒక్క సూక్తితో "ఉపశమనం" ప్రసాదించే ధర్మోపన్యాసకుడు లూకా బండారాన్ని ఆ నాటకంలో గోర్కీ బయటపెట్టేడు. జీవిత పరిస్థితులకు లొంగిపోయే జడమైన మానవతావాదానికి ప్రతిగా, జీవితాన్నీ, జీవితాన్నే కాకుండా మానవుణ్ణి కూడా మార్చివేసేందుకూ, అతని అంతరాత్మని విముక్తిచేసేందుకూ యావత్తు జీవితసత్యాన్నీ నిర్భయంగా ముఖాముఖీ దర్శించవలసిందని పిలుపు ఇచ్చే విప్లవ పోరాటశీలమైన మానవతావాదాన్ని గోర్కీ నిలబెట్టాడు. "అధోజనం" అనే నాటకంలోని: "మానవుడే సత్యం," "మానవుడు — ఎంతో గర్వించదగిన మాట యిది!" "సర్వమూ — మానవునిలోనే వుంది, సర్వమూ మానవుని కోసమే" అనే ఉత్తేజపూరిత వచనాలను లక్షలాది, కోట్లాది మంది అన్ని భాషలలోనూ నేడు పునశ్చరణ చేస్తున్నారు.

1906లో తాను రచించిన "అమ్మ" నవలలో గోర్కీ విప్లవాత్మక మానవతావాద సమస్యను ముందుకు తెచ్చాడు. గోర్కీ రచించిన ఈ పుస్తకంవలె, అసంఖ్యాక చదువరుల మనస్సులను చూరగొన్నట్టి, లక్షలాది మనుషుల జీవితాలపై అంత బలమైన అంత ప్రత్యక్షమైన ప్రభావం నెరపినట్టి మరొక పుస్తకం ఇంచుమించు ప్రపంచ సాహిత్యమంతటిలోనూ లేదనే మనం ఘంటాపథంగా చెప్పవచ్చు.

ఇరవయ్యో శతాబ్ది ఆరంభంలోనే, అనగా సాహిత్యరంగంలో గోర్కీ ప్రత్యక్షమైన తరువాత ఒక దశాబ్ది గడవకముందే, అతని పేరు అప్పటికే ప్రపంచం నలుదిక్కులా ప్రతిధ్వనించింది. లియో టాల్‌స్టాయ్, అన్‌తోన్ చేహొవ్‌లవంటి అతని సమకాలీనులూ స్వదేశస్థులూ అతని సరసన ఉన్నారన్న మాట నిజమే. ఐనప్పటికీ నూతన శతాబ్ది తన దృష్టి యావత్తూ కేవలం గోర్కీపైనే లగ్నంచేసింది. అతని చుట్టూ వెలరేగిన విజయధ్వానంతో పోటీపడేందుకు సాహిత్య ప్రామాణికులుగా సార్వత్రికంగా గుర్తించబడినట్టి ఇబ్‌సెన్, బెర్నార్డ్ షా, అనతోల్ ఫ్రాన్స్‌లవంటి వారికి సహితమూ సాధ్యమయ్యేదికాదన్నమాటే. గోర్కీ అట్టడుగు స్తరాలనుండి, సమాజంయొక్క నేలమాళిగల్లోనుంచి, పైకి వచ్చాడు. మరి ఇప్పుడేమో, తన బాల్యంలోనూ, కౌమారంలోనూ, తొలి యవ్వనంలోనూ తాను భరించిన

హింసలనుండీ బాధలనుండీ విధి తనను విముక్తి చేసి వెనుకటి కష్టాలకూ కడగండ్లకూ ప్రతిఫలంగా తనవిప్పుడు సన్మానిస్తున్నట్లుంది. నూతన శతాబ్ది అతనిని అక్షరాలా వరించింది. నూతన శతాబ్ది తన పరిష్కారాన్ని గోర్కీలో అన్వేషించినట్లుంది.

ఇరవయ్యో శతాబ్దికి కీలకమైన నూతన స్వరాన్ని గోర్కీ వెంటనే గ్రహించాడు. సంపూర్ణ సమానతను కల్గిన, క్రియాశీలుడైన భూమికగా, ప్రధాన పాత్రగా కార్మికుడు ప్రపంచ చారిత్రక రంగంపై ప్రవేశించాడు. ఈ నూతన శతాబ్ది గర్భాన జన్మించిన నూతన వీరుని కీర్తించే గాయకునిగా, అతని జీవితచరిత్రను కళాత్మకంగా వెలయించిన రచయితగా, సాహిత్యంలో అతని ప్రతినిధిగా నిలబడ్డాడు గోర్కీ. ఈ నూతన శతాబ్ద వీరుని సంపూర్ణ కళాత్మక స్వరూపమూ పరిణామమూ "అమ్మ" అనే నవలలో మనకి అందించబడింది.

ఈ నవలకు ప్రాతిపదిక వాస్తవమైన చారిత్రక ఘటనలు — 1902లో సోర్మోవా నగర కార్మికులు జరిపిన మే దినోత్సవ ప్రదర్శన, ప్రదర్శన చెదరగొట్టబడిన తర్వాత ప్రదర్శకులపై జరిపిన కోర్టు విచారణ — సర్వవిదితమే. ఈ ఘటనలను గోర్కీ తరువాతి సంవత్సరాలలో స్మరించుకుని ఇలా అన్నాడు: "సోర్మోవాలో ప్రదర్శనానంతరం, కార్మికులను గురించి ఒక పుస్తకం రాయాలనే తలపు, లోగడ నిజ్నీ నోవ్‌గొరొద్‌లో ఉంటూండిన రోజుల్లోనే నాకు కలిగింది. ఈ ఘటనలను గురించిన వివరాలను ఆరోజుల్లోనే సేకరించడం ప్రారంభించాను, వేర్వేరు వివరణలు కూడా రాసుకున్నాను." ఈ విధంగా గోర్కీ రచన స్వకపోల కల్పితమైన చారిత్రక పత్రంగా రూపొందింది. ఐనప్పటికీ ఈ రచనకు ఆధారమైన ఘటనలను, సహజంగానే, రచయిత భావగర్భితంగా మలచి, కళాత్మక రూపం యిచ్చాడు. నవలలోని ప్రధాన పాత్రలు వాస్తవంగా జీవించిన వ్యక్తులే. నవలకు మూలమైన ఘటనలు నవలలో ప్రత్యక్షమయ్యే ప్రధాన భూమికల జీవితాల్లో — సోర్మోవా నగర కార్మికుడు ప్యోత్ర్ జలోమొవ్, అతని తల్లి, వీరిద్దరి జీవితాల్లోనూ — సంభవించిన విషయాలే. ఈ భూమికల ప్రాగ్రూపాలకు సిద్ధహస్తుని లేఖిని నూతన జీవం పోసింది, వాటినుండి నూతన వీరులనూ నూతన సన్నివేశాలనూ అవతరింపజేసింది. ఫలితంగా 1905 విప్లవానికి ముందువాటి రష్యన్ కార్మికవర్గ జీవితమూ పోరాటాలయొక్క విశాలమూ సాధారణీకృతమూ అయిన చిత్రపటంగా నిలిచిన రచన ఆవిర్భవించింది.

విప్లవానికై రష్యా పథం ఎంత కష్టభూయిష్ఠంగానూ సంక్లిష్టంగానూ ఉంటుందో రచయిత పుస్తకంవల్ల వ్యక్తమవుతుంది. అయినప్పటికీ ఆ పథమే ఏకైక యథార్థ పథమైంది. అదే భవిష్యత్తుకి మార్గమైంది. ఈ భవిష్యత్తుకై సర్వప్రజల పోరాటాలకూ కార్మికవర్గమే నాయకశక్తి అని "అమ్మ" నవల స్థిరంగా చెప్పింది. తన మహనీయ ఆదర్శాలను సాధించేందుకు విజృంభించుతూన్న కార్మికవర్గాన్ని గురించిన పుస్తకమిది. తన సద్గుణాలను, రాజకీయంగానూ సైద్ధాంతికంగానూ తన పరిపక్వతయందలి లోపాలను సహితమూ కార్మికవర్గం తనంతట

తాను స్వయంగా ఈ పుస్తకంలో చూడగల్గుతుంది. కార్మికవర్గంకోసమూ, యావత్తు రష్యన్ ప్రజకోసమూ ఆవశ్యకంగా రచించబడిన పుస్తకమిది.

గోర్కీతో జరిపిన ఒక సంభాషణలో వి. ఐ. లెనిన్ "అమ్మ" నవలను గురించి ఇలా చెప్పాడు: "...ఈ పుస్తకం చాలా అవసరం. విప్లవోద్యమాలలో పాల్గొన్న కార్మికులలో చాలామంది చైతన్యరహితులైనవారు, అయత్నకృతంగా పాల్గొన్నవారు; వారిప్పుడు 'అమ్మ'ను చదివి గొప్ప మేలు పొందుతారు.

"ఇది అతి సమయోచితమైన పుస్తకం."

కళాత్మకమైన కృతిలోని ఐక్యత, అందులోని భూమికల ఏకత్వాన్నీ భావనమైక్యతమూ సాధించదు, సన్నివేశాల సమైక్యతనూ సాధించదు, కాని కృతికర్తయొక్క నైతిక స్థానాల సమైక్యతను సాధించుతుందని లియో టాల్‌స్టాయ్ ఒకసారి అన్నాడు. "అమ్మ" నవలలో గోర్కీ తీసుకున్న నైతిక స్థానం అతని ప్రధాన కథానాయిక — నీలొవ్నా — భూమికలో ప్రతిబింబితమైంది. ప్రత్యేకించి యీ కథానాయికే — ఒక సామాన్య కార్మిక స్త్రీ — పుస్తకానికి "అమ్మ" అని పెట్టిన పేరుకు కారణమైంది. నవల ఆరంభంలో నీలొవ్నాను మనం చూసినప్పుడు తనవంటి వేలాది ఇతర కార్మిక మాతల మధ్య ఆమెను మనం ప్రత్యేకించి ఎంత మాత్రం పోల్చుకోలేము. వారందరి భర్తలూ ఫ్యాక్టరీల్లోనూ మిల్లులలోనూ భరించనలవికాని కష్టమైన పని చేసి, తప్పతాగి తందనాలు తొక్కి, ఒకరితో ఒకరు పోట్లాడుకుని, ఇంటికి వచ్చి పెళ్ళాలనూ పిల్లలనూ చితకబాదేవారు. కాని తన కొడుకు, పావెల్ వ్లాసొవ్, ఎప్పుడైతే ఆ ఫ్యాక్టరీ పేటలో మామూలుగా సాగుతూన్న జీవితంతో తెగతెంపులు చేసుకుని, విప్లవకారుడవుతాడో అప్పుడు — అతనితో బుజం బుజం కలిపి నిలబడుతుంది అతని తల్లి నీలొవ్నా. నవలలో నీలొవ్నా అనుసరించిన పథం — విప్లవంలో కార్మికుడు అనుసరించే పథం. మరి ఆ మార్గమూ, నీలొవ్నా దయామయ, న్యాయశీల హృదయమూ, ఆమె మనస్సాక్షీ, జీవితాన్ని మెనరుతో కరుణతో గడపాలనే ఆమె ఊహాలూ — ఇవే గోర్కీకి ఈ పుస్తకంలో ప్రధానమైన నైతిక ప్రమాణాలవుతున్నాయి. మరి మనం, చదువరులం, ఈ నవలలో ఆమె చుట్టూ వున్న ప్రపంచాన్ని ఆమె కళ్లతోనే, ఆమె విలువలతోనే, విలువకట్టుతాం. పావెల్ వ్లాసొవ్ కామ్రేడ్లు కూడా ఆమెను "అమ్మ" అనే అంటారు. గోర్కీ పుస్తకానికి మౌలికమైన — ప్రధానమైన — భావం ఇందులోనే వుంది. నిజానికి, ఆమె చుట్టూ వున్న విప్లవకారులూ పావెల్ స్నేహితులూ అమ్మపట్ల ఆ వైఖరిలోనే తమ ఆధ్యాత్మిక భ్రాతృభావాన్ని స్పృశిస్తారు. పావెల్‌కి సన్నిహితుడైన అన్‌ద్రేయ్ నహోద్కా అన్నాడు: "మేమంతా ఒక తల్లి బిడ్డలం. ప్రపంచంలోని కార్మికులంతా సోదరులనే అకుంఠిత విశ్వాసమే మా తల్లి." కార్మిక కర్షకుల ఉమ్మడి కార్యమైన స్వేచ్ఛా పోరాటంలోకి జీవితంచేత లాక్కురాబడిన పల్లెటూరి రైతు రీబిన్ కూడా దీన్ని చక్కగా అర్థంచేసుకుంటాడు: "ప్రజలంతా ఒకటే అనే భావం

వాళ్లకు కలిగించడం చాలా గొప్ప సంగతి! మనము చేస్తున్న పనే లక్షలాది ప్రజలు చేయుదల చుకున్నారని తెలిస్తే నీ హృదయానికెంతో పూరట కలుగుతుంది.''

విప్లవ పోరాటం గురించీ, ఈ పోరాట విధానంలో, ఈ పోరాటపు పవిత్ర జ్వాలలో ప్రజాబాహుళ్యంలోనుంచి వచ్చిన వ్యక్తి ఎలా ఆంతరంగిక పరివర్తనను పొందుతాడో, ఎలా ఆధ్యాత్మిక పునర్జన్మ పొందుతాడో ఆ విధం గురించీ ''అమ్మ'' నవలలో చెప్పబడింది. మానవుని ''పునరుత్థానం'' అనే విషయం ప్రగాఢ తాత్విక, తీక్ష్ణ వాగ్వాదరూపాన్ని ధరించింది. ప్రతివాడూ ప్రతివాని శత్రువే అనే భావాన్ని విప్లవ పోరాటం ప్రజల చిత్త వృత్తిలో రేకెత్తిస్తుందని దాస్తాయేవ్‌స్కీ భయపడగా, ఇందుకు వ్యతిరేకంగా కేవలం విప్లవ పోరాటం మాత్రమే మానవుని అంతరంగాన్నంతటినీ జంతుప్రవృత్తినుండీ స్వార్థపరత్వంనుండీ శుద్ధిచేస్తుందని గోర్కీ చూపించాడు. రాజకీయాలతో సంబంధాలు తెంచుకొని, చెడుగుపట్ల ప్రతిఘటనారాహిత్య భావాన్ని అనుసరించే ఆంతరంగిక స్వయంపరిణతి మార్గమే మానవుని పునరుత్థానంగా లియో టాల్‌స్టాయ్ చిత్రించగా, ''అమ్మ'' నవలలోని కథానాయిక పోరాటరం గంపై అడుగుపెట్టి ''పునరుత్థానమైన ఆత్మని చంపలేరు!'' అని ఎలుగెత్తి చాటుతుంది.

* * *

గోర్కీ సృజనలో ప్రధానమైన ఇతివృత్తాలు రెండున్నాయి. ఇవి ఒకదానినొకటి పరి పూర్ణం చేసుకుంటూ, అతని ప్రాపంచిక దృశ్యంలోని ''పరమరహస్యాన్నీ,'' వాస్తవికతపట్ల అతని దృక్పథాన్నీ బహిర్గతం చేస్తూంటాయి. మొదటి ఇతివృత్తం: తన భవితవ్యాన్ని ప్రజాభవితవ్యంతో, సత్యంయొక్క విప్లవాత్మక పరివర్తనతో ఐక్యంచేస్తూ మానవునిలో సంభవించే ''పునరుత్థానం.'' రెండవ ఇతివృత్తం: ''వ్యక్తిత్వ వినాశం'' – ''నేను'' అనే అహాన్ని ప్రజలనుండి వేరుచేసి వెడలగొట్టటందుకు ప్రయత్నించే ఉరుకులతో నురుగులతో ప్రవహించుతూన్న చారిత్రక స్రవంతికి వెన్నుచూపి దానినుండి దాగునే వ్యక్తులకు శరణ్యమయ్యే విస్మృతి. మొదటి ఇతివృత్తం ''అమ్మ'' నవలలో ఉన్నతోన్నత స్థాయి సాక్షాత్కారం పొందగా, రెండవ ఇతివృత్తం గోర్కీ రచితమైన ఒక వరుస రచనలలో ప్రస్తావించబడి, నాల్గు సంపు టాలుగా నవలారూపంలో వెలువడిన అతని ''తుది'' రచన ''క్లీమ్ సామ్‌గీన్ జీవితం'' అనే నవలలో అత్యంత విశాలతతో పరిపూర్ణతతో మలచబడింది.

గోర్కీ జీవితపు చరమపాదంలో ప్రాయికంగా అతని ప్రతిభ నూతన వాసంతికా వికా సంతో విలసిల్లింది. ''క్లీమ్ సామ్‌గీన్ జీవితం,'' ఇతర మహాకృతులూ అటుండగా, ''ఎగోర్ బులిచ్యోవూ, ఇతరులూ,'' ''దొస్తిగాయెవూ, ఇతరులూ,'' ''వాస్సా జెలెజ్నోవా'' రెండవ పాఠాంతరమూ వంటి అత్యుత్తమ నాటకరచనలను అతని లేఖిని ఈ కాలంలోనే సృజిం చింది. గోర్కీ జీవితపు కడపటి యేళ్లలో అతని పత్రికావ్యాసరచన పెద్ద ఎత్తున సాగింది.

అతని బహుముఖ సామాజిక క్రియాశీలత విస్తృతరంగాలను స్పృశించింది. ఈ వ్యాసంగమం తటెప్పైనా రచయితయొక్క ఉదాత్తధీరత్వ ముద్ర, అతని చివరి సంవత్సరాలనూ తుది దినాలనూ ఉజ్వలపరచిన ఆ ధీరత్వం వేసిన విజయ ముద్ర, చిరస్థాయిగా నిలచింది.

1921లో గోర్కీ, లెనిన్ పట్టుదల ఫలితంగా, వైద్య చికిత్సకై విదేశాలకు వెళ్లిన సంగతి అందరకూ తెలిసిందే. ఒకవాడు తుపాకిగుండు దూసుకొనిపోవడంతో దెబ్బతిన్న ఊపిరితిత్తి, చాలా కాలంగా వున్న క్షయ వ్యాధిని ఇక ప్రతిఘటించలేకపోయింది: రచయిత ప్రాణం ప్రమాదంలో పడింది. ఏళ్లు గడచినప్పటికీ వ్యాధి ఏమాత్రమూ తగ్గుముఖంపట్టలేదు. మహత్తర సోషలిస్టు నిర్మాణం సాగుతూన్న తన స్వదేశంలోనే గోర్కీ చాలా కాలం గడుపుతూ ఉండేవాడు. 1928నుంచి ప్రతి వేసవికాలానికీ అతడు సోవియట్ యూనియన్‌కు వచ్చేవాడు. చీకటిగా వ్యాకులంగా వుండే చలికాలం దగ్గరపడడంతో అతనికి ఇటలీకి వెళ్లక తప్పేది కాదు. ఆ వెచ్చని శీతోష్ణస్థితికి అతని శరీరం అలవాటుపడింది. రచయిత శరీరాన్ని అంటిపెట్టుకునే ఉన్నానంటూ క్షయవ్యాధి మరింత తరుచుగా గుర్తుచేస్తూనే వున్నప్పటికీ, గోర్కీ ఆ సంగతి లక్ష్యపెట్టక, 1933లో స్వదేశంలో స్థిరంగా వుండిపోయేందుకే నిశ్చయించుకున్నాడు. ఇది తన ఆయుక్షీణానికి దారితీస్తుందని అతనికి తెలుసు. ఐనప్పటికీ మరోలా చేయడానికి అతను యిష్టపడలేదు. జర్మనీ దేశంలో ఫాసిస్టులు రాజ్యాధికారానికి వచ్చారు. తన ప్రధాన ఆయుధాలను తొలి సోషలిస్టు రాజ్యం దిశగానే తప్పనిసరిగా గురిపెట్టనున్న మాతన ప్రపంచ సంగ్రామం తన విషవాయువులతో వాతావరణాన్ని కలుషితపరచ సాగింది. గోర్కీది ఫాసిస్టు వ్యతిరేకతతో జ్వలితమైన ప్రజావాణి. ప్రపంచ శాంతిరక్షణోద్యమ ప్రధాన నాయకులలో, అంతర్జాతీయ యుద్ధవ్యతిరేక మహాసభ నిర్మాతలలో ఆయన ఒకడు. తన తుది గడియలలో తనకింకా స్మారకం పోకముందు తన కడపటి మాటలుగా అతడు ఇలా అన్నాడు: "...యుద్ధాలు వస్తున్నాయి.... సిద్ధంగా వుండాలి...." తన కథానాయకుడు దాన్‌కొ వలె అతడు మరణించాడు.

1968 మార్చి 28న గోర్కీ శతజయంతి జరిగింది. అతడు అసువులు బాసి ముప్పై యేళ్ళు పైగా అయింది. కాని అతని మూర్తి విశ్వసాహిత్యంలో కేంద్రస్థానమందే నిల్చివుంది — ఈనాటివరకు అతని కళానిష్కరణలే విశ్వసాహిత్య ప్రక్రియలో పురోగమించుతూ వున్నాయి.

కాలప్రవాహంలో సంవత్సరాలు లీనమైపోతాయి. కాని నీజ్నీ నోవ్‌గొరొద్ కార్మాగారపు కార్మికుడు అలెక్సేయ్ పేష్కొవ్, ప్రతిభాన్విత రచయిత మక్సీమ్ గోర్కీ తన హృదయోత్తేజంతో లక్షలాది మానవుల ఆత్మలను ఉత్తేజపరచుతూ రష్యా దారుల్లో, ప్రపంచ దారుల్లో అడుగులిడి ముందుకు, మున్ముందుకు సాగిపోతూనే వుంటాడు.

మరి అతని యాత్రకు అంతు లేదు.

ప్రొఫెసర్, డాక్టర్ బ్యాలిక్

# 1

ప్రతిరోజూ తెల్లవారేసరికి ఫ్యాక్టరీ కుయ్యిమని కూత పెడుతుంది. ఆ కూత వినీ వినడంతో కూలిపేటలోని జనమంతా కార్మిక పేటపై పొగకమ్మి, మానెకంపు విరజిమ్మే గాల్లో, యింకా వదలని నిద్రమత్తుతో చిరచిరలాడుతూ ఇళ్లలోనుంచి బెదరిపోయిన బొద్దింకల్లా గబగబా వీధుల్లో పడతారు. చిరుచీకట్లో, బురద రోడ్లమీద కాళ్లీడ్చు కుంటూ ఎత్తైన రాతి బోనులవైపు నడుస్తారు. తమకోసం నిర్దాక్షిణ్యంగా ఎదురుచూస్తూ డజన్లకొద్దీ, జిడ్డోడుతుండే చతురపు కళ్లతో ఫ్యాక్టరీ వారికి దారి చూపెడుతుంది. వాళ్ల పాదాలకింద కాళ్ళ రొచ్చు చితచితలాడుతుంది. నిద్రమత్తు బొంగురు గొంతుకతో కేకలు వేస్తూ తిట్లతో గాలిని చించుతూండగా, ఫ్యాక్టరీ యంత్రాల రొద, ఆవిరి బుసబుస గాలిలో ఎగురుతూ వారికెదురు సన్నాహం చేస్తుంటాయి. కఠినంగా ధుమధుమలాడుతూ ఉన్న ఎత్తైన నల్లని పొగ చిమ్నీలు పేటపైన దుడ్డుకర్రల్లా అగుపడుతూ ఉంటాయి.

సాయంకాలం, అస్తమించుతున్న సూర్యుని పీరస కిరణాలు, కిటికీ తలుపుల అద్దాల మీద పడి ప్రతిబింబించే సమయానికి ఫ్యాక్టరీ తన రాతి పేగుల్లోనుంచి విసర్జించే చెత్తంతో సమానమైనట్టుగా జనాన్ని బయటికి గెంటేస్తుంది. మురికి ఓడుతూ మసిబారిన మొగాల్తో ఆకలి బిగిమీద మెరిసే దంతచ్ఛాయలతో ల్యూబ్రికేటింగ్ మానె జిగట వాసనలను వెదల గొట్టుతూన్న శరీరాలతో వారు మళ్లీ రోడ్డెక్కుతారు. ఈ రోజు గొడ్డుచాకిరి ముగిసింది. ఇంటివద్ద భోజనమూ విశ్రాంతీ తమకోసం కనిపెట్టుకుని ఉన్నాయని వారి గొంతుకలు ఉత్సాహంగానూ, అంతే కాదు, సంతోషంగా కూడానూ ఉంటాయి.

పగలంతటినీ ఫ్యాక్టరీ దిగ్రమింగింది. ఫ్యాక్టరీ యంత్రాలు, కార్మికుల శరీరాలలోని శక్తిని తమకు కావలసినంతవరకు, పీల్చేశాయి. ఇంతటితో ఈ రోజు సరి. దాని ఛాయలేమీ కనుబడవు. మనిషి ఆయుర్దాయంలో ఒక రోజు తరిగిపోయిందన్నమాట. ఇక ఆ నాటికి అతడాశించేది విశ్రాంతి, చుట్ట పొగతో నిండిన సారాదుకాణపు సరదాలు. అంతటితో అతడు సంతృప్తి చెందుతాడు.

ఆదివారం రోజునా, శలవు రోజుల్లోనూ, కూలిజనం ఉదయం పది గంటలవరకూ నిద్రపోయేవారు. నిద్రమంచి లేచిన తరువాత మర్యాదస్థులైన దంపతులు, ఉన్నంతలో ఉత్తమమైన దుస్తులు ధరించి, మతంపట్ల అలక్ష్యంగా ఉండే యువజనులను చీవాట్లు

పెడుతూ, చర్చికెడతారు. అక్కడ ప్రార్థనలైపోయాక ఇంటికొచ్చి పిండివంట తిని సాయంకాలంవరకూ పడుకుంటారు.

అనేక సంవత్సరాలనుంచి పేరుకుంటూ వస్తున్న అలసట ఫలితంగా వారికి తినాలనే వాంఛ మందగించి పోతుంది. అందుచేత ఆకలిని రేకెత్తించడానికి, చురుకైన వోద్కా ఎక్కువగా త్రాగుతారు.

సాయంకాలం వీధులవెంట తిరుగుతుంటారు. నేల పొడిగా ఉన్నా రబ్బరు జోళ్లు ఉన్నవారు వాటిని బూట్లపైన తొడుక్కుంటారు. వాతావరణం చక్కగా ఉన్నా, గొడుగులున్నవారు వాటిని కూడా మోసుగెడతారు.

స్నేహితులను కలుసుకున్నప్పుడు, ఫ్యాక్టరీని గురించీ, మిషనులను గురించీ, మేస్త్రీలను గురించీ మాట్లాడుకుంటారు. తమ పనికి సంబంధించని విషయాలను గురించి వాళ్లెప్పుడూ ఆలోచించరు, మాట్లాడరు. వినుగుపుట్టించే వారి దైనందిన చర్యలో, అప్పుడప్పుడు మాత్రం కొన్ని నిరుకులేని ఆలోచనలు మిణుకుమిణుకుమనేవి. మగవాళ్లు ఇంటికొచ్చి భార్యలతో కజ్జాతెచ్చుకుని వాళ్లను తరచుగా బాదుతూ ఉంటారు. యువకులు సారా దుకాణాలకో, స్నేహితులిండ్లకో పోయి, అక్కడ ఎకార్డియన్ వాయించుకుంటూ, అసభ్యమైన పాటలు పాడుకుంటూ డాన్సుచేస్తూ తిట్టుకుంటూ తాగి తందనాలు తొక్కుతుంటారు. రోజూ చేస్తుండే కాయకష్టంవల్ల శరీరం అలసిపోయిన కారణంగా, తాగుడు త్వరగా తలకెక్కుతుంది. వారి హృదయాలలో చెప్పడానికి వీలులేని ఆవేశమేదో ఒకటి బయటకు ఉబ్బుకొస్తుంది. దానితో ఏదో చిన్న అవకాశాన్ని పురస్కరించుకుని, తగవులాటకు దిగి పశుత్వానికి లోనై క్రూరంగా కొట్టుకుంటారు. కొన్నిసార్లు తీవ్రమయిన గాయాల పాలవుతారు. అప్పుడప్పుడు హత్యలు కూడా జరుగుతుంటాయి.

వారి పరస్పర మానవ సంబంధాలలో ఒక విధమైన కోపం గుంభితంగా దాగి ఉంది. వారి కండరాల అలసట ఎంతటి అనివార్యమో, వారిలోని ఈ కోపం అంతటి పురాతనమైనది. ఈ మానసిక రోగం వారికి తమ తండ్రితాతల దగ్గరనుండి పుట్టుకతోనే సంక్రమించింది. చచ్చేవరకూ, అది వల్లని ఛాయలా వెంబడించి, అర్థంలేని క్రూర కర్మలను వారిచేత చేయిస్తుంది.

ఆదివారంనాడు, యువకులు చిరిగిపోయిన గుడ్డలతో, ఒళ్లంతా మట్టీ బురదా కొట్టుకుని చితికి పోయిన ముఖాలతో రాత్రి చాలా ఆలస్యంగా ఇంటికొచ్చేవారు. ఒక్కొక్కప్పుడు తమ స్నేహితులను కొట్టిన దెబ్బలను గురించి అక్కసుకొద్దీ బడాయిలు చెప్పుకుంటూ ఇంటికొచ్చేవారు. మరొకప్పుడు తమకు జరిగిన పరాభవాలకు చిరచిరలాడుతూనో, ఆగ్రహపడుతూనో ఏడుస్తూనో వచ్చేవారు. తప్పత్రాగి అసహ్యంగా, హీనంగా, నికృష్టంగా, జాలి కొల్పేటట్లుగా ఉండేవాళ్లు. తరుచుగా వాళ్ల ఏ పొదమాటునో, సారాదుకాణంలోనో

తాగుడువల్ల వ్యాహతప్పి పడుంటే తల్లో తండ్రో చూడడం సంభవించేది. పెద్దవాళ్లు వాళ్లను బూతులు తిట్టి, వోద్కాతో నిండిన వాళ్ల శరీరాలను బాగా మర్దించి, ఇంటికి మోసుకొచ్చి ఆపేక్షతో పడుకోబెడతారు, మళ్లీ అరుణోదయం కావడంతోనే, ఫ్యాక్టరీ కూత కఠోరంగా కూయడంతో నిద్ర లేపుతారు.

కడుపున కన్న బిడ్డల్ని వాళ్లు నానా తిట్లూ తిట్టేవారు, వాళ్లని నిర్దాక్షిణ్యంగా బాదేవారు. అయితే ఏమి – యువకుల పోట్లాటలనూ తాగుడునూ యథావిధిగా జరగాల్సిన నిత్యకృత్యాలుగానే వారు పరిగణించేవారు. తండ్రులు తాము యువకులుగా వుండిన రోజుల్లో కొట్టుకునేవారు, త్రాగేవారు. తమ తల్లితండ్రుల చేతుల్లో చితుకమోదులు అనుభవించారు, అలాగే తమ పిల్లలూనూ. బతుకు ఎప్పుడూ అలాగే ఉండేది. అది బురద ఏటిలా మెల్లగా ఏకరీతిలో రోజులతరబడి శాశ్వతంగా ప్రవహించుతుంది. అవే కార్యాలను దైనందినం నెరవేర్చే అలవాట్లతోనూ, లోతుగా వేళ్లతన్నిన ఆలోచనలతోనూ అన్ని విషయాలూ కలిసి కట్టకట్టుకుమండేవి.

ఒక్కొక్కప్పుడు ఫ్యాక్టరీ పేటలో కొత్త మనుష్యులు వచ్చి స్థిరపడుతారు. కొత్త మనుష్యులు కనుక వారు మొదట్లో నలుగురి దృష్టినీ ఆకర్షిస్తారు. ఆ తరువాత, తాము పనిచేసిన ఇతర స్థలాల్లోని విశేషాలను వాళ్లు చెప్పగా వినడంవల్ల వాళ్లపై ఆసక్తి ఏర్ప డుతుంది. త్వరలోనే ఆ వింత ముగిసిపోతుంది. ఇక వాళ్ల సంగతెవరూ పట్టించుకోరు. ఆ కొత్తవాళ్లు చెవుతుండే మాటలనుబట్టి, కార్మికుల జీవితవిధానం అన్ని చోట్లా ఒకలాగే ఉన్నట్లు స్పష్టమైంది. ఆ మాట నిజమైనప్పుడిక మాట్లాడుకోవడానికేమున్నది?

కొత్తగా వచ్చినవారిలో కొందరు మాత్రం ఈ పేటవారెరుగని కొన్ని కొత్త విషయాలను చెవుతూ వచ్చారు. వాళ్లతో ఎవరూ వాదించేవారు కారు. ఈ వింత మాటలను అనుమా నంగా వింటూ ఉండేవారు. వాళ్ల మాటలు కొందరిలో చిరాకు కలిగించాయి. మరికొందరిలో ఆందోళన కలిగించాయి. మరికొందరిలో ఛాయామాత్రంగా ఆశ రేకెత్తించాయి. ఆ ఆందోళనవల్ల జీవితం మరింత చిక్కుల్లో పడడమే ఫలితం కావడంచేత, దానిని పోగొట్ట డానికి మరింత తాగవలసి వచ్చేది.

కొత్తగా వచ్చినవారిలో ఏదైనా అసాధారణ విషయాన్ని పేటలోని జనం గుర్తించిన ట్లయితే దానిని గురించి అతనిని తప్పుపట్టేవారు. తమలాగే ఉండని వారినెవ్వరినైనా సంకోచించేవారు. వారి జీవితం కఠినంగా ఉన్నా, జడంగా ఒడుదుడుకుల్లేకుండా ఏదో విధంగా సాగిపోతుండడంచేత, కొత్తవాడొచ్చి ఏమి తల్లకిందులు చేస్తాడోనని వారికి భయముం దేమో. ఎప్పుడూ ఒకే విధమైన భారంతో జీవితాన్ని సాగించడం వారి కలవాటైపోయింది. ఆ భారం తగ్గే ఆశ యేమీ వారికి లేదు. కనుక ఏదైనా మార్పు వస్తే వారి కష్టాలు మరింత ఎక్కువవుతాయని వారి నమ్మకం.

కొత్త భావాలను వెలిబుచ్చేవారికి కార్మిక జనం మౌనంగా దూరంగా ఉండేవారు. కనుక కొత్తవాళ్లు వెళ్లిపోయేవారు. ఎవరైనా ఉండడమంటూ వుంటే, వారు కూడా వీళ్లలాగే మారిపోయేవారు, లేకపోతే దూరదూరంగా ఉండేవారు.

ఈలాటి జీవితాన్ని ఏ ఏభై ఏండ్లో గడిపేక మనిషి చనిపోయేవాడు.

## 2

ఈవిధంగానే మిహయీల్ వ్లాసొవ్ అనే ఒక మెకానిక్ జీవనం గడుపుతుండేవాడు. అతడు రోమశుడు, కోపి. దట్టమైన కనుబొమల్లోనుంచి చిన్న కళ్లు అనుమానంతోనూ కావేశంతో కూడిన ఛీత్కారంతోనూ మిలమిలలాడుతూ వుండేవి. అతడు ఫ్యాక్టరీలోకల్లా మంచి పని వాడైన మెకానిక్. ఆ పేటలోకల్లా బలవంతుడు. పై అధికారులతో కస్సు బుస్సుమంటూ ప్రవర్తించడంచేత, డబ్బు సంపాదించలేకపోయేవాడు. ప్రతి శలవు రోజునా అతడెవ్వరినో చితగ్గొట్టేవాడు. అందుచేత ఊరందరికీ అతడంటే అసహ్యం, భయం కూడా. అతనిని తిరుగబడి కొట్టాలని ఎందరు ఎన్ని సార్లు ప్రయత్నించినా, ఆ ప్రయత్నాలు ఫలించ లేదు. ఎవరైనా తనమీద కొస్తున్నట్లు వ్లాసొవ్ కనిపెట్టినట్లయితే, ఒక రాతినో, బల్లనో, ఇనుప ఊచనో చేత్తో పుచ్చుకుని, కాళ్లు ఎడంగా నిల్రదొక్కుకుని, మాట్లాడకుండా శత్రువు రాక కెదురుచూస్తుండేవాడు. రోమమయమైన చేతులూ, కళ్ల దగ్గరనుంచి మెడవరకూ దట్టంగా పెరిగిన నల్లని గడ్డం ఉన్న ముఖంగల ఆ రూపాన్ని చూచేసరికి ఎవ్వరైనా హడలి పోయేవారు. ముఖ్యంగా చిన్నవైన అతని కండ్లలోనుంచి పొడుచుకొచ్చే వాడి చూపులను చూస్తుంటే, ఎవ్వరికైనా, దయాదాక్షిణ్యాలు లేకుండా నిర్భయంగా దెబ్బతియ్యడానికి సంసిద్ధంగా ఉన్న ఒక రాక్షసశక్తి ఎదుట కనిపించేది. ఆ చూపు ఎదుటిమనిషిని పొడిచేస్తున్నట్లుండేది.

"కుక్కల కొడకల్లారా! పొండి!" అంటూ గడ్డంలోనుంచి పసుపువచ్చని పారపళ్లు మెరుస్తూండగా అతడు బుస్సున అరిచేసరికి, జనం ఎక్కడి వాళ్లక్కడ పరారైపోయేవారు. ఏమీ చేయలేక తిట్టుకుంటూ పోయేవాళ్లు.

"కుక్కల కొడకల్లారా!" అని తిడుతూ వారి వెంటబడి నిర్లక్ష్యంగా శూలాల్లాంటి చూపులు చూచేవాడు. తలపైకెత్తి నిర్భయంగా:

"ఎవ్వరా, మీలో ఎవడికిరా చావాలని ఉంది?" అని అరిచేవాడు.

చావాలని వాళ్లలో ఎవ్వరికీ లేదు.

వ్లాసొవ్ ఎప్పుడోకాని మాట్లాడేవాడు కాదు. నోరు విప్పితే మాత్రం "కుక్కల కొడకా" అనే ఊత పదం రావలసిందే. పోలీసులను గురించి మాట్లాడినా, ఉద్యోగస్థులను

గురించి మాట్లాడినా, ఫ్యాక్టరీ యజమానులను గురించి మాట్లాడినా అదే మాట. భార్యనెప్పుడూ "కుక్కముండా" అనే పిలిచేవాడు.

"ఏయ్, కుక్కముండా! నా పంట్లాం చినిగిపోయింది. కనబడడం లేదూ?" అనేవాడు.

అతని కుమారుడు పావెల్ పద్నాలుగు సంవత్సరాల వయస్సులో ఉండగా, ఒకనాడు వ్లాసావ్ అతనిని జుట్టు పట్టుకుని ఈడ్వడానికి ప్రయత్నం చేశాడు. పావెల్ బరువైన సుత్తిని చేత్తో పట్టుకుని, కరుగ్గా:

"చేతులొద్దు!" అన్నాడు.

"ఏమిటేమిటీ?" అన్నాడు తండ్రి పొడుగ్గా, సన్నగా వున్న కొడుకు దగ్గరకు — భూర్జవృక్షం దగ్గరకు మేఘచ్ఛాయలా — జరుగుతూ.

"ఇక చాలించు, ఇంతవరకూ సహించాను. ఇక సహించను" అంటూ సుత్తి పైకెత్తాడు కొడుకు.

తండ్రి ఒకసారి కొడుక్కేసి ఒక చూపు పారించాడు. రోమమయమైన చేతులు వెనక్కి లాక్కున్నాడు.

"సర్లేరా...." అన్నాడు చిన్న నవ్వు నవ్వి. తరువాత దీర్ఘంగా నిట్టూర్చి,

"నువ్వు కుక్కల కొడుకువేరా నిజంగా" అన్నాడు.

ఇది జరిగిన కొద్ది రోజుల తరువాత అతడు భార్యతో:

"ఇక మీదట నువ్వు డబ్బూ గిబ్బూ నన్నడగద్దు. ఇప్పట్నుంచి పావెలే నిన్ను పోషిస్తాడు" అన్నాడు.

"ఓహో, అయితే సంపాదించినదంతా నువ్విక తాగేస్తావు కాబోలు!" అని జవాబు చెప్పడానికామె సాహసించింది.

"ఛీ కుక్కముండా! ఆ సంగతి నీకెందుకు? నాకిష్టమైతే, ఒక పిల్లను తెచ్చుకుంటాను!"

అతడే పిల్లనూ తెచ్చుకోలేదు. కాని రెండేళ్ల అనంతరం చచ్చిపోయేదాకా, అతడు కొడుకును గురించి పట్టించుకోనేలేదు. ఎన్నడూ నోరెత్తి అతనితో మాట్లాడలేదు.

వ్లాసావ్ ఒక కుక్కని పెంచాడు. అది కూడా అతన్లాగే భారీగా, రోమశంగా ఉండేది. ప్రతిరోజూ పొద్దున్నే అతనిని ఫ్యాక్టరీ దాకా సాగనంపేది. సాయంకాలం అతనికోసం గేటు దగ్గర కనిపెట్టుకుమండేది. వ్లాసావ్ శలవు రోజుల్లో సారాదుకాణాలన్నిటినీ చుట్టబెట్టేవాడు. ఎవ్వరితోనూ మాట్లాడేవాడు కాదు. కాని ఎవరి కోసమో వెతుకుతున్నట్లు జనం మొగాలకేసి పరీక్షగా చూస్తుండేవాడు. గుబురు తోక ఈడ్చుకుంటూ రోజంతా కుక్క కూడా తన యజమానిని వెంబడించేది. బాగా తాగేసి వ్లాసావ్ ఇంటికి చేరుకుని భోజనానికి కూర్చునేవాడు. తన కంచంలోనే దానికి కూడా తిండిపెట్టేవాడు. దానినెప్పుడూ కొట్టే

పాడు కాదు, తిట్టేవాడు కాదు. అలాగని, దానిని గారాం చేసేవాడూ కాదు. భోజనం పూర్తి కావడంతోనే కంచాలూ పళ్లేలూ తీసెయ్యడంలో అతని భార్య ఏమాత్రం ఆలస్యం చేసినా తానే వాటిని కింద పారేసేవాడు. ఒక వోద్కా సారా సీసాను బల్లమీద పెట్టుకుని, గోడకానుకుని, కళ్లు మూసుకుని నోరు బారుగా విప్పి ఒక విషాదగీతాన్ని ఆలాపించేవాడు. అసహ్యంగా ఉండే ఆ రాగధ్వనులు అతని మీసాల్లోనుంచి ఇరుకుగా బయటికొచ్చి భోజన సమయంలో మీసాలనంటుకున్న రొట్టెతుంపులను దులిపేసేవి. పాట పాడేటప్పుడు, అతడు బండబారిన వేళ్లతో గెడ్డాన్నీ మీసాలనూ సవరించుకుంటూ ఉండేవాడు. ఆ పాటలోని మాటల కర్థంపర్థం నిరుకూ నియమం ఉండదు. రాగం పొంపు, శీతకాలంలో తోడేళ్లు మొరిగినట్టే. సీసాలో సారా పూర్తి అయేవరకూ అలా పాడుకుంటాడు. తర్వాత ఆ బెంచీ మీదనే ఒరుగుతాడు. లేకపోతే ఎదుటనున్న బల్లమీద తలవాల్చేసి పొద్దున్న ఫ్యాక్టరీ కూత కూసేవరకూ అలాగే నిద్రపోతాడు. కుక్క అతడి పక్కనే పడుకుంటుంది.

చివరకు అంత్రవృద్ధివల్ల అతడు మరణించాడు. అయిదు రోజులపాటు ముఖం నల్లబడిపోయి, కండ్లు మూతలడిపోయి, పళ్లు పటపట కొరుకుతూ పక్కమీద పొర్లాడేవాడు. అప్పుడప్పుడు భార్యతో:

"నాకు పాషాణం ఇయ్యి.... విషం పెట్టు...." అంటూండేవాడు.

డాక్టరు కాపడం పెట్టమన్నాడు. కాని మిహాయీల్‌కు శస్త్రచికిత్స అవసరమని చెప్పి, వెంటనే హాస్పిటల్‌కు తీసుకెళ్లాలన్నాడు.

"పో, కుక్కల కొడకా! నీ సహాయం అక్కరలేకుండానే చస్తాను!" అన్నాడు ఆయాస పడుతూ వ్లాసావ్.

డాక్టరు వెళ్లిపోయాక, భార్య కళ్ల నీళ్లు పెట్టుకుని, శస్త్రచికిత్స చేయించుకోమని ఎంతో బతిమాలింది. మిహాయీల్ ఆమెకేసి పిడికిలి బిగించి,

"నాకు నయమైతే నీకింకా అనర్థం!" అన్నాడు.

మర్నాడు ఉదయం ఫ్యాక్టరీ కూత కూస్తుంటే అతడు మరణించాడు. నోరు తెరుచు కుని కోపంగా బొమలు ముడుచుకుని శవపేటికలో అతడు పడుకున్నాడు. అతని భార్య, కొడుకు, కుక్క, దనీల వెసావ్‌శ్చికోవ్ (ఫ్యాక్టరీలోనుంచి తొలగింపబడిన దొంగ, తాగుబోతు), పేటలో ఉండే కొందరు బిచ్చగాళ్లూ వ్లాసావ్‌ను పూడ్చేశారు. భార్య కొద్దిగా అతి నెమ్మదిగా ఏడ్చింది. పావెల్ అసలేడ్వనే లేదు. ఆ కొద్దిమందీ శవాన్ని వూరేగిస్తుంటే ఎదురొచ్చిన పేటలోని జనం ఒక క్షణమాగి శిలువగుర్తు వేసుకొని:

"అతడు చనిపోయినందుకు పెలగేయా చాలా సంతోషిస్తుండాలి" అన్నారు.

"కుక్కలా బతికేడు. కుక్కలా చచ్చిపోయాడు" అన్నారు మరికొందరు.

శవపేటికను వూడ్చిపెట్టటంతోనే జనమంతా ఎవరి దారిని వాళ్లు పోయారు. కాని

కుక్క మాత్రం సమాధి దగ్గరే కూచుని, తిరుగవేసిన మట్టిని విశృంఖలంగా మూచూస్తూ అక్కడే ఉండిపోయింది. కొన్ని రోజులు తర్వాత ఎవరో దాన్ని చంపేశారు....

## 3

తండ్రి చనిపోయిన రెండు వారాల తర్వాత ఒక ఆదివారంనాడు పావెల్ వ్లాసొవ్ చిత్తుగా తాగి, తూలిపడుతూ, ఇంటికొచ్చి, మెల్లగా పాకుతూ బల్లదగ్గర తన తండ్రి కూచునే చోట కూచున్నాడు. తన తండ్రిలాగే పిడికిలితో బల్లగుద్ది తల్లిని కేకేశాడు:

"భోజనం!"

తల్లి దగ్గర చేరి కొడుకు పక్కనే కూచుంది. అతన్ని కౌగలించుకుని తలను రొమ్ముకు చేర్చుకుంది. కాని అతడామెను దూరంగా నెట్టేశాడు.

"త్వరగా! అమ్మా!"

"వెర్రిపిల్లడు" అంటూ విషాదంగానూ ఆప్యాయతతోనూ తన చేతిని తీసేసుకుంది.

"నేను పొగ తాగుతాను! నాన్న గొట్టం వాకియ్యి" అన్నాడు పావెల్ తడబడుతున్న నాలుకను కష్టంమీద వద్దుకుంటూ.

పావెల్ తాగడమిదే మొదటి సారి. సారా అతని శరీరాన్ని నిస్సత్తువ చేసింది. కాని స్పృహ మాత్రం తప్పలేదు. తలలో "నేను తాగేనా? తాగేనా?" అనే ప్రశ్న పదేపదే మెదిలింది.

తల్లి ఆప్యాయత అతని వెంతో కలవర పెట్టింది. ఆమె కళ్లల్లోని విషాదచ్ఛాయలతని హృదయాన్ని స్పందింపచేశాయి. బావురుమని ఏడ్వాలనుకున్నాడు. కాని ఉన్నదానికన్న ఎక్కువ నిషాను నటిస్తూ, కన్నీటి ధారలనాపుకున్నాడు.

తల్లి తడితడిగా ఉన్న అతని చింపిరి తలను మెల్లగా నిమిరింది.

"నువ్వీ పని చేసి యుండకూడదబ్బాయ్" అని మెల్లగా చెప్పింది.

తనకేదో సుస్తీగా ఉన్నట్లు అతడు బాధపడ్డాడు. ఎక్కువగా డోకెళ్లిపోయింది. తల్లి అతన్ని పక్కమీద పడుకోపెట్టింది. వెల్లబారిన నుదుటిమీద తడి తువ్వాలు పెట్టింది. దానితో కొంత నిషా తగ్గింది. కాని తల ఇంకా తిరుగుతూనే ఉంది. రెప్పలింకా తెరిపిన పడడం లేదు. బరువుగానే ఉన్నాయి. నోరంతా వెగటుగా ఉంది. ఆ స్థితిలోనే కనుబొమల లోనుంచి తల్లి విశాలమైన ముఖంకేసి చూశాడు.

"నేనింకా చిన్నవాడిననుకుంటాను. అంతా తాగుతారు. వాళ్లకేమీ కాదు. నా కెందుకో జబ్బుచేసింది...." అనుకున్నాడు.

దూరాన్నుంచి తల్లి మృదుస్వరం వినబడింది:

"నువ్వు ఈవిధంగా తాగడం ఆరంభిస్తే నన్నెలా పోషిస్తావురా నాయనా?"

"అందరూ తాగుతున్నారు కదా?" అని గట్టిగా కళ్ళు మూసుకుని పావెల్ జవాబు చెప్పేడు.

తల్లి నిట్టూర్పు విడిచింది. అతను చెప్పిన మాట నిజమే. జనానికి ఒక క్షణం సుఖాన్నిచ్చేది సారాదుకాణమొక్కటేనని ఆమెకూ తెలును.

"కాని నువ్వు మాత్రం తాగకూడదునుమా.... మీ నాయన మీ యిద్దరికి చాలినదాని కన్న మించి తాగేశాడు. నన్నాయన నానా హింసలూ పెట్టాడు! నామీద నీకైనా కాస్తంత జాలి కలగడం లేదురా నాయనా?" అన్నది.

ఆమె విచారంగా చెప్పిన మెత్తని మాటలు వింటుంటే, తన తండ్రి జీవితకాలంలో, తల్లి ఉన్నదో లేదో కూడా తనకు గుర్తులేని సంగతి జ్ఞప్తికొచ్చింది. కొడతాడేమోననే భయంతో ఆమె నిశ్శబ్దంగా ఉండేది. తన మటుకు తాను తండ్రిని కలుసుకోకుండా ఉండాలనే ఉద్దేశంతో వీలైనంతవరకు ఇంటి కొచ్చేవాడుకాడు. అందుచేత తల్లికీ దూరంగానే బతికాడు. క్రమక్రమంగా నిషా తగ్గిన పిమ్మట, ఆమె నెంతో పరిశీలనగా చూశాడు.

పావెల్ తల్లి పొడగరి. కొంచెం గూనివుంది. బండ చాకిరీవల్లా, భర్త కొట్టిన దెబ్బల వల్లా ఆమె నిశ్శబ్దంగానూ కొద్దిగా పక్కకు వంగుతూనూ నడుస్తుంది. దేనికో కొట్టుకుంటానేమో నన్న బెదురు ఆ నడకలో కనుబడుతుంది. విశాలంగానూ గుండ్రంగానూ ఉండి, పొంగి ముడతలు పడిన ఆమె ముఖంలో, భయవిషాదాలతో నిండిన నల్లని కళ్ళ వెలుగులు విరజిమ్ముతున్నాయి. ఆ పేటలో ఉండే చాలామంది స్త్రీల కళ్ళ అలాగే ఉంటాయి. ఆమె కుడి కనుబొమకు పైగా లోతైన మచ్చ ఒకటుంది. అది కనుబొమను కాస్తంత పైకి ఎగదోసింది. అందువల్ల ఆమె కుడి చెవి ఎడమ చెవికన్న ఎత్తుగా ఉన్నట్లు కనుబడుతుంది. ఆమె ముఖం ఎప్పుడూ ఏ మొనుస్తుందోననే అదట్లో ఉన్నట్లు కనిపిస్తుంది. ఒత్తుగా నల్లగా ఉండే ఆమె జుట్టులో అక్కడక్కడ తెల్లవెంట్రుకలు మెరుస్తున్నాయి. ఆమె మూర్తీభవించిన సౌమ్యత, విషాదం, అణకువ అని చెప్పాలి.

ఆమె చెక్కిళ్లమీద కన్నీటి ధారలు మెల్లగా జారుతున్నాయి.

"ఏడ్వకమ్మా! నాకు దాహమియ్యి" అన్నాడు మెల్లగా కుమారుడు.

"కొద్దిగా చన్నీళ్ళు పట్టుకొస్తాను."

ఆమె నీళ్లు పట్టుకొచ్చేసరికి అతడు నిద్రపోయాడు. ఒక్క నిముషం ఆమె కొడుకు వైపు చూచింది. చేతిలోని పాత్ర వణుకుతోంది. అందులోని మంచు ముక్క సీనారేకు పాత్ర అంచుకు కొట్టుకుంటోంది. అప్పుడా పాత్రను ఆమె బల్లమీద పెట్టి, ఎదుటనున్న దేవుని పటాలకు మొకరించింది. బయట ఉన్న తాగుబోతులు చేసే ధ్వనులు కిటికీని తాకుతున్నాయి. శరద్రాత్రి చిమ్మచీకట్లోనుండి ఎకార్డియన్ ధ్వని వినబడుతోంది. ఎవరో

బొంగురు గొంతుకతో పాడుతున్నాడు. మరొకడు బూతుకూతలు కూస్తున్నాడు. వినుగూ కోపంతో ఆడవాళ్ల మాటలు వినబడుతున్నాయి....

వ్లాసొవ్‌ల చిన్న ఇంటిలో జీవితం మునుపటికన్న నెమ్మదిగామూ సాఫీగామూ సాగిపోతోంది. ఇతరుల ఇళ్లలోకన్న కొంత భిన్నంగా కూడా సాగుతోంది. వాళ్ల ఇల్లు పేటలో ఒక చివర, కొంచెం ఎత్తైన విటవు గట్టుమీద ఉన్నది. అవతల బాడవ వైపుకు గట్టు వాలి ఉంది. ఇంటిలో మూడింట ఒక వంతు వంటయిల్లే ఆక్రమించింది. దానిలోనే ఒక చిన్న అడ్డం కట్టి చిన్న గదిగా అమారుచేయబడింది. అందులోనే తల్లి పడుకుంటుంది. మిగిలిన రెండు వంతులూ ఏకంగా ఒకే చదరపు గది. దానికి రెండు కిటికీలున్నాయి. ఒక మూల పావెల్ మంచం, మంచానికి ఎదుటి మూల ఒక మేజా, రెండు బెంచీలూ ఉన్నాయి. ఇవి కాక కొద్ది కుర్చీలు, అద్దం అమర్చిన డ్రెస్సింగు టేబిలూ, బట్టలపెట్టె, గోడకి ఒక గడియారం, ఒక మూల రెండు పూజా పటాలు — ఇవే ఆ గదిలో వుండే సామగ్రి.

పావెల్ యువకులంతా చేయవలసిన పనులన్నీ చేస్తుండేవాడు. ఒక ఎకార్డియన్, గంజి పెట్టిన చొక్కా, నెక్‌టై, జత రబ్బరు జోళ్లు, బెత్తం కొనుక్కున్నాడు. ఈవిధంగా అతడు తన ఈడు అందరు కుర్రవాళ్లలాంటివాడే అయాడు. సాయంకాలపు పార్టీలకు వెళ్లేవాడు. నాలుగు జంటల డాన్సూ, పోల్కా డాన్సూ నేర్చుకున్నాడు. ఆదివారం రాత్రి తాగి ఇంటికొచ్చేవాడు. కాని వోద్కా అతని ఒంటికి పడలేదు. జబ్బు చేసేది. సోమవారం పొద్దున్న లేచేసరికి తలనొప్పి, గుండెల్లో మంట వచ్చేవి. ముఖం వెలవెలబారి వాడిపోయేది.

"రాత్రి బాగా కులాసాగా కాలక్షేపం చేశావా?" అని ఒక రోజున అతన్ని తల్లి అడిగింది.

"అబ్బ! ఛండాలం!" అంటూ చిరాకుతోనూ వినుగుతోనూ ఆమెకు జవాబుచెప్పేడు. "ఇంతకన్న చేపలు పట్టుకుందుకు పోవడం నయం. లేకపోతే ఒక తుపాకి కొనుక్కొని వేటకెడతాను" అన్నాడు పావెల్.

పావెల్ ఫ్యాక్టరీలో కష్టపడి పనిచేసేవాడు. ఒక రోజైనా గైరుహాజరు కాకుండా, ఆలస్యంగా వచ్చినందుకు జరిమానా పడకుండా పనిచేశాడు. అతను మితభాషి. తల్లి కళ్లలాగే విశాలంగా ఉండే అతని నీలి కళ్లలో ఒక విధమైన అసంతృప్తి ద్యోతకమయేది. అతను తుపాకీని కొనుక్కోలేదు, చేపలు పట్టుకుందుకు వెళ్లనూ లేదు. కాని అతను అందరివలె కాకుండా వేరే మార్గం పట్టినట్లు మాత్రం స్పష్టమైంది. మునుపటిలాగ అంతగా పార్టీలకెళ్లేవాడు కాదు. ఆదివారంనాడు ఇంట్లో ఉండేవాడు కాదు. కాని రాత్రి ఇంటి కొచ్చేటప్పుడు స్పృహతోనే ఉండేవాడు. నిశిత దృష్టిగల అతని తల్లి, తన కొడుకు ముఖం చిక్కిపోతోందని గ్రహించింది. అతని కండ్లలోనూ, ముఖకవళికల్లోనూ ఏదో ఒక

తీవ్రమైన ఆలోచనా తత్పరతనామె చూచింది. అతని మనసులో ఏదో కోపమో అంతర్గతంగా ఏదో జబ్బో ఉందేమో ననిపించింది. ఇంతకు ముందు అతని స్నేహితులు కొందరు తరుచుగా వస్తుండేవారు. ఇప్పుడతను ఇంట్లో ఉండకపోవడం తెలుసుకుని రావడం మానేశారు. తన కొడుకు ఫ్యాక్టరీలో ఉండే ఇతర యువకుల్లాంటివాడు కాడని తల్లి సంతోషించింది. కాని అందరితోపాటు అంధకారబంధురమైన సామాన్య ప్రవాహాన్ని అనుసరించకుండా, వేరు దిశగా తన జీవిత నౌకకు చుక్కాని పట్టేటందుకు తన కొడుకు చేస్తున్న ప్రయత్నాలను చూస్తుంటే, ఎందుకో ఆమెకు చెప్పనలవికాని అస్పష్టమైన భయం కలిగింది.

''పావెల్, నీ వొంట్లో బాగుందా?'' అని అప్పుడప్పుడు అడుగుతుండేది తల్లి.

''ఓ! బాగా ఉంది!'' అని పావెల్ జవాబిచ్చేవాడు.

''ఏమిటల్లా చిక్కిపోయావు?'' అని నిట్టూర్చి అడుగుతూండేదామె.

పావెల్ పుస్తకాలను ఇంటికి తేవడం మొదలెట్టాడు. వాటిని రహస్యంగా చదివేవాడు. చదివేశాక వాటిని దాచేసేవాడు. అప్పుడప్పుడు వాటిలోని కొన్ని భాగాలను కాపీ రాసుకుని, ఆ కాగితాన్ని దాచి పెట్టుకునేవాడు....

తల్లీ కొడుకూ బొత్తిగా అపరిచితుల మాదిరిగా ఉండేవారు. ఇద్దరూ కలసి మాట్లాడుకోవడం కూడా అరుదైపోయింది. పావెల్ ప్రొద్దున్నే ఒంటరిగా కూచుని మాటామంతీ లేకుండా టీ తాగేవాడు. తిన్నగా పనిలోకెళ్లి మధ్యాహ్నం భోజనాని కొచ్చేవాడు. భోజన సమయంలో కేవలం మాటవాసికి ముక్తసరిగా రెండు మాటలు మాట్లాడి, భోజనమవడంతోనే అదృశ్యమైపోయేవాడు. మళ్లీ సాయంకాలందాకా కనబడేవాడు కాడు. సాయంకాలమింటికి రావడంతోనే ఒళ్లు కడుక్కుని, భోజనం చేసి ఓ పుస్తకం ముందరేసుకుని కూర్చునేవాడు. ఆదివారంనాడు పొద్దున్నే ఇంటినుండి బయలుదేరిపోయి, రాత్రి చాలా పొద్దు పోయిన తరువాత ఇంటికొచ్చేవాడు. అతను పట్టణంలో కెళ్లేవాడనీ, అప్పుడప్పుడు నాటకాని కెళ్లేవాడనీ తల్లికి తెలుసును. కాని పట్టణంనుండి ఎవ్వరూ తమ యింటికి రావడం లేదు. రోజు రోజూ అతడు మితభాషి కావడం ఆమె కనిపెట్టింది. కాని తనకర్థం కాని కొత్త మాటలనతడు ఉపయోగించడం ఆమె గ్రహించింది. పూర్వమతడు మాట్లాడేటప్పుడు ఉపయోగిస్తూండిన మోటు మాటలిప్పుడు వినబడడంలేదు. పావెల్ ప్రవర్తనలోని కొత్త పోకడలెన్నిటినో ఆమె గమనించింది. ఆడంబరంగా దుస్తులు ధరించడం మానేశాడు. శరీర శుభ్రతకూ, బట్టల శుభ్రతకూ ఎక్కువ శ్రద్ధ వహించడం మొదలుపెట్టేడు. అతని నడవడిలో ఎక్కువ స్వేచ్ఛ, నిరాడంబరత్వమూ ద్యోతకమైనాయి. వెనుకటి మోటుతనం తగ్గిపోయింది. ఈ మార్పు లెందుకొచ్చాయో తెలియక ఆమె చాలా ఆందోళన చెందింది. ఆమెపట్ల కూడా అతడి ప్రవర్తన మారింది. ఒక్కొక్కప్పుడు అతనే ఇల్లు తుడిచేవాడు.

ఆదివారం రోజున తన పడకను తనే వేసుకునేవాడు. తన తల్లి చేస్తుండే పనులకడ్డెళ్లి ఆమెకు సహాయం చేసేవాడు. ఈ పేటలో అలాటి పనులెవ్వరూ చేసి ఎరుగరు.

ఒక రోజున పావెల్ ఒక చిత్రపటాన్ని తెచ్చి గోడకు తగిలించాడు. అందులో ముగ్గురు మనుష్యులు రోడ్డు దిగువకు నడుస్తూ గాఢమైన సంభాషణలో నిమగ్నులైనట్లున్నది.

"సమాధినుండి లేచి వచ్చి క్రీస్తు ఎమ్మాస్‌కు పోతున్నాడు" అని పావెల్ తల్లికా చిత్రపటాన్ని వివరించాడు.

ఆ బొమ్మ చూచి తల్లి చాలా సంతోషపడింది. "క్రీస్తు దేవునిపట్ల ఇంతటి భక్తి కలిగినవాడు చర్చికెందుకెళ్లడబ్బా?" అనుకుంది.

పావెల్ స్నేహితుడైన వడ్రంగి ఆకర్షణీయమైన గోడ అలమారా తయారుచేసిస్తే దానిలో పుస్తకాలు పెట్టాడు పావెల్. పుస్తకాల సంఖ్య పెరగజొచ్చింది. ఇప్పుడా గదెంతో అందంగా కనబడుతోంది.

పావెల్ తల్లిని మామూలుగా "మీరు" అనేవాడు, "అమ్మగారు" అని పిలిచేవాడు. అప్పుడప్పుడు తటాలున ఎంతో ఆప్యాయంగా పిలిచేవాడు.

"అమ్మా! ఈ రోజు రాత్రి ఇంటికి ఆలస్యంగా వస్తానుగాని, నన్ను గురించి బెంగ పెట్టుకోకు" అన్నాడు పావెల్.

ఆ మాట కామె ఎంతో సంతోషపడింది. అతడి మాటలో ఆమెకేదో అకుంఠితమైన దీక్ష గోచరించింది.

కాని ఆమెకు ఆందోళన ఎక్కువైంది. కాలం గడిచినా కారణం మాత్రం స్పష్టపడ లేదు. ఏదో అవ్యక్తమైన కారణంతో ఆమె హృదయభారం క్రమంగా ఎక్కువైంది. ఒక్కొక్కప్పుడు ఆమె కొడుకును చూచి కోపం తెచ్చుకునేది. "అతను కూడా అందరిలాగే ఎందుకుండకూడదు? విరాగిలాగున్నాడే! ఎప్పుడూ అంత తీవ్రమైన ఆలోచనలో ఉండడమెందుకు? వీడి వయస్సుకీ నడవడి ఒప్పదు" అని అనుకునేది.

మరల కొంత ఆలోచన చేసి, "బహుశా ఏ పిల్లతోనైనా ప్రేమలో పడ్డాడేమో!" అనుకునేది.

కాని ఏ పిల్లతోనైనా ప్రేమకలాపాన్ని సాగించడానికి డబ్బు కావాలి కదా! పావెల్ తన సంపాదనంతా తల్లి చేతిలోనే పెడుతున్నాడు.

ఈవిధంగా వారాలూ నెలలూ – అస్పష్టమైన ఆలోచనలతోనూ, పెరుగుతున్న సంకోచాల తోనూ చిత్రమైన మౌన జీవితంతోనూ నిండిన రెండు సంవత్సరాలు – గడచిపోయాయి.

## 4

ఒక రోజు రాత్రి భోజనానంతరం పావెల్ కిటికీ తెర మూసేసి సీనారేకు దీపాన్ని వెలిగించి, కుర్చీకి ఎగువగా గోడకున్న మేకుకు దానిని తగిలించి చదవడం ప్రారంభించాడు.

కంచాలు కడుక్కుని తల్లి వంట ఇంట్లోంచి అతని దగ్గర కొచ్చింది. పావెల్ తలెత్తి ఎందు కొచ్చావమ్మా అన్నట్లు చూచాడు.

"ఏమీ లేదబ్బాయి" అని గొణుక్కుంటూ వంటింట్లో కెళ్ళిపోయింది. ఆమె కను బొమలు నరాల వీరసంచేత అదరడం మొదలెట్టాయి, కాని కొంచెం సేపు తనలో తను గుంజా టన పడి, చేతులు కడుక్కుని మరల కొడుకు దగ్గరకొచ్చింది.

"ఇంతసేపూ ఏమి చదువుతున్నావని అడుగుదామనుకుంటున్నాను" అంది మెల్లగా.

పావెల్ పుస్తకం మూసేశాడు.

"కూచో, అమ్మా!"

తల్లి భారంగా కూచుంది. ఏదో ముఖ్య విషయాన్ని వినడాని కన్నట్లుగా ఆమె తలెత్తింది.

ఆమెకేసి చూడకుండానే పావెల్ స్వరం తగ్గించి మాట్లాడడం మొదలెట్టేడు. అతని కంఠధ్వనిలో ఎందుకో గాని కొంచెం కరుకుదనం ద్యోతకమైంది.

"నేను నిషేధింపబడిన పుస్తకాలను చదువుతున్నాను. మన గురించి, కార్మికులను గురించి ఉన్నదున్నట్లుగా నిజం చెప్తున్న కారణంచేత అవి నిషేధింపబడ్డాయి. వీటిని చూస్తే, నన్ను జైల్లో పెడతారు. నేను నిజం తెలుసుకోవాలనుకుంటే జైల్లో పెడతారు. తెలిసిందా?"

హఠాత్తుగా ఆమెకు ఊపిరాడడం కష్టమైంది. కళ్ళు తెరిచి కొడుకును చూసింది. అతన్ని గుర్తు పట్టడమే కష్టమైంది. అతని కంఠధ్వని మారిపోయింది, ఇదివరకటికంటె స్ఫుటంగా ఉత్తేజకరంగా ఉంది. నునుపైన సన్నని మీసాన్ని పెరుక్కుంటూ అతడు తలవంచి మూలకు తీక్షణంగా చూస్తున్నాడు. అతన్ని గురించి ఆమెకేదో భయం కలిగింది. జాలి పడింది.

"ఆ పనెందుకు చేస్తావు పాషా?"* అని అడిగింది.

పావెల్ తలెత్తి ఆమెకేసి చూశాడు.

"నేను నిజానిజాలు తెలుసుకో గోరుతున్నాను కనుక" అని తొణుకూ బెణుకూ లేకుండా మెల్లగా జవాబుచెప్పేడు.

అతని కంఠస్వరం మెల్లగా ఉన్నప్పటికీ దృఢంగా ఉంది. కండ్లలో స్ఫుటమైన వెలుగ గుపడింది. అతను యావజ్జీవమూ ఏదో భయంకరమైన రహస్యకార్యానికి అంకితమైనట్లు ఆమె తెలుసుకోగలిగింది. ఏమొచ్చినా అనుభవించకతప్పదు కనుక, మారు మాటాడకుండా తలొగ్గలవే అలవాటు కలది కనుక, దుఃఖావేదనలతో నలిగిపోయి, ఏమి చెప్పడానికీ తోచక ఆమె మెల్లగా ఏడ్చింది.

పావెల్ మెల్లగా ఎంతో అనురాగంతో,

---

* పాష — పావెల్‌కు ముద్దు పేరు. — సం.

"ఏడవకమ్మా" అన్నాడు. ఆ మాటలతో అతడు తన దగ్గరనుంచి శలవు తీసుకుం టున్నట్లనిపించింది తల్లికి.

"చూడమ్మా! మనమిక్కడ గడుపుతున్న జీవితమెలాంటిదో ఆలోచించు. నీకు నలభై ఏళ్ల పైన బడ్డాయి. సుఖమనేదేమైనా ఎరుగుదువా? నాన్న నిన్ను కొడుతూ ఉండేవాడు. ఆయనెందుకు కొట్టేవాడో ఇప్పుడు నాకు తెలిసింది. ఆయన జీవితంలో ఉండే కటుత్వా న్నంతటినీ నీమీద తీర్చుకునేవాడు. ఆయనను ఏదో అణగదొక్కివేస్తేది. అదేమిటో ఆయనెరగడు. ఆ కసి నీమీద తీర్చుకునేవాడు. ముప్పయి ఏళ్లు ఈ ఫ్యాక్టరీలో గొడ్డు చాకిరీ చేశాడు. ఫ్యాక్టరీ అంతకీ కలిపి రెండు కార్ఖానాలు మాత్రమే ఉండేటప్పుడు పనిలో చేరేడు. ఇప్పుడు ఏడు కార్ఖానాలున్నాయి."

పావెల్ చెప్పే మాటలను తల్లి ఆత్రుతతోనూ, భయంతోనూ విన్నది. తన కొడుకు కళ్లలో చూడ ముచ్చటైన వెలుగామెకు గోచరించింది. అతడు తన రొమ్మును బల్లకాన్చి, కన్నీటి చారికలు కట్టిన ఆమె ముఖంమీదకు ఒరిగి, తానిప్పుడే తెలుసుకున్న సత్యాన్ని గురించి మొట్టమొదటి సారిగా ఉపన్యసించాడు. యువకునికుండే శక్తితో, తాను తెలుసుకున్న సత్యంపట్ల సంపూర్ణమైన విశ్వాసంతో గర్వించే విద్యార్థికుండే ఆవేశంతో, పావెల్ తను స్పష్టంగా తెలుసుకున్న విషయాలను గురించి మాట్లాడేడు. తన తల్లికి నచ్చచెప్పడానికికన్న, తనను పరీక్షించుకునేందుకే అతడు అంతగా మాట్లాడేడు. ఏమి చెప్పాలో మాటలు స్ఫురించక అతడాగిపోయినప్పుడు, తన ఎదుట బాధపడుతున్న తల్లి ముఖం స్ఫురణకొచ్చింది. కన్నీటి ధారల తెరలోనుంచి ఆమె దయార్ద్ర నయనాలతో, దిగ్భ్రమతోనూ, ఆశ్చర్యంతోనూ తనకేసి చూస్తుండడం గుర్తించాడు. తల్లిని చూచి జాలిపడ్డాడు. ఆమెను గురించీ, ఆమె జీవితాన్ని గురించీ మాట్లాడ్డం మొదలెట్టేడు.

"అమ్మా, నువ్వు సంతోషమనేది ఏ మెరుగుదువు? నువ్వు నీ జీవితంలో ఏమి మంచిని జ్ఞాపకముంచుకుంటావు?" అని అడిగేడు.

ఆమె అంతా విని తలూపింది. సంతోషకరమైన భావాలూ, విచారకరమైన భావాలూ ఆమె తలకెక్కాయి. ఆమె హృదయావేదనకు యీ మాటలు ఉపశాంతిని కలిగించాయి. ఇదివరకెన్నడూ తన జీవితాన్ని గురించి తనతో మాట్లాడినవారు లేరు. ఇప్పడీ మాటలు, తానెన్నడో మరచిపోయిన ఆలోచనలను లీలగా రేకెత్తించాయి. జీవితం అడుగున పడిపోయి అంతరిస్తున్న అసంతృప్తి భావాలు మరల రేకెత్తాయి. ఎప్పటివో చిన్ననాటి భావాలు, అను భూతులు జ్ఞప్తికొచ్చాయి. చిన్నతనంలో ఆమె, తన స్నేహితురాండ్రతో జీవితాన్ని గురించి చాలా మాట్లాడింది. అన్ని విషయాలను గురించీ ఆమె చాలా విపులంగా మాట్లాడింది. ఆమె, ఆమె స్నేహితురాండ్రు కూడా, జీవితంలో ఉండే కష్టాలను గురించి ఒకరితో ఒకరు మొరపెట్టుకునేవారు. కాని అందుకు కారణాలు తెలుసుకోవడానికి ప్రయత్నించేవారు

కారు. ఇప్పుడు తన ఎదుట ఆసీనుడై ఉన్న తన కుమారుని కళ్ళూ, ముఖం, మాటలూ, వ్యక్తపరుస్తున్న భావాలు, ఆమె హృదయాన్ని స్పందింప చేస్తున్నాయి. తన తల్లి జీవితాన్ని ఇంత బాగా అవగాహన చేసుకుని, ఆమె బాధలను గురించి ఇంతగా జాలిపడే కుమారుని చూచుకుని ఆమె హృదయం గర్వంతో ఉప్పొంగింది.

తల్లులను గురించి జాలిపడేవారు అరుదు.

ఆడవాళ్ల జీవితాలను గురించి అతడు చెప్పినదంతా నిజమని ఆమెకు తెలుసును. ఇదివరకెన్నడూ ఎరుగని సౌమ్యతతో ఆ విషయాలు చెప్పడంచేత ఆమె హృదయం ద్రవించింది.

"అయితే నువ్వేం చేద్దామనుకుంటున్నావు?" అని పావెల్ నడిగింది, అతని మాటకు అడ్డు తగులుతూ.

"ముందు చదువుకోవడం. తర్వాత ఇతరులకు బోధించడం. మన కూలిజనం బాగా చదువుకోవాలి. మన జీవితాలు ఇంత భారంగా ఎందుకున్నాయో బాగా గుర్తించి అవగాహన చేసుకోవాలి."

ఎప్పుడూ ఏదో గంభీరంగా కనబడే పావెల్ నీలి నేత్రాలలో, ఇప్పుడు సౌమ్యమూ లలితమైన వెలుగూ కనబడడంవల్ల తల్లికెంతో సంతోషంగా ఉంది. ముడతలు పడిన ఆమె చెక్కిళ్లమీద కన్నీటి బిందువులు కంపిస్తున్నా, ఆమె పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడింది. జీవితంలోని చేదు సత్యాన్ని బాగా కనిపెట్టిన తన కొడుకును చూచి ఆమె గర్వపడుతూనే ఉంది. అయితే అతడింకా చిన్నవాడు. అందరిలాగా మాట్లాడడం లేదు. తనతో సహా అందరూ ఈ జీవితమింతేనవే స్థితిలో ఉన్నప్పుడు, దానితో తలపడడానికి అతడొక్కడే పూనుకున్నాడు. "నువ్వు ఏం చేయగలవు నాయనా?" అని అడగాలనుకుంది.

కాని అలా అడిగితే తన కొడుకుపట్ల తనకుండే ఉన్నతమైన సదభిప్రాయం కొరవడినట్లవుతుందేమోనని సంకోచించింది. తన కొడుకు తెలివైనవాడని తనకు హఠాత్తుగా తెలిసింది. అయినా అతన్ని తను పూర్తిగా అర్థంచేసుకోలేకపోతోంది.

పావెల్ తన తల్లి పెదవులమీద చిరునవ్వును, ముఖంలోని ఏకాగ్రతను, కళ్లలోని ప్రేమనూ గుర్తించాడు. తను చెప్తున్న సత్యాన్ని ఆమె అర్థం చేసుకునేందుకు తాను చేస్తున్న ప్రయత్నంలో కృతకృత్యుడినైనాననుకున్నాడు. తన మాటలలోని శక్తి అతని ఆత్మవిశ్వాసాన్ని మరింత బలీయంచేసింది. ఒకప్పుడు ఆవేశంతోనూ, మరొకప్పుడు చిరునవ్వుతోనూ, ఒకప్పుడు బొమలు చిట్లించి అతడు మాట్లాడేవాడు. ఇంకొకప్పుడు అతని మాటలు ద్వేషంతో కంపించేవి. వాటిని విన్నప్పుడు ఆమెకు భయం కలిగేది. తలపంకించి మెల్లగా:

"ఇది సాధ్యమే నంటావా, పాషా?" అని అడిగేది.

"ఓ, తప్పకుండా" అన్నాడు పావెల్ ఇచ్ఛితంగా. మేలు చేయడానికి ఆత్రపడుతూ సామాన్య ప్రజల్లో ఈ సత్యాన్ని నాటిన మనుష్యులను గురించి విపులంగా చెప్పేవాడు. ఆ విధంగా సత్యాన్ని నాటిన మనుష్యులను, వన్యమృగాలైనట్లుగా, జీవితానికి శత్రువులైనవారు వెదికి వేటాడి, జైళ్లలో పడేసి, కఠినశిక్షకు పాల్జేసేవారని చెప్పేడు.

"అలాటి మనుష్యులను వేనెరుగుదును. ఈ ప్రపంచానికి వారే నిగ్గు" అన్నాడు పావెల్ తీవ్రంగా.

ఈ మనుష్యులను గురించిన ఆలోచన ఆమెకు హడలు పుట్టించింది. "అదంతేనా?" అని కొడుకును అడగాలనుకుంది.

కాని ధైర్యం చాలలేదు. ఆ మనుష్యులను గురించి పావెల్ చెప్పే కథలను ఆమె విశ్వే మ్మరాలై వింది. వారిని గురించి తనకేమీ అర్థంకాకపోయినా, తన కుమారునికి ఇటువంటి ప్రమాదకరమైన విషయాలను గురించి ఆలోచించడం, చెప్పడం వాళ్ల వేర్వేరు కాబోల మకుంది. చివరకు:

"తెల్లవారుతున్నట్లుంది.. యింక పోయి పడుకో" అంది.

"నేను పడుకుంటాన్లే. అయితే నన్ను బాగా అర్థంచేసుకున్నావా?" అని ఆమెనైపుకి వంగి పావెల్ ప్రశ్నించాడు.

"ఆ, తెలిసింది" అని నిట్టూర్చింది. ఆమె కళ్లవెంట జలజల అశ్రువులు రాలేయి, "అది నీ వినాశమే!" అంది.

పావెల్ లేచి గదిలో పచార్లు చేశాడు.

"సరే! నేనేం చేస్తున్నానో, ఎక్కడికెడుతున్నానో తెలిసినట్లే కాదూ! నేను నీకంతా చెప్పేశాను. నన్ను నువ్వు ప్రేమిస్తే నా దారికి అడ్డురాకు" అన్నాడు.

ఆమె ఏడ్చింది.

"నాయనా! ఇదంతా నువ్వు నాకు చెప్పకపోతేనే బాగుండేదేమో" అంది.

పావెల్ ఆమె చెయ్యి పట్టుకుని గట్టిగా నొక్కేడు.

ఎంతో ఆప్యాయంగా "అమ్మా!" అని పిలిచి అపూర్వంగా చెయ్యి నొక్కడంతోనే ఆమె పరవశురాలైపోయింది.

"నేనద్దు రాను.... చూస్తూ ఉండు.... చూడు" తల్లి గద్గదస్వరంతో అంది. స్పష్టంగా చెప్పలేని బాధతో "నువ్వు రోజుకు రోజూ చిక్కిపోతున్నావు" అంది.

ఒక్కసారి ఆమె పావెల్ పొడుగాటి బలిష్ఠమైన దేహాన్ని ఆపాదమస్తకమూ ప్రేమ పూరితమైన దృష్టితో చూచింది.

"నీకు ఏది మంచిదని తోస్తుందో ఆవిధంగా బతుకు. నేను నీకెప్పుడూ అడ్డురాను. కాని ఒక్కటి మాత్రం చెప్తున్నాను విను. నీవెవరితో మాట్లాడుతున్నావో జాగ్రత్తగా

చూసుకో. ప్రజలంటే కొంచెం భయపడుతూ ఉండు. వాళ్లు ఒకళ్లనొకళ్లు అసహ్యించు కుంటారు. వాళ్లెప్పుడూ ఈర్ష్యతోనూ దురాశతోనూ ఉంటారు. ఒకళ్ల నొకళ్లు దెబ్బ తీసుకోవాలని కోరుకుంటూ ఉంటారు. వాళ్లు తప్పు చేస్తున్నారని వేలెట్టి చూపించావా, వాళ్లు నిన్ను ద్వేషించి నాశనం చేయడానికి చూస్తారు.''

పావెల్ గుమ్మంలో నిలబడి, తన తల్లి ఆవేదనతో చెప్పిన మాటలన్నిటినీ విన్నాడు. తర్వాత ఒక్క చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు:

''నువ్వు చెప్పింది నిజమేనమ్మా! ప్రజలు చెడ్డవారే. కాని సత్యమనే దొకటున్నదని నేను తెలుసుకున్నాక ప్రజలు మంచివాళ్లలాగ కనబడుతున్నారు.'' మళ్లీ ఒక చిరునవ్వు నవ్వి ఇలా చెప్పేడు: ''నాలో ఇలాటి మార్పెల్లా వచ్చిందో నాకు తెలియదు. కాని నా చిన్న తనంలో ఎవరిని చూసినా నాకు భయం వేసేది. నేను పెద్దవాడనవుతుంటే ప్రతివారిమీదా అసహ్యం వేసేది. కొందరి పశుత్వం చూస్తే వారిపట్ల అసహ్యం కలిగేది. కొందరి విషయంలో అకారణంగా కూడా. కాని ఇప్పుడంతా మార్పొచ్చేసింది. బహుశా ప్రజలపట్ల నాకు జాలి కలిగిందేమో? వాళ్లు పశువుల్లా ప్రవర్తించడానికి కారణం కేవలం వారే కాదని నేను తెలుసు కోవడంవల్ల ననుకుంటాను, నా హృదయం మెత్తబడింది'' అని మౌనం వహించాడు.

తన హృదయంలోనుంచి వచ్చే వాణిని వినడానికా అన్నట్లు ఆగి, మెల్లగా ఆలోచనా పూర్వకంగా:

''సత్యంవల్ల కలిగే ఫలితమదే!'' అన్నాడు.

''ఓరి దేవుడా! నీలో ఏదో ప్రమాదకరమైన మార్పు వచ్చింది'' అని నిట్టూర్చి తల్లి కొడుకుకేసి తేరిపారజూచింది.

పావెల్ నిద్రపోయాక, తల్లి మెల్లగా పడకమీదనుంచి లేచి అతని దగ్గరకెళ్లింది. అతడు వెల్లకిల పడుకున్నాడు. గౌరవర్ణంలో ఉన్న అతని తల తెల్లని తలగడమీద ఆని ఉంది. తల్లి రాత్రి దుస్తులు ధరించి, చెప్పులు లేకుండా, చేతులు గుండెకి హత్తుకుని నిలబడింది. నిశ్శబ్దంగా ఆమె పెదవులు కదిలాయి. పెద్ద కన్నీటి బొట్లు చెక్కిళ్లమీదుగా మెల్లగా కారేయి.

తల్లీ, కొడుకూ ఎక్కువగా మాట్లాడుకోకుండా జీవితం గడుపుతున్నారు. వారెంతో సన్నిహితంగా ఉంటున్నా దూరంగా ఉన్నట్లే ఉన్నారు.

## 5

వారం మధ్యలో వచ్చిన ఒక శలవు రోజున పావెల్ బయటికి వెడుతూ:

''అమ్మా, శనివారం నాడు పట్టణంనుంచి కొందరు నన్ను కలుసుకోడానికొస్తారు'' అన్నాడు.

"పట్టణంనుంచా?" అని తల్లి రెట్టించింది. హఠాత్తుగా మెల్లగా ఏడ్వడం మొదలెట్టింది.

"ఎందుకమ్మా అలా ఏడుస్తావు? ఏమిటి సంగతి?" అని పావెల్ అడిగేడు.

ఆమె ఏప్రన్ కొంగుతో కన్నీళ్లు తుడుచుకుంది.

"నాకు తెలియదు. ప్రత్యేక కారణమేమీ లేదు...."

"భయమేస్తోందా?"

"అవును" అని అంగీకరించింది.

అతడు తల్లికేసి వంగి పరిగ్గా తన తండ్రిలాగే కటువుగా అన్నాడు:

"మనల్ని నాశనం చేస్తున్నది భయమే. మనమీద సవారీ చేసేవాళ్లు మన భయం మూలంగానే మనలనణగదొక్కి బెదిరిస్తున్నారు."

"నామీద కోపం తెచ్చుకోకు బాబూ! నేను భయపడకుండా ఎలా ఉండగలను? నా బతుకంతా భయంతోనే గడిపాను. నా ఆత్మ చుట్టూ భయం అలముకుంది" అని దీనంగా ఏడుస్తూ చెప్పింది.

"క్షమించు. వాళ్లు రాక తప్పదు" అని మెల్లగా పావెల్ వెళ్లిపోయాడు.

మూడు రోజుల పాటు ఆమె భయంతోనూ గడగడలాడుతూనూ కాలక్షేపం చేసింది. కొత్త వాళ్లెవరో తన ఇంటికి వస్తారనే సంగతి జ్ఞాపక మొచ్చినప్పుడల్లా ఉలికిపడేది. ఈ భయంకరమైన మనుష్యులే తన కొడుకును ఈ కొత్త మార్గంలోకి మళ్లించారనుకుంది.

శనివారం సాయంకాలం పావెల్ ఫ్యాక్టరీనుండి వచ్చి, ఒళ్లు కడుక్కుని గుడ్డలు మార్చుకుని బయటికి వెళ్లిపోయాడు.

"నా కోసమెవరైనా వస్తే, ఇప్పుడే వస్తానని చెప్పు. గాభరా పడకు" అని తల్లికేసి చూడకుండా చెప్పేడు.

ఆమె నీరసంగా బెంచీమీద కూలబడింది. పావెల్ ఆమెకేసి కఠినంగా చూశాడు.

"పోనీ ఈ రాత్రి కెక్కడికైనా వెడతావా?" అని సూచించాడు.

ఆ మాటలు తల్లికి బాధ కలిగించాయి.

"ఎందుకూ? వెళ్లను."

అది నవంబరు మాసాంతం. పగటి వేళ సన్నని పొడిమంచు ఘనీభవించిన భూమిమీద పడింది. తన కొడుకు నడచిపోతుంటే, అతని కాళ్లకింద మంచు కరకరలాడుతోంది. కిటికీల్లోంచి చిమ్మ చీకటి విశ్చలంగా కమ్ముకుంటోంది. ఏదో ప్రమాదం ఎదురుచూస్తున్నట్లు గుమ్మానికి గ్రుడ్లప్పగించి, గట్టిగా బెంచీని రెండు చేతుల్తో పట్టుకుని ఆమె కూచుంది....

ఆ చీకట్లోంచి ఎవరో వింత దుస్తులు వేసుకున్న తుంటరులు తన ఇంట్లోకి మెల్లగా

ప్రవేశిస్తున్నారు, ఎవరో ఇంటి చుట్టూ తచ్చాడుతున్నారు, వ్రేళ్ల గోడలను తడుము తున్నాయి అన్న భ్రమలో పడింది.

ఇంతలో ఆమెకు ఎవరో పాడుతున్న ఈల పాట వినిపించింది. ఆ పాట విచారంగా శ్రావ్యంగా నిశ్శబ్దాన్నీ చీకటినీ మెల్లగా చీల్చుకుంటూ, ఎవరికోసమో వెతుక్కుంటూన్నట్లు క్రమంగా దగ్గర కొస్తోంది. కిటికీదగ్గర కొచ్చి గోడకు తాపిన బల్లకూర్పులోకి దూరి పోయిందేమో అన్నట్లు హఠాత్తుగా ఆగిపోయింది.

గుమ్మం ముందర అడుగుల చప్పుడైంది. తల్లి గభాలున లేచి ఆత్రంగా తలెత్తి చూచింది.

తలుపు తెరుచుకుంది. ముందుగా ఒక తలకాయ, దానిమీద బొచ్చుటోపీ కనబడింది. తర్వాత పొడుగాటి శరీరం గుమ్మంలోనుంచి వంగి లోపలికొచ్చి నిటారుగా నిలబడింది. కుడి చేత్తో తల్లికి వందనం చేస్తూ నిట్టూర్పు విడిచి, మెల్లని గొంతుకతో,

''నమస్కారమండి'' అన్నాడు ఆ మనిషి.

తల్లి మౌనంగా తలొంచి వందనాన్నందుకుంది.

''పావెల్ ఇంట్లో ఉన్నాడా?''

కొత్త యువకుడు నెమ్మదిగా బొచ్చుకోటు తీసి పక్కన పెట్టేడు. ముందొక కాలూ, తర్వాత మరొకటీ పైన పెట్టుకుని టోపీతో బూట్లనంటుకున్న మంచును దులిపేశాడు. తర్వాత ఆ టోపీ నొకమూలకు గిరాటేసి గదిలో పచారుచేశాడు. తనకు సరిపోతుందా సరిపోదా అన్నట్లు ఒక కుర్చీని పరీక్షగా చూచి అందులో కూచుని, చేతిని నోటికడ్డెట్టుకుని ఆవులించాడు. అతని శిరస్సు పొంకంగా ఉంది. జుట్టు అంటకత్తెరేసుంది. నున్నటి గెడ్డం. వాలు మీసం. ఉబ్బెత్తుగా ఉన్న ధూసర వర్ణపు విశాల నేత్రాలతో అతడు గదంతా పరిశీ లనగా కలియజూచాడు. కాలిమీద కాలేసుకుని కుర్చీలో ముందుకూ వెనక్కూ ఊగుతూ:

''ఈ కొంప మీ స్వంతమా? అద్దెదా?'' అని అడిగేడు.

ఎదురుగా కూర్చున్న తల్లి:

''అద్దెదే'' అని జవాబిచ్చింది.

''అట్టే అంత బాగా లేదే'' అని వ్యాఖ్యానించాడు.

''పావెల్ ఇప్పుడే వస్తాడు. ఒక్క క్షణం ఆగండి.''

''అదే చేస్తున్నాను'' అని తాపీగా ఆ ఆజానుబాహుడు జవాబిచ్చాడు.

అతని వినాదం, మృదు కంఠస్వరం, తీరుపైన ముఖం ఆమెకు విశ్వాసం కలిగించాయి. అతని చూపులో నిర్మొగమాటం, స్నేహం ద్యోతకమయ్యాయి. స్వచ్ఛమైన అతడి కళ్లలో ఆనంద కిరణాలు నృత్యం చేస్తున్నాయి. నిడుపైన కాళ్లూ, కొద్దిగా వంపులో కోణాలు తేరిన అతని శరీరమంతా చూస్తే అతడిలో ఏదో ఒక ఆకర్షణ శక్తి గోచరించింది. నీలి

చొక్కా, వెడల్పాటి నలుపు షరాయీ తొడుక్కున్నాడు. షరాయి చివళ్లను బూట్సులో దోపే శాడు. తల్లి అతనిని నీవెవరవు? ఎక్కడనుంచొచ్చావు? మా అబ్బాయిని చాలా కాలంనుంచి ఎరుగుదువా? అని అడగాలని అనుకుంది. కాని అతడే గభాలున ముందుకు వంగి తనే ముందుగా మాట్లాడేడు.

''మామ్మగారూ! మీ తలమీద అంత దెబ్బ కొట్టినవారెవరండి?'' అని అడిగేడు.

అతనడగడం నెమ్మదిగానే అడిగాడు. అతడి కళ్లలో చిరునవ్వు తొంగి చూచినట్లుంది. కాని అతని ప్రశ్న ఆమెకు కష్టం కలిగించింది.

''దాంతో మీకేమి పని పట్టింది?'' అని నిదానంగా మర్యాదగా అడిగింది.

అతను ఆమెకేసి బాగా ముందుకు వంగి,

''కోప్పడకండమ్మా! నా పెంపుడు తల్లికి కూడా సరిగా అలాటి మచ్చే ఉండేది. అందేత అడిగేను. ఆమె కాపురం చేస్తుండిన చెప్పులు కుట్టే ఆయనచేత ఆ దెబ్బ తిన్నది. చెప్పులు కుట్టే దిమ్మతో కొట్టేడు. ఆమె చాకి పనిచేసేది. అతడు చెప్పులు కుట్టేవాడు. ఆమె దౌర్భాగ్యంకొద్దీ అతణ్ణి ఎక్కడో పట్టుకుంది. పెద్ద తాగుబోతు. అదంతా ఆమె నన్ను పెంచుకున్న తర్వాతనే. అబ్బ! ఏమి కొట్టేవాడంటారు! భయంతో నా కళ్లు ఉబ్బి పోయేవి!'' అన్నాడు.

అతడి నిర్మొగమాటం ఆమెను నిరాయుధుణ్ణి చేసింది. అతనితో అంత చిరాకుగా మాట్లాడినందుకు పావెల్‌కు కోపమొస్తుందేమోనని భయపడింది.

''నాకేమీ కోపం రాలేదు నాయనా! కాని మీరు గభాలున ఆ ప్రశ్న అడిగేరు. నా భర్తే వడ్డించాడు. స్వర్గంలో దేవుడాయన్ని చల్లగా చూచును గాక!'' అని తానేదో తప్పు చేసినట్లు చిరునవ్వు నవ్వుతూ చెప్పింది. ''మీరు తాతారులా?''

అతను గభాలున కాలు జాడించి, నోరు వెంబచేసుకుని, చెవులు అదిరేలా నవ్వాడు. తర్వాత ముఖమెత్తి, ''ఇంకా అంతవరకూ రాలేదు లెండి!'' అన్నాడు.

అతడి పరిహాసానికి మెల్లగా నవ్వుతూ:

''మీ మాట రష్యన్ మాటలా లేదే'' అంది.

అతిథి నవ్వుతూ:

''నాది రష్యన్ భాష కన్న మేలైనది. నేను హొహోల్‌ని.* మాది కానెవ్!'' అన్నాడు.

''ఇక్కడ కొచ్చి చాన్నాళ్లయిందా?''

''దాదాపు ఏడాదినుంచి పట్టణంలో ఉంటున్నాను. ఫ్యాక్టరీలో చేరి సుమారొక నెల

* హొహోల్ అంటే ఉక్రేనియన్ దేశస్తునికి వాడుక పేరు. — సం.

వుతుంది. ఇక్కడ మీ అబ్బాయీ, ఇంకా కొంతమందీ మంచివాళ్ళున్నారు. కనుక ఇక్కడే ఉంటాననుకుంటాను'' అన్నాడు మీసాలు సవరించుకుంటూ.

తల్లికి అతడంటే ఇష్టం కలిగింది. తన కొడుకును గురించి చెప్పిన మంచి మాటలకు బదులుగా ఏమైనా చెయ్యాలనుకుంది.

''ఓ గ్లాసు టీ ఇవ్వనా?'' అని అడిగింది.

''నాకొక్కడికేనా?'' అని భుజాలెగరేసి జవాబుచెప్పాడు. ''మిగతావాళ్ళు వచ్చేదాకా ఆగండి. అప్పుడందరికీ విందు చేయండి'' అన్నాడు.

అతడి మాటలు మరల ఆమె భయాన్ని జ్ఞప్తికి తెచ్చాయి.

''మిగతావాళ్ళు కూడా ఇలాంటివాళ్ళే అయితే బాగుండును'' అనుకుంది.

మళ్ళీ మెట్లమీద అడుగుల చప్పుడు ఆమె విన్నది. తలుపు తెరుచుకునేసరికి, తల్లి మళ్ళీ లేచి నిలబడింది. ఒక యువతి వంటయింట్లో ప్రవేశించేసరికి ఆమె కాశ్చర్యం కలిగింది. ఆ అమ్మాయి పొట్టిగా ఉంది. సాదా ముఖం ఆమె పల్లెటూరు పిల్లని చెపుతోంది. తన దట్టమైన తెల్ల జుట్టుని వాలు జడ వేసుకుంది.

''వేనాలస్యం చేశానా?'' అని నెమ్మదిగా అడిగింది.

''లేదు. నడిచి వచ్చావా?'' అన్నాడు హొహోల్.

''మీరే పావెల్ మిహాయ్‌లొవిచ్ తల్లిగారనుకుంటాను? నమస్కారం. నా పేరు నతాషా.''

''మీ పైతృకనామం?''

''వసీల్యెవ్నా. మరి, మీది?''

''నీలొవ్నా. పెలగేయా నీలొవ్నా.''

''అయితే మనమిప్పుడు పరస్పరం పరిచయం చేసుకున్నామన్నమాట.''

తల్లి కొద్దిగా ఊపిరి బిగించి ఆ అమ్మాయి వంక చూసి చిరునవ్వు నవ్వుతూ:

''అవును'' అంది.

కోటు విప్పుతున్న ఆ అమ్మాయికి చెయ్యిస్తూ హొహోల్:

''బాగా చలిగా ఉందా?'' అన్నాడు.

''చలి దారుణంగా ఉంది. బయట పొలాల్లో జోరుగా ఈదురు గాలి కొడుతోంది.''

ఆమె కంఠధ్వని స్పష్టంగా ఖంగుమనేటట్లుంది. చిన్న నోరు. స్ఫుటమైన పెదవులు. మొత్తంమీద ఆమె గుండ్రంగా నవనవలాడుతోంది. కోటు వగైరాలన్నీ తీసేసి, చలికి పొంగిన చిన్న చేతులతో ఎర్రబారిన చెక్కిళ్లను రుద్దుకుంది. టక్‌టక్‌మని బూటు కాళ్ల మడమలతో చప్పుడు చేసుకుంటూ గబగబా ఇంకొక గదిలో కెళ్లింది.

''ఈ అమ్మాయి రబ్బరు బూట్లు తొడుక్కోవడం లేదే!'' అనుకుంది తల్లి.

''హు – హు – హూ.... చలికి నా ఒళ్ళు బిగుసుకుపోతోంది'' అని ఆ అమ్మాయి వణుకుతూ చెప్పింది.

తల్లి గభాలున వంటయింట్లో కెళ్లి:

''సమొవార్* అంటిస్తున్నాను. ఒక్క నిమిషం'' అంది.

తల్లికి ఆ అమ్మాయిని తాను చాలా కాలంగా ఎరుగున్నట్లనిపించింది. సానుభూతితో కూడిన అపూర్వమైన మాతృప్రేమ పొంగింది. పక్క గదిలో సంభాషణ వింటుంటే, తల్లి పెదవులమీద చిరునవ్వు నృత్యం చేసింది.

''సహోద్యా! దేనిని గురించి అలా విచారంగా వున్నారు?'' అని ఆ అమ్మాయి అడిగింది.

''మరేమీ విశేషం లేదు.... ఈ విధవరాలి కళ్లు చక్కగా ఉన్నాయి. మా అమ్మ కళ్లు కూడా ఇలాగే ఉండేవనుకుంటాను. నాకు మా అమ్మ తరుచు జ్ఞాపకమొస్తోంది. ఆమె బ్రతికుందనే నా అభిప్రాయం'' అంటూ హోహోల్ తాపీగా జవాబిచ్చాడు.

''ఆమె చనిపోయిందన్నారు కదా!''

''ఆమె నా పెంపుడు తల్లి. నా జనక తల్లి సంగతి చెపుతున్నాను. బహుశా ఆమె కీయెవ్‌లో ఎక్కడో వీధుల్లో బిచ్చమెత్తుకుంటూ ఉంటుంది. సారా పట్టిస్తూ ఉంటుంది. ఆమె చిత్తుగా తాగినదుంటే, పోలీసులు ఈ దవడా ఆ దవడా వాయిస్తూ ఉంటారు.''

''పాపం! వెర్రిపిల్లడు'' అనుకుని తల్లి నిట్టూర్చింది.

నతాషా ఏదో గబగబా ఆవేశంతో ఉపశమనంగా మృదువుగా మాటలు చెప్పింది. మళ్లీ హోహోల్ ఇలా అన్నాడు:

''మీరింకా ముక్కుపచ్చలారనివారు. ఢక్కా మొక్కీలు రుచిచూడలేదు. మీకేం తెలుస్తుంది? మనిషికి జన్మనివ్వడం చాలా కష్టం. అతనికి మంచీ మర్యాదా నేర్పడం మరింత కష్టం.''

''నిజమే నాయనా!'' అనుకుంది తల్లి. హోహోల్‌కు మనశ్శాంతి కలిగేటట్లు మాట్లాడాలనుకుంది. ఇంతలో తలుపు నెమ్మదిగా తోసుకుని, నికొలాయ్ వెసొవ్‌ష్చికోవ్ లోపలికొచ్చాడు. అతడు పాత దొంగ దనీల కొడుకు. నికొలాయ్ ఎవరితోటీ కలిసిమెలిసి ఉండేవాడు కాడని పేటంతా ప్రతీతి. నికొలాయ్ ఎప్పుడూ విచారంగా ఒంటెత్తుగా ఉండేవాడు. అందుచేత జనం అతనిని ఉడికించేవారు.

''ఏమిటిలా వచ్చావ్ నికొలాయ్?'' అని ఆశ్చర్యంతో అడిగింది తల్లి.

అరచేతితో స్ఫోటకపు మచ్చల ముఖాన్ని తుడుచుకుంటూ, అమ్మని పలకరించకుండానే, ''పావెల్ ఇంట్లో వున్నాడా?'' అని అడిగేడు.

---

* సమొవార్ – టీ కాచుకునేందుకు రష్యాలో ఉపయోగించే పరికరం. – సం.

"లేదు."

గది అంతా తేరిపారజూచి లోపల ప్రవేశించాడు.

"కామ్రేడ్స్, నమస్కారం" అన్నాడు.

"ఇతడా?" అసమ్మతిసూచకంగా అనుకుంది తల్లి. అతన్ని చూచినందుకు చాలా సంతోషపడుతున్నట్లు, నతాషా అతనితో ఆప్యాయంగా కరచాలనం చేయడం చూసి తల్లి తెల్లబోయింది.

మరిద్దరు కూడా వచ్చారు. వాళ్ల బొత్తిగా చిన్న కుర్రాళ్లు. అందులో ఒక అబ్బాయి ఆమెకు తెలుసు. చురుకైన ముఖం, ఉంగరాల జుట్టు, మెరక నుదురూ గల ఆ పిల్లవాడి పేరు ఫ్యోదొర్. అతడు ఫ్యాక్టరీ కార్మికుడైన ముసలి సిజోవ్ మేనల్లుడు. రెండవవాడు కొంచెం పిరికివాడు. తిన్నటి జుట్టు పైకి ఎగదువ్వాడు. అతనామెకు పరిచితుడు కాదు. కాని అతనేమీ భయంకరంగా లేడు. చివరికి పావెల్ వచ్చాడు. తన కూడా ఇద్దరు ఫ్యాక్టరీ పనివాళ్లను వెంటపెట్టుకొచ్చాడు. వాళ్లిద్దరూ తల్లికి పరిచితులే.

"సమొవార్ సిద్ధంచేస్తున్నావు కదా అమ్మా? ధన్యవాదాలు!" అన్నాడు పావెల్.

"కొంచెం వోద్కా కొని పట్టుకు రమ్మంటావా?" అని అడిగింది. అనిర్వచనీయమైన ఏదో విశేషానికి ఆమె కృతజ్ఞత చూపాలనే ఆవేశంతో అలా అడిగింది.

"అక్కర్లేదు" అని ఆప్యాయంగా చిరునవ్వు నవ్వుతూ బదులుచెప్పేడు పావెల్.

ఈ సమావేశమేదో పెద్ద ప్రమాదకరమైనదన్నట్లుగా, తన కొడుకు తనను పరిహాసం చేయడానికి చెప్పేడు కాబోలనే భావం ఆమెకు స్ఫురించింది.

"వీళ్లేనా నిషేధింపబడవలసిన జనం?" అని మెల్లగా కొడుకు నడిగింది.

పక్క గదిలో కెడుతూ:

"అవును వీళ్లే" అన్నాడు పావెల్.

తల్లి అతనిని ప్రేమతో పిలిచి:

"పిల్లా?!" అంది. "పిడింకా చిన్నపిల్లడే!" అనుకుంది మెహర్బానీగా.

## 6

మరిగిన సమొవార్ని తల్లి గదిలోకి తెచ్చింది. అతిథులంతా బల్లచుట్టూ కూర్చున్నారు. ఒక మూల దీపంకింద నతాషా పుస్తకం చేత్తో పుచ్చుకుని కూచుంది.

"ప్రజలింత చెడ్డ బతుకెందుకు బతుకుతున్నారో తెలుసుకోవాలంటే..." అంది నతాషా.

"చెడ్డవాళ్లుగా ఎందుకున్నారో తెలుసుకోవాలంటే" అన్నాడు హొహోల్.

''వాళ్ల జీవితాలను ఎలా ఆరంభించారో పరిశీలించాలి....''

''పరిశీలించండి, పిల్లలూ, పరిశీలించండి'' అని టీ అందిస్తున్న తల్లి అన్నది.

అందరూ మాట్లాడ్డం మానేశారు.

''ఏమిటమ్మా! మీ ఉద్దేశ్యం?'' అని పావెల్ ముఖం చిట్లించుకుంటూ అడిగేడు.

''ఉద్దేశ్యమా?'' అంటూ తలెత్తి చూసేసరికి అందరూ ఆమెకేసే చూస్తున్నారు. ''ఏమీ లేదు. నాలో నేనే ఏదో మాట్లాడుకుంటున్నాను. మీరు తెలుసుకోదలచుకుంటే, ఎందుకు చూడకూడదా అని ఆశ్చర్యపడుతున్నాను'' అని మెల్లగా గొణిగింది.

నతాషా నవ్వింది. పావెల్ చిరునవ్వు నవ్వేడు.

''మామ్మా, టీకి కృతజ్ఞులం'' అన్నాడు హోహోల్.

''ఇంకా తాక్కు ముందేనా కృతజ్ఞత'' అని కొడుక్కేసి దీర్ఘంగా చూస్తూ:

''నేనేమైనా మీకడ్డొస్తున్నానా?'' అని అడిగింది.

''ఆతిథ్యమిచ్చే అమ్మ అతిథులకడ్డేమిటి? త్వరగా నాకు టీ ఇవ్వండి. ఒళ్లంతా గజగజ ఒణుకుతున్నాను. నా కాళ్లు మంచుగడ్డల్లా ఉన్నాయి'' అన్నది నతాషా. ఆమె కంఠస్వరం చంటిపిల్ల స్వరంలా నిష్కపటంగా ఉన్నది.

''ఇప్పుడే ఇస్తాను. ఇదిగో ఇస్తున్నా'' అని హడావిడిగా చెప్పింది తల్లి.

నతాషా టీ తాగి బిగ్గరగా నిట్టూర్పు విడిచింది. జడ భుజంమీదనుంచి వెనుకకు పడే సుకుంది. పసుపుపచ్చరంగు అట్టగల బొమ్మల పుస్తకంలోనుంచి చదవడం మొదలెట్టింది. తల్లి కప్పుల్లో టీ పోస్తూ, చప్పుడు కాకుండా ఉండేందుకు ప్రయత్నిస్తూ విన్నది. కొండ గుహల్లో ఉంటూ, రాళ్లతో వేటాడి జీవించిన ఆటవిక జీవాన్ని గురించిన కథలు ప్రవాహంగా సాగిపోతూండగా ఆ అమ్మాయి సన్నని సంగీతంలాటి కంఠస్వరం సమొవార్ చేస్తూన్న ధ్యానశీల ఝూంకారంలో లీనమైపోయింది. అవన్నీ దేవతల కథలలాగున్నాయి ఆమెకు. ఇలాటి కథలనెందుకు విశ్లేషించాలని కొడుకు నడుగుదామనుకుని, అతనికేసే అలా చూస్తూ ఉంది. కాని ఇక వినడానికి విసుగు చెంది, తన కొడుకూ, అతిథులూ చూడకుండా వారిని ఓరకంటితో పరిశీలనగా చూడడం మొదలెట్టింది.

పావెల్ నతాషా పక్కన కూర్చున్నాడు. అందరిలో అతడే అందగాడు. నతాషా పుస్త కంమీదకు వంగి చదువుతోంది. కణతలమీద పడుతున్న ముంగురులను మధ్యమధ్య వెనక్కి తోసుకుంటోంది. తలకాయ ఊపుతూ, పుస్తకం చూడకుండా, ఎదుటనున్న వాళ్ల ముఖాల కేసి ఆప్యాయంగా చూస్తూ చిన్న గొంతుకతో తన అభిప్రాయాలను చెపుతోంది. హోహోల్ బల్లకొక చివరగా కాళ్లు జాపుకుని తాను నవరించుకుంటూన్న మీసాలకొనలను కళ్లు చిట్లించుకుని చూస్తున్నాడు. వెసావ్‌శ్చికోవ్ తన కుర్చీమీద క్రరలాగున బారుగా నిటారుగా కూర్చున్నాడు. మోకాటి చిప్పలను అరచేతుల్తో నొక్కి పట్టుకున్నాడు. మశూచికం మచ్చలు,

చిన్న నుదురు, సన్నటి పెదవులుగల అతని ముఖం భావశూన్యంగా కృత్రిమముఖం తగిలించుకున్నట్లుంది. తళతళ మెరుస్తున్న ఇత్తడి సమొవార్‌మీద ప్రతిఫలిస్తున్న తన ముఖాన్ని తన సన్నని కళ్లతో తదేకధ్యాసతో చూస్తున్నాడు. అతడు ఊపిరి పీలుస్తున్నట్లుగా కూడా కనబడడం లేదు. చిన్నవాడైన ఫ్యోదొర్, చదువుతున్న దానిని వింటూ, తాను లోపల్లోపల పునశ్చరణం చేసుకుంటున్నట్లు నిశ్శబ్దంగా పెదవులను కదలిస్తున్నాడు. అతని స్నేహితుడు మోకాళ్లమీద మోచేతుల నాన్చి అరచేతుల్లో చెక్కిళ్లు మోపుకుని ఆలోచనాపూర్వకమైన చిరునవ్వు నవ్వుతూ ముందుకు బాగా వంగి కూర్చున్నాడు. పావెల్‌తో వచ్చిన ఒక కుర్రాడికి ఎర్రని ఉంగరాలజుట్టూ, సంతోషం ఉట్టిపడే ఆకుపచ్చ కళ్లున్నాయి. అతను ఏదో చెప్పడానికి ఉబలాట పడుతున్నట్లుగా తను కూర్చున్న చోట ఊరకే కదులుతున్నాడు. లేరంగు అంటకత్తెర జుట్టుతో రెండవవాడు, వేల చూపులు చూస్తూ, ఎప్పుడూ చేత్తో తల నిమురుకుంటూనే ఉన్నాడు. అందుచేత తల్లి అతని ముఖాన్నే సరిగా చూడలేకపోయింది. ఆ గది చిత్రంగా సుఖంగా ఉన్నట్లనిపించింది. అదంతా ఏదో కొత్తగా కనబడుతోంది. నతాషా చదువుకు పోతుంటే, తన పడుచుతనపు వినోదాల సందడి తల్లికి జ్ఞాపకమొచ్చింది. ఆనాటి వినోదాలలో యువకులు చిత్తుగా తాగి సారాకంపు కొట్టేవారు. వారి అశ్లీల భాష, మానవ ద్వేషంతో కూడుకున్న పరాచికాలు స్ఫురణకొచ్చి తనమీద తనకే జాలేసి హృదయం కుంగిపోయింది.

తన భర్తతో తనకు పెళ్లి ఎలా కుదిరినదీ జ్ఞప్తి కొచ్చింది. ఆనాడామె ఒక సంబరంలో ఉండగా అతను ఆమెనొక చీకటి నడవలో పట్టుకుని గోడనేసి నొక్కేశాడు.

"నన్ను పెళ్లి చేసుకుంటావా?" అని మోటుగా అడిగాడు. ఆమెకు చాలా బాధ కలిగింది. కోపమొచ్చింది. కాని ఆమెకు నొప్పిపెట్టేటట్లుగా రొమ్ములు గట్టిగా పట్టుకుని వేడిగా చెమ్మగా వస్తూన్న ఊపిరిని ఆమె ముఖంమీద కురిపించాడు. అతని పట్టులోనుంచి తప్పించుకుని దూరంగా పోవాలని ప్రయత్నించింది.

"ఆగు! జవాబుచెప్పు, వినబడుతోందా?" అని భయపెడుతూ పళ్లు కొరికేడు.

సిగ్గుతో, అవమానంతో, ఆమె జవాబుచెప్పలేకపోయింది.

ఇంతలో ఎవరో తలుపు తెరిచారు. అతడు మెల్లగా పట్టు వదిలేడు.

"ఆదివారం నాడు పెళ్లిళ్ల బేరగాడిని పంపిస్తాను" అన్నాడు.

అలాగే పంపించాడు.

తల్లి కళ్లు మూసుకుని భారంగా నిట్టూర్పు విడిచింది....

"జనం ఎలా బతికేరో నాకక్కర లేదు. ఎలా బతకాలో నేను తెలుసుకోవాలి" అన్నాడు వెసొవ్‌శ్చికోవ్ అసమ్మతి స్వరంతో.

"అద్సరే" అన్నాడు ఎర్ర తలకాయవాడు లేచి నిలబడి.

''కాదు కాదు'' అన్నాడు ఫ్యోదొర్.

వాళ్ళు వాదించుకుంటూంటే మాటలు అగ్నిజ్వాలల్లా లేస్తున్నట్లనిపించింది. వాళ్ళెందు కలా అరుచుకొంటున్నారో తల్లికేమీ తెలియలేదు. ఆవేశంతో వాళ్ళ మొగాలన్నీ ఎర్రగా కందిపోయాయి. కాని ఎవళ్ళూ నిదానాన్ని పోగొట్టుకోలేదు. ఎవళ్ళూ కూడా తన చెవుల కలవాటైన మోటు మాటల నుపయోగించలేదు.

''ఆడపిల్లదగ్గర మోటు మాటలనుపయోగించడానికి వారు సిగ్గుపడుతున్నారు'' అని నిశ్చయించుకుంది.

అందరి ముఖాల వంకా, చంటిపిల్లలకేసి చూచినట్లుగా పరిశీలనగా చూస్తున్న నతాషా ముఖంలోని గాంభీర్యం తల్లికి నచ్చింది.

''కామ్రేడ్స్! ఒక్క నిముషమాగండి!'' అని నతాషా అడ్డురావడంతో, అందరూ మాటలు కట్టిపెట్టి ఆమెకేసి చూశారు.

''మనమన్నీ తెలుసుకోవాలనేవాళ్ళు చెప్పిన మాటా నిజమే. మనం సదసద్వివేకమనే జ్యోతిని మనలో వెలిగించుకోవాలి. అంధకారంలో ఉక్కిరిబిక్కిరయే వాళ్ళకు ఆ జ్యోతి కన బడాలి. ప్రతి ప్రశ్నకూ సత్యసమ్మతంగా నిజాయితీగా మనం జవాబివ్వగలగాలి. సత్యాసత్యాలను సంపూర్తిగా తెలుసుకోవాలి....''

హోహోల్ నతాషా చెప్పిన మాటలు వింటూ వాటికి లయగా తలూపేడు. వెసొవ్ శ్చికోవ్, ఎర్ర తలకాయవాడు, పావెల్‌తో వచ్చిన ఫ్యాక్టరీ కుర్రవాళ్లలో ఒకడూ లేచి ఒక గుంపుగా ఒక పక్కన నిలబడ్డారు. ఎందుకోగాని తల్లికి వాళ్ళు నచ్చలేదు.

నతాషా మాట్లాడ్డం ముగించగానే పావెల్ లేచాడు.

''కడుపునిండా కూడేనా మనకు కావలసినది?... కానే కాదు.... మన భుజాలమీదెక్కి సవారిచేస్తూ మన కళ్లకు గంతలు కడుతున్న వాళ్లకు, మనకంతా తెలుస్తోందని చూపించాలి. మనం మూర్ఖులం కామనీ, పొట్ట నింపుకోవడం తప్ప మరేమీ అక్కర లేని పశువులం కాదనీ, కేవలం పొట్ట నింపుకోవడమే గాదు, మనుషుల్లా బతకాలని కోరుకుంటున్నామనీ వాళ్లకు రుజువుచేయాలి. మనం కూడా మనుష్యుల్లా జీవించలని కోరుతున్నాం. మన శత్రువులు మనల్ని బండ చాకిరీతో ఎంత కుంగదీస్తున్నా, బుద్ధిలో వారికేవిధంగానూ తీసిపోమనీ, వాళ్లకన్న తెలివితేటల్లో మనది పైచెయ్యేననీ కూడా మనం ధ్రువపరచాలి!'' అని ఆ ముగ్గురికేసీ చూస్తూ నిదానంగా చెప్పేడు.

అతనెంత బాగా మాట్లాడేడోననే గర్వం తల్లి హృదయంలో జనించింది.

''కడుపునిండా తిండి వున్న వాళ్ళు చాలమందే ఉన్నారు. కాని నిజాయితీపరులు అరుదు. కుళ్ళుజీవితమనే ఈ ఊబిని దాటాలంటే రాబోయే సర్వమానవ సోదర రాజ్యానికి మనం ముందుగా వంతెన నిర్మించాలి. మనం చేయవలసిన పని అదీ'' అన్నాడు హోహోల్.

''ఏమిటో! దెబ్బలాడవలసిన సమయమొచ్చినప్పుడు, చేతులు ముడుచుకుని కూచోవడమే మిటి?'' అని అసమ్మతిసూచకంగా వెసొవ్ శ్చికోవ్ ఘర్రుమన్నాడు.

ఆ సమావేశం ముగిసేసరికి అర్ధరాత్రి దాటిపోయింది. వెసొవ్ శ్చికోవ్, ఎర్ర తలకాయ వాడూ ముందు నిష్క్రమించారు. తల్లికి అదీ నచ్చలేదు.

''ఎంత తొందర పడుతున్నారో!'' అనుకుంది వాళ్లను సాగనంపుతూ.

''నన్నింటిదాకా దిగబెడతారా నహోద్కా?'' అని నతాషా అడిగింది.

''ఓ తప్పకుండాను'' అన్నాడు హొహోల్.

నతాషా వంటింట్లో కెళ్లి కోటు వగైరాలు ధరిస్తుంటే, తల్లి:

''అమ్మాయ్! మీ మేజోళ్లు చాలా పల్చగా వున్నాయి. ఈ చలికవి ఆగవు. మీకొక జత ఊలు మేజోళ్లు అల్లి పెట్టనా?'' అంది.

''సంతోషం, పెలగేయా నీలొవ్నా, కాని ఊలు మేజోళ్లు గుచ్చుకుంటాయి'' అని నతాషా నవ్వుతూ అంది.

''గుచ్చుకోకుండా మెత్తని ఊలుతోనే అల్లి పెడతాను'' అంది తల్లి.

నతాషా కళ్లు చిట్లించి, తల్లికేసి తదేకంగా చూసింది. ఆ చూపు తల్లిని తికమక పెట్టింది.

''నా తెలివి తక్కువను మన్నించమ్మాయ్!'' అని, ''మనసులో ఉన్న మాట పైకి అనేశాను'' అని నెమ్మదిగా జోడించింది.

''ఎంత మంచివారమ్మా మీరు!'' అంటూ నతాషా అంత నెమ్మదిగానూ అని, తల్లి చేతిని ఉద్రేకంతో నొక్కింది.

''వెళ్లొస్తాను మామ్మా!'' అంటూ హొహోల్ తల్లికేసి చూసి, నతాషా వెంట వెళ్లి పోయాడు.

పావెల్ చిరునవ్వుతో గుమ్మంలో నిలబడ్డాడు. తల్లి అతడికేసి చూసింది.

''ఎందుకలా నవ్వుతున్నావు?'' అని అడిగింది.

''మరేమీ విశేషం లేదమ్మా! ఏదో సంతోషం కలిగింది.''

''నేను ముసలిదాన్ని కావచ్చును. మూర్ఖురాల్ని కావచ్చును. కాని మంచేదో చెడ్డేదో చెప్పగలను సుమా!'' అని కొంచెం కరుకుగా చెప్పింది తల్లి.

''అందుకు సంతోషమే. మీరింక పడుకోరాదూ?''

''ఇదిగో ఒక్క నిమిషంలో పడుకుంటా.''

ఆమె బల్లమీదనుంచి టీ కప్పులు, వగైరాలన్నీ తీసేస్తోంది. ఈ సమావేశమామెకెంతో సంతోషం కలిగించింది. నిజంగా సంతోషంతో చెమట పట్టింది. అన్ని విధాలా సమావేశం చక్కగా జరిగి ప్రశాంతంగా ముగిసినందుకు ఆమెకు చాలా సంతృప్తి కలిగింది.

''పాషా! ఇదంతా బాగా జరిపించావు! హోహోల్ చాలా మంచివాడు సుమా! ఆ పిల్ల ఎంత చురుకైనది! ఎవరామె?''

''ఉపాధ్యాయిని'' అని పచారు చేస్తూ ముక్తసరిగా జవాబిచ్చాడు పావెల్.

''ఆమె చాలా పేదరాలై ఉండాలి. బట్టలేమీ బాగాలేవు. అలా ఉంటే ఈ చలిలో ఇట్టే పడిశం పట్టేస్తుంది. ఆమె తల్లితండ్రులెక్కడున్నారు?''

''మాస్కోలో'' అని తల్లి కెదురుగా ఆగి మెల్లగా చెప్పడం మొదలెట్టేడు. ''ఆమె తండ్రి ధనవంతుడు. ఇనుప వ్యాపారం చేస్తున్నారు. బాగా ఆస్తిపాస్తులు వున్నాయి. ఈ ఉద్యమంలో చేరి ఈ జీవితాన్ని చేపట్టడంచేత, తండ్రి ఆమె నింట్లోంచి వెళ్లగొట్టేడు. చిన్నప్పుడు భోగభాగ్యాలతో సుకుమారంగా పెరిగింది. ఇప్పుడు రాత్రి చీకట్లో ఒంటరిగా ఏడు మైళ్లయినా నడుస్తుంది....''

ఆ మాటలు విని తల్లి అబ్బురపడింది. గది మధ్యలో కొయ్యబారి నిలబడి కనుబొమలు ముడుచుకుని మౌనంగా కొడుక్కేసి చూచింది. తర్వాత నెమ్మదిగా,

''ఇప్పుడామె పట్నం వెళ్లిందా?'' అని అడిగింది.

''అవును.''

''అయ్యో నా తల్లీ! భయం లేదూ?''

''మీరే చూశారుగా! ఆమె భయపడదు'' పావెల్ నవ్వేడు.

''కాని ఆమె ఎందుకెళ్లిపోవాలి? రాత్రి ఇక్కడే ఉండి నా దగ్గరే పడుకోవచ్చుగా!''

''అల్లా కుదరదు. ఉదయం ఆమెనిక్కడెవరైనా చూస్తారు. అది మాకిష్టం లేదు.''

తల్లి కిటికీలోనుంచి చూస్తూ సాలోచనగా

''పాషా! నాకిందులో ఏమీ అంత ప్రమాదమైన పని కనిపించదే! అంత నిషేధించ వలసిన దిందులో ఏముందబ్బా? మీరేమీ తప్పుపని చేయడంలేదే? చేస్తున్నారా?'' నెమ్మదిగా కొడుకు నడిగింది.

ఇందులో ఆమెకు నమ్మకం కుదర్లేదు. అదేదో తేల్చుకోవాలనుకుంది.

''లేదమ్మా! మేమేమీ తప్పు చేయడం లేదు'' పావెల్ ఖచ్చితంగా చెప్పేడు. నిదానంగా ఆమె కళ్లతో చూపు కలుపుతూ, ''కాని ఎప్పుడో ఒకనాడు మేమంతా జైళ్లలో ఉంటాం. ఈ సంగతి నీకు తెలుసుంటే మంచిది'' అన్నాడు.

ఆమె చేతులు వణికాయి.

''బహుశా — దేవుడు మేలు చేస్తే — ఎలాగో నువ్వు తప్పించుకోవచ్చు కదా!'' అని గుసగుసగా అడిగింది.

''కుదరదు. నిన్ను మోసం చేయడం నాకిష్టం లేదు. తప్పించుకోవడం వీలు కాదు'' అన్నాడు ప్రేమగా చిరునవ్వుతో.

"వెళ్లి పడుకో. బాగా అలసిపోయావు."

తానొక్కతే మిగలగానే, కిటికీ దగ్గరకెళ్లి బయటికి చూస్తూ నిలబడింది. బయట చలిగా ఉంది. మంచు కమ్మింది. గాలి వీస్తోంది. నిద్రమత్తుకమ్మిన చిన్న ఇళ్లమీదనున్న మంచు నురగలను గాలి ఎగురగొట్టేస్తోంది. గాలి గోడలకు కొట్టుకుని నేలకు దూకి వీధిలోని మంచు తరకల్ని తరిమేస్తోంది.

"ఓ ఏసు ప్రభూ! మమ్మల్ని కనికరించు!" అని తనలో తానే మెల్లగా గొణుక్కుంది.

హృదయంలోనుంచి అశ్రుధారలు పొంగి వచ్చాయి. తన కొడుకు నిబ్బరంగా, తొణుకూ బెణుకూ లేకుండా చెప్పిన కష్టాలన్నీ, ముందుగానే ఆమె గుండెల్లో రాత్రి వేళ రెక్కలపురుగు కొట్టుకున్నట్లుగా, తపతప కొట్టుకోవడం మొదలెట్టాయి. తన కళ్ల ముందర మంచు కప్పిన మైదానంమీద తెల్లటి హోరుగాలి కీచుమంటూ వీస్తున్నట్లామెకు కనబడింది. ఆ మైదానంమీద దూరంగా, ఊగిసలాడుతుండే ఒక అమ్మాయి నల్లని ఆకృతి కనుబడింది. ఆమె కాళ్ల ముందర గాలి సుళ్లు తిరిగి ఆమె పావడాను ఎగురగొట్టి, ముఖాన్ని జివ్వుమనే మంచుతో కొడుతోంది. కాళ్లు మంచులో కూరుకుపోతుంటే, ఆమె అతి కష్టంమీద ముందుకు నడుస్తోంది. చలి భయంకరంగా ఉంది. శరత్కాలపు గాలివిసురుకు, వంగిపోయే గడ్డి మొలకలాగున, ఆమె శరీరం ముందుకు వాలింది. ఆమె కుడి పక్కన వూబిలో ఎత్తైన అడవి గోడకట్టినట్లుంది. సన్నని భూర్జవృక్షాలూ, ఆకురాలిపోయిన ఏస్పెన్ చెట్లూ ఒంటరిగా గుసగుసలాడుకుంటున్నాయి. దూరాన పట్నంలోని దీపాలు మిణుకుమిణుకు మంటున్నాయి.

"ఓ ప్రభూ కనికరించు" అని గడగడలాడుతూ తల్లి తనలో తాను గొణుక్కుంది.

## 7

జపమాలలోని పూసల్లా రోజులు దొర్లిపోయి వారాలు, నెలలు గడిచిపోయాయి. ప్రతి శనివారం, పావెల్ స్నేహితులు తన ఇంట్లో సమావేశమవుతూ ఉండేవారు. సుదూరంగా ఉండే లక్ష్యాన్ని అందుకునేందుకు జనం పైకెక్కేటందుకు ఒక్కొక్క సమావేశమూ ఒక్కొక్క మెట్టు అవుతోంది.

కొత్త వాళ్లొచ్చి సమావేశాల్లో పాల్గొంటున్నారు. వ్లాసావ్ ఇంట్లో ఉన్న గది జనంతో కిటకిటలాడుతూ వచ్చింది. నతాషా వచ్చినప్పుడల్లా అలిసి ముద్దయి చలితో గడ్డకట్టుకు పోయివచ్చేది. కాని ఎప్పుడూ నవ్వుతూనే వుండేది. పావెల్ తల్లి ఆమెకోసం మేజోళ్ల జత అల్లి, స్వయంగా ఆమె చిన్ని పాదాలకు తొడిగింది. నతాషా నవ్వింది. కాని అంతలోనే నిశ్శబ్దంగా ఉండిపోయి, ఆలోచనలో పడింది.

"ఒకప్పుడు నాకో దాది వుండేది. ఆమె నాపట్ల మహా దయగా ఉండేది.... పెలగేయా

పిలొవ్నా! అదేం చిత్రమో కాని, ఎంతో కఠినమైన జీవితాన్నీ, అభాగ్య జీవితాన్నీ గడుపు తున్నా కార్మికజనం ఇతరులకన్న దయగా ఉంటారు సుమా...." అంది నెమ్మదిగా నతాషా. ఆమె దూరంగా ఉన్నవారి నెవరినో, తనకు అతిదూరాన్నున్నవారి నెవరినో ఉద్దేశించి అలా చెప్పింది.

"భలేదానివమ్మా నువ్వు? తల్లిదండ్రులూ, ఎవ్వరూ లేకుండా మరి...." అని పెల గేయా నీలొవ్నా నిట్టూర్చి మౌనం వహించింది. తన భావాలను వ్యక్తపరచలేకపోయింది. కాని నతాషా ముఖంకేసి చూస్తుంటే ఆమెకు మరోసారి ఎందుకో తెలియని కృతజ్ఞ తానుభూతి కలిగింది. తలముందుకొంచుకుని చిరునవ్వుతో ఏదో ఆలోచనలో నిమగ్నమైన ఆ అమ్మాయి కెదురుగా తల్లి చతికిలబడింది.

"నా తల్లితండ్రుల్ని వదిలి ఎలా వుండగలుగుతున్నానంటారా?" రెట్టించింది నతాషా. "అదేమంత విశేషం కాదు. మా నాన్న చాల మోటు మనిషి. మా అన్నయ్య కూడా అలాంటి వాడే. పైగా తాగుబోతు కూడాను. మా అక్కయ్య అభాగ్యురాలు. ఆమె తనకంటె వయసులో చాలా పెద్దవాడిని పెళ్లాడింది. అతడు చాలా ధనవంతుడే కాని ఆశపోతు. మా అమ్మను చూస్తే మాత్రం జాలేస్తుంది. మీలాగే చాలా అమాయకురాలు. ఎలుకంత మనిషి. ఎలుకలాగే వడిగా పరుగెత్తుతుంది. అలాగే ఎవర్ని చూసినా భయపడుతుంది. అబ్బ! అప్పు డప్పుడు ఆమెను చూడాలని మనసెంత ఆరాట పడుతుందో చెప్పలేను!"

"అయ్యో! నా తల్లీ!" అంటూ తల్లి విచారంతో తలూపింది.

ఆ అమ్మాయి గభాలున తల వెనక్కు వాల్చింది. దేనినో పక్కకు త్రోసేసినట్లు చటుక్కున చేయి చాచి,

"కాదమ్మా! అప్పుడప్పుడు నేను ఆనందంగా, చాలా ఆనందంగా వుంటాను!" అంది.

ఆమె ముఖం వెలవెల బారింది. నీలి నేత్రాలు తళుక్కుమన్నాయి. అమ్మ భుజాలమీద చేతులేసి:

"మేమేం చేస్తున్నామో మీకు తెలిస్తే, ఎంతటి అమోఘమైన పని చేస్తున్నామో మీరు తెలిసికోగలిగితే!" అని నెమ్మదిగా మనసుకు హత్తుకునేటట్లు చెప్పింది.

పెలగేయా నీలొవ్నా హృదయానికి ఈర్ష్యలాంటిదేదో తాకినట్లయింది.

"అందుకు నాకు వయసు మించిపోయింది. పైగా చదువు సంధ్యలు రావు...." అంటూ విచారంగా లేచి నిలబడింది....

...ఇటీవల పావెల్ మునుపటికంటె తరుచుగా మాట్లాడుతూ వచ్చాడు. సుదీర్ఘంగా, మరింత తీవ్రంగా కూడా మాట్లాడుతున్నాడు. రోజుకు రోజూ చిక్కిపోతున్నాడు. అతడు నతాషాకేసి చూసినప్పుడు, ఆమెతో మాట్లాడినప్పుడు, అతని కళ్లలోని తీవ్రత కొంత

మెత్తనవుతున్నట్లు తల్లి కనిపెట్టింది. కంఠస్వరం తగ్గు స్థాయిలో కొచ్చేది. చెప్పే ధోరణిలో కరుకుతనం తగ్గేది.

"భగవంతుడు అలాగే అనుగ్రహించాలి" అని తల్లి నవ్వుతూ అనుకునేది.

వాళ్ల సమావేశాల్లో వాగ్వివాదాలు చాలా తీవ్రమై తుఫాను రేగినప్పుడు, హోహోల్ లేచి నిలబడి, శరీరాన్ని ముందుకూ వెనక్కూ గుడిగంటలోని నాలుకలాగున ఊగిసలాడిస్తూ ముక్తసరిగా రెండు మంచి మాటలు చెప్పేవాడు. దానితో అందరూ తగ్గి స్థిమిత పడుతుండే వాళ్లు. ఎప్పుడూ విషాదంతో చిరచిరలాడుతుండే వెసొవ్ శ్చికోవ్ ఇతరులనేదో చేయమని చెపుతుండేవాడు. అతడూ, సమోయ్‌లొవ్ అని పిలువబడే ఎర్ర తలకాయవాడూ, చర్చలను మాత్రం లేవదీస్తుండేవారు. వాళ్ల వాదనను లేరంగు జుట్టుగల ఇవాన్ బూకిన్ బలపరుస్తుండేవాడు. అతడిని చూస్తే కారవునీళ్లలో మునిగి వచ్చిన మనిషిలా కనబడేవాడు. యాకొవ్ సోమొవ్ చాలా సాఫీగా శుభ్రంగా ఉండేవాడు. కొంచెం మాట్లాడినా, సద్భావంతో గంభీరంగా మాట్లాడేవాడు. అతనూ, విశాలమైన నుదురుగల ఫ్యోదొర్ మాజిన్, ఎల్లప్పుడూ పావెల్, హోహోల్ పక్షంగానే మాట్లాడుతుండేవారు.

ఒక్కొక్కప్పుడు నతాషా బదులు నికొలాయ్ ఇవానొవిచ్ వచ్చేవాడు. కళ్లకు అద్దాలు. చిన్న గడ్డం. అతడెక్కడో మారుమూల రాష్ట్రంలో పుట్టాడు. అందుకనే అతడు మాట్లాడుతుంటే "ఒ" అనే అక్షరాన్ని పలకడంలో ఒక చిత్రమైన యాస ఉండేది. మొత్తంమీద అతను "మారుమూల" మనిషి. అతడు చాలా సాధారణమైన విషయాలను గురించి మాట్లాడేవాడు. కుటుంబజీవనం, పిల్లలు, వర్తక వ్యాపారం, పోలీసులు, రొట్టె, మాంసం వగైరాల ధరవరలు, మొదలైన ప్రజల నిత్యజీవితానికి సంబంధించిన సంగతులే చెప్పేవాడు. ఆ చెప్పడంలో ప్రజలకు ప్రతికూలమైన అన్ని అసత్యాలనూ, అసంబద్ధాలనూ, అవివేకాలనూ, బయట పెట్టేవాడు. అతడెక్కడో చాలా దూరాన్నుంచి వచ్చాడనీ, ప్రజలంతా సుఖంగా విజాయితీగా బ్రతికే మరో ప్రపంచంనుంచి వచ్చాడనీ ఊహించుకునేది తల్లి. నిజానికి ఇక్కడంతా అతనికి కొత్తగానే ఉంది. ఆ జీవితానికి అతడు అలవాటు పడలేకపోతున్నాడు, అంగీకరించలేకనూ పోతున్నాడు. అతనికది నచ్చలేదు. దాన్ని సక్రమ పద్ధతిలో పెట్టాలనే పట్టుదలనూ, దీక్షనూ ఈ జీవితం అతనిలో రేకెత్తించింది. అతని ముఖం లేత పసుపురంగు చాయ. కళ్ళు తీర్చి దిద్దినట్లుంటాయి. మృదువైన కంఠధ్వని. చేతులెప్పుడూ నులివెచ్చగా ఉంటాయి. వ్లాసొవాను అతనెప్పుడు పలకరించినా ఆమెతో దృఢంగా కరచాలనం చేసేవాడు, ఆమెకెంతో సంతుష్టిగా ఉండేది.

పట్టణంనుంచి ఈ సమావేశాలకు ఇంకా చాలామంది వచ్చేవారు. తరుచుగా సన్నంగా ఉండే ఓ అమ్మాయి వచ్చేది. ఆమె ముఖం వెల్లబారి ఉండేది. ఆమె నేత్రాలు విశాలంగా ఉండేవి. ఆమెనందరూ "సాషెంకా" అని పిలిచేవాళ్లు. ఆమె నడకలో, కదలికల్లో కొంత

మగ వాలకం ఉండేది. ఆమెకు చిరాకొచ్చినపుడల్లా వత్తైన కనుబొమలు ముడిచి, సూటిగా వున్న పలుచని ముక్కు పుటాలు అదిరేటట్లు మాట్లాడేది.

"మనం సోషలిస్టులం" అని మొట్టమొదటిసారి గట్టిగా తెగేసి చెప్పింది ఆమే.

తల్లి ఈ మాటలు వినేసరికి అదిరిపోయి, మౌనం దాల్చి, ఆ అమ్మాయికేసి తేరిపార చూసింది. సోషలిస్టులు రష్యా చక్రవర్తిని చంపేరని ఆమె తన చిన్నతనంలో విన్నది. తమ పొలాల్లో పనిచేసే బానిసరైతులను విడుదల చేసినందుకు, భూస్వాములు ఆగ్రహం చెంది, చక్రవర్తిని చంపి బదులు తీర్చుకునేవరకూ, జుట్టు కత్తిరించుకోమని శపథం చేశారని జనం చెప్పుకునేవారు. అంచేత వాళ్లని సోషలిస్టులనేవారు. ఇప్పుడు తన కొడుకూ, అతని మిత్రులూ, తామెందుకు సోషలిస్టులని పిలుచుకుంటున్నారో ఆమె కర్థం కావడం లేదు.

ఒక రోజున అందరూ వెళ్లిపోయాక ఆమె పావెల్ దగ్గరకెళ్లి,

"పావ్లూష! నువ్వు సోషలిస్టువా?" అని అడిగింది.

ఎప్పటిలాగానే పావెల్ ఆమె ఎదుట నిటారుగా స్థిరంగా నిలబడి,

"అవును. అయితే?" అన్నాడు.

తల్లి గాఢమైన నిట్టూర్పు విడిచింది. కళ్లు వాల్చేసింది.

"నిజమేనా పాషా? వాళ్లు జారుకి విరోధులు కదూ? వాళ్లొక జారుని చంపేరు కూడా?"

పావెల్ చేత్తో చెక్కిళ్లు రాసుకుంటూ గదిలో ఆ చివరనుంచి ఈ చివరదాకా అంగ లేశాడు. వ్యంగ్యంగా చిన్ననవ్వు నవ్వి:

"అలాంటి పనులు మాకక్కర లేదమ్మా!" అన్నాడు.

తర్వాత ఆమెతో చాలా సేపు గంభీరంగానూ, నెమ్మదిగానూ మాట్లాడేడు. ఆమె అతని ముఖంకేసి చూస్తూ,

"తప్పుడు పనులు చేయడు, చేయలేదు నా చిట్టి తండ్రి" అనుకుంది.

ఆతర్వాత ఈ భయంకరమైన మాట ఎన్నోసార్లు ఆమె విన్నది. ఆ మాట మొద్దు బారిపోయింది. తన చెవికీమాట వాళ్లు ఉపయోగించుకునే అసంఖ్యాకమైన ఇతర కొత్త మాటలవలెనే పరిపాటైపోయింది. కాని ఆమెకు సాషెను చూస్తే సరిపడలేదు. ఆమె సముఖంలో తల్లి చాలా ఆందోళన చెంది చికాకుపడేది.

ఒక రోజున తల్లి హోహోల్‌తో ఆమెను గురించి అసంతృప్తితో పెదవులు బిగించి ప్రస్తావించింది.

"ఆమె అంత బిరుసుగా ఉంటుందేమిటి? ప్రతి వాళ్లనీ ఆ పని చేయ్, ఈ పని చేయ్ అని ఆజ్ఞాపిస్తూంటుంది."

హొహోల్ పెద్దగా నవ్వేడు.

"సరిగా ఎక్కడ కొట్టాలో అక్కడ కొట్టేరమ్మా మాన్యూ! ఏం పావెల్, ఎలావుంది? బాగుందా?" అంటూ తల్లికేసి తిరిగి కన్నుగీటి, "కులీనుల తీరు అంటే అదే మరి!" అన్నాడు.

"ఆమె చాలా మంచిది" అన్నాడు పావెల్ పొడిగా.

"అవును. కాని ఆమె ఒక విషయాన్ని అర్థంచేసుకోదు. 'చేసి తీరాలి' అంటుంది ఆమె. మనమేమో 'చేయదలచుకున్నాం,' 'చేయగలగాలి' అంటాం" అన్నాడు హొహోల్.

తర్వాత వాళ్లిద్దరూ తల్లి బుద్ధి కందని సంగతులేవో చర్చించుకున్నారు.

అందరికంటె పావెల్ విషయంలో సాషా చాలా కరుకుగా వ్యవహరించడం తల్లి గమనించింది. అప్పుడప్పుడు ఆమె అతన్ని కేకలేసేది కూడా. అలాంటప్పుడు పావెల్ ఏమీ మాట్లాడేవాడు కాదు. నవ్వుతూ ఆ అమ్మాయి ముఖంకేసి ముచ్చటగా చూసేవాడు. నతాషాకేసి చూసినట్లే చూడ్డం కూడా తల్లికి మనస్కరించలేదు.

ఒక్కొక్కప్పుడు వీళ్లందరూ హఠాత్తుగా ఆనంద తరంగాల్లో తేలిపోతూ ఉండడం తల్లికి ఆశ్చర్యం కలిగించేది. సాయం సమయంలో, విదేశాల్లో కార్మిక జనుల ఉద్యమాల భోగట్టాను పత్రికల్లో చదువుతుండేటప్పుడు అలాటి ఆనందం వాళ్లకు కలిగేది. అప్పుడు వాళ్ల కళ్లలో ఆనందం తళుక్కున మెరిసేది. అదో చిత్రంగా చిన్న పిల్లల్లాగ సంతోషంలో మునిగి పకపక నవ్వుకునేవారు. ఒకళ్ల భుజాలనింకొకళ్లు ఆప్యాయంగా చరుచుకునేవారు.

"జర్మనీ కామ్రేడ్సుకు జయ్!" అని ఒకడు ఆనందాతిరేకంతో అరిచేవాడు.

మరొకసారి ఇంకొకడు:

"ఇటలీ కార్మికులు వర్ధిల్లాలి!" అని కేకేసేవాడు.

తమ నెరుగనట్టే, తమ భాషనైనా ఎరుగనట్టే దూరదేశాల కార్మికులకు తమ ఈ అభినందనలను వ్యక్తంచేస్తూన్నప్పుడు, తమ నెరుగని ఆ ప్రజలు వాటిని విన్నట్టూ, తమ ఆనందపారవశ్యాన్ని గ్రహించినట్టూ వీరు నిశ్చయంగా నమ్మినట్లు అగుపడేది.

"వాళ్లకి రాస్తే బాగుంటుందేమో?" అన్నాడు హొహోల్ ఆర్ద్రదృష్టితో. అతని కళ్లు మెరిశాయి. "వాళ్లు ఏ మతాన్ని నమ్ముతున్నారో, ఏ ఆశయాన్ని విశ్వసిస్తున్నారో, ఏ లక్ష్యంకోసం జీవిస్తున్నారో, ఆ లక్ష్యంకోసం జీవించే స్నేహితులు రష్యాలో కూడా ఉన్నారనీ, వాళ్లు సాధించిన విజయాలకు వీరు కూడా ఆనందిస్తున్నారనీ, వాళ్లకు మనం తెలియచేయాలి."

వికసిత వదనాలతో వాళ్లు ఫ్రెంచి, ఇంగ్లీషు, స్వీడిష్ జనాన్ని గురించి వారు తమ కెంతో సన్నిహితులైన మిత్రులన్నట్లు మాట్లాడుకుంటారు. వాళ్లనెంతో గౌరవించి, వాళ్ల కష్ట సుఖాలలో పాల్గొనేటట్లు మాట్లాడుకునేవారు.

ప్రపంచంలో ఉండే కార్మికులంతా ఒక్కటే అన్న మానసిక సన్నిహితత్వం, ఈ చిన్న

ఇరుకు గదిలో జన్మించింది. అపరిమితమైన ఆనందాన్నీ ఆశనూ కలిగించే ఈ భావనమై క్యతయొక్క జీవశక్తికి వారంతా ఆనందించేవారు. దాని అర్థం తెలియకపోయినా తల్లి కూడా దాని శక్తిని తెలుసుకుని సంతోషించింది.

ఒక సారి ఆమె హోహోల్‌తో ఇలా చెప్పింది.

"మీ సంగతి చూడండి! యూదులు, ఆర్మీనియనులు, ఆస్ట్రియనులు అన్ని దేశాల వారూ మీకు స్నేహితులేనే! వాళ్ల సుఖదుఃఖాలన్నీ మీకు కావాలి!"

"అవును మామ్మా! అవును. మాకు జాతులూ, తెగలూ లేవు. స్నేహితులూ, శత్రువులూ మాత్రమే. కార్మికులంతా మాకు స్నేహితులు. ధనికులూ, ప్రభుత్వాలూ మాకు విరోధులు. ఒక్కసారి ప్రపంచాన్నంతవీ కలచూచి, మా కార్మికుల మెంతమంది ఉన్నామో, మేమెంత బలంగా ఉన్నామో తెలుసుకుంటే, మా ఆనందానికి అంతు ఉండదు. హృదయమెంతో చల్లపడుతుంది. మామ్మా! ఫ్రెంచివాళ్లూ ఇటాలియన్లూ కూడా ఈ దృష్టితోనే ఆలోచించిననాడు సంతోషపడతారు. మేమంతా ఒక తల్లి బిడ్డలం. ప్రపంచంలోని కార్మికులంతా సోదరులనే అకుంఠిత విశ్వాసమే మా తల్లి. ఈ భావం మా హృదయాలనుప్పొంగ చేస్తుంది. ధర్మమనే ఆకాశంమీద ప్రకాశించే సూర్యుడే ఈ భావం. ఈ ఆకాశం కార్మికుని హృదయం. అతడెవరైనా తనకే పేరు పెట్టుకున్నా, సోషలిస్టన్నవాడల్లా మానసికంగా మాకు నిన్న, నేడు, ఎప్పటికీ సోదరుడే!"

ఈ దృఢమైన అమాయిక విశ్వాసం వాళ్లలో రోజురోజుకూ పెరిగింది. చాలా ఉదాత్త రూపంలో పెరిగింది. అదొక మహత్తర శక్తిగా పరిణమిస్తోంది. తల్లి దాన్ని గుర్తించినప్పుడు, సూర్యుని వంటి గొప్పశక్తి ఏదో ప్రపంచంలో ఉదయిస్తోందనే అనుభూతిని పొందింది. దాన్ని తన కళ్లారా చూచినట్లుంది.

తరుచుగా వాళ్లు పాడుతుండేవారు. అందరికీ వచ్చిన పాటలే గొంతెత్తి హాయిగా పాడుతుండేవారు. మధ్యమధ్య మాత్రం భావగర్భితమైన కొత్త పాటలు చక్కగా రాగయుక్తంగా పాడేవారు. ఈ పాటలను మాత్రం చర్చి సంగీతంలాగున చాలా మెల్లని కంఠస్వరంతో గంభీరంగా పాడేవారు. పాటకుల ముఖాలు వివర్ణమయేవి, ఎర్రబారేవి. మాటల్లో గొప్ప శక్తి వ్యక్తమయేది.

కొత్త పాటల్లో ఒకటి తల్లికి చాలా హృదయ సంచలనం కలిగించింది. అది సంకోచంతో, అవిశ్వయంతో దారీ తెన్నూ కానక ఒంటరిగా సంచారం చేసే క్షతహృదయుని విషాద గీతం కాదు. లేమితో బాధపడుతూ, భయంతో కుంగిపోతూ, వ్యక్తిత్వ శూన్యులైన వారి నివేదనలు కావు. గుడ్డివాళ్లు దారీ తెన్నూ తెలియకుండా తిరుగుతూ విడిచే విషాద పూరితమైన నిట్టూర్పులు అందులో లేవు. మంచీ చెడ్డా తారతమ్యం లేకుండా అన్నిటినీ సవాల్ చేసే పేచీపూచీ లెరుగని సాహసుల వివాదాలు అందులో కనబడవు. నాశనం చేయ

డమే కాని పునర్నిర్మాణం చేయలేక, విచక్షణారహితులై ప్రతీకారాన్ని కాంక్షించేవారి ఆవేదనను ఆ పాట ధ్వనించలేదు. ఆ పాటలో పాతకాలపు బానిస ప్రపంచ అవశేషా లేమీ లేవు.

తల్లికి ఆ పాటలోని కఠోరమైన మాటలు, కటువైన రాగం నచ్చలేదు. కాని ఆ మాటల వెనుకా రాగం వెనుకా ఊహాకతీతమైన మహత్తర విశేషమేదో ఉంది. ఆ విశేషమే ఆ మాటలను, రాగాన్నీ కూడా ముంచేసేది. అలాటి అనిర్వాచ్యమైన విశేషమే తల్లికి ఆ యువకుల కళ్లలోనూ, ముఖాల్లోనూ కనబడేది. అది వాళ్లలో జీవిస్తున్నదా అనిపించింది ఆమెకు. మాటలకూ పాటలకూ అతీతమైన ఒక శక్తికి లోబడి, ఆమె ఆ పాటను మిగిలిన వాటికంటె చాలా శ్రద్ధతోనూ, ఉద్రేకంతోనూ వింటూండేది.

వాళ్లు ఆ పాటను మిగిలినవాటికన్న నెమ్మదిగా పాడేవారు. కాని అది వాటికన్న స్ఫుటంగా వినిపించేది. మార్చినెలలో వసంతాగమనానికి నాందిగా వీచే పిల్లవాయువు జనాన్ని ఆనంద పరవశులను చేసినట్లుగా ఈ పాట జనాన్ని ఆకర్షించేది.

''ఈ పాటని మనం వీధుల్లో పాడవలసిన సమయం వచ్చింది'' అనేవాడు వెసావ్శ్చికోవ్, చిరచిరలాడుతూ.

ఇటీవల చేసిన దొంగతనానికి అతని తండ్రిని మళ్లీ జైల్లో పడేశారు.

''ఇప్పుడు మనం మా యింట్లో సమావేశం కావచ్చు'' అన్నాడు వెసావ్శ్చికోవ్.

దాదాపుగా ప్రతిరోజూ, పనైపోయిన తర్వాత, పావెల్ స్నేహితుల్లో ఎవరో ఒకరు అతనితో ఇంటికొచ్చేవాళ్లు. అక్కడ చదువుతూ కూచుని కొన్ని విషయాలను కాగితాలమీద రాసుకుంటూ ఉండేవాళ్లు. కాళ్లూ చేతులూ ముఖం కడుక్కునేందుకు కూడా వ్యవధి లేనట్లుండేవాళ్లు. చేతుల్లో పుస్తకాలుంచుకునే టీ, రాత్రి భోజనం కూడా చేసేవాళ్లు. రానురాను వాళ్లేమి మాట్లాడుకుంటున్నారో అర్థంచేసుకోవడం కూడా తల్లికి కష్టమైంది.

''మనమొక పత్రికను ప్రారంభించాలి'' తరుచుగా అంటుండేవాడు పావెల్.

జీవితం ఎక్కువ వేగంగానూ, ఉద్వేగంగానూ నడుస్తోంది. తేనెటీగలు ఒక పువ్వు మీదనుంచి మరొక పువ్వుమీద కెగిరిపోతున్నంత వేగంగా ఒకదాని వెంట మరో పుస్తకం చదివేస్తున్నారు జనం.

''వాళ్లు మన్ని గురించి మాట్లాడుకుంటున్నారు. త్వరలో మన్ని పట్టేస్తారు'' అన్నాడు ఒకనాడు వెసావ్శ్చికోవ్.

''చేప పుట్టిన తర్వాత ఎప్పుడో ఒకనాడు వలలో తగుల్కోక తప్పదు'' అన్నాడు హొహోల్.

హొహోల్పై ఆప్యాయత తల్లికి రోజుకురోజూ హెచ్చింది. అతడు ''మామ్మా'' అని పిలిచినప్పుడల్లా చంటిబిడ్డ తన మృదుహస్తంతో చెక్కిళ్లు నిమిరినట్లుండేది ఆమెకు. ఆదివారంనాడు పావెల్ పనిలో ఉంటే, హొహోల్ కర్రలు కొట్టేవాడు. ఒకరోజున ఒక బల్లచెక్క భుజాన పెట్టుకొచ్చి బులిగిపోయిన గుమ్మం మెట్టును తీసేసి కొత్తదానిని

అమారు చేశాడు. మరొక రోజున వంగిపడిపోయిన కట్టవను ఎవరికీ తెలియకుండానే ఛేక్షు దీశాడు. పనిచేస్తుండేటప్పుడు ఈల వేస్తూ ఏదో ఒక చక్కని విషాద రాగాన్ని ఆలాపించేవాడు.

"హొహోల్‌ను మన ఇంట్లోనే ఉంచుకుందాం, అది మీకిద్దరకూ మంచిదే. మీరిద్దరూ అటూ ఇటూ తిరగక్కర్లేదు" అని తల్లి ఒకనాడు కొడుకుతో చెప్పింది.

పావెల్ భుజాలెగరేసి:

"ఎందుకమ్మా ఇంకా కష్టాన్ని నెత్తికెత్తుకుంటావ్?" అన్నాడు.

"తెలివితక్కువ మాట! నా జీవితమంతా నా ప్రమేయం లేకుండానే కష్టభరితమైంది. అలాంటి మంచివాడికోసం కొంచెం కష్టమెక్కువైతే ఫరవాలేదు" అంది తల్లి.

"నీ యిష్టమమ్మా! అతడొస్తే నాకు సంతోషమే" అన్నాడు కొడుకు.

హొహోల్ వాళ్ల ఇంట్లోకే మకాం మార్చాడు.

## 8

పేట చివరనున్న పావెల్ చిన్న యింటిపైన జనం దృష్టి పడింది. డజన్ల కొద్దీ అనుమానాస్పదమైన చూపులు ఆ ఇంటి గోడలను గుచ్చుకొంటున్నాయి. రకరకాల పుకార్లు బయలుదేరాయి. గట్టువారనున్న ఆ ఇంటి రహస్యాన్ని దేన్నో భయపెట్టి బయటికి లాగడా నికి వాళ్లు ప్రయత్నించేవారు. రాత్రిళ్లు జనం కిటికీలోనుంచి తొంగిచూస్తుండేవాళ్లు. అప్పుడప్పుడు కిటికీ అద్దాలను తట్టుతూ ఉండేవారు. ఏమిటని చూడపోతే భయపడి కాళ్లకి బుద్ధి చెప్పేవారు.

ఒక రోజున వ్లాసావాను సారాదుకాణదారు బెగున్‌త్సోవ్ వీధిలో నిలబెట్టాడు. ముసలాడు చూడ్డానికి చక్కగా వుంటాడు. ఎప్పుడూ నీలిరంగు ముహమల్ వేస్ట్ కోటుధరి తొడుక్కుని, మెత్తగా బుసబుసలాడుతూన్న ఎర్రటి మెడకొక వన్లని సిల్కురుమాలును చుట్టు కునేవాడు. మెరిసే కూచి ముక్కుమీద తాబేలు చిప్పతో ఫ్రేముకట్టిన కళ్లద్దాలుండేవి. అందుచేత అతన్నందరూ "ఎముకల కళ్లు" అని పిలిచేవారు.

గుక్క తిప్పుకోకుండా, జవాబుకోసం ఆగకుండా, వడగళ్ల వానలా వ్లాసావామీద మాటలు కురిపించాడు:

"పెలగేయా నీలొవ్నా! బాగున్నారా? మీ అబ్బాయి ఎలా ఉన్నాడు? పెళ్లి చేసుకునే ఆలోచనలో లేడా? నాకు చూడగా, పెళ్లి ఈడొచ్చినట్లు కనబడుతోంది. కొడుకులకెంత త్వరగా పెళ్లి చేస్తే తల్లిదండ్రుల కంత మంచిది. సంసారం ఉంటే మనిషికి శరీరమూ ఆత్మా కూడా బాగుంటాయి. జాడీలో ఊరగాయలా భద్రంగా. నేనే నీ స్థితిలో ఉంటే, పెళ్లి చేసేసేవాడినే. కాలాన్నిబట్టి, మనిషి నడవడి ఎలా ఉందో బాగా కనిపెట్టి చూస్తుండాలి.

జనం ఎవళ్లిష్టమొచ్చినట్లు వాళ్లు నడుచుకోవడం మొదలెట్టేరు. బొత్తిగా తలా తోకా లేకుండా ఆలోచించడం, పనిచేయడం జరుగుతోంది. ప్రభునివాసమైన చర్చికెళ్లడం మాను కుంటున్నారు. నలుగురూ కూడే జాగాలకు కూడా దూరంగా ఉంటున్నారు. ఏవో చీకటి మూలల్లో చేరి గుట్టుగా గుసగుసలాడుకుంటున్నారు. గుసగుసలెందుకంటాను? జనానికి దూరంగా ఉండడమెందుకు? బహిరంగంగా — సారాదుకాణంలో మాట్లాడుకోకూడనంతటి విషయాలేమున్నాయంటాను! రహస్యాలా? రహస్యాలకు స్థానం చర్చి ఒక్కటే. మూల మూలల్లోనుంచి వినబడే గుసగుసలు మనసులోని కలతకు చిహ్నం. పెలగేయా నీలొవ్నా! మీ ఆరోగ్యం బాగుండుగాక.''

వీడ్కోలు సూచకంగా టోపీ తీసి దాన్ని డాబుగా గాలిలో ఊపి అతడు వెళ్లిపోయాడు. తల్లి తబ్బిబ్బయిపోయింది.

మరోసారి వ్లాసొవ్‌ల పొరుగింటామె, ఫ్యాక్టరీ గేటు దగ్గర తినుబండారాలమ్ముకుని పొట్టపోసుకునే మార్యా కోర్‌సునొవా అనే కమ్మరి విధవరాలు తల్లిని బజారులో కలుసుకుని, ''పెలగేయా! నీ కొడుకు నొక కంటితో కనిపెట్టు'' అంది.

''ఏమిటి నీ ఉద్దేశం?'' అని తల్లి అడిగింది.

''మా తల్లీ! చెడ్డ పుకార్లు పుడుతున్నాయి. మీవాడేదో రహస్య సంఘాన్ని ఏర్పాటు చేస్తున్నాడంటున్నారు. ఫ్లాగెల్లాంట్ల కూటమి లాంటిది.... వాళ్లలాగే ఒకళ్ల నొకళ్లు కొరడాలతో కొట్టుకుంటారుట'' అని నెమ్మదిగా చెప్పింది మార్యా.

''ఉట్టి చెత్త! బుద్ధితక్కువ మాట, మార్యా.''

''నిప్పు లేకుండా పొగరాదు'' అంది మార్యా.

ఈ సంభాషణలను తల్లి పావెల్‌తో చెప్పుతూ ఉండేది. అతడు భుజాలెగరేసి ఊరుకునే వాడు. మృదువుగా పైకి నవ్వేసేవాడు హొహోల్.

''ఆడపిల్లలకు కూడా అనకారం చేస్తున్నారు. మీరు చక్కని యువకులు. ఏ అమ్మాయికైనా తగినవాళ్లే. కష్టపడి పనిచేస్తారు. తాగుబోతులు కారు. వాళ్ల జోలి మీరు బొత్తిగా పట్టించుకోరు. పట్నంనుంచి, చెడ్డవాళ్లైన అమ్మాయిలు మీ దగ్గర కొస్తుంటారని అంటున్నారు.''

''పొనిద్దూ.... అయితే'' అని పావెల్ విసుక్కున్నాడు.

''బురద గుంటలో అంతా మురికి కంపే కొడుతుంది.... మామ్మా! పెళ్లి చేసుకుని మొగుడితో కాపురం చేయడమంటే ఏమిటో కాస్త వాళ్లకు చెప్పకపోయారూ! అప్పుడు మెడలు విరగ్గొట్టించుకునేందుకు వాళ్లంత తొందర పడరు'' అన్నాడు హొహోల్.

''అయ్యో నాయనా! వాళ్లు బాధలన్నీ చూస్తూనే ఉన్నారు, అన్నిటినీ అర్థంచేసుకుంటూనే ఉన్నారు. కాని వాళ్లు మాత్రం ఏం చేయగలరు చెప్పు?'' అంది తల్లి.

''అదేమిటో తెలుసుకుంటే, మరొక పని చేసుకుంటారు'' అన్నాడు పావెల్.

తల్లి అతని ముఖంకేసి చూసి:

''వాళ్ల కెందుకు తెలియచెప్పకూడదు? వాళ్లలో కాస్తంత చురుకైన వాళ్లనిక్కడకు పిలవండి'' అంది.

''అదేమీ కుదరదు'' అన్నాడు పావెల్.

''పోనీ ప్రయత్నం చేస్తే పోయేదేముంది?'' అని హొహోల్ ప్రశ్నించాడు.

పావెల్ ఒక్క నిముషం మౌనం వహించి జవాబిచ్చాడు:

''ఏముంది? జంటజంటలుగా పోవడం మొదలెడతారు. కొందరు పెళ్లిళ్లు చేసుకుంటారు. అంతే, దానితో సరి!''

తల్లి ఆలోచనలో పడింది. పావెల్ వైరాగ్యతీవ్రత ఆమెకు చాలా చికాకు కలిగించింది. పావెల్ వలెనే అతనికన్న పెద్దవాడైన హొహోల్‌వంటి వాళ్లతో సహా అందరూ పాటిస్తున్నారని ఆమె గుర్తించింది. కాని వాళ్లంతా అతన్ని చూచి భయపడుతున్నారే కాని అతని తీవ్రత మూలంగా ఎవరూ పావెల్‌ను ప్రేమించడం లేదని ఆమెకు తోచింది.

ఒక రోజు రాత్రి తల్లి తన పక్కమీద పడుకునుండగా ఆమె కొడుకూ, హొహోల్ ఇద్దరూ పక్క గదిలో చదువుకుంటున్నారు. వాళ్లు నెమ్మదిగా మాట్లాడుకునే మాటలు పలచని తడికెగుండా ఆమె చెవుల్లో పడ్డాయి.

''ఆ నతాషా నాకు నచ్చింది'' అని చటుక్కున అన్నాడు హొహోల్.

''నాకు తెలుసు సంగతి!'' అన్నాడు పావెల్.

హొహోల్ నెమ్మదిగా లేచి చెప్పులు తొడుక్కోకుండానే గదిలో పచారు చేయడం మొదలెట్టేడు. మెల్లగా ఒంటరిగా కాస్సేపు ఈల వేసుకున్నాడు. తర్వాత లోగొంతులో మళ్లీ మాట్లాడడం మొదలెట్టాడు.

''ఆమెకేమైనా తెలిసిందంటావా?''

పావెల్ జవాబుచెప్పలేదు.

''నీ అభిప్రాయమేమిటి?'' అని హొహోల్ మళ్లీ అతి నెమ్మదిగా అడిగేడు.

''ఆమె తెలుసుకుంది.... అందుకే ఇక్కడికి రావడం మానేసింది'' అని పావెల్ జవాబిచ్చాడు.

హొహోల్ మళ్లీ గదిలో పచారు చేశాడు. అతని ఈల పాట గదిలో ధ్వనించింది.

''పోనీ నేనామెకు చెప్తే!'' అని హొహోల్ అడిగేడు.

''ఏమని?''

'' 'నేను... నిన్ను...' '' అని హొహోల్ మెల్లగా ప్రారంభించాడు.

''నువ్వు చెప్పడ మెందుకు?'' అని పావెల్ మాట కడ్డొచ్చేడు.

హొహోల్ పచారు అపుచేసినట్లు తల్లికి వినబడింది. అతడు మెల్లగా నవ్వుతున్నట్లు వినిపించింది.

"నీవు ఒక పిల్లని ప్రేమిస్తే, ఆ సంగతి ఆమెతో చెప్పాలి. చెప్పకపోతే ఏమవుతుంది?"

పావెల్ చేతిలో ఉన్న పుస్తకాన్ని చటుక్కున మూసేశాడు.

"ఏమవాలని నీ కోరిక?" అని అడిగేడు.

ఇద్దరూ చాల సేపు మౌనం వహించారు.

"అయితే, మరేం చెయ్యాలంటావ్?" అని హొహోల్ మళ్లీ అడిగేడు.

పావెల్ నెమ్మదిగా అందుకున్నాడు.

"అన్‌ద్రేయ్, నీకేమి కావాలో దాన్ని గురించి నీకు స్పష్టమైన అభిప్రాయముండాలి. ఆమె నిన్ను ప్రేమించిందే అనుకో — ఆ విషయం నాకు సందేహమే — అయినా మాటవరుసకు ప్రేమించిందనే అనుకుందాం — మీరు పెళ్లి చేసుకుంటారు. చాలా మంచి సంబంధం! ఆమె మేధావి, నువ్వు కార్మికుడవు. పిల్లలు పుట్టుకొస్తారు. వాళ్లను పోషించడానికి రాత్రింబగళ్లు నువ్వు చాకిరీ చేయాలి. తిండికోసం, పిల్లల పోషణకోసం, ఇంటి అద్దెకోసం, నీ బతుకంతా యాతనలో పడి తాకట్టయిపోతుంది. నువ్వూ, ఆమే కూడా మన ఉద్యమానికి ఎందుకూ పనికిరాకుండా పోతారు."

కొంచెం సేపు ఆగి పావెల్ మళ్లీ మాట్లాడ్డం మొదలెట్టాడు. ఈ సారి అతని మాట కొంచెం సరళంగా వచ్చింది.

"అన్‌ద్రేయ్! ఆ ప్రయత్నం విరమించుకో. ఆమెకేమీ కష్టం తెచ్చి పెట్టకు."

నిశ్శబ్దం. గడియారం టిక్కుటిక్కుమంటూ సెకండ్లను కొట్టింది.

"నా హృదయంలో సగభాగం ప్రేమిస్తోంది. సగభాగం ద్వేషిస్తోంది. దీన్ని ఒక హృదయమేనంటావా?" అన్నాడు హొహోల్.

పుస్తకంలోని పేజీలు తిరగవేస్తున్న చప్పుడవుతోంది. పావెల్ చదువుతూనే ఉన్నాడన్నమాట. తల్లి ఊపిరి పీల్చడానికి కూడా సంకోచిస్తూ కళ్లు మూసుకు పడుకుంది. హొహోల్‌మీద ఆమె హృదయమెంతో జాలిపడింది. అయితే తన కొడుకుపట్ల ఇంకా ఎక్కువ జాలిపడింది.

"అయ్యో పాపం! వెర్రిపిల్లాడు" అనుకుంది.

"కనుక నేనామెతో ఏమీ చెప్పకూడదంటావ్?" చటుక్కున హొహోల్ అడిగేడు.

"అవును. ఏమీ చెప్పకూడదు" అన్నాడు పావెల్.

"అయితే, సరే, చెప్పను" అన్నాడు హొహోల్. కొన్ని క్షణాలాగి, "పావెల్! ఇలాటి స్థితిలో పడినప్పుడు నువ్వూ చాలా యిబ్బందిలో పడతావు సుమా!" అన్నాడు.

"ఇప్పుడే ఆ కష్టంలో ఉన్నాను."

బయట గాలి జోరుగా వీసురుతోంది. లోపల గడియారం టిక్‌టిక్‌మంటూ కాలం జారిపోతున్న సంగతిని జ్ఞాపకం చేస్తోంది.

"ఇదంతా ఆషామాషీ వ్యవహారం కాదు" నెమ్మదిగా అన్నాడు హొహోల్.

తల్లి ముఖాన్ని తలగడతో కప్పకుని నిశ్శబ్దంగా ఏడ్చింది.

మరునాడు ఉదయం అన్‌(ద్రేయ్ చాలా చిన్నవాడైపోయినట్లూ, అతడిమీద ఆప్యాయత మరింత పెరిగినట్లూ ఆమె మనసుకు తట్టింది. తన కొడుకు ఎప్పట్లాగునే నిటార్గా సన్నంగా, మౌనంగా కనిపించాడు. ఇంతకుముందు ఆమె హొహోల్ నెప్పుడూ అన్‌(ద్రేయ్ ఒనీసిమొవిచ్ అనే పిలుస్తుండేది. కాని ఈ రోజున అనుకోకుండా:

"అన్‌(ద్యూషా,* మీ బూట్లు మరమ్మత్తు చేయించుకోండి, లేకపోతే పడిశం పడుతుంది" అంది.

అతడు నవ్వుతూ:

"ఈ సారి జీతాల రోజున కొత్త జత కొనుక్కుంటాను" అని జవాబిచ్చాడు. తర్వాత తన పొడుగాటి చేతి నామె భుజంమీద వేసి "నిజానికి మీరే నా కన్న తల్లేమో? కాని నా రూపంవల్ల మీరా సంగతి నంగీకరించడం లేదనుకుంటాను. అంతేనా?" అన్నాడు.

ఆమె జవాబుచెప్పకుండా అతని చేతిని నిమిరింది. ప్రేమపూరితమైన మాటలు ఎన్నో చెప్పాలనుకుంది. కాని ఆమె హృదయమంతా జాలితో నిండిపోయింది. నోటివెంట మాటరాలేదు.

## 9

సోషలిస్టులు నీలిసిరాతో రాసి పంచిపెడుతున్న కరపత్రాలను గురించి పేటలో మాట్లాడుకోవడం మొదలుపెట్టేరు. ఈ కరపత్రాలు, ఫ్యాక్టరీ పరిపాలకులను ఘాటుగా విమర్శించాయి. పీటర్స్‌బుర్గులోనూ, దక్షిణ రష్యాలోనూ జరిగిన సమ్మెల గురించి చెపుతూ, కార్మికులంతా తమ హక్కుల రక్షణకోసం ఏకంకావాలని ఆ కరపత్రాలు హెచ్చరించాయి.

ఫ్యాక్టరీలో బాగా డబ్బు సంపాదించుకుంటున్న నడివయస్కులు ఈ కరపత్రాలు చూసి చాలా ఆగ్రహావేశ పరవశులయారు.

"తంటాల మారివాళ్లు! ఇలాటి పనులు చేస్తున్నందుకు వాళ్ల వీపులు చిట్లగొట్టాలి!" అంటూ ఆ కరపత్రాలను యజమానులకు అందచేశారు.

యువకులు వాటిని చాలా ఉత్సాహంతో చదువుకున్నారు.

---

* అన్‌(ద్యూష — అన్‌(ద్రేయ్‌కి ముద్దుపేరు. — సం.

"ఇందులో అంతా నిజమే!" అన్నారు వాళ్ళు.

కార్మికుల్లో ఎక్కువమంది మాత్రం, రోజువారీ చాకిరీతో నలిగిపోయి ఉదాసీనంగా:

"దీనివల్ల ఏం జరుగుతుంది? అసంభవం" అని పెదవి చప్పరించేసేవారు.

కాని మొత్తంమీద ఈ కరపత్రాలు చాలా అలజడి కలిగించాయి. ఒక వారం కొత్త కరపత్రం రాకపోతే, పనివాళ్ళు,

"వాళ్ళు అచ్చెయ్యడం మానేసినట్లుంది" అని ఒకళ్లకొకళ్లు చెప్పుకునేవారు.

మరుసటి సోమవారం కొత్త కరపత్రం రావడంతోనే కార్మికులంతా గుసగుసలాడుకునే వాళ్ళు.

ఫ్యాక్టరీలోనూ, సారాదుకాణంలోనూ కొత్త ముఖాలగుపించేవి. వాళ్ళు నలుగురితోనూ కలసిమెలసి తిరుగుతూ, మనుష్యులను పలకరిస్తూ విషయాలను పసికడుతూ ఉండేవారు. వాళ్ళు అతి జాగ్రత్తగా వ్యవహరిస్తూ ఉండడంచేతా, ప్రతి విషయంలోనూ వారు జోక్యం కలిగించుకోవడంచేతా, వాళ్లపట్ల అనుమానం కలుగుతుండేది.

తన కొడుకు చేస్తున్న పనే ఈ అలజడి కంతకూ కారణమని తల్లి గ్రహించింది. జనం, అతనిపట్ల ఆకర్షితులవుతున్నట్లు ఆమె గుర్తించింది. అందుకామె ఎంత గర్వపడేదో, అంతగా అతని క్షేమం గురించి ఆత్రత పడేది.

ఒక సాయంకాలపు వేళ మార్యా కోర్సునొవా వ్లాసొవ్‌ల ఇంటి కిటికీతలుపు తట్టింది. తల్లి కిటికీతలుపు తెరిచేసరికి ఆమె బిగ్గరగా గొణిగింది:

"పెలగేయా! జాగర్త! ఆటకడుతుంది. ఈరోజు రాత్రి మీ ఇల్లు సోదా చేస్తారు. మాజిన్ ఇల్లు, వెసొవ్‌ష్చికోవ్ ఇల్లు కూడా."

ఆమె బండ పెదవులు గబగబ కొట్టుకున్నాయి. మాంసపు కండలా వున్న ముక్కుతో ఆమె గాలి ఎగబీల్చింది, ఆమె ఇటూ అటూ అనుమానంగా చూసింది. వీధిలో ఉన్న మనిషి నెవరినో ఆమె కనిపెట్టి చూస్తోంది.

"ఏమమ్మోయ్! నాకేం తెలియదు. నేను నీకేమీ చెప్పలేదు. అసలు నిన్ను చూడనేలేదు. వింటున్నావా?" అంటూ చక్కాపోయింది.

తల్లి కిటికీతలుపు వేసుకుని నెమ్మదిగా కుర్చీలో కూలబడింది. తన కొడుక్కి ఏదో ముప్పు రాబోతోందనే సంగతి గమనానికొచ్చేసరికి చటుక్కున లేచి నిలబడింది. గబగబా బట్టలేసుకుని, తలకు శాలువ కప్పుకుని తిన్నగా ఫ్యోదొర్ మాజిన్ ఇంటికి పరుగెత్తింది. అతడు సుస్తీగా ఉండడంచేత ఫ్యాక్టరీ కెళ్లలేదు. ఆమె అతనింట్లోకి వెళ్లేసరికి అతడు కిటికీపక్కన కూర్చుని ఓ పుస్తకం చదువుకుంటూ, బిరబిగిసిపోయిన బొటన వ్రేలిని మర్దన చేసుకుంటున్నాడు. ఈ వార్త వినడంతోనే అతను తెల్లబోయి గభాలున గంతేశాడు.

"సరి సరి బాగుంది!" అని గొణుక్కున్నాడు.

వణుకుతున్న చేత్తో నుదుటిమీది చెమట తుడుచుకుంటూ:

"ఏం చేద్దాం?" అడిగింది తల్లి.

"ఒక నిముషం ఆగండి. కంగారు పడకండి" అని బాగా ఉన్న చేత్తో ఉంగరాల జుట్టును వెనక్కు తోసుకుంటూ జవాబుచెప్పేడు.

"ఏమిటి? మీరే కంగారు పడుతున్నారే!" అంది ఆమె.

అతడు కొంచెం సిగ్గుపడుతూ, చిరునవ్వు నవ్వేడు.

"నేనా?... హుం.... పాడు వ్యవహారం.... ఇదంతా పావెల్‌కు తెలియచేయాలి. నేను ఎవరినో పంపిస్తాను. మీరు ఇంటికెళ్లండి. దిగులుపడకండి. వాళ్లు మనల్నేమీ కొట్టరు కదా? కొడతారంటారా?" అన్నాడు.

ఆమె ఇంటికెళ్లి పుస్తకాలన్నీ పోగుచేసి వాటిని గుండెలకి హత్తుకుని ఇల్లంతా తిరిగింది. పొయ్యిమీద, పొయ్యికింద, నీళ్ల తొట్టెలో అన్నిచోట్లా పరీక్షగా చూసింది. పావెల్ ఫ్యాక్టరీ నుంచి పరుగెత్తు కొస్తాడనుకుంది. కాని అతడు రాలేదు. చివరకు అలసిపోయి, వంటింట్లో కెళ్లి బెంచీమీద పుస్తకాలెట్టి వాటిమీద కూచుంది. కదలడానికి భయపడి, పావెల్, హొహోల్ వచ్చేవరకూ ఆమె అలాగే కూచుండిపోయింది. వాళ్లు రావడంతోనే లేవకుండానే,

"విన్నారా?" అని అడిగింది.

"ఆ, విన్నాం — నీకు భయమేస్తోందా?" చిరునవ్వుతో పావెల్ అడిగేడు.

"చాలా...."

"భయపడవద్దు, భయపడినందువల్ల ఏమీ లాభంలేదు" అన్నాడు హొహోల్.

"సమొవార్ కూడా రాజబెట్టినట్టు లేదే!" అన్నాడు పావెల్.

"ఇదిగో! నీటి మూలాన...." అని లేచి పుస్తకాలను చూపెట్టింది.

ఆమె కొడుకూ, హొహోల్ ఫక్కున నవ్వేరు. దానితో ఆమె మనసు కొంచెం కుదుట బడింది. ఆ పుస్తకాల్లోంచి పావెల్ కొన్నిటిని ఏరేడు. వాటిని దాచేయడానికి బయటికి పట్టుకుపోయాడు. సమొవార్ అంటిస్తూ హొహోల్ చెప్పడం మొదలెట్టేడు:

"మామ్మా! ఇందులో భయపడడానికేమీ లేదమ్మా! ఇలాంటి తెలివితక్కువ పనులతో కాలహరణం చేయడం వాళ్లకే సిగ్గుచేటు. చేయెత్తు మనుష్యులు, నడుముమీద ఖడ్గాలు వ్రేలాడేసుకుని, స్పర్స్ ఉన్న బూట్లు తొడుక్కుని ఉంటారు. వాళ్లిక్కడ కొచ్చి సామాను లన్నీ కిందామీదా చేసేస్తారు. మంచాలకింద పొయ్యికింద సోదా చేస్తారు. నేల కొట్టులో దూరతారు. అటకలెక్కుతారు. ముఖంనిండా సాలె గూళ్లంటుకుంటాయి. విసుగుచెంది బుసలు కొడతారు. సిగ్గుతో చిరచిరలాడతారు. అంచేత చాలా భయంకరంగా కనబడేట్లు, కోపంగా ఉన్నట్లు నటిస్తారు. వాళ్లు చేసే పనిలో ఉండే పశుత్వం వాళ్లకీ తెలుసు. ఒకసారి నా వస్తువులన్నీ చిందరవందర చేయడానికి సిగ్గుపడిపోయి, ముట్టుకోకుండానే వెళ్లిపోయారు.

ఖకోసారి నన్ను వాళ్లు వెంట తీసుకుపోయారు. జైల్లో పడేసి నాలుగు నెలలుంచేశారు. జైల్లో పనిపాటలేమీ చేయక్కర్లేదు. అలా కాచుకు కూచోడమే. నీకు సమను రావడంతోనే సిపాయిలు వీధుల్లో నడిపించి తీసుకుపోతారు. అక్కడొక పెద్ద అధికారి నిన్ను ప్రశ్నలు వేస్తాడు. ఆ అధికారులేమంత ఎక్కువ తెలివైనవాళ్లు కారు. వాళ్లు చాలా పిచ్చిపిచ్చి ప్రేలా పాలు చేస్తారు. తర్వాత మళ్లీ జైలుకు తీసుకుపొమ్మని సిపాయిలకు ఉత్తరువు జారీ చేస్తారు. అలా వెనక్కూ ముందుకూ ఊగిసలాడిస్తారు. ఇంతకూ వాళ్లు జీతాలు పుచ్చుకుంటున్నందుకు ఏదో ఒక పని చేయాలి కదా! చివరకు కొంత కాలానికి నిన్ను వదిలేస్తారు. దీని తతంగమంతా ఇంతే!''

''అన్ద్ర్యూషా! ఏమి చిత్రంగా మాట్లాడుతావు!'' అని తల్లి ఆశ్చర్యం వెలిబుచ్చింది.

సమొవార్‌ని ఊది ఆర్పేయడానికి నేలమీదకు వంచిన ఎర్రని ముఖాన్ని అతడు పైకెత్తి, మీసాలు కిందకు దువ్వుకుని,

''ఏమిటి చిత్రం?'' అని అడిగేడు.

''నీకెప్పుడూ ఎవరూ ఏ బాధా కలిగించనట్టు మాట్లాడుతున్నావే?''

హొహోల్ చిరునవ్వుతో లేచి తల పంకిస్తూ ఇలా చెప్పేడు:

''భూమిమీద ఏ బాధా పొందని ఆత్మ అంటూ ఉన్నదా? వాళ్లు నన్ను యింత అని చెప్పలేనంతగా బాధించారు. జనం అలాటివాళ్లు కనుక నువ్వు చేసేదేముంది? దాన్ని గురించి తలుచుకుంటుంటే, నువ్వు చేసే పనికి అడ్డొస్తుంది. నీవు అనుభవించిన బాధల గురించీ, నీకు తగిలిన గాయాలను గురించీ, ఆలోచించుకుంటూ ఉండడం వృధా ప్రయాస. జీవిత మంతే! జనంమీద నాకు చాలా కోపమొచ్చేది. కాని అందువల్ల ఉపయోగం లేదని తెలుసు కున్నాను. ప్రతివాడూ, తన పొరుగువాడు తనను కొడతాడేమోనని భయపడుతుంటాడు. కనుక తనే ముందుగా అతని ముక్కు పట్టుకోవాలని చూస్తుంటాడు. మామ్మా! జీవితం అలాగే సాగిపోతోంది.''

అతని మాటలు మెల్లని ప్రవాహంలా సాగేయి. రాబోయే సోదాను గురించిన ఆమె భయ మంతా పటాపంచలైపోయింది. అతని విశాల నేత్రాలు చిరునవ్వును వికసింపచేశాయి. మని షెంత వికారంగా ఉన్నా, అతనిలో ఉండే చలాకీ నామె కనిపెట్టింది.

తల్లి నిట్టూర్పు విడిచింది.

''అన్ద్ర్యూషా! దేవుడు నిన్ను చల్లగా చూడాలి!'' అని ఉత్సాహంగా అంది.

హొహోల్ సమొవార్ దగ్గరకెళ్లి మళ్లీ దాని కెదురుగా చతికిలబడ్డాడు,

''నాకు కొంచెం సుఖాన్నిచ్చేవారుంటే, నేను ఒద్దనను. కాని దానికోసం నేనెవ్వరినీ దేవురించను.''

పావెల్ బయటనుంచి లోపలి కొచ్చాడు.

''వాళ్లకింక కనబడవు'' అని ధీమాగా చెపుతూ చేతులు కడుక్కున్నాడు. చేతులు తుడుచుకుంటూ తల్లికేసి తిరిగి చెప్పాడు:

''నువ్వు భయపడినట్లు కనుపించావా, ఈ ఇంట్లో ఏదో వున్నది కనుకనే ఆమె ఇల్లా హడలిపోతోందనుకుంటారు. మేమేమీ తప్పవని చేయడం లేదని నువ్వు ఎరుగుదువు. న్యాయం మన వైపే ఉంది. జీవితకాలమంతా దానికోసం కృషిచేస్తాం. మా తప్పు అదొక్కటే. కనుక మన మెందుకు భయపడాలమ్మా?''

''పావెల్! నేను గుండెని నిబ్బరం చేసుకుని కుదుటపడతాను'' అని మాటిచ్చింది. కాని ఉత్తరక్షణంలోనే బావురుమంది. ''త్వరగా వాళ్లొచ్చి ఈ పనేదో పూర్తి చేసేస్తే బాగుండు'' ననుకుంది.

ఆ రాత్రికి వాళ్లు రాలేదు. మర్నాటి ఉదయం పిల్లలు హేళన చేస్తారనుకుని ముందుగా తన్ను గురించి తానే నవ్వుకుంది.

''పట్టి పుణ్యానికే బెదరిపోయాను!'' అంది.

## 10

దాదాపు నెలరోజులైన తర్వాత, పోలీసు లొచ్చారు. నికొలాయ్ వెసొవ్‌శ్చికోవ్ పావెల్‌నూ అన్‌ద్రేయ్‌నీ చూడడాని కొచ్చాడు. వాళ్లు ముగ్గురూ కూచుని తమ పత్రికను గురించి చర్చించుకుంటున్నారు. చాలా పొద్దుపోయింది. దాదాపు అర్ధరాత్రి అయింది. తల్లి మంచంమీద పడుకుంది. మగత నిద్రలో వాళ్లు ఆత్రతతో మాట్లాడుకుంటున్న గుసగుసలు ఆమెకు వినబడుతున్నాయి. అన్‌ద్రేయ్ మునివేళ్లమీద చప్పుడు కాకుండా వెళ్లి వంటయింట్లోంచి తలుపు వేశాడు. కుండ పగిలిన చప్పుడైంది. ఛళ్లున తలుపు తెరుచుకుంది. అన్‌ద్రేయ్ వంటింట్లోకెళ్లి,

''స్పర్స్ చప్పుడవుతున్నాయి!'' అని చెవిలో ఊదేడు.

తల్లి పక్కమీదనుంచి గభాలున లేచి, వణుకుతున్న చేతుల్తో బట్టలు తీసుకుంది. పావెల్ గుమ్మందగ్గరకెళ్లి తాపీగా,

''పడుకో, నీ వంట్లో బాగా లేదు'' అన్నాడు.

బయట గలగల శబ్దం వినబడుతోంది. పావెల్ గుమ్మందగ్గరకెళ్లి చప్పున తలుపు తెరచి:

''ఎవరు వారు?'' అన్నాడు.

వెలవెలలాడే ఒక పొడుగాటి వ్యక్తీ, అతని వెంట మరొక వ్యక్తీ ప్రత్యక్షమయారు. ఇద్దరు పోలీసులు పావెల్‌ను వెనక్కి నెట్టి ఇరు పక్కలా నిలబడ్డారు.

''మీరు ఎదురుచూస్తున్న వాళ్లం కామేమోకదూ!'' అని ఒకడు హేళనగా పలకరించాడు.

అతడు పొడుగ్గా సన్నంగా పలచని నల్లమీసంగల ఆఫీసరు. ఫెద్యాకిన్ అనే స్థానిక పోలీసు జవాన్ తల్లి పడక దగ్గరకెళ్లి,

''ఆమె అతని తల్లి దేవరా! ఇతనేనండి కథానాయకుడు'' అని ఎడమ చేత్తో టోపీ సర్దుకుని కుడి చేత్తో పావెల్‌ను చూపించాడు.

''పావెల్ వ్లాసొవ్?'' అంటూ ఆఫీసరు కళ్లు చిట్లించాడు.

పావెల్ తలూపేడు.

''నీ ఇల్లు సోదా చెయ్యాలి'' అన్నాడు ఆఫీసరు మీసం మెలేసుకుంటూ. ''లేవమ్మా! లే. ఎవరు వారు?'' అంటూ రెండో గదిలో కెళ్లేడు.

''మీ పేర్లేమిటి?'' అని అడిగేడు.

ఇద్దరు సాక్షులు లోపలికి వచ్చారు. ఒకడు ఫ్యాక్టరీలో పాతపని చేసే త్వెర్యకోవ్ అనే ముసలాడు. రెండోవాడు నల్లగా లావుగా ఉండే ఫైర్‌మన్ రీబిన్. అతడు, త్వెర్యకోవ్ ఇంట్లోనే ఒక గది అద్దెకు పుచ్చుకుని ఉంటున్నాడు.

''నమస్తే, నీలొవ్నా!'' అని అతడు మోటుగా బొంగురు గొంతుకతో తల్లిని పలకరించాడు.

ఆమె గుడ్డలు వేసుకుంటూ, ధైర్యం చిక్కబట్టుకునేందుకు తనలో తానే గొణుక్కుంది.

''ఇలాంటి విడ్డూరమెప్పుడూ వినలేదే! ఇలా అర్ధరాత్రి వేళ రావడం! మనుషులు నిద్రపోతుంటే జొరబడ్డమేమిటి?''

గదంతా జన సమ్మర్దమైంది. ఏ కారణంచేతనో గాని బూట్‌పాలిష్ వాసన గదంతా ఆవరించింది. స్థానిక పోలీసు అధికారి, ఇద్దరు పోలీసులు గబగబా బీరువాల్లోంచి పుస్తకాలను లాగేసి ఆఫీసరు ఎదురుగా కుప్పగా పారేశారు. ఇద్దరు పిడికిళ్లతో గోడలమీద గుద్ది చూశారు. కుర్చీలకింద దూరి చూశారు. ఒకడు పొయ్యిమీది కెగబాకి కూడా చూశాడు. హొహోల్, వెసొవ్‌శ్చికోవ్ లిద్దరూ ఒక మూల పక్కపక్కనే నిలబడున్నారు. నికొలాయ్ స్ఫోటకం మచ్చల ముఖం కందగడ్డలా ఎర్ర బారింది. తన దృష్టిని అతను ఆఫీసరుమీద నుంచి తప్పించలేదు. హొహోల్ మీసం మెలేసుకుంటూ నిలబడ్డాడు. తల్లి గదిలోకి రావడంతోనే చిన్ననవ్వు నవ్వి, ఆమెకు ధైర్యం కలిగించడానికి తలూపాడు.

భయం పోగొట్టుకునేందుకు, మామూలుగా పక్క కొదిగి నడవడానికి బదులు, అమ్మ రొమ్ములు విరుచుకుని తిన్నగా నడచి వచ్చింది. ఆ నడక తమాషాగా హుందాగా కనబడింది. అడుగులు చప్పుడు చేసుకుంటూ నడిచింది. కనుబొమలు మాత్రం చిట్లించే ఉన్నాయి....

తెల్లని సన్నని వ్రేళ్లతో ఆఫీసరు గబగబా పుస్తకాలనందుకుని, పేజీలు తిరగేసి చలాకీగా పుస్తకాలను పక్కకు గిరాటేస్తున్నాడు. కొన్ని పుస్తకాలు కింద పడిపోయాయి. ఎవ్వరూ నోరెత్తడం లేదు. పోలీసు జవానులు చెమటలు కక్కుతూ ఆయాసపడుతున్నారు. స్పర్స్ చప్పుడు చేస్తున్నారు. మధ్యమధ్య,

"అక్కడ చూశారా?" అంటున్నారు.

తల్లి, పావెల్‌లాగే చేతులు కట్టుకుని, అతని పక్కనే గోడకానుకుని నిలబడింది. ఆఫీసరును తదేక దృష్టితో చూసింది. మోకాళ్లు పీకేయి. కళ్లు పొరలు కమ్మాయి.

"పుస్తకాలనల్లా కింద పారెయ్యాలా?" అని నికొలాయ్ కఠినంగా అడిగేడు. దాంతో విశృంఖలత తొలగిపోయింది.

తల్లి ఉలికిపడింది. త్వెర్యకోవ్ తల ఎవరో తోసినట్లు అదిరి పడింది. రీబిన్ గురగురలాడుతూ నికొలాయ్‌కేసి తేరిపార చూశాడు.

ఆఫీసరు కళ్లు చిట్లించి, మొద్దుగా ఉండే నికొలాయ్ మశూచి మచ్చల ముఖాన్ని వాడిగా చూశాడు. పుస్తకాల పేజీలను మరింత చురుకుగా తిరగేయడం మొదలెట్టేడు. తాను ఏదో భరించరాని నొప్పితో బాధపడుతున్నట్లు చేతగాని నిరసనతో కేకేసేందుకు సిద్ధంగా వున్నట్లు గుడ్లు పెద్దవి చెయ్యసాగాడు.

"ఏయ్! సిపాయ్! ఆ పుస్తకాలు తియ్!" అన్నాడు వెసావ్‌ష్చికోవ్.

పోలీసులందరూ అతడికేసి తీక్షణంగా చూశారు. ఆఫీసరుకేసి కూడా చూశారు. అతడు తలెత్తి నికొలాయ్ విశాల దేహాన్నంతటినీ వాడి చూపు చూశాడు.

"హూం...." అని ముక్కిడిగా దీర్ఘంతీస్తూ "పుస్తకాలు పైనెట్టండి" అన్నాడు ఆఫీసరు.

ఒక పోలీసు జవాన్ వంగి, చిందరవందరగా పడున్న పుస్తకాలను పైన పెట్టడం మొదలెట్టేడు.

"నికొలాయ్ నోరు మూసుకూరుకుంటే బాగుండును" అంది తల్లి పావెల్‌తో.

అతడు భుజాలెగరేశాడు. హొహోల్ తలొంచుకున్నాడు.

"ఈ బైబిల్ ఎవరు చదువుతారు?"

"నేను" అన్నాడు పావెల్.

"ఈ పుస్తకాలన్నీ ఎవరివి?"

"నావి" పావెల్ జవాబిచ్చాడు.

"బాగుంది" అంటూ ఆఫీసరు కుర్చీలో జార్లపడ్డాడు. నున్నితమైన చేతి వేళ్లను మెటికెలు విరుచుకున్నాడు. బల్లకిందకు కాళ్లు జారచాపుకున్నాడు. మీసాలు దువ్వుకుంటూ నికొలాయ్‌తో,

''నువ్వేనా అన్‌ద్రేయ్ నహోద్కా?'' అన్నాడు.

''అవును'' అని నికొలాయ్ ముందు కొచ్చాడు. హోహోల్ అతడిని జబ్బ పట్టుకుని వెనక్కి లాగేడు.

''అతడు కాదు. నేను అన్‌ద్రేయ్....''

ఆఫీసరు చెయ్యి పైకెత్తి చిటికెనవేలు ఝుళిపించాడు.

''జాగ్రత్త! ఏం చేస్తున్నావో తెలుసుకుని మరీ చేస్తూ ఉండు.''

తర్వాత కాగితాలు చూసుకోవడం మొదలెట్టాడు.

కిటికీలోనుంచి చల్లని వెన్నెల లోపల పడుతోంది. బయటనుంచి ఎవరి కాళ్లకిందనో మంచు నలుగుతున్న కరకర శబ్దం మెల్లగా వినబడుతోంది.

''నహోద్కా, హూం! ఇదివరలో రాజకీయ నేరాలకు నువ్వు జైలు శిక్ష ననుభవించావు కదూ?'' అని ఆఫీసరు అడిగేడు.

''ఆ! ఒకసారి రొస్తొవ్‌లోనూ, మరొకసారి సరాతొవ్‌లోనూ.... కాని అక్కడి పోలీసులు మాత్రం నన్ను 'మీరు' అని సంబోధించారు.''

ఆఫీసరు కుడి కన్ను మూసుకుని నలుపుకున్నాడు. చిన్ని పళ్లు ఇకిలిస్తూ అడిగేడు:

''ఫ్యాక్టరీలో రాజద్రోహకరమైన కరపత్రాలను పంచిపెట్టే తుంటరులెవ్వరో మీకు తెలుసా?''

హోహోల్ వెటకారంగా పళ్లికిలించాడు. ముందుకూ వెనక్కూ ఊగి, జవాబుచెప్పడానికి సిద్ధమవుతున్నాడు. ఛటుక్కున నికొలాయ్ మాట ఖంగుమంది.

''తుంటరులను మొదటి సారిగా ఇప్పుడే చూస్తున్నాం.''

నిశ్శబ్దం అలుముకుంది. ఎవళ్లూ మారు మాటాడలేదు.

తల్లి ముఖంమీది మచ్చ వెలవెలబారింది. రీబిన్ నల్ల గెడ్డం చిత్రంగా అదరడం మొదలెట్టింది. వ్రేళ్లతో గెడ్డం దువ్వుకుంటూ అతడు కళ్లు వాల్చాడు.

''ఈ అడ్డగాడిదని అవతలికి తీసుకెళ్లండి'' అని ఆఫీసరు ఆజ్ఞాపించాడు.

ఇద్దరు పోలీసులు నికొలాయ్ జబ్బలు పట్టుకుని బలవంతంగా వంటింట్లోకి ఈడ్చుకుపోయారు. అక్కడ అతడు పాదాలను నేలకు బిగతన్ని వాళ్ల నాపుచేశాడు.

''ఉండండి. నేను కోటు తొడుక్కోవాలి'' అన్నాడు.

పోలీసు అధికారి పెరట్లోంచి లోపలికొచ్చి,

''అంతా గాలించాం. అక్కడేమీ లేదు'' అన్నాడు.

''సహజమే. చాలా అనుభవశాలితో వ్యవహారిస్తున్నాం'' అని ఆఫీసరు వెటకారం చేశాడు.

నెమ్మదిగా, పెడసరంగా ఉండే అతని మాటలు విని, తల్లి పసుపుపచ్చగా వున్న

అతడి ముఖంకేసి భయంగా చూసింది. సామాన్య జనంపట్ల అతడికుండే నిరసనభావాన్ని గమనించి ఇతడెంతో దాక్షిణ్యహీనుడైన శత్రువనుకుంది. ఆమె ఎప్పుడో అరుదుగా గాని అలాటి మనుష్యులను చూచి ఎరగదు. వాళ్ల ఉనికిని అప్పుడే మరచిపోయింది.

"కరపత్రాలవల్ల తబ్బిబ్బైపోయే మనుష్యులు ఇలాటివాళ్లే నన్నమాట!" అని అనుకుంది.

"నహోద్కా అనే పేరు పెట్టుకున్న జారజుడు అన్‌ద్రేయ్ ఒనిసిమొవ్! మీరు అరెస్టులో ఉన్నారు!" అన్నాడు ఆఫీసరు.

"ఎందుకు?" అని తొణుకూ బెణుకూ లేకుండా హొహోల్ అడిగేడు.

"ఆ సంగతి తర్వాత తెలుస్తుంది" అన్నాడు పరమాసహ్యాన్ని కప్పిపుచ్చే తియ్యని గొంతుకతో. పెలగేయా వైపు తిరిగి,

"నీకు చదువొచ్చా?" అని అడిగేడు.

"రాదు" అని పావెల్ జవాబిచ్చాడు.

"నేను నిన్నడగడం లేదు" అని పావెల్‌మీద చిరాకుపడి, "ముసల్దానా! చెప్పు!" అన్నాడు.

ఆ మనిషిమీద కలిగిన అసహ్యంతో ఆమెకు ఒళ్లు తెలియలేదు. మంచునీళ్లలో మునిగినట్టుగా గడగడ వణికింది. కాస్తంత ధైర్యం తెచ్చుకుంది. ముఖంమీద మచ్చ కమిలిపోయినట్టయింది. కోపంతో బొమలు ముడిచి, చేయి చాపి:

"అలా అరవడమెందుకు? అభం శుభం ఎరగని చిన్నవాళ్లు మీరు. కష్టమంటే ఏమిటో ఎరుగరనుకుంటాను" అంది.

"శాంతించమ్మా!" అని పావెల్ ఆమెనాపడానికి ప్రయత్నించాడు.

"నువ్వాగు" అంటూ ఛటుక్కున బల్లదగ్గరకెళ్లి, "ఎందుకు వీళ్లని తీసుకెళ్లడం?" అని గట్టిగా అడిగింది.

"అది నీ పని కాదు! ఊరుకో!" అంటూ ఆఫీసరు లేచాడు. "వెసొవ్‌శ్చికోవ్ కూడా అరెస్టులోనే ఉన్నాడు. అతడిని కూడా తీసుకురండి!" అని ఆజ్ఞాపించాడు.

ముక్కుకు దగ్గరగా పెట్టుకొని ఏదో కాగితాన్ని చదవడం మొదలెట్టేడు.

నికొలాయ్‌ని ఎదుటికి తీసుకొచ్చారు.

ఆఫీసరు చదవడం మానేసి,

"టోపీ తియ్!" అని అరిచాడు.

రీబిన్ పెలగేయా నీలొవ్నా దగ్గరకొచ్చి భుజంతో మెల్లగా నెట్టి,

"కంగారు పడకమ్మా" అన్నాడు.

"నా చేతులు రెండూ పిల్లిద్దరూ పట్టుకుంటే నా టోపీని తియ్యడ మెల్లాగయ్యా?" అని ఆఫీసరు రిపోర్టు చదువుతున్నదాని కన్న గట్టిగా అడిగేడు.

ఆఫీసరు కాగితాన్ని బల్లమీద పడేసి,

"సంతకం చెయ్!" అన్నాడు.

వాళ్ళ సంతకాలు చెయ్యడం చూస్తుంటే ఆమె ఉద్వేగం చల్లారింది. గుండె జారి పోయింది. అవమానంవల్లా విస్సపోయతవల్లా గ్రుడ్లలో నీళ్ళ తిరిగేయి. భర్తతో కాపురం చేసిన ఇరవై ఏళ్లలోనూ ఆమె అనేక సార్లు అలాంటి కన్నీళ్ళ కార్చింది. ఇటీవల ఆ బాధ మరచిపోయింది. ఆఫీసరు ఆమెకేసి నున్నితమ్మైన వెటకారంతో చూచి ఇలా అన్నాడు:

"ఏయ్ ముసలమ్మా! కన్నీళ్ళన్నీ యిప్పుడే కార్చెయ్యకు. ముందుక్కూడా కొంచెం మిగుల్చుకో."

కడుపులోనుంచి మరొక్కసారి కోపం పొంగులా వచ్చింది.

"బిడ్డలను కన్న తల్లికి కన్నీటికి కొరవుండదు. అన్నిటికీ సరిపోయినంతగా ఉంటాయి. మీకు తల్లి అంటూ వుంటే, ఆమెకు తెలుస్తుంది."

ఆఫీసరు కాగితాలను నిగనిగ మెరిసే తాళంగల చేతిసంచిలో గబగబా వేసుకున్నాడు.

"నడవండి!" అని ఆజ్ఞాపించాడు.

"అన్ద్రేయ్ శలవు, నికొలాయ్ శలవు!" అంటూ పావెల్ వెచ్చగా కరచాలనం చేసి సాగనంపాడు.

"బహుశా త్వరలోనే కలుసుకుంటారు లెండి!" ఆఫీసరు చిన్న వెకిలి నవ్వు నవ్వేడు.

వెసొవ్శ్చికోవ్ బరువుగా నిట్టూర్పు విడిచాడు. అతని కంఠంలోకి రక్తం పొంగి ఎర్ర బారింది. కోపంతో కళ్ళ జ్యోతుల్లా వెలిగేయి. హొహోల్ చిన్న నవ్వు నవ్వేసి తలూపుతూ, తల్లి చెవిలో మెల్లగా ఏదో గుసగుసలాడేడు.

"ఎవరిది న్యాయమో భగవంతుడు చూస్తున్నాడు" అంటూ ఆమె అతనిపై శిలువ చిహ్నం గీసింది.

బూడిద రంగు దుస్తుల్లో పోలీసులంతా, స్పర్స్ చప్పుడు చేసుకుంటూ ఇంట్లోంచి బయటికి పోయారు. అందరి కన్న ఆఖరున బయటికెళ్ళినవాడు రీబిన్. వెడుతూ పావెల్ కేసి పంకోచిస్తూ చూశాడు.

"మంచిది. వెళ్ళొస్తా" నని ఆలోచిస్తూ పరామరిక చేసి దగ్గుకుంటూ బయటికి వెళ్ళేడు.

పావెల్ చేతులు వెనక్కు పెట్టుకుని చిందరవందరగా పడున్న కాగితాలనూ గుడ్డలనూ తొక్కుకుంటూ మెల్లగా పచారుచేశాడు.

"చూశావా! వాళ్ళ చేసే తంతు, యిలాగే ఉంటుంది" అన్నాడు విచారంగా.

తల్లి ఆ గత్తరనంతా ఆశ్చర్యంతో చూసింది.

"నికొలాయ్ ఎందుకంత దుడుకుగా వ్యవహరించినట్లో?" అని వ్యసనపడుతూ అడిగింది.

"అతడు బెదరిపోయాడనుకుంటాను" అన్నాడు పావెల్.

"ఇట్టే లోపలికొచ్చారు. అట్టే పట్టుకుని, తీసుకుపోయారు అంతే!" అని చేతులు నలుపుకుంటూ ఆమె గొణుక్కుంది.

తన కొడుకు అరెస్టు కాలేదు కనుక ఆమె గుండె కొంచెం తాపీగా కొట్టుకుంటోంది. కాని తను చూచిన అవంబద్ధతను తలచుకుంటే మాత్రం ఆలోచన స్తంభించిపోయింది.

"ఆ పసుపుపచ్చని ముఖంవాడు మనలను చాలా హేళన చేశాడు. మనలను బెదరగొట్టా లని చూశాడు...."

"పరే అమ్మా! బాగానే ఉంది. రా, మనం ఇదంతా సర్దుదాం" తటాలున పట్టు దలగా అన్నాడు పావెల్.

అమ్మా అని తనను పిలిచాడు. తల్లిమీద ఆప్యాయత కలిగినప్పుడల్లా అతని కంఠస్వరం అలాగే ఉంటుంది. దగ్గరకెళ్లి ఆమె అతడి ముఖంకేసి చూచింది.

"నీ మనసుకేమైనా వాళ్లు బాధ కలిగించారా?" అని మెల్లగా అడిగింది.

"అవును. చాలా కష్టం. మిగిలినవాళ్లతోపాటు నన్ను కూడా తీసుకుపోతే బాగుండేది."

అతని గ్రుడ్లలో నీరు తిరిగినట్లు ఆమె కనుపడింది.

"కొంచెం ఆగు! నిన్నూ తీసుకెడతారులే" అని నిట్టూర్చి అతని కుపశమనం కలి గించాలనుకుంది.

"తీసుకెడతారని నాకు తెలుసు."

ఆమె ఒక్క క్షణం మౌనం వహించింది. చివరకు,

"నువ్వెంత కఠినహృదయుడవైనావురా, పావెల్! అప్పుడప్పుడైనా ఒక చల్లని మాట చెప్పకూడదా! ఆ మాటవేసన్నదే చాలు. నువ్వు మరింత కటువుగా చెప్తున్నావు?"

అతడు ఆమెకేసి చూస్తూ దగ్గర కొచ్చాడు.

"అమ్మా! ఎల్లాగో నాకు తెలియదు, కాని నువ్వు అందుకు సిద్ధం కావాలి."

ఆమె నిట్టూర్పు విడిచింది. మాట తడబడకుండా ప్రయత్నం చేసి కొంచెం సేపాగి అతన్ని అడిగింది:

"జనాన్ని వాళ్లు హింసపెడతారా? ఒళ్లు చీలుస్తారా? ఎముకలు విరగ్గొడతారా? ఆ సంగతి తలుచుకున్నప్పుడల్లా.... అబ్బ.... భయమేస్తుంది."

"వాళ్లు ఆత్మను చీలుస్తారు.... కలుషితమైన వాళ్ల చేతులతో ఆత్మను తాకితే మరీ బాధగా ఉంటుంది...."

మరునాడు బూకిన్, సమోయ్‌లొవ్, సోమొవ్ వగైరా మరి అయిదుగుర్ని కూడా అరెస్టుచేసిన భోగట్టా తెలిసింది. సాయంకాలం ఫ్యోదొర్ మాజిన్ పావెల్ ఇంటికొచ్చి, ఒక్క నిముషముండి వెళ్లాడు. అతని ఇంట్లో కూడా సోదా జరిగింది. అందుకతడెంతో సంతృప్తి పడి వీరుడల్లే ఉన్నాడు.

"నీకేమైనా భయమేసిందా, ఫ్యోదొర్?" అని తల్లి అడిగింది.

అతడు వెలవెలబోయాడు. ముఖ కవళికలు ఉగ్రమయాయి. ముక్కు పుటాలు అదిరేయి.

"ఆఫీసరు నన్ను కొడతాడేమోననుకున్నాను. అతడు దుక్కలా ఉన్నాడు. నల్లని గెడ్డం, వేళ్లనిండా బొచ్చు, గుడ్డివాడిలాగ ముక్కుమీద నల్లకళ్లద్దాలతో ఉన్నాడు. 'బొక్కలో తోస్తాను, మరి ప్రాణాలతో పైకిరావు' అని అతడు నామీద అరిచి కాళ్లు నేలకు తాటించాడు. మా అమ్మగాని నాన్నగాని ఎన్నడూ నా ఒంటిమీద చెయ్యి చేసుకున్న పాపాన పోలేదు. వాళ్లకి నేనొక్కడినే కొడుకును. కనుక నన్నెంతో గారాంతో పెంచారు."

ఒక క్షణం అతడు కళ్లు మూసుకున్నాడు. పెదిమెలు కొరికాడు. గభాలున రెండు చేతుల్తో జుట్టు వెనక్కి దువ్వుకున్నాడు. ఎర్రబారిన కళ్లతో పావెల్‌కేసి చూస్తూ ఇలా అన్నాడు:

"నన్నెవడైనా కొట్టడానికి సాహసిస్తే నేను వాడిమీదికి కత్తిలా ఎగిరి పడతాను. పళ్లతో కొరికేస్తాను. నన్ను ఒకేసారి చంపేస్తే చంపేయనియ్యి!"

"నువ్వు చాలా అర్భకుడివి. ఎలా దెబ్బలాడగలవు?" అన్నది తల్లి.

"ఏమైనా నేను దెబ్బలాడ్డం మానను" అన్నాడు ఫ్యోదొర్.

అతడు వెళ్లిపోవడంతోనే,

"మొదట్లో ఇతడే లొంగిపోతాడు" అంది తల్లి.

పావెల్ జవాబుచెప్పలేదు.

కొన్ని నిముషాల్లో వంటింటి తలుపు మెల్లగా తోసుకుంటూ రీబిన్ లోపలికొచ్చాడు.

"నమస్తే" అని ఒక చిన్ననవ్వు నవ్వేడు. "మళ్లీ వచ్చాను. నిన్న రాత్రి వాళ్లు తీసుకొస్తే వచ్చాను. ఇప్పుడు నా అంతట నేనే వచ్చాను" అంటూ మనసారా పావెల్‌తో కరచాలనం చేశాడు. తల్లి భుజం తట్టాడు.

"ఒక గ్లాసు టీ ఇవ్వండి" అన్నాడు.

అతని విశాలమైన నల్లని ముఖాన్నీ, నల్లటి గడ్డాన్నీ, నల్లని కళ్లనూ జాగ్రత్తగా పరిశీలించాడు పావెల్. నిదానమైన అతని చూపులో ఏదో విశిష్టత ఉంది.

తల్లి సమొవార్ వెలిగించేందుకు వంటింట్లోకెళ్లింది. రీబిన్ బల్లమీద మోచేతులాన్చి కూచుని పావెల్‌కేసి చూశాడు.

"పోతే...." అంటూ మధ్యలో ఆగిపోయిన సంభాషణను మళ్లీ సాగించుతూన్నట్టు అన్నాడు. "నీతో మనము విప్పి కొన్ని విషయాలు మాట్లాడాలి. కొంత కాలంనుంచి నిన్ను కనిపెట్టి చూస్తున్నాను. ఇంచుమించు మీ యింటి పొరుగునే ఉంటున్నాను. మీ యింటికి చాలామంది వస్తూపోతూండడం గుర్తించాను. కాని వాళ్లెవరూ తాగి తందనాలు తొక్కడం లేదు. అది మొదటి విషయం. వాళ్లలో మంచివాళ్లు కూడా ఉన్నట్టు తెలుస్తూనే ఉంది. లోపం ఏమిటబ్బా! అని ఆశ్చర్యపడవలసి వస్తోంది. నా బతుకేదో నేను బతుకుతూ ఉండ డంవల్ల నన్ను చూచినా కొందరికి కన్నెర్రే."

మాటలు బరువుగానే పడుతున్నా, బాగా ఆలోచించి మాట్లాడుతున్నా, వాగ్ధోరణి ధారాళంగా నడిచింది. మాట్లాడేటప్పుడు చామనచాయ చేత్తో గడ్డం సవరించుకుంటూ పావెల్‌కేసి తదేకంగా చూస్తుండేవాడు.

"జనం నిన్ను గురించి చెప్పుకోవడం మొదలెట్టేరు. అన్నట్టు నువ్వు చర్చికెళ్లవుట కదూ? అంచేత నిన్ను మత వ్యతిరేకి వంటున్నారు. ఆ మాటకొస్తే నేనూ వెళ్లను. సరి. ఇక కరపత్రాల సంగతి. అదంతా నీ పనేనా?"

"అవును" అన్నాడు పావెల్.

"అదేమిటి? నువ్వొక్కడివేనా ఏమిటి?" అంటూ తల్లి సర్దుబాటు చేయబోయింది.

పావెల్, రీబిన్ నవ్వుకున్నారు.

"సరే.... బాగుంది" అన్నాడు రీబిన్.

తన మాటను వాళ్లు లక్ష్యపెట్టనందుకు విసుక్కుంటూ తల్లి వెళ్లిపోయింది.

"మంచి ఆలోచనే! ఈ కరపత్రాలున్నాయే యివి జనాన్ని బాగా కుదిపి లేపుతున్నాయి. మొత్తం పంథొమ్మిదే కదూ?"

"అవును."

"అంటే నేనన్నిటినీ చదివేసన్నమాటే. అందులోని కొన్ని సంగతులు అంత స్పష్టంగా లేవు. కొన్ని అనవసరమైనవి వున్నాయి. అయితేనేంలే, ఒక వ్యక్తికి తాను చెప్పవలసిన సంగ తులు చాలా ఉంటే, ఒకటి రెండు విషయాలు అదనంగా చెప్పకుండా ఉండలేడు."

తెల్లటి గట్టి పళ్లు కనిపించేలాగ రీబిన్ చిరునవ్వు నవ్వేడు.

"ఇక సోదా సంగతి. అన్నిటికంటే ముఖ్యంగా దాని తర్వాత మీరు నాకు బాగా నచ్చారు. నువ్వూ, హొహోల్, నికొలాయ్ మీరంతా ఎలాంటివాళ్లో బాగా రుజువు చేసుకున్నారు...."

అతను మాట్లాడడం ఆపేశాడు. కిటికీలోనుంచి చూస్తూ, వేళ్లతో బల్లమీద దరు వేస్తూ, సరియైన మాటలకోసం తడువుకున్నాడు.

"రుజావు చేసుకున్నారు. 'మహాప్రభూ! మీ పని మీరు చేసుకోండి. మా పని మేము చేసుకుంటామ'ని నిక్కచ్చిగా మీ నిశ్చయాన్ని చెప్పేశారు. హోహోల్ కూడా చాలా మంచి కుర్రాడు. అతడు ఫ్యాక్టరీలో మాట్లాడుతూండగా అప్పుడప్పుడు విన్నాను. 'అబ్బ! ఇతని నెవ్వరూ అణగదొక్కలేరు, మృత్యువొక్కటి తప్ప! బలే ఉక్కు పిండం' అనుకున్నాను.... పావెల్! నన్ను నమ్ముతున్నావా?"

"నమ్ముతున్నాను" అన్నాడు పావెల్ తలూపుతూ.

"బాగుంది. నా సంగతి చూడు! — నలభై ఏళ్ళన్నాయి. నీ వయస్సుకు రెట్టింపు. అంటే ప్రపంచాన్ని నీకన్న ఇరవై రెట్లు ఎక్కువ చూశానన్నమాట. మూడేళ్లకు పైగా సైన్యంలో సిపాయిగా ఉన్నాను. రెండు పెళ్ళిళ్ళ చేసుకున్నాను. మొదటి పెళ్లాం చచ్చి పోయింది. రెండో దాన్ని వదిలేశాను. కాకసస్‌కు వెళ్లేను. ఆత్మయోధులు అనే మతశాఖవారిని చూశాను. జీవితాన్ని మార్చడం వాళ్లవల్ల కాదు."

రీబిన్ మెత్తని సారవంతమైన మాటలను తల్లి ఆత్రంగా వింది. నడివయస్సులోవున్న మనిషొచ్చి తన కడుపులో ఉన్న కష్టసుఖాలను తన కొడుకుతో చెప్పుకుంటున్నందుకు చాలా సంతోషించింది. కాని పావెల్ చాలా ఉదాసీనంగా ఉన్నట్లు ఆమెకు తోచింది. ఆ లోపాన్ని ఆమె తన ఆతిథ్యంతో పూరించడానికి యత్నించింది.

"మిహయీల్ ఇవానొవిచ్! తినడానికేమైనా తెమ్మన్నారా?" అని అడిగింది.

"ధన్యవాదాలు, అమ్మా! కాని నాకేమీ వద్దు. నేను భోజనం చేసొచ్చాను. అయితే పావెల్! మన జీవితం సక్రమంగా నడవడం లేదంటావ్ అంతేనా?"

పావెల్ లేచి నిలబడి చేతులు వెనక్కి పెట్టుకుని పచారు చేయడం మొదలెట్టేడు.

"లేకేం సరిగానే నడుస్తోంది. అందుకే మీరు నా దగ్గర కొచ్చి మనసు విప్పి మాట్లాడ్డం జరిగింది. క్రమక్రమంగా మన కార్మికుల సందర్శి ఏకం చేస్తోంది. అందరినీ కూడగట్టే సమయం త్వరలోనే వస్తుంది. ప్రస్తుతం మన బతుకు అన్యాయంగా ఉంది. బహు భారంగా ఉంది. కాని మనం ఇప్పుడు కళ్లు తెరచి చూస్తున్నాం. జీవితంలోని చేదు నిజాన్ని గ్రహిస్తున్నాం. ఈ స్థితిగతులను త్వరగా బాగు చేసుకునేందుకు మార్గాలను చూస్తున్నాం."

"ఔను. సరిగా చెప్పేవు! మనుషుల్లో పూర్తిగా మార్పు రావాలి. ఎవడికైనా పేలు పడితే, వాడివి ఆవిరి స్నానం చేయించి, ఒళ్ళూ తలా బాగా రుద్ది శుభ్రమైన గుడ్డలు కట్టాలి. అప్పుడు వాడు చూడడానికి బాగా కనబడతాడు. అయితే వాడి లోపలి కుళ్ళను శుభ్రంచేయడ మెలాగ? అదీ అసలు సంగతి!" అన్నాడు రీబిన్.

పావెల్ ఫ్యాక్టరీని గురించీ, దాని అధికారులను గురించీ, విదేశాల్లో కార్మికులు తమ

హక్కులకోసం సాగిస్తున్న పోరాటాలను గురించి చాలా ఆవేశంతో మాట్లాడేడు. అప్పుడప్పుడు పావెల్ అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నందుకు సూచనగా:

''అద్గదీ సంగతి!'' అని రీబిన్ బల్లమీద చరిచేవాడు.

ఒకసారి అతడు నవ్వేసి తాపీగా:

''అబ్బే! నువ్వింకా కుర్రాడివి! జనాన్ని గురించి నీకింకా బాగా తెలియదు'' అన్నాడు.

పచారు చేస్తున్న పావెల్ రీబిన్ కెదురుగా నిలబడి కొంచెం తీవ్రంగా:

''పెద్దా చిన్నాతో పనేముంది? ఆ సంగతి వదిలేద్దాం.... ఎవళ్ల భావాలు సరియైనవో చూద్దాం'' అన్నాడు.

''అయితే, దేవుడి విషయంలో కూడా వాళ్లు మనల్ని మోసం చేస్తున్నారంటావ్! అంతేనా? హుం.... నా అభిప్రాయం కూడా మన మతం సరియైనది కాదనే.''

ఇంతవరకూ మాట్లాడ కూరుకున్న తల్లి ఇక ఊరుకోలేకపోయింది. తాను అత్యంత పవిత్రమైన భక్తివిశ్వాసాలతో కొలుస్తున్న దేవుని గురించీ, అతడికి సంబంధించిన విషయాలను గురించీ తన కొడుకు చులకనగా ప్రసంగిస్తున్నప్పుడామె ఉండబట్టలేకపోయేది. అతని దృష్టిని ఆకర్షించేందుకు ప్రయత్నించేది. అలాంటి శూలాల్లాంటి నాస్తిక పదాలతో తన హృదయాన్ని గాయపరచవద్దని మౌనంగా కళ్లతోనే అర్థించేది. అయితే అతని నాస్తికత్వం మరుగున ఏదో గొప్ప విశ్వాసముందని మాత్రం ఆమె గ్రహించింది. ఆ భావమే ఆమెకు వూరట కలిగించేది.

''ఏడి ఆలోచనలు నాకెక్కడ అంతు చిక్కుతాయి?'' అనుకునేది.

తన కొడుకు చెప్పే మాటలు నడివయస్సులో వున్న రీబిన్ మనసుకు కష్టం కలిగిస్తాయని ఆమె అనుకుంది. కాని అతడు నిస్సంకోచంగా పావెల్ నడిగిన ప్రశ్నను వినేసరికి ఇక ఆగలేకపోయింది.

''దేవుణ్ణి గురించి మాట్లాడేటప్పుడు కాస్త జాగ్రత్తగా ఉండండి'' అని దీర్ఘమైన ఊర్పు తీసింది. మరింత ఆవేశంతో ఇలా అంది: ''మీ ఇష్టమొచ్చినట్లు మీరనుకోండి. కాని ప్రభువైన దేవుణ్ణి మీరు నాకు దూరంచేస్తే, నాలాటి ముసలిదానికి కష్టమొచ్చినప్పుడు దిక్కెవరు?''

ఆమె కళ్లలో గిర్రున నీళ్లు తిరిగేయి. గిన్నెలు కడుగుతుంటే వేళ్లు వణికేయి.

''అమ్మా! మమ్మల్ని నువ్వు సరిగా అర్థంచేసుకోలేదమ్మా'' అన్నాడు పావెల్ మృదువుగా.

''మమ్మల్ని మన్నించమ్మా!'' అని రీబిన్ పావెల్‌కేసి చూసి ఒక చిన్న నవ్వు నవ్వేశాడు.

''పులిపిరికాయలు కత్తిరించడానికి నీది తగిన వయసు కాదన్న సంగతి మరచిపోయాను!'' అని మెల్లని స్వరంతో స్పష్టంగా చెప్పేడు.

పావెల్ మళ్లీ అందుకున్నాడు.

"మీరు నమ్మే దయామయుడైన దేవుణ్ణి గురించి కాదమ్మా నేను మాట్లాడుతున్నది! మతగురువులు ఏ దేవుని పేరు చెప్పి మనలను బెదరిస్తుంటారో, ఏ దేవుణ్ణి మనకొక దుడ్డుకర్రలా చూపించి బెదురుపెట్టి, కొద్దిమంది అధికారుల దుర్ణయాలకు మనలను తలొగ్గేటట్లు చేస్తారో ఆ దేవుణ్ణి గురించే చెప్పేను."

"అదీ సంగతి!" అంటూ రీబిన్ బల్ల చరిచి, "వాళ్ళు దొంగ దేవుడిని మనమీద రుద్దేరు! దొరికిన ఆయుధాన్నల్లా చేతుల్లో పుచ్చుకుని మనతో పోరాడుతారు. అమ్మా! ఈ విషయం బాగా ఆలోచించు. దేవుడు మనిషిని తన ఛాయగా సృష్టించాడు. అంటే, మనిషి దేవుడులా ఉంటే, దేవుడు మనిషిలా ఉంటాడన్నమాటే కదూ? మనం దేవుడులా ఉన్నామా? అడవి జంతువులకన్న అధ్వాన్నంగా ఉన్నాం. చర్చిలలో ఒక దిష్టిబొమ్మను మన ఎదుట పెడతారు. అమ్మా! మనం మన దేవుణ్ణి మార్చుకోవాలి. అతడిని పరిశుభ్రం కూడా చేయాలి. వాళ్ళు దేవుణ్ణి అసత్యంతోనూ, దూషణతోనూ చుట్టపెట్టేశారు. మన ఆత్మలను ధ్వంసం చేయడానికి అతడి ముఖాన్ని వికారపరచేశారు."

అతడు మాట్లాడ్డమైతే మృదువుగానే మాట్లాడేడు. కాని అతడు మాట్లాడిన ప్రతి మాటా తల్లికొక సమ్మెట దెబ్బలా తాకింది. నల్లని గెడ్డంతో ఉండే అతని విశాలమైన విషాదముఖం చూడడానికి ఆమె భయపడింది. అతని కళ్ళలోని నల్లని మెరుపును ఆమె భరించలేకపోయింది. భయంతో ఆమె గుండె పీక్కుపోయింది.

"నే వెళ్ళిపోతున్నా, ఇలాంటి సంభాషణను వినడానికి నాకు శక్తి చాలదు" అని తలూపుతూ గభాలున వంటింట్లో కెళ్ళిపోయింది.

"చూశావా పావెల్! ప్రధానమైనది హృదయం. కాని బుద్ధి కాదు. మానవుని ఆత్మలో దానికొక విశిష్ట స్థానముంది. అక్కడ మరొకటి పెరగదు" అన్నాడు రీబిన్.

"వివేచనా బుద్ధి ఒక్కటే మనిషికి విమోచన కలిగిస్తుంది" అని పావెల్ ఖచ్చితంగా చెప్పేడు.

"కేవలం వివేచనా బుద్ధి మానవునికి బలాన్నివ్వదు. అతనికి బలాన్నిచ్చేది హృదయమే, బుద్ధి కాదు" అని బిగ్గరగా రీబిన్ మళ్ళీ వక్కాణించాడు.

తల్లి బట్టలు మార్చుకుని ప్రార్థన చేయకుండానే మంచంమీద పడుకుంది. ఆమెకు మనసు మనసులో లేదు. ఉత్సాహమేమీ లేకుండా పోయింది. ఆదిలో ఆమె రీబిన్ చాలా తెలివైనవాడనుకుంది. ఇప్పుడతనంటే విరోధభావం కలిగింది.

"మతద్రోహి! ఇతరులను రెచ్చగొడుతున్నాడు! అసలతడిక్కడికెందుకు రావాలి?" అని అతని మాటలు వింటున్నప్పుడు ఆమె కనిపించింది.

కాని, అతడు తొణుకూ బెణుకూ లేకుండా గాఢమైన విశ్వాసంతో మాట్లాడుతూనే ఉన్నాడు.

"పవిత్ర స్థలాన్ని ఖాళీగా ఉంచకూడదు. మానవుని హృదయంలో భగవంతుడుండే చోటు అతి మెత్తనైనది. దానిని కోసి పారేస్తే, అక్కడ పెద్ద పుండైపోతుంది. పావెల్, మనమొక కొత్త మతాన్ని లేవ దీయాలి. మానవునికి మిత్రుడైన దేవుడిని సృష్టించాలి. అంతే!"

"క్రీస్తు ఉన్నాడు కదా!" అన్నాడు పావెల్.

"క్రీస్తుకు బలం చాలదు. 'నాకీ కష్టం రానివ్వకు' అన్నాడు. సీజర్‌ని అంగీకరించాడు. భగవంతుడైనవాడు తన సృష్టిమీద మానవమాత్రుని అధికారాన్నెలా అంగీకరిస్తాడు? సర్వశక్తులూ అతడే కదా! ఆయన తన ఆత్మను ఇది దైవ శక్తి, ఇది మానవ శక్తి అని రెండుగా విభజించడు. క్రీస్తు వర్తకానికి వ్యతిరేకి కాడు. వివాహానికీ వ్యతిరేకి కాడు. ఆయన అత్తిచెట్టుకు శాపం పెట్టడం తప్పు. కాయలు కాయకపోవడం అత్తిచెట్టు అపరాధమా? అలాగే, మనిషి హృదయం మంచి సుత్పన్నం చేయకపోతే తప్పు దానిది కాదు. నా ఆత్మలో చెడుగును నేనే నాటేనా?"

రీబిన్, పావెల్ ఈ విషయమై ఒకళ్లను మించి ఒకళ్లు ఆవేశంతో చర్చించుకున్నారు. పావెల్ గదిలో పచారు చేస్తుంటే నేల అదిరిపోయేది. అతడు మాట్లాడినప్పుడల్లా ఏ శబ్దమూ వినబడేది కాదు. రీబిన్ నెమ్మదిగా స్ఫుటంగా మాట్లాడుతుంటే, తల్లి గడియారం టిక్‌టిక్ శబ్దాన్నీ, బయట గోడకు కొట్టుకునే మంచు ధ్వనినీ కూడా వినగలిగేది.

"నా ఫైర్‌మన్ భాషలో చెప్పవలసొస్తే భగవంతుడొక జ్వాల. అతడు హృదయంలో ఉంటాడు. అందులోనుంచి మొదటగా మాట పుట్టింది. ఆ మాటే దేవుడు. అదే ఆత్మ."

"మాటే వివేచనా బుద్ధి" వక్కాణించాడు పావెల్.

"అలాగే అనుకో! అప్పుడు భగవంతుడు హృదయంలోనూ ఉంటాడు. వివేచనా బుద్ధిలోనూ ఉంటాడు. చర్చిలో మాత్రం ఉండడు. చర్చి భగవంతుడి సమాధి."

తల్లి నిద్రపోయింది. రీబిన్ వెళ్లిపోవడం ఆమెకు తెలియదు.

అప్పటినుంచి రీబిన్ ఆ యింటికి తరుచుగా వస్తుండేవాడు. అతడొచ్చినపుడు పావెల్ స్నేహితులెవరైనా ఉంటే, అతడు మాట్లాడకుండా ఒక మూల కూర్చునుండేవాడు. అప్పుడప్పుడు మాత్రం "అదంతే!" అంటుండేవాడు.

ఒకనాడు పావెల్ ఇంట్లో అంతా సమావేశమై ఉండగా, వారందరినీ తన నల్లని కళ్లతో సమీక్షించి చిరచిరలాడుతూ ఇలా చెప్పేడు: "విషయాలను మనం ఇప్పుడు ఉన్నవి వున్నట్లు మాట్లాడుకోవాలి. ముందు ఎలా జరగాలో కాదు. ముందు ఏమి కాబోతుందో ఎవరికి తెలుసు? ప్రజలకు స్వేచ్ఛంటూ లభిస్తే, వాళ్లకేది మంచిదో వాళ్లే నిర్ణయించు కుంటారు. వాళ్లడగకుండానే వాళ్ల బుర్రల్లోకి చాలా సంగతులను కూరేయడం జరిగింది. ఇక వాళ్లంతట వాళ్లే ఆలోచించుకోవలసిన సమయం వచ్చేసింది. ఒకప్పుడు వాళ్లు ఈ

జీవిత విధానాన్నీ, ఈ చదువునూ కూడా త్రోసిరాజంటే అనవచ్చు. చర్చిలోని దేవుడిలాగే ఇవి కూడా వాళ్లకి శత్రువులుగా తోచవచ్చు. పుస్తకాలను వాళ్ల ఎదుట పడెయ్యండి. వాళ్ల సమస్యల్ని వాళ్లే పరిష్కరించుకుంటారు. అదే అసలు సంగతి!''

రీబిన్, పావెల్, ఇద్దరు మాత్రమే ఉన్నప్పుడు వాళ్లు అంతులేకుండా చర్చించుకుంటూ ఉండేవారు. కాని ఎప్పుడూ శాంతాన్ని కోల్పోయే వాళ్లు కారు. తల్లి వాళ్ల మాటలను చాలా ఆసక్తితో వినేది. వాళ్లు మాట్లాడుకునే ప్రతి మాటనీ అవగాహన చేసుకునేందుకు ప్రయత్నించేది. విశాలమైన వక్షస్థలం, నల్లటి గడ్డం కలిగిన రీబిన్, భారీగా బలంగా ఉండే తన కొడుకూ, ఇద్దరూ కూడా గుడ్డివాళ్లయిపోయారనుకునేది ఆమె. ముందుగా ఒకవైపున బయటపడే మార్గం కోసం తడుముళ్లాడేవారు. ఈలోగా దాన్ని వదిలిపెట్టి, మరొక ప్రక్క తడుముతుండేవారు. చేతికి దొరికినదాన్ని గట్టిగా పట్టుకునేవాళ్లు. అంతలో దాన్ని వదిలి నేలమీద గిరాటేసేవాళ్లు. వాటిని పాదాలకింద వడేసి తొక్కేవాళ్లు. మొత్తంమీద విశ్వాసాన్నీ, ఆశనూ వదలకుండా తడుముకుంటూనే ఉండేవాళ్లు.

నిర్మొగమాటమూ, సాహసికమూ అయిన, విభ్రమం కలిగించే మాటలను వినడాన్ని ఆమె ఆ యిద్దరి దగ్గర్నుంచీ నేర్చుకుంది. మొదటి రోజుల్లోలాగ, ఈ మాటలామెను బాధించడం లేదు. వాటిని ఎదుర్కోవడం ఆమె నేర్చుకుంది. భగవంతుడు లేడని వాళ్లు ఒక్కొక్కప్పుడనుకున్న మాటలలోనే, వాళ్లకి భగవంతునియందుండే గాఢవిశ్వాసాన్ని ఆమె కనిపెట్టింది. అలాంటప్పుడు మెల్లగా ఒక నవ్వు నవ్వేది. ఆమెలోని క్షమ అందులో పూర్ణంగా కనబడేది. రీబిన్ అంటే ఆమెకంత ఇష్టం లేకపోయినా, వెనుకటి శత్రుభావం పోయింది.

ప్రతి వారమూ తల్లి జైలు దగ్గరకెళ్లి హోహోల్‌కు పుస్తకాలూ, ఉతికిన బట్టలూ అందిచ్చేది. ఒకసారి ఆమెను అతన్ని చూడనిచ్చారు.

ఇంటి కొచ్చాక:

''అతనేమీ మారలేదు. అందరితో మంచిగా ఉంటున్నాడు. అందరూ అతనితో పరిహాసమాడుతూ ఉంటారు. అతనికి చాలా చాలా కష్టంగానే ఉండవచ్చు. కాని ఆ కష్టాన్ని ఏమాత్రమూ పైకి కనబడనివ్వడం లేదు'' అని ఆప్యాయంగా చెప్పింది తల్లి.

''మనిషంటే అలాగే ఉండాలి. దుఃఖమనేది చర్మం లాంటిది. మనం దానిలోపలే ఉంటాం. అలాటి పైకప్పుకు మనం అలవాటైపోయాం. ఇందులో గర్వించడానికేమీ లేదు. అందరూ కళ్లకు గంతలు కట్టుకోరు. కొందరు కళ్లు మూసుకుంటారు, అంతే. మనం మూర్ఖులమైతే మూలుగుతూ భరించడం తప్ప చేసేదేమీ లేదు'' అని రీబిన్ వ్యాఖ్యానించాడు.

# 12

పేటలోని జనమందరి దృష్టి వ్లాసొవ్‌ల చిన్న ఇంటిమీద పడింది. కొందరా యింటి వ్యవహారాలను అనుమానంతో చూస్తూ వచ్చారు. కొందరు అకారణమైన శత్రుత్వం వహించారు. కొందరు అక్కడేదో మంచి జరుగుతోందనే నమ్మకంతో పరిశీలిస్తూ వచ్చారు. అప్పుడప్పుడు ఎవరో ఒక కొత్త మనిషి పావెల్ దగ్గర కొస్తుండేవాడు. నాలుగు మూలలా అనుమానంతో చూచి ఇలా చెప్పేవాడు:

“నువ్వు పుస్తకాలు చదువుతూ ఉంటావు. చట్టం నీకు తెలుసు. దయచేసి నా విషయంలో కొంచెం సలహా చెప్తావా?...”

ఆ వచ్చిన మనిషి, పోలీసులో, ఫ్యాక్టరీ యజమానులో తనకు చేసిన అన్యాయాన్ని యాకరువు పెట్టేవాడు. కొన్ని చిక్కులున్న సందర్భాల్లో పావెల్, తానెరుగున్న లాయరుకు ఉత్తరమిచ్చి పట్టణానికి అతన్ని పంపేవాడు. వీలైతే తానే స్వయంగా ఆ సంగతిని తెలియ చెప్పేవాడు.

క్రమక్రమంగా జనం శ్రద్ధాసక్తులతోనూ, అచంచల విశ్వాసంతోనూ పనిచేస్తుండే ఈ యువకుని గౌరవించడం మొదలెట్టేరు. అతడు తన చుట్టూ జరుగుతున్న విషయాలను జాగ్రత్తగా గమనించేవాడు. శ్రద్ధగా వినేవాడు. జనంలో అభిప్రాయ భేదాలు ఎప్పుడేర్పడినా వాటిని మొదలంటా పరిశీలించి, ప్రజలనందరినీ ఒక తాటిమీదకి తెచ్చే సూత్రాన్ని కనుగొనేవాడు. అంచేత జనానికి పావెల్ యెడల భక్తి విశ్వాసాలు కుదిరేయి.

ముఖ్యంగా “గుంట కోపెక్కు” సంఘటన జరిగిన తర్వాత పావెల్ పలుకుబడీ, ప్రతిష్ఠ బాగా పెరిగాయి.

ఆ కథ ఇది. ఫ్యాక్టరీకి కొంచెం దూరంగా ఒక గుంట ఉంది. దాని చుట్టూ దేవదారు చెట్లూ భూర్జ వృక్షాలూ బాగా వొత్తుగా ఉన్నాయి. ఇంచుమించు ఫ్యాక్టరీ చుట్టూ ఈ గుంట ఆవరించి కుళ్ళు కంపు కొడుతుండేది. వేసవి కాలంలో నీరు పసరెక్కిపోయి, పచ్చటి పొగ పైకి లేచేది. దానిమీదనుంచి దోమలు మేఘాల్లా పైకి లేచేవి. అందువల్ల పేటంతా జ్వరాలతో బాధపడేవాళ్ళు. ఆ గుంట ఫ్యాక్టరీ వాళ్ళదే. ఆ గుంట నెండగట్టి, దానిలోంచి వంట చెరుకుగా ఉపయోగపడే “పీటు”ను తీసి సొమ్ము చేసుకోడానికి కొత్త డైరెక్టరు ఒక పథకం వేశాడు. ఫ్యాక్టరీ పనివాళ్ళ ఆరోగ్యాన్ని అభివృద్ధిచేయడానికే తానీ పని చేయిస్తున్నాననే మిషతో కూలివాళ్ళ కూలిలోనుంచి గుంట పూడ్చేందుకు రూబుల్‌కొక కోపెక్కు చొప్పున మినహాయించమని ఆజ్ఞాపించాడు.

దానితో కార్మికులకు ఒళ్ళు మండింది. ఈ మినహాయింపు కూలీలకేగాని గుమాస్తాల్లాంటి కలంపోటు జనానికి లేకపోవడంతో వాళ్ళకి మరింత కష్టం తోచింది.

కోపెక్కు మినహాయింపు ఉత్తరువును కొత్త డైరెక్టరు ఫ్యాక్టరీ నోటీసు బోర్డులో పెట్టించిన శనివారం నాడు, ఒంట్లో బాగుండకపోవడంచేత పావెల్ పనిలో కెళ్లలేదు. అంచేత దాని సంగతి అతనికేమీ తెలియలేదు. చాలా కాలంగా ఫ్యాక్టరీలో పాతపని చేస్తుండే సిజోవ్, పొడుగరీ ముక్కోపీ అయిన మెకానిక్ మహోతిన్, ఇద్దరూ మర్నాడు పావెల్ ఇంటికొచ్చారు.

''పెద్దవాళ్లం మేమందరం కలసి ఆలోచించాం. మన మిత్రులంతా నువ్వు సంగతులన్నీ బాగా తెలిసిన తెలివైనవాడవని మమ్మల్ని నీతో ఆలోచన చేయమని పంపించారు. కూలీల కోపెక్కులతో డైరెక్టరు దోమలమీద యుద్ధం చేయడానికి ఏ చట్టమైనా ఉన్నదేమో విన్నడిగి తెలుసుకోమన్నారు'' అని సిజోవ్ విపులంగా చెప్పేడు.

తర్వాత మెరిసే కళ్లతో మహోతిన్ అందుకున్నాడు:

''చూడు! నాలుగేళ్లక్రితం ఈ పీపానులు, స్నానాలగదులు కట్టిస్తామని చెప్పి మా దగ్గర మూడు వేల ఎనిమిది వందల రూబుళ్లు వసూలు చేశారు. ఆ సొమ్మేమైపోయిందో తెలియదు. స్నానాలగదులు నాటికీ నేటికీ కనబడ్డంలేదు!''

ఈ కోపెక్కు మినహాయింపులో ప్రత్యక్షంగా కనబడుతున్న అన్యాయాన్ని పావెల్ విపులంగా తెలియచెప్పేడు. ఇందువల్ల ఫ్యాక్టరీకొచ్చే లాభమేమిటో కూడా స్పష్టీకరించాడు. వచ్చినవాళ్లిద్దరూ కోపంతో ధుమధుమలాడుతూ వెళ్లిపోయారు. తల్లి వాళ్లను బయటదాకా సాగనంపి చిన్నగా నవ్వుకుంటూ వచ్చి:

''పెద్దవాళ్లు కూడా నీ దగ్గర కొచ్చి సలహాచేస్తున్నారే'' అంది.

ఆమెకేమీ జవాబుచెప్పకుండానే, పావెల్ ఏదో రాయడం మొదలెట్టేడు. కొంచెం సేపైనాక,

''అమ్మా! నువ్వొక పని చేసిపెడ్తావా! పట్నానికి వెళ్లి ఈ కాగితాన్ని అందిచ్చి రావాలి.''

''అదేమైనా ప్రమాదకరమైనదా?''

''అవును. మన పత్రికను అచ్చువేసే చోటికి విన్ను పంపుతున్నాను. ఏమైనా సరే, వచ్చే సంచికలో 'గుంట కోపెక్కు' కథ అచ్చు కావాలి.''

''అట్లాగే! వెడతాను.''

తన కొడుకు తనకి పని చెప్పడం ఇదే మొదటి సారి. అతడు ఏమీ దాచకుండా తనకు చెపుతున్నందుకు ఆమె చాలా సంతోషించింది.

ప్రయాణానికి బట్టలు వేసుకుంటూ ఆమె:

''పాషా! నా కర్థమైంది. ఇది శుద్ధ బందిపోటుతనమే. అతని పేరేమిటి? యెగోర్ ఇవానొవిచ్ కదూ?'' అంది.

ఆమె చాలా అలసట చెందినా రాత్రి పొద్దుపోయాక సంతృప్తితో ఇంటి కొచ్చి, కొడుకుతో ఇలా చెప్పింది:

"సాషెను కలుసుకున్నాను. ఆమె నిన్ను చాలా చాలా అడిగింది. యెగోర్ ఇవానొవిచ్ చాలా నిరాడంబరమైన వాడు సుమా! చాలా కులాసా మనిషి. చాలా తమాషాగా, చమత్కారంగా మాట్లాడతాడు."

"వాళ్లు నీకు నచ్చినందుకు సంతోషం" అన్నాడు పావెల్ మెల్లగా.

"ఆట్టహాసమేమీ లేని మనుష్యులు పావెల్! ఏదో గొప్పవాళ్లలాగ బడాయిగా ఉండక పోవడం చాలా గొప్ప సంగతి. వాళ్లందరూ నిన్ను గురించి చాలా గౌరవంగా చెప్పుకుంటున్నారు."

తలనొప్పి కారణంగా పావెల్ సోమవారం నాడు కూడా ఫ్యాక్టరీ కెళ్లలేదు. భోజనం చేసే సమయానికి ఫ్యొదొర్ మాజిన్ సంతోషంతోనూ ఆవేశంతోనూ రొజుకుంటూ వచ్చాడు.

"లేచి రావాలి! ఫ్యాక్టరీ అంతా ఒక్కసారి తిరుగుబాటు చేసింది. వాళ్లు నిన్ను తీసుకు రమ్మని నన్ను పంపేరు. మిగిలిన వాళ్లందరి కంటే విషయాలన్నీ నువ్వు బాగా చెప్పగలవని సిజోవ్, మహోతిన్ అంటున్నారు. అక్కడ జరుగుతున్న సంఘటనలను నువ్వు చూసి తీరాలి!" అన్నాడు.

ఒక్క మాట మాట్లాడకుండా, పావెల్ బట్టలేసుకోవడం మొదలెట్టేడు.

"ఆడవాళ్లు కూడా వచ్చారు. వాళ్లు చాలా గోల చేస్తున్నారు" అన్నాడు ఫ్యొదొర్.

"అయితే నేనూ వస్తున్నాను. వాళ్ల ఉద్దేశమేమిటి? నేనూ వస్తున్నా!" అంది తల్లి.

"రా!" అన్నాడు పావెల్.

ముగ్గురూ మౌనంగా, గబగబ అడుగులేసుకుంటూ వీధిలో నడక సాగించారు. ఆవేశంవల్ల తల్లికి ఊపిరి పీల్చుకోవడమే కష్టమనిపించింది. అక్కడేదో చాలా ముఖ్యమైన సంఘటన జరుగబోతున్నట్లామెకు స్ఫురించింది. ఫ్యాక్టరీ గేటుదగ్గర చాలామంది స్త్రీలు గుంపులుగుంపులుగా చేరేరు. వాళ్లలో వాళ్లు అరుచుకుంటున్నారు, తోసుకుంటున్నారు. వాళ్లు ముగ్గురూ ఫ్యాక్టరీ ఆవరణలో ప్రవేశించేసరికి ఆవేశంతో బొబ్బలెడుతున్న జనం వాళ్లని చుట్టుముట్టారు. ఫౌండ్రీ ఇటుక గోడ నానుకుని పాత ఇనుప కమ్ముల గుట్టమీద సిజోవ్, మహోతిన్, వ్యాలొవ్, పలుకుబడి కలిగిన మరో అయిదారుగురూ నిలబడుండడం తల్లి చూసింది. జనమంతా గోడకేసి దృష్టి నిలిపి చూస్తున్నారు.

"అదుగో వ్లాసొవ్ వస్తున్నాడు!" అని ఎవడో కేక వేశాడు.

"వ్లాసొవ్? అతన్నిక్కడకి రమ్మనమనండి!"

"నిశ్శబ్దం!" అని చాలామంది అరిచారు.

దగ్గరగా ఒక మూలనుంచి నడిదుడుకులులేని రీబిన్ కంఠస్వరం వినబడుతోంది:

"మనం పోరాడేది ఒక కోపెక్కు కోసం కాదు. న్యాయం కోసం. అదంతే! మనం అంతగా పట్టుపట్టేది కోపెక్కు కాదు. కొంచెం బరువెక్కువైనా ఇతర నాణేల కన్న అదే క్కువ గుండ్రమని కాదు. డైరెక్టరు రూబులులో కన్న మన కోపెక్కులో మానవ రక్తం ఎక్కువ ఉంది. సిసలైన విలువ ఉన్నది కోపెక్కులో కాదు. రక్తంలో. న్యాయంలో!"

అతని మాటలు జనానికి బాగా నచ్చేయి. ఆనందంతో వాళ్లనేక విధాలుగా భేష్ అంటే భేష్ అన్నారు.

"సరిగా చెప్పేవు రీబిన్!"

"మహ బాగా చెప్పేవయ్యా, ఫైర్‌మన్!"

"ఇదుగో! వ్లాసావ్!"

ఈ కంఠధ్వనులన్నీ ఏకమై, ఫ్యాక్టరీలోని మిషన్ల చప్పుడునూ, ఆవిరి గొట్టాల బుసబుసలనూ, తీగెల ఝూంకారాన్నీ ముంచేశాయి. చేతులు ఊపుకుంటూ జనం నాలుగు మూలల్నుంచీ పరుగెత్తుకొచ్చారు. ఒకళ్లనొకళ్లు వేళాకోళంగా పురికొల్పుకుంటూ ఆవేశ పూరితులై చేరుకుంటున్నారు. అలసటతో విసుగు చెందిన హృదయాలలో అణగి ఉన్న అసంతృప్తికి ఇప్పుడు ప్రాణంవచ్చి, ఒక్కసారి పొంగి బయటపడే మార్గాన్ని చూసుకుంటూంది. తన నల్లని రెక్కలను మరింత వెడల్పుగా చాపుకొంటూ, జనంపై తన పట్టును మరింతగా దృఢపరచుకొంటూ, వారిని ఒకరితో ఒకరిని ఢీకొట్టించుతూ పగసాధింపనుద్దే శించిన జ్వాలగా తాను రూపొంది, విజయోత్సాహంతో ఆ అసంతృప్తి ఆకాశంలోకి ఎగిరి పోయింది. జనం తొక్కిడివల్ల రేగిన దుమ్మూ మసీ, మేఘంలా పైకి లేచాయి. చెమటలు కక్కుతున్న ముఖాల్లో ఆవేశం ఉట్టిపడుతోంది. ధూళిధూసరితమైన చెక్కిళ్లమీద నల్లని చెమటబొట్లు గారకట్టేయి. ఉద్రేకం ఉట్టిపడుతున్న ముఖాల్లో కళ్ళూ, పళ్ళూ ధగధగలాడేయి.

సిజోవ్, మహోతిన్‌లు నిలబడ్డ ఇనప జాలరుమీదకే పావెల్ కూడా ఎక్కేడు.

"కామ్రేడ్స్!" అన్నాడు.

అతని ముఖం తెల్లబారడం, పెదిమెలు వణుకుతుండడం తల్లి గమనించింది. అప్ర యత్నంగా జనాన్ని నెట్టుకుంటూ ముందుకెళ్లింది.

"ఏంటట్లా యెగబడతావ్?" అని జనం ఆమెమీద చిరాకుపడ్డారు.

కొందరామెను వెనక్కి గెంటేరు. కాని ఆమె ఆగలేదు. చేతుల్తో, మోచేతుల్తో జనాన్ని చీల్చుకుంటూ, తన కొడుకు పక్కన నిలబడాలనే పట్టుదలతో ముందుకెళ్లింది.

గొప్ప ప్రాముఖ్యం గల్గిన "కామ్రేడ్స్" అనే మాటను పావెల్ అనేటప్పుడు సంతో షంతో అతని గొంతుకేదో అడ్డు పడినట్లయింది. ధర్మంకోసం తపనపడే తన హృద యాన్ని ఈ ప్రజలకర్పించాలనే గాఢమైన వాంఛ అతని నావహించింది.

ఆ మాటనుండి బలాన్నీ, ఆనందాన్నీ పుంజుకుంటూ:

"కామ్రేడ్స్!" అని పావెల్ రెట్టించాడు. "చర్చిలమూ, ఫ్యాక్టరీలమూ, కట్టే వాళ్లం మనమే. గొలుసులను చేసేవాళ్లం, నాణేలను అచ్చుగుద్దేవాళ్లం మనమే. ఉయ్యాల లోని పసిబిడ్డలు మొదలు, కాటికి కాళ్లు చాచుకున్న ముసలివాళ్లవరకూ అందరికీ ఆహారాన్నిచ్చి ప్రాణాలను రక్షించే జీవశక్తి మనమే."

"అదీ మాటంటే!" అని అరిచాడు రీబిన్.

"ఎక్కడైనా ఎప్పుడైనా ముందుగా కష్టపడేవాళ్లం మనం. ప్రతిఫలం పొందేటప్పుడు ఆఖరివాళ్లం. మనలనెవరు లక్ష్య పెడతారు? మనకెవరైనా కించిత్తు మేలు చేశారా? అఖరుకు మనల్ని మనిషిమాత్రులుగా ఎవరైనా చూస్తున్నారా? లేదు!"

"లేదు!" అని జనంలోంచి ఎవరివో గొంతుకలు ప్రతిధ్వనించాయి.

పావెల్ ఉపన్యాస ధోరణిలో పడ్డాక, చాలా నిదానంగా తేలికైన భాషలో మాట్లాడ్డం ప్రారంభించాడు. జనం బాగా కిక్కిరిసిపోయి, వేయి తలల శరీరంలా ముందుకు తోసు కొచ్చారు. వందలాది కళ్లు అతనికేసి తదేకంగా చూస్తున్నాయి. జనం అతనికేసి తదేక దృష్టితో చూస్తూ అతని నోటి వెంట వచ్చే మాటలను జుర్రుకుంటున్నట్లున్నారు.

"మనమంతా సహచరులమనీ, ఒకే కుటుంబానికి చెందిన మిత్రులమనీ తెలుసుకుని మన హక్కులకోసం పోరాడాలనే ఒకే ఒక యిచ్ఛ కారణంగా ఒకరితో ఒకరం బలంగా ముడిపడి వున్నామనే సంగతిని గుర్తించేదాకా మన జీవితాన్ని మెరుగు పర్చుకోడం సాధ్యం కాదు."

తల్లికి సమీపంగా నిలబడిన ఒక వ్యక్తి మోటుగా:

"అసలు విషయానికి రా!" అని అరిచేడు.

"మాటకడ్డు రాకయ్యా!" అని రెండు వైపులనుంచీ కేకలు లేచాయి.

మురికి నోడుతున్న ముఖాలు కోపంతోనూ సందేహంతోనూ చిరచిరలాడాయి, కాని చాలామంది ఆలోచనా నిమగ్నులై పావెల్‌కేసి తీక్షణంగా చూశారు.

"సోషలిస్టు! కాని తెలివితక్కువవాడు మాత్రం కాడు" అన్నాడొకడు.

"మా చెడ్డ ధైర్యంగా మాట్లాడుతున్నాడు కదూ!" అని ఒక పొడవాటి మెల్లకంటి కార్మికుడు తల్లిని మెల్లగా భుజంతో నెట్టి చెప్పేడు.

"కామ్రేడ్స్! మనకు మనమే సహాయం చేసుకోవాలనీ, ఇతరులెవరూ మనకు తోడ్ప డరనీ తెలుసుకోవలసిన సమయమొచ్చింది. మన విరోధులను జయించాలంటే ఒకడికోసం అందరం, అందరికోసం ప్రతి ఒకడూ అనే సూత్రమే మనకు శరణ్యం."

"ఓయ్! అబ్బాయిలూ! అతడు మాట్లాడేదంతా నిజం!" అన్నాడు మహోతిన్, పిడికిలి ఊపుతూ.

"డైరెక్టర్ని పిలవండి!" పావెల్ ప్రతిపాదించాడు.

ఆ గుంపు సంతనూ ఒక పెనుగాలి ఊపేసినట్లయింది. వందలాది గొంతుకలు అరిచాయి:

''డైరెక్టర్ని పిలవండి!''

''అతనికోసం ఒక రాయబారవర్గాన్ని పంపండి!'' అంటూ జనం ఒక్కుమ్మడిగా కేకలెట్టేరు.

తల్లి ఇంకా ముందుకు చొచ్చుకెళ్లింది. కొడుకువంక సగర్వంగా తదేకదృష్టితో చూచింది. చాలా కాలంగా పనిచేస్తూ, తోడివారి గౌరవ మర్యాదలు చూరగొన్న వయసు మళ్లిన కార్మికులమధ్య నిలబడి తన కొడుకు మాట్లాడడం, వాళ్లంతా అతని మాటలను శ్రద్ధగా విని అతనితో ఏకీభవించడం ఆమెకు చాలా సంతోషమైంది. మిగతావాళ్లలాగా అతడు కోపంతో చిరచిరలాడుతూ తిట్టకపోవడం ఆమెకు నచ్చింది.

రేకుల కప్పుమీద వడగళ్ల వాన కురిసినట్లుగా జనంలోనుంచి బూతులు, కేకలు, కరకు మాటలు రేగేయి. కళ్లు పెద్దవిచేసి ఎవరికోసమో వెదకుతున్నట్లు పావెల్ జనాన్ని పరిశీలించాడు.

''ప్రతినిధులెవరు?''

''సిజోవ్!''

''వ్లాసొవ్!''

''రీబిన్! అతని నాలుకకు వాడి ఎక్కువ!''

అకస్మాత్తుగా గుంపులోనుంచి గుసగుసలు చెలరేగాయి.

''స్వయంగా తనే వస్తున్నాడు!''

''డైరెక్టరు!''

కోసుగెడ్డం కోలముఖం గల పొడుగాటి వ్యక్తి ముందుకు రావడానికి జనం దారిచ్చారు.

''నన్నెళ్లనియ్యండి'' అని చేతుల్తో సౌంజ్ఞ చేసుకుంటూ డైరెక్టరు ముందు కెళ్లేడు. అతని ముఖం ధుమధుమలాడుతోంది. పెత్తందారీ అహంకార దృష్టితో అతను కార్మికు లందర్నీ పరిశీలనగా చూశాడు. మామూలు మర్యాదకొద్దీ కార్మికులు తమ టోపీలను తీసి వంగి నమస్కరించారు. అతడు వాటిని పట్టించుకోకుండానే చొచ్చుకెళ్లేడు. నిశ్శబ్దంతో పాటు కొంచెం కలవరం ప్రారంభమైంది. పిల్లలు అల్లరి చేస్తుండగా పట్టుబడినప్పుడు ఇరుకునబడినట్లుగా కొందరు తమ తత్తరపాటును వ్యక్తపరచుతూ చిరునవ్వు నవ్వేరు. మరికొందరు గుసగుసలాడేరు.

అతడు తల్లిని దాటి వెడుతూ తన కఠోర దృష్టి నామె ముఖంమీద సారించాడు. తర్వాత ఇనప కమ్ముల నెట్టుకెదురుగా నిలబడ్డాడు. పైకెక్కడానికెవరో అతనికి చేయందిచ్చారు. కాని అతను దాన్ని అందుకోకుండా బలమైన ఒక ఊపుతో తనే పైకెక్కి పావెల్ సిజోవ్‌లకెదురుగా నిలబడ్డాడు.

"ఏమిటీ సంత? మీరంతా పనెందుకు మానేశారు?"

కొద్ది క్షణాలపాటు నిశ్శబ్దం ప్రబలింది. చిన్న కంకులు గాలికి ఊగినట్లుగా జనం తలలూపేరు. సిజోవ్ టోపీ ఊపి, భుజాలెగరేసి తలొంచుకున్నాడు.

"అడిగిందానికి సమాధానం చెప్పండి!" అని డైరెక్టరు అరిచాడు.

పావెల్ ముందుకొచ్చి, సిజోవ్‌నూ, రీబిన్‌నూ చూపిస్తూ,

"కోపెక్కు మినహాయింపు విషయంలో మీ ఆర్డరు రద్దుచేసుకోమని మిమ్మల్ని కోర డానికి కార్మిక సోదరులందరూ మా ముగ్గుర్నీ ప్రతినిధులుగా ఎన్నుకున్నారు" అన్నాడు బిగ్గరగా.

పావెల్‌కేసి చూడకుండానే,

"ఎందుకూ?" అని అడిగాడు డైరెక్టరు.

"ఆ మినహాయింపు చాలా అన్యాయమని మేమంతా అనుకుంటున్నాం కనుక."

"బురద గుంటలోని నీరు తీసేసి దాని నెండగట్టడంలో నా అభిప్రాయం కార్మి కులను దోపిడీ చేయడమేనని, వాళ్ల క్షేమంకోసం కాదని మీరనుకుంటున్నారన్నమాట, అంతేనా?"

"అవును" అన్నాడు పావెల్.

"మీ అభిప్రాయమూ అంతేనా?" అని డైరెక్టరు రీబిన్ నడిగేడు.

"మా అందరి అభిప్రాయమూ అదే."

"ఏమయ్యా, పెద్దమనిషీ నువ్వేమంటావ్?" అని సిజోవ్ నడిగేడు.

"నా అభిప్రాయమూ అదే, మా కోపెక్కుల్ని మాదగ్గరే ఉంచుకోవాలనుకుంటున్నాం."

సిజోవ్ మళ్లీ తలవంచి అపరాధం చేసినవాడిలాగ చిరునవ్వు నవ్వేడు.

డైరెక్టరు జనాన్నందరినీ పరిశీలనగా చూసి భుజాలెగరేశాడు. తర్వాత పావెల్‌కేసి తీక్షణంగా చూసి ఇలా అన్నాడు:

"చూస్తే, నువ్వు కొంచెం చదువుకున్నవాడివిలా కనిపిస్తున్నావు! నా పథకంవల్ల కలిగే ప్రయోజనం నీక్కూడా అర్థం కాలేదా?"

"ఫ్యాక్టరీ స్వంత ఖర్చుతో మురుగెండకడితే దాని లాభం ఎవరికైనా కనబడుతుంది" అని అందరికీ వినబడేలా పావెల్ జవాబుచెప్పేడు.

"ఫ్యాక్టరీ ధర్మసంస్థ కాదు" అని డైరెక్టరు పుల్లవిరుపుగా చెప్పి, "మీరంతా వెంటనే పనిలో కెళ్లండి. ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

డైరెక్టరు ఇనుప జాలరుమీదనుంచి జాగ్రత్తగా అటూ ఇటూ చూడకుండా కిందకిదిగేడు.

జనంలో అసంతృప్తి కలకలం చెలరేగింది.

"ఏమిటది?" అని డైరెక్టరు నిలబడి గదమాయించాడు.

''పోయి ఆ పనేదో నువ్వే చెయ్యి!'' అని నిశ్శబ్దాన్ని పటాపంచలు చేస్తూ ఎవరో దూరాన్నుంచి కేకేశాడు.

''మీరంతా పదిహేను నిముషాల్లో ఎవరి పనిలోకి వాళ్లెళ్లకపోతే, జరిమానా విధిస్తాను'' అని డైరెక్టరు ఖచ్చితంగా ఆజ్ఞాపించాడు.

గుంపులోనుంచి మళ్లీ దారి చేసుకుంటూ అతడు వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు. అతని వెనుకనుంచి హోరుమని గోల బయల్దేరింది. అతడు దూరం వెళ్లేకొద్దీ గోల హెచ్చిపోయింది.

''మాట్లాడి చూడండి!''

''భలేవ్యాయమే! మనవేం బతుకుల్రా బాబూ!''

జనం పావెల్‌కేసి చూస్తూ కేకలెట్టేరు.

''ఏయ్, చట్టాలు మాట్లాడావే — ఏంజెయ్యాలిప్పుడు?''

''ఉపన్యాసం బాగానే ఇచ్చావు! డైరెక్టరొచ్చినపుడు అంతా టెంకాయ పిచ్చికొండ అయిపోయింది!''

''రావయ్యా వ్లాసావ్! మేమిప్పుడేమి చేయాలో చెప్పు.''

ఈ కేకలు చాలా ఎక్కువైనాక పావెల్ జవాబుచెప్పేడు:

''కామ్రేడ్స్! కోపెక్కు మినహాయింపు ఉత్తరువును రద్దు చేస్తానని అతడు వాగ్దానం చేసేదాకా, మనం పని మానెయ్యాలి.''

ఆవేశపూరితమైన వ్యాఖ్యానాలు బయల్దేరేయి.

''మనమంతా ఉట్టి దద్దమ్మలమనుకుంటున్నాడు కాబోలు!''

''అంటే సమ్మె అన్నమాట!''

''ఒక వెధవ కోపెక్కుకోసమే?''

''సమ్మె చేస్తే తప్పేమిటి?''

''మనందర్నీ పనిలోంచి తీసేస్తారు!''

''వాళ్లకి పనెవరు చేస్తారు?''

''అతనికి పనిచేసేవాళ్లు కావలసినంత మంది దొరుకుతారు.''

''ఎవళ్లు? కుళ్లువెధవలూ ద్రోహులూనా?''

## 13

పావెల్ కిందకు దిగి తల్లి దగ్గర నిలబడ్డాడు.

ప్రజల్లో గలభా రేగిపోయింది. ప్రతివాడూ, పక్కవాడితో ఆవేశంతో కేకలెడుతూ వాదిస్తున్నాడు. రీబిన్ పావెల్ దగ్గర కొచ్చి ఇలా అన్నాడు:

"పిల్లచేత సమ్మె చేయించడం మనవల్ల కాదు. ఆశాపరులే కాని పిరికిపందలు! మూడు వందలమందికి మించి నీ వెనకాల నిలబడరు. ఒక్క వంగటి కర్రతో ఎత్తడానికి వీళ్లేని చెత్త...."

పావెల్ మౌనం వహించాడు. తనమీద ఎంతో ఆశ పెట్టుకుని చూస్తున్న జన సమూహం అతని కళ్ల ముందు ఆడింది. గుండె దడదడ కొట్టుకుంది. బాగా ఎండి నెరియలు తీసిన భూమిమీద పడిన వానచినుకులు అదృశ్యమైనట్లే, తాను చెప్పిన మాటల ప్రభావం జనంలో ఎక్కడా కనిపించకుండా పోయినట్లనిపించింది.

చాలా అలసిపోయి, విచారంగా పావెల్ ఇంటికి నడిచాడు. తల్లి, సిజోవ్ అతనివెంట వెళ్లారు. రీబిన్ కూడా అతని పక్కన నడుస్తూ చెవిలో ఏదో గొణగొణలాడుతూనే వున్నాడు.

"నువ్వు బాగా మాట్లాడుతావు. కాని హృదయాన్ని స్పందింప చెయ్యలేవు. అదంతే! వాళ్ల హృదయాల కంటేటట్లు చెప్పాలి. గుండెల్లోపల నిప్పురవ్వ రగిలించాలి! వాళ్లతో వాదించి ఒప్పించలేము. బిగుతు జోడు కాలి కెక్కదు."

"నీలొవ్నా! ముసలి వాళ్లమైన మన పనైపోయింది. కాటికి కాళ్లు చాచుకు కూచో వలసిన వాళ్లమే" అన్నాడు సిజోవ్. "కొత్త తరపో మనుషులు ముందు కొస్తున్నారు. నిజానికి నువ్వూ నేనూ ఎలాటి బతుకు బతికేం? మోకాళ్లమీద పాకడం, తల నేలకు కొట్టు కోవడం, మన పైవాళ్లకు తలొగ్గుతూ ఉండడం. ఇంతే కదూ? కాని ఈ కాలం వాళ్లున్నారే మనలా లేరు. నాకు తెలియదు కాని, బహుశా వాళ్లు బాగా మేల్కొని జ్ఞానం తెచ్చుకు న్నారనుకుంటాను. బహుశా వాళ్లు మరింత అధ్వాన్నమైన తప్పే చేస్తూండవచ్చు. కాని మనలా మాత్రం లేరు. మాటవరసకి మన కుర్రాళ్ల సంగతి చూడు. డైరెక్టరుతో నిర్భ యంగా సమాన స్థాయిలో మాట్లాడేరు!... పావెల్, నిన్ను తర్వాత కలుసుకుంటా అబ్బాయీ! నువ్వు జనానికి అండగా నిలబడ్డ పద్ధతి చాలా బాగుంది. దేవుడు నీకు తోడ్పడును గాక! ఈ చిక్కుల్లోనుంచి బయటపడే మార్గాన్ని బహుశా నువ్వు కనుక్కుంటావు. దేవుడు నీకు మేలుచేయు గాక!" అంటూ సిజోవ్ వెళ్లిపోయాడు.

"పో పో! చావు!" అని రీబిన్ గొణిగేడు. "వీడిలాంటివాళ్లు మనుషులు కూడా కారు – పగుళ్లు పూడ్చేందుకు పనికొచ్చే ఉట్టి లప్పం. పావెల్! నువ్వు ప్రతినిధిగా ఉండాలని కేక లేసిన వాళ్లెవరో కనిపెట్టేవా? నువ్వు సోషలిస్టువనీ, ఈ పేచీలన్నిటికీ మూలకారకుడవనీ పుకార్లు పుట్టించే వాళ్లే సుమా! 'ఈ దెబ్బలో వీడిని పన్లోంచి పీకేస్తారు. దాంతో, వీడి రోగం చప్పగా కుదురుతుంది' అని వాళ్లు అనుకొని వుంటారు."

"వాళ్ల దృష్టిలో వాళ్లు చేసిన పని మంచిదే" అన్నాడు పావెల్.

"అలాగే. తోడేళ్లు ఒక దాన్నొకటి చీల్చి చెండాడుకోవడం సరైనదే."

రీబిన్ ముఖాన మబ్బులు అలముకున్నాయి. అతడు బాగా తబ్బిబ్బై పోయినట్లు కంఠ స్వరమే చెపుతోంది.

''జనం కేవలం ఒట్టి మాటలు చెవితే వినిపించుకోరు — కొంత బాధపడాలి. మాటలను రక్తక్షాళితం చెయ్యాలి....''

ఆ రోజంతా పావెల్ చాలా విసుగుతోనూ విషాదంతోనూ తిరిగేడు. మతి మతిలో లేదు. కండ్లు జ్యోతుల్లాగుండి, దేని కోసమో వెతుకుతున్నట్లున్నాయి. తల్లి అతని అవస్థను గుర్తించింది.

''పావెల్! ఏమిటలా ఉన్నావ్?'' అని జాగ్రత్తగా అడిగింది.

''తలనొప్పిగా ఉంది.''

''పడుకో. డాక్టర్ని పిలుస్తాను.''

''వద్దమ్మా! మరేం ఫర్వాలేదులే'' అని చప్పున జవాబుచెప్పి మెల్లగా తనలో తానే ఇలా గొణుక్కున్నాడు: ''నేను చాలా చిన్నవాణ్ణి, బలహీనుణ్ణి. అదే కారణం. వాళ్లు నన్ను నమ్మలేదు. నేను చెప్పిన సలహాను వినిపించుకోలేదు. అంటే, దాన్ని ఎలా చెప్పాలో నాకు తెలియలేదన్నమాట. నా మనసేమీ బాగా లేదు. నామీద నాకే చిరాకొస్తోంది.''

తల్లి, చిరాకుగా వున్న అతని ముఖాన్ని చూసింది. అతని కెలాగైనా ఉపశమనం కలిగించాలని ప్రయత్నించింది.

''కొంచెం ఓపిక పట్టు.... నువ్వు చెప్పేది ఈ రోజు గాకపోతే రేపు అర్థం చేసుకుంటారు'' అని మెల్లగా అంది.

''వాళ్లు అర్థం చేసుకోక తప్పదు!'' అన్నాడు.

''నువ్వు చెప్పే మాట నిజమని నాకూ అనిపిస్తోంది.''

పావెల్ ఆమె దగ్గర కెళ్లేడు.

''అమ్మా! నువ్వు చాలా అద్భుతమైన మనిషివమ్మా!'' అని, వెనక్కి తిరిగాడు. ఆ మెత్తని మాటలు ఆమెకు చురకేసినట్లనిపించి ఉలికిపడింది. గుండెలమీద చేయి వేసు కుని అతని లాలిత్యాన్ని తలుచుకుంది. ఆమె అతనిదగ్గర్నుంచి వెళ్లిపోయింది.

ఆ రాత్రి తల్లి నిద్రపోతోంది. పావెల్ ఇంకా తన మంచంమీద పడుకుని చదువుకుం టున్నాడు. పోలీసులొచ్చి చిరచిరలాడుతూ ఇల్లంతా గలభాచెయ్యడం మొదలెట్టారు. అటకమీద కెక్కారు. పెరడంతా గాలించారు. పసుపుపచ్చటి ముఖం ఆఫీసరు సరిగ్గా మొదటి సారొచ్చినపుడు చేసినంత హంగామా చేశాడు. వెటకారపు మాటలు విసురుతూ ఉండడం, మనసుకు నొప్పి కలిగించే వెటకారాలూ, వేళాకోళాలూ చేయడం అతనికి సరదా. తల్లి, తన కొడుకు ముఖంకేసి తదేకంగా చూస్తూ మౌనంగా ఒక మూల కూచుంది. అతడు తన మనస్సులో ఉండే భావాలను ఎంతో నిగ్రహంతో అణచి పెట్టుకున్నాడు. కాని

ఆఫీసరు నవ్వినప్పుడు మాత్రం అతని వ్రేళ్ళ విచిత్రంగా కదుల్తున్నాయి. పోలీసులు అతనితో పరిహాసం చేసినప్పుడల్లా, అతడు కోపం వెలిబుచ్చకుండా ఉండడానికెంత ప్రయాసపడేవాడో ఆమె గుర్తించింది. మొదటిసారి సోదా జరిగినప్పుడు భయపడినంతగా ఆమె ఈ సారి భయపడలేదు. పిశాచరులైన ఈ బూడిద రంగు ఆగంతువులపట్ల ఆమెకు ద్వేషం బాగా హెచ్చింది. ఆ ద్వేషం ఆమె భయాన్ని మింగేసింది.

"నన్ను పట్టుకుపోతారు" అన్నాడు గుసగుసగా పావెల్.

"నాకు తెలుసు" తలొంచుకుని తల్లి మెల్లగా బదులుచెప్పింది.

మధ్యాహ్నం కార్మికులతో అతడు చెప్పిన మాటలకు, వాళ్ళ అతన్ని జైల్లో పెడ్తారని ఆమె గ్రహించింది. అయితే పావెల్ చెప్పిన మాటలతో అందరూ ఏకీభవించారు కనుక, జనమంతా అతనికి తప్పకుండా అండగా ఉంటారు, అందుకని అతన్ని ఎంతో కాలం జైల్లో ఉంచలేరని అనుకుంది....

వీలొన్నా కొడుకునొక్కసారి కౌగిలించుకుని ఏడవాలనుకుంది. కాని ఆఫీసరు కళ్ళ చిట్లించుకుంటూ తన పక్కనే నిలబడున్నాడు. అతడి పెదవులు, మీసాలు అదురుతున్నాయి. తల్లి కన్నీళ్ళనూ ఆక్రందనాన్నీ వేడికోలునూ చూడ్డానికి అతడు కనిపెట్టుకుని ఉన్నట్లా మెకు తోచింది. తనలో ఉన్న శక్తినంతా పుంజుకుని సాధ్యమైనంత తక్కువ మాట్లాడేందుకు ప్రయత్నిస్తూ కొడుకు చేతిని గట్టిగా పట్టుకుని ఊపిరి బిగబట్టి మృదువుగా మెల్లగా ఇలా చెప్పింది:

"పాషా! వెళ్లిరా. కావలసిన వస్తువులన్నీ తీసుకున్నావా?"

"తీసుకున్నానమ్మా! బెంగపెట్టుకోకు."

"దేవుడు నిన్ను చల్లగా చూడాలి."

పావెల్‌ను తీసుకెళ్లిన తర్వాత తల్లి బెంచీమీద కూలబడి కళ్ళు మూసుకొని నెమ్మదిగా కుమిలికుమిలి ఏడ్చింది. తన భర్తలాగే నడుము గోడకాన్చి కూచుంది. దుఃఖభారంతోనూ అంతకన్న బాధాకరమైన తన నిస్సహాయ స్థితి మూలంగానూ ఆమె అవిధంగా కూచుండి పోయింది. తర్వాత గోడకు తల ఆన్చి బావురుమని ఏకమొయిన చాలసేపు ఏడ్చింది. గాయపడిన హృదయంలోని బాధంతా ఒక్కసారి ఆ ఏడ్పులో వెలికివచ్చింది. పసుపు పచ్చ ముఖం, పన్నని మీసాలూ గలిగిన ఆఫీసరు సంతృప్తిగా బొమలు ముడిచి తనకేసి చూసిన దృశ్యం ఆమె మనోనేత్రంనుండి తొలిగిపోలేదు. తల్లులనుండి పిల్లల్ని వేరుచేసే మనుష్యుల మీద ఆమె హృదయంలో ద్వేషాగ్ని రగుల్తోంది. ఇంతకూ వాళ్ళ చేసిన నేరం న్యాయాన్ని కోరడమే కదా.

చలి బాగా వేస్తోంది. కిటికీలమీద వర్షపు జల్లు కొడుతోంది. బూడిద రంగు దుస్తుల జనాభా, తమ పొడుగాటి చేతుల్తో, కళ్ళ మూసుకుపోయిన ఎర్రటి గండు ముఖాల్తో ఇంటి

చుట్టూ రాత్రంతా బూట్ల స్పర్స్ చప్పుడు చేసుకుంటూ తిరుగాడుతున్నట్లే ఆమెకు తోచింది.

"నన్ను కూడా పట్టుకుపోతే బాగుండేది!" అనుకుందామె.

కార్మికులను పనిలో హాజరుకమ్మని ఆజ్ఞాపిస్తూ ఫ్యాక్టరీ కూసింది. ఈ రోజు కూత చాలా నెమ్మదిగానూ, బొంగురుగానూ ఉన్నట్లామె కనిపించింది. తలుపు తెరుచుకుని రీబిన్ లోపలికొచ్చాడు.

గడ్డంమీద పడిన వర్షపు చినుకులను తుడుచుకుంటూ:

"అతన్ని తీసుకెళ్లిపోయారా?" అని అడిగేడు.

"ఆ! తీసుకుపోయారు. దుర్మార్గులు!" అని ఆమె నిట్టూర్పు విడిచింది.

రీబిన్ ఒక చిన్ననవ్వు నవ్వి ఇలా అన్నాడు:

"అనుకున్నదే. నా కొంపా సోదా చేశారు. అన్నీ చేతుల్తో పట్టి చూశారు. తెగ తిట్టుకున్నారు. కాని అపకార మేమీ చేయలేదు. సరి! అయితే పావెల్‌ను పట్టుకున్నారన్నమాట! డైరెక్టరు కనుసైగ చేస్తాడు, పోలీసు తలూపుతాడు — మరొక మనిషి ఖాళీ! బాగుంది వరస! వాళ్లూ వాళ్లూ ఒకటే. ఒకడు జనం కొమ్ములు పట్టుకుంటాడు. రెండోవాడు పూర్తిగా పాలు పిండేస్తాడు!"

"పావెల్‌కి మీరంతా అండగా నిలబడాలి! అతను చేసిన పని అందరికోసమే కదా!" లేచి నిలబడుతూ అంది తల్లి.

"ఎవరు నిలబడాలి?" అని అడిగాడు రీబిన్.

"అంతా!"

"హూం! నువ్విలా అనుకుంటున్నావ్! కాని అలా జరగదు!"

ఒక నవ్వు నవ్వి కాళ్లీడ్చుకుంటూ రీబిన్ వెళ్లిపోయాడు. అతడన్న నిరాశాపూరితమైన మాటలవల్ల తల్లి దుఃఖం యినుమడించింది.

"వాడిని కొడతారేమో! హింస పెడతారేమో...."

తన కొడుకు శరీరమంతా దెబ్బలతో పుండ్లు పడినట్లూ, రక్తాలు కారుతున్నట్లూ ఆమె భ్రమచెందింది. మంచుముద్దలా ఆమె హృదయాన్ని భయమావహించింది. కళ్లు మంటలెత్తేయి.

ఆరోజంతా ఆమె కుంపటి ముట్టించలేదు, భోజనం చేయలేదు, టీ కూడా తాగలేదు. రాత్రి ఆలస్యంగా ఒక రొట్టె ముక్క తింది. ఆమె రాత్రి పడుకున్నప్పుడు జీవితమంతా ఖాళీగా కనబడింది. ఇంతటి ఒంటరితనాన్నెప్పుడూ ఆమె ఎరుగదు. ఇటీవల కొన్నేళ్లుగా ఆమె ఏదో ముఖ్యమైనదాన్ని ఆకాంక్షిస్తూ కాలం గడిపేందుకు అలవాటు పడింది. ఏదో అలజడిగా పనిచేస్తూ, ముఖాలు కళకళలాడే యువజనులమధ్య ఆమె జీవిస్తోంది.

ప్రమాదకరమైనా ఈ మంచి జీవితాని కంతకీ కారకుడైన తన కుమారుని గంభీరమైన ముఖం ఆమె కళ్ల ఎదుట ఉండేది. అతడిప్పుడు వెళ్లిపోవడంతో ఆమెకింక అంతా పోయి నట్లు అనిపించసాగింది.

## 14

మరునాటి పగలూ, కన్ను మూతపడని ఆ రాత్రీ భారంగా గడిచాయి. మరుసటి దినం అంతకంటే భారంగా గడిచింది. తన దగ్గరకెవరో వస్తారని ఎదురుచూసింది. కాని ఎవరూ రాలేదు. సాయంకాలమైంది. రాత్రి చీకటి పడింది. చలిగాలీ వర్షం ప్రారంభమ యాయి. వర్షపు జల్లులు గోడలకు కొడుతున్నాయి. గాలి జాంయ్ మంటూ పొగ గొట్టం లోంచి కొడుతోంది. వేల అదిరింది. కప్పుమీదనుంచి వర్షపు చినుకులు జలజల రాలుతూ శబ్దం చేస్తున్నాయి. ఆ శబ్దంలో గడియారం టిక్‌టిక్ ధ్వని మునిగిపోయింది. ఇల్లంతా మెల్లగా ఊగుతున్నట్లనిపించింది. విషాదంవల్ల అన్ని వస్తువులూ నిర్జీవమై నిరుపయో గమైనట్టు తోచింది....

ఇంతలో ఎవరో కిటికీతలుపు తట్టినట్లయింది. రెండవ సారి కూడా తలుపు చప్పు డైంది. అలాటి చప్పుళ్లు ఆమె కలవాటైపోయాయి. అంచేత ఆమెకేమీ భయం కలగలేదు. ఈ సారి కొంచెం సంతోషం కూడా కలిగింది. ఏదో ఆశ కొద్దీ గభాలున లేచింది. భుజాలమీద శాలువ కప్పుకుని తలుపు తెరిచింది.

సమోయ్‌లొవ్ లోపలికొచ్చాడు. అతని వెంట తిరగేసిన కోటు కాలరుతోనూ, టోపీతోనూ ముఖం కప్పుకున్న వ్యక్తి ప్రవేశించాడు.

"మీ నిద్ర పాడు చెయ్యలేదుగదా!" అని సమోయ్‌లొవ్ నూటిగా పలకరించాడు. అతని కంఠస్వరంలో మామూలుగా కాకుండా కొంత ఆత్రత, విచారం ద్యోతకమయాయి.

"నేనసలు నిద్రపోనిదే!" అని చెప్పి వాళ్లేమి చెపుతారో అని ఆత్రంగా వాళ్లకేసి చూస్తూ మౌనంగా నిలబడింది.

సమోయ్‌లొవ్ వెంట వచ్చిన వ్యక్తి టోపీ తీసేసి, రాసిన గొంతుక సవరించుకుని,

"ఏమమ్మా! నన్ను గుర్తు పట్టలేదా ఏమి?" అని చాలా కాలంనుంచి ఎరిగిన మనిషి లాగున తన కురుచ చేయందిచ్చాడు.

"మీరా నాయనా! యెగోర్ ఇవానొవిచ్!" అంటూ ఆమె బిగ్గరగా ఆనందాన్ని వెలి బుచ్చింది.

యెగోర్ చర్చిగాయకుడిలాగ పొడుగాటి జుట్టు గలిగిన పెద్ద తలకాయను ముందుకు వంచి, "నేనే!" నని సమాధానం చెప్పేడు. అతని ముఖంమీద చిరునవ్వు ఒక్క వెలుగు

వెలిగింది. బూడిదవన్నె చిన్న కళ్లతో అతడు ఎంతో అనురాగంతో తల్లికేసి చూశాడు. కురుచ చేతులు, లావాటి మెడతో పొట్టిగా గుండ్రంగా వున్న అతడు పైకి అచ్చంగా సమొవార్‌లా కనబడుతున్నాడు. ముఖంలో మాత్రం తేజస్సు ఉట్టిపడింది. గుండెల్లో ఏదో గరగరమంటూన్న గురక చప్పుడుతో గట్టిగా ఊపిరి పీల్చాడు.

"నేను బట్టలేసుకొచ్చేదాకా పక్క గదిలో కూచోండి" అంది తల్లి.

"మీ దగ్గరకి ఒక పనిమీద వచ్చాం" అన్నాడు సమోయ్‌లొవ్ తల్లితో.

యెగోర్ ఇవానొవిచ్ పక్క గదిలోకెళ్లి అక్కడనుంచే మాట్లాడ్డం మొదలెట్టాడు.

"ఈవేళ ఉదయం నికొలాయ్ ఇవానొవిచ్ జైలునుంచి విడుదలయాడమ్మా!"

"అతడు జైల్లో ఉన్నట్లే నాకు తెలియదే!" అంది తల్లి.

"రెండు నెల్ల పదకొండు రోజులున్నాడు. హొహోల్‌ని చూశాడు. అతడు మిమ్మల్నడిగేనని చెప్పమన్నాడు. పావెల్ కూడా మిమ్మల్ని బెంగ పెట్టుకోవద్దన్నాడు. తనలా జీవించే వాళ్లందరికీ మధ్యమధ్య జైలులోనే విశ్రాంతి లభిస్తూ వుంటుందని మీకు చెప్పమన్నాడు. మన అధికారులు తప్పకుండా మన సంగతి ఆలోచించి చేసే సౌకర్యమదే. మరి అసలు సంగతి కొద్దాం! నిన్న ఎంతమందిని అరెస్టు చేశారో మీకు తెలుసా?"

"ఏమిటి? పావెల్‌నే కాకుండా వేరే వాళ్లని కూడా అరెస్టుచేశారేమిటి!" అని ఆశ్చర్యంగా అడిగింది తల్లి.

"ఇతను నలభై తొమ్మిదోవాడు.... బహుశా ఫ్యాక్టరీ యజమానులు మరో డజనుమందిని అరెస్టు చేయిస్తారు. ఉదాహరణకి ఈ పెద్దమనిషిని పట్టేస్తారు" అన్నాడు యెగోర్ తాపీగా.

"అవును. నన్ను కూడా!" కొంచెం విచారంగా అన్నాడు సమోయ్‌లొవ్.

ఎందుకో కాని వ్లాసొవాకి కొంత వూరట కలిగింది.

"కీడులో మేలు వాడక్కడ ఒంటరిగా లేడు" అనే భావం ఆమె మనస్సులో మెరిసింది.

దుస్తులు ధరించి, సంతోషంగా అతిథులను కలుసుకుంది.

"ఇంతమందిని పట్టుకుంటే, బహుశా వాళ్లను చాలా కాలముంచుతారనుకోను."

"అలాగే! ఉంచరు.... ఒక్కసారి వాళ్లాడే ఈ ఆటని కట్టించామా, తోకముడిచి పారిపోతారు. దాని సూక్ష్మమేమంటే, ఇప్పుడు ఫ్యాక్టరీలో కరపత్రాలు పంచిపెట్టడం మానేసినట్లయితే పోలీసులు ఆ సంగతి ఆధారం చేసుకుని పావెల్‌మీదా, జైళ్లలో మగ్గుతూన్న ఇతర మిత్రులమీదా నేరం మోపు చేస్తారు" అన్నాడు యెగోర్ ఇవానొవిచ్.

"అదెట్లా?" అని భయపడుతూ తల్లి అడిగింది.

యెగోర్ ఇవానొవిచ్ నిదానంగా జవాబుచెప్పేడు:

"ఎట్లాగేముంది? స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఒక్కొక్కప్పుడు పోలీసుల బుర్రలు కూడా సరిగానే పనిజేస్తాయి. మీ మటుకు మీరే ఆలోచించుకోండి. పావెల్ జైల్లో లేనప్పుడు

కరపత్రాలు, కాగితాలు ఫ్యాక్టరీలో కొచ్చేవి. అతడిని జైల్లో పెట్టగానే కరపత్రాలూ లేవు, కాగితాలూ లేవు. కనుక అతడే ఈ కాగితాలను విరజల్లుతున్నాడని అర్థం! అంతేనా? అక్కడనుంచి ఒకరొకరినే మింగడం మొదలెడతారు. పోలీసులు జవాన్ని పూర్తిగా ముక్కలు ముక్కలు చేసి తినేస్తారు. పిసళ్ల తప్ప ఏమీ మిగలవు."

"సరి. సరి! ఇప్పుడు నా కర్థమైంది. అయ్యో పాపం! వాళ్లకోసం మనమిప్పుడేం చెయ్యాలి?" అని తల్లి విషాదంగా అడిగింది.

"వాళ్ల దాదాపు అందర్నీ పట్టేశారు. వాళ్లని కాకులకూ గద్దలకూ వెయ్యా!" అంటూ సమోయ్‌లొవ్ వంటింట్లోనుంచి కేకేశాడు. "మనం ఇప్పుడు చేస్తున్న పనిని, మన ఉద్యమంకోసమే కాకుండా, జైల్లో ఉన్న మిత్రులను కాపాడుకునేందుకు కూడా కొన సాగించాలి" అన్నాడు.

"కాని పనిచేసేవాళ్లెవరూ లేరు...." అని చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు: "ఒకటో రకమైన కరపత్రాలు తయారుగా ఉన్నాయి. అన్నీ నా చేత్తో తయారుచేశాను. వాటిని ఫ్యాక్టరీలోకి ఏవిధంగా చేర్చాలన్న సమస్యే తేలడం లేదు."

"లోపలికెళ్లే గేటు దగ్గరే అందర్నీ సోదా చూడ్డం మొదలెట్టారు" అన్నాడు సమోయ్‌లొవ్.

తనేదో కొంత పనిచెయ్యాలనే అభిప్రాయం వాళ్లకున్నట్లు తల్లి గ్రహించింది.

"ఆ పని ఏవిధంగా చేయడానికి వీలుంది?" అని ఆత్రంగా అడిగింది.

సమోయ్‌లొవ్ గుమ్మం దగ్గర నిలబడి,

"పెలగేయా నీలొవ్నా! ఫ్యాక్టరీలో తినుబండారాలమ్మే మార్యా కోర్సునొవాతో మీకు పరిచయముందా?" అని అడిగేడు.

"ఉంది. ఎందుకూ?"

"ఆవిడతో మాట్లాడి చూడండి. వాటినేమైనా లోపలికి తీసుకెళ్ల గలదేమో?"

తల్లి చేయూపి అలాటి ఆలోచన లాభం లేదని చెప్పింది.

"కుదరదు. ఆమెవల్ల కాదు! ఆమె శుద్ధ వాగుడు పిట్ట. ఆ కాగితాలు నాద్వారా వచ్చాయని, ఈ ఇంట్లోనుంచి వచ్చాయని ఇట్టే తెలిసిపోతుంది. వద్దు" అంది. చటుక్కున ఆమెకొక ఆవేశం కలిగింది. "వాటిని నాకివ్వండి. నే నా పని చేస్తాను. దానికేదో మార్గం నేనే ఆలోచిస్తాను. మార్యాను తనకు సాయంగా నన్ను తీసుకెళ్ల మంటాను. ఏదో విధంగా నేను పొట్టపోసుకోవాలి కదా! ఫ్యాక్టరీలో తినుబండారాలమ్ముకుంటాను. నేనెలాగో ఒలాగ పని జరిపిస్తాను."

తల్లి తన చేతుల్ని గుండెలమీద అదిమి పట్టుకుని ఈ పనంతా ఎవరికీ అనుమానం కలగకుండా తను చేస్తానని తొందరగా హామీ ఇచ్చింది. సంతోషంతో పొంగిపోయి:

''జైల్లోనుంచి కూడా పావెల్ ఈ పనిని చేయగలడని వాళ్ళు తెలుసుకోవాలి! ఆ సంగతి తెలుసుకుంటారుగా!'' అంది.

ముగ్గురూ చాలా సంతోషపరవశులైనారు.

''అద్భుతమమ్మా! అద్భుతం! ఇదెంత గొప్ప సంగతో మీరు తెలుసుకోలేరు. అబ్బ! అమోఘమనుకో!'' చిరునవ్వు నవ్వుకుంటూ చేతులు రాసుకుంటూ యెగోర్ అన్నాడు.

''ఈ పథకం సాగిందా, నేను నిద్రమంచంమీదకెళ్ళినంత హాయిగా జైలుకు పోతాను'' అన్నాడు సమోయ్‌లొవ్.

''ఈ దేశంలోకల్లా అందకత్తెవమ్మా!'' అని గట్టిగా యెగోర్ తల్లిని బుజ్జగించాడు.

తల్లి మెల్లగా నవ్వుకుంది. ఫ్యాక్టరీలో కరపత్రాలు యథాప్రకారంగానే పంచిపెట్ట బడుతూవుంటే, యజమానులు తన కొడుకునేమీ అనలేరని ఆమెకు స్పష్టంగా అర్థమైంది. ఈ పని తాను తప్పకుండా చేయగలననే ధైర్యం ఆమెకు కలిగింది. ఆ ఆనందంలో ఆమె శరీరమంతా ఒక్కసారిగా జలదరించింది.

''జైల్లో మీరు పావెల్‌ని చూడ్డంతోనే మీ అమ్మ చాలా మంచిదని చెప్పండి'' అన్నాడు యెగోర్.

''నేను ముందుగా అతన్నే చూస్తాను'' అంటూ సమోయ్‌లొవ్ నవ్వేడు.

''నేను చేయవలసిన పనంతా చేస్తానని మావాడితో చెప్పండి. ఆ సంగతి వాడికి తెలియాలి!''

''సమోయ్‌లొవ్‌ను వాళ్ళు జైలుకి పంపకపోతేనో?'' అన్నాడు యెగోర్.

''అప్పుడు చేసేదేముంది?'' అంది తల్లి.

మగవాళ్ళిద్దరూ పకపక నవ్వుకున్నారు. కొంచెం బిడియపడుతూ ఆమె కూడా నవ్వింది.

''ఇతరుల కష్టాలు సొంత కష్టాల్లాగ చూసుకోవడం చాలా కష్టం'' అని కళ్ళు దించి చెప్పింది అమ్మ.

''అది సహజమేనమ్మా'' అన్నాడు యెగోర్. ''పావెల్‌కోసం అంతగా బెంగ పెట్టుకుని పరితపించకండి. అతడు జైల్లోనుంచి బాగా వస్తాడు. అక్కడ మనిషికి బాగా విశ్రాంతి దొరుకుతుంది. పుస్తకాలు బాగా చదువుకునే సావకాశం లభిస్తుంది. బయటనున్న మాబోటి వాళ్లకు ఆ రెండూ లభ్యం కావు. నేను మూడు సార్లు జైలుకెళ్ళి వచ్చాను. ప్రతిసారీ కూడా హృదయానికీ మనస్సుకూ చాలా లాభమే కలిగింది. అయితే అది శరీరానికి సుఖదా యకమని చెప్పను.''

''మీరల్లా ఒగరుస్తున్నారేమిటి?'' అమాయకంగా ఉండే అతని ముఖంకేసి స్నేహ పూర్వకంగా చూసి అడిగింది తల్లి.

“దానికొక ప్రత్యేకమైన కారణమున్నదిలే” అని వేలెత్తి జవాబుచెప్పేడు. “సరే! అయితే అమ్మా! అంతా స్థిరమైనట్లే కదూ? రేపు మేము కొన్ని కరపత్రాలను మీకు అందచేస్తాం. మళ్లీ చక్రం తిరగడం మొదలెట్టి, చిరకాలంనుంచి అంటి పెట్టుకున్న తుప్పును రాల్చేస్తుందన్నమాటే. వాక్స్వాతంత్ర్యానికీ జై! మాతృహృదయానికీ జై! మళ్లీ కలుసుకునే దాకా శలవు!”

సమోయ్‌లొవ్ ఆమెతో కరచాలనం చేసి,

“మా అమ్మకిటువంటి పని చెప్పలేను. వెళ్లొస్తాను!” అని శలవు తీసుకున్నాడు.

“వాళ్లందరూ కూడా యీ విషయాలన్నీ అర్థం చేసుకునే రోజొస్తుంది” అని తల్లి అతనికి ధైర్యం చెప్పింది.

వాళ్లు వెళ్లిపోవడంతోనే తలుపు గడియ వేసుకుని గదిమధ్యన మోకరించి కూర్చుని ప్రార్థన చేసుకుంది. ఆ ప్రార్థన, వాన శబ్దంలో కలిసిపోయింది. మాటలను నోట పట్టకుండానే ఆమె ప్రార్థించింది. పావెల్ ఆమె జీవితంలో కొత్తగా చొప్పించిన ప్రజకోసం ఏకాగ్ర ఆవేదనే ఆమె ప్రార్థన. ఎవరికి వారే అయినా, ఇంత సన్నిహితంగా ఉంటున్న ఈ అమాయిక జనం, తనకూ తన పూజా విగ్రహాలకూ మధ్య తిరుగాడుతున్నట్లు తల్లికి తోచింది.

మర్నాడు పొద్దున్నే ఆమె మార్యా కోర్‌సునొవాను కలుసుకోవడానికెళ్లింది.

మార్యా యథాప్రకారంగానే, జిడ్డోడుతూ లొడలొడ మాట్లాడుతూ, తల్లిని సానుభూతితో పలకరించింది.

జిడ్డు చేత్తో తల్లి వీపుమీద తట్టి యిలా అంది:

“దిగులు పడ్డావా? పడకు! అతడిని పట్టుకుపోయారా? సరే. పట్టుకుపోనియ్యి! మనం సిగ్గుపడవలసిం దేమీలేదు. మునుపు దొంగతనాలు చేసినవాళ్లను ఖైదు చేసేవారు. ఈ రోజుల్లో న్యాయంతప్పని వాళ్లను ఖైదులోకి పంపుతున్నారు. పావెల్ చెప్పకూడని మాటలే చెప్పేడనుకో అయినా, వాటిని అందరికోసం చెప్పేడు. ఆ సంగతి అందరికీ తెలిసిందే. కనక నువ్వు బెంగపెట్టుకోకు. ఒకవేళ వాళ్లా సంగతి ఒప్పుకోకపోయినా, మంచేదో చెడ్డేదో ఎవరైనా చెప్తారు.... నేనే మీ యింటికొచ్చి నిన్ను చూసి పోదామనుకున్నాను. కాని తీరుబడి లేకపోయింది. రోజంతా వంటకాలు తయారుచెయ్యడం, అమ్మడంతో సరిపోతోంది. ఇంతా చేస్తే ఏమీ మిగలదు. నువ్వు చూస్తావుగా! ముష్టి ముండనై చస్తాను. అబ్బ! ఈ ప్రేమికుల గొడవొకటి. బొద్దింకలు రొట్టెను వాల్కమూలాలా కొరికేసినట్లు నా ఎముకలు కొరుక్కు తినేస్తున్నారు. ఏదో కష్టపడి నాలుగు రూకలు వెనకేసుకునేసరికి ఎవడో ముండాకొడుకొచ్చి ఆకాస్తా లాగేస్తాడు. ఏంచెప్పను. ఆడదై పుట్టడమే పాపం! ఈ

లోకంలో ఆడదై పుట్టడంకంటే అడవిలో మానై పుట్టడం మేలనుకో! ఒంటరిగా బ్రతకడం కష్టం — పోనీ అని ఒక మగవాడిని తెచ్చుకున్నావా — ఇక నీ పని ఆఖరే!''

పెలగేయా ఆమె సోదె కడ్డెళ్లింది:

''నన్ను సహాయకురాలిగా తీసుకోమని విన్నడగడాని కొచ్చాను.''

''అదేమిటి'' అని మార్యా ఆశ్చర్యపడింది. పెలగేయా వివరంగా సంగతులన్నీ చెప్పేసరికి మార్యా అంగీకరించింది.

''తప్పకుండా. నా మొగాడు నన్ను బాధపెడుతుంటే నువ్వు నన్నెంతగా కాపాడేదానవో నాకు జ్ఞాపకముంది. నువ్విప్పుడు ఆకలితో బాధపడకుండా నేను కాపాడతాను. నిజానికి నీకందరూ సాయంచేయాలి. అందరికోసమే కదా నీ కొడుకు జైలు కెళ్లింది! అతడు చాలా మంచివాడమ్మా! అందరూ ఆ మాటంటారు. అతని విషయంలో అందరూ విచారపడుతున్నారు.... నా మాట నమ్ము! ఈ అరెస్టులవల్ల యజమానులకేమీ లాభం కలగదు. ఫ్యాక్టరీలో ఏమి జరుగుతోందో చూడు. అంతా చెరుపేసమ్మా! పరుగెత్తే వాడి కొంకులు తెగ్గొడితే వాడు పరుగెత్తడం మానేస్తారనుకుంటారు. కాని జరిగేది మాత్రం వేరు. వాళ్లు పదిమందిని కొడితే, వాళ్లమీద నూరుమంది తిరగబడుతున్నారు!''

ఈ సంభాషణ పర్యవసానంగా మర్నాడు మధ్యాహ్నం, మార్యా తయారుచేసిన రెండు బుట్టల తినుబండారాలతో తల్లి ఫ్యాక్టరీకెళ్లింది. మార్యా బజారులో వ్యాపారం చేసుకోడానికి వెళ్లింది.

## 15

సరుకులు అమ్మకానికి తెచ్చిన కొత్త వ్యాపారస్తురాలిని కార్మికులు వెంటనే గుర్తుపట్టేశారు.

''వ్యాపారంలోకి దిగేవా, నీలొవ్నా?'' అని ఆమోదసూచకంగా తలలూపుతూ అడిగేరు.

కొందరు పావెల్‌ను తొందరలోనే విడుదల చేస్తారని ఆమెకు హామీ ఇచ్చారు. మరికొందరు తమ సానుభూతిని వ్యక్తపరిచారు. ఇంకా కొందరు డైరెక్టరునూ, పోలీసులనూ బండబూతులు తిట్టేరు. వాళ్లు బాగానే తిట్టేరన్నట్లనిపించింది తల్లికి. జరిగిన ఘనికి సంతృప్తితో ఆమెను చూసి పండ్లికిలించేవారు కూడా లేకపోలేదు. టైమ్ కీపరు ఇసాయ్ గొర్‌బోవ్, పళ్లు పటపట కొరికి ఇలా అన్నాడు:

''నేనే గవర్నరునైతేనా నీ కొడుకుని ఉరితీసేవాడిని! జనాన్ని తప్పు దారికి మళ్లించే వాళ్లకంతే శిక్ష!''

ఈ దుర్మార్గుని బెదరింపు ఆమెను నిశ్చేష్టురాలినిగా చేసింది. ఇసాయ్‌కి ఆమె బదులు

చెప్పలేదు. పుట్టుమచ్చలున్న అతని చిన్నముఖాన్ని ఒక్కసారి తేరిచూచి తల వంచుకుని ఒక నిట్టూర్పు విడిచింది.

ఫ్యాక్టరీ అంతా గంద్రగోళంగా ఉంది. కార్మికులందరూ చిన్నచిన్న గుంపులుగా చేరి గుసగుసలాడుకుంటున్నారు. మేస్త్రీలు ఆదుర్దాగా అటూ ఇటూ తిరుగుతున్నారు. మధ్య మధ్య తిట్లూ, వెటకారపు వకవకలూ వినబడుతున్నాయి.

ఇద్దరు పోలీసులు పవెల్‌ను ఆమె ముందరనుంచి తీసుకెడుతున్నారు. అతడొక చెయ్యి జేబులో పెట్టుకుని రెండో చేత్తో ఎర్రని తలవెంట్రుకలను వెనక్కి దువ్వుకుంటు న్నాడు.

మరొక వందమంది కార్మికులు పోలీసులను తిడుతూ, వేళాకోళంచేస్తూ వాళ్ల వెంట బడ్డారు.

"పవెల్! షికారెడుతున్నావా?" అన్నాడొకడు.

"ఈమధ్య వీళ్ల మనకెలాంటి గౌరవమర్యాదలు జరిపిస్తున్నారో!" అన్నాడింకొకడు. "మనం షికారు తిరుగుతుంటే మనకుతోడుగా కావలాదారులను పంపిస్తున్నారు."

అతను బండబూతులు తిట్టేడు.

"ఇక ముందు దొంగల్ని పట్టుకుంటే ఏమీ ప్రయోజనం లేనట్లు తోస్తుంది. కనుక నిజాయితీపరుల్ని పట్టుకోవడం మొదలెట్టారు!" అని ఒక పొడుగాటి ఒంటి కన్ను కార్మికుడు కేకేశాడు.

"అధమం రాత్రి వేళైనా పట్టుకుపోతే బాగుండేది. కాని, అదీలేదు. సిగ్గులేని ముండా కొడుకులు పట్టపగలే ఈ పని చేస్తున్నారు!" అన్నాడొకడు గుంపులోనుంచి.

పోలీసులు, ఈ తిట్లేమీ తమకు వినబడనట్లుగా, తామేమీ చూడనట్లుగా నటిస్తూ, చిరచిరలాడుతూ గబగబా ముందుకు సాగిపోతున్నారు. ముగ్గురు కార్మికులు ఒక పెద్ద లోహపు రేకును మోసుకుంటూ వారి కడ్డెళ్లేరు.

"ఏయ్, చేపలు పట్టేవాళ్లూ! దారివ్వండి" అని బిగ్గరగా అరిచారు.

పవెల్ తల్లిముందరగా వెడుతూ తలూపేడు.

"నన్ను లాక్కుపోతున్నారమ్మా!" అని నవ్వుగా నవ్వుతూ చెప్పేడు.

ఆమె నిశ్శబ్దంగా తలొంచింది. నిజాయితీపరులూ, నిదానస్థులూ అయిన ఈ యువ కులందరూ నవ్వుతూ సరదాగా జైలుకెళ్లడం ఆమె మాతృహృదయాన్ని ఎంతో స్పందింప చేసింది. వాళ్లంటే జాలి కలిగింది.

ఫ్యాక్టరీనుంచి తిరిగి రావడంతోనే ఆ రోజంతా ఆమె మార్యాతో కాలక్షేపం చేసింది. ఆమె చెప్పే సొదె అంతా వింటూ ఆమె చేస్తున్న పనికి తల్లి సాయపడింది. రాత్రి బాగా పొద్దు పోయాక, కళాహీనంగా, నిరుత్సాహపూరితంగా శూన్యంగా వున్న తన ఇంటికి చేరు

కుంది. చాలా సేపు ఏమి చేయాలో తోచక అశాంతితో లక్ష్యరహితంగా అటూ ఇటూ తిరిగింది. రాత్రి బాగా పొద్దుపోయినా యెగోర్ ఇవానొవిచ్ తెస్తానని చెప్పిన కరపత్రాలనింకా తీసుకు రానందుకు ఆమె చాలా ఆందోళన పడింది.

వెలవెలలాడే శరత్కాలపు మంచు పింజలు పింజలుగా పడుతోంది. అవి కిటికీ అద్దాల కంటుకుని కరిగి కిందకు జారిపోతున్నాయి. వాటి చారలు అద్దాలమీద కనబడుతున్నాయి. తల్లి కొడుకును గురించి ఆలోచించుకుంటోంది....

ఎవరో మెల్లగా తలుపు తట్టేరు. తల్లి గభాలున లేచి తలుపు గడియ తీసింది. సాషా లోపలికొచ్చింది. తల్లి ఆమెను చూచి చాలా కాలమైంది. చూడగానే ఆమె వికారంగా, లావెక్కినట్లు తల్లికి తోచింది.

"క్షేమంగా వున్నారా? మిమ్మల్ని చూచి చాలా కాలమైంది. ఏ వూరైనా వెళ్లేరా?" అని సాషాను పలకరించింది. ఈ రాత్రి కొంత సేపైనా తను ఒంటరిగా ఉండక్కర్లేదు కదా అని సంతుష్టి చెందింది.

"లేదమ్మా! నికొలాయ్ ఇవానొవిచ్‌తోబాటు నేను జైల్లో ఉన్నా, ఆయన మీకు గుర్తున్నారా?" అంది చిరునవ్వుతో.

"గుర్తులేకపోవడ మేమిటి! నిన్న యెగోర్ ఇవానొవిచ్ ఆయన్ని వదలిపెట్టేరని చెప్పేడు. మీ సంగతి నాకు తెలియలేదు. మీరు కూడా అందులో ఉన్నారని నాకెవ్వరూ చెప్పలేదే...." అని తల్లి ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది.

"చెప్పడాని కేముంది అందులో. యెగోర్ ఇవానొవిచ్ వచ్చేలోగా నేను బట్టలు మార్చుకోవాలి" అంది సాషా,

"మీరు బాగా తడిసిపోయారే!"

"కరపత్రాలూ, కాగితాలూ తెచ్చాను."

"ఏవి, ఇలాతే!" ఆత్రంగా అంది తల్లి.

ఆ అమ్మాయి కోటు బొత్తాములు విప్పి వదులు చేసి, ఒక్కసారిగా దులిపింది. చెట్టు మీదనుంచి ఆకులు రాలినట్లు కాగితాలు జలజల రాలేయి. నవ్వుకుంటూ తల్లి వాటి నన్నిటినీ ఏరింది.

"మిమ్మల్ని చూడగానే, ఏమిటూ ఇలా వికారంగా లావెక్కేరని ఆశ్చర్యపోయాను. పెళ్లి చేసుకున్నారు కాబోలు, గర్భిణితో ఉన్నారేమోననుకున్నాను. అయ్యో, అయ్యో ఎన్ని పట్టుకొచ్చారు! ఇంత దూరం నడిచే వచ్చారా?"

"అవును" అంది సాషా. మునుపటిలాగే ఆమె సన్నగా పొడుగ్గా ఉంది. కాని ఆమె బుగ్గలు గుంటలుపడినట్లు తల్లికి తోచింది. కండ్లు పెద్దవైనట్టుగా కనబడ్డాయి. కళ్లకింద నల్లటి గుండ్రమైన రేఖలగుపడ్డాయి.

"ఇప్పుడే జైలునుంచి విడుదలై వచ్చారు కదా, కొంచెం విశ్రాంతి తీసుకోరాదూ! అప్పుడే ఈ పని చేయకపోతేనేమి?" అని నిట్టూర్పు విడుస్తూ తల్లి అడిగింది.

"ఈ పని చేయక తప్పలేదు.... సరే కాని పావెల్ సంగతి చెప్పండి. అతని నరెస్టు చేసినప్పుడేమైనా కలవరపడ్డాడా?" అని తలొంచుకుని వణుకుతున్న వేళ్లతో జుట్టు సవరించుకుంటూ అడిగింది సాషా.

"లేదు. అంత సులువుగా లొంగిపోతాడా?" అని జవాబిచ్చింది తల్లి.

"అతని ఆరోగ్యం బాగానే ఉందికదా?" అని ఆ అమ్మాయి మెల్లిగా అంది.

"వాడు ఎప్పుడూ జబ్బు పడలేదు.... మీరలా వణుకుతున్నారేమిటి? కొంచెం టీ రాస్ప్‌బెర్రీ మురబ్బా ఇమ్మన్నారా?"

"ఇస్తే మంచిదే. కాని ఇంత రాత్రి వేళ మిమ్మల్ని శ్రమ పెట్టనా? నేనే చేసుకుంటానులెండి!"

"ఇంత అలసటపడి వచ్చిన మీరా?" అంటూ తల్లి సాషాను మందలించి వంటింట్లో కెళ్లి సమోవార్ అంటించింది. సాషా కూడా వంటింట్లోకెళ్లి చేతులను తలవెనకాల పెట్టుకుని బెంచీమీద కూర్చుంది.

"ఎన్ని చెప్పినా, జైలు మనిషిని నీరసింపచేస్తుంది. అబ్బ! దిక్కుమాలిన సోమరితనం! అంతకన్న అధ్వాన్నమైనదింకొకటి లేదు. చేయవలసిన పని ఇంత ఉన్నదని తెలిసి కూడా, అక్కడ బోనులోని జంతువులా ఉండడం మహా కష్టం!" అన్నది సాషా.

"ఇంతా చేస్తే మీకు కిరీటం పెట్టేదెవరు?" అని తల్లి నిట్టూర్పు విడిచింది. తనకు తానే ఇలా జవాబుచెప్పుకుంది: "ఎవరు మెచ్చి ఏమిస్తారు? భగవంతుడు తప్ప? మీకు భగవంతుడిమీద కూడా నమ్మకం లేదాయె!"

"లేదు" అని తలూపుతూ సాషా జవాబుచెప్పింది.

"అదెలాగ?" అంది తల్లి, అప్రయత్నంగా. తుండు గుడ్డతో చేతి మసిని తుడుచుకుంది. గాఢమైన విశ్వాసంతో ఇంకా ఇలా చెప్పింది: "మీ మతమేమిటో మీరు తెలుసుకోరు. దేవుడిమీద విశ్వాసం లేకుండా ఇలాటి జీవితమెలా సాగించగలుగుతున్నారు?"

ఇంతలో ఎవరో దబదబ అడుగులేస్తూ గొణుక్కుంటూ గుమ్మమెక్కిన చప్పుడైంది. తల్లి ఉలికి పడింది. సాషా కూడా చటుక్కున లేచింది. మెల్లగా తల్లి చెవిలో చెప్పింది:

"తలుపు తియ్యకండి. వచ్చింది పోలీసువాళ్లైతే మీరు నన్నెరగనని చెప్పండి. చీకట్లో నేను దారి తప్పి మీ ఇంటికి వచ్చాననీ, గుమ్మంలో స్పృహ తప్పి పడుంటే లోపలికి మీరు తీసుకొచ్చి, దుస్తులు వదులు చేస్తే కరపత్రాలు దొరికేయనీ చెప్పండి. తెలిసిందాండి?"

తల్లికి చాలా జాలి కలిగింది.

"అమ్మడూ! నేనెందుకలా చెప్పాలమ్మా?"

''ఒక్క క్షణమాగండి. ఆ వచ్చినది యెగోర్ కావచ్చు'' అని తలుపు దగ్గర చెవిపెట్టి ఆలకించింది.

వచ్చినవాడు యెగోర్. శరీరమంతా తడిసిపోయింది. అలసటచేత ఆయాసపడుతున్నాడు.

''ఓహో! సమొవార్ మరుగుతోందన్నమాటే! బాగుంది. అమ్మా! మనిషిని ఉత్సాహ పరచడానికి సమొవార్‌ని మించిన దింకొకటి లేదు. సాషా! అప్పుడే ఇక్కడకొచ్చావూ?''

అతడు నిర్విరామంగా మాట్లాడుతూ బరువైన కోటును నెమ్మదిగా విప్పేశాడు. అతని బొంగురు ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో వంటిల్లంతా నిండిపోయింది.

''అమ్మా, జైలు అధికారులకు ఈ పిల్లంటే గిట్టదు. జైలరు ఈమెపట్ల అగౌరవంగా ప్రవర్తించినప్పుడు, అతడు క్షమార్పణ చేసేవరకూ నిరశనదీక్ష పట్టింది. ఎనిమిది రోజుల వరకూ ఈమె ఏవిధమైన ఆహారాన్నీ ముట్టుకోలేదు. మాకిక దక్కదనే అనుకున్నాం. నా పొట్టలాంటి పొట్ట ఎక్కడైనా చూశారూ?''

అదే పనిగా అలా మాట్లాడుతూనే, అసహ్యంగా కిందకి వాలిపోతూన్న పొట్టను చేతులతో పట్టుకుని ఇంకో గదిలోకెళ్ళి తలుపు మూసుకుని అక్కడనుంచి కూడా ఏమేమిటో మాట్లాడాడు.

''నిజంగా మీరు ఎనిమిది రోజుల పాటు పచ్చిమంచినీళ్ళు కూడా తీసుకోకుండా ఉపవాసం చేశారా?'' అని ఆశ్చర్యంతో సాషా నడిగింది తల్లి.

''అతనిచేత క్షమార్పణ చెప్పించడానికి అలా చెయ్యక తప్పిందికాదు'' అని జవాబు చెప్పింది సాషా. ఆమె ఇంకా చలితో వణుకుతూనే ఉంది. ఆమె చెప్పే ధోరణిలో కొంత మొండి పట్టుదలా, పెంకెతనం తల్లికి గోచరించాయి.

''బలే పిల్లే!'' అని లోపల అనుకుని ''మరి చచ్చిపోతేనో?'' అని బిగ్గరగా అడిగింది.

''పోతే పోవలసిందే. వేరే శరణ్యం లేదు.... కాని అతడు క్షమార్పణ చెప్పకున్నాడు. లోకువ కట్టేందుకు మనుషులకు అవకాశమివ్వకూడదు'' అని ఆ పిల్ల మెల్లగా చెప్పింది.

''హుం, అంతే! బతికున్నంత కాలం ఆడవాళ్లను లోకువ చేయడమే.''

యెగోర్ తలుపు తోసుకుని లోపలికొచ్చాడు.

''నా బరువు వదుల్చుకున్నాను.... సమొవార్ సిద్ధంగా వుందా? ఇదిగో! దాన్ని నేను లోపలికి తీసుకొస్తాను'' అంటూ పక్క గదిలోకి పట్టుకెళ్ళి ఇలా చెప్పేడు:

''మా నాన్న రోజుకి ఇరవై గ్లాసులైనా టీ తాగేవాడు. దాని పుణ్యమా అని ఆయన ఆరోగ్యంగా ప్రశాంతంగా డెబ్బై మూడేళ్లు బతికేడు. ఖచ్చితంగా 288 పౌనులు బరువుండే వాడు. వాస్క్రెసేన్‌స్కాయే పల్లెలో మతగురువుగా ఉండేవాడు....''

''ఏమిటీ? మీరు ఫాదరీ ఇవాన్ కొమాళ్లా?'' అని తల్లి ఆశ్చర్యంతో అడిగింది.

''అవును. మా నాయనగారిని మీరెరుగుదురా?''

''నాదీ వాస్క్రెసేన్‌స్కాయే!''

''ఏమిటి మీరు మావూరి వారే? ఎవరండీ మీ తండ్రిగారు?''

''మీ పక్కింటి పెర్ఫ్యోగిన్ కూతురునే!''

''అలాగా! అంటే కుంటి పిల్‌గారి కొమార్తెలా? ఆయన్ని నేను బాగా ఎరుగుదును. ఎన్ని సార్లాయన నా చెవి మెలి పెట్టాడో!''

ఒకరికొకరు ఎదురుగా నిలబడి, నవ్వుకుంటూ సవాలక్ష ప్రశ్నలేసుకున్నారు. టీ కాస్తూ సాషా చిరునవ్వు నవ్వింది. టీ గ్లాసుల చప్పుడుతో తల్లి స్పృహలో కొచ్చింది.

''క్షమించండి. నేను సమస్తం మరచిపోయాను. స్వంత ఊరు మనిషి కనబడితే ఎంత సంతోషం కలుగుతుందో మీకు తెలిసిందే కదా!'' అంది ఆమె సాషాతో.

''మీరే నన్ను క్షమించాలి. ఈ పనిని నేనే నామీద వేసుకున్నాను. అప్పుడే పదకొండైంది. నేనింకా చాలా దూరం నడిచిపోవాలి.

''ఇప్పుడెక్కడికి? పట్టణానికే?''

''అవును.''

''ఇప్పుడెళ్లకపోతేనేం? బయట బాగా చీకటిగా, చలిగా ఉంది. పైగా మీరు బాగా అలిసిపోయి ఉన్నారు. ఈ రాత్రి ఇక్కడే పడుకోండి. యెగోర్ ఇవానొవిచ్ వంటింట్లో పడుకుంటారు. మీరూ నేనూ ఇక్కడ పడుకుందాం.''

''వీల్లేదు. నేను వెళ్లి తీరాలి'' అంది సాషా.

''దురదృష్టవశాత్తూ ఆ అమ్మాయి వెళ్లక తప్పదమ్మా! ఇక్కడ ఆమెనందరూ ఎరుగుదురు. రేపు ఈ వీధులలో ఆమె కనబడ్డం అంత మంచిది కాదు.''

''ఎలా వెళ్తుంది? ఒంటరిగానే?''

''ఆహా! ఒంటరిగానే'' అన్నాడు యెగోర్ చిరునవ్వుతో.

సాషా నల్ల రొట్టె ముక్కమీద ఉప్పు చల్లుకుని తింటూ, ఒక గ్లాసునిండా టీ పోసుకుంది. ఆలోచనా నిమగ్నురాలై తల్లికేసి చూచింది.

''మీరూ, నతాషా ఈ పనెల్లా చేస్తారోగాని! నేనావని చెయ్యాలంటే భయమేస్తుంది'' అంది తల్లి.

''ఆమెకూ భయమే! అంతేనా సాషా?'' అన్నాడు యెగోర్.

''నిజమే భయమే'' అని జవాబుచెప్పింది సాషా.

తల్లి ఆమెకేసీ, యెగోర్‌కేసీ చూసింది.

''ఎంత కఠినులు మీరు!'' అని ఆశ్చర్యపడింది.

టీ తాగడంతోనే సాషా నిశ్శబ్దంగా యెగోర్‌తో కరచాలనం చేసి వంటింట్లో కెళ్లింది. తల్లి కూడా ఆమెవెంట వెళ్లింది.

“మీరు పావెల్‌ను చూస్తే, నేను అతన్ని చాలా చాలా అడిగానని చెప్పండి. మరచి పోకండి సుమా!” అంది సాషా.

తలుపుగడియమీద చేయి వేసి ఆమె చటుక్కున వెనక్కు తిరిగి: “మిమ్మల్నొక సారి ముద్దు పెట్టుకునేదా?” అని అడిగింది.

తల్లి మౌనంగా ఆమెను కౌగిలించుకుని ఆప్యాయతతో ముద్దు పెట్టుకుంది.

సాషా తల్లికి నమస్కారం చెప్పి శలవు తీసుకుని వెళ్ళిపోయింది.

సాషాను పంపించి తల్లి గదిలోకొచ్చి ఆదుర్దాగా కిటికీలోనుంచి బయటకు దృష్టి సారించింది. చీకట్లో మంచు దూది పింజల మాదిరిగా రాలుతోంది.

“ప్రోజొరొవ్‌లు జ్ఞాపకమున్నారా?” అని యెగోర్ అడిగేడు.

అతడు కాళ్ళు వంగజాపుకుని కూర్చుని నోటితో శబ్దం చేస్తూ టీని ఊదుకుంటున్నాడు. ముఖం ఎర్రగా, చిరుచెమటతో సంతృప్తిసూచకంగా ఉంది.

“ఆ! జ్ఞాపకముంది” అని తల్లి ఆలోచిస్తూ బల్ల దగ్గరగా వెళ్ళి చెప్పింది. ఆమె విచారంగా యెగోర్‌కేసి చూస్తూ కూచుంది.

“అయ్యయ్యో! ఆ సాషా! పట్టణానికి ఎప్పటికి చేరుకోగలుగుతుంది?”

“నిజమే. ఆమె చాలా అలసిపోయింది.... జైలుజీవితం ఆమెకేమీ మంచి చేయలేదు. ఇదివరకింకా బలంగా ఉండేది. పైగా ఆమె సుకుమారంగా పెరిగింది.... ఆమె ఊపిరితిత్తులలో చిన్న మచ్చ పడినట్లే ఉంది.”

“ఇంతకూ ఆమె ఎవరు?”

“ఒక పల్లెటూరి భూస్వామి కూతురు. ఆమె చెప్పేమాటల ప్రకారమైతే అతడొక పంది.... వీళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవాలనుకున్నారు. ఆ సంగతి మీకు తెలుసా?”

“ఎవరిద్దరూ?”

“ఆమె, పావెల్. కాని అదేమీ సందర్భపడలేదు. అతడు బయట ఉంటే ఆమె జైల్లో ఉంటోంది. ఆమె బయటకొస్తే అతడు జైల్లో ఉంటున్నాడు.”

“నాకేమీ తెలియదే” అంటూ తల్లి ఒక క్షణమాగి, “పావెల్ తన స్వవిషయాన్ని గురించి నాతో ప్రస్తావించడు” అంది.

ఈ సంగతి తెలిశాక, తల్లికి ఆ పిల్లమీద మరింత జాలి కలిగింది. అతిథిపై అప్రయత్నంగా కలిగిన కోపంతో అతనివైపు తిరిగి:

“మీరామెను ఇంటిదాకా ఎందుకు దిగబెట్టలేదు?” అని అడిగింది.

“నాకు వీలు లేకపోయింది. ఈ పేటలో నేను చేయవలసిన పని చాలా ఉంది. రేపు పొద్దుటినుంచి సాయంత్రం దాకా నేను అక్కడికీ ఇక్కడికీ తిరగాలి. నాలాగ ఆయాసపడే మనిషికి ఆ పని అంత తేలికైనది కాదు.”

"ఆ అమ్మాయి మంచిది" అన్నది తల్లి. యెగోర్ ఇప్పుడే చెప్పిన విషయాన్ని గురించి ఆలోచనలో మునిగింది. ఇటువంటి విషయాన్ని తను తన కొడుకు ద్వారా కాకుండా పరాయివాడిద్వారా తెలుసుకున్నందుకు ఆమెకు కష్టం తోచింది. రోషంతో పెదవులు కొరుక్కుంది.

"అవును. మంచిదే.... మీకామెపట్ల జాలి కలుగుతోందని నాకు తెలుస్తూనే ఉంది. కాని అందువల్ల ఏమీ ప్రయోజనం లేదు.... మాలాటి విప్లవకారులను గురించి జాలి పడడం ప్రారంభిస్తే, మీ గుండె పగిలిపోతుంది. నిజం చెప్పాలంటే, మా జీవితాలకు సుఖం అంటూ ఉండదు. మా స్నేహితుడొకడు ఈ మధ్యనే ప్రవాసంనుంచి తిరిగి వచ్చాడు. అతడు నిజ్నీ నోవ్‌గొరొద్ చేరేసరికి అతని భార్యా, పిల్లా స్మొలేన్‌స్క్ దగ్గర అతడికోసం కని పెట్టుకు కూచున్నారు. తీరా అతడు స్మొలేన్‌స్క్ చేరేసరికి భార్యనీ, బిడ్డనూ మాస్కో జైలుకు తీసుకుపోయారు. ఈ సారి సైబీరియా ప్రవాసం భార్య వంతు. నాక్కూడా భార్య ఉండేది. అద్భుతమైన మనిషి. అయిదేళ్లపాటు అలాటి జీవితాన్నే గడిపేసరికి ఆమెకు గోరీ కట్టవలసొచ్చింది."

యెగోర్ ఒక్క గుటకలో టీ తాగేసి తన కథను సాగించాడు. తను ఎన్నేళ్లు, ఎన్ని నెలలు జైలు శిక్షలనుభవించాడో తల్లికి వివరంగా చెప్పేడు. ఎంతకాలం ప్రవాసంలో ఉన్నాడో వివరించాడు. జైళ్లలో పడ్డ కష్టాలనూ, తిన్న దెబ్బలనూ విశదంగా తెలియజేశాడు. సైబీరియాలో ఆకలి బాధతో పడిన కడగండ్లన్నిటినీ చెప్పేడు. ఇంతటి కష్టభూయిష్ఠమైన కథను యెగోర్ ఏమీ తొణుకూ బెణుకూ లేకుండా అతి సామాన్య సంగతిగా చెపుతుంటే తల్లి ఆశ్చర్యంగా అతడికేసి చూస్తోంది.

చటుక్కున అతడు:

"ఇక మన పనిలో కొద్దాం" అన్నాడు.

అతని గొంతుక మారిపోయింది. ముఖం చాలా తీవ్రస్వరూపం దాల్చింది. కరపత్రాలను ఆమె ఫ్యాక్టరీలోకెలా పట్టుకెళ్లాలనుకుంటున్నదో చెప్పమన్నాడు. అతనికి ఇన్ని వివరాలు ఎట్లా తెలుసునాయని తల్లి ఆశ్చర్యపడింది.

ఆ విషయాన్ని గురించి చర్చించడం పూర్తయాక, మళ్లీ వాళ్లిద్దరూ తమ జన్మ స్థలమైన పల్లె గురించి మాట్లాడుకున్నారు. అతని మాటలన్నీ హాస్యధోరణిలో నడుస్తున్నాయి. ఆమె తన గతజీవితాన్ని గురించి ఆలోచనా నిమగ్నురాలైంది. తన జీవితం గున్న దేవదారు చెట్లూ, తెల్లని భూర్జ వృక్షాలూ, చలవ్రత వృక్షాలూ మొలిచిన బాడవలా తోచింది. భూర్జ వృక్షాలు తాపీగా ఎదిగి, అయిదేండ్లయే సరికి బురదలో పడి కుళ్లిపోతాయి. ఈ దృశ్యం కళ్లకు కట్టినట్లయేసరికి, ఆమె హృదయంలో అపారమైన జాలి కలిగింది. ఇంతలో మరొక దృశ్యం ఆమె మనోనేత్రానికి గోచరించింది. ఒక చురుకైన పడుచు పిల్ల, గట్టి

పట్టుదలగల పిల్ల, తడితడిగా ఉండే మంచు పొరల్లోనుంచి దారిచేసుకుంటూ ఒంటరిగా ప్రయాణపడుతూ ముందుకు పోతోంది.... తన కొడుకు జైల్లో ఉన్నాడు. బహుశా ఆత డింకా నిద్రపోయి ఉండడు. పడుకుని ఆలోచిస్తూ వుంటాడు.... కాని తల్లిని గురించి కాదు. ఇప్పుడతనికి అంతకన్న ఆప్యాయమైనదున్నది కదా! గాలికి చెదిరే మేఘాలలాగున బాధాకరమైన ఆలోచనలు ఆమె హృదయాన్ని చీకటితో కమ్మేశాయి....

యెగోర్ నవ్వు ముఖంతో:

"అమ్మా! మీరు చాలా అలసిపోయారు. ఇక పడుకుందాం" అన్నాడు.

ఆమె యెగోర్‌కు శలవు చెప్పి మెల్లగా వంటింట్లోకి వెళ్లిపోయింది. తన కొడుకు తన ప్రేమ విషయాన్ని తనకు చెప్పకుండా దాచిపెట్టినందుకు ఆమె హృదయం చాలా రోషపూరితమైంది.

మర్నాడు ఉదయం చద్ది భోజనం చేస్తూ యెగోర్ ఇలా అడిగేడు:

"వాళ్లు మిమ్మల్ని పట్టుకుని ఈ విప్లవ కరపత్రాలన్నీ మీకెక్కడనుంచి వచ్చాయని అడిగితే ఏం చెప్తారు?"

"అది మీ పని కాదంటాను" అని జవాబుచెప్పింది.

"మీరు చెప్పేమాటకు వాళ్లొప్పుకోరనుకుంటాను. ఆ పని వాళ్లదేనని వాళ్ల గట్టి నమ్మకం. వాళ్లు ఆ విషయంలో మిమ్మల్ని వదలిపెట్టకుండా గుచ్చిగుచ్చి అడుగుతారు."

"అడగనివ్వండి, నేనేమీ చెప్పను."

"అప్పుడు మిమ్మల్ని జైల్లో పెడతారు."

"పెడితే పెట్టనియ్యండి. మరీ సంతోషం. దేవుడికి దణ్ణం పెడతాను. అంటే, నేనందుకు పని కొస్తానన్నమాటే కదా?" అని నిట్టూర్పు విడిచింది. "నేనెవరికా్కవాలి? ఎవరికీ పనికి రాను.... నన్ను హింస పెడతారనుకోను...." అంది.

"హూం!..." అంటూ యెగోర్ తల్లికేసి తీక్షణంగా చూశాడు. "లేదమ్మా! మిమ్మల్ని హింస పెట్టరు. కాని మంచివాళ్లు కొందరు అవసరానికి అలా దూరంగా ఉండాలి."

తల్లి చిన్ననవ్వు నవ్వి,

"మీరు మంచివారు. కనుక ఆ మాటంటున్నారు" అంది.

యెగోర్ జవాబుచెప్పకుండా గదిలో అటూ ఇటూ పచార్లు చేశాడు. తర్వాత ఆమె దగ్గరకెళ్లి,

"అమ్మా! చాలా కష్టం. మీరెంత కష్టపడుతున్నారో నేనెరుగుదును" అన్నాడు.

"నాకే అన్న మాటేమిటి? అందరికీ కష్టమే.... కాకపోతే, ఈ సంగతులన్నీ బాగా ఎరిగిన వారికి కొంచెం తేలిక కావచ్చు. అయితే, నేనూ మెల్లమెల్లగా, మంచివాళ్లంతా ఏమి చెయ్యడానికి ప్రయత్నం చేస్తున్నారో తెలుసుకోవడం మొదలెట్టేను."

"ఆ సంగతి తెలుసుకుంటే, మీ అవసరం అందరికీ ఉంది. అమ్మా! అందరికీ!" అని యెగోర్ ఎంతో మనఃపూర్వకంగా చెప్పేడు. తల్లి అతనికేసి చూసి నవ్వింది.

మధ్యాహ్నం ఫ్యాక్టరీ కెళ్ళడానికి తల్లి తయారైంది. కరపత్రాలను పైకేమీ కన బడకుండా భద్రంగా పేర్చుకుంది. యెగోర్ ఆమె పేర్పును పరిశీలించి ఆ నేర్పుకు సంతో షించి "శబాష్" అన్నాడు.

"అమ్మా! కరపత్రాలు మీలో మార్పు కలిగించలేదు. నడి వయస్సులో ఉన్న పొడుగు పాటి స్త్రీ అచ్చంగా ఎలా ఉంటుందో అలాగే ఉన్నారు. కొంచెం లావెక్కుతున్న మని షిలా ఉన్నారు. అసంఖ్యాకమైన దేవుళ్ళ మీ ప్రథమ ప్రయత్నాన్ని ఆశీర్వదించెదరు గాక!"

ఒక అరగంటైన తర్వాత, ఆమె ఫ్యాక్టరీ గేటు దగ్గర ప్రశాంతంగా ధైర్యంగా నిలబడింది. తినుబండారాల బుట్టల బరువులో కొంచెం ముందుకు వంగింది. ఆ ఆవరణలోకి ప్రవేశించే వాళ్ళనందరినీ, ఇద్దరు కాపలాదారులు మోటుగా చేతుల్తో తడుముతూ సోదా చేస్తున్నారు. సోదాకు గురియైన కార్మికులు కావలా వాళ్ళకు ప్రతిఫలంగా తిట్లను కురిపి స్తున్నారు. ఒక పక్కగా పోలీసు నిలబడ్డాడు. అతని పక్కనే పొడుగాటి కాళ్ళూ ఎర్రని ముఖం గల ఒకడు తీక్షణమైన చూపులు చూస్తూ నిలబడ్డాడు. తల్లి తన కావడిని భుజం మార్చుకుని పొడుగు కాళ్ల వాడిని చూసీ చూడనట్లుగా పరిశీలించింది. అతడు గూఢచారి యని ఆమెకు స్ఫురించింది.

"దెయ్యాల్లారా! మా జేబుల్లో ఏముంది? తల తడిమి చూడండి" అని ఒక ఉంగ రాల జుట్టుకార్మికుడు తన బట్టలను తడుముతున్న కాపలాదారులను మందలించాడు.

"నీ తలలో ఏముంటుంది? పేలు తప్ప!" అని కాపలాదారు బదులు చెప్పేడు.

"అయితే, మమ్మల్ని వదిలేసి పేలనే పట్టుకోండి" అని కార్మికుడు తిరగేశాడు.

గూఢచారి అతడికేసి బాణంలా చూసి చిరాకుగా ఉమ్మేశాడు.

"నన్ను వదలిపెట్టండి. కావడి బరువుతో నా నడుం విరిగిపోయేటట్లుంది. చూడ్డం లేదూ?" అంది తల్లి.

"సరే. పో! పో! నువ్వేమీ చదవక్కర్లేదు చదువు!" అని కాపలాదారు చిరు బుర్రు మన్నాడు.

తల్లి తినుబండారాలమ్మే చోటుకెళ్లి బుట్టలను నేలమీద పర్చుకుంది. ముఖంమీది చెమటను తుడుచుకుని నాలుగు మూలలా చూసింది.

మెకానిక్‌లుగా పనిచేస్తుండే గూసెవ్ సోదరులు ఆమెను సమీపించారు.

"ఏమైనా 'పిరోగీ' బజ్జీ ఉందా?" అని వాళ్లలో పెద్దవాడైన వసీలియ్ బొమలు ముడిచి అడిగేడు.

"రేపు తెస్తాను" అని తల్లి జవాబిచ్చింది. ఇదొక సంకేతం. ఆ సోదరుల ముఖాలు వికసించాయి.

''మహా బాగా ఉంది!'' అన్నాడు సంతోషంతో ఇవాన్.

బుట్టలో ఏముందో చూడ్డానికి వసీలియ్ బుట్టమీదకు వంగేడు. ఆ క్షణంలో కరపత్రాల కట్ట ఒకటి అతని చొక్కాలో కెళ్ళిపోయింది.

''ఇవాన్! మనం ఈ పూట ఇంటికెళ్ళద్దు. ఈమె దగ్గర భోజనం కొనుక్కుందాం. కొత్తగా భోజన సామగ్రి అమ్మదెచ్చినావిడకు సహాయం చెయ్యాలి'' అని సోదరునితో బిగ్గరగా చెప్పేడు. ఈ మాటలు చెపుతూనే ఇంకొక కాగితాల బొత్తిని బూట్లలోకి దోపేశాడు.

ఇవాన్ నవ్వుతూ ''తప్పకుండా'' అన్నాడు.

తల్లి జాగ్రత్తగా నాలుగు మూలలా దృష్టి సారించింది.

''పులుసుపోయమ్మ పులుసు!... వేడి వేడి సేమ్యా'' అని కేకలు వేసింది.

అలా అరుస్తూనే బొత్తులు బొత్తులుగా కరపత్రాలు తీసి క్రామేద్సుకందిచ్చింది. ఒక్కొక్క కట్టే తీసి అందిస్తుంటే, ఆమె కళ్ళ ఎదుట పోలీసాఫీసరు పసుపు పచ్చటి ముఖం, అగ్గి పుల్ల గీయడంతోనే గుప్పుమన్నట్లగుపించేది. ''ఇదుగో తీసుకో.... ఇంకొకటి.... మరొకటి!'' అంటూ సంతోషంతో అందిచ్చింది.

పనివాళ్ళంతా గిన్నెలు చేత్తో పుచ్చుకుని రావడం మొదలెట్టేరు. ఒకడు దగ్గర కొచ్చేసరికి, ఇవాన్ గూసెవ్ బిగ్గరగా నవ్వడం ప్రారంభించేవాడు. తల్లి తొణుకూ బెణుకూ లేకుండా, కరపత్రాలనందివ్వడం మానేసి, తినుబండారాలకేసి దృష్టి మళ్ళించేది.

''భలే హస్త లాఘవం కలదానివమ్మా, నీలోవ్నా!'' అంటూ గూసెవ్ సోదరులు నవ్వుకున్నారు.

పక్కనే నిలబడి ఉన్న ఒక బొగ్గు పనివాడు విచారంగా ఇలా అన్నాడు:

''లేమి ఆమెనీ పని చేయిస్తోంది. లంజకొడుకులు! అన్నం పెట్టే కొడుకును కాస్తా పట్టుకుపోయారు. నాకో మూడు కోపెక్కులకి సేమ్యా ఇయ్యమ్మా! మరేమీ ఫర్వా లేదమ్మా! బెంగపెట్టుకోకు. నీకెలాగో గడచిపోతుందిలే!''

''దయతో చెప్పిన మాటలకు సంతోషం'' అంది చిరునవ్వుతో తల్లి.

''కాసిని మంచి మాటలు చెప్పడానికి ఖర్చేమవుతుందమ్మా'' అంటూ అతను వెళ్ళిపోయాడు.

''వేడి వేడి పులుసు! వేడి వేడి సేమ్యా!'' అని తల్లి అరిచింది.

కరపత్రాలు పంచే విషయంలో తాను సంపాదించిన మొదటి అనుభవాన్ని తన కొడుకుకెలా చెప్పాలా అని ఆలోచనలో పడింది. కాని పోలీసు ఆఫీసరు ధుమధుమలాడే పసుపు పచ్చని ముఖం మాత్రం ఆమె కళ్ళకు కట్టినట్లుంది. ఆశ్చర్య చకితుడై అతడు తన నల్లని మీసాన్ని వడేస్తున్నట్లే ఉంది. బిగబట్టిన దంతాల తెల్లనికాంతులు పెదవులమీదనుండి

ప్రవహిస్తున్నాయా అనిపించింది. సంతోషాతిశయంచేత ఆమె హృదయం పిట్టలా కూస్తోంది. కనుబొమలు తిప్పుకుంటూ "తీసుకో.... ఇంకొకటి తీసుకో!" అని పోలీసు ఆఫీసర్ని తానొక చరుపు చరుస్తున్నట్లు ఆమె మనసులోనే ఊహించుకుంది.

## 16

సాయంకాలం తల్లి టీ తాగుతోంది. బయట బురదలో తపతప తొక్కుతూన్న డెక్కల చప్పుడు వినబడింది. ఎరిగున్న కంఠస్వరం చెవిని పడింది. ఆమె చటుక్కున లేచి వంటిం ట్లోంచి వీధి గుమ్మం దగ్గరకు పరుగెత్తింది. గుమ్మం ముందు గబగబా అడుగుల చప్పుడైంది. ఆమెకు కళ్లు చీకట్లు కమ్మేయి. పాదంతో తలుపు తోసి, గుమ్మాని కాను కుంది.

"నమస్కారం, మామ్మా!" అంటూ పరిచయమైన కంఠస్వరం పలుకరించింది. సన్నని పొడుగాటి చేతులు ఆమె భుజాలపైన వాలాయి.

ఆమెకు మొదట్లో ఆశాభంగం అయింది. అన్ద్రేయ్‌ని చూడ్డంతోనే ఆనందభరితు రాలైంది. ఈ రెండు భావాలూ సమ్మిళితమై, మహోన్నతమైన ఉద్వేగాన్ని రేకెత్తించాయి. ఆమె ఆనంద పరవశురాలై అన్ద్రేయ్ భుజంమీద తన ముఖాన్ని ఆన్చింది. అతడు కంపిస్తున్న చేతుల్తో ఆమెను గట్టిగా పట్టుకున్నాడు. తల్లి మెల్లగా ఏడ్చింది. అతడామె జుట్టును నిమురుతూ, మధురమైన స్వరంతో ఇలా అన్నాడు:

"మామ్మా! ఏడవకండి. మనస్సు కష్టపెట్టుకోకండి. తప్పకుండా అతన్ని త్వరలోనే వాళ్లు విడుదల చేస్తారు. అతనిమీద ఏ నేరమూ రుజువు చేయలేకపోయారు. అందరూ కూడా ఉడక పెట్టిన చేపల్లా నోరు మూసుకున్నారు."

భుజంమీద చెయ్యి వేసి, అతడామెను పక్క గదిలోకి తీసుకెళ్లేడు. అతడు చెప్పిన మాటలనెంతో ఆసక్తితో వింటూ అతనికి మరింత దగ్గరగా జరిగింది. త్వరత్వరగా కన్నీళ్లను తుడిచేసుకుంది.

"పావెల్ మీకు నమస్కారాలు చెప్పమన్నాడు. అతడు ఎంత కులాసాగా ఉండాలో అంత కులాసాగానూ ఉన్నాడు. అక్కడ చాలా ఇరుకుగా ఉంది. వాళ్లు సుమారు ఒక వందమందిని మన పేటవాళ్లనూ, పట్టణంవాళ్లనూ పట్టుకుని, కొట్టుకి ముగ్గురిని నలుగురిని చొప్పున కుక్కి తాళం వేశారు. జైలు అధికారులు మంచివాళ్లే. పోలీసు దయ్యాలు కల్పించిన ఈ పనితో వాళ్లు నలిగి నున్నమైపోతున్నారు. పెద్ద ఉద్యోగులు ఏమంత కఠినంగా ఉండరు. 'బాబూ! మా పీకలమీదకేమీ తేకుండా నెమ్మదిగా ఉండండి' అంటూ ఉంటారు. అంతా చక్కగా కాలక్షేపమైపోతోంది. మాట్లాడుకుంటారు, ఒకళ్ల పుస్తకాలు ఇంకొకరు మార్చు

కుంటారు. తమకు అందిన భోజన పదార్థాలు పంచుకుంటారు. పాతదైన ఆ జైలు, అపరిశుభ్రంగా ఉన్నా, బాగానే ఉంది. మనుషుల కంత కష్టముండదు. మామూలు నేరస్థులైన ఖైదీలు కూడా చాలా మంచివాళ్లు. మన వాళ్లకెంతో సాయపడుతూ ఉంటారు. నన్ను, బూకిన్‌నీ, మరి నలుగురినీ విడుదల చేశారు. పావెల్ వంతు కూడా త్వరలోనే వస్తుంది. వెసొవ్‌శ్చికోవ్‌ను ఆఖరున విడుదలచేస్తారు. వాళ్లని నోటికొచ్చినట్లు తిడతాడు. కనుక, వాళ్లంతా అతనిమీద విరుచుకుపడుతుంటారు. పోలీసులతన్ని చూసేసరికి మండిపడతారు. అతడిని విచారణకు హాజరుపెడతారో, లేదా ఎప్పుడో చూసి చితకబాదుతారో. పావెల్ అతన్ని నిదానంగా ఉండమని పదేపదే చెప్తూంటాడు. తిట్టినంత మాత్రాన వాళ్లు బాగుపడరంటాడు. కాని అతడు వినిపించుకోడు. 'పుండుమీద చర్మాన్ని వలిచేసినట్లుగా వాళ్లనీ భూమి మీదనుంచి తొలగిస్తా!' నంటూ అరుస్తాడు. పావెల్ నడవడి బాగుంటుంది. దృఢంగానూ నిదానంగానూ ఉంటాడు. అతన్ని త్వరలో విడుదల చేస్తారనడానికేమీ సందేహంలేదు.''

''త్వరలో విడుదల చేస్తారనడానికేమీ సందేహం లేదు'' అని అతడన్న మాటను చిరునవ్వుతో రెట్టించింది తల్లి.

''అప్పుడన్నీ సద్దుకుపోతాయి. సరే గాని నాకొక గ్లాసు టీ ఇవ్వండి. తర్వాత మీ సంగతి. మీరెలా కాలక్షేపం చేస్తున్నారో చెప్పండి.''

అన్‌ద్రేయ్‌కి ఆమె ఒళ్లంతా నోరై చిరునవ్వు నవ్వుతున్నట్లనిపించింది. విచారకరమైన ఆమె కళ్లలో ప్రేమపూరితమైన వెలుగు ద్యోతకమైంది. తల్లి పలుచబారిన అతని ముఖాన్నీ, నల్లగా గుబురుగా పెరిగిన పిచ్చి గడ్డాన్నీ తదేక దృష్టితో పరిశీలిస్తూ నిట్టూర్పు విడిచింది.

''అన్‌ద్ర్యూషా! మీమీద నాకెంతో ఆప్యాయత కలుగుతోంది'' అంది.

''నన్ను ఆనందింప చేయడానికి కొంచెం చాలమ్మా! మీ హృదయం అందరినీ ప్రేమించడానికి తగినంత విశాలమైనది'' అని కుర్చీలో కూచుని ముందుకూ వెనక్కూ ఊగేడు.

''అలాకాదు. మీమీద నా కెక్కువ ప్రేమ.... మీ అమ్మ ఉంటే, మీలాటి కొడుకున్నందుకు ఆమెను చూసి అందరూ ఈర్ష్యపడేవాళ్లే'' అంది తల్లి.

హొహోల్ తలూపేడు. రెండు చేతుల్తో గబగబా తల రుద్దుకుని మెల్లని కంఠస్వరంతో:

''ఎక్కడో అక్కడ నా కొక తల్లి ఉందికదా!'' అన్నాడు.

''ఈ వేళ నేనేం చేశానో చెప్పనా'' అంటూ చిత్రంగా ప్రారంభించి, ఆ రోజున తాను ఫ్యాక్టరీలోకి కరపత్రాలనెలా తీసుకెళ్లినదీ విపులంగా — కొద్దిగా అతిశయోక్తులతో — చెప్పసాగింది.

మొదట్లో అతడు కొంచెం ఆశ్చర్యచకితుడై కళ్లు పెద్దవి చేసి చూశాడు. పిమ్మట పెద్ద నవ్వు నవ్వేడు.

"అబ్బో! ఇది తేలిగ్గా తీసేయవలసిన సంగతి కాదే! ఇది గొప్ప పని! పావెల్ పరమానందభరితుడైపోతాడు సుమా? పావెల్‌కే కాదు.... అందరికీ కూడా.... అద్భుతం! మామ్మా! అద్భుతం!"

హొహోల్ వెనక్కీ ముందుకూ ఊగేడు. మెటికలు విరిచి సంతోషం ఉట్టిపడేట్లు ఈలవేశాడు. ఆ సంతోషం తల్లిని కూడా ఆనందభరితురాలిని చేసింది. ఆమె హృదయ కవాటం ఒక్కసారిగా తెరుచుకుని మాటలు ప్రవాహవేగంగా వెలువడ్డాయి. ప్రశాంతమైన సంతోషం వెల్లివిరిసింది.

"అన్‌ద్ర్యూషా! మీకు శుభమగుగాక! నేను నా జీవితాన్ని గురించి ఆలోచించుకున్నప్పుడల్లా – దయాళువైన జీసస్ ప్రభూ – నేనెందుకోసం జీవించి ఉన్నాను? అనిపిస్తూ వుంటుంది. బండ చాకిరి, దెబ్బలు: ఇంతే గదా! నా భర్తను తప్ప నేనెవ్వరినీ కన్నెత్తి చూడలేదు! భయం తప్ప మరేమీ ఎరగను! పావెల్ ఎలా పెరిగి పెద్దవాడయాడో కూడా నాకు గుర్తులేదు. నా భర్త బతికున్నంతవరకూ, పావెల్‌ను నేను ప్రేమించానో లేదో కూడా నాకు తెలియదు. ఏరోజూ నాకుండే ఆలోచనా, ఆత్రతా ఒక్కటే: పశుప్రాయుడైన నా భర్తకు బాగా మెక్కపెట్టడం, ఆ పిమ్మట తడవేది లేకుండా అతడేమి చేయమంటే అది చేయడం. కోపమొచ్చి నన్ను కొట్టకుండా చూసుకోవడం. ఒక్కసారైనా నామీద జాలి పడతాడేమోనని నా కోరిక. కాని అతనికెప్పుడూ నామీద జాలి కలిగిందన్న జ్ఞాపకం నాకు లేదు. నేనతని భార్యను కానట్లూ, ఎవరో తనకు బాగా కసిగా ఉన్న వాళ్లకు మల్లే చావబాదేవాడు. ఇరవై ఏళ్ళు అలా జీవించాను. పెళ్లికిముందు నేనెలా ఉండేదాన్నో నాకు సుతరాం జ్ఞాపకం లేదు. వెనకటి విషయాలను జ్ఞాపకం చేసుకుందామంటే ఏమీ కనబడదు. శుద్ధ శూన్యం. యెగోర్ ఇవానొవిచ్ ఈమధ్య ఇక్కడికి వచ్చాడు. మేమిద్దరం ఒకే ఊరు వాళ్లం. అతడెన్నో విషయాలు చెప్పేడు. నాకంటారా? మా యిల్లు జ్ఞాపకముంది. మనుష్యులు జ్ఞాపకమున్నారు. కాని వాళ్లెలా జీవించేవారో, ఏమనుకునేవారో, వాళ్లేమయారో ఏమీ నాకు జ్ఞాపకం లేదు. ఒక పెద్ద అగ్ని ప్రమాదం సంగతి గుర్తుంది.... రెండుసార్లు కొంపలంటుకోవడం జ్ఞాపకముంది. ఇంకేమీ జ్ఞాపకం లేదు. నన్ను కొరడాలతో బాది సర్వమూ నాలోనుంచి వెళ్లగొట్టినట్లు, నా హృదయానికి సీలువేసినట్లు, దానికి చెవుడు, చీకుదనమూ పట్టినట్లయింది."

ఈ మాటలు చెపుతుంటే నీటిలోనుండి బయటపడిన చేపలాగున ఆమెకు ఊపిరాడలేదు. కొంచెం ముందుకు వంగి కంఠస్వరాన్ని బాగా తగ్గించి ఇలా చెప్పింది:

"నా భర్త చనిపోయాడు. ఇక కుమారునిమీద ఆధారపడ్డాను. అతడు ఈ వ్యవహారంలో దిగేడు. ఇది మరింత దుర్భరమైన విషయం. అతని కేమైనా ప్రమాదం సంభవించేట్లయితే నేను బతకడం ఎల్లాగ? అతన్ని గురించే నేనెప్పుడూ హడలిపోతూ

ఉంటాను. ఏమి హింసల పాలైనానో కదా! అతని కేదైనా ప్రమాదం కలగవచ్చునవే ఆలోచన కలిగినప్పుడు నా హృదయం దాదాపు పగిలిపోయినట్లుంటుంది."

ఆమె కొద్ది క్షణాలపాటు ఆగింది. ఒక్కసారి తల ఊపి, గొప్ప భావముట్టిపడేటట్లుగా మరల ప్రారంభించింది:

"స్త్రీప్రేమ, నిష్కామమైన పరిశుద్ధ ప్రేమ కాదు. మా స్వార్థం కోసం ఏది అవసరమో దానినే ప్రేమిస్తాం. కాని నేను మిమ్మల్ని చూద్దును కదా, మీ తల్లిని గురించి మీరు పరితపిస్తున్నారు. మీకు ఆమేమి కావాలి? ఇతరులందరూ ప్రజల కోసం కష్టాలనుభవించే వాళ్ళు — జైలుకూ సైబీరియా ప్రవాసానికీ వెళ్లేవాళ్ళు — ప్రాణాలర్పించేవాళ్ళ.... రాత్రి వేళ ఒంటరిగా, బురదలోనూ, మంచులోనూ, వర్షంలోనూ మైళ్లకు మైళ్ళు నడిచే పడుచుపిల్లలు, మన ఇంటికి నాలుగైదు మైళ్ళ పట్టణంనుండి నడిచి వెళ్లేవాళ్ళు. వాళ్లనెవరు నిర్బంధిస్తున్నారు? వాళ్లెందుకీ పని చేస్తున్నారు? వాళ్లలో గొప్పదైన పరిశుద్ధమైన ప్రేమ ఉన్నది కనుకనే, వాళ్లీ కష్టాలనెదుర్కొంటున్నారు. వాళ్లకొక గొప్ప విశ్వాసముంది. అన్‌ద్ర్యూషా! వాళ్లలో ఒక ప్రగాఢమైన నమ్మకముంది. కాని నా సంగతి చూడండి. వాళ్లలాగున నేను ప్రేమించలేను. నా స్వంతమనుకున్నదానినే, నాకు సన్నిహితమైనదానినే నేను ప్రేమించగలను."

"నిజమే!" అంటూ హోహోల్ తన అలవాటు ప్రకారం చేతుల్తో తల, బుగ్గలు, కళ్లూ గబగబా రుద్దుకుని పక్కకు తిరిగి ఇలా చెప్పేడు:

"ప్రతివారూ తనకేది దగ్గరో దాన్నే ప్రేమిస్తారు. కాని విశాల హృదయులైనవారికి దూరంగా ఉన్నవి కూడా సన్నిహితమే అవుతాయి. మీలో గొప్పదైన మాతృప్రేమ ఉంది. మీరు గొప్ప పనులు చేయగలుగుతారు."

"భగవంతు డనుగ్రహించును గాక!" అని నిట్టూర్పు విడిచి ఇలా అంది: "ఇది బ్రతకడానికి మంచి మార్గమని అనుకుంటున్నాను. అన్‌ద్రేయ్! నేనిప్పుడు మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. బహుశా పావెల్ కన్న ఎక్కువగానేమో! అతడు చాలా గుట్టు మనిషి. మాట వరసకి చెప్తాను. అతను సాషాను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాడు. కాని తల్లినైన నాతో ఒక్క మాటైనా చెప్పేడుకాడు."

"ఆ మాట నిజం కాదు" అని హోహోల్ ఆమె మాటకడ్డొచ్చాడు. "నిజం కాదని నాకు బాగా తెలుసు. అతడామెను ప్రేమిస్తున్నాడు. ఆమె కూడా అతన్ని ప్రేమిస్తోంది. అంత వరకు నిజమే. కాని వాళ్లెన్నటికీ పెళ్లి చేసుకోరు. ఆమెకు చేసుకోవాలనే ఉంది. కాని అతడికిష్టం లేదు...."

"ఓహో! అదా సంగతి" అని విచారసూచకమైన దృష్టి సారించి ఆలోచనాయుతంగా

''అదన్నమాట అసలు సంగతి! అంటే వాళ్ళ స్వీయసుఖాన్ని కూడా పరిత్యజిస్తారన్నమాట''
అంది.

''పావెల్ చాలా అపురూపమైన మనిషి. భల్లూకపు పట్టుదల కలవాడుసుమండీ!''
అన్నాడు హొహోల్, మృదువైన స్వరంతో.

''ఇప్పుడు జైల్లో మగ్గుతున్నాడు'' అంది సాలోచనగా తల్లి. ''తలుచుకుంటే దిగులుగానే ఉన్నా మరీ దుర్భరంగా లేదు. జీవితం మారింది, నా దిగుళ్ళూ మారాయి. నేనిప్పుడు అందరి కోసమూ దిగులుపడుతున్నాను. ఎందుచేతనంటే నా ఆత్మ హృదయంయొక్క కళ్లను తెరిపించింది. ఆ కళ్లతో చూస్తుంటే కొంచెం విచారం కలుగుతుంది. కాని వెంటనే సంతోషం కూడా కలుగుతోంది. నాకు అర్థంకాని సంగతులెన్నో ఉన్నాయి. సర్వేశ్వరునిలో మీకు నమ్మకం లేకపోవడం నాకు మహా బాధగా ఉంది. అయితే దానికి నేనేం చెయ్యగలను? మీరంతా నిజంగా మంచివాళ్లని నాకు తెలుస్తూనే ఉంది. ప్రజలకోసం మీరు కష్టమైన జీవితాన్ని వరించారు. సత్యంకోసం కఠినమైన జీవితాన్ననుసరిస్తున్నారు. ఇప్పుడు మీ సత్యమేమిటో నాకు అర్థమైంది: ధనవంతులున్నంత కాలం, సామాన్య జనానికి ఏవిధమైన సంతోషం కాని న్యాయం కాని ఉండదంటారు! ఏమీ ఉండదు! ఇప్పుడు మీ అందరితో ఉంటున్నాను కనుక అప్పుడప్పుడు రాత్రివేళల్లో నా పూర్వ జీవితాన్ని గురించి ఆలోచించుకుంటూ ఉంటాను. చిన్ననాటి నా బలమంతా బూటుకాలికింద నలిగిపోవడం, నా నవహృదయం పిడికిలి పోట్లతో పాడుమైపోవడం, తలుచుకుంటే నామీద నాకే జాలి కలుగుతుంది. వెగటు కలుగుతుంది. అయితే ఇప్పుడు నాకు బతకడం మెరుగ్గా కనబడుతోంది. కొద్దికొద్దిగా నేనెల్లా ఉన్నానో చూడగలుగుతున్నాను....''

హొహోల్ లేచి నిలబడ్డాడు. పొడుగ్గా సన్నంగా ఉన్న అతడు ఆలోచనా నిమగ్నుడై, చప్పుడు చేయకుండా పచారు చేస్తూ మృదువుగా అన్నాడు:

''ఎంత బాగా చెప్పేరమ్మా! చాలా బాగా చెప్పేరు. కేర్చ్‌లో పద్యాలు రాసే యూదు యువకుడొకడుండేవాడు. అతడొకనాడు ఈ పద్యం రాశాడు:

అమాయకులు హత్యల పాల్పడగా
సత్యమే వారిని బతికిస్తుంది.

కేర్చ్‌లో అతణ్ణి పోలీసులు చంపారు. అయితే అదేమంత ముఖ్యమైన సంగతి కాదు. అతడు సత్యాన్ని గ్రహించి దాన్ని ప్రజల్లో వెదజల్లేడు. మీరు కూడా ఆ అమాయకుల్లో ఒకరు....''

తల్లి మళ్లీ అందుకుంది.

''అయితే నేనిప్పుడు దిగ్గరగా మాట్లాడుతున్నాను. దిగ్గరగా మాట్లాడుతూ నా

మాటలు నేనే వింటున్నాను. కాని నా చెవులను నేనే నమ్మలేకపోతున్నాను. నా జీవితమంతా ఒక్కటే ఆలోచన. రోజెల్లా గడచిపోతుందా అనేదే. ఎవ్వరూ నన్ను చూడకుండా, నా శరీరంమీద చెయ్యి వెయ్యకుండా ఉంటే అంతే చాలనిపించేది. కాని ఇప్పుడు ఇతరులను గురించిన ఆలోచనలు నా తల నిండా ఉన్నాయి. మీ పనిని నేను పూర్తిగా అర్థంచేసుకోలేక పోవచ్చును. కాని మీరంతా నాకెంతో ఆప్తులు. మీ అందరి గురించీ నేను బాధపడుతుంటాను. మీరందరూ సుఖంగా ఉండాలని నా కోరిక. ముఖ్యంగా మీరు, అన్‌ద్ర్యూష!..."

అతడు ఆమె దగ్గరకొచ్చాడు.

"కృతజ్ఞుడిని" అన్నాడు. ఆమె చేతిని తన చేతుల్లో పెట్టుకుని గట్టిగా నొక్కి, తరువాత వదిలేసి చటుక్కున వెనక్కి తిరిగాడు. తల్లి తన ఆవేశంతో తానే అలసటచెంది, మెల్లగా విశ్రబ్ధంగా గ్లాసులు కడుగుతూ, తన హృదయంలో ఆనందానుభూతిని పొందింది.

పచారుచేస్తున్న హోహోల్ ఆమెతో ఇలా చెప్పేడు:

"మామ్మా! మీ ప్రేమను కొంత వెసొవ్‌శ్చికోవ్‌కు ప్రసాదించాలి. అతని తండ్రి జైల్లో ఉన్నాడు. ఎందుకూ పనికిరాని ముసలి తాగుబోతు. నికొలాయ్ అతన్ని కిటికీ దగ్గర చూచేసరికల్లా, తిట్లు ప్రారంభిస్తాడు. అది చాలా చెడ్డలవాటు. నికొలాయ్ సహజంగా చాల దయాదాక్షిణ్యాలుకలవాడు. అతడు కుక్కల్నీ ఎలకల్నీ, అన్ని రకాల జంతువుల్నీ ప్రేమిస్తాడు. మనుష్యులను మాత్రం అసహ్యించుకుంటాడు. మనిషికి ఏమి సంభవిస్తుందో కొంచెం చూడండి!"

"తల్లి ఎక్కడికో పోయింది.... తండ్రి దొంగ, తాగుబోతు...." అంది తల్లి ఆలోచిస్తూ.

అన్‌ద్రేయ్ పడుకుందుకు సిద్ధంగా ఉన్నాడనగా అతనికి కనబడకుండా ఉండేట్టుగా, తల్లి అతనిపై శిలువ గుర్తు వేసింది. అతడు పడుకున్న ఒక అరగంటకు:

"నిద్రపోతున్నావా అన్‌ద్ర్యూషా?" అని మెల్లగా అడిగింది.

"లేదు. ఎందుకూ?"

"నిద్రపో, నాయనా!"

"సరేనమ్మా, నిద్రపోతాను" అన్నాడు కృతజ్ఞతతో.

## 17

మర్నాడు వ్లాసొవ్నా ఫ్యాక్టరీ గేటు దగ్గర కొచ్చేసరికి కావలాదారులు ఆమె నటకాయించి బుట్టలన్నీ కింద పెట్టించారు. వాటినన్నిటినీ పూర్తిగా సోదా చేశారు.

ఆమె బట్టలను మోటుగా తడుముతుంటే:

"తినుబండారాలు చల్లారిపోతాయి!" అంటూ అసమ్మతిని తెలియచేసింది.

"నోర్మూయ్!" అని కాపలాదారు హుంకరించాడు.

"వాళ్లు కట్టవమీదనుంచి లోపలికి విసురుతారు. నా మాట విను" అంటూ మరో కాపలాదారు మెల్లగా ఆమె భుజంమీద ఒక చిన్న పోటు పొడిచాడు.

ఫ్యాక్టరీ లోపలికి ఆమె ప్రవేశించడంతోనే, ఆమె దగ్గర కొచ్చినవాళ్లలో మొదటివాడు వృద్ధుడైన సిజోవ్.

"ఏమమ్మోయ్! విన్నావా?" అని నాలుగు మూలలా చూశాడు.

"ఏమిటి?"

"ఆ కాగితాల సంగతి. అవి మళ్లీ ప్రత్యక్షమయాయి. బెద్దు ముక్కమీద ఉప్పు చల్లినట్లుగా అంతటా విరజల్లబడ్డాయి. సోదాలూ, అరెస్టులూ చేస్తూనే ఉన్నారు. మా మేనల్లుడు మాజిన్‌ను జైల్లో పెట్టేరు. ఏమైనట్టు? నీ కొడుకునూ పట్టుకుపోయారు. కాని ఆ పని చేస్తున్నది వాళ్లు కాదని ఇప్పుడందరకూ తెలుస్తోంది కదా!"

అతడు తన గడ్డాన్ని చేత్తో పట్టుకుని తల్లికేసి చిత్రంగా చూశాడు.

"మా యింటికోసారి రాకూడదూ? బొత్తిగా ఒంటరిగా ఉంటున్నావు కదా!"

తల్లి అతనికి కృతజ్ఞత తెలియచేసింది. తినుబండారాలు అమ్మకం ప్రారంభించింది. ఫ్యాక్టరీలో ఏదో కొత్తగా అలజడి రేగినట్లామె గుర్తించింది. అందరూ ఆవేశపూరితులై వున్నారు. జనం గుంపులుగుంపులుగా చేరి, మళ్లీ విడిపోతున్నారు. ఒక కర్మాగారంనుంచి మరో కర్మాగారానికి పరుగులెడుతున్నారు. ఈ ముసిగమ్మిన వాతావరణంలో ధైర్యసాహసాలతో కూడిన పనేదో జరుగుతోందని ఆమె కనిపెట్టింది. అప్పుడప్పుడు ఎత్తిపొడుపు మాటలూ, ఉత్సాహపరిచే మాటలూ వినబడుతున్నాయి. పెద్దలైన పనివాళ్లు ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు. ఫ్యాక్టరీ పెద్ద ఉద్యోగస్థులు అటూ ఇటూ తిరుగుతున్నారు. వాళ్ల ముఖాలలో ఆదుర్దా కనుబడుతూనే ఉంది. పోలీసులు అంతటా పరుగులెత్తుతున్నారు. గుంపులుగుంపులుగా చేరి ఉన్న పనివాళ్లు వాళ్లను చూడ్డంతోనే పచారులు ప్రారంభించేవారు. లేకపోతే మాట్లాడ్డం మానేసి, ఆగ్రహపూరితులై విస్పృహతో ఉన్న వాళ్ల ముఖాలకేసి తేరిపారి చూసేవాళ్లు.

కార్మికుల ముఖాలు తేటుగా ఉన్నాయి. ఇంతలో గూసెవ్ సోదరులలో పెద్దవాడు ఆమె కంటపడ్డాడు. అతని తమ్ముడు నవ్వుతూ అతన్ని వెంబడిస్తున్నాడు.

వడ్రంగి కార్ఖానా మేస్త్రీ వవిలోవ్, టైమ్‌కీపరు ఇసాయ్ మెల్లగా నడిచి వెళ్లారు. మేస్త్రీ బడలు కట్టిన గెడ్డం దులుపుకుంటూ లొడలొడ మాట్లాడుతూ నడుస్తూంటే, పొట్టివాడైన టైమ్‌కీపరు, అతని ముఖం చూడ్డానికి తల పైకెత్తి పక్కకు తిప్పి అతని వెంట నడుస్తున్నాడు.

"వాళ్లిదంతా వేళాకోళమనుకుంటున్నారోయ్, ఇవాన్ ఇవానొవిచ్! వాళ్ల కదొక

ఆనందం! డైరెక్టరు చెప్పినట్లు రాజ్యం నాశనమైపోతే మాత్రం వాళ్ళకేమి! అబ్బే! ఇలా ఒకరినీ ఇద్దరినీ కలుపు తీయడం కాదు. బాగా లోతుగా దున్నేయాలి...."

వసీలొవ్ చేతులు వెనక్కి పెట్టుకుని వేళ్ళ పిడికిట్లో బిగించి నడుస్తున్నాడు.

"పోండి! మీ యిష్టం మెచ్చినదాన్ని అచ్చేసుకోండి, కుక్కలకొడకల్లారా! నన్ను గురించి ఒక్కమాటంటే మాత్రం జాగ్రత్త!" అని గట్టిగా అన్నాడు.

వసీలియ్ గూసెవ్ తల్లి దగ్గర కొచ్చాడు.

"ఏమమ్మోయ్! మీ వంటకాలు బాగున్నాయి. మరొక సారి భోజనం చేసి చూద్దామనుకుంటున్నాను" అని కళ్ళు చిట్లించి మెల్లగా: "సరిగా అలాటివే మాకు కావాలి. మంచి పని చేస్తున్నారమ్మా!" అన్నాడు.

ఆమె ఎంతో అప్యాయంగా తలూపింది. ఆ పేటలోకల్లా పెంకె ఘటమని ప్రసిద్ధి కెక్కిన వసీలియ్ తన్నింతగా మన్నించి మాట్లాడ్డం ఆమెకెంతో సంతోషాన్ని చేకూర్చింది. ఫ్యాక్టరీలో జరుగుతున్న అలజడికి కూడా ఆమె సంతోషించింది. "ఇది నా మూలాన కాకపోతే...." అనే ఆలోచనలో పడింది.

ముగ్గురు మామూలు కూలీలు ఆమెకు కొంచెం దగ్గరలో ఆగి మాట్లాడుకుంటున్నారు.

"నాకెక్కడా దొరకలేదే" అని కించగా ఒకడన్నాడు.

"నాకైతే చదవడం రాయడం రాదు. కాని అందులో ఏముందో మాత్రం వినాలని ఉంది. మొత్తంమీద దెబ్బ మాత్రం మాటిగా తగిలిందని స్పష్టమవుతోంది" అన్నాడింకొకడు.

"బాయిలర్ గదిలో కెడదాం పదండి" అన్నాడు అటూ ఇటూ చూస్తూ మూడోవాడు.

గూసెవ్ తల్లికేసి చూసి సైగ చేశాడు.

"ఏమమ్మోయ్! చూశారా ఏమి జరుగుతోందో?" అన్నాడు.

వీలొవ్నా ఎంతో ఉత్సాహంతో ఇంటికొచ్చింది.

"చదవడం రానందుకు జనం చాలా విచారపడుతున్నారు. నా చిన్నతనంలో నాకు చదవడం వచ్చు. కాని మరచిపోయాను" అని అన్‌ద్రేయ్‌తో చెప్పింది.

"ఇప్పుడు నేర్చుకోకూడదూ?" అన్నాడు హొహోల్.

"ఈ వయస్సులోనా? నలుగురూ నవ్వడానికా?"

అన్‌ద్రేయ్ అలమారలోనుంచి ఒక పుస్తకాన్ని తీసి, అట్టమీది ఒక అక్షరాన్ని చూపించి, "ఇదేమక్షరం?" అని అడిగేడు.

"ఆర్" అని చిరునవ్వుతో ఆమె జవాబిచ్చింది.

"ఆ అక్షరం?"

"ఎ."

తల్లికి తన స్థితి అర్థమైంది. సిగ్గేసింది. అన్‌ద్రేయ్ లోపల్లోపల నవ్వుకుంటున్నట్లూ

ఆమెకగపడింది. అతవి చూపు తప్పించుకుంది. కాని అతని కంఠస్వరం మెల్లగా మృదువుగా ఉంది. ముఖం మాత్రం గంభీరంగా ఉంది.

"అన్‌ద్రేయ్! నిజంగా నాకు నేర్పాలనుకుంటున్నారా?" అని అప్రయత్నంగా వచ్చిన నవ్వుతో అడిగింది.

"ఎందుకు రాదు? ఇదివరకొకసారి నేర్చుకుని ఉంటే, ఇప్పుడు మళ్లీ దానంతటదే వస్తుంది. శాస్త్రం చెప్పినట్లు ప్రయత్నిస్తే నష్టం లేదు కదా!"

"అయితే మరింకో సామెత ఉంది: 'విగ్రహాంకేసి చూస్తూ కూచుంటే సన్యాసి కాడు.'"

"ఊహూం! సామెతలు కొల్లలుగా ఉన్నాయి. 'ఎంత తక్కువగా తెలుసుకుంటే, అంత సుఖంగా నిద్రపడుతుంది' అన్న సామెతను ఉదాహరణగా తీసుకోండి. నిజానికి అలా ఆలోచించవలసినది పొట్ట ఒక్కటే. సుళువైన మార్గాలు పట్టడానికి ఆ విధమైన సామెతలతో ఆత్మను పెడదారి పట్టించడమే" అన్నాడు అన్‌ద్రేయ్ తలూపుతూ. "ఈ అక్షరమేమిటి?" అని తల్లిని అడిగేడు.

"యల్" అంది.

"బాగుంది. ఇది?"

మరచిపోయిన అక్షరాలను జ్ఞాపకం చేసుకునేందుకు ఆమె ఏకాగ్రచిత్తంతో కళ్లకు పనిచెప్పింది. కాని కళ్లకి బాగా శ్రమనిపించింది. అలసటచేత కళ్ల వెంబడి నీరు కారింది. నిస్పృహ వచ్చింది.

"చదవడం నేర్చుకుంటున్నానన్నమాట!" అని మూలిగింది. "నలభై ఏళ్ల మీద కొచ్చాక అక్షరాలు నేర్చుకోవడమన్నమాట!"

హొహోల్ ఓదార్చడం మొదలెట్టేడు.

"ఏడవకమ్మా! మీ జీవిత విధానాన్ని మీరు ఎన్నుకోలేకపోయారు. అది చాలా నికృష్టమైనదనైనా తెలుసుకోగలిగారు. వేలాది జనం కావాలనుకుంటే ఇంతకన్న మేలైన బతుకు బతకగలరు. కాని వాళ్లు పశువుల్లాగే జీవిస్తుంటారు. అదే అద్భుతమైనదని కూడా అనుకుంటారు. ఈ వేళ కష్టపడి పనిచేస్తాడు, తింటాడు. రేపూ కష్టపడతాడు, తింటాడు. జీవితమంతా ప్రతిరోజూ ఇదే తంతు. పనిచేయడం, తినడం. ఇందులో అద్భుతమైన విశేషమేముంది? మధ్య మధ్య ఈ ప్రపంచంలోకి పిల్లలను రప్పిస్తాడు. వాళ్లు ఎక్కువగా తిండి అడగనంతవరకూ వాళ్లతో కులాసాగా ఆనందిస్తాడు. వాళ్లు అది కావాలి యిది కావాలి అడుగుతుంటే కోపమొచ్చి తిడతాడు: 'కుర్ర వెధవల్లారా! త్వరగా ఎదగండోయ్! పని పాటులు చేసుకోవలసిన వయసొచ్చింది!' అంటాడు. తన పిల్లలను పెంపుడు జంతువుల్లాగ తయారుచేయడానికి ప్రయత్నిస్తాడు. వాళ్లు కూడా తమ కడుపుకోసం

కష్ట పడడం మొదలెడతారు. తమ జీవితాలను జిగురులాగ సాగదీస్తారు. ఎవరైతే మానవుని మనోశృంఖలాలను ఛేదించడానికి ప్రయత్నిస్తారో వాళ్లే చెప్పుకోదగ్గవాళ్లు. మీ చేతనైనంత వరకు మీరిప్పుడు ఆ పనే చేస్తున్నారు."

"నేనా! నాచేత నేమవుతుంది?" అని అపనమ్మకాన్ని తెలియచేసింది.

"అలా అనకండి! ఇది వానలాంటిది. ప్రతి వాన చినుకూ ఒక విత్తనాన్ని తడుపుతుంది. మీరు చదవడం ప్రారంభిస్తే...." అంటూ నవ్వేశాడు.

లేచి పచారు చెయ్యడం మొదలెట్టేడు.

"మీరు తప్పకుండా నేర్చుకోవాలి. త్వరలో పావెల్ ఇంటి కొచ్చేస్తాడు. అప్పుడు — ఓహ్!"

"ఏయ్! అన్‌ద్ర్యూషా! చిన్న వయస్సులో ఉన్నవారి కష్టే సులువే. పెద్దవాళ్లయాక ఏముంది? బాధలు ఎక్కువవుతాయి. బలం తగ్గిపోతుంది. బుద్ధి అసలే ఉండదు!" అంది తల్లి.

## 18

సాయంకాలం హోహోల్ బయటికి వెళ్లేడు. తల్లి దీపం వెలిగించి బల్లదగ్గర కూర్చుని మేజోడల్లడం మొదలెట్టింది. అంతలోనే లేచి ఏమీ తోచక గదిలో అటూ ఇటూ తిరుగాడింది. వంటింట్లో కెళ్లి తలుపు తాళం వేసింది. కనుబొమలెగరేసుకుంటూ మళ్లీ గదిలో కొచ్చింది. కిటికీల తెరలు వేసేసి, అలమారలోనుంచి ఒక పుస్తకాన్ని తీసుకుని తిరిగి బల్లదగ్గర కూచుంది. ఇంతకు ముందు జాగత్తపడి కూడా ఆమె పుస్తకంమీదకు వంగి చదవడానికి ప్రారంభించే ముందు నాలుగు మూలలా అనుమానంగా చూడడం తప్పలేదు. తర్వాత కళ్లు మూస్తూ, తెరుస్తూ తనలో తాను గొణుక్కోడం మొదలుపెట్టింది.

"యల్ — లెటర్, బి — బాక్సు."

ఇంతలో ఎవరో తలుపు తట్టినట్లైంది. తల్లి గభాలున లేచి పుస్తకాన్ని అలమారలో పెట్టేసింది.

"ఎవరు వారు?" అని కంగారుగా అడిగింది.

"నేను."

గెడ్డం సవరించుకుంటూ రీబిన్ లోపలికొచ్చాడు.

"ఎవరు వారని అడిగేదానవు కాదే? ఒంటరిగా ఉన్నావా? హోహోల్ ఇంట్లో ఉంటాడనుకున్నాను. అతడిని ఈ రోజే చూశాను.... జైలు జీవితం అతనికేమీ చెరుపు చేసినట్లుగు పడ్డం లేదు" అంటూ రీబిన్ తల్లికేసి తిరిగి కూర్చున్నాడు.

"కొంచెం సేపు మనం మాట్లాడుకుందాం" అన్నాడు.

రీబిన్ ఆమెకేసి భావపూరితంగానూ, గుంభితంగానూ చూశాడు. ఆమెకేదో అస్పష్టమైన ఆందోళన కలిగింది.

"ఏ పనికైనా డబ్బవుతుంది" అంటూ తనకు స్వాభావికమైన భారమైన కంఠస్వరంతో మాట్లాడ్డం మొదలెట్టేడు. "పుట్టడానికి డబ్బు కావాలి. చావడానికి డబ్బు కావాలి. పుస్తకాలకూ కరపత్రాలకూ కూడా డబ్బు ఖర్చవుతుంది. ఈ కరపత్రాలకు డబ్బు ఎక్కడ నుంచి వస్తోందో నీకేమైనా తెలుసా?"

"నాకేం తెలియదు" అంది తల్లి. ఏదో ఎక్కడో లోపం జరిగిందనుకుంది.

"నాకూ తెలియదు. వాటిని రాసేవాళ్లెవరనేది రెండో ప్రశ్న."

"పుస్తకాలు బాగా చదివినవాళ్లు...."

"అంటే పెద్దమనుషులన్నమాట" అన్నాడు రీబిన్. గడ్డపు వెంట్రుకల నల్లని ముఖం ఎర్రబారింది: "అంటే పెద్దమనుష్యులు ఈ పుస్తకాలు రాసి బయటకు పంపుతారన్నమాట. కాని వాళ్లకు విరుద్ధంగానే ఈ పుస్తకాలు రాయబడుతున్నాయే! నువ్విప్పుడు బాగా ఆలోచించి నాకు విశదంగా చెప్పు! తమమీదికి సామాన్య జనాన్ని రెచ్చ గొట్టేటందుకు తామే డబ్బు ఖర్చుపెట్టుకోవడంలో నబబేమున్నది? ఏమంటావు?"

తల్లి భయంతో నిట్టూర్పు విడిచి తెల్లబోయి చూసింది.

"నువ్వేమనుకుంటున్నావు?" అని అడిగింది.

భల్లూకంలాగున రీబిన్ ఆమెకేసి తిరిగేడు.

"ఆహా! అదీ సంగతి. నాకు కూడా ఆ ఆలోచన తట్టేసరికి.... వళ్లంతా వణుకు పుట్టింది."

"ఏమైనా కనుక్కున్నావా?"

"మోసంలో పడ్డాం.... మనల్ని మోసం చేశారని అనుకుంటున్నాను. నాకేమీ ఇదమిద్ధమని విశదంగా తెలియదు. కాని ఇందులో ఏదో వంచన ఉంది. అంతే. పెద్దమనుష్యులున్నారే వాళ్లు, చాలా వంచనోపాయం తెలిసినవాళ్లు. చాపకింద నీళ్లలాంటివాళ్లు. నేమా నిజం తెలుసుకోవేందుకే ప్రయత్నిస్తున్నాను. ఇప్పుడది నాకు అవగాహనవుతోంది. ఇక ముందునుంచి నేనీ పెద్దమనుష్యులవెంట పోదలచుకోలేదు. వాళ్ల కవసరమైతే, నన్ను పడగొట్టి వంతెనమీదనుంచి నడిచేటట్లుగా నామీదనుంచి నడిచిపోతారు...." అన్నాడు రీబిన్.

అతడి మాటలు తల్లి హృదయాన్ని మెలిపెట్టేశాయి.

"ఓ భగవంతుడా! పాషె ఈ సంగతి ఎరగడా? అతని తోటివారందరూ...." అని విచారంతో ఆమె బిగ్గరగా అంది.

ఆ క్షణంలో ఆమె కళ్లకు యెగోర్, నికొలాయ్ ఇవానొవిచ్, పాషెల నిష్కల్మష ముఖాలు కనబడ్డాయి. ఆమె నాడి గబగబ కొట్టుకుంది.

ఆమె అనమ్మతిసూచకంగా తలూపుతూ అంది:

''కాదు కాదు! నేను నమ్మలేను! వాళ్లందరూ అంతరాత్మకలవాళ్లు....''

''ఎవరనుకుంటున్నావు?'' అని భావపూరితంగా అడిగేడు రీబిన్.

''అందరూ! వాళ్లంతా కూడా! నేను చూసినవాళ్లు.''

''అమ్మా! నువ్వు సరియైన చోట చూడ్డం లేదు. కొంచెం దూరంగా చూడు'' అన్నాడు రీబిన్ తలవంచుకుని. ''మనతో చేరిపోయిన వాళ్లకు ఏమీ తెలియకపోవచ్చు. వాళ్లందరికీ ఒక విశ్వాసమంటూ ఉంది. అది చాలా మంచిది. వాళ్ల వెనకాల కొందరు స్వార్థపరులుండవచ్చు. తమ మంచే కాని వారికి మరొకటేమీ పట్టదు. ఏ స్వప్రయోజనం లేకుండా ఎవ్వరూ తమకు తామే అపకారం చేసుకోరు కదా! ఈ పెద్దమనుష్యులవల్ల ఏమీ ప్రయోజనం కలగదు!'' అని పల్లెటూరు రైతుకుండే దృఢనమ్మకాన్ని వెలిబుచ్చాడు.

తల్లి మళ్లీ సంశయంలో పడి:

''మరి నువ్వేమి చెయ్యాలనుకుంటున్నావు?'' అని అడిగింది.

''నేనా?'' అని రెట్టించి రీబిన్ తల్లికేసి చూసి, ఒక క్షణమాగి, ''ఈ చదువుకున్న పెద్దమనుష్యులకు మనం దూరంగా ఉండాలి. అదీ సంగతి'' అన్నాడు.

అతడు మరల విచారంతో నోరు మెదల్పకుండా కొంచెం సేపు కూచున్నాడు. తర్వాత,

''నేను కూడా మన కుర్రాళ్లతోపాటు ముందుకు పోదామనుకున్నాను. అలాటి పనికి నేను బాగా తగినవాడినే. ప్రజలకేం చెప్పాలో నాకు తెలుసు. కాని నేనిప్పుడు వెళ్లిపోతున్నాను. నాకు విశ్వాసం పోయింది. కనుక వెళ్లిపోక తప్పదు'' అన్నాడు.

అతడు తలవంచుకుని ఆలోచనా నిమగ్నుడయాడు.

''నేను ఒంటరిగానే నా పని నేను చేస్తాను. పల్లెల వెంటా గ్రామాల వెంటా తిరిగి ప్రజలను లేవగొడతాను. వాళ్లు తమ పనిని స్వయంగా తమే చేసుకోవాలి. ఒకసారి వాళ్లకు అసలు విషయం తెలిస్తే, మార్గాలు వాళ్లే తెలుసుకుంటారు. విషయాన్ని తెలియచెప్పడమే నా పని. వాళ్ల ఆశలు వాళ్లవే. వాళ్ల బుద్ధి వాళ్లదే'' అన్నాడు రీబిన్.

తల్లికి అతనిమీద జాలి కలిగింది. అతడిని గురించి భయం కూడా కలిగింది. ఏకారణంచేతనో మొదట్లో అతనంటే అయిష్టత కలిగిన తల్లికి, ఇప్పుడెందుచేతనో అతడెంతో సన్నిహితుడయాడు.

''నిన్ను పట్టుకుంటారు'' అంది మెల్లగా.

రీబిన్ ఆమెకేసి చూసి,

''అవును. పట్టుకుంటారు. కాని వదిలిపెట్టేస్తారు. మళ్లీ మొదలెట్టి ఆ పనే చేస్తాను'' అన్నాడు.

''పల్లె రైతులే నిన్ను పట్టుకుని పప్పచెప్పుతారు. వాళ్లు నిన్ను జైల్లో పారేస్తారు.''

"శిక్షననుభవించి బయటపడతాను. మళ్లీ అ పనే చేస్తాను. పల్లె రైతులంటావా, ఒకసారి కట్టిపడేస్తారు. రెండు సార్లు, మూడు సార్లు కట్టిపడేస్తారు. తర్వాత నన్ను నిర్బంధించడం కన్న, నేను చెప్పిన మాటలను వినడమే తమకు క్షేమకరమని గ్రహిస్తారు. 'నన్ను నమ్మొద్దు, నా మాట మాత్రం వినండి' అని చెప్తాను. వాళ్లు విన్నట్లయితే, నన్ను నమ్ముతారు."

రీబిన్ నెమ్మదిగా ప్రతి మాటనీ తూచి మాట్లాడేడు.

"ఈ మధ్య నేమా చాలా కష్టాలు దిగమింగేను. ఒకటి రెండు విషయాలు తెలుసుకున్నాను...."

"మిహాయిల్ ఇవానొవిచ్! ఇంతటితో నీ పని ఆఖరు" అని విచారంగా తలూపుతూ అంది తల్లి.

రీబిన్ నల్లటి కళ్లతో ఆమెకేసి ప్రశ్నార్థక నిరీక్షణతో చూశాడు. గట్టిగా రెండు చేతుల్తో కుర్చీ పట్టుకుని బలిష్ఠమైన శరీరాన్ని ముందుకు వాల్చేడు. నల్లగా ఉండే అతని ముఖం, నల్ల గెడ్డం మధ్య వెలవెల పోతోంది.

"క్రీస్తు విత్తనం గురించి ఏమి చెప్పేడో జ్ఞాపకముందా? మరల జన్మెత్తడానికి ముందు అది నశించాలి. కాని నన్నింత త్వరలో చావు వరించదు. నేను జిత్తులమారి ముసిలినక్కని."

అతడు కుర్చీలోనుంచి నిదానంగా లేచి నుంచున్నాడు.

"నేను సారాదుకాణానికెళ్లి అక్కడ మనుషులతో కొంచెం సేపు కాలక్షేపం చేస్తాను. హొహోల్ ఇంతట్లో ఇంటికొచ్చేటట్లు కనబడ్డం లేదు. మళ్లీ పాత పనిలో ప్రవేశించాడనుకుంటాను. అంతేనా?"

"అంతే" అని చిరునవ్వుతో తల్లి జవాబిచ్చింది.

"బాగుంది. నేనొచ్చి వెళ్లేనని అతనితో చెప్పు."

ఉభయులూ పక్కపక్కగా నడిచి వంటింట్లో కెళ్లేరు. ఒకళ్ల నొకళ్లు చూడకుండానే అభిప్రాయాలను వెలిబుచ్చుకున్నారు.

"సరే. శలవు" అన్నాడు రీబిన్.

"శలవు. ఫ్యాక్టరీ వాళ్లకు నోటీసెప్పుడిస్తావు?"

"ఇవ్వడమైంది."

"అయితే ఎప్పుడెళ్లిపోతున్నావు?"

"రేపు ఉదయం. శలవు!"

చిరాకుగానూ అయిష్టంగానూ రీబిన్ గుమ్మంలోనుంచి వాకిట్లోకెళ్లేడు. అమ్మ ఒక నిముషం అతని అడుగుల చప్పుడు వింటూ నిలబడింది. తన హృదయాన్ని కలచివేస్తున్న

సంశయాలను కూడా వింటోంది. తర్వాత వెనక్కు తిరిగి గదిలో కొచ్చి కిటికీ తెరను పైకెత్తింది. బయట చీకటిగా ఉంది.

"రాత్రిళ్లే నా జీవనం" అనుకుంది.

ఒడ్డూ పొడుగూ బలమూ కలిగి హుందాగా ఉండే ఆ రైతుపట్ల ఆమెకు విచారం కలిగింది.

అన్‌ద్రేయ్ మంచి ఉషారుగా ఇంటికొచ్చాడు.

ఆమె రీబిన్ సంగతి అతనితో చెప్పింది.

"న్యాయాన్ని గురించి కేకలేసుకుంటూ గ్రామాల వెంట తిరుగుతూ అతడు ప్రజలను రెచ్చగొట్టవలసిందే!" అన్నాడు అన్‌ద్రేయ్. "అతడు మా అందరితోపాటు అడుగు కలపడం తేలికగాదు. అతని బుర్రంతా రైతుల భావాలతో నిండుగా ఉంది. మా భావాల కందులో చోటు లేదు."

"అతను చదువుకున్న పెద్దమనుషులను గురించి ప్రస్తావించాడు. అతను చెప్పిన మాటల్లో కొంత ఆలోచించవలసినదుంది.... వాళ్లు మిమ్మల్ని మోసంచేయకుండా చూసుకోండి!" అని తల్లి హెచ్చరిక చేసింది.

హొహోల్ నవ్వి ఇలా అన్నాడు:

"వాళ్లేమైనా నిన్ను బాధిస్తున్నారా? ఏయ్! మామ్మా! డబ్బు! అదే మా దగ్గరుంటేనా! మేమిప్పటివరకు ఇతరుల సొమ్ముతోనే ఈ పనంతా చేస్తున్నాం. ఉదాహరణకు చెపుతున్నాను. నికొలాయ్ ఇవానొవిచ్‌కి నెలకు డెబ్బై ఐదు రూబుళ్లు వస్తాయి. ఆయన మాకు ఏభై ఇచ్చేస్తాడు. అలాంటివాళ్లింకా ఉన్నారు. ఒక్కొక్కప్పుడు విశ్వవిద్యాలయ విద్యార్థులు అర్ధాకలితో కాలక్షేపం చేసి కోపెక్కు చొప్పున చందాలు పోగుచేసి మాకు పంపిస్తుంటారు. చదువుకున్న పెద్దమనుష్యులలోనూ ఉన్నారు అన్ని రకాలవాళ్లూనూ. కొందరు నిన్ను దారిలో వదిలేస్తారు. కొందరు దగా చేస్తారు. కాని వాళ్లలో ఉండే ఉత్తములు మాతో కలిసి పనిచేస్తారు."

తన రెండు చేతులతో చప్పట్లు కొడుతూ ఎంతో విశ్వాసంతో చెప్పేడు:

"మన అంతిమ విజయం ఇంకా దూరంగా ఉంది. చాలా దూరంగా ఉంది. అయినప్పటికీ మేడే రోజున చిన్న ఉత్సవాన్ని జరిపిస్తాం! అది చాలా అద్భుతంగా జరుగుతుంది!"

ఆమెకు రీబిన్ కలుగచేసిన సంశయాలన్నీ అన్‌ద్రేయ్ ఉత్సాహంతో ఎగిరిపోయాయి. హొహోల్ జుట్టు నిమురుకుంటూ నేలకేసి చూస్తూ పచారుచేశాడు.

"ఒక్కొక్కప్పుడు నువ్వు భరించలేనంతగా నీ హృదయం అద్భుతమైన దేనితోనో నిండిపోతుంది. నీవెక్కడికెళ్లినా అంతా మిత్రులే. వారందరి హృదయాల్లోనూ ఒకే జ్వాల ప్రజ్వరిల్లుతుంది. అంతా మంచివాళ్లు. దయాళువులు. కులాసా మనుష్యులు. ఒకళ్ల

వాళ్ళకళ్ళ అర్థంచేసుకోడానికి మాట్లాడుకో నక్కర్లేదు. ఎవరి హృదయంలోనుంచి ఏ పాట వచ్చినా అందరూ కలిసి ఒకే పల్లవి పాడతారు. ఆ పాటలన్నీ ఒకే నదిలోకి పారే సెల ఏళ్ల లాటివి. ఆ నది సువిశాలంగానూ స్వేచ్ఛగానూ ప్రవహించి ఆనందమయమైన నవజీవన సముద్రంలో కలిసిపోతుంది."

అతని ఆలోచనలకి అడ్డు రాకూడదనీ, ప్రవాహంగా సాగుతున్న వాగ్ధోరణికి అడ్డు రాకూడదనే భయంతో తల్లి కదలకుండా కూచుంది. మిగిలినవాళ్ళందరికన్నా, అతను మాట్లాడేటప్పుడామె ఎక్కువ శ్రద్ధగా వినేది. ఇతరులకన్న అతడు సులువైన భాషలో మాట్లాడతాడు. అతని మాటలు మాటిగా హృదయానికి హత్తుకుంటాయి. ముందు జరగబోయే విషయాలను గురించి పావెల్ ఎన్నడూ ప్రస్తావించేవాడు కాడు. హోహోల్ హృదయంలో ఒక భాగం ఎప్పుడూ భవిష్యత్తులోనే జీవించుతూన్నట్లు ఉండేది. అతను మాట్లాడినప్పుడు భూమిమీద ఉండే జనాని కందరికీ కలగబోయే పండుగని గురించి చెప్పేవాడు. తల్లికి ఈ దృశ్యమే జీవితంయొక్క పరమార్థాన్ని తెలియజేసింది. తన కుమారుడూ, అతని స్నేహితులందరూ చేస్తున్న పనియొక్క అంతర్యాన్ని తెలియజేసింది.

తలకాయ ఊపుకుంటూ హోహోల్ తన ప్రసంగాన్ని సాగించాడు.

"తర్వాత గథాలున నీకు తెలిసొస్తుంది. నలు పక్కలా చూసుకుంటే ఎక్కడా ఉత్సాహం కనబడదు. అంతా అపరిశుభ్రంగా ఉంటుంది. ప్రతివాళ్లూ చిరుబుర్రుమంటారు. అలిసిపోయి వుంటారు...."

అతని కంఠధ్వనిలో విషాదం ద్యోతకమైంది: "మనుషులను నీవు ఎక్కువగా నమ్మకూడదు. అది బాధ కలిగిస్తుందని నాకు తెలుసు. కాని వాళ్లను చూసి భయపడక తప్పదు. ఒక ప్పుడు ఏవగించుకోవాలి కూడా. ప్రతి మనిషిలోనూ బొమ్మా బొరుసూ ఉంటాయి. నీవు అతన్ని పూర్ణంగా ప్రేమించాలనుకుంటావు. కాని అదెలా సాధ్యం? అడవి జంతువులాగ నీమీదకు దూకే మనిషిని క్షమించడం ఎట్లా? నీలో ఒక సజీవాత్మ ఉన్నదనే సంగతి గుర్తించ కుండా నీ ముఖాన్ని చితకగొట్టేవాడిని క్షమించడం ఎట్లాగ? నీవు క్షమించలేవు! నీకోసం కాకపోవచ్చు. నీ మట్టుకు నీవెన్ని బాధలకైనా గురి కాగలవు. కాని అందువల్ల నీవు వాళ్ళు చేసే పనిని హర్షిస్తున్నావనే భావం వాళ్లకు కలగనివ్వకూడదు. ఇతరులకు కొట్టే అభ్యాసం చేసుకునేటందుకు నీ వీపును అరువివ్వకూడదు." అతని కళ్లలో చల్లని జ్యోతి ప్రజ్వలిస్తు న్నట్లగుపడింది. తలను నిబ్బరంగా పెట్టి మరింత నిశ్చలంగా ప్రస్తావన సాగించాడు: "తప్పు అనేది ఎక్కడ జరిగినా, అందువల్ల నాకు అపాయం కలగకపోయినా, దాన్ని క్షమించడానికి నా కధికారం లేదు. ఈ భూమిమీద ఉండేది నేనొక్కడినే కాను. ఈ రోజున నన్నెవరైనా బాధిస్తే పోనీలే అని నవ్వుతూ ఊరుకోవచ్చు. కాని ఈవేళ తన బలాన్ని నామీద చూపించిన మనిషి రేపు ఇంకొకళ్లను బాధపెట్టి బెదిరిస్తాడు. అందర్నీ ఒక్కలాగే చూడ్డానికి వీల్లేదు.

నీవు నిర్మొగమాటంగా ఎంచుకోవాలి: వీళ్లు నా శ్రేణికి చెందినవాళ్లు, వాళ్లు కాదు, అని విచక్షణ చేసుకోవాలి. ఇదంతా ముఖంగా కనబడ్డం లేదు కదూ? కాని నిజానికంతే.''

ఎందుకోగాని తల్లికి సాషా, పోలీసు ఆఫీసరూ జ్ఞాపకానికొచ్చారు.

''జల్లెడ పట్టని పిండితో మంచి రొట్టె ఎలా తయారవుతుంది?'' అని ఒక నిట్టూర్పు విడిచి చెప్పింది.

''అదే ఇప్పుడు ఉన్న ఇబ్బంది!'' అన్నాడు హోహోల్.

''అవును'' అంది తల్లి. ఆమెకు తన భర్త రూపం జ్ఞాపకాని కొచ్చింది. నవ్వూ తుళ్లూ లేకుండా పాకుడు పట్టిన పెద్ద రాయిలాంటి అతడి స్వరూపం ఆమెకు గుర్తు కొచ్చింది. హోహోల్ నతాషానూ, తన కొడుకు సాషానూ పెళ్లి చేసుకుంటే ఎలా ఉంటుందో ఊహించుకుంది.

హోహోల్ కొంచెం తీవ్రంగా మరల అసలు విషయంమీద ప్రసంగం సాగించాడు.

''అదెందుకల్లా ఉంది? నీ ముఖంముందు ముక్కులాగే ఆ విషయం స్పష్టంగా కనబడుతూనే ఉంది. ప్రజలంతా ఒకే స్థాయిలో అర్థంచేసుకోలేకపోవడమే అందుకు కారణం. దాన్ని మనం సరిచేద్దాం. మనసా ఊహించుకున్నదాన్ని, చేత్తో చేసినదాన్ని అంతట్నీ పంచేద్దాం. ప్రజలను భయానికీ ఈర్ష్యకూ దాసులను చేయవద్దు. ఆశకూ మూర్ఖత్వానికీ బందీలను చేయవద్దు....''

ఈ సంభాషణ అయిన తర్వాత తల్లీ, హోహోలు ఎన్నో సార్లు ఇలాంటి మాటలు మాట్లాడుకున్నారు.

హోహోల్‌ను మళ్లీ ఫ్యాక్టరీ పనిలోకి తీసుకున్నారు. అతడు సంపాదించిన జీతాన్ని తల్లి చేతిలో పెట్టేవాడు. పావెల్ దగ్గర్నుంచి పుచ్చుకున్నట్లుగానే, ఆమె నిస్సంకోచంగా అతని దగ్గర్నుంచి దాన్ని పుచ్చుకునేది.

ఒక్కొక్కప్పుడు అన్‌ద్రేయ్ చిరునవ్వుతో కన్ను గిలిపి:

''మామ్మా! కొంచెం చదువుకుంటేనో?'' అనేవాడు.

ఆమె నవ్వేసి వద్దనేది. అతడు చిరునవ్వుతో కన్ను గిలపడం ఆమెకు బిడియంగా ఉండేది.

''అది అంతటి అపహాస్యమైన విషయమైతే దాన్ని గురించి ఎందుకు బాధపడాలి?'' అని తనలో తనే అనుకునేది.

కాని రానురాను, తరుచుగా ఆమె అతన్ని ఏదో ఒక మాట కర్థమేమిటని అడుగుతుం డేది. తనా విషయాన్నంత పట్టించుకోవడం లేనట్లుగానూ యథాలాపంగా అడుగుతున్నట్లూ పక్కకు తిరిగి అడుగుతుండేది. ఆమె రహస్యంగా చదువుకుంటోందని అతడు గ్రహించాడు. అందుకతడు మెచ్చుకుని, తన దగ్గర చదవమని కోరడం మానేశాడు.

''నాకు చూపు బాగా ఆనడం లేదు ఆన్ద్రియ్యూషా. కళ్లజోడు కావాలనుకుంటాను'' అని ఒకరోజున ఆమె అడిగింది.

''దానికేమీ కష్టం లేదు. ఆదివారంనాడు మిమ్మల్ని పట్నంలో ఉన్న కంటి వైద్యుని దగ్గరకు తీసుకెడతాను. కళ్లద్దాలు పెట్టుకొద్దాం'' అన్నాడు.

## 19

పావెల్‌ను చూడ్డానికి తల్లి మూడు సార్లు అధికారులను కోరింది. నెరిసిన వెంట్రుకలు, ఊదారంగు బుగ్గలు, పెద్ద ముక్కూ గల ముసలి పోలీసు అధికారి మర్యాదగా వీల్లేదని చెప్పి పంపేశాడు.

''ఒక వారం రోజులు పోవాలమ్మా! అప్పుడు చూద్దాం. ఇప్పుడు మాత్రం అసంభవం....''

అతను గుండ్రంగా బొద్దుగా పక్వానికొచ్చిన కోసిన చిన్న పండులాగున్నాడు. పసుపు పచ్చని పుల్లతో తెల్లని పళ్లనెప్పుడూ కుట్టుకుంటూ ఉంటాడు. కళ్లలో దయాదాక్షిణ్యాలు ద్యోతకమవుతాయి. ఎప్పుడు మాట్లాడినా మర్యాదగానూ స్నేహంగానూ మాట్లాడేవాడు.

''అతనెప్పుడూ చిరునవ్వు నవ్వుతూ చాలా మర్యాదగా మాట్లాడుతాడు'' అని ఆమె హోహోల్‌తో చెప్పింది.

''అందుకేమీ సందేహం లేదు. వాళ్లంతా చాలా మంచివాళ్లే — నెమ్మదిగా నవ్వుతూ ఉంటారు. కాని వాళ్లకు 'ఇదిగో ఇతడు తెలివైనవాడు. విజాయితీ కలవాడు. కాని చాలా ప్రమాదకరమైన మనిషి. కనుక మీకేమీ సంకోచం లేకపోతే అతన్ని ఉరితీసెయ్యండి' అని చెప్పారనుకోండి, వాళ్లు చిన్ననవ్వు నవ్వేసి ఉరి తీసేస్తారు. తర్వాత కూడా అలా చిరునవ్వు నవ్వుతూనే ఉంటారు'' అని హోహోల్ జవాబుచెప్పేడు.

''మనింటికి సోదా కొచ్చినవాడు అలా లేడే. చూడ్డంతోనే వాడొక రౌడీ వెధవ అని కనబడిపోయింది.''

''అమ్మా! వాళ్లెవరూ మనుష్యులు కారు. ప్రజలను హడలగొట్టటానికి ఉపయోగపడే సుత్తులలాంటివాళ్లు. మనలాంటివాళ్లను సులువుగా తమ చెప్పుచేతల్లో ఉంచుకునేందుకు ఉలిలాటివాళ్లు. వాళ్లని కూడా యజమానులు తమ ఇష్టమొచ్చినట్లు ఉపయోగపడడానికి వీలుగా మల్చుకున్నారు. వాళ్లని ఏ పని చెయ్యమని ఆజ్ఞాపిస్తే ఆ పని చేసేస్తారు. ఏమీ ఆలోచించరు. ఎందుకని అడగరు.''

చివరకొకనాడు పావెల్‌ను చూడ్డానికి తల్లికి అనుజ్ఞ ఇచ్చారు. ఆదివారం నాడు ఆమె జైలాఫీసులో ఒక మూల కూచుంది. అపరిశుభ్రంగా ఉన్న ఆ చిన్న గదిలో ఖైదీలను

చూడ్డానికొచ్చినవాళ్ళు చాలామంది ఉన్నారు. వాళ్ళకి ఇక్కడికి రావడం ఇది మొదటిసారి కాదని స్పష్టమవుతోంది, ఎందుకంటే వాళ్ళు ఒకళ్లనొకళ్ళు ఎరుగుదురు, సాలెపట్టులా జిగటగా సాగే మెల్లని సంభాషణను వాళ్ళు సాగిస్తున్నారు.

"విన్నారా సంగతి? ఈ రోజు ప్రొద్దుటిపూట ప్రార్థన సమయంలో, చర్చి ఉద్యోగస్థుడు పాటపాడే కుర్రాడి చెవి నులిపిపారేశాడు...." అని దవడలు జారిపోయిన ముఖంతో బొద్దుగా వున్న ఒకామె అంది. ఆమె ఒడిలో ఒక రైలుసంచీ ఉంది.

"పాటపాడే కుర్రాళ్లంతా పెంకెవాళ్ళు!" అన్నాడు ఒక మాజీ ఆఫీసరు దుస్తుల్లో వున్న ముసలివాడు.

పొట్టి కాళ్ళూ, పొడుగు చేతులూ, ముందుకు పొడుచుకొచ్చే గడ్డం, బట్టతలగల ఒక పొట్టి మనిషి ఆఫీసంతా కంగారుగా తిరుగుతూ ఆవేశంతోనూ గద్గద స్వరంతోనూ వ్యాఖ్యానం చేస్తున్నాడు:

"ధరలు పెరిగిపోతున్నాయి. అందుచేత ప్రజలు చాలా చిరాకెత్తిపోతున్నారు. రెండవ రకం గొడ్డుమాంసం పౌను పధ్నాలుగు కోపెక్కులమ్ముతోంది. బ్రెడ్డు ధర మళ్లీ రెండువ్వరకి పెరిగిపోయింది...."

ఖైదీలు మధ్యమధ్య వస్తుండేవాళ్ళు. అందరూ ఒకే రకమైన బూడిదరంగు దుస్తుల్లోనూ బరువైన చెప్పుల్లోనూ ఉండడంచేత అంతా ఒకలాగే కనబడ్డారు. బొత్తిగా మసక వెలుతురులో ఉండే ఆ గదిలోకి రావడంతోనే వాళ్లకు కళ్ళు మెరమెరలాడేవి. ఒకడి కాళ్లకు బేడీలున్నాయి.

జైలు వాతావరణంలో చిత్రమైన శాంతి కనిపించింది. ప్రతిదీ అదేమిటో గాని, అతి సరళంగా జరిగిపోతున్నట్లుంది. వాళ్లందరూ చాలా కాలంగా తమ అవస్థకు అలవాటైపోయినట్లుగా తోచింది. కొందరు ఊసులైపోయేదాకా ఓపిక పట్టి ఉన్నారు. కొందరు బద్ధకంగా కావలా కాస్తున్నారు. మరికొందరు క్రమం తప్పకుండా విసుక్కుంటూ ఖైదీలను చూడడానికి వస్తున్నారు. తల్లి హృదయం ఆత్రతతో వణికింది. తన చుట్టూ ఉన్న వాటి నన్నిటినీ ఆశ్చర్యంగా చూసింది. విచారకరమైన ఆ నిరాడంబరత్వాన్ని చూచి ఆమె తెల్లబోయింది.

ఆమె పక్క వామనాకారంలో వున్న ఒక ముసలమ్మ కూచుంది. ఆమె ముఖం బాగా చిక్కిపోయింది. కళ్ళు తేటుగా ఉన్నాయి. సన్నని మెడ తిప్పుకుంటూ వాళ్లకేసి ఒరగా చూస్తూ అందరు చెప్పుకునే మాటలనూ ఆమె ఆలకిస్తోంది.

"ఎవర్ని చూడడానికొచ్చారు?" అని వ్లాసావా ఆమె నడిగింది.

"నా కొడుకును. విశ్వవిద్యాలయ విద్యార్థి. మీరో?"

"నేనూ నా కొడుకుకోసమే. కార్మికుడు."

''అతని పేరు?''

''వ్లాసొవ్.''

''ఆ పేరు వినలేదే. చాలా కాలంనుంచి ఉన్నాడా?''

''దాదాపు ఏడు వారాలైంది....''

''ఓ! మావాడు పది మాసాలనుంచి ఉన్నాడు.'' ఆ మాట చెపుతుంటే ఆమె కంఠ స్వరంలో గర్వం ఉట్టిపడింది.

''అవునవును'' అంటూ బట్టతల ముసలివాడు వాగడం ఆరంభించాడు. ''అందరికీ ఓపిక నశించింది.... అందరూ కోపంగా ఉన్నారు. ప్రతివాడూ కేకలేసేవాడే. ధరవరలు పెరిగి పోతూనే ఉన్నాయి. అందుచేత ప్రజల విలువ పడిపోతూనే ఉంది. దీని నాపడానికి ఎవరూ నోరెత్తరు.''

''సరిగా చెప్పేవయ్యా! ఇది చరమావస్థకొచ్చింది. ఎవరో ఒకరు, గట్టిగా చెప్పాలి – నోరు మూసుకోమని. మనకిప్పుడలాంటి గట్టిగొంతుక అవసరం'' అన్నాడు ఆఫీసరు.

అందరూ సంభాషణలో పాల్గొన్నారు. ఉద్రేకం చెలరేగింది. జీవితాన్ని గురించి అందరూ తమతమ అభిప్రాయాలను చెప్పాలని ఆత్రత పడుతున్నారు. కాని అందరూ చాలా మెల్లగానే మాట్లాడుతున్నారు. తల్లికి వాళ్ళు చెప్పే మాటలు నచ్చలేదు. ఇంటి దగ్గర మాట్లాడుకునే మాటలు వేరుగా ఉన్నాయి. అవి ఎక్కువ స్పష్టంగానూ, సాధా రణంగానూ ఉన్నాయి. స్ఫుటంగా కూడా ఉన్నాయి.

నలుచదరంగా ఉండే ఎర్రటి గడ్డంగల లావుపాటి జైలరు ఆమె పేరు పిలిచాడు. ఆవిడకేసి నఖశిఖ పర్యంతం చూసి, ''నాతో రా'' అని కుంటిగా అడుగేశాడు.

అతని వెంట నడుస్తూ కొంచెం తొందరగా అడుగెయ్యమని అతని వీపు తోద్దా మనిపించింది తల్లికి.

పావెల్ ఒక చిన్న గదిలో నిలబడున్నాడు. చిరునవ్వు నవ్వుతూ చేయి అందిచ్చాడు. తల్లి చిన్న నవ్వు నవ్వుతూ చేయి పుచ్చుకుని గబగబా కళ్ళు మిటకరించింది. మాటలు తొణక్క:

''బాగున్నావా?'' అంది.

''అమ్మా! గాభరా పడకు'' అన్నాడు పావెల్ ఆమె చేతిని గట్టిగా పట్టుకుని.

''ఫరవా లేదులే....''

''అమ్మా!'' అని జైలరు నిట్టూరుస్తూ అన్నాడు. ''కొంచెం దూరంగా నిలబడు'' అని బిగ్గరగా ఆవులించాడు.

పావెల్ తల్లి యోగక్షేమాల నడిగేడు. ఇంటిదగ్గర సంగతి సందర్భాల నడిగేడు. అతడింకా వేరే ఏవో ప్రశ్నలడుగుతాడని ఆమె ఎదురు చూసి కళ్ళలోకి పరీక్షగా చూసింది.

కాని అలాటిదేమీ జరగలేదు. అతడు ఎప్పటిలాగే తొణుకూ బెణుకూ లేకుండా శాంతంగా ఉన్నాడు. ముఖం కొంచెం తెల్లబారింది. కళ్లు మాత్రం పెద్దవైనట్లగుపడ్డాయి.

''సాషా నిన్నడిగేవని చెప్పమంది'' అంది తల్లి.

పావెల్ రెప్పలు అదిరేయి. ముఖం వికసించింది. చిరునవ్వు తొణికిసలాడింది. తల్లికి మాత్రం గుండెల్లో ఒక్క పోటు పొడిచినట్లనిపించింది.

''నిన్ను త్వరలో విడుదల చేస్తారంటావా?'' అని కొంచెం బాధతో అడిగింది. ''ఇంతకూ నిన్నెందుకు నిర్బంధించారంటావు? ఫ్యాక్టరీలోకి ఆ కరపత్రాలు మళ్లీ వచ్చాయి కదా?''

పావెల్ కళ్లు జిగేల్మని వెలుగు వెలిగాయి.

''నిజంగానే?'' అని చటుక్కున అడిగేడు.

''అలాంటి సంగతులేవీ మాట్లాడకూడదు. కుటుంబ విషయాలు మాత్రమే మాట్లాడుకోవాలి'' అని కునికిపాట్లు పడుతూ జైలరు మాటకడ్డొచ్చాడు.

''ఇది కుటుంబ వ్యవహారం కాదా?'' అని తల్లి అనమ్మతిసూచకంగా అడిగింది.

''దానికి సమాధానం నేను చెప్పలేను. కాని ఆ మాటలు మాట్లాడకూడదు'' అన్నాడు జైలరు.

''సరేలే! ఇంటిదగ్గర సంగతులు చెప్పమ్మా. నువ్వేం చేస్తున్నావు!'' అని పావెల్ అడిగేడు.

''ఓ! ఆ వస్తువులన్నీ నేను ఫ్యాక్టరీలోకి తీసుకెడుతున్నాను'' అని కొంటెతనంగా చూచి చిరునవ్వుతో ఇలా చెప్పింది, ''అవే నీకు తెలును కదా! కేబీజీ పులుసు, అంబలి—మార్యా తయారుచేసే తినుబండారాలన్నీ.''

పావెల్‌కి అర్థమైంది. చేతుల్తో తల పైకెగదువ్వుకుంటూ, నవ్వాపుకుని కొంటె చూపు చూశాడు.

''ఏదో చేతినిండా పని కల్పించుకోవడం బాగానే ఉంది. ఒంటరిగా ఉండే సమయం కాదు కదా?'' అన్నాడు పావెల్. అతడంత మృదువైన స్వరంలో మాట్లాడడం ఆమె విని ఎరుగదు.

''ఆ కరపత్రాలు ఫ్యాక్టరీలో అగుపడ్డాక, నన్ను కూడా వాళ్లు సోదా చేశారు'' అని కొంచెం బడాయిగా చెప్పింది.

''అదిగో మళ్లీ ఆ సంగతే మాట్లాడుతున్నావు. అలాటి మాటలు మాట్లాడకూడదని ఖచ్చితంగా చెప్పేను. బయట జరుగుతున్న విషయాలు తెలియకుండా ఉండాలనే కదా మనిషిని జైల్లో పెడుతున్నారు! నువ్వు చేసే పనేమిటి? ఏది నిషేధమో నీకీపాటికి తెలిసివుండాలే!'' అని జైలరు కోపంతో అన్నాడు.

''చాలమ్మా! మత్వేయ్ ఇవానొవిచ్ మంచి హృదయంకలవాడు. అతనికి కోపం తెప్పించడం

మంచిదికాదు. మేమంటే అతనికి దయే. ఇవేళ నువ్వొచ్చినప్పుడు ఆయన ఉండడం చాలా విశేషమే. మామూలుగా అసిస్టెంటు జైలరు ఉంటూ ఉంటాడు.''

జైలరు గడియారం చూసి:

''టైమైంది!'' అన్నాడు.

''అమ్మా! చాలా సంతోషం. నువ్వేమీ బెంగ పెట్టుకోకు. వాళ్లు నన్ను త్వరలోనే వదిలిపెట్టేస్తారులే'' అన్నాడు పావెల్.

ఆమెను మనసారా కౌగిలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. ఆమె చలించిపోయి ఆనందావేశంతో మెల్లగా ఏడ్చింది.

''రావమ్మా రా! ఏడవకు. అతన్ని త్వరలోనే వదిలేస్తారులే. అందరినీ వదిలేస్తారు. ఇక్కడ చోటులేక ఇరుగ్గా ఉంది'' అంటూ జైలరు ఆమెను వసారాలోంచి బయటికి తీసు కొచ్చాడు.

ఆమె ఇంటికి రావడంతోనే హొహోల్‌తో అన్ని విషయాలూ చిరునవ్వు నవ్వుతూ కనుబొమ లెగరేస్తూ చెప్పింది.

''ఎంత చాకచక్యంగా తెలియచెప్పేనో తెలుసా? వాడికి అర్థమైంది. అర్థమయే ఉండాలి. అర్థం కాకపోతే అంత ఆప్యాయంగా ఉండడు. అలా ఆపేక్షగా వాడు ఉండనే ఉండడు'' అని నిట్టూరుస్తూ చెప్పింది.

హొహోల్ నవ్వేడు.

''ఓహ్! వాళ్లూ వీళ్లూ అవీ ఇవీ కావాలంటారు. కాని తల్లికి కావలసిందల్లా ప్రేమే....''

తల్లికి చటుక్కున ఉత్సాహం పొంగివచ్చింది.

''అన్‌ద్ర్యూషా! మీరు ఆ మనుషుల్ని చూసి ఉండాల్సింది. వాళ్లకు అలవాటై పోయింది. తమ పిల్లల్ని పట్టుకుపోయి జైల్లో పారేస్తే ఏమీ జరగనట్లు వాళ్లు నిమ్మకి నీరెత్తినట్లుం డడం చిత్రం కాదూ! అలాటివాళ్లు అక్కడికొచ్చి కామకు కూచుని పిచ్చాపాటీ మాట్లాడు కోవడం విశేషం కాదూ! చదువుకున్నవాళ్లే అలా సర్దుకుంటే, మాలాటి ఏమీ ఎరగని అమాయకుల సంగతేమిటంటావ్?''

''ఓ! అవునవును. ఇంతకూ, చట్టం మనకన్న వాళ్లమీద ఎక్కువ కనికరం చూపు తుంది. వాళ్లకి మనకన్న చట్టం ఎక్కువ ఉపయోగపడుతుంది. కనుక ఎప్పుడో ఒకసారి యధాలాపంగా ఆ చట్టమే వాళ్ల నెత్తి నొక్కపెట్టు పెట్టేసరికి వాళ్లు భృకుటి విక్షేపి స్తారు. కాని అంతలోనే మళ్లీ సద్దుకుంటారు. ఇతరుల దుడ్డుకర్రతోకన్న స్వంత దుడ్డు కర్రతో దెబ్బ తినడం తేలిక కదా!'' అని తనకు స్వాభావికమైన వ్యంగ్యధోరణిలో హొహోల్ సమాధానం చెప్పేడు.

## 20

ఒక రోజు రాత్రి తల్లి బల్లదగ్గర కూచుని మేజోళ్ళు అల్లుతోంది. హోహోల్ పురాతన రోమ్ నగరంలో బానిసల తిరుగుబాటును గురించిన పుస్తకాన్ని ఆమెకు చదివి వినిపిస్తున్నాడు. ఇంతలో ఎవరో గట్టిగా తలుపు తట్టేప్పటికి హోహోల్ లేచి తలుపు తీసేడు. వెసొవ్ శ్చికోవ్ ఒక మూట చంకనెట్టుకుని లోపలి కొచ్చాడు. టోపీ తలమీద వెనక్కి పెట్టుకున్నాడు. మోకాళ్ళవరకూ బురద చిందులున్నాయి.

"ఇప్పుడే జైలునుంచి వస్తున్నాను. ఇలా వెడుతుంటే వెలుతురు కనిపించింది. కనుక ఒకసారి పలకరించి పోదామని వచ్చాను" అంటూ నీలొవ్నా చెయ్యి పట్టుకుని హృదయపూర్వకంగా చాలనం చేశాడు. "పావెల్ నిన్ను మరీమరీ అడిగేడు. వందనం చెప్పమన్నాడు" అన్నాడు.

కొంచెం యిబ్బందిగా కూచుని, గది నాలుగు మూలలా ఏదో అనుమానంతో చూశాడు.

ఇంతకు పూర్వం తల్లికి అతనంటే అంత ఇష్టముండేది కాదు. నలుపలకలగా ఉండే అతని తల, చిన్న కళ్ళూ, చూస్తే ఆమెకేదో భయంగా ఉండేది. ఈ రాత్రి మాత్రం అతన్ని చూస్తే ఆమెకెంతో సంతోషమైంది. అతనితో నవ్వుతూ మాట్లాడింది.

"ఎంత చిక్కిపోయావు! ఇతనికి కొంచెం టీ ఇద్దామా, అన్ద్ర్యూషా?"

"నేనప్పుడే సమొవార్ రాజబెడుతున్నాను" అని హోహోల్ వంటింట్లోనుంచి కేకేశాడు.

"పావెల్ ఎలా ఉన్నాడు? నిన్నేనా ఇంకెవర్నైనా విడుదల చేశారా?"

నికొలాయ్ తలొంచుకున్నాడు.

"పావెల్ అక్కడ ఓరిమితో కాచుకున్నాడు. నన్ను ఒక్కడినే వదిలిపెట్టేరు" అని తల్లికేసి తలెత్తి చూశాడు. పళ్ళు బిగించి నెమ్మదిగా ఇలా అన్నాడు: "నేను వాళ్ళతో చెప్పేశాను. 'నేననుభవించిందేదో అనుభవించాను. చాలు. ఇక నన్ను వదిలెయ్యండి. వదలకపోతే, ఎవళ్ళనో ఒకళ్ళను చంపి, నే చస్తాను.' కనుక వాళ్ళు నన్ను వదిలేశారు."

"ఆహా! అదా సంగతి!" అంది తల్లి తటాలున వెనక్కి తగ్గి. అప్రయత్నంగా ఆమె గుడ్లు మిణకరించింది. సునిశితమైన అతని సన్నని కళ్ళకేసి చూసింది.

"ఫ్యొదొర్ మాజిన్ ఎలా ఉన్నాడు? ఇంకా పద్యాలు రాస్తున్నాడా?" అని వంటింట్లోంచి హోహోల్ అడిగేడు.

"ఆహా! అది నాకు మాత్రం అర్థం కాదు" అని తలూపుతూ నికొలాయ్ బదులు చెప్పేడు. "అతను కేనరీపిట్టా? పంజరంలో పెట్టినా పాడడం మొదలెడుతుంది.... నాకు తెలిసేదొకటే – నాకు యింటి కెళ్ళాలని లేదు."

"నీకు ఇంటికెళ్లడాని కేముంది? ఖాళీ యిల్లు. కుంపట్లో నిప్పేసే దిక్కూ లేదు. అంతా చప్పగా చల్లారిపోయింది...." అని తల్లి సానుభూతితో జాలిగా చెప్పింది.

అతడేమీ మాట్లాడలేదు. ఆమెకేసి ఓరకంటితో కొంత సేపు చూశాడు. తర్వాత జేబులోనుంచి సిగరెట్ పాకెట్ తీసి దానిలోనుంచి ఒక సిగరెట్ ముట్టించి, చిరాకుగా ఉన్న కుక్క మొరిగినట్లు సంతోషంలేని నవ్వు నవ్వేడు. సిగరెట్‌లోనుంచి లేస్తున్న బూడిదరంగు పొగలు గాలిలో కలిసిపోతుంటే ఇలా అన్నాడు:

"అవును. అంతా మొద్దుకట్టుకుపోయిందనుకుంటాను.... గడ్డకట్టుకుపోయిన బొద్దింకలు నేలమీద పడుంటాయి. గడ్డకట్టుకుపోయిన ఎలకలు కూడా.... ఈ రాత్రికి నన్నిక్కడ ఉండనిస్తావా, పెలగేయా నీలొవ్నా?"

"ఉన్నంకోచంగా" అని వెంటనే ఆమె జవాబుచెప్పింది. అతనికెదురుగా ఉంటే ఆమెకేదో బాధనిపించింది.

"ఈ రోజుల్లో కొందరు తలితండ్రులను చూచి సిగ్గుపడవలసొస్తోంది...." అన్నాడు నికొలాయ్.

"ఏమిటి?" అని తల్లి అదిరిపడి అడిగింది.

అతడామెకేసి ఒకసారి తేరిపారచూసి కళ్లు మూసుకున్నాడు. దానితో అతని స్ఫోటకపు మచ్చల ముఖం గుడ్డివాని ముఖంలా కనబడింది.

"తల్లిదండ్రులను చూసి పిల్లలు సిగ్గుపడవలసొస్తోందంటున్నా" అని నిట్టూర్చి రెట్టించాడు. "పావెల్ నిన్ను గురించి ఎప్పుడూ సిగ్గుపడడు. కాని మా ముసలాయన్ని గురించి నేను సిగ్గుపడుతున్నాను. ఆయనింట్లో ఎన్నడూ నేను అడుగు పెట్టదలచుకోలేదు. నాకు తండ్రీ లేడు. కొంపా లేదు. ఉంటే పోలీసువాళ్ల దగ్గిరైనా ఉంటాను. లేకపోతే సైబీరియాకి పోతాను. అక్కడ ప్రవాసంలో ఉన్న జనాన్ని విడిపిస్తాను. వాళ్లు పారిపోవడానికి తోడ్పడతాను...."

సున్నితమైన మాతృహృదయానికి అతడు చాలా బాధపడుతున్నట్లు స్ఫురించింది. కాని అతన్ని గురించి జాలి కలగలేదు.

"నీ అభిప్రాయం అలా ఉంటే, నువ్వు వెళ్లిపోవడమే మంచిది." ఏమీ అనకుండా ఊరుకుంటే అతనికి బాధ కలుగుతుందని అలా అంది.

అన్‌ద్రేయ్ వంటింట్లోంచి ఇవతల కొచ్చాడు.

"ఏమిటంటున్నావు?" అని నవ్వేడు.

తల్లి లేచి నిలబడి,

"నే వెడుతున్నాను. తినడానికేమైనా పట్టుకొస్తాను" అంది.

నికొలాయ్ హొహోల్‌కేసి కొంచెం సేపు తదేక దృష్టితో చూశాడు. తర్వాత హఠాత్తుగా: ''కొందరు మనుషుల్ని చంపేయాలనుకుంటాను'' అన్నాడు.

''ఓహో! ఎందుకో?'' అని హొహోల్ అడిగేడు.

''వాళ్ల పీడ వదిల్చేయడానికే.''

పొడుగ్గా సన్నంగా ఉండే హొహోల్, గది మధ్యలో నిలబడి చేతులు జేబుల్లో వేసుకొని నికొలాయ్‌ని చూస్తున్నాడు. నికొలాయ్ కుర్చీలో మందకొడిగా కూచున్నాడు. సిగరెట్ పొగ అతనిని ఆవరించింది. ముఖంమీద ఎర్రని మచ్చలు లేచాయి.

''ఇసాయ్ గొర్‌బోవ్ తలకాయ తీసేస్తాను.... తీసెయ్యకపోతే.... నువ్వే చూస్తావుగా!''

''ఎందుకు?''

''అతను గూఢచారి.... అధికారుల దగ్గరకి మాటలు మోస్తూంటాడు. వాడే మా నాన్నను పాడు చేసినవాడు, వాడే ఆయన్ని కూడా మచ్చుపిట్టగా తయారుచేశాడు'' అని వెసొవ్‌శ్చికోవ్ అన్‌ద్రేయ్‌కేసి చిరచిరలాడుతూ చూశాడు.

''అదంతే! కాని దానికి నిన్ను బాధ్యుని చేసే అవివేకులుండరు కదా!'' అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు హొహోల్.

''తెలివైనవాళ్లూ, తెలివితక్కువవాళ్లూ ఒకలాగే ఉంటారు!'' అని నికొలాయ్ గట్టిగా రెట్టించాడు. ''పావెల్, నువ్వూ ఉన్నారు కదా. మీరిద్దరూ తెలివైనవాళ్లే. మీ దృష్టిలో నేను, ఫ్యోదొర్ మాజిన్, సమోయ్‌లొవ్ ఒక్కటే నంటావా? లేక పావెలూ, నువ్వూ ఒకరి నొకరు చూసుకునేటట్లే నన్నూ చూస్తావా? అబద్ధమాడకుండా చెప్పు. ఏమైనా నిన్ను నమ్మనులే! మీరంతా నన్నొక పక్కకు నెట్టేస్తుంటారు. నన్నుంచవలసిన చోట ఉంచుతారు....''

''నికొలాయ్! నీ ఆత్మకొక తెగులు పట్టింది!'' అని హొహోల్ అతని పక్కన కూచుని మెల్లగా చెప్పేడు.

''నిజమే. తెగులే. అయితే నీ ఆత్మ కూడా అలాటిదే. కాకపోతే నీ ఆత్మకు పట్టిన తెగులు, నా ఆత్మకు పట్టిన జబ్బుకంటె ఉన్నత స్థాయిలోదని నీ అభిప్రాయం. మనమంతా ఒకళ్ల నొకళ్లు కుక్కలకొడుకుల్లా చూస్తుంటాం. నేను చెప్పగలిగింది యింతే. ఏమంటావ్? అంతేనా నిజం చెప్పు.''

అంటూ అతడు తన దృష్టిని అన్‌ద్రేయ్ ముఖంమీద సారించి, జవాబుకోసం నోరు తెరుచుకు కూచున్నాడు. దద్దుర్లెక్కిన అతని ముఖంలోని వ్యక్తిత్వమేమీ మార్పు చెందలేదు. కాని దళసరిగా ఉండే పెదవులు అదిరేయి.

వెసొవ్‌శ్చికోవ్ చూపులోని తీవ్ర దృష్టిని పరికించడంతోనే హొహోల్ విచారంతో నవ్వి:

''నేనేమీ చెప్పలేకపోతున్నాను. హృదయంలోని గాయాలన్నిటినుండీ రక్తం కారుతు

న్నప్పుడు ఆ మనిషితో వాదించడంవల్ల అతన్నింకా బాధించడమే అవుతుందని నేనెరుగుదును. ఆ సంగతి నాకు బాగా తెలుసు!'' అన్నాడు.

''నేను నీతో వాదించలేను. ఎలా వాదించాలో నాకు తెలియదు'' అని వేలకేసి చూస్తూ నికొలాయ్ గొణిగేడు.

''మనమిద్దరం, ఎవళ్లంతటు వాళ్లం, కంటక మార్గాల్లో సంచరించాం. కష్టాలొచ్చినప్పుడు నీలాగే ఎవరి మట్టుకు వాళ్లు దుఃఖంతో మూలిగేం....'' అని హొహోల్ ఇంకా చెప్పబోతున్నాడు.

వెసొవ్‌శ్చికోవ్ మాటకడ్డొచ్చి మెల్లగా ఇలా చెప్పేడు:

''నువ్వు నాకు చెప్పగలిగిందేమీ లేదు. నా ఆత్మ తోడేలులా మొరుగుతోంది!''

''నేనేమీ చెప్పదలచుకోలేదు. ఈ అవస్థ దాటిపోతుందని నాకు తెలుసు. పూర్తిగా కాకపోయినా దాటిపోతుంది.''

ఒక నవ్వు నవ్వి నికొలాయ్ భుజం తట్టుతూ కూచున్నాడు.

''ఇది పొంగులాంటి చిన్నపిల్లల జబ్బు. ఎప్పుడో ఒకప్పుడు మనకందరికీ ఇది సోకుతుంది. బలమైనవాళ్లకు సోకితే తేలిగ్గా తగ్గిపోతుంది. బలహీనులకు సోకినప్పుడు వాళ్లు కొంచెం కష్టపడతారు. మన సంగతేమిటో మనకు కొద్దికొద్దిగా తెలిసే రోజుల్లో, పూర్తిగా జీవితాన్ని అవగాహన చేసుకుని, అందులో మన స్థానమేమిటో తెలియని సమయంలో ఇది మనల్ని ఆవహిస్తుంది. ప్రపంచంలోకల్లా నువ్వే గొప్పవాడవనీ, ప్రతివాళ్లూ నీ దగ్గర్నుంచి ఏదో సంగ్రహించదలచుకున్నారనీ అనిపిస్తుంది. కొంతకాలం పోయాక, ఇతరుల గుండెల్లో కూడా పెద్ద ఆత్మే ఉన్నదనీ, అది నీ ఆత్మ కేవిధంగానూ తీసిపోదనీ తెలుస్తుంది. అంతటితో సంగతులన్నీ తేలిగ్గా అర్థమవుతాయి. అప్పుడు బుల్లి గంట నొకదాన్ని పుచ్చుకుని, గంటల గోపురాన్నెక్కినందుకు నీకు సిగ్గేస్తుంది. ఆ గంటలగోపురం గణగణ ధ్వనిలో నీ చిన్న గంట శబ్దం వినబడదు. కాని ఆ గోపురంమీదనుండే అసంఖ్యాకమైన గంటల గణగణ శబ్దానికి నీ చిన్ని గంట కూడా బాగానే శ్రుతి కలిపిందని తెలుసుకుంటావు. చమురులో పడి మునిగి పోయిన ఈగలాగ నువ్వు వాయించే చిన్న గంట ధ్వని పెద్ద గంటల ధ్వనిలో ఏవ్యమైనా సరే. నేనేమి చెప్పడానికి ప్రయత్నిస్తున్నానో తెలుస్తోందా?''

''తెలుస్తోందనుకుంటాను. కాని నేనేమీ నమ్మదలచుకోలేదు'' అన్నాడు తలూపుతూ నికొలాయ్.

హొహోల్ నవ్వుతూ ఎగిరి గంతేసి చప్పుడు చేస్తూ నడవడం మొదలెట్టేడు.

''నేనూ నమ్మేవాడివి కాదోయ్, బండరాయ్!''

''బండరాయి అనెందుకంటావు?'' చిరచిరలాడుతూ నవ్వి నికొలాయ్ హొహోల్ నడిగేడు.

''ఎందుకంటావా? నువ్వల్లాగున్నావు కనుక.''

హఠాత్తుగా నికొలాయ్ విరగబడి నవ్వేడు.

హొహోల్ అతని ఎదురుగా నిలబడి:

"ఎందుకలా నవ్వుతున్నావ్?" అని అడిగేడు.

"నీ మనస్సును నొప్పించే వాడెంత అవివేకి అనే భావం స్ఫురించింది" అని నికొలాయ్ జవాబుచెప్పేడు.

"నా మనస్సు నెవరు నొప్పించగలరు?" అని భుజలెగరేశాడు హొహోల్.

"నాకు తెలియదు. ఎవరైనా నీకు నొప్పి కలిగిస్తే వాడు చాలా బాధపడక తప్పదని నా అభిప్రాయం" అని వెసొవ్ శ్చికోవ్ ఉల్లాసంగా నవ్వుతూ అన్నాడు.

"అదా సంగతి!" అంటూ హొహోల్ కూడా నవ్వేడు.

"అన్ద్ర్యూషా!" అంటూ వంటింట్లోంచి తల్లి కేకేసింది.

అన్ద్రేయ్ బయటికెళ్లేడు.

వెసొవ్ శ్చికోవ్ గదిలో ఒంటరిగా ఉండిపోయాడు. గదంతా ఒకసారి కలయజూసి మోటైన బూటు తొడిగున్న ఒక కాలును చాచుకుని పిక్క పట్టుకుని జాగ్రత్తగా పరిశీలించాడు. చేయి పైకెత్తి కొవ్విన తన అరచేతినీ, లావుగా పసుపు వెంట్రుకలతో కూడిన వ్రేళ్లనూ పరీక్షగా చూసుకున్నాడు. విసుగ్గా ఒక్కసారి చేయి ఝాడించి లేచాడు.

అన్ద్రేయ్ సమొవార్ని పట్టుకొచ్చేసరికి అతడు అద్దం ముందర నిలబడున్నాడు.

"చాలా రోజులైనాక నా ముంతను నేను మొదటి సారిగా చూసుకుంటున్నాను" అన్నాడు. ఒక వంకర నవ్వు నవ్వుతూ, "బలే ముంత!" అని రెట్టించాడు.

"దాన్ని గురించి నీకంత లక్ష్యమెందుకు?" అని హొహోల్ అడిగేడు.

"ముఖం ఆత్మకు దర్పణమంటుంది సాషా" అన్నాడు నిదానంగా నికొలాయ్.

"శుద్ధ తప్పు మాట. ఆమె ముక్కు చేపలు పట్టే గాలంలా ఉంటుంది. చెంపలమీది ఎముకలు కత్తుల్లా ఉంటాయి. కాని ఆమె ఆత్మ మాత్రం నక్షత్రంలా ఉంటుంది" అన్నాడు హొహోల్.

నికొలాయ్ అతనికేసి తీక్షణంగా చూసి మెల్లగా నవ్వేడు.

వాళ్లు టీ తాగడం ప్రారంభించారు.

నికొలాయ్ ఉడికిన ఒక బంగాళా దుంపను తీసుకుని, బ్రెడ్డుమీద కాస్త ఉప్పు చల్లుకుని నెమ్మదిగా, నిదానంగా ఎద్దులాగ నమలడం మొదలెట్టేడు.

"ఇక్కడ వ్యవహారాలెలా సాగుతున్నాయి?" అని నోటి నిండా నములుతూనే అడిగేడు.

అన్ద్రేయ్ ఫ్యాక్టరీలో ప్రచారం బాగానే సాగుతున్న శుభవార్త చెప్పగానే అతడు మళ్లీ విచారగ్రస్తుడైనాడు.

“ఈ పని చాలా ఆలస్యమవుతోంది! చాలా ఆలస్యం.... మనమింతకన్న చురుగ్గా పని సాగించాలి!”

తల్లి అతనికేసి చూస్తుంటే, ఆమె హృదయంలో ఒక విధమైన ప్రాతికూల్యం ఉత్పన్నమైంది.

“కొరడాతో కొట్టి పరుగెత్తించడానికి జీవితం గుర్రంలాంటిది కాదు” అన్నాడు అన్‌ద్రేయ్.

నికొలాయ్ అనంగీకారసూచకంగా తలూపేడు.

“అబ్బే! చాలా కాలం. నేనిలా ఓపిక పట్టలేను. నన్నేం చెయ్యమంటావ్?”

జవాబుకోసం హొహోల్‌కేసి చూస్తూ నిస్పృహాసూచకంగా చేతులూపాడు.

“మనమంతా బాగా చదువుకుని ఇతరులకు బోధించాలి. మనం చేయవలసిన పని అది” అని తలవాల్చి అన్‌ద్రేయ్ చెప్పేడు.

“అయితే మనం పోరాటాన్ని ప్రారంభించడమెప్పుడు?” అని వెసొవ్‌శ్చికొవ్ అడిగేడు.

“మనం పోరాటమెప్పుడు ప్రారంభిస్తామో నాకు తెలియదు కాని, ఈ లోపుగా వాళ్ళు మనల్ని చాలా సార్లు పీపులు చిట్లగొడతారని మాత్రం నేనెరుగుదును” అని నవ్వుతూ హొహోల్ బదులు చెప్పేడు. “నేను చూడగలిగినంతలో, మనం చేతుల్తో ప్రయోగించే ఆయుధాలకన్న బుర్ర ఉపయోగించే ఆయుధాలను సేకరించుకోవాలి” అన్నాడు.

నికొలాయ్ మళ్ళీ తినడం ప్రారంభించాడు. తల్లి అతని విశాలమైన ముఖంకేసి రహస్యంగా పరిశీలించింది. అతనిలో ఉండే మంచి ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నించింది.

చిన్నవైన కళ్ళతో అతడు చూసే వాడి చూపుల నామె ఎదుర్కొంది. అందుపైన ఆమె కనుబొమలు అదరనారంభించాయి. అన్‌ద్రేయ్ ఆవేదనలో పడ్డాడు. హఠాత్తుగా నవ్వుతూ మాట్లాడ్డం మొదలెట్టేవాడు. గభాలున మానేసి ఈలెయ్యడం ప్రారంభించేవాడు.

అతన్ని బాధించే విషయ మేమిటో తనకు తెలుసుననుకుంది తల్లి. నికొలాయ్ ఆలోచనా నిమగ్నుడై కూచున్నాడు. హొహోల్ చెప్పిన మాటలకన్నిటికీ అయిష్టంగానైనా కరుగ్గా జవాబులుచెప్పేడు.

ఆ చిన్న గదిలో తల్లికీ, అన్‌ద్రేయ్‌కీ చాలా ఇరుకనిపించింది. చాలా అసౌకర్యంగా ఉన్నట్లనిపించింది. వాళ్ళిద్దరూ ఒకరి తర్వాత ఒకరు తమ అతిథిని తేరిపారచూస్తూవచ్చారు.

చివరకతడు లేచి ఇలా అన్నాడు:

“నేనిక పడుకుంటాను. ఆ జైల్లో కూచుంటే దాదాపు నాకు పిచ్చెక్కినట్లయింది. అప్పుడు హఠాత్తుగా వాళ్ళు నన్ను వదిలిపెట్టేశారు. నాకు చాలా అలసటగా ఉంది.”

అతడు మెల్లిగా వంటింట్లోకి వెళ్లేడు. కొన్నేపు అటూ ఇటూ తిరిగి నిశ్శబ్దంగా

పడుకున్నాడు. తల్లి చెవులు నిక్క బెట్టుకుని వినడానికి ప్రయత్నించింది. కాని ఏమీ శబ్దమే లేదు.

''అతడు చాలా భయంకరమైన ఆలోచనలు చేస్తున్నాడు'' అని తల్లి అన్‌ద్రేయ్ చెవిలో చెప్పింది.

హొహోల్ తలూపుతూ:

''అతను చాలా క్లిష్టమైన మనిషి! కాని త్వరలో ఈ అవస్థ మారిపోతుంది. ఒకప్పుడు నేనూ అలాగే ఉండేవాడిని. నిప్పు మండడానికి ముందు చాలా పొగలను చిమ్ముతుంది. హృదయంలో అగ్నిజ్వాల వెలుగొందే ముందు పొగ రాకతప్పదు. మామ్మా! పడుకోండి. నేను కాస్సేపు చదువుకుంటాను'' అన్నాడు.

ఒక మూల గుడ్డతెరల వెనుకనున్న మంచంమీద తల్లి పడుకుంది. చాలా సేపటి వరకూ ఆమె నిట్టూర్పులు విడుస్తుండడం, ప్రార్థన చేస్తుండడం అన్‌ద్రేయ్ వింటూనే ఉన్నాడు. అతడు త్వరత్వరగా తాను చదువుతున్న పుస్తకం పేజీలు తిరగేశాడు. నుదురుమీద మర్దన చేసుకున్నాడు. పొడుగుపాటి వేళ్లతో మీసాలు తిప్పుకున్నాడు. కాళ్లు కదుపుకున్నాడు. గడియారం టిక్‌టిక్ మంటోంది. చెట్లమీదనుంచి గాలి రయ్యిమంటూ వీస్తోంది.

''అయ్యో! ప్రపంచంలో ఎంతోమంది ఉన్నారు! అందరూ వాళ్ల బాధలతో వాళ్లు మూలుగుతూ ఉన్నారు. సౌఖ్యవంతులెక్కడున్నారో కదా!'' అంటూ మెల్లని స్వరంతో తల్లి ఆక్రందనం వినబడింది.

''ఉన్నారు కొద్దిమంది, త్వరలో అలాటివాళ్లు గుంపులుగుంపులుగా ఉంటారు. గుంపులుగుంపులే!'' అని అన్‌ద్రేయ్ బదులుచెప్పేడు.

## 21

జీవితం త్వరితంగా సాగిపోతోంది. ఒక రోజులా లేదు ఇంకో రోజు. రోజురోజూ కొత్తదేదో జరుగుతూనే ఉంది. మునుపటిలాగున కొత్తవాళ్లొస్తే బెదరడం తల్లి మానేసింది. మునుపటికన్న తరుచుగా కొత్త మనుష్యులు రాత్రిళ్లొచ్చి అన్‌ద్రేయ్‌తో గుసగుసలాడి పోతుండేవాళ్లు. రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత కోటు కాలర్లు పైకెత్తుకుని టోపీలను కళ్లమీదకు దింపుకుని చీకట్లో నిశ్శబ్దంగా పోతుండేవాళ్లు. పొంగుతున్న ఉద్రేకాన్ని వాళ్లు అణచిపెట్టుకుంటున్న సంగతి నామె గమనించింది. వాళ్లంతా నవ్వుతూ పాటలు పాడుకోవాలని కోరుకుంటున్నా, వాళ్లకు వ్యవధి లేకుండాపోతోంది. వాళ్లెప్పుడూ ఏదో తొందరలోనే ఉంటున్నారు. కొందరు గంభీరంగా వెటకారంగా కనబడతారు. మరికొందరు యౌవనోత్సాహంతో కేరింతాలు ఆడుతూ వుంటారు. ఇంకా కొందరు నెమ్మదిగా ఆలోచనా నిమగ్నులైవుంటారు.

మొత్తంమీద వారంతా ఆత్మవిశ్వాసమూ పట్టుదలా కలవారని తల్లి తెలుసుకోగలిగింది. ఎవరి వ్యక్తిత్వం వారికున్నా అందరి ముఖాలూ ఇమ్మాస్‌కు పోతున్న క్రీస్తు ముఖంలాంటి ముఖంలో ఐక్యమైపోతున్నట్లు ఆమెకగుపించింది. పలచని ముఖం, దీక్ష ప్రస్ఫుటమయే ముఖం; నల్లని కళ్లలో తీక్షణంగా ప్రసరించే వీక్షణాలను ఆమె గుర్తించింది.

తల్లి వాళ్ల సంఖ్యను లెక్కించింది. వాళ్లందరూ పావెల్‌చుట్టూ చేరి, అతడివి శత్రువు దృష్టినుండి తప్పించడానికి ప్రయత్నిస్తున్నట్లు ఆమె మనోనేత్రానికి కగుపడింది.

ఒక రోజున ఉంగరాల జుట్టుగల చురుకైన పిల్ల అన్‌ద్రేయ్‌కోసం పట్టణంనుంచి ఒక కాగితాలకట్ట పట్టుకొచ్చింది. ఆమె వెళ్లిపోతూ తల్లికేసి ఉషారుగా ఒక తళుకు చూపుచూసి:

"కామ్రేడ్, శలవు!" అంది.

"శలవు" అని చిరునవ్వాపుకుంటూ తల్లి సెలవిచ్చింది.

ఆ పిల్లను బయటికి సాగనంపి, కిటికీలోంచి ఆమె చరచర వీధిలో నడుస్తూ పోవడం చూసి తల్లి చిరునవ్వు నవ్వుకుంది. వసంత పుష్పంలోని నవ్యతా, సీతాకోకచిలుక లాటి చురుకుదనం చూచి ఆనందించింది.

ఆ పిల్ల కనుచూపు మేర దాటిపోవడంతోనే, "కామ్రేడ్!" అంటూ తల్లి తనలో తాను గొణుక్కుంది. "ఓహో అమ్మాయీ! భగవంతుడు జీవితాంతంవరకూ విస్మమనరించే నిజమైన కామ్రేడ్‌ను అనుగ్రహించును గాక!" అనుకుంది.

పట్టణంనుంచి వచ్చే ఈ మనుషుల్లో చిన్న పిల్లలకుండే అమాయకత్వంలాంటిదేదో గోచరించడంతో తనలో తానే జాలితో నవ్వుకుంది. కాని వాళ్లలో ఉండే ఆత్మవిశ్వాసం, పట్టుదల ఆమె కాశ్చర్యం కలిగించి, వారిపట్ల ఎంతో ప్రేమను పురిగొల్పాయి. రోజు రోజుకూ వాళ్ల మంచితనాన్నీ, కార్యదీక్షనూ ఆమె గుర్తించకలిగింది. న్యాయానికి విజయం కలిగి తీరుతుందని వారు కలలు కంటుంటే ఆమె హృదయం ఉప్పొంగేది. మనసుకొక సంతృప్తి కలిగేది. కాని వాళ్లు మాట్లాడుకునే మాటలు విన్నప్పుడు మాత్రం ఆమె విచారంగా నిట్టూరుస్తూ ఉండేది. ముఖ్యంగా, వాళ్ల పరిపూర్ణమైన నిరాడంబరత్వమూ, స్వీయ సుఖంపట్ల పూర్తి అలక్ష్యమూ, ఆమెను బాగా ఆకర్షించాయి.

తల్లికి చాలవరకు జీవితాన్ని గురించి వాళ్లనుకునే మాటలు అవగాహనైనాయి. మానవుల కష్టాలకు మూలకారణాలను వాళ్లు తెలుసుకున్నారని ఆమెకు విశ్వాసం కలిగింది. వాళ్ల భావాలను చాలావరకామె అంగీకరించింది. కాని ఆమె హృదయాంతరాళంలో మాత్రం వాళ్లు జీవితాన్ని పునర్నిర్మించగలరనే నమ్మకం కలగలేదు. వాళ్లు అంటించిన చలిమంట చుట్టూ కార్మికజనమంతా చలికాగుతారనే విశ్వాసమామెకు కుదరలేదు. ఏరోజుకారోజు ఎవరి పొట్ట నింపుకోవడానికి వాళ్లు దేవులాడేవాళ్లే కాని రేపటి దాకా ఆగుదామనేవాళ్లు లేరు. కొద్దిమంది మాత్రమే సుదీర్ఘమైన కష్ట భూయిష్టమైన మార్గాన్ననుసరించడానికి

అంగీకరిస్తారు. చివరకు మానవులంతా సోదర భావంతో చేరుకునే రాజ్యంయొక్క అద్భుత స్వరూపాన్ని మనోనేత్రంతో చూడగలిగిన వారెందరో లేరు. ఆ కారణంచేతనే ఉత్తములైన ఈ జనమంతా ఆమెకు చంటిపిల్లల్లా ఆనేరు. తరుచుగా అలసటచేత నీరసంగా ఉన్న ముఖాలపై మీసాలూ గెడ్డాలూ పెరిగినా, ముఖంలో ముసలితనం కనబడుతున్నా, అందరూ ఆమె దృష్టిలో పిల్లలే.

"పాపం! పిల్లలు" అనుకుంది.

కాని వాళ్లందరూ నిజాయితీ, గాంభీర్యమూ, వివేకమూగల జీవితాన్ని సాగిస్తున్నారు. ఏదో మంచి పనిచేయాలనే అనుకుంటున్నారు. వాళ్లకు తెలిసిన విషయాలను ఇతరులకు చెప్పడానికి, ఒళ్లు దాచుకోకుండా కష్టపడుతున్నారు. అలాటి జీవితంలో ఉండే ప్రమాదాల నెరిగి కూడా, కొందరు ఆ జీవితాన్ని ఎందుకు గడుపుతున్నారో ఆమె గుర్తించింది. ఒక్క నిట్టూర్పు విడిచి, ప్రవాహంలా సాగిపోయిన తన గత జీవితంలోని కష్టాలను జ్ఞాపకం తెచ్చుకుంది. ఆలోచించినకొద్దీ క్రమక్రమంగా తాను ఈ నూతన జీవితంలో ప్రముఖ పాత్రను వహించవలసిన అగత్యాన్నామె గుర్తించింది. ఇదివరకు తానెవ్వరికైనా ఉపయోగ పడగలననే నమ్మకమామెకు లేదు. కాని ఇప్పుడు చాలామందికి తన అవసరమున్నదని ఆమె స్పష్టంగా తెలుసుకుంది. ఇది ఆమెకు కొత్తగా కలిగిన సుఖానుభూతి. ఆమె తలెత్తుకు తిరగగల ధైర్యాన్నిచ్చిన అనుభూతి....

ఫ్యాక్టరీలోకి కరపత్రాలను అందచేయడం తన ధర్మంగా భావించి తల్లి క్రమం తప్ప కుండా ఆ పని చేసింది. గూఢచారులామెను చూడ్డానికి అలవాటుపడ్డారు. కొన్ని సార్లు ఆమెను సోదా చేశారు. కాని కరపత్రాలు లోపలి కొచ్చిన మర్నాడే ఆ పని జరుగుతుండేది. ఆమె దగ్గర కాగితాలేమీ లేనప్పుడు, కాపలావాళ్ల కనుమానం కలిగేటట్లు చెయ్యడమెలాగో ఆమెకు తెలిసింది. ఆ పనిచేయడంతోనే వాళ్లు ఆమెను పట్టుకుని సోదా చేస్తుండేవాళ్లు. వాళ్లతో వాదన పెట్టుకుని తనను అగౌరవ పరుస్తున్నట్లు నటించేది. ఆవిధంగా వాళ్లను సిగ్గుపడేటట్లు చేసి, తన తెలివితేటలకు గర్వపడుతూ ఫ్యాక్టరీలోపలికెళ్లిపోయేది. ఈ నాటకమామెకెంతో సంతోషదాయకంగా ఉండేది.

వెసొవ్‌శ్చికోవ్‌ను ఫ్యాక్టరీవాళ్లు మళ్లీ పనిలోకి తీసుకోలేదు. ఒక కలప అడితిలో అతడు పనికి కుదిరేడు. దుంగలను, పలకలను, వంటచెరుకునూ తర్లిస్తూ ఉండడం అతని పని. దాదాపు ప్రతి రోజూ అతడు కలపను తన ఇంటి ముందరనుంచి తర్లిస్తుండడం తల్లి చూసింది. ముందుగా బక్కచిక్కిన రెండు నల్ల గుర్రాలు ఈడవలేక ఈడవలేక బాధను అనుభవించుతూ మకమకలాడుతూన్న కళ్లను మిటకరించుతూ, భారంగా తలలు కుదుపుకుంటూ నడిచేవి. వాటి వెనకాల ఒక తడి దుంగో, బల్లచెక్కలో దడదడలాడుతూ ఈడ్వబడుతుండేవి. గుర్రాల పక్కన నికొలాయ్ కళ్లేలు ఒదులుగా చేత్తో పట్టుకుని నడు

స్తుండే వాడు. అపరిశుభ్రంగా చినిగిన గుడ్డలు ధరించి, బరువైన బూట్లు తొడుక్కుని, టోపీ తల వెనక్కి పెట్టుకుని, అప్పుడే భూమినుంచి తవ్వి తెచ్చిన మోదులాగ బొద్దుగా అసహ్యంగా కనబడేవాడు. అతడు కూడా గుర్రాలలాగే నేల చూపులు చూస్తూ తల కుదుపు కుంటూ నడుస్తుండేవాడు. అతని గుర్రాలు గుడ్డిగా ఎదుటనుంచి వచ్చే బండ్లనూ మనుష్యుల్నీ ఢీక్కుంటూ ఉండేవి. అలాటప్పుడు ఎదుటివాళ్లు నికొలాయ్‌మీద కేకలేసి అడ్డమైన తిట్లూ తిడుతూ, కందిరీగల తుట్టెలాగున చుట్టుముట్టేవారు. అతడు వాళ్ల కేమీ జవాబు చెప్పేవాడు కాదు. తలెత్తి చూసేవాడు కాదు. రంయ్యి మని ఒకసారి ఈల వేసి, "పదండే!" అని గుర్రాల నదలించేవాడు.

విదేశాలనుండి వచ్చిన కరపత్రాన్నో, వార్తాపత్రికనో చదివి వినిపించడానికి అన్‌ద్రేయ్ కామ్రేడ్ల నందరినీ ఇంటికి రప్పించినప్పుడు, నికొలాయ్ వచ్చి ఒక మూల కూచుని గంటో రెండు గంటలో మౌనంగా వింటూ కూచునేవాడు. చదవడం అయిపోయాక యువకులు కొందరు చాలా తీవ్రంగా చర్చలు సాగిస్తుండేవాళ్లు. ఆ చర్చల్లో ఎన్నడూ వెసొవ్‌ష్చికోవ్ పాల్గొనేవాడు కాదు. అందరూ వెళ్లిపోయేదాకా కూర్చుని ఒంటరిగా అన్‌ద్రేయ్‌తో మాట్లాడుతుండేవాడు. ఒకసారి:

"ఇందులో ఎవరిదెక్కువ తప్పనాలి?" అని విచారంతో అడిగేవాడు.

"'ఇది నాది' అనే మాట ముందుగా ఎవడన్నాడో వాడిదీ అసలు తప్పు. వాడు మరణించి కొన్ని వేల సంవత్సరాలైంది. కనుక వాడిమీద ఆగ్రహపడి ఏమీ ప్రయోజనం లేదు" అని హొహోల్ వేళాకోళంగా జవాబుచెప్పేదు. కాని ఒక విధమైన ఆందోళన అతడి కళ్లలో కనిపించేది.

"ధనికుల మాటేమిటి? వాళ్లకి దమ్మిచ్చేవాళ్ల మాటేమిటి?"

హొహోల్ జుట్టు నిమురుకుంటూ మీసాలు మెలేసుకుంటూ, జీవితాన్ని గురించీ, ప్రజల్ని గురించీ తనకు తెలిసినంతవరకు అతనికి తెలియచెప్పడానికి తేలికైన మాటలను ఉపయోగించేవాడు. అందరిలోనూ తప్పు ఉన్నదని అతని మతం. కాని ఆ మాట నికొలాయ్‌కు తృప్తికరంగా లేదు. దళసరిగా ఉండే పెదవులను కొరుక్కుంటూ, అసమ్మతి సూచకంగా తలూపేవాడు. కాదు కాదని గొణిగేవాడు. చివరకు విచారంతో అసంతృప్తితో సెలవు పుచ్చుకునేవాడు.

ఒక రోజున:

"ఎవరిలోనో ఒకరిలో తప్పుండాలి" అన్నాడు. "అలాటివాళ్లు ఇక్కడే ఉన్నారు! వాళ్లను ఏరిపారేయాలి. నిర్దాక్షిణ్యంగా, పంటచేలల్లోనుంచి కలుపు మొక్కలను దున్ని పారేసినట్లు మన జీవితాన్ని కూడా దున్నేసెయ్యాలి."



9–460

"ఒక రోజున టైమ్‌కీపర్ ఇసాయ్ నిన్ను గురించి కూడా అలాగే అన్నాడు" అని తల్లి జ్ఞాపకం చేసింది.

"ఇసాయా?" అని అతడు రెట్టించాడు.

"అవును. నీచుడు! ఇళ్ల చుట్టూ దొంగలా తిరుగుతూ రకరకాల ప్రశ్నలేస్తూ ఉంటాడు. మా వీధిలోకి కూడా వచ్చి కిటికీలోకి తొంగిచూడ్డం ప్రారంభించాడు."

"కిటికీలోకి తొంగిచూస్తున్నాడా?" అని నికొలాయ్ రెట్టించి అడిగేడు.

తల్లి మంచంమీద పడుకుని ఉండడంచేత అతని ముఖాన్ని చూడలేకపోయింది.

"వాడికంత పని పాటులు లేకుండా ఉంటే తొంగిచూడనియ్యి" అని హొహోల్ సమయానికి మాటడ్డెయ్యడంతోనే తానెంత పొరబాటు మాట మాట్లాడిందో తల్లికి అర్థమైంది.

"అదేమీ కాదు. తప్పు చేస్తున్నవాళ్లలో అతడొకడు" అన్నాడు నికొలాయ్.

"అతని తప్పేమిటి? అతడు అవివేకి కావడమా?" అని చటుక్కున హొహోల్ అడిగేడు.

వెసొవ్‌శ్చికోవ్ ఏమీ మాట్లాడకుండానే బయటికెళ్లిపోయాడు.

హొహోల్ నెమ్మదిగా భారంగా గదిలో పచారుచేయడం మొదలెట్టేడు. పొడుగు కాళ్లలా సన్నంగా పొడుగ్గా ఉండే కాళ్ల విసురు పక్కగదిలోకి వినబడుతోంది. తల్లికి నిద్రాభంగం కలుగకుండా ఉండేటందుకు, మామూలు ప్రకారం బూట్లు విడిచేశాడు. కాని ఆమె నిద్రపోలేదు. నికొలాయ్ వెళ్లడంతోనే:

"అతనంటే నాకు చాలా భయం" అంది ఆత్రంగా.

"హుం" అని హొహోల్ దీర్ఘం తీశాడు. "అతను చాలా పట్టుదల మనిషి. అతని ఎదుట ఎప్పుడూ ఇసాయ్ మాటెత్తకండి మామ్మా! ఇసాయ్ నిజంగా గూఢచారే సుమండీ!"

"అందులో వింతేమీ లేదు. అతని బంధువొక పోలీసు!" అని తల్లి జవాబు చెప్పింది.

హొహోల్ కొంచెం గాభరాగా మాట్లాడ్డం మొదలెట్టేడు.

"నికొలాయ్ ఈమధ్య ఏదో ఒక రోజున అతన్ని గట్టిగా వీపు చిట్టగొడతాడు. అధికారంలో ఉన్న పెద్దమనుషులు సామాన్య జనంలో ఎలాటి విద్వేష భావాలను పెంచుతున్నారో చూశారూ? నికొలాయ్‌లాంటి మనుషులు తమకు జరుగుతున్న అపచారాలను గ్రహించి, ప్రాణం విసిగితే ఏమవుతుందనుకుంటున్నారు? భూమ్యాకాశాలు రక్తసిక్తమైపోతాయి."

"అబ్బ! భయంకరం, అన్‌ద్ర్యూషా!" అని తల్లి ఆశ్చర్యచకితురాలైంది.

అన్‌ద్రేయ్ ఒక్క నిముషముండి ఇలా అన్నాడు:

"సరే! ఈగల్ని మింగడం ఎందుకు, వాంతి చేసుకోడమెందుకు?... అయితే అధికారులయొక్క ప్రతి రక్తబిందువూ, వాళ్లేడిపిస్తుండే జనంయొక్క కన్నీటి సముద్రాల్లో కలిసిపోతుంది...." అతడొక చిన్ననవ్వు నవ్వి "ఇది అక్షరాలా నిజం. కాని ఇది మనసేమీ ఓదార్చదు" అన్నాడు.

## 22

ఒక ఆదివారంనాడు తల్లి బజారు కెళ్ళి సరుకులు కొనుక్కుని ఇంటికొచ్చి తలుపు తెరుచుకుని, సంతోషంతో గుమ్మంలోనే నిలబడిపోయింది. లోపలనుంచి పావెల్ విస్పష్టమైన కంఠధ్వని వినబడింది.

"అదిగో! ఆమె వచ్చింది!" అని హాహోల్ కేకేశాడు.

పావెల్ తనకేసి చటుక్కున తిరగడం ఆమె చూసింది. అతని ముఖంలో ఒక్క వెలుగు వెలిగింది. ఆమె కెంతో ఆనందం కలిగింది.

"ఆఖరుకు ఇంటి కొచ్చావే!" అని గొణుగుతూ, చతికిలబడింది. అనుకోకుండా అతడు తిరిగి రావడంవల్ల ఆమె ఆశ్చర్యచకితురాలైంది.

పావెల్ వెల్లబారిన తన ముఖాన్ని ఆమె ముఖానికి చేర్చాడు. పెదవులు అదురుతున్నాయి. కనుకొలకుల్లో నీటిబిందువులు తళతళలాడుతున్నాయి. కొన్ని క్షణాలపాటు నోటంట మాట తొణకలేదు. తల్లి కూడా అతనికేసి మౌనంగా చూసింది.

హాహోల్ మెల్లగా ఈలేసుకుంటూ వాళ్ళిద్దరినీ వదలిపెట్టి పెరట్లో కెళ్ళిపోయాడు.

"చాలా సంతోషం అమ్మా! ప్రేమస్వరూపమైన అమ్మా! చాలా ధన్యవాదాలు!" అని మెల్లని స్వరంతో వణుకుతున్న వేళ్ళతో, పావెల్ ఆమె చేతిని గట్టిగా నొక్కాడు.

అతని ముఖంలోని వికాసాన్నీ, సంతృప్తినీ చూసి ఆమె పరమానందభరితురాలైంది. అతని కంఠస్వరంలోని మృదుత్వాని కామె సంతోషించి, మెల్లగా చేత్తో అతడి తల తట్టింది. తన గుండెల్లోని దడను శాంతింపచేసుకోవడానికి ప్రయత్నించింది.

"బాగానే ఉంది, మధ్యలో నాకెందుకు ధన్యవాదాలు?" అంది.

"మేము చేస్తూండే మహత్కార్యానికి తోడ్పడినందుకు. మరీమరీ ధన్యవాదాలు" అని పావెల్ రెట్టించాడు. "ఎవరికైనా తనూ తన తల్లీ ఏకమనస్కులు అని చెప్పుకోగలగడం ఎంతో అపురూపమైన ఆనందం."

ఆమె మాట్లాడకుండా కొడుకు మాటల్లోని మాధుర్యాన్నాస్వాదించింది. ఎదుట నిల బడి ఉన్న కొడుకు మంచితనాన్నీ ప్రేమనూ మెచ్చుకుంది.

"అమ్మా! నీవెంత కష్టాన్ననుభవించావో నాకు తెలుసు. మేము చేసే పని నీకు నచ్చ లేదని నేనెరుగుదును. మా పనిని నీ వంగీకరిస్తావని నేనెన్నడూ అనుకోలేదు. మా భావాలు నీ భావాలవుతాయనుకోలేదు. నీ జీవితమంతా ఓర్చుకున్నట్లే, విధిలేక మా భావాలను కూడా ఓర్చుకుంటావనుకున్నాను. అది నాకు కష్టమనిపించింది!"

"సంగతులన్నీ తెలుసుకోవడానికి అన్ద్ర్యూష చాలా తోడ్పడ్డాడు" అంది ఆమె.

"అతను నాతో నీ సంగతి చెప్పేడు" అని పావెల్ నవ్వేడు.

"యెగోర్ కూడా. మేమిద్దరం ఒకే ఊరువాళ్లం. అన్‌ద్ర్యూష నాకు చదవడం కూడా నేర్పాలనుకున్నాడు."

"అందుచేత సిగ్గేసి, నీ అంతట నువ్వే రహస్యంగా చదవడం మొదలెట్టావన్నమాట!"

"అయితే అతడు గ్రహించాడన్నమాటే!" అని ఆశ్చర్యపడింది. "అతన్ని లోపలికి రమ్మనమందాం. మనకి అడ్డురాకూడదని కావాలనే బయటికెళ్లేడు. అతనికి జనకతల్లి లేదు...."

"అన్‌ద్రేయ్! ఎక్కడున్నావు?" అని పావెల్ తలుపు తెరుచుకుని గుమ్మంలో కొచ్చి కేకేశాడు.

"ఇక్కడున్నా. కొద్దిగా పుల్లలు కొడుతున్నాను."

"లోపలికి రా!"

వెంటనే అతడు లోపలికి రాలేదు. కాని కొంచెం సేపైనాక లోపలికొచ్చి వంటింట్లో ప్రవేశించి సంసారం గురించి మాట్లాడ్డం మొదలెట్టేడు.

"నికొలాయ్‌ని కొంచెం వంటచెరకు పడెయ్యమని చెప్పాలనుకుంటున్నాను. ఇక ఎంతో లేదు. మామ్మా! పావెల్‌ని చూశారా? తిరుగుబాటు చేసినవాళ్లను శిక్షించడానికి బదులు, అధికారులు వాళ్లను బాగా మేపుతున్నట్లుంది."

తల్లి ఫక్కున నవ్వింది. ఆమెకు సంతోషంతో ఇంకా తలదిమ్ముగానే ఉంది. గుండె కూడా ఆనందంతో కొట్టుకుంటూనే వుంది. అయితే కొంత వివేచనా, మర్యాదా పాటించి, సహజ శాంతంతో ఉండే తన కొడుకును చూసుకోవాలని ఆమె ఆత్రపడింది. జరుగుతున్నదంతా చాలా అద్భుతంగా ఉంది. జీవితమంతటిలోనూ, ప్రప్రథమంగా వేడు కలిగిన సౌఖ్యాన్ని ఎల్లకాలం తన హృదయంలో ఇంత బలీయంగానూ ఉంచుకోవాలని ఆమె కోరిక. ఆ సంతోషం తగ్గిపోకుండా బంధించడానికి, పక్షులను పట్టుకునేవాడు, అపురూపమైన పక్షి అప్రయత్నంగా చేతికి చిక్కినప్పుడు దాన్ని పారిపోకుండా ఏవిధంగా చిక్కబట్టుకుంటాడో, ఆమె కూడా అలాగే బంధించడానికి తహతహలాడింది.

"మనం భోజనం చేద్దాం. పాషా! నువ్వు భోజనం చేసినట్టులేదే?" అంది తల్లి.

"లేదు. నన్ను వాళ్లు వదలిపెట్టేయడానికి నిశ్చయించుకున్నారని నిన్న జైలరు చెప్పేడు. అందుచేతేమీ తినడానికి గాని తాగడానికి గాని మనస్కరించలేదు."

"నేను విడుదల కాగానే నాకు కనబడిన మొదటివాడు సిజోవ్" అంటూ పావెల్ ప్రారంభించాడు. "నన్ను చూడ్డంతోనే అతడు వీధి దాటుకొచ్చి 'ఏమయ్యోయ్' అని పల కరించాడు. నేను ప్రస్తుతం ప్రమాదకరమైన వ్యక్తిననీ, పోలీసు నిఘాలో ఉన్నాననీ, కనుక నాతో కొంచెం జాగ్రత్తగా మాట్లాడమనీ హెచ్చరించాను. మరేమీ ఫరవాలేదంటూ, అతను తన మేనల్లుడిని గురించి అనేక విధాలైన ప్రశ్నలడిగేడు. ఫ్యోదొర్ జైల్లో జాగ్రత్తగా

మసలుకుంటున్నాడా అని అడిగేడు. 'జైల్లో జాగ్రత్తగా మసలుకోవడం అంటే?' అని నేనడిగేను. 'అదేలే! స్నేహితులెవ్వరితోనూ చిరునామా మనకుండా ఉన్నాడా అని' అతడన్నాడు. ఫ్యోదార్ మంచివాడనీ, నిజాయితీ, తెలివితేటలూ కలవాడనీ నేను చెప్పేసరికి అతడు గడ్డం దువ్వుకుని గర్వంగా 'మా సిజోవ్ కుటుంబంలో చెడ్డవాళ్లు లేరు' అన్నాడు.''

''ముసలాయన చాలా బుద్ధిమంతుడులే!'' తలూపుతూ హోహోల్ అన్నాడు. ''అతడితో నేను చాలా సార్లు మాట్లాడేను. మంచివాడు. ఫ్యోదార్ నేమైనా తొందరగా వదిలిపెడ్తారా?''

''బహుశా అతన్ని త్వరగానే వదిలిపెడతారనుకుంటున్నాను. ముసలాడు ఇసాయ్ చెప్పే మాటలు తప్ప అతనిమీద ఏమీ లేదు. దానివల్ల ఏమవుతుంది?''

తన కొడుకుకేసి దృష్టి తప్పించకుండానే తల్లి అటూ ఇటూ తిరిగింది. అన్‌ద్రేయ్ చేతులు వెనక్కి పెట్టుకుని కిటికీ దగ్గర నిలబడి పావెల్ చెప్పేమాటలు వింటున్నాడు. పావెల్ పచారుచేస్తున్నాడు. అతడు గెడ్డం పెంచాడు. చక్కని నల్ల వెంట్రుకలు అతని చెంపలమీద ఒత్తుగా ఉంగరాలు తిరిగి ఉన్నాయి. వాటి మూలంగా అతడి ముఖం నలుపు విరిగినట్టుంది.

''రండి. కూర్చోండి'' అని తల్లి భోజనం వాళ్ల ముందర పెట్టింది.

భోజనం చేస్తుండగా అన్‌ద్రేయ్, పావెల్‌తో రిబిన్‌ను గురించి చెప్పేడు. అన్‌ద్రేయ్ చెప్పడం పూర్తి అయాక:

''నేను ఇంటి దగ్గర ఉన్నట్లయితే, అతడిని పోనిచ్చేవాడిని కాను'' అని పావెల్ అనమ్మతి తెలియచేశాడు. ''అతడు అక్కడికేమి తీసుకెడతాడు? తీవ్రమైన ఆవేశమూ, గందరగోళపు బుర్ర తప్ప.''

''సరే కాని నలభై ఏళ్లొచ్చిన మనిషిని, అందులోనూ చాలా కాలం ఆత్మలో ఉండే ఎలుగుబంట్లతో పెనగులాడేవాడిని, మార్చడమంటే ఏమంత తేలికైన పని కాదు'' అన్నాడు నవ్వుతూ హోహోల్.

తల్లికి చాలావరకు అర్థంకాని వాదనలో పడ్డారు. భోజనమైపోయింది. కాని ఒకళ్లమీద ఒకళ్లు గంభీరంగా ఉండే పదజాలాన్ని గుప్పేసుకున్నారు. మధ్యమధ్య మామూలుగా మెల్లగానే మాట్లాడుకున్నారు.

''ఏమైనా సరే! మనం ముందుకు చొచ్చుకువెళ్లవలసిందే. వెనకడుగన్న మాటుండకూడదు'' అని పావెల్ దృఢనిశ్చయాన్ని ప్రకటించాడు.

''వెళ్లి మనల్ని శత్రువులుగా భావించే లక్షల జనాన్ని ఢీకోవాలన్నమాట, అంతేనా?''

వాళ్లిద్దరూ వాదించుకుంటూంటే తల్లి శ్రద్ధగా వింది. రైతులవల్ల ఏమీ ప్రయోజనం లేదని పావెల్ అభిప్రాయమనీ, హోహోల్ రైతుల పక్షంగా ఉన్నాడనీ, రైతులకు కూడా మంచీ చెడ్డా తెలియచెప్పాలని అతని అభిప్రాయమనీ తల్లి గ్రహించింది. ఆమెకు

అన్‌ద్రేయ్ మాటలు బాగా అర్థమవుతాయి. అతని మాటే సరియైనదని ఆమెకు తోచింది. అతడు పావెల్ కేదైనా చెప్పినప్పుడు, కొడుకు జవాబుకోసం ఆమె ఎంతో ఆత్రంతోనూ సంకోచంతోనూ ఎదురుచూస్తూ ఉండేది. హోహోల్ అతనికేమీ కోపం తెప్పించలేదు కదా అనే ఆమె భయం. వాళ్లిద్దరూ ఒకళ్లమీద ఒకళ్లు కేకలేసుకుంటూనే ఉన్నారు. కాని ఇద్దరికీ కోపం మాత్రం కలుగలేదు.

"పావెల్! అది నిజమేనంటావా?" అని తల్లి మధ్యమధ్య అడుగుతుండేది.

"ముమ్మాటికీ నిజం" అని అతడు చిరునవ్వు నవ్వుతూ బదులుచెప్పేవాడు.

"భలే దొడ్డవాడివి కదూ?... బాగా భోజనమైతే చేశావు. కాని దాన్ని బాగా నమిలి మింగలేదు. అదింకా నీ గొంతుక నంటుకుంది. కొంచెం ద్రవ పదార్థం లోపలికి పోనియ్యి" అని హోహోల్ స్నేహంతో వెటకారంచేశాడు.

"తమాషా మనిషివేనే?" అన్నాడు పావెల్.

"శ్రాద్ధ భోజన సంతోషం."

తల్లి మెల్లగా నవ్వుకుని తలూపింది....

## 23

వసంత మొచ్చింది. మంచు కరగడం మొదలెట్టింది. కిందనున్న బురదా, మట్టీ అగపడుతున్నాయి. రోజుకు రోజూ బురద బాగా పైకగుపడుతోంది. పేటంతా పీలికలులాగ చిరాకుగా ఉంది. పగలు ఇంటి కప్పులమీదనుంచి నీళ్లు చుక్కలుచుక్కలుగా పడుతున్నాయి. బూడిద పట్టిన గోడల్లోంచి — చెమటలాగ — తేమ ఊరుతోంది. కాని రాత్రిళ్లు ఇంకా మంచు కణాలు తెల్లగా ప్రకాశిస్తూనే ఉన్నాయి. సూర్యుడు ఆకాశంమీద చాలా సేపు నిదానంగా ప్రకాశిస్తున్నాడు. సెల ఏళ్లు బాడవలోకి గలగల ప్రవహిస్తున్నాయి.

మే దినోత్సవాన్ని జరిపించడానికి ప్రయత్నాలు ప్రారంభమైనాయి.

ఆ ఉత్సవంయొక్క ప్రాముఖ్యాన్ని విశదీకరిస్తూ, కరపత్రాలు ఫ్యాక్టరీలోనూ పేటలోనూ వెదజల్లడం జరిగింది. ప్రచారంవల్ల ఆనాటివరకూ ప్రభావితం కాని యువ జనులు కూడా వాటిని చదువుకుని "మనం కూడా వీటిలో పాల్గొనాలి!" అనుకున్నారు.

"ఇక ఆగడానికి వీల్లేదు!" అన్నాడు వెసొవ్‌శ్చికోవ్. "చాలా కాలంగా దాగుడు మూతలాడుకుంటూ వస్తున్నాం!" అని విషాదంగా నవ్వేడు.

ఫ్యొదొర్ మాజిన్ చాలా ఉత్సాహభరితుడయాడు. అతడు పంజరంలోని భరద్వాజ పక్షిలా ఉన్నాడు. చాలా చిక్కిపోయాడు. మాట్లాడినా కదలినా భయసంకోచాలతో గడగడ వణకిపోతున్నాడు. అతన్నెప్పుడూ యాకొవ్ సొమొవ్ నిశ్శబ్దంగా వెంటాడుతూవుంటాడు.

అతడు వయసుకు పిల్లవాడైనా వయసుకు మించి గంభీరంగా ఉంటాడు. యాకొవ్‌కు పట్టణంలో ఇప్పుడు పని దొరికింది. సమోయ్‌లొవ్ (జైలు నివాసంవల్ల అతని వెంట్రుకలు ఎర్రబడినట్లున్నాయి), వసీలియ్ గూసెవ్, బూకిన్, ద్రగూనొవ్, ఇంకా కొందరూ ఆ వాడు సాయుధ ప్రదర్శనం జరిపించాలని పట్టుబట్టేరు. పావెల్, హొహోల్, సొమొవ్, ఇంకా కొందరూ ఆ అభిప్రాయాన్ని వ్యతిరేకించారు.

యెగోర్ వ్లాసొవ్‌ల ఇంటికి వస్తూ ఉండేవాడు. ఎప్పుడూ ఆయాసపడుతూ, ఊపిరాడక చెమటలు కక్కుతూ వేళాకోళాలాడుతూ:

"కామ్రేడ్స్! ప్రస్తుతం ఉన్న సాంఘిక విధానాన్ని మార్చడానికి మనం చేస్తున్న కృషి చాలా గొప్పదే. కాని మన విజయాన్ని త్వరితంగా సాధించాలంటే, మేొక కొత్త బూట్ల జత కొనుక్కోడం విధాయకం." తడిసి చివిగిపోయిన బూట్లను అందరికీ చూపించాడు. "నా రబ్బరు జోళ్లు కూడా మరమ్మతుకు అతీతమైన స్థితిలో ఉన్నాయి. అందుచేత రోజూ నా పాదాలు తడిసిపోతున్నాయి. మనం పాత విధానాన్ని బహిరంగంగా, ఏవిధమైన మినహాయింపులూ లేకుండా ఖండించేవరకూ, నేను భూగర్భంలో నివాసం చేయాలని కోరుకోవడం లేదు. కనుక సాయుధ ప్రదర్శనం జరిపించాలని కామ్రేడ్ సమోయ్‌లొవ్ చేసిన సూచనను నేను తోసిపుచ్చుతున్నాను. దానికి బదులుగా నేనొక సూచన చేస్తున్నాను. అదేమిటంటే నేనొక బూట్ల జత అమర్చుకోవాలి. ఎందుచేతనంటారా, మూకుమ్మడి దొమ్మీకంటే అలాటి కార్యక్రమమే సోషలిస్టు విజయానికి మరింతగా ఉపకరిస్తుందని నా దృఢమైన విశ్వాసం."

ఇటువంటి అలంకారభూయిష్టమైన భాషలో అతడు ఇతర దేశాల్లోని కార్మికులు తమ జీవితాలనుద్ధరించుకోవడానికి పడుతున్న పాట్లు అన్నీ చెప్పాడు. అతని ఉపన్యాసాలను వినాలని తల్లి ఎంతో ముచ్చటపడేది — వాటిని విన్నాక ఆమె మనస్సుకి అవి చిత్రంగా హత్తుకునేవి. ప్రజలకు ప్రబలమైన శత్రువులు, ఎక్కువగా వాళ్లని మోసం చేసేవాళ్లు, వాళ్లనెక్కువ హింస పెట్టేవాళ్లు, సామాన్యులైన కొవ్వెక్కిన ఎర్ర మొగాల ఉద్యోగులేనని ఆమెకు తోచింది. వాళ్లు దురాశాపరులు, పీనులు, దుర్మార్గులు. చక్రవర్తి వాళ్ల భూములమీదకు వత్తిడి తెస్తే, వాళ్లే సామాన్య జనాన్ని రెచ్చగొట్టారు. ప్రజలు నిరంకుశ పరిపాలకుడైన రాజును కూలదోసిన పిమ్మట, ఈ చిన్న అధికారులే ప్రజాసామాన్యాన్ని వాళ్ల గుడిసెల్లోకి తోసేసి, మోసం చేసేసి అధికారాన్ని చేపట్టారు. ప్రజలు ధిక్కరిస్తే వేలకొద్దీ జనాన్ని చంపేశారు.

ఒక రోజున యెగోర్ చెప్పిన మాటలన్నీ తనేవిధంగా అవగాహన చేసుకుందో ధైర్యం చేసి యెగోర్‌తో చెప్పింది.

"యెగోర్ ఇవానొవిచ్! దాని సంగతంతేనా?" అని తత్తరపడి చిరునవ్వుతో అడిగింది.

అతడు ఫక్కున నవ్వేడు. కళ్లు తిప్పుతూ ఊపిరందాక చేతులను గుండెలమీద రాసుకుంటూ ఇలా చెప్పేడు.

"అమ్మా! దాని సంగతంతే. చరిత్ర అనే ఆబోతును కొమ్ములు పట్టుకుని సాధిస్తున్నావు! అక్కడక్కడ అసలు విషయానికి అలంకారాలూ అతిశయోక్తులూ ఉన్నప్పటికీ, నిజమెంతో అంతా సరిగానే ఉంది. ఒళ్లు బలిసిన ఈ చిన్నవాళ్లున్నారే, వాళ్లు అందరి కన్నా ఎక్కువ పాపిష్టులు. ప్రజల రక్తాన్ని పీల్చే విషపురుగులు. ఫ్రెంచివాళ్లు వాళ్లని బూర్జువాలనడం చాలా న్యాయం. అన్యం పుణ్యం ఎరుగని అమాయిక జనాన్ని హింసించి, వాళ్ల రక్తాన్ని పీల్చే ఈ జనం...."

"ధనికుల్ని పని చేస్తున్నారనేనా నువ్వు చెప్పేది?" అని తల్లి అడిగింది.

"అవును. వాళ్లు ధనికులు కావడం వాళ్ల దురదృష్టం. చంటిపిల్లలకిచ్చే ఆహారంలో రాగి కలుపుతుంటే, అది వాళ్ల ఎముకల పెరుగుదలనడ్డేస్తుంది. శిశువు మరుగుజ్జువాడై పోతాడు. కాని మనిషికి బంగారమనే విషం పెడితే అతడి ఆత్మ గిడసబారిపోతుంది. పాండించి నిర్జీవమైపోతుంది. అయిదేసి కోపెక్కులకు పిల్లలు కొనుక్కుని ఆడుకుంటూ ఉండే రబ్బరు బంతిలాగైపోతుంది."

ఒక రోజున యెగోర్‌ను గురించి పావెల్, అన్ద్రేయ్‌తో ఇలా అన్నాడు:

"అసలు సంగతేమంటే, అన్ద్రేయ్! పైకెక్కువగా వేళాకోళాలాడే మనుష్యులు, సాధారణంగా లోపల ఎక్కువ బాధపడేవాళ్లే."

హొహోల్ కొంచెం సేపు నిదానించి, కళ్లు చిట్లించి, జవాబిచ్చాడు.

"నువ్వు చెప్పినమాటే నిజమైతే, రష్యా అంతా నవ్వలేక చస్తుందనే అనుకోవాలి."

నతాషా వస్తూ ఉండేది. ఆమె కూడా మరొక పట్నంలో జైల్లో ఉండేది. ఆ అనుభవం ఆమెలో ఏమంత మార్పు తెచ్చినట్లు కనబడ్డం లేదు. ఆమె ఎదురుగా ఉంటే, హొహోల్ చాలా ఉత్సాహంగా ఉంటాడనీ, అందరితోనూ వేళాకోళాలాడుతుంటాడనీ తల్లి గ్రహించింది. కాని నతాషా వెళ్లిపోవడంతోనే ఈలమీద విషాద గీతాలు పాడుకుంటూ గదిలో పచారుచేస్తూ ఉంటాడు.

సాషా తరుచుగా వస్తూ ఉండేది. కాని ఎప్పుడూ హడావిడిగా, చిరుబురుమంటూ వచ్చేది. ఎందుచేతనో కాని ఇటీవల మరీ చిరచిరగానూ ముక్తసరిగానూ ఉంటోంది.

ఒక రోజున పావెల్ ఆమెను సాగనంపడానికి గుమ్మందాకా వెళ్లి తలుపు చేరవేయడం మరచిపోయాడు. తల్లి వాళ్లిద్దరి సంభాషణా విన్నది.

"జండా మీరు పుచ్చుకుంటారా?" అని సాషా మెల్లగా అడిగింది.

"అవును."

"తుది నిర్ణయమేనా?"

"అవును. అది నా ప్రత్యేకమైన హక్కు."
"అంటే మళ్లీ జైలు కెళ్లడమన్నమాటేనా?"
పావెల్ బదులు చెప్పలేదు.
"కాని మీరు మానే...."
"ఏమిటి?"
"ఇంకెవరివైనా ఆ పని చేయనియ్యకూడదా?"
"కూడదు" అన్నాడు ఖచ్చితంగా.
"బాగా ఆలోచించండి. మీరు బాగా పలుకుబడి కలవారు. అందరికీ మీరంటే ఇష్టం. మీరన్నా, అన్‌ద్రేయ్ అన్నా ప్రజలకు చాలా ఇష్టం. మీరిద్దరూ ఇక్కడుంటే మీరెంత మంచి పని చేయగలుగుతారో ఆలోచించండి! జండాను మీరు పుచ్చుకుంటే వాళ్ళు మిమ్మల్ని ప్రవాసానికి పంపుతారు. చాలా కాలంపాటు చాలా దూరానికి పంపేస్తారు."
తల్లికి ఆ అమ్మాయి కంఠధ్వనిలో భయం, ఆపేక్ష ప్రత్యక్షంగా ద్యోతకమవుతున్నాయి. సాషె చెప్పిన మాటలు ఆమె హృదయంమీద మంచునీళ్లు చల్లినట్లనిపించాయి.
"నేను ఒక నిశ్చయాని కొచ్చేశాను. ఇక దానికి తిరుగుండదు" అన్నాడు పావెల్.
"నేను కోరినా తిరుగుండదా?"
పావెల్ మాటలో అమాంతంగా చురుకుదనమూ కరుకుదనమూ వచ్చేసింది.
"అలాంటి మాట మీరు చెప్పకూడదు! చెప్పకూడదు!"
"నేనూ మానవమాత్రురాలినే" అంది ఆమె మృదువుగా.
"అద్భుతమైన మానవులు!" అని మెల్లగా గద్గదస్వరంతో అతడు జవాబిచ్చాడు. "నా కత్యంత ఆప్తులు మీరు! అందుచేతనే – అందుచేతనే – మీరలాంటి మాటలు చెప్పకూడదు."
"శలవు" అంది ఆ అమ్మాయి.
ఆమె మడమల చప్పుడును బట్టి ఆమె పరుగెత్తుతోందని తల్లి గ్రహించింది. పావెల్ తోటలో కెళ్లాడు.
తల్లి హృదయం భయంచేత కుంగిపోయింది. వాళ్లిద్దరూ ఏమి మాట్లాడుకుంటున్నారో ఆమెకు బాగా అర్థం కాలేదు. కాని తనకేదో పెద్ద ముప్పు రాబోతోందని మాత్రం ఆమె గ్రహించింది.
"ఇతనేం ఆలోచిస్తున్నాడో" అనే ఆలోచనలో పడింది.
పావెల్, అన్‌ద్రేయ్ కలసి లోపలికొచ్చారు.
"ఓహో! ఇసాయ్, ఇసాయ్! వాడినేమి చెయ్యాలి?" అన్నాడు హొహోల్ తల పంకిస్తూ.
"ఈ వ్యాపారం కట్టిబెట్టమని హెచ్చరిద్దాం" అన్నాడు చిరచిరలాడుతూ పావెల్.
తల్లి తలొంచుకుని,

''నువ్వేమి చెయ్యాలని ఆలోచిస్తున్నావ్, పాషా?'' అని అడిగింది.

''ఎప్పుడు? ఇప్పుడా?''

''కాదు. మే ఒకటవ తేదీని.''

''ఓ! అదా? నేను మన జండాను పట్టుకుని ఊరేగింపుకు ముందు నడవదలచు కున్నాను. బహుశా ఆ కారణంచేత వాళ్లు మళ్లీ నన్ను జైలుకు పంపుతారనుకుంటాను'' అన్నాడు పావెల్ మెల్లగా.

తల్లికి కళ్లు పీకడం మొదలుపెట్టేయి. నోరెండింది. పావెల్ ఆమె చేయి పట్టుకుని మెల్లగా బుజ్జగించాడు.

''నేను ఆ పని చేసితీరాలి. అమ్మా! బాగా అర్థం చేసుకో.''

''నేనేమీ అనలేదే'' అని మెల్లగా తలెత్తి జవాబుచెప్పింది. కాని అతని నేత్రాల్లో కరుకైన మెరుపామె కంటబడడంతోనే ఆమెకు భయం కలిగింది.

అతడు నిట్టూర్పు విడిచి ఆమె చేతిని వదిలిపెట్టేడు.

''నువ్వు బాధపడ్డంకన్న సంతోషించాలమ్మా! నవ్వుతూ కొడుకులను మృత్యుదేవత కౌగిట్లోకి పంపే తల్లులు మనకెప్పుడు లభ్యమౌతారో?'' అని మెల్లగా మందలించాడు పావెల్.

''ఓహో! లార్డు మేయరుగారొచ్చి పెద్ద కబుర్లు చెపుతున్నాడు'' అని హొహోల్ పలికేడు.

''నేనేమీ అనలేదే! ఏమన్నాను?'' అని తల్లి రెట్టించింది. ''నేను నీకేమీ అడ్డు రాను.... కాని నా బాధ నాది. తల్లిని కాకుండా ఎలా ఉండగలను?''

పావెల్ దూరంగా వెళ్లేడు. తర్వాత అతడన్నమాటలు ఆమె మనసుకు శూలాల్లా గుచ్చు కున్నాయి.

''అదొక రకమైన ప్రేమ. జీవితానికి ప్రతిబంధకం కలిగించే ప్రేమ.''

''వద్దు పాషా! వద్దు'' అంది తల్లి. తన మనసుకు క్షోభ కలిగించే మాటలింకా ఏమైనా చెపుతాడేమోనని ఆమె భయపడింది. ''నా కర్థమైంది.... నువ్వు ఇంకో పనిచెయ్యలేవు.... నీ కామ్రేడ్సుకోసం....''

''వాళ్లకోసం కాదు. నాకోసమే'' అని పావెల్ సవరించాడు.

అన్‌ద్రేయ్ గుమ్మంలో కొచ్చాడు. అతని పొడుగుకు గుమ్మం ఎత్తు సరిపోదు. కనుక మోకాళ్లు వంచి భుజాన్ని గుమ్మంపక్కకాన్చి తలముందుకెట్టి నిలబడ్డాడు.

''అయ్యో! ప్రభువుగారూ! ఈ ప్రస్తావన ఇక చాలిస్తే బాగుంటుంది'' అంటూ అతడు పావెల్ ముఖంకేసి తీక్షణంగా చూశాడు. రాళ్ల సందున ఉండే బల్లిలా ఉన్నాడు అన్‌ద్రేయ్.

తల్లికి ఏడుపొచ్చింది.

"అయ్యయ్యో! మరిచిపోయాను" అంటూ బయటి కెళ్ళిపోయింది. తను ఏడుస్తుంటే కొడుకు చూడకూడదని ఆమె అభిప్రాయం. బయటికెళ్ళాక ఒక మూలకెళ్ళి శబ్దంకాకుండా ఏడ్చింది. తన హృదయంలోని రక్తమంతా కన్నీరుగా కారిపోతోందా అన్నంతగా ఆ ఏడుపా మెకు నిస్పత్తువ కలిగించింది.

ఓరగా తెరచి ఉన్న గుమ్మంలోనుంచి వాళ్ళిద్దరూ మెల్లగా వాదించుకోవడం ఆమె చెవిలో పడింది.

"ఏమిటి నీ అభిప్రాయం? ఆమెనలా బాధించడం నీకు సరదాగా ఉందా?" అని హొహోల్ అడిగేడు.

"నువ్వలా అనడం న్యాయం కాదు" అన్నాడు పావెల్.

"నువ్వలా మాట్లాడుతూ మూర్ఖుడవవుతూంటే చూస్తూ నోరు మూసుక్కూచుంటే, నేను బలే స్నేహితుడినే అవుతాను. నువ్వసలు అలా చెప్పవలసిన అగత్యమేమొచ్చింది? ఏమి జరుగుతోందో నీకు కనిపించడంలేదా?"

"ఇలాంటి విషయాల్లో నిష్కర్షగా ఉండాలి. అవునో కాదో చెప్పడానికి జంకకూడదు."

"ఆమెతోనా?"

"ఎవరితోనైనా సరే. నా కాళ్లకు చుట్టుకుని నన్ను దిగదీసే ప్రేమ కాని, స్నేహం కాని నా కక్కర లేదు...."

"గొప్ప వీరుడవులే! వెళ్లి ముక్కు తుడుచుకో! సాషాకు చెప్పు.... ఆమె...."

"నేనామెతో అప్పుడే చెప్పేశాను...."

"ఓ! చెప్పలేదు! నువ్వామెతో మెల్లగా, ప్రేమ ఒలికేటట్టుగా చెప్పేవు. నేను వినక పోయినా, నువ్వు చెప్పేవులే. కాని అమ్మ దగ్గర మాత్రం గొప్ప వీరుడవుగా కనబడాలి! నీ తలతిరుగుడంతకీ పిసరంత విలువ లేదు. ఆ సంగతి తెలుసుకో...."

నీలొవ్నా త్వరత్వరగా కళ్ళు తుడుచుకుంది. హొహోల్ ఇంకా ఏమి దుడుకుగా మాట్లా డుతాడోనని భయపడుతూ గభాలున తలుపు తోసుకుని వంటింట్లో ప్రవేశించింది.

"హూ!... ఎంత చలిగా ఉందో!" అని ఆమె బిగ్గరగా అంది. భయంతోనూ, దుఃఖంతోనూ వణుకుతున్న గొంతుకతో "ఇది వసంతమని ఎవరనుకుంటారు?" అంది.

ఒక లక్ష్యమంటూ లేకుండా ఆమె అటు సామానిటూ ఇటు సామానటూ చప్పుడు చేస్తూ సర్దింది. పక్క గదిలో మాటలు, చప్పుడులో మునిగిపోవాలని ఆమె ఉద్దేశ్యం.

"అంతా మారిపోయింది.... ప్రజలకి వేడెక్కుతోంది. వాతావరణం చల్లబడుతోంది. ఇంతకు ముందు యీపాటికి కొంచెం వేడి అందుకునేది. ఆకాశం తెరపిగా ఉండేది. సూర్యుడు బాగా ప్రకాశించేవాడు...." అంటూ మరింత బిగ్గరగా మాట్లాడింది.

మాటలు ఆగిపోయాయి. తల్లి వంటింట్లో మధ్యగా నిలబడి వింటోంది.

"ఆమె ఏమంటోందో విన్నావా? ఇప్పటికైనా నువ్వామెను సరిగా అర్థం చేసుకోవాలి. మాటలకేం గాని, నిజానికి నీకన్న ఆమె ఎక్కువ ధైర్యస్థురాలు!" అన్నాడు హొహోల్ మెల్లగా.

"టీ తాగుదామా?" అని అమ్మ వణుకుతూ అడిగింది. తానెందుకు వణుకుతున్నదీ చెప్పడానికో అన్నట్లు "అబ్బ! చలి! నేను ముద్దకట్టుకుపోతున్నాను" అంది.

మెల్లగా పావెల్ ఆమె దగ్గరకెళ్లేడు. తలవంచుకుని తన తప్పు నంగీకరించినట్లుగా చిన్న నవ్వు నవ్వేడు:

"అమ్మా! క్షమించాలి. నేనింకా చిన్నవాడిని.... తెలివితక్కువవాడిని కూడా."

తల్లి అతన్ని దగ్గరకు లాక్కుని తల రొమ్ముకు చేర్చుకుని వెక్కివెక్కి ఏడ్చింది.

"నా పాటికి నన్నొదిలెయ్యి! నాకేమాటా చెప్పద్దు. నీ జీవితం నీ చేతిలోనే ఉందని భగవంతుడికి తెలుసు. దాన్ని నీ యిష్టమొచ్చినట్లు ఉపయోగించుకో. కాని నన్నొదిలెయ్యి. అయితే తల్లి కొడుకును ప్రేమించడం మానగలదా? ప్రేమించక తప్పదు. నేను మిమ్మల్ని అందరినీ ప్రేమిస్తున్నాను. మీరంతా నాకు ప్రేమాస్పదులే. మీరందరూ ప్రేమించదగినవారే. నేను ప్రేమించకపోతే మిమ్మల్ని ప్రేమించే వాళ్లెవరు? నీవు వెళ్లిపోతావు. మిగిలిన వాళ్లు నిన్ను అనుసరిస్తారు. అన్నీ వదలుకుని నీ వెంట వస్తారు!"

ఆమె హృదయంలో ఎన్నో గొప్ప గొప్ప ఉజ్వలభావాలు పొంగుకొచ్చాయి. హృదయం విషాదభరితమైన సంతోషసాగరంలో తేలి ఆడింది. దాన్ని వ్యక్తం చేయడానికి మాటలు తొణకలేదు. ఆవేదనతో కొడుకును చురచుర చూసింది. ఆమె కళ్లలో తీక్ష్ణమూ ప్రగాఢమూ అయిన బాధ కనబడుతోంది.

"సరేనమ్మా! సరే! నన్ను క్షమించు. నాకిప్పుడంతా అర్థమైంది. దీన్ని నేనెన్నడూ మరచిపోను. మరచిపోనని ప్రమాణం చేస్తున్నాను!" అంటూ పావెల్ చిరునవ్వుతో ఆమె ముఖంకేసి చూశాడు. అతడికి సంతోషమైంది. కాని కొంచెం సిగ్గుపడ్డాడు.

ఆమె పావెల్‌ని వదలిపెట్టి పక్క గదిలోకి తొంగిచూసి:

"అన్ద్ర్యూషా! అతనిమీద కేకలెయ్యకండి. మీరు అతనికంటె పెద్దవారు కదా...." అని మృదువుగా హెచ్చరించింది.

"ఓహో అలాగా! కేకలెయ్యడం మానను సరి కదా, రెండు గుద్దులు కూడా గుద్దుతాను...." అన్నాడు, తిరిగి చూడకుండానే.

ఆమె అతని దగ్గరగా వెళ్లి చేయి చాస్తూ:

"ఎంత మంచివాడవోయ్!"

అతడు చరున తిరిగి, ఆమె పక్కనుంచి వంటింట్లో కెళ్లేడు. చేతులు వెనక్కి పెట్టుకుని అటోతులా తలదించి తీవ్రమైన వెటకారంతో మాట్లాడేడు:

"పో పావెల్! పో! నీ మెడ కొరికేసేలోగా పో! మామ్మా! మీరు కంగారుపడకండి. నేను తమాషే కంటున్నాను. ఇదిగో సమొవార్ అంటిస్తున్నాను. మంచి బొగ్గులే సంపాదించారు. తడి ముద్దలు!"

అతడు మరి మాట్లాడలేదు. తల్లి వంటింట్లో కెళ్లేసరికి నేలమీద కూర్చుని సమొవార్ రాజబెట్టుతున్నాడు. తల పైకెత్తకుండానే చెప్పడం ప్రారంభించాడు.

"భయపడకండమ్మా! నేనతడినేమీ చెయ్యను. నేను ఉడకపెట్టిన బంగాళాదుంపలాంటి మెత్తటివాడిని. ఏమోయ్ వీరుడా! నువ్వు చెవులు మూసుకో — నాకు నిజంగా అతనంటే ఎంతో ప్రేమ. కాని అతడు ధరించే వెయిస్ట్‌కోటు నాకు నచ్చలేదు. అదయితే కొత్తదే. అది చాలా అందంగా ఉందని అతని ఉద్దేశం కనుక బొజ్జ ముందేసుకుని 'నా వెయిస్ట్‌కోటెంత బాగుందో చూడండ'ని తిరుగుతానంటాడు. వెయిస్ట్‌కోటు బాగానే ఉంది కాని అందర్నీ తొయ్యడమెందుకు? అసలే ఇరుగ్గా వుందాయె!"

పావెల్ చిన్న నవ్వు నవ్వి:

"ఎంతసేపింకా ఇలా సతాయిస్తావు? ఒక సారి చెప్పేవు. రెండు సార్లు చెప్పేవు. ఇంక ఇంతటితో అవుదూ" అన్నాడు.

హొహోల్ నేలమీద కూర్చుని సమొవార్‌కి రెండు వైపులా కాళ్లు చాపేశాడు. నఖశిఖపర్యంతం పావెల్‌ను చూశాడు. తల్లి గుమ్మంలో నిలబడి ఆప్యాయంగా అతడి తలవెనుక భాగాన్ని ఆపేక్షగా చూసింది. అతడు చేతులు చాచి ఒళ్లు విరుచుకుని తల్లీ కొడుకులను చూశాడు. కళ్లు గభాలున ఎర్రబడ్డాయి.

"మీరిద్దరూ మంచివాళ్లే" అన్నాడు.

పావెల్ ముందుకు వంగి అతని చెయ్యి పట్టుకున్నాడు.

"నన్ను లాగకు — నన్ను తిరగతోసెయ్యగలవు!" అన్నాడు హొహోల్.

"మీరు సిగ్గుపడడమెందుకు? కానివ్వండి. మీరిద్దరూ ఒకరినొకరు గట్టిగా కౌగలించుకుని ముద్దెట్టుకోండి" అంది తల్లి.

"ఆ పని చేద్దామా?" అన్నాడు పావెల్.

"రా" అంటూ హొహోల్ లేచి నిలబడ్డాడు.

వాళ్లిద్దరూ గాఢంగా కౌగలించుకున్నారు. శరీరాలు వేరు కాని స్నేహంచేత ఆత్మ ఒక్కటైంది. తల్లి చెక్కిళ్లమీదనుంచి ఈ సారి ఆనందాశ్రువులు ప్రవహించాయి. ఆ కన్నీళ్లను తుడుచుకుంటూ,

"ఆడవాళ్లకు ఏడవడమంటే చాలా ఇష్టం. సంతోషమొచ్చినా ఏడుస్తారు. విచారమొచ్చినా ఏడుస్తారు" అని బిడియపడుతూ చెప్పింది.

హొహోల్ మెల్లగా పావెల్‌ను వెనక్కి తోసేశాడు. తను కూడా కళ్లు తుడుచుకుంటూ

''ఇక చాలు.... దూడ సరదా. ఇంతటితో తీరింది. ఇక దాన్ని కాల్చవలసిన సమయ మొచ్చింది. దిక్కుమాలిన బొగ్గులు ఎక్కడనుంచి వచ్చాయో? ఊదగా ఊదగా కళ్లల్లో నీళ్లు తిరిగేయి'' అన్నాడు.

''ఆ కన్నీళ్లని గురించి సిగ్గుపడనక్కర్లేదు'' అన్నాడు పావెల్, మెల్లగా కిటికీ పక్కన కూర్చుని.

తల్లి కూడా అతని దగ్గరకెళ్లి పక్కనే కూర్చుంది. ఇప్పుడామె హృదయమంతా ఒక సరికొత్త ధైర్యంతో నిండింది. అందువల్ల విచారమెంతగా వున్నా, ఆమెకు గంభీరమైన నిదానమూ సంతృప్తీ కలిగేయి.

''మామ్మా! మీరు లేవకండి. టీ సామాన్లు నే పట్టుకొస్తాలెండి. హృదయం ఆవిధంగా మెలిపెట్టబడ్డాక కొంచెం సేపు విశ్రాంతి తీసుకోండి'' అన్నాడు హోహోల్.

గదిలోంచి బయటికెడుతూ, హోహోల్ స్ఫుటమైన గొంతుకతో:

''జీవితమంటే ఏమిటో ఇప్పుడే రుచి చూశాం. నులివెచ్చని మానవ జీవితం'' అన్నాడు.

పావెల్ తల్లికేసి చూసి ''నిజమే'' అన్నాడు.

''అది అన్నింటినీ మార్చేసింది. మన కష్టం వేరు. అలాగే మన సంతోషమూ వేరే'' అంది తల్లి.

''అలాగే ఉండాలమ్మా! ఏమంటే, ఒక కొత్త హృదయం ఉత్పన్నమవుతోంది, మామ్మా. ఓ కొత్త హృదయం పుడుతోంది. మానవుడు ముందుకు నడక సాగిస్తున్నాడు. పోతూ పోతూ దారిలో వివేకమనే వెలుతురును ప్రసరింపచేస్తున్నాడు. 'వివిధ దేశాల జనులారా! ఒకే కుటుంబానికి చెందినవారిలాగున ఏకంకండి!' అని కేకలేసుకుంటూ పోతున్నాడు. ఆ కేకకు జవాబుగా బలమైన హృదయాలన్నీ కలిసి ఒక బ్రహ్మాండమైన హృదయంగా రూపొంది వెండి గంటవలె బలంగా ఖంగుమని మోగుతాయి'' అన్నాడు హోహోల్.

పెదవులు వణక్కుండా ఉండేటందుకు తల్లి వాటిని గిట్టకరచుకుంది. కన్నీళ్లు పైకి రాకుండా కళ్లు మూసుకుంది.

పావెల్ మాట్లాడబోతున్నట్లు, చెయ్యి పైకెత్తేడు. కాని తల్లి అతని చెయ్యి పట్టుకుని కిందికి లాగింది.

''అతని మాటకడ్డెళ్లకు'' అని మెల్లగా చెవిలో చెప్పింది.

హోహోల్ గుమ్మాని కడ్డంగా నిలబడి మాట్లాడ్డం సాగించాడు.

''ప్రజలింకా చాలా కష్టాలననుభవిస్తారు. ఇంకా ఎంతో రక్తాన్ని ప్రవింపచేస్తారు. కాని నా హృదయం దేన్ని భరిస్తోందో, మనస్సు దేన్ని కాంక్షిస్తోందో, దానికి మాత్రం ఈ కష్టాలూ, ఈ రక్తబలీ అందవు. నక్షత్రమూ దాని కిరణాలూ ఎంత గొప్పవో నేనంత గొప్పవాడిని. నేను దేనినైనా భరించగలను. ఎంతటికైనా ఓర్వగలను. ఏమంటే నాలో ఒక

మహదానందం ఉంది. దానిని ఏదీ, దాన్ని ఎవ్వరూ నా దగ్గరనుంచి లాక్కోలేరు. ఈ ఆనం దమే నా బలం!''

టీ తాగుతూ వాళ్ళు ముగ్గురూ జీవితాన్ని గురించీ, ప్రజలను గురించీ, వాళ్ల భవిష్యత్తును గురించీ మాట్లాడుకుంటూ అర్ధరాత్రిదాకా కూచున్నారు.

తల్లికెప్పుడైనా ఒక అభిప్రాయం స్ఫురిస్తే, దాన్ని బలపరచేటందుకు తన గత జీవితంలోని దుస్సంఘటన నొకదాన్ని జ్ఞప్తికి తెచ్చుకునేది.

వాళ్ళు మాట్లాడుకునే మాట వింటుంటే, ఆ ప్రవాహంలో ఆమెకుండే భయాలు కొట్టుకుపోతూండేవి. తన చిన్నతనంలో ఒక నాడు తన తండ్రి చెప్పిన ఈ మాటలు ఆమెకు స్ఫురణకొచ్చాయి.

''ఊరికే చిరాకుపడ్డంలో అర్థం లేదు! నిన్ను పెళ్ళాడతాననే అవివేకి ఎవడైనా వస్తే, వెంటనే అంగీకరించు. ఆడవాళ్లంతా పెళ్లి చేసుకోకమానరు. తర్వాత పిల్లలు పుడతారు. వాళ్లవల్ల కష్టాలు పరంపరగా రాక తప్పదు. వాళ్లందరి తోటిదాననే నువ్వు.''

అటు తర్వాత చీకట్లో చవిటి పర్రల్లోనుంచి మెలికెలు తిరిగిపోయే నిరాశాపూరితమైన జీవితాన్ని ఆమె చూసింది. ఆ దారిని నడవడం తప్ప గత్యంతరం లేదని తెలుసుకున్నాక, ఒక గుడ్డి శాంతి కలిగింది. మళ్లీ ఇప్పుడలాంటి అనుభూతే కలిగింది. కొత్త రకమైన కష్టం త్వరలోనే సంభవిస్తుందనే స్ఫురణకలగడంతోనే ఎవరో అజ్ఞాతవ్యక్తితో నిర్లక్ష్యంగా మాట్లాడ్డం ప్రారంభించింది.

''ఇదిగో, తీసుకోండి!''

సాగదీసి బిగించిన తీగెలా ఝూంకరించుతూ ప్రకంపించుతూన్న ఆమె బాధాకలిత హృదయానికి ఈ మాటలు ఉపశాంతి కలిగించాయి.

కాని వాళ్ళు తనదనుకునే వస్తువులన్నిటినీ లాక్కోరనే ఒక ఆశను మాత్రం ఆమె రహస్యంగా దాచుకుంది. కొంత లాక్కోకుండా తప్పనిసరిగా ఉంచుతారనుకుంది.

## 24

ఒక రోజు ఉదయం, పావెల్, అన్‌ద్రేయ్ పనిలో కెళ్లిన తర్వాత కోర్సునొవా కిటికీ తలుపు తట్టింది.

''ఇసాయ్‌ని చంపేశారు. చూసి వద్దాం రా!'' అంది.

తల్లి ఉలికిపడింది. హంతకుడి పేరామె మనసుకు చటుక్కున స్ఫురించింది. శాలువ భుజంమీద వేసుకుంటూ,

''ఎవరు చేశారంటావు?'' అని అడిగింది.

''చంపినవాడక్కడే ఇసాయ్ పక్కన కూచుంటాడనుకుంటున్నావా? దెబ్బతో పడగొట్టి పారిపోయాడు.''

వాళ్లిద్దరూ దారంట పోతుంటే కోర్నుసొవా ఇలా చెప్పింది: ''మళ్లీ కొత్తగా సోదాలు ప్రారంభమవుతాయి. హంతకుడిని పట్టుకునేందుకు ప్రయత్నాలు జరుగుతాయి. నిన్నరాత్రి మీవాళ్ళు ఇంటిలో ఉండడం మంచిదైంది. అందుకు నేనే సాక్షిని. అర్ధరాత్రి వేళ ఇంటికి వెడుతూ మీ కిటికీలోపలికి తొంగిచూశాను. మీరంతా బల్లచుట్టూ కూర్చుని ఉన్నారు.''

''అయ్యో దేవుడా! ఎవరైనా, మావాళ్ల నెట్లా అనుమానిస్తారమ్మా మార్యా?'' అని భయంతో తల్లి ఆశ్చర్యంగా అడిగింది.

''సరి. సరి. అతగాడి నెవరు చంపుతారు? మీవాళ్లకు సంబంధించినవాళ్లే ఎవరో చంపి ఉండాలి. అతను, వాళ్లమీద గూఢచారిగా పనిచేస్తున్న సంగతందరికీ తెలిసిందే'' అని నిశ్చయంగా చెప్పింది కోర్నుసొవా.

తల్లి హఠాత్తుగా ఆగిపోయింది. ఊపిరి తీసుకోలేక చేతులను రొమ్ముమీద నొక్కుకుంది.

''ఏమిటది? భయపడకు. అతనికి జరుగవలసిందేదో జరిగిందిలే! పదపద. తొందరగా వెళ్లకపోతే అతన్ని తీసుకెళ్లిపోతారు!''

వెసొవ్ష్చికోవ్‌మీద తల్లికుండే అనుమానం ఆమెను వెనక్కి లాగింది.

''అతడన్నంత పనీ చేసేశాడు'' అనుకుంది.

ఫ్యాక్టరీ సమీపంలో తగలబడిపోయిన ఇంటి ముందు జనం గుంపుగా చేరి కందిరీగల్లా ధ్వని చేస్తూన్నారు. కాలిపోయిన దూలాలెక్కి బూడిద రేగగొడుతున్నారు. ఆ గుంపులో స్త్రీలు, అంతకన్న ఎక్కువగా పిల్లలు, దుకాణదారులు, సారాదుకాణంలో పనిచేసేవాళ్ళు, పోలీసులూ ఉన్నారు. పొడుగాటి విగ్రహం, నెరిసిన కుచ్చుగెడ్డం, రొమ్మునిండా పతకాలు గల పోలీసు ఉద్యోగి పేట్లిన్ కూడా ఉన్నాడు.

ఇసాయ్ సగం కూచున్నాడు. సగం వేల కొరిగేడు. నల్లగా బొగ్గయిన దూలాని కానుకున్నాడు. తల కుడి భుజంమీదకు వ్రేలబడిపోయింది. కుడి చెయ్యి లాగుజేబులో ఉండి పోయింది. ఎడమ చేతి వేళ్లు మెత్తని మట్టిలో కూరుకుపోయాయి.

తల్లి అతని ముఖంకేసి చూసింది. అతని కాళ్ల సందున పడున్న టోపీని కళావిహీనమైన ఒక కన్ను తేరిపారచూస్తోంది. అతని నోరు, ఆశ్చర్యపడుతున్నట్లుగా సగం తెరుచుకుంది. ఎర్రటి గడ్డం పక్కకు తొలిగింది. అతని పలచని శరీరం, కోసుతల విడుపైన మచ్చల ముఖం, చావువల్ల మరింత కుంచించుకుపోయినట్లు కనబడింది. తల్లి శిలువ గుర్తు వేసుకుని

నిట్టూర్పు విడిచింది. అతడు బతికున్నప్పుడామె కతనంటే అసహ్యంగా ఉండేది. కాని ఇప్పుడు అతడిని చూస్తుంటే ఆమెకు జాలేసింది.

"ఎక్కడా రక్తం కనబడ్డంలేదు. పిడికిలితో కొట్టి ఉండాలి" ఎవడో గుసగుసగా అన్నాడు.

"తను తీసుకున్న గోతిలో తనే పడ్డాడు. దొంగముండాకొడుకు" అన్నాడు మరొకడు కసితీరా.

పోలీసు ఉద్యోగి, ఆడవాళ్లను తోసుకుంటూ వచ్చి బెదరిస్తూ:

"ఎవరా మాట్లాడేది?" ప్రశ్నించాడు.

జనం అతనికి దారిచ్చారు. కొందరు గబగబా వెళ్లిపోయారు. ఒకడు వికటంగా నవ్వేడు.

తల్లి ఇంటికెళ్లింది.

"అతన్ని గురించి అయ్యో అనేవాళ్లు లేరే" అనుకుంది, తనలో తనే.

ఆమె మనోనేత్రానికి స్థూలకాయుడైన నికొలాయ్ తనకేసి నిస్పృహతో రెప్ప వాల్చకుండా చూస్తున్నట్లగుపడింది. అతడి కుడి చెయ్యి ఇప్పుడే కొట్టేసినట్లుగా ఊగుతూ కనబడింది.

అన్‌ద్రేయ్, పావెలూ ఇంటికి రాగానే వాళ్లని ఆ సంగతి అడిగింది.

"ఇప్పటి కెవరినైనా అరెస్టు చేశారా?"

"ఏమీ వినలేదు" అన్నాడు హొహోల్.

వాళ్లిద్దరూ కూడా కుంగిపోయి ఉన్నట్లామె గ్రహించింది.

"ఎవరైనా నికొలాయ్ పేరు చెప్పేరా?"

"లేదు" అన్నాడు పావెల్. అతడి చూపులో ఒక విధమైన కరుకుదనమూ, మాటలో ఒక ప్రత్యేకతా ఆమె గమనించింది.

"వాళ్లు అతన్ని అనుమానిస్తున్నారని అనుకోను. అతడెక్కడో ఉన్నాడు. నిన్న మధ్యాహ్నమే అతడు ఏటికెళ్లిపోయాడు. ఇంకా తిరిగి రాలేదు. అతడిని గురించి నేను వాకబు చేశాను" అన్నాడు పావెల్.

తల్లి ఉపశమించి నిట్టూర్పు విడిచి,

"దేవుడు చల్లగా చూడాలి! దేవుడు చల్లగా చూడాలి" అంది.

హొహోల్ ఆమెకేసి తేరిపార చూసి తలొంచుకున్నాడు.

"ఏమీ ఎరగనివాడిలా అక్కడ పడున్నాడు. అతడి గురించి విచారపడేవారెవ్వరూ లేరు. ఒక్క మంచిమాట మాట్లాడేవారు కనబడరు. తలపెట్టేవారు కూడా లేరు. నరికి పారేసిన వస్తువులా పడి ఉన్నాడు" పాలోచనగా అంది తల్లి.

భోజనం చేస్తూ చటుక్కున పావెల్ చెంచా పారేసి:

"అది నావల్ల కాదు!" అని ఒక్క కేకేశాడు.

''ఏమిటి?'' అని హొహోల్ అడిగేడు.

''ఆహారంకోసం పశువులను చంపుతాం. అదే చెడ్డ పని. అడవి జంతువులు ప్రమాద కరమైనప్పుడు వాటిని చంపక తప్పదు. మానవుడు క్రూరజంతువుగా మారి తోటి మానవులను చంపుకు తింటుంటే, అలాటివాడిని నేను చంపగలను. కాని అలాంటి నన్నాసి వెధవను చంపడానికి ఎవరికి చెయ్యి వచ్చిందో?''

హొహోల్ భుజాలెగరేశాడు.

''ఏ క్రూరజంతువుకన్నా అతడు ప్రమాదకరమైనవాడు. దోమ ఒక్క రక్తం చుక్క పీల్చినందుకే దాన్ని చంపుతాం కదా.''

''అది నిజమే. నా అభిప్రాయం అది కాదు. అది చాలా అసహ్యమైన పని అంటు న్నాను.''

''కాని వేరే శరణ్యం లేదు. తప్పదు.''

''నువ్వలాంటి అధముణ్ణి చంపగలవా?'' అని కొంచెం సేపు ఆలోచించి పావెల్ అన్ద్రేయ్ నడిగేడు.

హొహోల్ అతన్ని, విశాలమైన నేత్రాలతో, తదేక దృష్టితో చూసి, తటాలున తల్లివైపు తన చూపు మరల్చాడు. విచారంతోనే అయినా ఖచ్చితంగా అన్నాడు:

''నా కార్యోద్దేశ్యంకోసం నా ఉద్యమంకోసం నేనే పనిచేయవలసొచ్చినా చేస్తాను. చివ రకు నా సొంత కొడుకునైనా చంపుతాను'' అన్నాడు.

''ఓయ్, అన్ద్ర్యూషా!'' అని తల్లి ఆశ్చర్యంతో కేకవేసింది.

''తప్పదమ్మా! జీవితమంతే'' అని చిన్న నవ్వు నవ్వేడు.

''నిజమే, నువ్వు చెప్పేది నిజమే. జీవితమంతే'' అన్నాడు పావెల్.

హఠాత్తుగా అన్ద్రేయ్ చాలా ఆవేశంతో లేచి ఒక్క గంతేశాడు. ఏదో అంతశ్శక్తి అతన్నలా ప్రేరేపించింది, చేతులు ఊపుకుంటూ ఇలా మాట్లాడేడు:

''దానికి మనమేం చెయ్యగలం? అందర్నీ ప్రేమించే రోజులొచ్చేవరకూ, కొందర్ని ద్వేషించడం తప్పనిసరి అయింది. అభ్యుదయానికి అడ్డు వచ్చేవారి నెవరినైనా నాశనం చెయ్యాలి. తన స్వార్థానికి ధనంకోసం, కీర్తికోసం, గౌరవంకోసం జనాన్ని అమ్మేసేవాళ్లని తుడిచిపెట్టెయ్యాలి. నిజాయితీగా ప్రవర్తించే వాళ్ల మార్గాని కడ్డొచ్చి, వాళ్లని శత్రువుకి అప్పచెప్పడానికి సావకాశంకోసం కాచుక్కూచునే ద్రోహులను, జూడాస్‌లను, ఎవరినైనా సరే నాశనం చెయ్యకపోతే, నేనే ద్రోహి నవుతాను. నాకా హక్కు లేదంటావ్? — కాని మన యజమానులకు సైనికులనూ, ఉరితీసేవాళ్లనూ, వ్యభిచారగృహాలనూ, జైళ్లనూ, ప్రవాస స్థలాలనూ ఉంచుకునే హక్కు ఉందంటావా? వాళ్ల సౌఖ్యాన్నీ, భద్రతనూ రక్షించుకునే టందుకు ఇటువంటి హంగులన్నీ చేసుకునే హక్కు వాళ్లకుందా? ఒక్కొక్కప్పుడు వాళ్ల

చేతుల్లోని దుడ్డుకర్రను లాక్కొని తప్పనిసరిగా ఉపయోగించవలసివచ్చిందంటే ఆ తప్పు నాదా? ఏవిధమైన సంకోచం లేకుండా నేను లాక్కుంటాను. వాళ్ళు మన్ని పదులు వందలుగా చంపితే, నేను తిరగబడి ఒక్కడినైనా తలబద్దలుకొట్టే హక్కు నాకున్నది. అందరికన్న ఎవరెక్కువగా నా దగ్గరకొచ్చి నన్ను వేధిస్తాడో, ఎవరెక్కువగా నా ఉద్యమాని కడ్డొస్తాడో వాడిమీద దుడ్డుకర్ర తిరగేసే అధికారం నా కున్నది. జీవితమలాగే ఉంది. కాని నేనలాంటి జీవితానికి వ్యతిరేకిని. అలా ఉండాలని నే ననుకోవడం లేదు. అలాటివాళ్ల రక్తం చిమ్మడంవల్ల ఏమీ ప్రయోజనం లేదని కూడా నాకు తెలుసు. అది నిర్జీవమైన రక్తం. మన రక్తం వర్షంలా చిమ్మబడినప్పుడే సత్యం ఉప్పొంగుతుంది. వాళ్ల రక్తం చిమ్మబడితే అది ఆరిపోతుంది. అంతే. ఆ సంగతి నాకు తెలుసు. అయితే ఆ పాపాన్ని నా నెత్తిమీదనే పడేసుకుంటాను. చంపక తప్పదని నాకు తోస్తే నేనే చంపుతాను. నా పాపం నాతోనే అంతమై పోతుంది. భవిష్యత్తుమీద మచ్చంటూ మిగలదు. ఆ మరక నాకే అంటుకుంటుంది కాని మరెవరికీ అంటుకోదు!"

అతడు దేన్నో నరికి పారేస్తున్నట్లు చేతులతో సంజ్ఞలు చేస్తూ గదిలో పచారు చేశాడు. విచారంతోనూ ఆందోళనతోనూ తల్లి అతన్ని చూసింది. అతని హృదయాంతరాళంలో ఏదో పగిలి చాలా బాధ కలిగిస్తున్నట్టు ఆమె గ్రహించింది. హత్యను గురించిన భయంకరమూ ప్రమాదకరమైన ఆలోచనలు ఆమె మనస్సునుండి తొలగిపోయాయి: "వెసొవ్‌శ్చికోవ్ నేరం చేసి ఉండకపోతే పావెల్ స్నేహితులెవరూ చేసి ఉండరు" అనుకుంది. పావెల్ తలొంచుకుని, హొహోల్ ఘంటాపథంగా చెప్పే మాటలు వింటున్నాడు.

"ముందుకెళ్లాలంటే ఒక్కొక్కప్పుడు నీ అంతర్యానికి విరుద్ధంగా నువ్వు నడువ వలసివస్తుంది. నీ హృదయంతో సహా సర్వమూ సమర్పించాలసొస్తుంది. నీ ఉద్యమానికి నీ జీవితాన్ని సమర్పించడం సులభమే. కాని నీ ప్రాణంకంటే ప్రియమైనదాన్ని కూడా సమర్పించవలసొస్తుంది. దాన్ని సమర్పించడంవల్ల, ఈ ప్రపంచంలో ఏది నీ కత్యంత ప్రియతమమైన సత్యమో, ఏ సత్యం కొరకు నువ్వు పోరాడుతున్నావో ఆ సత్యాన్ని మరింత బలపరచినవాడవవుతున్నావు."

గదిమధ్య నిలబడి మనిషి వెలవెలబారి అర్ధనిమీలిత నేత్రాలతో, ప్రమాణం చేసి చెపుతున్నట్లుగా చెయ్యెత్తి ఇలా చెప్పేడు:

"ప్రజలు తమ అందాన్ని చూసుకుని తామే ఆనందించే రోజులొస్తాయని నాకు తెలుసు. అప్పుడు ప్రతి మనిషీ మిగిలినవాళ్లందరికీ నక్షత్రంలా కనబడతాడు. ప్రపంచమంతా స్వేచ్ఛాళువులైన జనంతో నిండిపోతుంది. ఆ స్వేచ్ఛవల్లనే వాళ్ళు గొప్పవాళ్లవుతారు. అందరి హృదయ కవాటాలూ తెరుచుకుని ఉంటాయి. ఎవరి హృదయాల్లోనూ ద్వేషంగాని ఈర్ష్యగాని ఉండదు. అప్పుడు జీవితమంతా మానవసేవకు అంకితమైపోతుంది. మానవుడు

మహాపురుషుడవుతాడు. ఉన్నత స్థాయి కెక్కుతాడు. ఏమంటే స్వేచ్ఛాళువులైన వారు మహౌన్నత్యాలను అందుకోగల్గుతారు! అప్పుడు సౌందర్యంకోసం జనం సత్యాన్నీ, స్వాతంత్ర్యాన్నీ ఉపాసిస్తారు. ఎవరి హృదయాలు ప్రేమతో ప్రపంచాన్నంతనీ ఆలింగనం చేసుకోగలుగుతాయో అలాంటివారు ఉత్తమ పురుషులుగా లెక్కకొస్తారు. వారిలోనే గొప్ప సౌందర్యం ఉంటుంది. ఈ నవజీవనోపాసకులు గొప్పవాళ్ళవుతారు!''

ఒక్క నిమిషం ఆగి, హృదయాంతరాళంలోనుంచి వచ్చిన కంఠస్వరంతో,

''అలాటి ఉత్తమ జీవితంకోసం నేను ఏ పనిచెయ్యడానికైనా సిద్ధంగా ఉన్నాను'' అన్నాడు.

అతడి ముఖం ఉద్రేకంతో పొంగింది. చెక్కిళ్ళమీద పెద్ద కన్నీటిచుక్కలు ధారగా ప్రవహించాయి.

పావెల్ తెల్లబోయి తల పైకెత్తి తేరిపారి అతనికేసి చూశాడు. ఆందోళనకరమైన ఆలోచన తనను ఆవరించుతూన్నట్టు తల్లికి అనిపించింది.

''ఏమిటది, అన్ద్రేయ్?'' అని పావెల్ మెల్లగా ప్రశ్నించాడు.

హాహోల్ తలూపి, నిలువుగా నిలబడి సూటిగా తల్లికేసి చూశాడు.

''అది జరగడం నేను చూశాను.... నాకంతా తెలును....''

తల్లి ముందుకు వొచ్చుకెళ్ళి అతని చేతులను గట్టిగా పట్టుకుంది. అతడు తన కుడి చేతిని వదలించుకోవడానికి ప్రయత్నించాడు. కాని ఆమె పట్టు వదల్లేదు.

''ఉష్! ఊరుకో నాయనా! ఊరుకో!...'' అని చెవిలో చెప్పింది.

''ఉండండి! అదెలా జరిగిందో చెప్తాను'' అన్నాడు హాహోల్.

''చెప్పద్దు, అన్ద్ర్యూషా!'' అని నీరు నిండిన కళ్లతో అతని వంక చూస్తూ తల్లి గొణిగింది.

పావెల్ మెల్లగా దగ్గర కొచ్చాడు. అతని ముఖం వెల్లబారింది. గ్రుడ్లలో నీళ్ళు తిరిగేయి. చిన్న నవ్వు తెచ్చుకుని,

''అమ్మ నువ్వేమోనని భయపడుతోంది'' అన్నాడు.

''నేను భయపడ్డం లేదు! నేను నమ్మను! నా కళ్లతో చూసినా నేను నమ్మను....''

''ఉండండి'' అని చేతులు విడిపించుకోవడానికి ప్రయత్నించాడు హాహోల్. ''నేను కాదు. కాని నేను ఆపాలంటే ఆపగలిగేవాడినే'' అన్నాడు.

''ఇష్! అన్ద్రేయ్'' అన్నాడు పావెల్.

పావెల్, హాహోల్ చేతిని తన చేత్తో పుచ్చుకుని రెండవ చేతిని అతని భుజంమీద వేశాడు — వణుకుతున్న పొడుగాటి శరీరాన్ని శాంతపరచేందుకా అన్నట్టు. గద్గద స్వరంతో అన్ద్రేయ్ ఇలా అన్నాడు:

''పావెల్ నేనది జరగాలని అనుకోలేదు సుమా. జరిగిన సంగతిది: నువ్వు నన్నూ,

ద్రగూనొవ్‌మా ఆ మూల వదలిపెట్టి వెళ్లేవు కదా. మేమిద్దరం మాట్లాడుకుంటుంటే ఇసాయ్ వచ్చి మమ్మల్ని చూస్తూ, వెక్కిరించాడు. 'చూశావా? వాడు రాత్రంతా నన్ను వెంబడించే ఉన్నాడు. వాడిని గట్టిగా ఉతికెయ్యాలి' అన్నాడు ద్రగూనొవ్. తర్వాత అతడు వెళ్లిపోయాడు – ఇంటికెళ్లిపోయాడనుకుంటాను.... పిమ్మట ఇసాయ్ నా దగ్గర కొచ్చాడు....'' హొహోల్ పెద్దగా నిట్టూర్చేడు.

''అప్పుడు నన్నెవరూ ఎప్పుడూ అవమాన పరచనంతగా అవమానించాడు. కుక్కవెధవ!''

తల్లి నెమ్మదిగా అతన్ని బల్లదగ్గరకు తీసుకెళ్లి కూచోపెట్టింది. తన భుజాలు అతనికి తగిలేటట్టు అతని దగ్గరగా కూచుంది. పావెల్ చిరచిరలాడుతూ గడ్డం దువ్వు కుంటూ నిలబడే ఉన్నాడు.

''మన పేర్లన్నీ వాళ్లకు తెలిసిపోయాయనీ, మనమంతా పోలీసుజాబితాలో ఉన్నామనీ, మే డే ఉత్సవాలకు ముందుగానే మనల్ని అరెస్టుచేస్తారనీ వాడు చెప్పేడు. లోపల మండు తున్నా, నేనేమీ జవాబుచెప్పలేదు. నవ్వేసి ఊరుకున్నాను. నేను చాలా చురుకైనవాడిననీ, ఈ మార్గాన్ని అనుసరించడం దురదృష్టమనీ అన్నాడు. నువ్వు....'' అని ఆగి ఎడం చేతో ముఖం తుడుచుకున్నాడు. అతని కళ్లు మెరిశాయి.

''నా కర్థమైందిలే!'' అన్నాడు పావెల్.

'' 'నువ్వు అధికార్లకి సాయంచెయ్యడం మంచిది' అన్నాడు.''

హొహోల్ పిడికిలి ఊపి పళ్లు పటపట కొరికి ఇలా అన్నాడు:

''అధికార్లకట – వాడి శ్రాద్ధం! అంతకన్న వాడు ముఖంమీద గుద్దినా బాగుండేది. అది నాకూ వాడికీ కూడా మంచిదే. వాడలా నా హృదయంమీద, కుళ్లుకంపు కొట్టే శ్లేష్మాన్ని ఉమ్మడం నేను భరించలేకపోయాను.''

అన్‌ద్రేయ్ ఆవేశంతో పావెల్ చేతిలోనుంచి తన చేతిని విసురుగా లాక్కున్నాడు. అస హ్యించుకుంటూ మెల్లని స్వరంతో ఇలా చెప్పేడు:

''నేను వాడి ముఖంమీద ఒక్క దెబ్బ కొట్టి వెళ్లిపోయాను. ద్రగూనొవ్ నా వెనకాలే మెల్లగా 'దొరికేవురా ఆఖరికి!' అనడం విన్నాను. అతడు ఆ మూలనే కాసుకుని ఉండి ఉండాలి. నేను వెనక్కి తిరుగుదామా అని అనుకున్నాను. కాని తిరగలేదు. దెబ్బ కొట్టిన చప్పుడు వినబడింది. కాని నా దారిన నేను కప్పమీద కాలేసి దాటిపోయినట్లు ముందుకెళ్లి పోయాను. పనిచేసే చోటికి కొందరొచ్చి, 'ఎవరో ఇసాయ్‌ని చంపేశారు!' అని అరిచారు. నేను నమ్మలేకపోయాను. కాని నా చెయ్యి తీపు పెట్టడం మొదలెట్టింది. పనిచెయ్యలేక పోయాను. నిజానికి నాకేమీ నొప్పెట్టలేదు, కాని చెయ్యి కురుచ అయిపోయినట్టు అనిపిం చింది.'' అన్‌ద్రేయ్ తన చేతికేసి తీక్షణంగా చూశాడు. ''ఈ అసహ్యమైన మచ్చను ఈ జీవితంలో కడిగెయ్యలేననుకుంటాను.''

''నీ హృదయం నిష్కళంకంగా వుండాలి — అదే ముఖ్యమైన సంగతి'' అంది తల్లి మృదువుగా.

''నావల్ల ఏ తప్పూ వుందని నే ననుకోవడం లేదు — ఎంత మాత్రం అనుకోవడం లేదు!'' అన్నాడు హోహోల్ దృఢంగా. ''అసహ్యంవేస్తోంది, అంతే. దీనిలో ఇరుక్కోకుండా వుండవలసింది నేను.''

పావెల్ భుజాలెగరేసి:

''నీ మాట నాకర్థం కావడం లేదు. నువ్వు చంపలేదు కదా! చంపితే మాత్రం....'' అన్నాడు.

''వినవయ్యా, సోదరా — ఒక హత్య జరుగుతోందని నీకు తెలిసినప్పుడు, దాన్ని నువ్వు ఆపకపోతే....''

''నాకర్థం కావడం లేదు'' అని పావెల్ రెట్టించాడు. ''అంటే, బహుశా నాకు అర్థమైంది. కాని అవగాహన అయినట్లు నాకు అనిపించడం లేదు.''

ఫ్యాక్టరీ కూత కూసింది. దురహంకారపూరితమైన ఆ కూతను హోహోల్ విని తల వెనక్కి వాల్చేశాడు.

''ఇవ్వేళ ఇక పనిలో కెళ్లదలచుకోలేదు'' అన్నాడు.

''నేనూ వెళ్లను'' అన్నాడు పావెల్.

''నేను స్నానాలగదిలోకి వెడతాను'' అంటూ చిన్న నవ్వు నవ్వి, గుడ్డలు మూట కట్టుకున్నాడు. చాలా నిరుత్సాహంతో ఇల్లు వదిలిపెట్టేడు.

సానుభూతి నిండిన తల్లి చూపులు అతన్ని అనుసరించాయి.

''పాషా, నువ్వేమైనా అను, మనిషిని చంపడం పాపమే. అయితే అందుకు నేనెవరినీ నేరస్థుడనను. ఇసాయ్ విషయంలో నేను జాలిపడుతున్నాను. వాడెందుకూ పనికిరాని ఊరూ పేరూ లేని వాడు. ఈ వేళ నేను వాడిని చూసినప్పుడు, అతడు నిన్ను ఉరితీయిస్తానని బెదరించిన విషయం జ్ఞాపకాని కొచ్చింది. కాని ఆ కారణంచేత నేనతన్ని అసహ్యించుకోలేదు. చచ్చిపోయాడని సంతోషించలేదు. నాకు విచారం మాత్రం కలిగింది.... ఇప్పుడంటావా — ఆ జాలి కూడా కలగడం లేదు....''

ఆమె నిశ్శబ్దంగా ఆలోచనలో పడింది. పిమ్మట ఆశ్చర్యార్థకమైన చిన్న నవ్వు నవ్వి,

''అయ్యో నాయనా, నేనే మంటున్నదీ వింటున్నావా పాషా?'' అంది.

నిజానికి అతడు వినసే లేదు. నేలచూపులు చూస్తూ పచారుచేస్తూ, విషాదంగా జవాబుచెప్పేడు.

''అదేనమ్మా జీవితం! ప్రజలు ఒకళ్ల మీద కొకళ్లు ఏ విధంగా రెచ్చగొట్టబడుతు

న్నారో చూడు. అనుకోకుండానే నువ్వాకళ్లను దెబ్బ తియ్యవలసొస్తోంది. ఇంతకూ నువ్వెవరిని కొడుతున్నావు? నీలాగే ఏ హక్కులూ లేని నిర్భాగ్యపు జీవిని. ఈ సందర్భంలో అతడు నీకన్న అదృష్టహీనుడు. ఏమంటే, వాడు పట్టి మూర్ఖుడు. పోలీసులు, గూఢ చారులు అంతా మనకు శత్రువులే. కాని వాళ్లంతా మనలాటి మనుష్యులే. మనకు మల్లేనే వాళ్ల రక్తం కూడా పీల్చబడుతోంది. మనల్ని చూసినట్లుగానే వాళ్లని కూడా హీనంగానే చూస్తారు. మనమంతా ఒక్క తరహా వాళ్లమే. కాని యజమానులు మాత్రం ప్రజల్ని ఒకళ్లమీద ఇంకొకళ్లను రెచ్చగొట్టి ఉంచుతారు. భయంతోనూ, అవివేకంతోనూ వాళ్లను అంధులను చేస్తారు. చేతులూ కాళ్లూ కట్టేసి, బాగా నలిపేసి రక్తం పీల్చేస్తారు. చివరికి ఒకళ్లనొకళ్లు కొట్టుకుని అంతా నలిగిపోతారు. వాళ్లు ప్రజలను తుపాకులుగానూ, కర్రలుగానూ, రాళ్లుగానూ మార్చేసి, 'ఇదే రాజ్యం' అంటారు.''

అతడు తల్లికి దగ్గరగా వెళ్లేడు.

''అమ్మా! అది చాలా అపరాధం. లక్షలాది ప్రజలను దుర్మార్గంగా హత్యచెయ్యడం. మానవుల ఆత్మలను బలవంతంగా హత్యచెయ్యడం. ఆ సంగతి కనిపెట్టేవా? ఆత్మలను హత్య చేసేవాళ్లని గుర్తించావా? మాకూ వాళ్లకీ ఉండే తేడాను గ్రహించావా? మే మెవ ళ్లనైనా కొట్టినపుడు అది అసహ్యం, సిగ్గుచేటు, బాధాకరం. ఎక్కువగా అసహ్యకరం. కాని వాళ్లు వేలాది ప్రజలను చల్లగా నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు. ఏవిధమైన సంకోచం లేకుండా చంపి గొప్పగా సంతృప్తిచెందుతారు. జనాన్ని ఈ విధంగా నలిపేసి చంపడ మెందుకంటే మనల్ని బానిసలుగా చేసే తమ వెండిబంగారాలనూ, వస్తువాహనాది భాగ్యాలనూ రక్షించుకోడానికి. బాగా ఆలోచించు — ప్రజల్ని చంపి, వాళ్ల ఆత్మలను ముక్కలు చెక్కలు చెయ్యడం వాళ్ల ప్రాణాలను రక్షించుకోవడానికి కాదు — వాళ్ల ఆస్తిపాస్తులను రక్షించుకోవ డానికి! ఆస్తిపాస్తులు మానవుడికి వెలుపల ఉండే ఆడంబరాలే కాని అతని హృదయంలో ఉండేవి కావు.''

ఆమె చేతులను తన చేతుల్లో పెట్టుకుని వాటిమీదకొంగి గట్టిగా నొక్కేడు.

''అమ్మా! వాళ్లు చేసే పని ఎంతటి సిగ్గుచేటో, ఎంత నీచమో నువ్వు అర్థం చేసుకో గలిగితే, మేమెందుకు పోరాడుతున్నామో, ఆ సత్యం నీకు బోధపడుతుంది. అదెంతటి మంచిదో, మహత్తరమైనదో నువ్వు చూడగలుగుతావు.''

తల్లి ఎంతో ఉద్వేగపడి లేచింది. తన హృదయంలోని జ్యోతి, తన కుమారుని హృద యంలోని జ్యోతితో మిళితమై ఒక మహాజ్వాల అవాలనే కోరిక ఆమె వాపహించింది.

''కొంచెం ఓపిక పట్టు, పాషా! ఓపిక పట్టు! నేనూ దాన్ని చూస్తాను'' అని ఆమె రొజుకుంటూ గొణిగింది.

## 25

ఎవరో చప్పుడు చేసుకుంటూ వాకిలి గుమ్మం ఎక్కేరు. తల్లీ కొడుకూ ఒకళ్లకేసి ఒకళ్లు తెల్లబోయి చూసేరు.

నెమ్మదిగా తలుపు తెరుచుకుని రీబిన్ లోపలికి ప్రవేశించాడు.

తల పైకెత్తి చిరునవ్వు నవ్వుతూ:

"ఇదిగో వచ్చాను. అనుమానాల మనిషిని. అన్న మాటప్రకారం నడిచేవాడిని. అక్కడికీ ఇక్కడికీ తిరుగుతూ, అన్నిటిలో వేలెట్టేవాడిని!"

అతడు నార చెప్పులు తొడుక్కున్నాడు. బొచ్చుటోపీ ధరించాడు. గొర్రెతోలు కోటు కప్పుకున్నాడు. దాన్నిండా తారుమరకలే. పటకాలో నల్లని చేతి తొడుగులు దోపుకున్నాడు.

"మీ ఆరోగ్యం ఎలా ఉంది? పావెల్! నిన్ను వదలిపెట్టేరే? బాగుంది. నీలొవ్నా! బాగా ఉన్నావా?" తెల్లటి పళ్లు బయటపెట్టి నోరారా నవ్వేడు. అతని కంఠస్వరం మునుపటికన్న మృదువైంది. ముఖంమీద బాగా ఒత్తుగా గెడ్డం పెరిగింది.

అతన్ని చూసి తల్లి చాలా ఆనందపడింది. నల్లటి మరకలతో ఉన్న అతని బరువైన చేతిని పట్టుకుంది. ఘాటుగా కొడుతున్న తారు వాసన వొక్కసారి గట్టిగా పీల్చింది.

"అబ్బ! నిన్ను చూస్తే నాకెంత సంతోషం కలుగుతోందనుకున్నావు?" అంది.

పావెల్ రీబిన్‌కేసి చిరునవ్వు నవ్వి:

"అసలైన పల్లెటూరి రైతంటే నువ్వేనోయ్!" అన్నాడు.

అతిథి నెమ్మదిగా కోటు విప్పి పక్కన పెట్టేడు.

"అవునయ్యా, నేను మళ్లీ రైతునై పోతున్నాను. మీరందరూ నాగరికులైన పెద్ద మనుషులు కండి. నేను మీకు భిన్నంగా ఈ వైపుకెడతాను."

రంగుల చొక్కాను విప్పుతూ, గదంతా తిరుగుతూ అన్నీ పరిశీలించాడు.

"పుస్తకాలు తప్ప ఇక్కడ కొత్త మార్పేమీ లేదు.... సరే. విశేషాలేమిటో చెప్పండి" అన్నాడు.

కాళ్లు ఎడంగా పెట్టుకుని, మోకాటి చిప్పలను చేతుల్తో గట్టిగా పట్టుకుని కూచున్నాడు. ముసిముసి నవ్వులు నవ్వుతూ జవాబు కెదురుచూస్తూ పావెల్ ముఖంమీద నల్లని కళ్లను నిగిడించాడు.

"మా పని ముందుకే సాగుతోంది" అన్నాడు పావెల్.

"దున్ని విత్తనాలు చల్లుతాం. మొక్కలెదుగుతుంటే చూస్తూంటాం. ఆపైన ఏడాదంతా కాచుకు తాగుతూ కాలక్షేపం చేస్తూ ఉంటాం. అంతేనా?" అని రీబిన్ నవ్వేశాడు.

"మిహయీల్ ఇవానొవిచ్, మీరెల్లా కాలక్షేపం చేస్తున్నారు?" రీబిన్‌కి ఎదురుగా కూచుని పావెల్ అడిగేడు.

"బాగానే ఉన్నాను. యెగిల్‌దేయెవొలో ఉంటున్నాను – ఆ పేరెప్పుడైనా విన్నావా? – అందంగా ఉండే పెద్ద పల్లెటూరు. సంవత్సరానికి రెండు సంతలు సాగుతాయి. జనాభా రెండు వేల పైచిలుకు. నిరుపేదలు. ఎవళ్లకీ స్వంత భూమి లేదు. అంతా కవులుకు పుచ్చుకోవలసిందే. అదీ అంత సారవంతమైనది కాదు. నేనొక రక్తం పీల్చేవాడి దగ్గర పనిలో చేరేను. శవానికి పట్టిన పురుగుల్లాగ అలాటివాళ్లక్కడ చాలామంది ఉన్నారు. బొగ్గు కాల్చి తారు తయారుచేస్తారు. ఇక్కడ సంపాదిస్తుండిన దానిలో నాలుగో వంతు సంపాదిస్తున్నాను. అయితే ఇక్కడకన్న రెట్టింపు కష్టపడుతున్నాను. ఆ రక్తం పీల్చేవాడి దగ్గర ఏడుగురం పనిచేస్తున్నాం. నేను తప్ప అంతా ఆ వూరివాళ్లే. మంచివాళ్లు, అందరూ యువకులు. అందరూ చదవడం రాయడం నేర్చుకున్నవాళ్లే. అందులో యెఫీమ్ అనే అగ్గిబరాటా వున్నాడు. అతడినేం చెయ్యాలో తెలియడం లేదు."

"వాళ్లను మాట్లాడించుతూంటారా? వాళ్లకి ఏమైనా చెప్తుతూంటారా?" అని పావెల్ ఆత్రంగా అడిగేడు.

"నేనేమంత మౌనంగా వుండను. మీ కరపత్రాలన్నీ – మొత్తం ముప్పైనాలుగూ నాతో పట్టుకెళ్లేను. అయితే నేనెక్కువగా బైబిల్ నుపయోగిస్తాను. బైబిలులోనుంచి తెలుసుకోవలసింది చాలా ఉంది. హోలీ చర్చి వాళ్ల అంగీకారాన్ని పొందిన లావుపాటి పుస్తకం. దాన్ని నమ్మవచ్చు!"

రీబిన్ నవ్వుతూ పావెల్‌కు కన్ను కొట్టేడు.

"కాని అది చాలదు. నిన్ను అడిగి కొన్ని పుస్తకాలు పట్టుకెడదామని వచ్చాను. మేమిద్దరం వచ్చాం. యెఫీమ్‌ను కూడా నాతో తీసుకువచ్చాను. యజమానులు తారు ఇచ్చి రమ్మని పంపేరు. అది ఇచ్చేసి నిన్ను చూసిపోదామని దారి మళ్లి వచ్చాం. ఆ యెఫీమ్ వచ్చేలోగానే పుస్తకాలియ్యి. అతడికి విషయాలంత ఎక్కువగా తెలియకూడదు."

తల్లి రీబిన్‌కేసి చూస్తుంటే అతని కోటులోనే కాకుండా అతని వైఖరిలోనే అదేదో మార్పు ఉన్నట్టు ఆమెకు తోచింది. నడవడి కొంత సావుతేరింది. చూపులో జిత్తులమారితనం ద్యోతకమైంది. కళ్లలో మునుపటంతటి అమాయకత్వం లేదు.

"అమ్మా! మీరు వెళ్లి పుస్తకాలు తీసుకొస్తారా? ఏ పుస్తకాలో అక్కడివాళ్లకే తెలుసు. పల్లెటూళ్లకు పంపడానికని చెపితే చాలు" అన్నాడు పావెల్.

"అలాగే వెడతాను.... సమొవార్ మరగడంతోనే వెడతాను" అంది తల్లి.

"ఏమమ్మోయ్ పెలగేయా నీలొవ్నా! నువ్వు కూడా ఈ వ్యవహారంలో చిక్కుకున్నావూ?" అని రీబిన్ నవ్వేడు. "ఓహో! అక్కడ చాలామందికి పుస్తకాలు కావాలి. ఆ పనంతా అక్కడుండే ఒక ఉపాధ్యాయుడు చూస్తుంటాడు. అతను మతంవాడైనా మంచివాడనే అంటారు. అక్కడికేడు మైళ్ల దూరంలో మరొక టీచరమ్మ కూడా ఉంది. వాళ్ల ఉద్యోగాలు పోతా

యేమోననే భయంతో వాళ్లిద్దరూ నిషిద్ధ గ్రంథాలనుపయోగించరు. కాని నాకు కావలసినవి నిషిద్ధ గ్రంథాలే. అందులోనూ, కొంచెం గరమ్‌గరంగా ఉండేవి కావాలి. నేను అందచేసే పుస్తకాలు పోలీసు ఇన్‌స్పెక్టరు చేతుల్లో పడినా, మతగురువు చేతుల్లో పడినా, వాళ్లెవరి సంటారు? ఆ టీచర్లనే అనుమానించి వాళ్లనే తొందర చేస్తారు. ఈలోగా నే నెక్కడో దాక్కొని కాలం వెళ్లబుచ్చేస్తాను."

తన తెలివితేటలకు తనే మెచ్చుకుంటున్నట్లుగా అతడు ఇకిలించాడు.

"ఓహో! నువ్వు చూడ్డానికి ఎలుగ్గొడ్డులా ఉన్నావు కాని, అమ్మో నిజానికి నక్కవే!" అనుకుంది తల్లి.

"వాళ్లు నిషిద్ధ గ్రంథాలను ప్రచారం చేస్తున్నందుకు టీచర్లననుమానించి వాళ్లని జైల్లో పెడతారా?" అని పావెల్ అడిగేడు.

"తప్పకుండా పెడతారు.... పెడితేనేమి?" అన్నాడు రీబిన్.

"మరి తప్పు చేసింది మీరు, వాళ్లు కాదాయె. జైలుకు మీరే వెళ్లాలి...."

రీబిన్ మోకాటి చిప్పమీద కొట్టుకుంటూ:

"తమాషా మనిషివే! నన్నెవరూ అనుమానించరు. రైతులు అలాంటి పనిచేయరు కదా. పుస్తకాల వ్యవహారమంతా నడిపించేవాళ్లు చదువుకున్న పెద్దమనుషులు. ఆ పనికంతా జవాబ్దారీ వాళ్లదే" అని నవ్వేడు.

పావెల్ రీబిన్‌ని సరిగా అర్థంచేసుకోలేదనుకుంది తల్లి. తన కొడుకు కళ్లు చిట్లించడం కూడా చూసింది. అంటే అతడు కోపంగా ఉన్నాడని అర్థం.

"మిహాయిల్ ఇవానొవిచ్ అభిప్రాయం తను చేసిన పనికి తప్పు మరొకరిమీదుగా పోవాలని" అని సంకోచిస్తూ స్పష్టీకరించింది.

"అదీ సంగతి.... ప్రస్తుతానికి" అంటూ రీబిన్ గడ్డం దువ్వుకున్నాడు.

"అమ్మా! అయితే విను. మనవాళ్లలో ఒకడు – మాటవరుసకు అన్‌ద్రేయ్ – తప్పు చేసి నా వెనక దాగేడనుకో. అతడేదో అపరాధం చేస్తే, నన్ను జైలుకు పంపేరనుకో. నీకెలా ఉంటుంది?" అన్నాడు పావెల్.

తల్లి ఉలికిపడి కొడుకుకేసి ఆశ్చర్యపడి చూసింది.

"కామ్రేడ్‌ను అలా ఎందుకు మోసం చేస్తారు?" అని తలపంకిస్తూ అడిగింది.

"ఊహూం! నీ అభిప్రాయం తెలిసింది పావెల్" అని దీర్ఘం తీశాడు రీబిన్. తల్లి కేసి అలక్ష్యంగా ఒక చూపు చూశాడు.

"మామ్మా! ఇదంతా చాలా సూక్ష్మమైన వ్యవహారం" అన్నాడు. తర్వాత పావెల్‌కేసి తిరిగి ఉపదేశ ధోరణిలో మాట్లాడ్డం మొదలెట్టేడు:

"తమ్ముడూ, నువ్వు చంటిపిల్లాడిలా ఆలోచిస్తున్నావు. రహస్య కార్యక్రమం సాగిం

చేటప్పుడు నిజాయితీని గురించి తాపత్రయపడ్డానికి వీల్లేదు. నువ్వే ఆలోచించు. ఎవరి దగ్గర పుస్తకాలు దొరుకుతాయో వాళ్లని ముందు జైల్లో పారేస్తారు. టీచర్ల జోలికెళ్లరు. అది మొదటి సంగతి. ఉపాధ్యాయులు అంగీకరింపబడిన పుస్తకాలనుపయోగించినా వాళ్లు చెప్పే భావాలొకటే అనేది రెండవ సంగతి. అయితే వాళ్లు ఉపయోగించే మాటలు వేరు. వాటిలో కొంచెం నిజం తక్కువ. సూక్ష్మంగా చెప్పాలంటే నా లక్ష్యం, వాళ్ల లక్ష్యం ఒక్కటే. కాని వాళ్లు సందుల వెంబడి నడుస్తారు. నేను రాజబాటమీద నడుస్తాను. అధికారుల దృష్టిలో మేమిద్దరమూ అపరాధులమే. ఔనా? ఇక మూడవ సంగతి. వాళ్లని నేను బలపర్చను. ఆశ్వికదళాలవారితో కాల్బలాలు ఎప్పటికీ సన్నిహితులు కారు. బహుశా నేను రైతుల విషయంలో అలాటి పని చెయ్యకపోవచ్చును. టీచర్లలో ఒకడు మతబోధకుని కొడుకు. రెండవది ధనికుడైన భూస్వామి కూతురు. వాళ్లెందుకు ఈవిధంగా ప్రజలను రెచ్చగొడుతున్నారు? వాళ్ల మనసుల్లో ఏముందో రైతునైన నేను తెలుసుకోలేను. నేనేమి చేస్తున్నానో నాకు తెలుసు. కాని వాళ్లెందుకు చేస్తున్నారో నాకు ఎంత మాత్రమూ తెలియదు. వెయ్యి సంవత్సరాలనుండి వాళ్లు చదువుకున్న పెద్దమనుష్యులేమి చేస్తారని అనుకుంటున్నారో అదే చేశారు. రైతుల చర్మాల నొలిచి పదును చేశారు. కాని హఠాత్తుగా వాళ్లే ఇప్పుడు మేల్కొని, రైతుల కళ్లకు కట్టిన గంతలను తమ చేతుల్తోనే విప్పేస్తున్నారు! నేను దేవతల కట్టుకథలను నమ్మేవాడిని కాను. ఇది చాలావరకు దేవతల కట్టుకథలాగే ఉంది. ఈ చదువుకున్న పెద్దమనుషులకీ నాకూ చాలా తేడా ఉంది. శీతాకాలంలో చేల కడ్డపడి స్వారీచేస్తుంటే, దూరంగా రోడ్డు కడ్డంగా ఏదో తళుక్కుమంటుంది. అదేమిటి? తోడేలా? నక్కా? లేకపోతే ఉట్టి కుక్కా? ఏమిటో చెప్పలేం. దానికీ నీకూ మధ్య చాలా దూరముంది."

తల్లి కొడుక్కేసి చూసింది. అతడు ఖిన్నుడైనాడు.

పావెల్‌కేసి సంతృప్తితో చూస్తూ, వేళ్లతో గడ్డం దువ్వుకుంటుంటే రీబిన్ కళ్లలో నల్లని వెలుగు అగుపించింది.

అతడు తన ఉపదేశాన్ని సాగించాడు:

"ఇది మర్యాదల గురించి ఆలోచించవలసిన కాలం కాదు. జీవితం చాలా కటకటగా ఉంది. కుక్కల దండు గొర్రెలమంద కాదు. — ఏ కుక్క మొరుగు ఆ కుక్కదే."

"చదువుకున్న పెద్దమనుషుల్లో సామాన్య ప్రజలకోసం ప్రాణాలర్పించడానికి కూడా సిద్ధపడిన వాళ్లున్నారు. జీవితమంతా జైళ్లలో మగ్గుతున్న వాళ్లున్నారు" అంది తల్లి. తానెరుగున్న జనమంతా ఆవిడ తలపుకొచ్చారు.

"వాళ్లొక ప్రత్యేక తరగతివారు. రైతులు ధనికులై పెద్దమనుషులవుతారు. పెద్దమనుషులు పేదలై రైతులుగా దిగజారిపోతారు. పావెల్, ఈ సంగతే నువ్వు నాకు స్పష్టీకరించి

చెప్పేవు జ్ఞాపకముందా? ఒక వ్యక్తి ఏవిధంగా జీవిస్తుంటాడో దాన్ని బట్టే అతని ఆలోచన నిర్ధారణవుతుంది. దాని సంగతంతే! కార్మికుడు అవునంటే యజమాని కాదంటాడు. కార్మికుడు కాదంటే యజమాని అవునంటాడు. అది వాళ్ల స్వభావం. అలాటి భేదమే రైతుకూ భూస్వామికీ మధ్య ఉంది. భూస్వామి తన రైతు కడుపునిండా తింటూండడం చూసి కంట్లో నిప్పులు పోసుకుంటాడు. అన్ని తరహాల మనుషుల్లోనూ కుక్కలకొడుకు లుంటూనే ఉంటారు. నేను ప్రతి రైతునూ వెనకేసుకు రావడం లేదనుకో...." అంటూ రీబిన్ లేచి నుంచున్నాడు.

చప్పుడు చేయకుండా పళ్లు కొరుకుతున్నట్లుగా గెడ్డం వణికింది. మెల్లని కంఠ స్వరంతో మళ్లీ ప్రారంభించాడు:

"అయిదేళ్లపాటు పని కోసం ఫ్యాక్టరీనుంచి ఫ్యాక్టరీకి తిరిగి, గ్రామమనేది ఎలా ఉంటుందో మరచిపోయాను. చివరకు పల్లెటూరు చేరుకున్నాక, అక్కడి జీవితం దుర్భరమ నిపించింది. అర్థమైందా? అక్కడ నేను బ్రతకలేననిపించింది. ఇక్కడుండేవాళ్లు అక్కడ జరుగుతుండే ఘోరాలను చూడలేరు. ఆకలి జనాన్ని నీడలాగే వెంటాడిస్తుంది. ఆహారం దొరికే ఆశ ఏమీ లేదు. ఏ మాత్రం కూడా లేదు. ఆకలి ప్రజల ఆత్మలను కబళించేస్తుంది. తలలను కొరికేస్తుంది.... వాళ్లు జీవించరు.... అంతమంటూ లేని లేమితో వాళ్లు అలా కృశించి పోతారు. ప్రజలు మరో ముద్ద తినకుండా, ఉద్యోగులు గద్దల్లా కనిపెట్టి చూస్తూ ఉంటారు. రైతు చేతిలో మరో ముద్ద ఉండగా వాళ్లు చూశారంటే, దాన్ని లాక్కుని దవడ పగిలేటట్లు కొడుతారు...."

రీబిన్ నాలుగు మూలలా చూసి పావెల్‌కేసి తిరిగి బల్లవానుకుని ప్రసంగాన్ని కొనసాగించాడు.

"మరల అలాటి జీవితంకోసమే నేను నానా అవస్థలూ పడ్డాను. దాన్ని భరించ లేనను కున్నాను. 'ఏమైనాసరే చివరంటా అందులోనే ఉండాలనుకున్నాను. పూర్తిగా ఫలితాలను సమకూర్చలేకపోవచ్చుగాని, వాళ్లను హైరాను పెట్టడానికి చాలు' అనుకున్నాను. అందుచేత అక్కడే ఉండిపోయాను. వాళ్లమీద ఉండే కసిచేత నా హృదయం చీటులు తీసింది. కసి శంకా శూలంలాగ నా గుండెల్లో గుచ్చుకునే ఉంది."

నెమ్మదిగా పావెల్ దగ్గరకెళ్లి అతని భుజంమీద చెయ్యి వేశాడు. నుదుటిమీద చెమట బిందువులేర్పడ్డాయి. చెయ్యి వణికింది.

"నీ సహాయం నాకు కావాలి. నాకు పుస్తకాలియ్యి. ఎలాటి పుస్తకాలో తెలుసా? ఆ పుస్తకాలు చదివినవాడెవ్వడూ మరి నిద్రపోకూడదు. పుర్రెలో నన్నుని ముళ్లు కలిగిన ఏదు పందిని పెట్టినట్లుండాలి. నీకు పుస్తకాలను రాసేవాళ్లతో గ్రామస్థులకుపయోగపడేలా కూడా రాయమని చెప్పు. మాటలు మనిషిని వేపేసేటట్లు రాయమను. వాటిని చదివినవాళ్లు

ఈ ఉద్యమంకోసం తమ ప్రాణాలర్పించేటంత తీవ్రంగా రాయాలి.'' రీబిన్ చెయ్యి పైకెత్తి ప్రతి మాటనూ విడివిడిగా స్పష్టంగా ఇలా చెప్పేడు: ''మృత్యువు మృత్యువును జయిస్తుంది! విశదీకరించి చెప్పాలంటే ప్రజలు పునర్జన్మ నెత్తడానికి చావాలన్నమాట. ప్రపంచమంతటా లక్షలాది జనం పునర్జన్మ ఎత్తి బతకాలంటే మనం కొన్ని వేలమంది చావాలి. అదీ సంగతి! ప్రజలు ఉద్ధరింపబడేటట్లయితే చావడం తేలికే! ప్రజలు లేవాలి గాని!''

తల్లి సమోవార్ పట్టుకొచ్చి రీబిన్‌కేసి ఓరగా చూసింది. ఆమెకు అతడు మాట్లాడిన మాటల బరువుచేతనూ, తీవ్రతచేతనూ తను అణిగిపోతున్నట్లనిపించింది. తన భర్తను జ్ఞప్తికి తెచ్చే లక్షణాలు కొన్ని అతనిలో కనబడ్డాయి. ఇలాగే తన భర్త కూడా చొక్కా చేతులు పైకి లాగేవాడు. ఇలాగే పళ్ళు పటపట కొరికేవాడు. అతడు కూడా అపుకోలేనంత కోపంతో మండిపోయేవాడు. అయితే అతడు మౌనంగా వుండేవాడు. ఇతడు మాత్రం తన భావాలను వెల్లడించగలుగుతున్నాడు. అందుచేతనే ఇతడు అతనంతటి భయంకరంగా లేడు.

''మనం ఈ పని చెయ్యాలి! వాస్తవమైన విషయాలను చెప్పండి. మీకోసమొక వార్తాపత్రికను అచ్చువేస్తాం....'' అన్నాడు తలపంకిస్తూ, పావెల్.

తల్లి తన కొడుక్కేసి చూసి నవ్వుతూ తలూపింది. మళ్లీ మాట్లాడకుండా బట్టలు వేసుకుని ఇంట్లోంచి వెళ్లిపోయింది.

''బాగుంది! రాయడానికి సంగతులన్నీ మేము చెప్తాం. కాని చాలా తేలికైన భాషలో రాయాలి. దూడలకు కూడా అర్థం కావాలి!'' అన్నాడు రీబిన్.

వంటింటి తలుపు తోసుకుని ఒక మనిషి లోపలికొచ్చాడు.

''యెఫీమ్'' అన్నాడు రీబిన్, వంటింటికేసి చూస్తూ. ''రావోయ్ యెఫీమ్! ఇతడు — యెఫీమ్, ఇతడు — పావెల్. అతన్ని గురించి నీకు చెప్పేను కాదూ?''

వెల్లబారిన జుట్టు, వెడల్పైన ముఖంగల పొడుగాటి యువకుడు కురుచయిన గొర్రెతోలు కోటు తొడుక్కుని పావెల్ ఎదుట నిలబడ్డాడు. టోపీ చేత్తో వుచ్చుకుని బొమలు ముడిచి పావెల్‌కేసి రెప్ప వాల్చకుండా చూశాడు. గట్టివాడనే అభిప్రాయాన్ని పావెల్‌కు కలుగజేశాడు.

''మీ పరిచయం కలిగినందుకు చాలా సంతోషం'' అన్నాడు బొంగురు గొంతుకతో. కరచాలనం చేశాక నిడుపైన తలవెంట్రుకలను రెండు చేతులతోనూ నిమురుకున్నాడు. గదంతా కలియజూశాడు. అతని దృష్టి పుస్తకాలమీద పడేసరికి సరాసరి నెమ్మదిగా వాటి దగ్గరకెళ్లేడు.

''వాటిని పట్టుకున్నాడు!'' అంటూ రీబిన్ పావెల్‌కు కన్ను కొట్టేడు. యెఫీమ్ వెనక్కి తిరిగి చూసి మళ్లీ పుస్తకాలను పరిశీలించడం ప్రారంభించాడు.

''చదవడానికి ఎన్ని పుస్తకాలో! కాని చదవడానికి మీకు తీరిక వుండదేమో? గ్రామాల్లో చదువుకోడానికి ఎక్కువ సావకాశం ఉంటుంది'' అన్నాడు.

''కాని కోరిక లేదేమో?'' అని అడిగాడు పావెల్.

''అక్కర్లేదు. కావలసినంత కోరిక కూడా ఉంది'' అన్నాడు యెఫీమ్, గడ్డం రుద్దు కుంటూ. ''జనం బుద్ధిని ఉపయోగించడం మొదలెట్టేరు'' అన్నాడు. '''భూగర్భశాస్త్రం' అంటే ఏమిటి?''

పావెల్ విశదీకరించి చెప్పేడు.

''అది మా కక్కర్లేదు'' అంటూ ఆ కుర్రాడు పుస్తకాన్ని అరలో ఉంచేశాడు.

''భూమి ఎక్కడనుంచి వచ్చిందో రైతుకక్కర్లేదు'' అని రీబిన్ బిగ్గరగా నిట్టూర్చేడు. ''అది ఎలా విభజింపబడిందో మాత్రమే అతడికి కావాలి. భూఖామందులు తనకళ్ల ముందర, దాని నెలా లాక్కున్నారో కావాలి. భూమి తిరిగితే నేమి? స్థిరంగా ఉంటే నేమి? అది తనకు అన్నం పెట్టేవరకూ, దాన్ని గోడకు కొట్టినా వేలాడ దీసినా రైతుకేమీ బాధ లేదు.''

'''బానిసత్వపు చరిత్ర' '' అని యెఫీమ్ చదివేడు. ''అది మమ్మల్ని గురించేనా?'' అని అడిగేడు.

''రైతుబానిసత్వం గురించి ఈ పుస్తకంలో ఉంది'' అని పావెల్ మరో గ్రంథాన్ని అందిచ్చాడు. యెఫీమ్ దాన్ని పుచ్చుకుని అటూ ఇటూ తిరిగేశాడు.

''ఇదంతా పాత పురాణం'' అని యెఫీమ్ దాన్ని పక్కకు పెట్టేశాడు.

''మీకేమైనా భూమి కేటాయించబడిందా?'' అని పావెల్ ప్రశ్నించాడు.

''ఓ! నాకూ మా అన్నదమ్ములిద్దరికీ కలిసి పదకొండెకరాల వ్వర ఉంది. కాని అదెందుకూ పనికిరాదు. ఇత్తడి గిన్నెలు తోముకోడానికి మాత్రమే పనికొస్తుంది. వ్యవసాయానికి పనికిరాదు....''

తర్వాత కొంచెం సేపాగి ఇలా అన్నాడు:

''నేనా భూమిని వదిలేశాను. అదెందుకు పనికొస్తుంది? అదేమీ అన్నం పెట్టదు. కాని దాని నంటిపెట్టుకుని ఉంచేస్తుంది. నేను నాలుగేళ్లుగా వ్యవసాయ కూలీగా ఉన్నాను. ఆకురాలు కాలం వెళ్లేక సైన్యంలో చేరాలి. మిహాయిల్ మామ వెళ్లద్దంటున్నాడు. ఇటీవల జనాన్ని చంపడానికి సైనికుల్ని పంపిస్తున్నారంటాడు. కాని నేను వెడతాననుకుంటాను. స్తెపాన్ రాజిన్, పుగచోవ్ కాలంలో కూడా సిపాయిలు జనాన్ని చంపేరు. అలాటి దారుణ కృత్యాన్ని ఆపుచెయ్యాలి! మీరే మంటారు? అవునంటారా?'' అని పావెల్ నడిగేడు.

''ఆహా! ఆపుచెయ్యాలి! కాని అదంత తేలికైన పని కాదు. సైనికులకు ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో బాగా తెలుసుకోవాలి'' అని నవ్వుతూ పావెల్ జవాబుచెప్పేడు.

''నేర్చుకుంటాం'' అన్నాడు యెఫీమ్.

"ఈ సంగతి ఆఫీసర్లు తెలుసుకుంటే వాళ్లు మిమ్మల్ని తుపాకితో కాల్చేస్తారు" అన్నాడు పావెల్ తమాషాగా అతనికేసి చూస్తూ.

"వాళ్లు దయతలుస్తారని ఎవరనుకుంటారు?" యెఫీమ్ చల్లగా ఒప్పుకొని పుస్తకాలను మళ్లీ పరిశీలించడం మొదలెట్టేడు.

"యెఫీమ్! టీ తాగెయ్యి. ఇక మనం త్వరగా వెళ్లాలి" అన్నాడు రీబిన్.

"సరే" అని ఇంకొక ప్రశ్న వేశాడు. "విప్లవం అంటే తిరుగుబాటేనా?"

స్నానం చేసి, ఎర్రగా ఆవిరి కక్కుతూ చిరచిరలాడుతూ అన్‌ద్రేయ్ లోపలికొచ్చాడు. యెఫీమ్‌తో ఏమీ మాట్లాడకుండా కరచాలనం చేసి రీబిన్ పక్కన కూచుని అతనికేసి నఖశిఖ పర్యంతం చూచి చిన్న బుసకొట్టేడు.

"నీవేమంత కులాసాగా లేనట్లుందే? ఏమొచ్చింది కష్టం?" అంటూ రీబిన్ అతని మోకాటి చిప్పమీద చరిచాడు.

"ప్రత్యేకంగా చెప్పదగిందేమీ లేదు" అన్నాడు హొహోల్.

"ఇతడు కూడా కార్మికుడేనా?" అని అన్‌ద్రేయ్‌కేసి చూపించి యెఫీమ్ అడిగేడు.

"అవును. ఎందుకూ?" అన్నాడు అన్‌ద్రేయ్.

"అతనెప్పుడూ ఫ్యాక్టరీ పనివాడిని చూడలేదు. వాళ్లు ఇతరుల్లాంటి మనుషులు కారనుకుంటున్నాడు" అని రీబిన్ విశదీకరించాడు.

"ఇతరులకూ మాకూ తేడా ఏమిటి?" అని పావెల్ ప్రశ్నించాడు.

"మీ ఎముకలు కోసుగా ఉంటాయి. రైతుల దుమ్ములు గుండ్రంగా ఉంటాయి" అని యెఫీమ్ అన్‌ద్రేయ్‌ని పరిశీలనగా చూసి జవాబిచ్చాడు.

"రైతు, కాళ్లను భూమిమీద విలదొక్కి నిలుచుంటాడు" అంటూ రీబిన్ ప్రారంభించాడు: "భూమి తనది కాకపోయినా రైతు దానిమీద నిలబడతాడు. దానికి సన్నిహితంగా ఉంటాడు. కాని ఫ్యాక్టరీ కార్మికుడు పక్షిలాంటివాడు. అతనికి నా అన్న స్థలముండదు. ఇల్లూ వాకిలీ ఉండదు. ఇవ్వేళ ఇక్కడుంటాడు. రేపెక్కడికో పోతాడు. ఆడది కూడా అతడి నొక చోట ఉండేటట్లు చెయ్యలేదు. కాస్తంత ఆమెతో తగాదా వస్తే, ఆమెను వది లేసి పోతాడు. ఉన్నదానికన్న మేలైన పనికోసం వెతుక్కుంటూ పోతాడు. కాని రైతు మాత్రం తాడు తెంచుకుని పోడు. ఉన్నదాన్ని బాగు చేసుకోవాలని తంటాలు పడతాడు.... ఇదిగో మీ అమ్మ వచ్చిందే."

యెఫీమ్ పావెల్ దగ్గర కొచ్చి,

"మీ పుస్తకమొకటి నాకు చదువుకునేందుకిస్తారా?" అని అడిగేడు.

"తప్పకుండా" అన్నాడు పావెల్.

ఆ కుర్రవాని కళ్లు సంతోషంతో చమక్ మన్నాయి.

"నేను దాన్ని మళ్లీ తెచ్చి ఇచ్చేస్తాను. మా పనివాళ్లు తారు డబ్బాలు ఇక్కడికి తెస్తుంటారు. వాళ్లచేత పంపిస్తాను" అని హామీ ఇచ్చాడు.

"మనం వెళ్లాలసిన వేళయింది" అంటూ రీబిన్ లేచాడు. అప్పటి కప్పుడే గొర్రెతోలు కోటు తొడుక్కుని పటకా బిగించుకుంటున్నాడు.

యెఫీమ్ పుస్తకాన్నందుకుని, చిరునవ్వు నవ్వుతూ,

"ఈ పుస్తకం నాకెంతో ఆనందాన్నిస్తుంది!" అన్నాడు.

వాళ్లు వెళ్లడంతోనే పావెల్ ఉద్రేకంతో అన్‌ద్రేయ్ నడిగేడు:

"వాళ్లను గురించి నీ అభిప్రాయమేమిటి?"

"తుపానును సూచించే రెండు మేఘాలు."

"మిహయాల్?... ఎప్పుడూ ఫ్యాక్టరీలో పనిచేయనివాడులా ఉన్నాడు. అచ్చంగా రైతే! మరి భయంకరంగానూ ఉన్నాడు!" అంది తల్లి.

"వాళ్లొచ్చినప్పుడు నువ్విక్కడ ఉండకపోవడం బొత్తిగా బాగా లేదు" బల్లదగ్గర కూర్చున్న పావెల్, తన టీ గ్లాసుకేసి ముఖం చిట్లించుతూ అన్నాడు. "నువ్వెప్పుడూ మానవ హృదయాన్ని గురించి మాట్లాడుతుంటావు కదా. ఈ వచ్చిన వాళ్లిద్దరి హృదయాలనూ నువ్వు పరిశీలించి ఉంటే బాగుండేది. రీబిన్ నన్ను ఉక్కిరిబిక్కిరి చేసేశాడు. అతడితో నేను వాదించలేకపోయాను కూడా. అతడికి మానవులమీద ఏమాత్రం కూడా నమ్మకమున్నట్లు లేదు! వాళ్ల కేమాత్రం విలువనూ ఇచ్చేవాడుగా కనబడలేదు! అమ్మ చెప్పిన మాట నిజమే! అతనిలో భయాన్ని కలిగించేదేదో ఉంది."

"ఆ సంగతి కనబడుతూనే ఉంది. పరిపాలకులు మనుష్యుల మనస్సులను కలుషితం చేశారు! ప్రజలొక్కసారి లేచారంటే, వాళ్లన్నిటినీ కూలగొట్టేస్తారు! వాళ్లకి కావలసింది ఖాళీ భూమి. వాళ్లు దాన్ని ఖాళీ చేస్తారు. అంతా మట్టం చేసేస్తారు!" అన్నాడు అన్‌ద్రేయ్, చిరచిరలాడుతూ.

అతడు మెల్లగా మాట్లాడేడు. అతని మనసులో మరొక ఆలోచనేదో ఉన్నట్లు స్పష్టంగా కనబడుతోంది. తల్లి అతని దగ్గరకెళ్లి మెల్లగా తట్టి,

"అన్‌ద్ర్యూషా, కొంచెం సంబాళించుకో!" అంది.

"ఒక్కక్షణమాగు, మామ్మా!" అన్నాడు ఆప్యాయంగా అన్‌ద్రేయ్.

అతడు హఠాత్తుగా లేచి ఆగ్రహంతో బల్లగుద్దేడు.

"అవును, రైతు ఒక్క సారి భూమిమీద కాలూని నిలబడ్డాడంటే, తన స్వంత ఉపయోగానికి భూమినంతా ఖాళీ చేస్తాడు! ప్లేగు అనంతరం అన్నీ తగలబెట్టినట్లు అతను కూడా భూమినంతా కాల్చేస్తాడు. తాను పడిన బాధలేమీ పేరుకైనా కనబడకుండా చేసేస్తాడు...."

"ఆ తర్వాత అతడు మనకే అడ్డొస్తాడు" అన్నాడు పావెల్.

"అతడు అడ్డు రాకుండా చూచుకోవలసిన పూచీ మనమీద ఉంది! అతడిని కళ్లేలు పట్టి బిగించవలసినవాళ్లం మనం. అందరికన్నా మనమే అతనికి సన్నిహితులం. అతడు మనలను నమ్మి మనవెంట వస్తాడు."

"రీబిన్ మనలను గ్రామాలకోసం ఒక పత్రికను ప్రకటించమన్నాడు" అన్నాడు పావెల్.

"సరిగ్గా అదే చేయాలి!"

"నేనతనితో చర్చించకపోవడం పొరబాటైపోయింది" అన్నాడు పావెల్ నవ్వుతూ.

"అందుకింకా చాలా సావకాశాలున్నాయి" అన్నాడు హొహోల్ నిదానంగా. వేళ్లతో తలదువ్వుకుంటూ ఇలా అన్నాడు: "నువ్వు బూరా ఊదుతూనే ఉండు. ఎవళ్ల పాదాలు భూమిలో కూరుకుపోకుండా ఉంటాయో, వాళ్లు నీ పాటకు తగినట్లుగా ఆడతారు. మనకు భూమిమీద కాలూనదని రీబిన్ చెప్పిన మాట నిజం. మనం భూమినంటి పెట్టుకో కూడదు. ఏమంటే, దాన్ని కదిలించడమే మన పని. ఒక్కసారి మనం దాన్ని కదలించడంతోనే జనమంతా చెల్లాచెదరైపోతారు. మరొకసారి కదిలించుదాం, ఇంకోసారి...."

"అన్‌ద్ర్యూషా! నీ కంతా అతి సులువుగా కనబడుతుందే" అని తల్లి నవ్వింది.

"అవును. జీవితం ఎంత సులువో, ఇదీ అంతే" అన్నాడు హొహోల్.

కొన్ని నిముషాల తర్వాత "నేను పొలాల్లోకి షికారెదుతున్నాను" అన్నాడు.

"స్నానం చేశాకా? ఈదర గాలి వీస్తోంది.... పడిశం పడుతుంది. జాగ్రత్త!" అంది తల్లి.

"నాకు కొంచెం గాలి తగలాలి" అన్నాడు అన్‌ద్రేయ్.

"పడిశం పట్టించుకోకు.... ఒక నిద్ర తీయడం మంచిదనుకుంటాను" అన్నాడు ఆప్యాయంగా పావెల్.

"కాదు. నే వెదుతున్నా."

మరి మాట్లాడకుండా కోటు వేసుకుని బయట కెళ్లిపోయాడు. తల్లి నిట్టూర్పు విడిచి,

"అతడేదో చాలా బాధపడుతున్నాడు" అంది.

"అది జరిగినప్పటినుంచీ, అతన్ని 'నువ్వు' అని పిలుస్తున్నావు. నాకందుకు చాలా సంతోషంగా ఉంది" అన్నాడు పావెల్.

తల్లి పావెల్‌కేసి ఆశ్చర్యంగా చూసింది.

"అలాగా? నేనది గమనించలేదు. అతడు నాకు ఎంతో సన్నిహితుడయాడు, ఎంతో నేను చెప్పలేనన్నమాట."

"నీ హృదయం దయాపూరితమైనదమ్మా!"

"నీకూ, నీ స్నేహితులకూ నేను సహాయభూతంగా ఉండాలికదా! అదెలాగో నాకు తెలిస్తేనా!"

"భయపడకు, నువ్వే తెలుసుకుంటావు."

"భయపడకుండా ఉండడం ఎలాగో నాకు తెలియదు" అని తల్లి చిరునవ్వు నవ్వింది.

"అమ్మా! ఇక మనం ఈ విషయాన్ని గురించి మాట్లాడుకోవద్దు. ఒకటి మాత్రం జ్ఞాపకముంచుకో – నేను నీకు మరీమరీ కృతజ్ఞుడిని!"

తన కన్నీళ్లను కొడుకు చూడకుండా తల్లి వంటింట్లో కెళ్ళింది.

హొహోల్ ఇంటి కొచ్చేసరికి చాలా ఆలస్యమైంది. వస్తూనే మంచంమీద పడుకున్నాడు.

"నేనివ్వాడు పదిమైళ్లైనా నడిచి ఉంటాను" అన్నాడు.

"అందువల్ల ఏమైనా లాభించిందా?" అని పావెల్ అడిగేడు.

"అదెందుకులే! నేను నిద్రపోతాను."

ఇక మళ్లీ అతడేమీ మాట్లాడలేదు.

కొంచెం సేపట్లో వెసొవ్‌శ్చికోవ్ లోపలి కొచ్చాడు. చినిగిన గుడ్డలతో ఉన్నాడు, ఎప్పటిలాగే అసంతృప్తిగా ఉన్నాడు.

"ఇసాయ్ నెవరు చంపేరో విన్నావా?" అని అటూ ఇటూ తిరుగుతూ పావెల్ నడిగేడు.

"లేదు" అని పావెల్ ముక్తసరిగా జవాబిచ్చాడు.

"అంత పని చేయడానికి అసహ్యించుకోనివాడొకడు దొరికేడు. ఆ పని చేయడానికి నేనే తయారవుతున్నాను. నేను కాకపోవడం నిజంగా బాగా లేదు. ఆ పనిచేయడానికి నేనే తగినవాడిని."

"నికొలాయ్, అలాంటి మాటలు మాట్లాడకు" అన్నాడు స్నేహభావంతో పావెల్.

"అసలు అలాటి ఆలోచనెందుకు!" అని తల్లి ఎంతో ఆప్యాయంగా మందలించింది. "గుండె చూస్తే మేకపిల్ల గుండె. కాని గర్జన మాత్రం సింహ గర్జన. ఎందుకలాంటి మాటలు మాట్లాడ్డం?" అంది.

ఈ రోజు రాత్రి నికొలాయ్‌ని చూస్తే తల్లి కెంతో సంతోషమైంది. అతని మశూచికపు మచ్చలముఖం కూడా ఆమెకెంతో ఆకర్షణీయంగా ఉంది.

"నేనలాంటి పనికి తప్ప, మరెందుకూ పనికిరాను" అన్నాడు నికొలాయ్ భుజాలెగరేస్తూ. "నేనెందుకైనా పనికొస్తానా అని అనుకుంటూ ఉంటాను. ఏమీ కనబడదు. ప్రజలతో మాట్లాడాలంటే, ఎలాగో నాకు తెలియదు. జరుగుతున్నదంతా చూస్తున్నాను. జనం పడుతూన్న బాధలు నేనెరుగుదును. కాని వాటిని మాటల్లో వ్యక్తపరచలేను. నేను మాటలు రాని ప్రాణిని."

పావెల్‌ను సమీపించి తల వంచి బల్లను గోకుతూ బల్లమీద రాస్తూ తన మామూలు గొంతుకతో కాకుండా, చిన్న పిల్లల్లా ప్రాధేయపడుతూన్న గొంతుకతో ఇలా అన్నాడు: "నా కొక కఠినమైన పని అప్పచెప్పండి! నేనిలా జీవించలేను! మీరంతా పనిలో మునిగి ఉన్నారు. అదెలా అభివృద్ధి అవుతోందో నేను చూస్తూనే ఉన్నాను. నేనొక్కడినేనా ఇలా చెక్కలూ దుంగలూ మోస్తూ ఉండవలసినవాడిని? ఎందుకిలా బ్రతకడం? కనుక నాకొక కఠినమైన పని వప్పచెప్పండి."

పావెల్ అతడి చేయి పట్టుకుని దగ్గరకు లాక్కున్నాడు.

"తప్పకుండా!" అన్నాడు.

తెరకవతలనైవుమండి హోహోల్ మాట వినబడింది.

"నికొలాయ్! నీకు అచ్చు కూర్చే పని నేర్పుతాను. ఏమంటావ్?"

నికొలాయ్ అతని దగ్గరకు లోపలకెళ్ళేడు.

"నువ్వు నేర్పితే ఇదిగో నా కత్తి నీకిచ్చేస్తాను" అన్నాడు.

"నీ కత్తి తగలెయ్య!" అని హోహోల్ బిగ్గరగా నవ్వుతూ అరిచాడు.

"ఇది చాలా మంచి కత్తి" అని పట్టుదలగా నికొలాయ్ రెట్టించాడు.

పావెల్ కూడా నవ్వడం మొదలెట్టేడు.

"నన్ను చూచి నవ్వుతున్నారా?" అని గది మధ్య నిలబడి నికొలాయ్ అడిగేడు.

మంచంమీదనుంచి ఒక గంతేసి,

"అందుకు సందేహమేమిటి?" అన్నాడు హోహోల్. "వినండి. పొలాల్లో షికారు వెడదాం పదండి. వెన్నెల బాగా ఉంది. వెడదామా?"

"అలాగే" అన్నాడు పావెల్.

"నేమా వస్తాను. హోహోల్ నవ్వుతుంటే వినాలని ఉంటుంది నాకు" అన్నాడు నికొలాయ్.

"నువ్వు బహుమతులను ఇస్తానని వాగ్దానం చేస్తుంటే వినాలని నాకూ ఉంది" అని మందహాసంచేస్తూ అన్నాడు హోహోల్.

బట్టలు తొడుక్కునేందుకు అతడు వంటింట్లో కెళ్ళేడు.

"కోటు వేసుకో" అని తల్లి హెచ్చరించింది.

వాళ్ళు ముగ్గురూ గుమ్మం దాటి వెళ్ళేక, తల్లి కిటికీలోనుంచి వాళ్ళను కొంచెంసేపు చూస్తూ నిలబడింది. తర్వాత వెనక్కు తిరిగి పూజావిగ్రహంకేసి చూసింది.

"ఓ భగవంతుడా! వాళ్ళ నమ్మగ్రహించు. వాళ్ళకు మేలు చెయ్యి!" అని గొణుక్కుంటూ ప్రార్థించింది.

రోజులు చరచరా గడచిపోయాయి. తల్లికి త్వరలో రానున్న మే డే ఉత్సవాన్ని గురించి ఆలోచించడానికైనా తీరిక లేకపోయింది. కాని పగలల్లా పని పాటలతో అలసిపోయి రాత్రి వేళ మంచంమీద పడుకునేసరికి ఆమె గుండెల్లో ఏదో బాధగా ఉండేది.

''అదేదో త్వరగా వచ్చేస్తే బాగుండును'' అని ఆమె అనుకునేది.

తెల్లవారడంతో ఫ్యాక్టరీ కూసేది. తొందర తొందరగా ఫలహారం చేసి అన్‌ద్రేయ్, పావెల్ బయటకెళ్లిపోయేవారు. వెడుతూ వెడుతూ పది పనులు పురమాయించి పోయేవారు. పగలల్లా పంజరంలోని ఉడతలా తిరుగుతూ ఆ పనీ ఈ పనీ చేస్తూ ఉండేది. వంట చేయడం, గోడలమీద కాగితాలంటించడానికి జిగురు కాచడం, ఊదాసిరాను తయారు చేయడం, ముక్కూ మొగం ఎరుగనివాళ్లు వచ్చి, పావెల్‌కు సందేశాలందిస్తే, వాటిని పుచ్చుకుని అతనికి అందివ్వడం మొదలైన పనులన్నీ ఆమె చక్కబెట్టేది. ఆ వచ్చినవాళ్లు ఆవేశంతో వచ్చి, దాన్ని కొంత ఆమె దగ్గర వదిలేసిపోయేవారు.

కార్మికులను మే దినోత్సవంలో పాల్గొనవలసిందని పిలుపు ఇస్తూ, ప్రతి రాత్రీ గోడల మీద ప్రకటన లతికింపబడ్డాయి. ఆఖరికి పోలీసు స్టేషన్ తలుపులమీద కూడా అతికింప బడ్డాయి. ప్రతిరోజూ ఫ్యాక్టరీలో కరపత్రాలు పంచిపెట్టబడ్డాయి. ప్రతి ఉదయమూ పోలీసులు కూలీపేటంతా తిట్టుకుంటూ తిరిగి గోడలమీద నోటీసులను చింపేస్తుండేవారు. కాని మధ్యాహ్నం భోజన సమయంలో ఎక్కడనుంచో కరపత్రాలు గాలికి కొట్టుకొచ్చి కాళ్లకడ్డం తగిలేవి. పట్టణంనుంచి గూఢచారులొచ్చి వీధి మలుపుల్లో విలబడి ఫ్యాక్టరీలోనుంచి భోజన సమయంలో వచ్చేపోయే కార్మికులను ఎగాదిగా పరిశీలిస్తుండేవారు. పోలీసుల అశక్తతను చూస్తూ అందరూ ఆనందించేవాళ్లు. ముసలి కార్మికులు కూడా ముసిముసి నవ్వులు నవ్వుకునేవారు.

''ఏం చేస్తున్నారో చూడండి!'' అనుకునేవాళ్లు.

కార్మికులు గుంపులుగుంపులుగా చేరి ఆవేశంతో కరపత్రాలను గురించీ, ప్రకటనల గురించీ చర్చించుకుంటుండేవారు. అపారమైన ఉత్సాహం వెల్లివిరిసింది. ఈ వసంతంలో జీవితం ఎక్కువ రసవంతంగా తోచింది. అందులోని కొత్తదనమే వారిని ఉత్సాహపరచింది. కొందరు మాత్రం మునుపటికన్న ఎక్కువ కోపంతో నేరస్థులను గట్టిగా తిట్టడం మొదలెట్టేరు. మరికొందరికి లీలామాత్రంగా ఆశ, భయం కలిగేయి. ఇంకా కొందరు — వాళ్లు చాలా తక్కువమందే — జనాన్ని ఈవిధంగా కలవరపరుస్తున్నది మేమే కదా అనే ఆనందాన్ని అనుభవిస్తున్నారు.

పావెల్‌కూ, అన్‌ద్రేయ్‌కీ దాదాపు నిద్ర లేనేలేదు. ముఖం తెల్లబారి, గొంతుక

బొంగురుపోయి, చాలా అలిసిపోయి ఇంటికొచ్చేవాళ్ళు. వాళ్ళు ఎక్కడో అడవుల్లో సమావేశాలు జరుపుతున్నారని తల్లికి తెలుసు. అశ్విక పోలీసు దళాలు ఫ్యాక్టరీ చుట్టూ ఉండే గ్రామాల్లో రాత్రిళ్ళు గస్తీ తిరుగుతున్నాయనీ, గూఢచారులు ప్రతిచోటా పొంచి ఉన్నారనీ, కొందరి కార్మికులను పట్టుకుని పోదామేస్తున్నారనీ, గుంపులుగా ఉంటూ తమ కంటబడిన కార్మికులను బెదరగొడుతున్నారనీ, కొందరిని అరెస్టుచేస్తున్నారనీ తల్లికి తెలుసు. తన కొడుకూ, అన్ద్రేయ్ కూడా ఎప్పుడైనా అరెస్టయే ప్రమాదమున్నదని ఆమె గుర్తించింది. అరెస్టయితేనే వాళ్ళకు మంచిదనే భావంతో అరెస్టు కావాలని కూడా కోరుకుంది.

ఏదో ఒక అజ్ఞాత కారణంగా, టైమ్ కీపర్ ఇసాయ్ హత్యను గురించి ఎవరూ పట్టించుకోకుండా మాపుచేసేశారు. రెండు రోజులపాటు స్థానిక పోలీసులు కొంత విచారణ జరిపించారు. కాని ఒక డజనుమందిని విచారించి అంతటితో విరమించుకున్నారు.

పోలీసులతోనూ తదితరులతోనూ కూడా పాయిలా పాయిలాగా ఉండే మార్యా కోర్సునొవా ఒక రోజున తల్లితో ఆ విషయమై తన అభిప్రాయంగా పోలీసువాళ్ల అభిప్రాయాన్నే వివరించి చెప్పింది:

"హంతకుడిని వాళ్ళేమి పట్టుకుంటారు! ఆ రోజు ఉదయం అధమం వందమందైనా ఇసాయ్‌ని చూసి ఉంటారు. అందులో నూటికి తొంభైమందైనా అతన్నో దెబ్బ వెయ్యడానికి సంతోషించేవాళ్ళే. ఏడు సంవత్సరాలనుంచి అతడు జనాన్ని కష్టిస్తున్నాడు."

హొహోల్‌లో స్పష్టంగా కనబడే మార్పు వచ్చింది. ముఖం చిక్కి పొడుగైంది. రెప్పలు వాచి కళ్ళు సగం మూతలు పడ్డాయి. ముక్కు పుటాల దగ్గరనుంచి నోటివరకూ ముడత కనబడుతోంది. అతడు మామూలు విషయాలను గురించి ప్రస్తావించడం మానేశాడు. తిరుచు పరవశుడై, ధర్మం, స్వేచ్ఛ, విజయం పొందే భవిష్యత్తును గురించి ప్రసంగిస్తూ శ్రోతలను కూడా ఉద్రిక్తులను చేసేవాడు.

ఇసాయ్ హత్యను గురించిన దర్యాప్తులన్నీ అణగిపోయినప్పుడు,

"మనమీదే కాదు, మనకు ప్రతికూలంగా ఉపయోగించుకునే వాళ్ళమీద కూడా వాళ్ళకేమీ కనికరం లేదు. తమ కిరాయి మనుషులు చచ్చినా 'అయ్యో, పాప'మని విచారించరు. వాళ్ళు విచారించేదల్లా డబ్బుకోసమే" ముఖం చిట్లించి నవ్వుతూ అన్నాడు అన్ద్రేయ్.

"అన్ద్రేయ్! ఆ సంగతి ఇక చాలించు" అన్నాడు పావెల్ ఖచ్చితంగా.

"కుళ్ళిపోయిన సరుకు. ముట్టుకోవడంతోనే రాలిపోయింది. అంతే" అంది తల్లి.

"ఇది అక్షరాలా నిజం. కాని ఇది మనసేమీ ఓదార్చదు" అని చిరచిరలాడుతూ హొహోల్ బదులుచెప్పేడు.

అతడు తరుచుగా ఈ మాట చెప్పేవాడు. చెప్పినప్పుడల్లా చాలా వెగటుగానూ కటువుగానూ ఉండే సిద్ధాంతంగా ఉండేది.

...చాలా కాలంనుంచి ఎదురుచూస్తున్న మే 1వ తేదీ వచ్చింది.

యధాప్రకారంగానే ఫ్యాక్టరీ సైరను జబర్‌దస్తీగా కూసింది. రాత్రంతా కంటిమీద కునుకు లేని తల్లి మంచంమీదనుంచి ఉలికిపడి లేచి, టీకి క్రితం సాయంకాలమే సిద్ధపరచి ఉంచిన సమోవారంటించింది. కుర్రవాళ్ళు పడుకునే గది తలుపు మామూలుగా తట్టాలని లేచింది. కాని కొంచెమాలోచించి వెనక్కు తగ్గింది. కిటికీ దగ్గర, పన్ను పోటుతో బాధపడేవాళ్ళ లాగున అరచెయ్యి దవడకింద పెట్టుకుని కూచుంది.

నీలి ఆకాశంమీద తెలి మబ్బులు, గులాబి రంగు మబ్బులు, ఫ్యాక్టరీ గొట్టాలలోనుంచి వచ్చే ఆవిరి బుసలకు, బెదరిపోతున్న పక్షుల పిండులాగున పారిపోతున్నాయి. కలలోలాగున తల్లి ఆ మేఘాలను చూస్తూ కూచుంది. తల భారంగా ఉంది. నిద్రలేని కారణంగా కళ్ళు వాచి పొడియారిపోయాయి. ఒక చిత్రమైన ప్రశాంతత ఆమె వావహించింది – గుండె తాపీగా కొట్టుకుంది. చిన్నచిన్న ఆలోచనలతో మనసంతా నిండింది. "సమోవార్ చాలా పెందరాళే అంటించాను. నీళ్ళు మరిగిపోతాయి. వాళ్ళిద్దరూ చాలా అలసిపోయున్నారు. ఈ రోజు ఉదయం వాళ్లను కాస్సేపు నిద్రపోనిస్తేనో?" అనుకుంది.

కిటికీలోనుంచి ఉదయభానుని కిరణాలు సంతోషంతో తొంగిచూశాయి. ఆమె చేయి చాచి ఆ కిరణాలనందుకుని ఆలోచనాపూర్వకంగా నవ్వుకుంటూ రెండవ చేతితో వాటిని బుజ్జగించింది. చివరకు లేచి నెమ్మదిగా సమోవార్‌మీదనుంచి గొట్టాన్ని తీసేసింది. తర్వాత ముఖం కడుక్కొని, భక్తితో తనపై శిలువను గీసుకుని పెదవులు మెదపుతూ ప్రార్థన మొదలెట్టింది. ఆమె ముఖం వికసించింది. కుడి కనుబొమ అదరడం మొదలెట్టింది....

ఫ్యాక్టరీ సైరను రెండవ కూత మొదటి కూతంత గంభీరంగానూ, ధాటీగానూ లేదు. దాని బొంగురు ధ్వనిలో కొంచెం వణుకు కూడా పుట్టింది. మామూలుకన్న ఎక్కువ సేపు కూసినట్లనిపించింది తల్లికి.

పక్క గదిలో హొహోల్ స్వరం స్పష్టంగా వినబడింది.

"విను, పావెల్?"

చెప్పులు లేని పాదాల చప్పుడు వినబడింది. ఎవరో దర్జాగా ఆవులించాడు.

"టీ సిద్ధంగా ఉంది" అంది తల్లి.

"లేస్తున్నాం" అన్నాడు పావెల్ హుషారుగా.

"సూర్యోదయమవుతోంది. ఆకాశం మబ్బు పట్టింది. ఈ వేళ మబ్బులేకుండా ఉండాలి" అన్నాడు హొహోల్.

నిద్రచేత ముడతలుబడ్డ ముఖంతో అతడు వంటింట్లో ప్రవేశించాడు. కాని మంచి కులాసాగా ఉన్నాడు.

"మామ్మా! శుభోదయం! బాగా నిద్రపట్టిందా?"

తల్లి అతన్ని సమీపించి మెల్లగా,

''అన్‌ద్ర్యూషా! నువ్వతని పక్కనే నడవాలి సుమా!'' అంది.

''తప్పకుండా మామ్మా. మీకు మాట ఇస్తున్నాను. ఎల్లప్పుడూ మేమిద్దరం కలసే నడుస్తుంటాం'' అని చెవిలో చెప్పేడు.

''ఏమిటోయ్! మీరిద్దరూ గుసగుసలాడుతున్నారు?'' అని పావెల్ అడిగేడు.

''ఏమీ లేదు, పావెల్!''

''చెవుల వెనకాల బాగా కడుక్కోమంటోంది! పడుచు పిల్లలు ఇవేళ నాకు కన్ను కొడతారులే!'' అని జవాబిస్తూ హొహోల్ ముఖం కడుక్కునేందుకు బయటికి వెళ్లేడు.

''కార్మికులారా లేవండోయ్! పోరాటానికి లేవండోయ్'' అని పావెల్ మెల్లగా పాడేడు.

పొద్దెక్కినకొద్దీ వాతావరణం తెరిపైంది. మేఘాలన్నిటినీ గాలి తరిమేసింది. పొద్దుటి ఫలహారానికి బల్లసర్దుతూ తల్లి తలపంకిస్తూ ఈ చిత్రమంతా ఏమిటాయని ఆలోచిస్తోంది. ఈ రోజున, మరి కొంత సేపట్లో వీళ్ల పని ఏమవుతుందో ఎవరూ చెప్పలేరు. కాని పొద్దుటి వేళ నవ్వుతూ తుళ్లుతూ వేళాకోళాలాడుకుంటున్నారేమిటని, ఆమె ఆలోచించింది. కాని ఏ కారణంచేతనో ఆమె కూడా ప్రశాంతతను, సంతోషాన్ని పొందింది.

కాలహరణంకోసం నిదానంగా ఫలహారం చేశారు. పావెల్ టీ గ్లాసులో చక్కెర వేసుకుని జాగ్రత్తగా చెంచాతో కలుపుకున్నాడు. బ్రెడ్డుమీద సమానంగా ఉప్పు చల్లుకున్నాడు. బ్రెడ్డుమీద పెచ్చు అతనికి బాగా ఇష్టం. హొహోల్ బల్లకింద పాదాలను అటూ ఇటూ మార్చుకుంటూ, టీ గ్లాసులో సూర్య కిరణాన్ని పట్టి గోడమీదా, నరంబీమీదా తమాషాగా ప్రతిఫలింపచేసి చూస్తూ కూచుని, ఇలా అన్నాడు:

''నేను పదేళ్ల వయస్సులో ఉన్నప్పుడు సూర్యుడిని గ్లాసులో పట్టుకోవాలని అనుకున్నాను. అందుకోసం ఒక గ్లాసును తీసుకుని సూర్యుడిని అందులో ప్రతిఫలింపచేశాను. వెంటనే అతడిని బంధించేయాలని ఫట్‌మని గ్లాసును చేత్తో కొట్టేను. చేయి తెగిపోయింది. పైగా దెబ్బలు కూడా తిన్నాను. దెబ్బలు తిన్నాక పెరట్లో తోటలో కెళ్లేసరికి, మట్టి బెడ్డమీద సూర్య బింబం ప్రతిఫలించడం చూశాను. నాకు కోపమొచ్చి నా శక్తికొద్దీ ఆ బెడ్డను తొక్కేశాను. నా బట్టలమీద బురద చింది, మరకలైనాయి. దాన్ని గురించి మరోకసారి దెబ్బలు తిన్నాను. అందుచేత నా కసి తీర్చుకోవడానికి సూర్యునికేసి తిరిగి నాలుక చాచి 'ఎయ్యయ్య'ని వెక్కిరించాను. 'ఓయ్ ఎర్ర తలకాయ దెయ్యమా! నాకేం దెబ్బ తగల్లేదు!' అని అరిచాను. దాంతో నా మనసు కుదుటబడింది.''

''సూర్యుడిని ఎర్ర తలకాయవాడనాలని నీకెందుకు తోచింది?'' అని పావెల్ నవ్వేడు.

''మా వీధిలో మా యింటి కెదురుగా ఎర్రటి ముఖం, ఎర్రటి గడ్డం కలిగిన కమ్మరి

ఉండేవాడు. అతడు చాలా కులాసా మనిషి. దయాంతరంగుడు. అందుచేత సూర్యుడు అతని లాగే ఉన్నాడని నాకు తోచింది.''

ఈ సంభాషణను భరించలేక:

''మీరీ వేళ ఏవిధంగా నడవాలో ఆ విషయం మాట్లాడుకోరేమి?'' అంది తల్లి.

''ఇదివరకే నిర్ణయమైన విషయాలను గురించి మాట్లాడుకుంటే కంగారవుతుంది.... మామ్మా! ఏ కారణంచేతనైనా వాళ్ళు మమ్మల్ని అందరినీ అరెస్టుచేస్తే, నికొలాయ్ ఇవానొవిచ్ వచ్చి ఏం చెయ్యాలో మీకు చెప్తాడు'' అన్నాడు నెమ్మదిగా హొహోల్.

''సరే. మంచిది!'' అని తల్లి నిట్టూర్పు విడిచింది.

''మనం షికారుగా నడిచి వెడితే?'' అన్నాడు పావెల్.

''ప్రస్తుతం ఇంటిదగ్గరుండడం మంచిది. ఇప్పటినుంచీ పోలీసులను వేధించడమెందుకూ? ఇప్పటికే వాళ్లకు నీ సంగతి బాగా తెలుసు'' అని జవాబిచ్చాడు అన్‌ద్రేయ్.

ఇంతలో ఫ్యొదొర్ మాజిన్, పరుగెత్తుకుంటూ లోపలికొచ్చాడు. అతని ముఖం విప్పారివుంది. బుగ్గలెర్రబడ్డాయి. సంతోషపూరితమైన అతని ఉత్సాహంతో తాపీగా కూచున్నవాళ్ల విసుగు ఎగిరిపోయింది.

''ప్రారంభమైంది! ప్రజల్లో కదలిక పుట్టింది. దృఢ నిశ్చయంతో వాళ్లంతా వీధుల్లోకొచ్చేస్తున్నారు. వెసొవ్‌ష్చికోవ్, వాస్య గూసెవ్, సమోయ్‌లొవ్ ఫ్యాక్టరీ గేటుదగ్గర నిలబడి ఉపన్యాసాలిస్తున్నారు. చాలామంది పనివాళ్లు ఇళ్లకు తిరిగిపోయారు. లేవండి! వెళ్లవలసిన సమయమైంది! అప్పుడే పది గంటలైంది!'' అని హెచ్చరించాడు మాజిన్.

''నేను వస్తున్నాను!'' అన్నాడు ఖచ్చితంగా పావెల్.

''ఇదిగో మీరే చూస్తారుగా. మధ్యాహ్నం భోజనమైనాక ఫ్యాక్టరీలో ఒక్క మనిషి ఉండడు!'' అంటూ ఫ్యొదొర్ పరుగెత్తి కెళ్లిపోయాడు.

''గాలిలో కొవ్వొత్తిలాగున్నాడు!'' అంది తల్లి. తర్వాత లేచి బట్టలు మార్చుకునేందుకు వంటింట్లో కెళ్లింది.

''మామ్మా! మీరెక్కడికి?'' అని అన్‌ద్రేయ్ అడిగేడు.

''మీతోటే'' అని ఆమె జవాబిచ్చింది.

అన్‌ద్రేయ్ మీసాలు మెలేస్తూ పావెల్‌కేసి తేరి చూచాడు. పావెల్ వేళ్లతో జుట్టు బరుక్కుంటూ ఆమె దగ్గర కెళ్లేడు.

''అమ్మా! నిన్ను అగమని నేనొక్కమాట చెప్పను — మరి నాతో కూడా నువ్వేమీ చెప్పద్దు — సరేనా?''

''సరేలే. సరే. భగవంతుడు మిమ్మల్ని రక్షించుగాక!'' అని ఆమె గొణుక్కుంది.

# 27

తల్లి పావెల్ అన్‌ద్రేయ్‌లవెంట బయలుదేరివెళ్లింది. ఎక్కడ చూసినా ప్రజల కలకల ధ్వనులతో చెవులు గింగురుమంటున్నాయి. ప్రజలు గుమ్మాలదగ్గరా కిటికీలదగ్గరా గుంపులుగుంపులుగా నిలబడి, తన కొడుకూ, అన్‌ద్రేయ్ కలిసి నడుస్తుంటే వాళ్లకేసి తేరి చూడడం తల్లి కనిపెట్టింది. ఆమె కళ్ల ముందర ఆకుపచ్చరంగూ, బూడిదరంగూ కలసినట్లుగా ఛాయలగుపించాయి.

ప్రజలు వాళ్లకు నమస్కారాలు పెట్టేరు. ఈ రోజున ప్రజలనుకునే మాటల్లో కొంత విశిష్టత కనబడింది. వాళ్లు మెల్లగా మాట్లాడుకునే మాటలు కొన్ని ఆమె చెవుల్లో పడ్డాయి.

"అరుగోనయ్యా! నాయకులు వెడుతున్నారు!"

"నాయకులెవరో మనకేం తెలుసు?"

"నేనేమీ వాళ్ల కపకారం జరగాలనడం లేదు."

పక్కనే ఒక పెరట్లోనుంచి ఎవరో నిరసంగా ఒక కేక వేశాడు.

"పోలీసువాళ్లు వాళ్లని పట్టుకుంటారు. దానితో వాళ్ల పని ఆఖరు."

"ఇదివరకొకసారి పట్టుకున్నారు కదా!"

ఒక కిటికీలోనుంచి ఒక ఆడమనిషి మొర వినబడింది:

"నువ్వేమి చేస్తున్నావో బాగా ఆలోచించుకో! పోషించవలసిన కుటుంబ మొకటున్నదన్న సంగతి మరచిపోకు!"

వాళ్లు కాలు విరిగిపోయిన జోసీమొవ్ ఇంటి ముందునుంచి నడుస్తున్నారు. పనిలో కాలు పోవడంచేత ఫ్యాక్టరీవాళ్లతనికి నెలవారీ పింఛనిస్తారు. అతడు కిటికీలోనుంచి తల బయట పెట్టి:

"ఏయ్ పావెల్! నీ మెడలు విరగ్గొడతారులే. వెధవా! నీ రోగం కుదురుతుందిలే!" అన్నాడు.

తల్లి ఉలిక్కిపడి అలా నిలబడిపోయింది. చర్రున కోపం పొడుచుకొచ్చింది. కుంటివాడి ముఖంకేసి తేరిపార జూచింది. వాడు తిట్టుకుంటూ కిటికీలోనుంచి ముఖం వెనక్కి లాక్కున్నాడు. తల్లి గబగబ అడుగేసి కొడుకు దగ్గరకు చేరుకుంది. వెనకబడకుండా అతని అడుగులో అడుగేసి ముందుకు సాగింది.

పావెల్ అన్‌ద్రేయ్‌లు ఈ మాటలేమీ వినిపించుకుంటున్నట్లు లేదు. తొణుకూ బెణుకూ లేకుండా చరచరా నడిచేస్తున్నారు. వారికి నడి వయస్కుడు మిరోనొవ్ కనబడ్డాడు. అతడు చాలా వినయశీలుడు. అతని నిజాయితీకీ, నిదానానికీ అందరూ అతడిని మన్నిస్తారు.

''దనీల ఇవానొవిచ్! మీరు కూడా ఈవేళ పని మానేయడానికి నిశ్చయించుకున్నారా?'' అని పావెల్ అడిగేడు.

''మా ఆవిడ ప్రసవించేసమయం. పైగా ఇలాంటి రోజున ఎలాంటి వాళ్లకైనా ఆందో ళన తప్పదు'' అంటూ క్రామేద్సుకేసి తీక్షణంగా చూశాడు. తర్వాత, ''ఇవ్వేళ డైరెక్టరును బాధ పెట్టడానికి మీరేదో ఆలోచన చేస్తున్నారంటున్నారేమిటి? – కిటికీ తలుపులు బద్దలు కొడతారా?'' అని నెమ్మదిగా అడిగేడు.

''మేము తాగుబోతులం కాము'' అన్నాడు పావెల్.

''జండాలు పుచ్చుకుని, పాటలు పాడుకుంటూ వీధుల్లో ఊరేగుతాం. అంతే. మా పాటలు వింటే, మా ఆశయమేమిటో తెలుస్తుంది'' అన్నాడు హొహోల్.

మిరోనొవ్ కొంచెం ఆలోచిస్తూ,

''మీ ఆశయం సంగతి నాకు బాగానే తెలుసు. మీ కరపత్రాలు చదువుతూనే ఉన్నాను'' అన్నాడు. ''ఇదిగో నీలొవ్నా! నువ్వు కూడా ఈ తిరుగుబాటులో చేరేవేమిటి?'' అని నవ్వుతూ అడిగేడు.

''చచ్చిపోయేలోగా ఒక్కసారైనా ధర్మమార్గంలో నడవాలి కదా!''

''ఓహో!... ఫ్యాక్టరీలోకి నిషిద్ధ కరపత్రాలను పట్టుకొచ్చింది నువ్వేనని వాళ్ళు చెప్పే మాటలు నిజంలాగే ఉన్నాయే!'' అన్నాడు మిరోనొవ్.

''ఎవరు చెప్పేరు?'' అని పావెల్ ప్రశ్నించాడు.

''హుం. వాళ్లంటున్నార్లే. సరే శలవు. జాగ్రత్తగా ఉండండి.''

తల్లి మెల్లగా ముసిముసి నవ్వులు నవ్వుకుంది. తన్ను గురించి ఆవిధంగా చెప్పుకుంటు న్నందుకామె సంతోషపడింది.

''నువ్వు కూడా జైల్లో కెడతావమ్మోయ్!'' అని నవ్వేడు పావెల్.

క్రమంగా సూర్యుడు పైకొస్తున్నాడు. వసంతకాలపు నవ్యతకు లేత ఎండ తోడైంది. ఆకాశంమీద మేఘాల చలనవేగం తగ్గింది. వాటి నీడలు మరింత ప్రకాశమానమైనాయి. మేఘాలు తాపీగా వీధుల పైనా ఇళ్ల పైనా జారుగా పోతున్నాయి. ఇళ్లమీదా వీధుల్లోనూ ఉన్న దుమ్మంతా గాలికి కొట్టుకుపోతోంది. దానితోపాటు ప్రజల ముఖాల్లోని విసుగుదల కూడా కొట్టుకుపోయింది. అంతా శోభస్కరంగా కన్పడింది. ప్రజల కోలాహల ధ్వని ఫ్యాక్టరీ మిషనుల చప్పుడును ముంచేసింది.

దొడ్లల్లోంచీ కిటికీల్లోంచీ పరిపరి విధాలుగా ప్రజలాడుకునే మాటలు తల్లి చెవిన బడ్డాయి. కొందరు చాలా దుర్మార్గంగానూ భయంకరంగానూ మాట్లాడేరు. మరికొందరు ఉత్సాహంగా ఆలోచనాపూర్వకంగా మాట్లాడేరు. వివిధమైన అనుభూతులతో కూడిన ఆనాటి

ఉత్సవంలో పాల్గొంటున్నందుకు తన కృతజ్ఞతను తెలియచెయ్యాలనీ, అపోహలను తొలగించాలనీ, తెలియని వారికి తెలియజెప్పాలనీ ఆమె చాలా ఉబలాటపడింది.

పెద్ద వీధినుండి పోయే యిరుకు సందులో దాదాపు నూరుమంది సమావేశమైనారు. వాళ్ల మధ్యలో నిలబడి మెసెవ్ శ్చికోవ్ ఉపన్యసిస్తున్నాడు:

"మన రక్తాన్ని వాళ్లు నల్లులు పీల్చేసినట్లు పీల్చేస్తున్నారు!" అతడు మోటుగా చెప్పిన ఆ మాటలు వాళ్ల తలలకు బాగా ఎక్కాయి.

"నిజానికి అంతేకదా?" అని చాలామంది ఒక్కసారిగా అరిచేరు.

"కుర్రాడు కొంత శ్రమ పడుతున్నాడు. నేనెళ్లి సాయం చేస్తే బాగుంటుందనుకుంటాను" అన్నాడు హొహోల్.

పావెల్ అతని వారడానికి ప్రయత్నించేలోగానే, అన్ద్రేయ్ చర్రున జనంలోకి తోసుకెళ్లిపోయాడు.

"కామ్రేడ్స్!" అని కంచు కంఠంతో ఒక్క హెచ్చరిక చేశాడు: "ఈ ప్రపంచంలో అనేక దేశాల ప్రజలున్నారని వాళ్లు చెపుతుంటారు. యూదులు, జర్మన్లు, ఆంగ్లేయులు, తార్తారులు వగైరా. కాని నేనా మాట నమ్మను. ప్రపంచంలో రెండు తరహాల మనుషులున్నారు. ఒకళ్లకొకళ్లు సరిపడని రెండు తెగలు — ధనికులు, పేదలు. ప్రపంచంలో జనం యొక్క వేష భాషల్లో మార్పులుండవచ్చు. కాని ధనికులైన ఫ్రెంచివారుగాని, జర్మన్లుగాని, ఇంగ్లీషువారుకాని తమ దేశాల్లోని కార్మికజనాన్ని ఏవిధంగా ఏడిపిస్తున్నారో తెలుసుకుంటే వారంతా దగాకోరులే. వాళ్ల మొహం తగలెయ్యా!"

జనంలోనుంచి ఎవరో నవ్వేడు.

"ఇక రెండవ తరహావారి సంగతి చూద్దాం. ఫ్రెంచి కార్మికులు, తార్తార్ కార్మికులు, టర్కీ కార్మికులు అందరూ మన రష్యా కార్మికుల్లాగే కుక్కల్లాగ నికృష్టంగా జీవిస్తుంటారు."

క్రమక్రమంగా ఎక్కువమంది జనం సందులోకి మళ్లడం మొదలెట్టేరు. కాలి వేళ్ల మీద నిలబడి మెడలెత్తి నిశ్శబ్దంగా చూస్తున్నారు.

అన్ద్రేయ్ గొంతుక మరింత లేచింది.

"ఇతర దేశాల్లోని కార్మికులు సూక్ష్మమైన ఈ సత్యాన్ని ఈపాటికే తెలుసుకుని ఉండవలసింది. ఈ మే దినంనాడు...."

"పోలీసులు!" అని ఒకడు కేకేశాడు.

గుర్రాలమీద స్వారీచేసుకుంటూ నలుగురు పోలీసులు సందులో ప్రవేశించారు. చేతిలోని కొరడాలను విసురుతూ:

"పొండి! పొండి!" అని కేక వేశారు.

ప్రజలు చురచురమన్నారు. అయిష్టంగానే ఎవరి మట్టుకు వారు తప్పుకున్నారు. కొందరు కంచె గోడలెక్కేరు.

"చూడండి! వందులను గుర్రాలమీద కూచోబెట్టారు. మేమెంత ధైర్యవంతులమైన సైనికులమో అని గుర్రుగుర్రుమంటున్నాయి ఆ పందులు!"

హోహోల్ వీధి మధ్య ఒంటరిగా వుండిపోయాడు. రెండు గుర్రాలు తలలు విసరుకుంటూ అతనిమీద కెళ్లేయి. అతడొక పక్కకు తప్పుకునేసరికి, తల్లి అతని చెయ్యి పట్టుకుని తనకేసి లాక్కుంది.

"పావెల్ పక్కనే నిలబడతానని నాకు వాగ్దానం చేశావుకదా! ఒంటరిగా తంటా తెచ్చుకున్నావే!" అంది తల్లి.

"క్షమించమ్మా. వెయ్యి క్షమాపణలు" అన్నాడు చిరునవ్వుతో హోహోల్.

తల్లి హృదయాన్ని కలచివేసే ఆందోళన పుట్టింది. అలసట తోచింది. తల దిమ్మెక్కింది. సంతోషం విచారం ఒకదాని వెంట ఒకటి తరుముకొచ్చాయి. భోజనవిరామం కూత కూస్తే బాగుండుననుకుంది.

అందరూ చౌకులోని చర్చి దగ్గర చేరుకున్నారు. చర్చి ఆవరణలో దాదాపు ఐదు వందలమంది యువజనులూ బాలబాలికలూ చేరి కోలాహలం చేశారు. సమూహం ముందుకూ వెనక్కూ ఊగిసలాడింది. జనం తలలెత్తి, ఆత్రంగా దేనికోసమో ఎదురుచూస్తున్నారు. వాతావరణమంతా ఆవేశభరితమైంది. కొందరు ఏమి చెయ్యాలో తెలియక చూస్తున్నట్లున్నారు. కొందరు బడాయిగా మాట్లాడుతున్నారు. ఆడవాళ్ళు మగవాళ్ళతో మెల్లగా వాదిస్తున్నారు. మగవాళ్ళు వాళ్ళమీద చిరాకుపడుతూ తప్పించుకుపోతున్నారు. అప్పుడప్పుడు తిట్లు కూడా వినబడుతున్నాయి. రకరకాల మనుషులున్న ఆ గుంపులోనుంచి మెల్లని ప్రతికూల ధ్వనులు వినబడ్డాయి.

"మీత్యా, నువ్వు బాగా ఆలోచించుకో!" అని ఒక స్త్రీ గద్గదస్వరంతో చెవుతోంది.

"నా సంగతి నాకొదిలెయ్యి" అని అతడు జవాబు చెప్పేడు.

సిజోవ్ విస్పష్టంగా మెల్లగా అందరికీ నచ్చేటట్లు చెప్పడం మొదలెట్టేడు:

"మనం మన పిల్లల్ని అర్ధాంతరంగా వదలిపెట్టకూడదు. వాళ్ళు వాస్తవానికి మనకన్న తెలివైనవాళ్ళు. మనకన్న ధైర్యస్థులు. బాడవ వ్యవహారంలో మన కోపెక్కుకోసం పోరాడినదెవరు? వాళ్ళే. మనమా సంగతి మరచిపోకూడదు. అందుకు వాళ్ళు జైల్లో పడ్డారు. ఆ లాభాన్ని మనం అనుభవించాం!"

ఫ్యాక్టరీ సైరను కూతేసింది. ఆ ధ్వనిలో జనం రణగొణ ధ్వనులు మునిగిపోయాయి. జనమంతా ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. కూచున్నవాళ్లంతా లేచి నిలబడ్డారు. ఒక్క క్షణం అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. ఎవరి మటుకు వారే ఉషారైపోయారు. కొందరి ముఖాలు వెలవెలబారేయి.

"కామ్రేడ్స్!" అని పావెల్ బిగ్గరగా ఖంగుమనే ధ్వనితో జనాన్ని హెచ్చరించాడు.

తల్లి కళ్లలో వేడి కన్నీటి బిందువులేర్పడ్డాయి. అమాంతంగా ఆమెలో గొప్ప బలం చేకూరి నట్లనిపించింది. ఒక్క గంతేసి తన కొడుకు పక్కనే నిలబడింది. జనం సూదంటురాయిని ఇనుప ముక్కలు పట్టినట్లు అతని చుట్టూ కడియం కట్టేరు.

తల్లి అతని ముఖంకేసి తీక్షణంగా చూసింది. ధైర్యమూ, గర్వమూ ఉట్టిపడే జ్యోతి అతని కళ్లలో ఆమె కగుపడింది.

"కామ్రేడ్స్! ఈ రోజున మన మెవరమో, మన ఆదర్శ మేమిటో విస్పష్టంగా తెలియచేసి మన పతాకాన్ని ఎగురవేయడానికి నిశ్చయించుకున్నాం. న్యాయానికీ, ధర్మానికీ, స్వేచ్ఛకీ చిహ్నమైనదీ పతాకం!"

పావెల్ అలా అనేసరికి జండాకఱ్ఱ జనంలోనుంచి లేచింది. పెద్దదైన ఎఱ్ఱని పక్షిలాగున కార్మికుల జండా పైకెగిరింది.

పావెల్ చెయ్యెత్తేసరికి జండా గాలిలో రెపరెపలాడింది. డజనుమంది, తెల్లటి జండా కఱ్ఱను గట్టిగా పట్టుకున్నారు. తల్లి కూడా చెయ్యేసింది.

"కార్మికులు చిరస్థాయిగా వర్ధిల్లాలి!" అని పావెల్ నినాదాన్నిచ్చాడు.

వందలాది జనం ప్రతిధ్వానం చేశారు.

"కామ్రేడ్స్! మన భావాలకన్నిటికీ జన్మస్థానమైన మన పార్టీ, సోషల్ డెమోక్రటిక్ వర్కర్సు పార్టీ చిరస్థాయి అగుగాక!"

జనం ఒక్కసారిగా పొంగిపోయారు. జండాయొక్క అంతర్యాన్ని గుర్తించినవారు దాని దగ్గర కొత్తుకొచ్చారు. మాజిన్, సమోయ్‌లొవ్, గూసెవ్ సోదరులు, పావెల్ దగ్గరకు చేరుకున్నారు. నికొలాయ్ తలవంచుకుని జనంలోనుంచి తోసుకుంటూ ముందుకొచ్చాడు. తాను ఎరగని యువజనులు, ఉద్వేగంతో తనను ప్రక్కకు నెట్టేస్తున్నారనుకుంది తల్లి.

"కార్మికవర్గం వర్ధిల్లాలి!" అని పావెల్ అరిచాడు.

ఒక వెయ్యి గొంతుల్లోంచి, ఒక్క సారిగా, ఆనందంతోనూ, శక్తితోనూ హృదయాన్ని కంపింపచేసే ఆ నినాదం ప్రతిధ్వనించింది.

తల్లి నికొలాయ్ చేతినీ మరొకరి చేతినీ గట్టిగా పట్టుకుంది. కళ్లలో నీళ్లు తిరిగి ఉక్కిరిబిక్కిరయింది. కాని ఆమె ఏడవలేదు. మోకాటి చిప్పలు వణికేయి. అదురుతున్న పెదవుల్లోంచి,

"అయ్యో నాయనలారా!..." అని గొణిగింది.

స్ఫోటకపు మచ్చల ముఖం విప్పారేటట్లుగా నికొలాయ్ నవ్వేడు. జండాకేసి రెప్ప వాల్చకుండా చూస్తూ చేయి చాచేడు. గభాలున తల్లిని కౌగలించుకుని, పకపక నవ్వుతూ ఆమెను ముద్దాడేడు.

మృదుమధురమైన కంఠాన్ని ఎత్తి, జనంయొక్క రొద అణిగిపోయేటట్లు:

"కామ్రేడ్స్!" అని కేకేశాడు హొహోల్. "మనం నేడొక నూతన దేవుని పేరిట ఒక పవిత్ర యాత్ర ప్రారంభించాం. జ్ఞానం, సత్యం, న్యాయం, మంచితనం అన్నిటికీ ఆధారభూతుడు యీ దేవుడే. మన లక్ష్య మింకా చాలా దూరాన ఉంది! ముళ్ల కిరీటం మాత్రం దగ్గరగా చేతి కందేటట్లున్నది! సత్యం జయించి తీరుతుందనే విశ్వాసంలేనివారుంటే, ఈ సత్యంకోసం ప్రాణార్పణం చేయగల ధైర్యం చాలనివారుంటే, అందుకు కష్టపడే శక్తి తమకు లేదని భయపడే వారుంటే అలాటివారు పక్కకు తప్పుకోండి! మన అంతిమ విజయంలో విశ్వాసమున్నవారే మాకు కావాలి! మన లక్ష్యాన్ని అర్థం చేసుకోలేనివారు మాతోపాటు నడవనక్కర లేదు! ఏమంటే వాళ్లు దుఃఖపడతారు. కామ్రేడ్స్! మాతో చేరేవాళ్లు చేరండి! స్వేచ్ఛాపరులైన జనంయొక్క పండగ రోజు చిరస్థాయి యగుగాక! మే దినం చిరస్థాయి యగుగాక!"

గుంపు పెరిగిపోయింది. పావెల్ జండాను పైకెత్తి పట్టుకున్నాడు. పావెల్ ముందుకు నడుస్తుంటే, జండా గాలిలో విప్పారి రెపరెపలాడింది. సూర్య కిరణాలు దానిమీద ప్రసరిస్తుంటే అది చిరునవ్వు నవ్వుతూ విహరించింది.

ఫ్యోదార్ మాజిన్ పాట మొదలెట్టేడు:

"పాత ప్రపంచాన్నే పరిత్యజిద్దాం...."

డజన్ల కొద్దీ కంఠాలు లేచి, అతని పాట నందుకున్నాయి:

"పాదాలనంటిన ధూళిని దులిపేద్దాం!..."

తల్లి మాజిన్ వెనకాలే నడిచింది. ఆమె పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడుతోంది. దృష్టి మాత్రం జండామీదా, తన కొడుకుమీదా లగ్నమై ఉంది. ఆమె చుట్టూ సంతోషపరవశులైన జనం ముఖాలే కనుబడుతున్నాయి. వివిధమైన రంగులుగల కళ్లు ప్రకాశిస్తున్నాయి. ఎదుట తన కొడుకూ, అన్ద్రేయ్ నడుస్తున్నారు. వాళ్లిద్దరి పాటా ఆమెకు వినబడుతోంది. అన్ద్రేయ్ మృదుమధుర స్వరం, పావెల్ జీర గొంతుతో మిళితమై పాట సాగుతోంది:

"కార్మికులారా లేవండోయ్! సమరానికి లేవండోయ్!
కష్టపడినా కడుపులు మండే కార్మికులారా, లేవండోయ్!"

జనం ఎర్ర జండాకేసి తోసుకుంటూ ముందుకొచ్చారు. కేకలేసుకుంటూ పరుగెత్తుకొచ్చారు. కాని వారి కేకలు పాటలో మునిగిపోయాయి. ఈ పాట, వాళ్లు రోజూ మెల్లగా ఇళ్ల దగ్గర పాడుకుంటున్నదే. కాని ఈరోజున ఏ అడ్డూ లేకుండా వీధుల్లో పాడుతుంటే

దాని అద్భుత శక్తి వెల్లడైంది. నిరుపమానమైన ధైర్యాన్ని ఆ పాట ప్రతిధ్వనింపజేసింది. ఉజ్వలమైన భవిష్యత్తుకోసం, సుదీర్ఘమైన పథాన్ని నడవాలని ఆ పాట ప్రబోధిస్తూ, ఆ మార్గంలో సంభవించే కష్టాలనెదుర్కోవాలని నిస్సంకోచంగా స్పష్టీకరించింది. నిదానంగా మండే మంటకు, మసి పోయినట్లుగా ఆ పాట జనాన్ని అంటిపెట్టుకున్న పాత భావాలను తొలగించింది. కొత్తదంటే భయాన్ని బుగ్గిచేసేసింది.

భయసంతోషాలు నిండిన ముఖం ఒకటి తల్లి పక్కకి పాడుచుకొచ్చింది. ఒక రోదన స్వరం "మిత్యా! ఎక్కడి కెడుతున్నావు?" అని కేకేసింది.

తల్లి ఆగకుండానే:

"వెళ్లనియ్యి. అతన్ని గురించి మీరు బెంగపెట్టుకోకండి. నేమా మొదట్లో ఇలాగే భయపడ్డాను. నా కొడుకు ముందే ఉన్నాడు — ఆ జండా పుచ్చుకున్నవాడే!" అంది.

"ఏయ్, రౌడీలూ! ఎక్కడి కెడుతున్నారు? అరుగో సైనికులక్కడున్నారు" అని సన్నంగా పొడుగ్గా ఉండే ఆమె హఠాత్తుగా తల్లి చేయి పట్టుకుంది.

"ఏమమ్మోయ్! వాళ్లు ఎలా పాడుతున్నారో వినండి! మా మిత్య కూడా!"

"భయపడకండి! వాళ్లది పవిత్రమైన కార్యం — తనకోసం ప్రాణార్పణ చేసే ప్రజలే లేకపోతే క్రీస్తు కూడా ఉండి ఉండడు" అని తల్లి ఓదార్చింది.

ఈ ఆలోచన గభాలున ఆమె మనస్సుకు తట్టింది. అతి సూక్ష్మమూ, విస్పష్టమూ అయిన ఈ ఆలోచనతో ఆమె పరవశురాలైంది. తన చేతినింకా పట్టుకునే ఉన్న స్త్రీకేసి తీక్ష్ణంగా చూస్తూ,

"తనకోసం ప్రాణార్పణ చేసే ప్రజలు లేకపోతే, క్రీస్తు ఉండి ఉండేవాడు కాడు" అని ఆశ్చర్యంగా చిన్ననవ్వు నవ్వి మళ్లీ ఆ మాట చెప్పింది.

సిజోవ్ ఆమె పక్కకొచ్చాడు.

"ఈ రోజున బహిరంగంగా ఊరేగుతున్నారు.... ఏమంటావు?" అంటూ టోపీ ఆడిస్తూ పాటకు తాళం వాయించాడు. "పాట పాడుతున్నారు. ఎలాంటి పాట అనుకున్నా వేమిటి?"

"సమరానికి జారుకు యోధులు కావాలి.
సమర్పించండి ఆయనకు మీ కొడుకులను...."

"వాళ్లకేమీ భయమన్నమాట లేదు. నా కొడుకే బతికుంటే...." అన్నాడు సిజోవ్.

తల్లి గుండెలో పొడిచినట్లయింది. అంచేత కొంచెం వెనుకబడింది. గబగబా జనమా మెను గోడ పక్కకు నెట్టేసి పెద్ద కెరటంలా ముందుకెళ్లిపోయారు. వాళ్లు చాలామంద యూరు. కనుక ఆమెకు చాలా సంతోషం కలిగింది.

"కార్మికులారా లేవండోయ్! సమరానికి లేవండోయ్!"

ఒక పెద్ద ఇత్తడి బూరా ఆ పాటను గాలిలోకి ఒలకపోస్తోందన్నట్లనిపించింది. ఆ పాట కొందర్ని మేల్కొలుపుతోంది. కొందర్ని పోరాటానికి సంసిద్ధులను చేస్తోంది. మరి కొందరిలో ఆవేదనాయుతమైన జిజ్ఞాసను ప్రకోపింపజేస్తోంది. ఇంకా కొందరిలో చెప్పడానికి వీల్లేనంత అతిశయంగా సంతోషాన్ని రేకెత్తిస్తోంది. కొందరిలో భయంతో కూడిన ఆశా భావాన్ని పురిగొల్పింది. మరికొందరిలో చిరకాలంనుంచి పేరుకున్న ఆగ్రహావేశాలకు తలుపులు తెరిచేసింది. ప్రతివాళ్లూ తలపైకెత్తి గాలిలో ఎగురుతున్న ఎర్ర జండాను చూస్తున్నారు.

"అదిగో వాళ్లు వెడుతున్నారు. సోదరులారా! మీకు శుభం కలుగుగాక!" అని ఎవడో పరవశుడై కేక పెట్టేడు.

మామూలు మాటల్లో చెప్పడానికి వీల్లేనంతటి గంభీరభావం ఆ వ్యక్తి నావహించి యుండడంచేత ఒక్క తిట్టు తిట్టుకున్నాడు. ద్వేషం, బానిసకు సహజంగా వుండే అంధ ద్వేషం, సూర్యకిరణాలు సోకినప్పుడు పాము బుసకొట్టినట్లు బుస్ మంది. తిట్ల రూపంలో అది వ్యక్తమైంది.

"మతవిధ్వంసకులు!" అన్నాడొక వ్యక్తి కిటికీలోనుంచి పిడికిలి ఝాడిస్తూ.

"చక్రవర్తిమీద తిరుగుబాటా? మహా ఘనత వహించిన జార్ చక్రవర్తిమీదనే! తిరుగుబాటే?" అన్నాడొక కీచుగొంతు మనిషి.

తల్లి తన ముందరనుంచి స్త్రీలూ పురుషులూ, ముందుకెళ్లిపోతుంటే, కొందరి ముఖాలు చాలా కలతచెంది ఉన్నట్లు చూసింది. జనం అలా ప్రవాహంలాగ పోతూనే ఉన్నారు. ఆ పాట, వాళ్లనలా ముందుకు లాక్కుపోతోందా అనుకుంది. ఆ పాట ఊపుతో, రోడ్డుమీద జనాన్నందర్నీ తోసేస్తున్నట్లనిపించింది. ఎర్ర జండాకేసి తలెత్తి చూసే సరికి, ఆమె మనోనేత్రానికి, ఆత్మవిశ్వాసంతో ధగధగలాడే తన కొడుకు ముఖం కనబడింది.

తల్లి ఊరేగింపుకు చివరైంది. ఏవిధమైన తొందరపాటూ లేకుండా, దీని పర్యవసాన మేమిటో తమకు ముందే తెలుసుననే నిర్లక్ష్యంతో మాట్లాడుకుంటూ నడిచే మనుషుల మధ్య ఆమె చేరింది. ఏవిధమైన ఉద్రిక్తతా లేకుండా వాళ్లు పరిపూర్ణమైన విశ్వా సంతో ఇలా మాట్లాడేరు:

"ఒక పటాలాన్ని స్కూలుదగ్గర ఉంచారు. మరో పటాలాన్ని ఫ్యాక్టరీదగ్గర ఉంచారు."

"గవర్నరు వచ్చాడు...."

"నిజంగానే?"

"నా కళ్లతో చూశాను. ఇప్పుడే వచ్చాడు!"

"ఎలాగైతేనేం వాళ్లు మనల్ని చూసి బెదిరిపోయారు.... చూడు! సైనికులు! గవ ర్నరు!" అన్నాడొకడు తృప్తిగా ఒక తిట్టు తిడుతూ.

"ఓ బోళాబోళీ వాయసలారా!" అనుకుంది తల్లి.

కాని ఈ మాటలామె చెవులకు కటువుగానూ, జీవరహితంగానూ సోకేయి. వీళ్ల నొదుల్చుకుందామా అనే భావంతో చరచరా అడుగు లేసింది. వాళ్లు చాలా నెమ్మదిగా కాళ్లీడ్చుకుంటూ నడవడంచేత వాళ్లని తప్పించుకుని ముందుకెళ్లడం కష్టమైన పని కాలేదు.

గభాలున ఊరేగింపు మొగ దేనికో గుద్దుకున్నట్లయింది. భయంకరమైన శబ్దంతో బారు బారంతా వెనక్కి దబాయించబడింది. ప్రవాహంలా సాగే పాట గజగజ వణికింది. కాని వెంటనే మరింత బిగ్గరగానూ వేగంగానూ సాగింది. కాని మళ్లీ ఆగిపోయింది. ఒక్కొక్కళ్లే పాడడం మానుకుంటున్నారు. మళ్లీ పాటను వెనుకటిలా విజృంభింప చేయడానికి కొన్ని స్వరాలు లేచాయి:

"కార్మికులారా లేవండోయ్! సమరానికి లేవండోయ్!
కష్టపడినా కడుపులు నిండని కార్మికులారా, లేవండోయ్...."

కాని ఈ పిలుపులో మునుపటి పటుత్వం లేదు. మునుపటి ఏకాగ్రత లేదు. ఐకమత్యంతో కూడిన విశ్వాసం లోపించింది. వాళ్ల గొంతుల్లో భయం ధ్వనిస్తోంది.

ఊరేగింపుకు ముందేమి జరుగుతున్నదో తల్లి కగుపడ్డం లేదు. అక్కడ ఏమైందో ఆమెకు తెలియదు. కనుక జనాన్ని పక్కకు నెట్టుకుంటూ ముందుకెళ్లడం మొదలెట్టింది. ఆమె ముందుకెడుతుంటే తిట్టుకుంటూ వెనక్కొచ్చేవాళ్లనూ, తలలొంచుకుని దౌడాయించే వాళ్లనూ ఢీక్కుంది. ఏడవలేక నవ్వేవాళ్లూ, వెటకారంగా ఈల లేసేవాళ్లూ ఆమె కెదురయ్యారు. ఆమె వాళ్ల ముఖాలను పరిశీలనగా చూసింది. వాళ్లను కళ్లతో హెచ్చరించింది.

"కామ్రేడ్స్!" అని పావెల్ గంభీరమైన కంఠస్వరం వినబడింది. "సైనికులు మాత్ర మెవరు? వాళ్లు కూడా మనలాటి మనుషులే. వాళ్లు మనమీద చెయ్యిచేసుకోరు. వాళ్లెందుకు చేసుకోవాలి? అందరూ తెలుసుకోవలసిన సత్యాన్ని మనం ప్రకటిస్తున్నందుకా? ఆ సత్యాన్ని వాళ్లు కూడా వినిపించుకోవలసిందే. వాళ్లకా సంగతింకా తెలియకపోవచ్చు. వాళ్లు కూడా తమ స్థితిని గుర్తించి మనలో కలసిపోయే కాలం త్వరలోనే వస్తుంది. అప్పుడు హంతకులు, బందిపోటులైనవాళ్ల పతాకంకింద నిలబడి మనల్ని వేధించడానికి బదులు, స్వేచ్ఛా పతాకం కింద మనలో కలిసిపోతారు. వాళ్లీ సత్యాన్ని త్వరలో తెలుసుకునేటట్టు చెయ్యాలంటే మనం ముందుకు సాగిపోవాలి. కామ్రేడ్స్! ముందడుగెయ్యాలి! ఎప్పుడూ ముందుకే!"

పావెల్ కంఠస్వరంలో తొణుకూ బెణుకూ లేదు. మాటలు నిశితంగానూ స్పష్టంగానూ వెలువడ్డాయి. కాని జనం గుంపు పల్చబడుతోంది. ఒక్కొక్కళ్లే వరుసలోంచి తప్పుకుని ఇంటి ముఖం పడుతున్నారు. కొందరు గోడలకానుకుని చూస్తున్నారు. ఊరేగింపు కొయ్య

పీల రూపం దాల్చింది. ముందు పావెల్ నిలబడ్డాడు. కార్మికుల అరుణ పతాకం అతని నెత్తి మీద రెపరెపలాడుతూ ఎగురుతోంది. నల్లటి పక్షి రెక్కలార్చుకుని ఎగిరిపోవడానికి సిద్ధంగా ఉన్నట్లుంది ఆ ఊరేగింపు, ఆ పక్షికి ముక్కు స్థానంలో పావెల్ వున్నాడు.

## 28

వీధి చివరగా చౌకుకు వెళ్లే దారికి అడ్డంగా, బూడిదరంగు దుస్తులను ధరించిన మనుషులు గోడ కట్టినట్లు నిలబడున్నారు. అందరూ ఒక్కలాగే ముఖాలు కనబడకుండా ఉన్నారు. ప్రతివాళ్ల భుజంమీదా సన్నీ ధగధగలాడింది. శబ్దం, చలనం లేని ఆ గోడమీదనుంచి వచ్చే దాక్షిణ్యశూన్యమైన వాయువులు కార్మికుల నావరించాయి. తల్లి గుండెలు చల్లబడి పోయాయి.

ఆమె జనాన్ని తోసుకుంటూ ముందుకు సాగింది. జండా చుట్టూ కడియం కట్టి ఉన్న తన స్వజనం దగ్గరగా చేరుకోవాలని ఆమె ప్రయత్నం. వాళ్ల నంటిపెట్టుకుని వాళ్లని బలపర్చే స్నేహితులు చుట్టూ ఉన్నారు. ఇలా తోసుకుపోవడంలో ఆమె ఒక పొడుగాటి మని షిని—సన్నటి గడ్డం, ఒకే కన్ను గలవాడిని—ఢీకొంది. అతడు వెనక్కి తిరిగి:

"ఏం కావాలి నీకు? ఎవరు నువ్వు?" అని అడిగేడు.

"నేను పావెల్ వ్లాసావ్ తల్లిని" అంది. ఆమెకా సమయంలో మోకాళ్ల వణికేయి. కింద పెదవి వశం తప్పింది.

"ఓ!" అన్నాడు ఏకాక్షి.

"కామ్రేడ్స్! మనం జీవితమంతా ముందుకు సాగుతూనే ఉండాలి. మనకు మరో గత్యంతరంలేదు!" అన్నాడు పావెల్.

అంతా నిశ్శబ్దమైంది, భీతావహమైంది. పతాకం పైకెత్తబడింది. ఒక్క క్షణ మాగిన తర్వాత జనం తలలమీద విహరిస్తూ నిదానంగా బూడిదరంగు గోడలాగుండే సిపా యిల వరుస ముందుకు సాగింది. తల్లి ఉలికిపడి ఊపిరి తీసుకుని కళ్ల మూసుకుంది. పావెల్, అన్‌ద్రేయ్, సమోయ్‌లొవ్, మాజిన్—యీ నల్గురూ మాత్రమే గుంపుకు ముందు సాగారు. ఫ్యోదొర్ మాజిన్ విస్పష్టమైన కంఠధ్వని ఆకాశంలోకి లేచింది:

"ఘనత్యాగం చేశారు....
ఈ అసమానమైన పోరాటంలో...."

అని మెల్లని స్వరంలో జనం గొంతులు ప్రతిధ్వనించాయి.

నల్గురు నాయకులూ పాటకు శ్రుతిగలుపుతూ ముందుకెళ్లేరు.

ఫ్యేదొర్ గొంతు తమ దృఢనిశ్చయాన్ని ప్రకటిస్తూ రంయ్‌మని లేచింది:

"సర్వస్వం త్యాగం చేశారూ...."

రెండవ శ్రేణిలోని సోదరులు:

"స్వతంత్రోద్యమానికి...."

అని అందుకున్నారు.

"ఆహా! కుక్కల కొడుకులు! విషాదగీతం పాడుతున్నారు!" అని పక్కనున్నవాడెవరో విషం కక్కుతూ అన్నాడు.

"ఒక్క పోటు పొడు!" అని ఇంకొకడు చాలా కోపంతో అన్నాడు.

తల్లి తన రెండు చేతులనూ గుండెల కదుముకుని నాలుగు మూలలా తేరిపారజూచింది. వీధంతా నిండిపోయి ఉన్న గుంపు, జెండాతో ముందుకు సాగిపోతున్న నలుగుర్నీ చూస్తూ గడగడ వణకుతూండడం చూసింది. నలుగురివెనకా కొద్దిమంది అడుగేస్తున్నారు. కాని అడుగడుక్కీ కొందరు జారిపోతున్నారు. చప్టామీద నడుస్తుంటే వాళ్ల నిప్పులు తొక్కుతూన్నట్లనిపించింది.

"దౌర్జన్యానికి అంతం వస్తుంది...."

అని ఫ్యేదొర్ భవిష్యత్తును సూచిస్తూ పాడేడు.

"ప్రజలంతా లేస్తారు...."

అని దృఢమైన గాత్రంతో కొందరు రెండవ చరణాన్నందుకున్నారు.

పాటతోపాటు, భయభ్రాంతులైనవారి గుసగుసలు బయలుదేరేయి.

"ఉత్తరువు లిస్తున్నాడు...."

"బారు చెయ్యండి!" అని కఠినమైన కేక ముందునుండి వినబడింది.

కెరటంలాగువ సన్నీలు భుజాలమీదనుంచి కిందకు దిగి, ముందుకొస్తున్న పతాకాన్ని, జిత్తులమారి ఇకిలింపుతో ఎదుర్కొన్నాయి.

"పదండి ముందుకు!"

"అరుగో వస్తున్నారు!" అన్నాడు ఏకాక్షి. చేతులు రెండూ జేబుల్లో పెట్టుకొని అతడొక పక్కకు తొలగిపోయాడు.

తల్లి రెప్పవాల్చకుండా ఆ దృశ్యాన్ని చూసింది. వీధివెడల్పునా సిపాయిలు బూడిదరంగు తరంగంలో ముందుకు చొచ్చుకొచ్చారు. సన్నీల వెండి వెలుగులతో నిర్దాక్షిణ్యమైన పట్టుద

లతో వారు ముందుకు చొచ్చుకొస్తున్నారు. గబగబా నాలుగు అడుగులేసి ఆమె తన కొడుకును సమీపించింది. అప్పుడే అన్‌ద్రేయ్ తన పొడుగైన శరీరాన్ని పావెల్‌ను కాపాడడానికి అతనికి అడ్డుగా పెట్టడం చూసింది.

"నా పక్కకి వచ్చెయ్, కామ్రేడ్!" అన్నాడు పావెల్ కఠినంగా.

అన్‌ద్రేయ్ తల వెనక్కు వాల్చి, చేతులు వెనక్కు పెట్టి పాట పాడుతున్నాడు. పావెల్ అతన్ని భుజంతో తోసేసి, మళ్లీ కఠినంగా చెప్పాడు:

"పక్కకు రా! నువ్విలా చెయ్యడానికి నీకు హక్కు లేదు! జండా ముందు వెళ్లాలి!"

"చెదిరిపోండి!" అని ఒక పొట్టి ఆఫీసరు, కత్తిని ఝళిపిస్తూ సన్నని గొంతుకతో కేకేశాడు. అతడు ముందుకు సాగుతూ, మోకాళ్లు వంచకుండా కాళ్లు ముందుకు విసురుతూ బూటు మడమలతో నేలమీద దడదడ శబ్దం చేస్తున్నాడు. తల్లికి ఆ బూట్లు నిగనిగ ఇది వరకే తెలుసు.

ఆ ఆఫీసరు పక్కనే కొంచెం వెనుకగా ఒక పొడుగాటి వ్యక్తి ఉన్నాడు. అతడి జుట్టు అంటకత్తెర వేసి వుంది. నల్లయిన నెరిసిన మీసం. అతడు ధరించిన పొడుగాటి బూడిద రంగు కోటుకు ఎర్రని అస్తరు కుట్టబడి ఉంది. వెడల్పాటి పంట్లాం పొడుగునా పసుపురంగు పట్టీలున్నాయి. హొహోల్‌లాగే అతడు చేతులు వెనక్కు పెట్టుకుని నడుస్తున్నాడు. గుబురుగా పెరిగిన కనుబొమలను పైకెత్తి, అతడు తన దృష్టినంతటినీ పావెల్‌మీద కేంద్రీకరించాడు.

తల్లి దృష్టి కంటబడినదాన్నంతటినీ ఆకళింపు చేసుకోలేకపోయింది. ఆమె హృదయమంతా వేదనతో క్రిక్కిరిసి ఉంది. ఏ క్షణంలో అది బద్దలవుతుందో చెప్పలేని స్థితిలో ఉంది. ఆ ఆవేదనతో ఆమె ఉక్కిరిబిక్కిరి అవుతూ, గుండెలను గట్టిగా అదిమి పట్టుకుంది. జనం ఆమెను ఒక తోపు తోశారు. దానితో ఆమె ఊగిసలాడిపోయింది. అయినప్పటికీ ఆలోచి తంగానే, దాదాపు స్పృహలేనట్లే ముందుకు తోసుకెళ్లింది. ముందునుంచి నిర్దయాత్మక మైన తరంగం చొచ్చుకొస్తుంటే తన వెనకాల జనం పల్చబడుతున్నట్లామె గ్రహించింది.

ఎర్ర జండాతో ముందుకు వెళ్లే జనానికీ, ఎక్కడా ఎడంలేకుండా దృఢంగా సాగి వస్తూన్న బూడిదరంగు మానవ తరంగానికీ మధ్య ఖాళీ క్రమంగా సన్నగిల్లిపోతోంది. ఏకో న్ముఖంగా చొచ్చుకొస్తున్న సిపాయిల ముఖాలన్నీ ఒకటిగానే తల్లి కగుపడ్డాయి. రకరకాల కళ్లతో ఒకటే అసహ్యమైన పసుపుపచ్చ గీతలాగున, వీధంతా అడ్డంగా ఆవరించినట్లామె కగుపడింది. ఎదురుగా నిగనిగలాడుతూన్న క్రూరమైన సన్నీల మొనలు ఊరేగింపులో నడిచేవాళ్ల గుండెలకు గురిగా ఉన్నాయి. సన్నీలు వాళ్లని ముట్టుకోకుండానే ఒకరి తరువాత ఒకరిని గుంపులోనుంచి వేరుచేసి, చెదరగొట్టేశాయి.

తన వెనకాలనుండి జనం పరుగెత్తుతూ ఆవేశంతో అరుస్తూ ఉండడం తల్లి చెవిని బడింది:

"సోదరులారా! చెదిరిపోండి!"

"వ్లాసావ్! పరుగెత్తు!"

"వెనక్కొచ్చెయ్, పావెల్!"

"జెండా వదిలెయ్, పావెల్!... దాన్ని నా చేతికియ్యి దాచేస్తాను" అన్నాడు వెసావ్‌శ్చికోవ్. అతడు జెండాకర్రను పట్టుకున్నాడు, జెండా వెనక్కి వాలిపోయింది.

"వద్దు! అలాగే ఉండనియ్యి!" అని పావెల్ హుంకరించాడు.

నికొలాయ్ చటుక్కున చేతిని వెనక్కు తీసుకున్నాడు – చేయి కాలితే తీసుకున్నట్లు. పాట ఆగిపోయింది. జనం ఆగిపోయి, పావెల్‌చుట్టూ గోడ కట్టినట్లు కడియం కట్టేరు. అయినప్పటికీ అతడు ముందుకు తోసుకెడుతూనే ఉన్నాడు. హఠాత్తుగా అనుకోనంతగా ఆకాశంమీదనుంచి పడినట్లుగా నిశ్శబ్దమేర్పడింది. కంటి కగుపడని మేఘమావరించినట్లయింది.

సుమారు ఇరవైమంది జెండాను చుట్టుముట్టేరు. జనం ఎక్కువమంది లేకపోయినా ఉన్నవాళ్లు మాత్రం ధైర్యంగా దృఢంగా నిలబడ్డారు. తల్లి తన ఆదుర్దా కొద్దీ వాళ్ల దగ్గర కెళ్లింది. వాళ్లతో ఏమిటో చెప్పాలనే కోరిక ఆమెకు కలిగింది.

"లెఫ్టినెంట్! అతని దగ్గర్నుంచి దాన్ని లాగెయ్యండి!" అని పొడుగుపాటి ముసలి వ్యక్తి జెండాను వేలెట్టి చూపిస్తూ ఆజ్ఞాపించాడు.

పొట్టి ఆఫీసరు గబగబ పావెల్ దగ్గరకు పరుగెత్తుకెళ్లి, జెండాను పట్టుకుని, "వదులు!" అని కేకేశాడు.

"చేతులు తీసెయ్యి!" అని పావెల్ బిగ్గరగా అన్నాడు.

జెండా గాలిలో గజగజ ఇటూ అటూ కంపించింది. మళ్లీ నిటారుగా నిలబడింది. పొట్టి ఆఫీసరు వెనక్కు గంతేసి కింద పడ్డాడు. నికొలాయ్ బిగించిన పిడికిలి ఝాడిస్తూ తల్లి ముందరనుంచి వేగంగా ముందుకెళ్లేడు.

"వాళ్లని అరెస్టు చెయ్యండి!" అని ముసలి వ్యక్తి గట్టిగా అరిచాడు. బూటు కాలితో నేలమీద దడదడ చరిచాడు.

కొందరు సిపాయిలు ముందుకు పరుగెత్తేరు. అందులో ఒక సిపాయి తుపాకి మడమతో ఒక్క దెబ్బ కొట్టాడు. జెండా ఊగిసలాడి ముందుకు పడింది. సిపాయిల గుంపులో అది మాయమైపోయింది.

"అయ్యో!" అని ఎవరో చాలా బాధగా కేకవేశారు.

తల్లి దెబ్బ తిన్న జంతువులా కెవ్వుమంది. దానికి జవాబుగా సిపాయిల మధ్యనున్న పావెల్:

"శలవు, అమ్మా! శలవు" అన్న మాటలు వినబడ్డాయి.

"అతడు బతికున్నాడు! నన్ను జ్ఞాపకముంచుకున్నాడు!" అనే రెండాలోచనలామెకు చటుక్కున తోట్టాయి.

"మామ్మా! శలవు!"

కాలి వేళ్లమీద నిలబడి తలెత్తి కష్టంమీద వాళ్లని చూసింది. సిపాయిలమధ్య వాళ్ల కన్న ఎత్తుగా ఉన్న అన్ద్రేయ్ ముఖమామెకు కనబడింది. అతడు చిరునవ్వు నవ్వుతూ ఆమెకు శిరస్సు వంచి నమస్కారం చేశాడు.

"అయ్యో నాయనలారా!... అన్ద్ర్యూషా! పాషా!" అని కేకలేసింది.

"కామ్రేడ్సు! శలవివ్వండి!" అని వాళ్లు సిపాయిలమధ్యనుంచే శలవు తీసుకున్నారు.

చాలామంది వాళ్ల దగ్గర శలవు తీసుకుంటూ ప్రతిధ్వానాలు చేశారు. కిటికీల్లోంచి, ఎక్కడో పైనుంచి, ఇళ్ల కప్పులమీదనుంచి ఆ ధ్వనులు వినబడ్డాయి.

## 29

ఎవడో తల్లిని రొమ్ముమీద ఒక్క పోటు పొడిచాడు. ఆగ్రహోదగ్రుడైన పొట్టి ఆఫీసరు ఎదురుగా నిలబడినట్లామె లీలగా గుర్తించింది.

"పో! ముసలమ్మా, పో!" అని అతడు హుంకరించాడు.

తల్లి అతడిని ఆపాదమస్తకం చూసింది. అతని కాళ్ల ముందర విరిగిపోయిన జెండా కర్రలున్నాయి. ఒకదాని చివర ఎర్ర గుడ్డ ఇంకా అంటిపెట్టుకునే ఉంది. ఆమె కిందకు వంగి దాన్ని తీసుకుంది. ఆఫీసరు దాన్ని ఆమె చేతుల్లోంచి లాక్కుని ఆమెను పక్కకు నెట్టేడు.

"చెప్తున్నాను, పో!" అని గట్టిగా అరుస్తూ కాళ్లతో నేలమీద చరిచాడు.

సిపాయిల వలయంలోనుంచి పాట లేచింది:

"కార్మికులారా లేవండోయ్! సమరానికి రారండోయ్!"

అంతా గిర్రున తిరిగింది. గజగజలాడింది. టెలిగ్రాఫ్ తీగెల్లోంచి వచ్చే జుంయ్యుమనే శబ్దంలాగ, గాలి చిరాకెత్తించేటట్లు ధ్వనించింది. ఆఫీసరు గభాలున వాళ్లమీద కెళ్లేడు.

"మీ పాట కట్టిపెట్టండి! సార్జెంటు మేజర్ క్రయ్‌నోవ్!" అని ఆగ్రహంతో ఉరిమేడు.

తూలుతూనే తల్లి, అతడు పారేసిన విరిగిపోయిన జెండా కర్ర దగ్గరకెళ్లి దాన్ని పైకి తీసింది.

"ఏయ్, వాళ్ల నోళ్లు నొక్కెయ్యి!"

పాట గిజగిజలాడింది. కంపించింది. తడబడింది. ఆగిపోయింది. ఎవరో తల్లి భుజంమీద చెయ్యేసి వెనక్కి తిప్పి ఒక్క తోపు తోసి,

''ఫో! ఫో!'' అన్నాడు.

''వీధి ఖాళీచెయ్యండి!'' అని ఆఫీసరు అరిచాడు.

పది అడుగుల దూరంలో కొంతమంది జనం గుమికూడి ఉండడం తల్లి చూసింది. కొందరు అరుస్తూ, కొందరు తిడుతూ, మరికొందరు ఈలవేస్తూ మెల్లగా వెనక్కు మళ్లి దొడ్లలో దూరుతున్నారు.

''ఏయ్ ఆడపిశాచం! వెనక్కి ఫో!'' అంటూ ఒక యువ సిపాయి ఆమె చెవిదాకా వచ్చి అరిచాడు. పక్కనున్న కాలిబాటవరకూ, ఆమెను గెంటేశాడు.

శక్తి తగ్గిపోవడంచేత నెమ్మదిగా జండా కర్ర ఊతంతో ముందుకు నడిచింది. రెండవ చేత్తో గోడలను, కంచెలను పట్టుకుని పడిపోకుండా నడిచింది. ''పొండి, పొండి!'' అని వెనకనుంచి ప్రక్కనుంచి సిపాయిలు అరుస్తూంటే జనం వెనక్కొళ్లిపోతున్నారు.

సిపాయిలను పోనిచ్చి, తానాగిపోయి నాలుగు వైపులా చూసింది. వీధి చివర, చాలామంది సిపాయిలు, ఖాళీగా ఉన్న చౌకులో కెవరూ వెళ్లకుండా అడ్డంగా నిలబడ్డం చూసింది. బూడిదరంగు కోటులవాళ్లు జనాన్ని ముందు కెళ్లకుండా అటకాయిస్తూనే ఉన్నారు.

తల్లికి వెనక్కొళ్లాలని బుద్ధి పుట్టింది. కాని అప్రయత్నంగా ముందు కెడుతుంటే పక్కనొక సన్నటి సందు నిర్జనంగా కనబడేసరికి, అందులోకి మళ్లింది.

అక్కడాగింది. దీర్ఘంగా నిట్టూర్చింది. ఎక్కడో ముందునుంచి జనం గొణగొణ ధ్వని ఆమె చెవుల్లో పడింది.

జండా కర్రమీద బాగా బరువాన్చి మళ్లీ ముందుకు సాగింది. ఒళ్లంతా ముచ్చెమటలు పోశాయి. కనుబొమ లదరడం ప్రారంభించాయి. పెదవులు కదిలేయి. చేతులు సంజ్ఞలు చేస్తున్నాయి. ఒకదాని కొకటి సంబంధంలేని భావాలు మనసులో అగ్నికణాల్లా మెరిశాయి. ఆ భావాల వత్తిడి ఎక్కువై వాటిని గట్టిగా అరచి చెప్పాలనే కోరిక ఆమెకు కలిగింది.

ఆ సందు ఎడమ పక్కకు మళ్లింది. దాని మొగలో జనం గుమిగూడి ఉండడం తల్లి చూసింది. వాళ్లు బిగ్గరగా ఆవేశంతో మాట్లాడుకుంటున్నారు:

''వాళ్లు తమాషాకోసం సన్నీలబారు కెదురెళ్లలేదు! ఆ సంగతి గ్రహించాలి!''

''ఇలాంటి దెప్పుడైనా చూశారయ్యా? సన్నీలల్లా మీదకొస్తుంటే పిసరంతైనా జంకు లేకుండా పర్వతాల్లా నిలబడ్డం!''

''ఆ పావెల్ వ్లాసొవ్‌ని చూడండి!''

''అతనో! ఆ హొహోల్?''

''చేతులు వెనక్కు పెట్టుకుని నవ్వుతూ అలాగే నిలబడున్నాడు. వాడి తస్సాదియ్యా, భయంలేని దయ్యమే!''

"నాయనలారా!" అంటూ తల్లి వాళ్ళమధ్యకు చొచ్చుకెళ్ళింది. సగౌరవంగా వాళ్లామెకు దారియిచ్చారు. ఎవరో నోటి నిండా నవ్వేడు.

"చూడండి! చూడండి! ఆమె జండా పట్టుకొచ్చింది. జండా!"

"నోర్ముయ్!" అని ఎవరో అతడిని గట్టిగా మందలించాడు.

తల్లి చేతులు బారసాచి మాట్లాడ్డం మొదలెట్టింది:

"నాయనలారా! వినండి. దేవుడి పేరు తలుచుకుని వినండి! మీరంతా చాలా మంచి వాళ్ళు. ఆత్మీయులైన నాయనలారా! జరిగిన సంగతులను చూడ్డానికి భయపడకండి! సాక్షాత్తూ మన పిల్లలు — మన రక్తంలో రక్తమైన పిల్లలు — అందరికీ సమానంగా న్యాయం జరగాలనే సంకల్పంతో కొత్త ప్రపంచంలో పడ్డారు. మీకందరికీ, మీకు పుట్టబోయే పిల్లలందరికీ మంచి జరిగే రోజులకోసం వెదకడానికి వారు కంకణం కట్టుకున్నారు.... సత్యమూ, న్యాయమూగల మరొక జీవితవిధానాన్ని వాళ్ళు అన్వేషిస్తున్నారు.... జనాని కందరికీ వాళ్ళు మంచిని కోరుతున్నారు!"

తల్లికి హృదయం విచ్చిపోతున్నట్లనిపించింది. గొంతుక వేడెక్కి పొడారిపోయింది. కాని లోపలినుంచి కొత్తదైన గొప్ప వాగ్ధాటి పుట్టుకొచ్చింది. ప్రేమమయమైన ఆ మాటలు నాలుక దాటి అనర్గళంగానూ ధాటీగానూ బయటకొస్తున్నాయి.

తాను చెప్పే మాటలను జనం అందరూ నిశ్శబ్దంగా వింటున్నట్లూ, విని ఆలోచి స్తున్నట్లూ కూడా గ్రహించింది. తన కొడుకునూ, అన్‌ద్రేయ్‌నీ, తాము సిపాయిల చేతిలో పడనిచ్చినవారినీ, వాళ్ల ఖర్మం అనుభవించమని వదలిపెట్టేసిన వారినందరినీ అనుసరించ వలసిందిగా జనాన్ని ప్రోత్సహించవలెనని ఆమెకు ప్రగాఢమైన కోరిక కల్గింది.

కోపంగా ధుమధుమలాడుతుండే జనాన్నొక సారి తేరి పారజూచి, మెల్లగా వాళ్లకీ విధంగా పట్టుదలగా నచ్చజెప్పింది:

"మన బిడ్డలు ప్రపంచంలో సౌఖ్యాన్ని అన్వేషిస్తున్నారు. మనందరి సౌఖ్యంకోసం, క్రీస్తు దేవుని సత్యంకోసం వాళ్లీ మార్గాన నడుస్తున్నారు. అసత్యపరులూ, దురాశా పీడి తులూ అయిన దుర్మార్గులు మన నోళ్ళు నొక్కి మనలను నలిపేయడానికి ఏ సాధనాలను వినియోగిస్తున్నారో వాటన్నిటినీ ఎదుర్కోవడానికే వాళ్లా దారి తొక్కేరు. నాయనలారా! మనందరి కోసమే — ప్రపంచంలోని ప్రజలందరి కోసమే — ప్రపంచంలోని కూలీ నాలీ జనమందరి కోసమే మన యువజనులు ఈవిధంగా లేచారు! వాళ్లను వదిలిపెట్టకండి! వాళ్లకు వెన్నివ్వకండి. మీ బిడ్డలను ఏకాకులను చెయ్యకండి! మీ సంగతాలోచించుకోండి. మీ పిల్లల హృదయాలమీద విశ్వాస ముంచండి! వాళ్ళు సత్యాన్ని బయటపెట్టేరు. అందుకే వారు బాధలననుభవిస్తున్నారు. వాళ్లల్లో విశ్వాసముంచండి!"

ఆమెకు నోట మాట రాలేదు. నీరసంచేత తూలింది. స్పృహ తప్పి పడిపోయేటంత పనైంది. ఎవరో ఆమెను పట్టుకున్నారు.

"భగవంతుని సత్యాన్నే ప్రవచిస్తోంది.... ఆహా! భగవంతుడు చెప్పిన సత్యాన్నే చెప్తోంది. సత్పురుషులారా! వినండి!" అని ఒకడు వేశంతో అన్నాడు.

"అయ్యో పాపం! చూడండి. ఆమె ఎలా బాధపడుతోందో!" అని మరొకడు సాను భూతితో అన్నాడు.

"సరి. సరి! బాధపడుతున్నది ఆమె కాదు. మూర్ఖులమైన మనల్ని మొత్తుతోంది!" అని ఇంకొకడు మందలించాడు.

"సోదరులారా!... మా మిత్య – పవిత్ర హృదయుడు. వాడేమి తప్పు చేశాడు? తను ఏ స్నేహితులను ప్రేమించాడో, వాళ్ల ననుసరించాడు. ఆమె చెప్తున్న మాట నిజం. మన పిల్లలను మనమెందుకు దారి మధ్యలో వదిలెయ్యాలి? వాళ్లేం తప్పు చేశారు?" అని ఒక స్త్రీ బిగ్గరగా వణుకుతున్న కంఠంతో అడిగింది.

ఆ మాటలు విని తల్లి గడగడ వణికింది. మెల్లగా ఏడ్చింది.

"నీలొవ్నా, ఇక ఇంటికెళ్లవమ్మా. వెళ్లు తల్లీ, వెళ్లు. ఈ వేళకిది చాలు నీకు!" అన్నాడు సిజోవ్.

అతడి ముఖం వెలవెలలాడుతోంది. గెడ్డం చెదిరిపోయింది. గభాలున అతడు నిటారుగా నిలబడి నాల్గువక్కలా తీక్షణంగా చూశాడు:

"నా కొడుకు మత్వేయ్‌ని ఫ్యాక్టరీ తన పొట్టను పెట్టుకున్న సంగతి మీరంతా ఎరుగుదురు. వాడే బతికుంటే, నేను స్వయంగా వాడిని వీళ్లవెంట పంపి ఉండేవాడిని. నేనే స్వయంగా వాడితో 'మత్వేయ్! నువ్వు కూడా వాళ్లతో వెళ్లు! అదొకటే సరియైన దారి. అదొక్కటే నిజాయితీతో కూడిన మార్గం!' అని చెప్పేవాణ్ణి."

అతడంతటితో ఆగి మౌనం దాల్చేడు. మిగిలినవాళ్లు కూడా మౌనం దాల్చేరు. ఏదో మహత్తరమైన కొత్త విషయం వాళ్ల నావహించింది. దాన్ని గురించి జనానికిప్పుడే విధమైన భీతీ కలగడం లేదు. సిజోవ్ బిగించిన పిడికిలిని పైకెత్తి ఊపుతూ ఇలా అన్నాడు:

"ముసలివాడిని మాట్లాడుతున్నాను. వినండి.... మీరంతా నన్నెరుగుదురు. నాకు ఏభై మూడేళ్లు నెత్తినబడ్డాయి. ముప్పై తొమ్మిది సంవత్సరాలనుంచి ఇక్కడ పనిచేస్తు న్నాను. ఈ రోజున నా మేనల్లుడిని మళ్లీ అరెస్టు చేశారు. వాడు చాలా మంచివాడు. తెలివైనవాడు. వాడు కూడా ఊరేగింపులో ముందే నిలబడ్డాడు. పావెల్ పక్కన, సరిగ్గా జెండా దగ్గరే, నిలబడ్డాడు...."

సిజోవ్ తన చేతిని అటూ ఇటూ ఊపేడు. అతడి ప్రాణం పోతోందా అనిపించింది. తల్లి చెయ్యి పట్టుకుని:

"ఈ అవ్వ చెప్పిందంతా నిజం. మన పిల్లలు నిజాయితీగానూ, న్యాయంగానూ బత కాలంటున్నారు. మనం వాళ్లని మధ్యలో వదిలేసి చక్కావచ్చాం! నీలొవ్నా! రా పోదాం" అన్నాడు.

ఆమె ఎర్రబారిన కళ్లతో, జనాన్ని నలుమూలలా చూసి,

"నాయనలారా! జీవితం మన బిడ్డలకోసమే. ఈ ప్రపంచమే వాళ్లకోసం...." అంది.

సిజోవ్ విరిగిపోయిన జండా కర్రనామె చేతి కందిచ్చి,

"రావమ్మా, నీలొవ్నా! ఇదిగో నీ కర్ర చేత్తో పుచ్చుకో" అన్నాడు.

జనం విచారంతోనూ, గౌరవంతోనూ చూచారు. సానుభూతితో మెల్లగా మాట్లాడు కున్నారు. సిజోవ్ ఏమీ మాట్లాడకుండా ఆమెకు దారి చేశాడు. జనం నిశ్శబ్దంగా పక్కకు తప్పుకుని ఆమెకు దారిచ్చారు. ఊహాతీతమైన ఏదో ఒక శక్తి ప్రేరేపణచేత తాపీగా ఆమె వెంట వెళ్లారు. దారిలో ఆమెను గురించి మెల్లని కంఠస్వరంతో, ప్రశంసాత్మకమైన మాటలను ఒకళ్ల కొకళ్ళు చెప్పుకున్నారు.

ఆమె ఇంటి గుమ్మం దగ్గరకు చేరుకున్నాక, వెనక్కు తిరిగి, కర్ర ఊతంతో నిలబడి, తలవంచి వందనంచేసింది.

"చాలా కృతజ్ఞురాలిని...." అని నెమ్మదిగా చెప్పింది.

ఇంతలో తన హృదయాంతరాళంలోనుంచి పుట్టుకొచ్చిన కొత్త భావం జ్ఞప్తికొచ్చి, "జీసస్ కీర్తి కోసం తమ ప్రాణాలనర్పించే మనుష్యులే లేకపోతే, జీసస్ ప్రభువే ఉండి ఉండడు" అంది.

జనం మౌనం దాల్చి ఆమెకేసి రెప్పలు వాల్చకుండా చూశారు.

మరొకసారి జనానికి తలవంచి వందనంచేసి ఆమె ఇంట్లో కెళ్లిపోయింది. సిజోవ్ తలొంచుకుని ఆమె వెంట లోపలి కెళ్లేడు.

కొంచెం సేపు జనం గుమ్మం ముందర మాట్లాడుకుంటూ నిలబడ్డారు.

తర్వాత నెమ్మదిగా ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోయారు.

## 1

ఆరోజంతా తల్లికి అదే ధ్యాస. శరీరాన్నీ, ఆత్మనూ కూడా వేధిస్తున్న అలసటకొద్దీ, కన్ను మూసేసరికి మధ్యాహ్నం జరిగిన సంఘటనలన్నీ జ్ఞాపకానికొచ్చేవి. పొట్టి ఆఫీసరు, పావెల్ కంచు వన్నె ముఖం, నవ్వుతూ కళకళలాడే అన్‌ద్రేయ్ కళ్ళూ, అన్నీ ఆమె కళ్లకు కట్టినట్లు ప్రత్యక్షమైనాయి.

ఏమీ తోచక గదిలో అటూ ఇటూ తిరిగింది. కిటికీ దగ్గర కూచుని వీధిలోకి చూసింది. మళ్లీ లేచి పచారు చేసింది. ఏమాత్రం చప్పుడైనా గభాలున లేచి అర్థంలేకుండా దేని కోసమో వెదుకుతున్నట్లు తచ్చాడింది. నీళ్ల తాగింది. కాని ఆ నీళ్ల ఆమె దాహాన్ని కాని, ఆమె గుండెలను కుతకుతలాడించే అగ్నిని కాని చల్లార్చలేకపోయాయి. ఆ రోజు రెండు భాగాలుగా చీలిపోయింది. మధ్యాహ్నంవరకూ జరిగిన సంఘటనలకొక అర్థమగుపడింది. కాని రెండవ భాగంలో ఏమీ అర్థం కనబడ్డం లేదు. ఏదో బావురుమంటూన్న శూన్యం ఆమె ఎదుట నిలిచింది.

“ఇప్పుడేం చెయ్యాలి?” అనే ప్రశ్న ఉదయించింది.

మార్యా కోర్సునోవా వచ్చింది. వస్తూనే చేతులెగరేసుకుంటూ ఆవేశంతో కేకలెట్టింది. పెద్ద ఏడ్పు ఏడ్చేసింది, ఆశ్చర్యం వెలిబుచ్చింది. పాదాలతో నేలమీద పడపడ కొట్టింది. శాపనార్థాలెట్టింది. వాగ్దానాలూ, సూచనలూ చేసింది. ఈ హంగామా ఏమీ కూడా తల్లిని కదిలించలేకపోయింది.

“ఆహా! ప్రజలంతా గుప్పున లేచారు! ఫ్యాక్టరీ అంతా లేచిపోయింది. ఫ్యాక్టరీ అంతా!” అంటూ కోర్సునోవా నోటివెంట బిగ్గరగా వస్తూన్న మాటలు తల్లికి వినబడ్డాయి.

“ఔను, ఔను” అంది తల్లి మెల్లగా, తలూపుతూ. నిజానికి ఆమె దృష్టి అంతా గడిచిన సంఘటనమీదనే లగ్నమై ఉంది. పావెల్ అన్‌ద్రేయ్‌లతో ఆఖరైన సంఘటనలే జ్ఞప్తికొస్తున్నాయి. ఏడవలేకపోయింది. హృదయం కుంచించుకుపోయి, పొడారిపోయింది. పెదవులు కూడా ఆరిపోయాయి. నోరెండిపోయింది. చేతులు వణికేయి. వెన్నువెంట చలి తెరవచ్చి గజగజలాడించింది.

ఆ రోజు సాయంకాలం పోలీసు లొచ్చారు. ఏవిధమైన ఆశ్చర్యమూ, భయమూ లేకుండా ఆమె వారిని కలుసుకుంది. వాళ్ళు అర్భాటం చేసుకుంటూ ఇంట్లోకి ప్రవేశిం

చారు. చాలా సంతోషంగానూ, సంతృప్తిగానూ ఉన్నారు. పసుపుపచ్చని ముఖంగల ఆఫీసరు, పళ్లికిలిస్తూ:

"ఏయ్ ముసలమ్మా, బాగున్నావా? మనం కలుసుకోవడమిది మూడోసారి కదూ?" అన్నాడు.

ఆమె ఏమీ మాట్లాడలేదు. పొడి ఆరిపోయిన నాలుకతో పెదవులను తుడుచుకుంది. ఆఫీసరు అతిధోరణిలో పడి ఆమెకు బోధించడానికి ప్రయత్నంచేశాడు. అతిగా మాట్లాడ్డం అతని కొక సరదా కాబోలనుకుంది. అతడన్న మాటలామె కేమీ బాధ కలిగించలేదు. నిజానికి వాటి నామె పట్టించుకోనే లేదు. కాని చివరకి, "ఏమమ్మోయ్! ఈ తప్పంతా నీదే. నీ కొడుకును చిన్నప్పటినుంచీ అదుపాజ్ఞల్లో పెట్టకపోవడం, దేవుడన్నా చక్రవర్తి అన్నా భక్తి గౌరవాలు కలిగించకపోవడం నీదే తప్పు...." అనేసరికి ఆమె తలుపు దగ్గరే నిలబడి మెల్లగా జవాబు చెప్పింది:

"మన మంచి చెడ్డల్ని నిర్ణయించే న్యాయాధిపతులు మన పిల్లలే.... వాళ్ళు ఆవిధమైన కఠోర మార్గాన్ననుసరించి పోతుంటే, వాళ్ల పాటుకు వాళ్ల నొదిలిపెట్టినందుకు వాళ్లే మన మంచి చెడ్డల్ని నిర్ణయిస్తారు."

"ఏమిటంటున్నావ్? బిగ్గరగా చెప్పు!" అరిచాడు ఆఫీసరు.

"మన పిల్లలే మన పాలిటి న్యాయాధిపతులు అంటున్నాను" అని తల్లి నిట్టూర్చి జవాబుచెప్పింది.

అతడు రుసరుసలాడుతూ ఏదో లొడలొడ మాట్లాడేడు. అవేమీ ఆమె వినిపించుకోలేదు.

ఇంటిని సోదాచేసేటప్పుడు, సాక్షిగా మార్యా కోర్సునోవాను రప్పించారు. ఆమె తల్లికి పక్కనే నిలబడింది గాని తలెత్తి ఆమెకేసి చూడలేదు. ఆఫీసరు ఆమెను ఏదైనా ప్రశ్నించి నప్పుడు మాత్రం వంగి సలాం కొట్టి ఒకటే జవాబుచెప్పేది:

"మహాప్రభూ! నాకేమీ తెలియదు. నేను అమాయకురాలిని. అవీ ఇవీ అమ్ముకుంటూ పొట్టపోసుకుంటున్నాను. నాకే పాపమూ తెలియదు...."

"నోరు ముయ్!" అని ఆఫీసరు మీసాలు దువ్వుకుంటూ ఆజ్ఞాపించాడు. మళ్లీ వంగి సలాం చేసింది. కాని అతడు చూడకుండా వున్నప్పుడు వెక్కిరించింది.

"వాడి మొహానికి అంతే!" అని తల్లి చెవిలో అంది.

వ్లాసావాను సోదా చెయ్యమని ఆఫీసరు ఆజ్ఞాపించాడు. ఆమె బిత్తరపోయి, ఆఫీసరు ముఖంకేసి చూసింది.

"మహాప్రభూ! అలాటి పని చెయ్యడం నాచేత గాదండీ!" అని భయపడుతూ చెప్పింది.

ఆఫీసరు బూటుకాలితో నేలమీద కొట్టి నానా హంగామా చేసి హుంకరించాడు. మార్యా తలొంచుకుంది.

"సరి! పెలగేయా నీలొవ్నా తప్పదు. బొత్తాము విప్పు" అని తల్లితో చెప్పింది.

చేతుల్తో తల్లి దుస్తులను తడుముతుంటే, మార్యా ముఖం ఎర్రబడిపోయింది.

"కుక్కల కొడుకులు!" అని గొణిగింది.

"ఏయ్? ఏమిటావణుగుడు?" అని సోదా జరుగుతున్న వైపు తీక్ష్ణంగా చూస్తూ ఆఫీసరు హుంకరించాడు.

మార్యా గడగడలాడుతూ,

"ఏమీ లేదు బాబూ! ఆడవాళ్ల వ్యవహారం లెండి...." అని నసిగింది.

చివరకు, ఆఫీసరు తల్లిని కాగితంమీద సంతకం చేయమని ఆజ్ఞాపించాడు. అలవాటు లేని చేత్తో "పెలగేయా వ్లాసొవా, కార్మికుని విధవరాలు" అని అక్షరాలు చెక్కింది.

"ఏమిటి రాశావు? అదంతా ఎందుకు రాశావు?" అని ఆఫీసరు ఆశ్చర్యంగా కోల ముఖం చేసి అడిగేడు. "అడవి మనుషులు!" ముసిముసి నవ్వుతూ అన్నాడు.

వాళ్లు వెళ్లిపోయారు. తల్లి రొమ్ముమీద చేతులు కట్టుకొని కిటికీ దగ్గర నిలబడి రెప్పవాల్చకుండా, కనుబొమలు పైకెత్తి సూటిగా చూసింది. పెదవులు బిర్రబిగునుకున్నాయి. దవడలు గిట్టకరుచుకుపోయి బాధవిపించింది. కిరసనాయిలు దీపంలో చమురు విండుకుంది. వత్తి కొడి కట్టడం మొదలెట్టింది. దీపం మిణుకుమిణుకు మంటోంది. దీపాన్ని నోటితో ఊది ఆర్పేసి చీకట్లో అలాగే నిలబడిపోయింది. హృదయంలోని ఆవేదనచేత స్వేచ్ఛగా ఊపి రాడలేదు. కళ్లూ కాళ్లూ నొప్పులు పుట్టేదాకా అలాగే నిలబడింది. మార్యా కిటికీ దగ్గర కొచ్చి తాగినదాని గొంతుకతో ఆమెను పిలిచింది:

"పెలగేయా! ఇంకా పడుకోలేదా? పాపం బాధపడిపోతున్నావు! పోయి పడుకో!"

బట్టలు మార్చుకోకుండానే తల్లి పడుకుంది. కొన్ని క్షణాల్లో లోతైన చెరువులో మునిగిపోయినట్లు గాఢమైన నిద్రలో మునిగిపోయింది.

ఇంతలో ఆమెకు కలొచ్చింది. పట్టణానికెళ్లే దారిలో, బాడవ కవతల నమువచ్చని ఇసుక దిబ్బ పక్కనుంచి తాను నడుస్తోంది. ఆ దిబ్బ అంచున పావెల్ నిలబడున్నాడు. అతడు తాపీగా, అన్ద్రేయ్ గొంతుకతో:

"కార్మికులారా లేవండోయ్, సమరానికి రారండోయ్!"

అని పాడుతున్నాడు.

ఆమె నుదిటిమీద చెయ్యి పెట్టుకుని తన కొడుకును చూస్తూ ఆ దిబ్బ ముందర నుంచి వెళ్లిపోయింది. నీలి ఆకాశం ముందు అతడి మూర్తి విస్పష్టంగా కనబడుతోంది.

తాను గర్భిణీ కావడంచేత అతన్ని సమీపించడానికి బిడియపడింది. తన చేతుల్లో ఆమె మరొక చంటిపిల్ల నెత్తుకుంది. అలా ముందుకు సాగుతుంటే, ఒక పొలంలో పిల్లలు బంతి ఆడుకోవడం చూసింది. అక్కడ పిల్లలు చాలమందే ఉన్నారు. బంతి ఎర్రగా ఉంది. తన చేతుల్లో ఉండే పసిపిల్లవాడు బంతికోసం చేతులు సాచి ఏడవడం మొదలెట్టేడు. అతడికి చన్నిచ్చి వెనక్కి తిరిగింది. ఈ సారి ఆ ఇసుక దిబ్బమీద సైనికులు నిలబడ్డారు. సన్నీలను తనకేసి బారెట్టేరు. త్వరత్వరగా పొలం మధ్యనున్న చర్చికి పారిపోయింది. ఆ చర్చి చాలా ఎత్తుగా, తెల్లగా, గాలిలో తేల్తూన్నట్టు ఉంది. అది మేఘాలతో చేయబడిందా అన్న ట్లుంది. అక్కడ ఎవరినో పూడ్చి పెడుతున్నారు. శవపేటిక భారీగా నల్లగా ఉంది. మూత బిగింపబడి ఉంది. మతగురువు, ఆయన సహాయకుడు తెల్లని గౌనులు ధరించి చర్చిలో అటూ ఇటూ తిరుగుతూ పాడుతూన్నారు:

"హాలిలూయా, క్రీస్తు లేచాడు...."

సహాయ మతగురువు హారతివళ్లెన్ని ఊపుతూ, ఆమెను చూసి వంగి నమస్కరించి, చిరునవ్వు నవ్వేడు. తళతళలాడే ఎర్రని వెంట్రుకలతో, అతని ముఖం సమోయ్‌లోవ్ ముఖం లాగ కళకళలాడుతోంది. డోముకి ఉన్న అద్దాలలోంచి తెల్లని గుడ్డలా సూర్య కిరణాలు పడు తున్నాయి. బృందగానం చేసే రెండు బాల్కనీలలోనుంచి పిల్లల పాట వినబడుతోంది:

"హాలిలూయా, క్రీస్తు లేచాడు...."

ఇంతలో గభాలున మతగురువు, చర్చిమధ్యకొచ్చి నిలబడి "వాళ్లనరెస్టు చెయ్యండి!" అని అరిచాడు. అతని ఫాదరీ దుస్తులన్నీ అంతర్ధానమైపోయాయి. పై పెదవిమీద బూడిద రంగు మీసం నిక్కపొడుచుకుంది. అందరూ — సహాయ మతగురువుతోసహా — పారిపోయారు. అతడు హారతి వళ్లెన్ని పక్కన పారేసి హొహోల్‌లాగున రెండు చేతుల్తో తలను గట్టిగా నొక్కిపట్టుకున్నాడు. తల్లి తన చేతిలోని పసిబిడ్డను పారిపోతున్న వాళ్ల కాళ్లకడ్డంగా పడే సింది. నగ్నంగా ఉన్న ఆ పసిబిడ్డను చూసి వాళ్లు బెదరి పక్కకు తప్పుకుపోయారు. తల్లి మోకరించి వాళ్లను ప్రార్థించింది:

"పసిబిడ్డను వదిలేసి పోకండి! మీతో తీసుకుపొండి!"

"హాలిలూయా, క్రీస్తు లేచాడు...."

అంటూ నవ్వుతూ చేతులు వెనక్కి పెట్టుకుని హొహోల్ పాట పాడేడు.

ఆమె వంగి ఆ బిడ్డ నెత్తుకుని బల్ల చెక్కలతో నిండి ఉన్న బండిలో కూర్చో పెట్టింది. ఆ బండి పక్కనే నికొలాయ్ మెల్లగా నడుస్తున్నాడు.

"కనుక వాళ్ళ నాకు గట్టి పనే వప్పచెప్పేరన్నమాట...." నవ్వుకుంటూ అన్నాడు.

వీధులన్నీ అసహ్యంగా ఉన్నాయి. ఇళ్ల కిటికీల్లోనుంచి జనం తొంగిచూస్తున్నారు. కొందరు కేకలేస్తున్నారు. కొందరు ఈలవేస్తున్నారు. మరికొందరు చేతులూపుతున్నారు. వాతావరణం బాగా ఉంది. సూర్యుడు తేజోవంతంగా ప్రకాశించాడు. ఎక్కడా నీడన్నది కనబడ్డం లేదు.

"పాడండి మామ్మా! జీవితమింతే!" అని హొహోల్ బిగ్గరగా అన్నాడు.

ఇతరమైన ధ్వనులన్నిటినీ ముంచేసే లాగున హొహోల్ పాడాడు. తల్లి అతని వెంట వెళ్ళింది. హఠాత్తుగా ఆమె జారి అగాధమైన గోతిలో పడింది. గోతిలోని శూన్యం ఆమెకు ఎదురుగా కేకలేసుకుంటూ వచ్చింది.

ఒళ్లంతా గగురుపాటుతో తల్లికి మెళకువ వచ్చింది. ఎవరో మోటు మనిషి తన బరువైన చేత్తో ఆమె గుండె పట్టుకుని మెల్లగా పిండేస్తున్నట్లనిపించింది. కూలీలను పనిలోనికి రమ్మని విరామంలేకుండా ఫ్యాక్టరీ సైరను కూతవేస్తోంది. అది రెండవ కూత అని ఆమె గుర్తుపట్టింది. గది నిండా పుస్తకాలూ, దుస్తులూ చెల్లాచెదురుగా పడివున్నాయి. అంతా తలకిందులుగా ఉంది. నేలంతా బూటుకాళ్ల మట్టి మరకలతో నిండిపోయింది.

తల్లి లేచి, ముఖం కడుక్కోకుండా ప్రార్థనచేయకుండా గదంతా శుభ్రంచెయ్యడం మొదలెట్టింది. వంటింట్లో, విరిగిపోయిన జండా కర్ర, దాన్ని చుట్టపెట్టుకున్న జండా పీలికమీద, ఆమె దృష్టి పడింది. దాన్నామె చేత్తో పుచ్చుకుని పొయ్యిగూటి కింద పారేద్దామనుకుంది. ఇంతలో కాస్త ఆలోచించి, కర్రమున్న ఎర్రగుడ్డను తీసి జాగ్రత్తగా మడిచి జేబులో పెట్టుకుంది. తర్వాత కర్రను మోకాల్తో విరిచి పొయ్యిలో పడేసింది. తరువాత నేలనూ కిటికీలనూ చన్నీళ్లతో కడిగింది. సమొవార్ ముట్టించి బట్టలేసుకుంది. వంటింటి కిటికీ దగ్గర కూచుని:

"ఇప్పుడిక చెయ్యవలసిందేమిటి?" అని ప్రశ్నించుకుంది.

ఇంతలో తను పొద్దుటిపూట ప్రార్థనచెయ్యలేదనే సంగతి ఆమెకు జ్ఞప్తికొచ్చింది. లేచి పూజావిగ్రహాందగ్గరకెళ్లి ఎదురుగా కొన్ని క్షణాలు నిలబడి మళ్లీ కూచుంది. హృదయం ఖాళీయైపోయింది.

చిత్రమైన ప్రశాంతత ఏర్పడింది. నిన్నటి రోజున వీధుల్లో పెద్ద గోలగా అరచిన వాళ్లంతా ఈ వేళ వాళ్ల ఇళ్లల్లో దూరి కూచుని నిన్న జరిగిన అసాధారణ సంఘటనలను గురించి ఆలోచించుకుంటున్నారా అనిపించింది.

చటుక్కున తన చిన్ననాటి సంఘటన ఒకటి ఆమెకు జ్ఞాపకమొచ్చింది. భూస్వామి జొసాయ్‌లొవ్ పాత ఇంటి తోటలో పెద్ద చెరువొకటి ఉండేది. ఆ చెరువునిండా కలువ పువ్వులుండేవి. శరదృతువులో ఒకనాడామె ఆ చెరువు పక్కనుంచే నడిచిపోతుంటే చెరువు


13–460

మధ్యలో పడవ కనిపించింది. చెరువులో నీరు నల్లగా నిర్మలంగా ఉంది. ఆ పడవ నీటికి అతికించినట్లుంది. నీటిపైన వాడిపోయిన ఆకులు విషాదసూచకంగా పడున్నాయి. మనిషి గాని తెడ్డుగాని లేకుండా ఉన్న ఆ పడవ నడి తటాకంలో ఎండుటాకులమధ్య కదలకుండా ఉన్న ఆ దృశ్యం అజ్ఞాతంగా ఉన్న గాఢమైన దుఃఖాన్ని సూచిస్తోంది. ఆ పడవను చెరువు మధ్యకి ఎవరు ఎందుకు తోసేరా అని ఆశ్చర్యపడుతూ ఆమె చాలా సేపు గట్టుమీద నిలబడి చూసింది. ఆ ఇంట్లో నౌకరీ చేసే ఒకడి భార్య—పొట్టిగా నల్లటి చింపిరి జుట్టు మనిషి—ఆ చెరువులో దూకి మునిగిపోయిందని ఆ సాయంకాలం తల్లి కెవరో చెప్పేరు. ఆ సంఘటన నేడు గుర్తుకొచ్చింది.

తల్లి ఒక్కసారి తన చేతితో నుదురును తుడుచుకుంది. క్రిందటి రోజున జరిగిన సంఘటనలన్నీ స్మృతిపథానికొచ్చి తలంతా అనేకమైన ఆలోచనలతో నిండిపోయింది. కొంత సేపటి దాకా ఆ ఆలోచనల ప్రభావంలో పడి చల్లారిపోయిన టీ గ్లాసును చూస్తూ కూచుండి పోయింది. మనసులో మాత్రం, ఎవరైనా తన ప్రశ్నలన్నిటికీ జవాబుచెప్పగల నిరాడంబరమైన బుద్ధిశాలితో మాట్లాడాలనే కోరిక పుట్టింది.

తన కోరిక సిద్ధించిందా అన్నట్లు, మధ్యాహ్నం నికొలాయ్ ఇవానొవిచ్ ఆమెను చూడ్డానికొచ్చాడు. కాని అతన్ని చూడ్డంతోనే ఆమెకు హఠాత్తుగా గాభరా పుట్టింది. అతడు చేసిన వందనాన్ని అందుకోకుండానే ఆమె మెల్లగా:

"ఏమిటిలా వచ్చారు? మీరు ఇలా రావడం తెలివితక్కువ పని. మీరిక్కడకు రావడం వాళ్లెవరైనా చూశారంటే, మిమ్మల్ని కూడా పట్టుకుపోతారు!" అంది.

అతడామె చేతిని గట్టిగా పట్టుకుని, సులోచనాలను నుదుటిమీదికి తోసి ఆమె దగ్గరగా వంగి:

"పావెల్, అన్‌ద్రేయ్, నాకూ మధ్య ఒక ఖరారు జరిగింది. వాళ్లను అరెస్టు చేసినట్లయితే, మర్నాడు నేను పట్నానికి మిమ్మల్ని తీసుకెళ్లాలని" అన్నాడు. అతని కంఠధ్వని చాలా మృదువుగాను, ఆమెపట్ల ఎంతో సానుభూతిసూచకంగామూ ఉంది. "ఏమైనా సోదా జరిగిందా?" అని అడిగాడు.

"అవును. సిగ్గుశరాలు లేకుండా, కొంపంతా గాలించి నానా హంగామా చేశారు!"

"వాళ్లకి సిగ్గెందుకు?" అని నికొలాయ్ భుజాలెగరేస్తూ అన్నాడు. ఇక ముందామె పట్టణంలో ఎందుకు కాపురముండాలో చెప్పడం మొదలెట్టేడు.

స్నేహభావంతోనూ ఆప్యాయంగానూ అతడు చెప్పిన మాటలన్నీ ఆమె విని, చిన్న నవ్వు నవ్వింది. అతడు చెప్పిన వాదనలన్నీ ఆమె వినిపించుకోలేదు. కాని అతని యెడల తనకు కలిగిన ఆప్యాయతకూ విశ్వాసానికీ ఆమె ఆశ్చర్యపడింది.

"పాషా కోరికల్లా ఉంటే, మీకేమీ ఇబ్బంది లేకుండా ఉంటే...."

“దాన్ని గురించి మీకేమీ ఆలోచనక్కరలేదు. నేనొక్కణ్ణే ఉంటున్నాను. అప్పుడప్పుడు మా అక్క వస్తూ ఉంటుంది” అని మాటకడ్డొచ్చాడు.

“అయితే నేను మీ ఖర్చుమీద జీవించను.”

“మీకు కావాలంటే పని చూడగలం” అన్నాడు నికొలాయ్.

ఆమెకు పని అంటే, తన కొడుకూ, అన్‌ద్రేయ్, వాళ్ల స్నేహితులూ చేసే పని అనే అర్థం. నికొలాయ్ దగ్గర కొచ్చి, అతని కళ్లకేసి తేరిపారచూసింది.

“నిజంగానే పని చూస్తారా?” అని అడిగింది.

“నాకు పెళ్లీగిళ్లీ లేదు. కనుక నా యింట్లో అంత పని లేదు....”

“ఇంట్లో పని కాదు.... నేనడుగుతున్నది” అంది మెల్లగా.

అతడీ మాత్రం అర్థం చేసుకోలేకపోయినందుకు కొంచెం బాధపడి నిట్టూర్పు విడిచింది. అతడు మాత్రం చిరునవ్వు నవ్వేసి కొంచెం ఆలోచనాపూర్వకంగా ఇలా అన్నాడు:

“పత్రికను అచ్చువేయమని కోరిన రైతుల చిరునామాను పావెల్‌ని అడిగి మీరు తెలుసుకుంటే....”

“వాళ్లని నేనెరుగుదును! వాళ్లని వెదికి పట్టుకుని మీరేమి చెయ్యమంటే అది చేస్తాను! నిషిద్ధ పత్రాలను తీసుకువెళ్తున్నానని ఎవరూ అనుకోరు. మీ కడుపు చల్లగా ఉండా! నేను ఫ్యాక్టరీలోకి కరపత్రాలు పట్టుకెళ్లలేదూ?” అని సంతోషంతో తల్లి చెప్పింది.

హఠాత్తుగా ఆమె కొక గాఢమైన కోరిక కలిగింది. భుజాన సంచి వేసుకుని, కర్ర చేత్తో పుచ్చుకుని, గ్రామాలను, అడవులను దాటి దేశమంతా తిరగాలనిపించింది.

“నన్నీ పని చెయ్యనియ్యండి! నేనెక్కడికైనా పోగలను. చూస్తారుగా! అన్ని రాష్ట్రాల్లోనూ, అన్ని రోడ్లవెంటా, దారి తెలుసుకుంటూ నేను వెళ్లగలను! ఎండాకాలంలో, శీతాకాలంలో తీర్థయాత్రికురాలిలా తిరగ్గలను. సమాధి చేరేదాకా తిరుగుతూ ఉంటాను. అంతకంటె నా కింకేం కావాలి గనుక?”

ఇల్లూ వాకిలీ లేని సంచారిగా తను గ్రామాల్లో తిరుగుతూ కుటీరాల కిటికీల దగ్గర నిలబడి భిక్షం అడుక్కుంటున్న దృశ్యం ఆమె మనోనేత్రానికి గోచరమయేసరికి, దుఃఖం కలిగింది.

నికొలాయ్ మృదువుగా ఆమె చెయ్యి పట్టుకుని, తన వెచ్చని అరచేత్తో తట్టాడు. గడియారంకేసి చూసి,

“ఆ విషయం తర్వాత మాట్లాడుదాం!” అన్నాడు.

“మన పిల్లలు—మన ప్రాణంలో ప్రాణమైనవాళ్లు—తమ స్వార్థాన్ని గురించి కొంచెమైనా ఆలోచించుకోకుండా తమ ప్రాణాలను, స్వేచ్ఛను బలిదానం చేస్తుంటే, తల్లినైన నేను ఏమీ చేయలేనా?” అని అంది.

నికొలాయ్ తెల్లబోయాడు.

"ఇంతకు ముందెవరూ ఇలా మాట్లాడ్డం నేనెన్నడూ వినలేదు" అని నెమ్మదిగా చెపుతూ ఆమెకేసి ఆప్యాయతతోనూ ఏకాగ్రతతోనూ చూశాడు.

ఆమె విషాదంతో తలూపుతూ, నిరాశగా చేతులు ఊపుతూ:

"నేనేమి చెప్పగలను? నాలో కొట్టుకుంటున్న మాతృహృదయాన్ని వర్ణించేటందుకు నాకు మాటలు దొరికితేనా...." అంది.

ఏదో గొప్ప శక్తి పైకి లేపినట్లుగా ఆమె లేచి నిలబడింది. ధర్మావేశపూరితమైన మాటలు పొంగి వచ్చాయి.

"అప్పుడు వాళ్లలో అనేకమంది ఏడుస్తారు.... వాళ్లలో అధములు, సిగ్గే మాత్రం లేనివాళ్లు కూడా ఏడుస్తారు!"

నికొలాయ్ కూడా లేచి గడియారంకేసి చూశాడు.

"అయితే అంగీకరించినట్టేనా? మీరు పట్టణానికొచ్చేసి నాదగ్గర ఉంటారన్న మాటేగా?"

ఆమె తలూపింది.

"ఎప్పుడు? సాధ్యమైనంత త్వరలో" అన్నాడు నికొలాయ్. "మీరు వచ్చేసేదాకా నేను చాలా ఆదుర్దాగా ఉంటాను" అని మెల్లగా చెప్పేడు.

ఆమె ఆశ్చర్యంతో అతడికేసి చూసింది. అతనికి తనేమవుతుంది? అతడు తల పక్కకు వాల్చి, బిడియంతో చిరునవ్వు నవ్వుతూ కొంచెం వంగి నిలబడ్డాడు. సాధారణమైన నల్లకోటు ధరించాడు. అతడి వాలకం అతని స్వభావానికి భిన్నంగా ఉంది.

"మీదగ్గరేమైనా డబ్బుందా?" అని రెప్పలు వాల్చి అతడామెనడిగేడు.

"లేదు!"

వెంటనే అతడు జేబులో చెయ్యి పెట్టి, పంచి తీసి, దాన్ని విప్పి ఆమెకు అందించి:

"ఇదుగోనమ్మా! తీసుకోండి" అన్నాడు.

అప్రయత్నంగా తల్లి నవ్వుకుంది.

"మీ వ్యవహారమంతా చిత్రంగా ఉందే!" అంటూ తలూపింది. "డబ్బంటే కూడా మీకేమీ విలువ లేనట్లుంది. కొందరు మనుషులు దాన్ని సంపాదించడంకోసం ఆత్మలను కూడా అమ్ముకుంటారు.... మీరు దానికేమీ విలువ ఇవ్వడం లేదే! ఇతరులకోసం దగ్గరుంచుకుంటున్నారులాగుంది."

నికొలాయ్ నెమ్మదిగా నవ్వుకున్నాడు.

"డబ్బుందే అది చాలా అసహ్యమైనది. పుచ్చుకోవడానికీ ఇవ్వడానికీ కూడా చాలా చికాకైనది...."

అతడామె చెయ్యి పట్టుకుని గట్టిగా నొక్కేడు.

"సాధ్యమైనంత త్వరలో రండి!" అన్నాడు.

తర్వాత అతడు మెమ్మదిగా వెళ్లిపోయాడు.

అతడిని గుమ్మందాకా సాగనంపుతూ అమ్మ ఆలోచనలో నిమగ్నురాలైంది:

"అంతటి మంచి హృదయం కలవాడే! నన్ను గురించి విచారపడడేమిటి!"

దీనివల్ల అతనిపట్ల తన కసంతృప్తి కలిగిందో, లేక ఆశ్చర్యం కలిగిందో మాత్రం ఆమె తేల్చుకోలేకపోయింది.

2

నికొలాయ్ వచ్చిన నాల్గవ రోజున తల్లి అతని ఇంటికి బయల్దేరింది. రెండు ట్రంకు పెట్టెల సామానుతో ఆమె బండి, కూలిపేటను వదలిపెట్టి పొలాలవక్కనుంచి పోతూంది. వెనక్కు తిరిగి చూసేవరికి హఠాత్తుగా ఆమెకు లోగడ తను కఠినమైన విషాద పూరిత జీవితాన్ని గడపినట్టే, రోజులు త్వరత్వరగా గడచిపోయేటట్టు చేసిన కొత్త సుఖ దుఃఖాలతో కూడిన నూతన జీవితంలో తను అడుగుపెట్టినట్టే ఈ పేటను శాశ్వతంగా వదలిపెడుతున్న సంగతి గుర్తుకొచ్చింది.

తన పొగగొట్టాలను ఆకాశంలోకి చొనుపుతూన్న ఫ్యాక్టరీ ఎర్రటి పెద్ద సాలీడు లాగ మసిబారిన నేలమీద కాళ్లు పారజాపుకుని ఉంది. దాని చుట్టూ ఒంటి అంతస్తుగల కార్మికుల ఇళ్లు బాడవ కానుకుని గుంపులుగా ఉన్నాయి. ఆ ఇళ్లు వెలవెల లాడుతూ ఒకదానిమీద ఒకటి కట్టకట్టినట్లుగా ఉన్నాయి. వాటికన్న ఎత్తుగా, ఫ్యాక్టరీలాగే ఎర్రటి రంగు చర్చి కనుబడుతోంది. దాని గోపురం మాత్రం పొగ గొట్టాలకంటె కిందగానే ఉంది.

తల్లి నిట్టూర్పు విడిచి, తన బ్లౌజు కాలరు వదులు చేసుకుంది. అది ఆమెకు ఊపిరి సలపకుండా చేస్తున్నట్లనిపించింది.

"ఛల్ ఛల్!" అని బండివాడు కళ్లెపు వారు పుచ్చుకుని గుర్రాన్ని అదిలించాడు. బండిమనిషి పొట్టిగా ఉన్నాడు. వంకర కాళ్లు. వయస్సెంతని చెప్పడానికి వీల్లేదు. నెత్తిమీదా ముఖంమీదా వెంట్రుకలు పల్చపల్చగా ఉన్నాయి. కళ్లల్లో ఏమీ కళాకాంతులు లేవు. బండి పక్కనే అతడు నడుస్తుంటే, అటూ ఇటూ, దొర్లుతున్నట్లున్నాడు. అతడికి కుడి ఎడమల తేడా కూడా అంతగా ఉన్నట్లు లేదు.

"ఛల్ ఛల్!" అని ఉమురోమని గుర్రాన్ని అదలిస్తూ, పెళ్లలు పెళ్లలుగా మట్టి అంటుకున్న బూటుకాళ్లను తమాషాగా గాలిలోకి తన్నుతుండేవాడు. తల్లి తన చుట్టు పక్కల పరికించింది. తన మనస్సులాగే పొలాలు కూడా ఖాళీగా ఉన్నాయి....

గుర్రం తల ఒకే మాదిరిగా విసురుకుంటూ లోతుగా దిగవడుతూన్న ఎండకి వెచ్చ

గిలిన ఇసుక నేలలో భారంగా అడుగులువేస్తూ నడిచింది. ఇసుక జలజల ధ్వనిచేసింది. శిధిలమైపోతున్న బండి కిరకిర శబ్దం చేసింది. ఈ ధ్వనులన్నీ దుమ్ముతో మిళితమై వెనక్కుండిపోయాయి.

నికొలాయ్ ఇవానొవిచ్ పట్టణం చివర ఒంటరిగా ఉండే వీధిలో కాపురమున్నాడు. అతని యిల్లు పాతదైన రెండంతస్తుల మేడలో భాగం. ఇంటి ముందర చిన్న తోట ఉంది. లైలాక్, అకేషియా చెట్ల కొమ్మలు, లేత పాప్లర్ చెట్ల వెండిలాంటి తెల్లని ఆకులూ అతడుండే మూడు గదుల కిటికీలలోకి తొంగిచూస్తూ ఉంటాయి. ఇంటి లోపల అంతా పరిశుభ్రంగానూ, ప్రశాంతంగానూ ఉంది. అల్లల్లాడే కొమ్మల అల్లిబిల్లి నీడలు నేలమీద అల్లల్లాడుతున్నాయి. గోడలకు పుస్తకాల అలమారాలు అమర్చబడున్నాయి. గోడలమీద ఎవరివో గంభీర వదనాలున్న వ్యక్తుల చిత్రపటాలు వేలాడుతున్నాయి.

"ఇక్కడ మీకు సౌకర్యంగా ఉంటుందా?" అంటూ నికొలాయ్ తల్లి కొక చిన్న గది చూపించాడు. ఆ గదిలో ఒక కిటికీలోనుంచి తోట కనబడుతుంది. మరొక కిటికీలోనుంచి వచ్చిక పెరిగిన పెరడు కనబడుతుంది. ఈ గదిలో కూడా గోడలకు పుస్తకాల అలమారాలు అమర్చబడివున్నాయి.

"నేను వంటింట్లో ఉంటేనే బాగుంటుందేమో. వంటిల్లు చక్కగా పరిశుభ్రంగానే ఉంది...." అని బదులు చెప్పింది తల్లి.

ఆ మాటలు నికొలాయ్‌ని గాభరాపరిచాయి. వంటింట్లో ఉండవద్దని చెప్పి ఆ గదిలో ఉండడానికామెను వొప్పించేసరికి అతని ముఖం వికసించింది.

ఆ మూడు గదుల్లోనూ ప్రత్యేకమైన వాతావరణం వున్నట్టనిపించింది. శుభ్రమైన గాలి హాయిగా ఉంది. కాని ఆ గోడలమీద చిత్రపటాల్లో ఉన్న వ్యక్తులు అంత ఏకాగ్రచిత్తంతో ఆ గదుల్లోకి చూస్తూవుంటే, వాళ్ల ధ్యానానికేమి భంగం కలుగుతుందోననే భయంచేత ఎవరికీ గట్టిగా మాట్లాడాలనే బుద్ధి పుట్టదు.

కిటికీలో ఉండే పూలకుండీల్లో తల్లి చెయ్యి పెట్టి మట్టిని తడివి చూసి:

"మొక్కలకు నీళ్లు పొయ్యాలి" అంది.

"ఔనౌను! నా కవంటే ఎంతో ఇష్టం. కాని వాటికి సంరక్షణ చెయ్యడానికి తీరిక లేకుండా ఉంది...." అన్నాడు నికొలాయ్ ఇవానొవిచ్.

నికొలాయ్ ఇమ్ముగా ఉండే తన ఇంట్లో కూడా, నిదానంగా, తన ఇల్లు కానట్టుగా నడుస్తూండడం గమనించింది ఆమె. గదిలో ఉండే వస్తువులను ముఖం బాగా దగ్గర పెట్టి, సులోచనాలను సవరిస్తూ సున్నితమైన కుడి చేతి వేళ్లతో పైకెత్తి పట్టుకుని తన దృష్టి నాకర్షించిన వస్తువును పరిశీలనగా చూస్తూండేవాడు. అతడు ఒక్కొక్కప్పుడు ఏదైనా ఒక వస్తువును తీసి తన ముఖానికి దగ్గరగా పట్టుకుని, దాన్ని తన కళ్లతో స్పృశించుతూన్నట్టు

దానికేసి చూసేవాడు. అతడు కూడా తల్లిలాగే ఆ రోజావే కొత్తగా ఆ ఇంట్లో ప్రవేశిం చినట్లు వస్తువులను పరీక్షగా చూస్తుండేవాడు. తనలాగే అతనికి కూడా అన్నీ కొత్తగా ఉన్నట్లే ప్రవర్తించాడు. అందుచేత ఆమె మనసుకు కొంత కుదురేర్పడింది. అతనితో కూడా తిరుగుతూ అతని దైనందిన కార్యక్రమం గురించి అడుగుతూ ఏ వస్తువెక్కడుందో, ఎక్కడుండాలో గమనించింది. పనులు సరిగా చెయ్యడం చేతకాదని ఒప్పుకొనే అమాయకత్వాన్నే వెలిబుచ్చుతూ ఆమె ప్రశ్నలకి అతను జవాబుచెప్పేడు.

పువ్వుల చెట్లకామె నీళ్ల పోసి, పియానోమీద చిందరవందరగా పడేసి ఉన్న సంగీతపు పుస్తకాలను సర్దింది. సమొవార్‌కేసి చూసిః

''దాన్ని నిగనిగలాడేటట్లు తోమించాలి'' అంది.

అతడు మబ్బుగా ఉన్న ఆ పాత్రను చేతులతో తడిమి వేళ్లను కళ్లదగ్గరగా పెట్టుకుని పరీక్షగా చూశాడు. తల్లి మృదువుగా నవ్వింది.

ఆ రాత్రి మంచంమీద పడుకుని ప్రొద్దుటనుండి జరిగిన సంగతులను జ్ఞప్తికి తెచ్చుకుంది. తలెత్తి నాలుగు మూలలా ఆశ్చర్యంతో చూసింది. పరాయి కొంపలో ఉండడం ఆమె జీవితంలో ఇదే మొదటి సారి. అయినప్పటికీ ఆమెకేమీ కొత్తని కాని కష్టమని గాని అనిపించలేదు. నికొలాయ్‌పట్ల ఆమె కొక ఆప్యాయత కలిగింది. అతనికి సంతోషం కలిగేటట్లు అన్నీ అమర్చాలనీ, అతని జీవితానికి సుఖాన్నీ సంతృప్తినీ చేకూర్చాలనీ ఒక గాఢమైన వాంఛ ఆమెకు కలిగింది. అతనిలో ఉండే నేర్పులేమి, చిత్రమైన అశక్తత ఆమె హృదయాన్ని ఆకర్షించాయి. మామూలు మనుషులకన్న అతని విశిష్ట ప్రవర్తన, చంటి బిడ్డల్లో గోచరమయ్యే అమాయకత్వాన్నీ తెలివినీ ద్యోతకం చేసే అతని కళ్లూ ఆమె నాక ర్షించాయి. అప్పుడామె ఆలోచనలు తన కొడుకుమీదకు పోయాయి. మరోసారి మే దినోత్సవం నాటి సంఘటనలు జ్ఞప్తికొచ్చాయి. ఆ సంఘటనల కొక కొత్త అర్థమూ, ఒక కొత్త ధ్వనీ ఆమెకు స్ఫురించాయి. ఆ ఉత్సవానికిలాగే ఆనాటి బాధకు కూడా ఒక విశిష్టతను ఆమె గుర్తించింది. ఆనాటి దుఃఖం, పిడికిలితో గుద్దినప్పటిలాగ తలను భూమిమీదికి వంచేటట్టుగా లేదు. పదేపదే గుండెలను పొడిస్తే రేగిన మెల్లని కోపంవల్ల వంగిన నడుమును నిటారుగా సాచేటట్టుగా చేసే పోటువుల్లా వుంది.

తెరచి ఉన్న కిటికీలోనుంచి రాత్రివేళ పట్టణంలోని అపరిచితమైన ధ్వనులన్నీ ఆమె చెవుల్లో పడుతున్నాయి. తోటలోని చెట్లమీద ఆకులు రెపరెప ధ్వనులు చేస్తున్నాయి. వాటిని ఆలకిస్తూ,

''లోకంలో ముందుకు పోతున్నారు పిల్లలు'' అనుకుంది.

మరునటి రోజు పొద్దున్నే ఆమె సమొవార్‌ను నిగనిగలాడేటట్లు తోమి, టీకి నీళ్ళు మరగబెట్టింది. టీకోసం బల్లను సర్ది, నికొలాయ్ లేచేవరకు వంటింట్లో కనిపెట్టుకు

కూచుంది. నికొలాయ్ దగ్గుతూ లేచి తలుపు తెరిచాడు. ఒక చేత్తో చొక్కా మెడను, రెండో చేత్తో మలోచనాల జోడు పట్టుకుని వంటింట్లో కొచ్చాడు. తల్లికి వందనం చేశాడు. ఆమె అందుకుంది. ఆమె సమొవార్‌ను ఇవతల గదిలోకి తెచ్చింది. అతడు ముఖం కడుక్కుంటూ నేలమీద నీళ్లు చిందించాడు. సబ్బును, పళ్లు తోముకునే కుంచెనూ కింద పారేసుకున్నాడు. తన వికారపు అలవాట్లకు తనే గొణుక్కున్నాడు.

టీ తాగుతూ, నికొలాయ్ తల్లికి తన కథ చెప్పేడు:

"నేను జేమ్‌స్త్వో బోర్డు*లో ఒక విచారకరమైన పని చేస్తుంటాను. మన రైతులు ఏవిధంగా నాశనమవుతున్నారో చూస్తుంటాను. పుష్టికరమైన ఆహారం తగినంతగా దొరక్క మన రైతులు అకాలమరణం పొందుతున్నారు. వాళ్లకు బలహీనమైన పిల్లలు పుట్టుకొచ్చి శరత్కాలం రాగానే ఈగలు చచ్చినట్లు చచ్చిపోతున్నారు. మా కిదంతా తెలుసు, ఇందుకు కారణాలు కూడా తెలుసు. ఈ కారణాలు పరిశీలించడానికే మాకు జీతాలను కూడా ఇస్తున్నారు. దాని సంగతంతే...."

"మీరు విద్యార్థులా?" అని తల్లి అతడినడిగింది.

"కాదు. నేను ఉపాధ్యాయుడిని. మా నాయన వ్యాత్కా ఫ్యాక్టరీ మేనేజరు. నేను మాత్రం ఉపాధ్యాయుడిగా చేరేను. గ్రామంలో రైతులకు పుస్తకాలను ఇచ్చినందుకు పట్టుబడి జైలు శిక్షననుభవించాను. ఆతర్వాత ఒక పుస్తకాల దుకాణంలో విక్రయదారుగా పనిచేశాను. అక్కడ నా అజాగ్రత్తవల్ల మళ్లీ జైల్లో పడ్డాను. తర్వాత నన్ను అర్ఖాంగెల్‌స్క్‌కు ప్రవాసం పంపేరు. అక్కడ కూడా గవర్నరుతో పేచీపడి అతని ఆగ్రహానికి గురయ్యాను. అంచేత తెల్ల సముద్ర తీరాన ఉన్న ఒక కుగ్రామానికి నన్ను పంపేశారు. అక్కడ అయిదేళ్లున్నాను."

ఆ గదిలో అతని కంఠస్వరం అలా తాపీగా ప్రతిధ్వనించింది. తల్లి ఇలాంటి కథల నెన్నిటినో ఇదివరకు వింది. కాని చెప్పేవాళ్లు తొణుకూ బెణుకూ లేకుండా, ఆగ్రహావేశాలకు చోటివ్వకుండా, ఇవన్నీ తప్పనిసరిగా జరగాల్సినవే అన్నట్లు ఎలా చెప్పగలుగుతారో మాత్రం ఆమెకు అర్థం కాలేదు.

"మా అక్కయ్య ఇవేళ వస్తోంది" అన్నాడు నికొలాయ్.

"ఆమెకు పెళ్లి అయిందా?"

"ఆమె విధవరాలు. ఆమె భర్తను సైబీరియాకి ప్రవాసం పంపేరు. అతడు అక్కడ నుంచి తప్పించుకుని పారిపోయాడు. రెండేళ్ల కిందట యూరప్‌లో క్షయవ్యాధివల్ల మరణించాడు."

---

* స్థానిక పరిపాలన సంస్థ. — సం.

"ఆమె మీకన్న ఎన్నేళ్ళ పెద్ద?"

"నాకన్న ఆరేళ్ల పెద్దది. నేనామెకు ఎంతైనా ఋణపడున్నాను. ఆమె ఎంత చక్కగా పియానో వాయిస్తుందో వినండి. ఆ పియానో ఆమెదే. ఇక్కడున్న వస్తువులు చాలా వరకామెవే. పుస్తకాలు నావి."

"ఆమె ఎక్కడుంటుంది?"

"ఎక్కడ పడితే అక్కడే.... ఎక్కడ ధైర్యంగల మనిషి అవసరమో అక్కడ ఆమె ఉంటుంది" అని అతడొక చిరునవ్వు నవ్వేడు.

"ఆమె కూడా ఇలాటి పనే చేస్తోందా?"

"ముమ్మాటికీ!"

ఇంతలో అతడు ఆఫీసు కెళ్లిపోయాడు. తల్లి "ఇలాటి పని" అంటే ఏమిటో ఆలోచించడం మొదలెట్టింది. పట్టుదలతో, నిదానంగా ఏరోజుకారోజు ఈ పనిలో నిమగ్నులై ఉన్న మనుషుల్ని గురించి కూడా ఆలోచించింది. దానితో వాళ్ల ముందర తనెంతో అల్పమైన దానిలా అనిపించింది. రాత్రివేళ మహోన్నత పర్వతం ముందర తను నిలబడినట్లనిపించింది.

దాదాపు మధ్యాహ్నం అయేసరికి నల్లటి దుస్తులను ధరించిన ఒక పొడుగుపాటి సన్నని స్త్రీ ప్రత్యక్షమైంది. తల్లి తలుపు తీయడంతోనే, ఆ స్త్రీ తన పసుపుపచ్చటి సంచిని కింద పడేసి చేతిని గట్టిగా పట్టుకుంది.

"మీరు పావెల్ మిహాయ్‌లొవిచ్ తల్లి అనుకుంటాను?" అని అడిగింది.

"అవును" అని తల్లి జవాబుచెప్పింది. ఆ స్త్రీ ధరించిన నాజూకైన దుస్తులను చూసి ఆమె కొంచెం కంగారుపడింది.

"మీరు నేనూహించుకున్నట్లుగానే ఉన్నారు. మా తమ్ముడు మీరిక్కడ కొచ్చేసి ఇక్కడే ఉండిపోతారని రాశాడు" అని చెప్పి, ఆమె అద్దం దగ్గర నిలబడి టోపీ తీసేసింది. "నేను చాలా కాలంనుంచి పావెల్ మిహాయ్‌లొవిచ్‌ని బాగా ఎరుగుదును. అతడు మీ సంగతి చెప్పేడు" అంది.

ఆమె కంఠస్వరం బొంగురుగా ఉంది. మాటలు నెమ్మదిగా మాట్లాడింది. కాని నడక చాలా చలాకీగా ఉంది. ఆమె కచికవన్నె కళ్లలో యవ్వనం కనిపిస్తున్నా, కణతలమీద సన్నని ముడతలు, సున్నితమైన చెవి దొప్పల పైన మెరుస్తూన్న నెరసిన వెంట్రుకలు ఆమె పెద్దతనాన్ని సూచిస్తున్నాయి.

"నాకు ఆకలేస్తోంది! ఒక కప్పు కాఫీ కావాలి" అని అడిగింది.

"ఇప్పుడే ఒక నిమిషంలో తయారుచేసిస్తాను!" అని అలమారాలోనుండి కాఫీ పాత్ర నందుకుంటూ "పాష మీతో నా ప్రస్తావన చేశాడనికదూ మీరన్నది?" అని అడిగింది.

“చాలా తరుచుగా మీ సంగతే చెప్పేవాడు.” ఆమె చిన్న తోలు సిగరెట్ పెట్టెలోనుంచి ఒక సిగరెట్ తీసి ముట్టించి గదిలో పచారు చెయ్యసాగింది.

“అతన్ని గురించి మీరు చాలా భయపడుతున్నారా?” అని తల్లి నడిగింది.

కాఫీ పాత్ర కింద వెలుగుతున్న స్పిరిటు పొయ్యినుండి లేస్తూన్నట్టి సన్నని నీలి మంట లను చూస్తూ తల్లి నవ్వింది. కొత్తగా వచ్చిన స్త్రీ సమక్షంలో తన కుండే సంకోచాలన్నీ సంతోషంలో ఏమ్యమైపోయాయి.

“అంటే, మా చిట్టినాయన నన్ను గురించి చెప్పేదన్నమాటే” అని తల్లి తనలో తనే అనుకుంది. “నిజమే అతని విషయమై భయం లేకపోలేదు. కాని కొంత కాలం కిందట ఇలాంటిది సంభవిస్తే నేనింతకన్న చాలా బాధపడేదాన్ని. ఇప్పుడో, ఈ పనిలో అత డొక్కడే కాదని నాకు తెలుసు” అని ఆమెతో మెల్లగా చెప్పింది.

ఆమె ముఖంకేసి చూసి తల్లి ఆమె పేరడిగింది.

“సోఫ్యా” అని ఆమె బదులుచెప్పింది.

తల్లి ఆమెను ఎంతో ఆసక్తితో పరిశీలించింది. చాలా ధైర్యసాహసాలు, ఉద్వేగం ఆమె యందమితంగా ఉన్నట్లామె గ్రహించింది.

“ఇప్పుడు ముఖ్యమైన దేమిటంటే వీళ్లందరూ ఇక ఆట్టేకాలం జైల్లో ఉండకూడదు. వాళ్ల ఈ విచారణను త్వరలో ముగిస్తే బాగుండును! వీళ్లకు ప్రవాస శిక్షను విధిస్తారు. అక్కడనుంచి పావెల్ మిహాయ్‌లొవిచ్ తప్పించుకు వచ్చేసే ఏర్పాట్లను మనం చేస్తాం. అతని అవసరం యిక్కడ చాలా ఉంది” అని సోఫ్యా ధీమాగా చెప్పింది.

తల్లి సోఫ్యాకేసి సంకోచంతో చూసింది. సిగరెట్టు పీకెను ఎక్కడ పారెయ్యాలా అని సోఫ్యా ఇటూ అటూ చూసి చివరకామె సిగరెట్టు పీకెను పువ్వుల కుండీ మట్టిలో పడేసి నలిపేసింది.

“అలా చేస్తే మొక్కలు పాడైపోతాయి” అంది తల్లి అప్రయత్నంగా.

“క్షమించండి. నికొలాయ్ కూడా నాకు ఆ మాటే చెబుతూ ఉంటాడు” అని సోఫ్యా ఆ సిగరెట్టు ముక్కను తీసి కిటికీలోంచి బయట పారేసింది.

తల్లి కొంచెం ఇరుకున పడింది. తను తప్పుచేసినట్లుగా సోఫ్యాకేసి చూసి:

“మీరు నన్ను క్షమించాలి. నేను అనాలోచితంగా మాట అనేశాను. మీరేం చెయ్యాలో నేనెలా చెప్పగలను!” అంది.

“నేనింత అపరిశుభ్రంగా ఉన్నప్పుడు మీరెందుకు చెప్పకూడదు?” అని సోఫ్యా భుజా లెగరేసింది. “కాఫీ సిద్ధమైపోయిందా? సంతోషం. ఒక కప్పే తెచ్చేరేమిటి? మీరు తాగరా?”

గభాలున సోఫ్యా తల్లి భుజం పట్టుకుని దగ్గరకు లాక్కుని ఆమె నేత్రాలను తదేక దృష్టితో చూస్తూ,

"మీకేమైనా ఇక్కడ కొత్తగా ఉందా?" అని అడిగింది.

తల్లి చిన్నవవ్వు నవ్వింది.

"సిగరెట్ ముక్కను గురించి నేనంత నిర్మొగమాటంగా మాట్లాడిన తర్వాత నాకింకా కొత్తేమిటి?.... నేను నిన్ననే ఈ ఇంట్లో కొచ్చాను. కాని అప్పుడే ఇది నా స్వంత ఇల్లనిపిస్తోంది.... నాకేమీ భయమనేది లేదు. నాకు తోచిందేదో అనేస్తాను...." అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ తల్లి చెప్పింది.

"సరిగా అలాగే ఉండాలి!" అంది సోఫ్యా.

"నా తలెప్పుడూ తిరుగుతూ ఉంటోంది. నేనేమి చేస్తున్నానో నాకే తెలియని పరవశ స్థితిలో ఉంటున్నాను. ఒకప్పుడు ఎవరితోనైనా మనసిచ్చి మాట్లాడే ముందు వాళ్ల మంచి చెడ్డలు బాగా తెలుసుకుంటే తప్ప నోరు విప్పేదాన్ని కాను. ఇప్పుడంటారా, నా హృదయ కవాటం తెరిచివుంది. ఇప్పుడు నే చెప్పే మాటలను నేను చెప్పగలుగుతానని కలలోనైనా అనుకోలేదు...." అంది తల్లి.

సోఫ్యా మరొక సిగరెట్‌ను తీసి తల్లి ముఖంకేసి తన కచికరంగు కళ్లతో ప్రసన్నంగా చూసింది.

"అతడు తప్పించుకుని వచ్చేటట్లు చేస్తామని మీరంటున్నారు కదా. అయితే అతడెలా జీవిస్తాడు? దొంగచాటుగా ఉంటాడా?" అని తల్లి తన మనసును బాధిస్తున్న విషయాన్ని అడిగేసింది.

"అదేమంత కష్టమైన సంగతి కాదు" అంటూ సోఫ్యా గిన్నెలోనుంచి మరొక కప్పుకాఫీని నింపుకుని ఇలా చెప్పింది: "అతడు కూడా దొంగచాటుగా ఉండే అనేకమంది మనుషుల్లాగే కాలక్షేపం చేస్తాడు. ఇప్పుడే నేనలాంటి మనిషినొకరిని కలుసుకుని అతనొక్కడుండాలో అక్కడకు సాగనంపి వచ్చాను. అతని అవసరం కూడా ఇక్కడ చాలా ఉంది. అతనికి అయిదేళ్ల ప్రవాస శిక్ష విధించారు. కాని మూడున్నర మాసాలు మాత్రమే ప్రవాసంలో గడిపాడు."

తల్లి కొంచెం సేపు ఆమెకేసి అలాగే చూసి చిరునవ్వు నవ్వింది. తలూపుతూ ఇలా అంది:

"ఆ దినం సంఘటనలు నా మనస్సును తలకిందులు చేసేశాయి. నేనేమవుతున్నానో నాకే తెలియడం లేదు. ఒకే సారి రెండు దారుల్లో నడుస్తున్నట్లుంటోంది. ఒక్కొక్కప్పుడు అన్నీ తెలిసినట్లుగానే ఉంటుంది. మళ్లీ అంతలో సొగమంచు కమ్మేసినట్లుంటుంది. మాట వరసకి మీ సంగతే చూద్దాం. మీరు మర్యాదగల కుటుంబంలో పుట్టిన ఆడకూతుళ్లు అయినా మీరిలాంటి పని చేస్తున్నారు. మా పాషని బాగా ఎరుగుదురు.... అతన్ని గురించి మంచిగా మాట్లాడేరు.... అందుకు నేను చాలా కృతజ్ఞురాల్ని."

''కృతజ్ఞత తెలుపవలసింది మీకు'' అని సోఫ్యా నవ్వింది.

''నాకెందుకు? నేనతనికి ఈ పనంతా నేర్పించలేదే!'' అని తల్లి నిట్టూర్చింది.

సోఫ్యా సిగరెట్టు పీకెను సాసరులో నలిపి పడేసింది. బంగారంలా మెరిసే ఆమె బరువు పాయల జుట్టు విడిపోయి నడుంమీద పడేదాకా గట్టిగా తల ఆడించింది.

''వాజాకైన ఈ దుస్తులన్నీ ఇక తీసెయ్యాలి'' అని లేచి బయటకు పోయింది.

3

నికొలాయ్ సాయంత్రం అయాక వచ్చాడు. భోజనం చేస్తుండగా, సోఫ్యా, ప్రవాసంనుంచి పారిపోయి వచ్చిన ఒక మనిషిని తానెలా దాచినదీ, కనిపించిన వాడల్లా గూఢచారి అనుకుని తానెలా ఝుడిసినదీ, తప్పించుకు వచ్చినవాడెంత తమాషాగా ప్రవర్తించినదీ, నవ్వుతూ వర్ణించింది. తల్లి కామె ధోరణి చూస్తుంటే బడాయి మాటలు చెపుతోందా అనిపించింది. ఒక కార్మికుడు తను చాలా కఠినమైన పనిని నేర్పుతో నిర్వహించినప్పుడు చెప్పేలా ఆమె చెప్పింది.

ఇప్పుడు సోఫ్యా గచ్చకాయ రంగు తేలిక దుస్తుల్ని ధరించింది. ఆ దుస్తుల్లో ఆమె బాగా పొడుగ్గా కనిపించింది. నేత్రాలు బాగా నల్లగా కనబడ్డాయి. కదలికలో ఎక్కువ పొందిక కనబడింది.

భోజనాంతరం నికొలాయ్:

''చూశావా, సోఫ్యా, నువ్వు మరొక పని చెయ్యవలసి ఉంటుంది. రైతులకోసం ఒక పత్రికను ప్రకటించేటందుకు మనం పూనుకున్నాం. కాని ఈ అరెస్టులమూలంగా, వాటిని పంచిపెట్టే మనిషితో సంబంధం తెగిపోయింది. అతన్ని వెదికి పట్టుకోడానికి మనకు పెలగేయా నీలొవ్నా ఒక్కరు మాత్రమే తోడ్పడగలరు. నువ్వామెవెంట పల్లెటూళ్ల కెళ్లాలి. ఎంత త్వరగా వెడితే అంత మంచిది'' అన్నాడు.

సోఫ్యా సిగరెట్టు దమ్ము పీల్చి,

''సరే, అలాగే. పెలగేయా నీలొవ్నా, మనం వెడతాం, ఔనా?'' అని అడిగింది.

''వెడదాం.''

''చాలా దూరమా?''

''దాదాపు ఎనభై మైళ్ళు.''

''అయితే సరే! ఇప్పుడు నాకు కొంచెం సంగీతం కావాలి. అమ్మా! నేను కొద్దిగా పియానో వాయిస్తే మీకేమీ యిబ్బంది కలగదు కదా?''

''నా విషయమై అలాటి సంకోచాలు పెట్టుకోకండి. నేనసలిక్కడ లేనట్టుగానే భావించి, మీ పని మీరు చూసుకోండి'' అంటూ తల్లి సోఫాలో ఒక పక్కకు జరిగింది.

అక్కా, తమ్ముడూ ఆమెను చూస్తున్నట్లుగుపడలేదు, కాని ఆమెను ఏదో వంకపెట్టి సంభాషణలోకి లాగడానికి ప్రయత్నం చేస్తూనేవున్నారు.

"నికొలాయ్, ఇది విను! ఇది గ్రీగ్ కృతి. నేనివ్వేళే పట్టుకొచ్చాను.... కిటికీతలుపులు మూసెయ్యి."

సోఫ్యా సంగీత పుస్తకాన్ని విప్పి, పియానోమీద ఎదుటగా పెట్టుకుని, ఎడమచేత్తో పియానో వాయిస్తూ పాట మొదలెట్టింది. పియానో తంతులు షడ్జమ స్థాయిలో మోగేయి. మెల్లని స్వరంతో మరొక గొంతు శ్రుతి కలిపింది. కుడి చేతి వేళ్ల కిందనుంచి బంగారు స్వరాలు వణుకుతూ పైకి లేచాయి.

మొదట్లో ఈ సంగీతమేమీ తల్లిని చలింపచేయలేదు. ఆ సంగీతమేదో గొణగొణ ధ్వనిగానే అనింది. చాలా గజిబిజిగా ఉండే అస్తవ్యస్త ధ్వనిలో ఏ స్వరాన్నీ ఆమె చెవులు గుర్తించలేకపోయాయి. సోఫాకు రెండో చివర కాళ్లు ముడుచుకుని నికొలాయ్‌నీ, బంగారు రంగు జుట్టుగల సోఫ్యానూ తల్లి అర్ధనిమీలిత నేత్రాలతో చూస్తూ కూచుంది. సూర్య కిరణం సోఫ్యా తలనూ భుజాలనూ వెలుగుతో నింపింది, తరువాత పియానో మెట్లమీదకు జారి ఆతరువాత ఆమె వేళ్ల కింద గిజగిజలాడింది. సంగీతం పొంగి గదంతా ఆవరించి, ఆమె ఎరగకుండానే ఆమె హృదయానికి సోకింది.

అకారణంగా తల్లికి అంధకారమయమైన తన గత జీవితంలోని ఘట్టమొకటి స్ఫురణ కొచ్చింది. తానా సంగతి ఏనాడో మరచిపోయింది. నేడు అదంతా విస్పష్టంగా జ్ఞప్తికొచ్చింది.

ఒక రోజు అర్ధరాత్రివేళ ఆమె భర్త తప్ప తాగి ఇంటికొచ్చాడు. మంచంమీద పడుకున్న ఆమెను చెయ్యిపట్టుకుని బరబర కిందకు లాగి డొక్కలో తన్నేడు.

"లంజముండా! ఇక్కడనుంచి పో! నువ్వంటే నాకు అసహ్యమేస్తోంది!" అన్నాడు.

అతడు కొట్టే దెబ్బలు తప్పించుకోవడానికి రెండేళ్ల కొడుకును చేతుల్లోకి తీసుకుని ముందర అడ్డం పెట్టుకుని నేలమీద మోకరించింది. నగ్నంగా, వెచ్చగా ఉండే పిల్లవాడు ఏడుస్తూ ఆమె చేతుల్లో గిజగిజలాడేడు.

"ఇక్కడనుంచి పో!" అని మిహాయిల్ హుంకరించాడు.

ఆమె చటుక్కున లేచి వంట ఇంట్లోకి పారిపోయింది. తన భుజంమీద జాకెట్టు వడేసుకుని, పిల్లవాడికి శాలువ కప్పి, మారు మాటాడకుండా, నిశ్శబ్దంగా, రాత్రి దుస్తులూ, జాకెట్టూ మాత్రం ధరించి, కాలికి జోడైనా వేసుకోకుండా బయటికి వచ్చేసింది. అది మే నెల. రాత్రివేళ చాలా చలిగా ఉంది. వీధుల్లో ధూళి చల్లగా పాదాలకంటుకుని వేళ్లమధ్య దూరింది. చేతుల్లో పిల్లవాడు ఏడుస్తూ గిజగిజ తన్నుకున్నాడు. పిల్లవాడిని గుండెలకు హత్తుకుని, "అయమ్మ, హాయి—హాయి!" అంటూ ఓదారుస్తూ, భయం కొద్దీ వీధివెంట చరచర నడిచింది.

అరుణోదయమైంది. అర్ధనగ్నంగా ఉన్న స్థితిలో తన నెవరైనా చూస్తారేమోనని సిగ్గుపడుతూ, బాడవ దగ్గర వున్న ఏస్పెన్ చెట్లకింద కూచుండిపోయింది. చాలా సేపామె అక్కడే, కళ్లు బాగా తెరుచుకుని చీకట్లో చూస్తూ కూచుంది. పిల్లవాడి వోదార్చడానికి, తన హృదయంలోని గాయానికి ఉపశమనంకోసం, ఆమె అదే పనిగా ''అయమ్మ, హాయి—హాయి'' అని జోల పాడింది.

ఆకస్మాత్తుగా నల్లని పక్షి ఒకటి ఆమె పక్కనే ఎగిరింది. దానితో ఆమె ఉదాసీనత లోనుండి ఉలిక్కిపడి లేచింది. చలిచేత గడగడ వణుకుతూ ఇంటికేసి మళ్లింది. యధాప్రకారంగా తన్నులూ, అవమానాలూ జరిగే చోటికే....

రాగం ఆఖరు కొచ్చింది. నిర్లక్ష్యమైన కఠిన స్వరంతో సంగీతం మెల్లగా అంత మై పోయింది.

సోఫ్యా తమ్ముడికేసి తిరిగి:

''నీకు నచ్చిందా?'' అని అడిగింది.

''బాగా నచ్చింది! బాగా'' అని నిద్రలోనుంచి లేచినవాడిలాగున అతడు జవాబు చెప్పేడు.

తల్లికి జ్ఞప్తికొచ్చిన సంఘటనలు ఆమె హృదయంలో తటతట కొట్టుకున్నాయి. స్పృహ ఉండీ ఉండని స్థితిలో ఆమెకీ ఆలోచన తట్టనారంభించింది:

''ప్రపంచంలో స్నేహంగానూ, ప్రశాంతంగానూ కలిసి జీవించే మనుషులుంటారు. అంధకారమయమైన ఆ జీవితంలోలాగ వారు తమలో తాము పోరాడుకోరు.... తప్పతాగి ఒళ్లు తెలియకుండా ఉండరు. చిన్న రొట్టెముక్కకోసం దెబ్బలాడుకోరు....''

సోఫ్యా మరొక సిగరెట్ ముట్టించింది. ఆమె తెరపి లేకుండా సిగరెట్లు తాగుతుంది.

''ఆ పాటంటే కోస్త్యకు చాలా ఇష్టం'' అంది. బాగా దమ్ము పీల్చి మళ్లీ పియానో మీటి మెల్లని విషాద స్వరాన్ని పలికించింది. ''అతనికి సంగీతం వినిపించాలని నేనెంతో సరదా పడేదాన్ని! అతనిదెంతో సున్నితమైన మనస్సు! ప్రతి నాదుపుకూ చలించిపోయేవాడు, హృదయం పొంగి పొరలిపోయేది!'' అంది.

''పాపం.... ఆమె తన భర్తను తలుచుకుంటున్నట్లుంది'' అనుకుంది తల్లి. ''చిరునవ్వు నవ్వి మరీ తల్చుకుంటుంది!...''

''అతను నన్నెంత సుఖపెట్టేడో కదా! జీవితాన్ని సుఖవంతం చెయ్యడం అతనికి తెలుసు!'' అంది సోఫ్యా.

''అవును. అతని ఆత్మ ఎప్పుడూ సంగీతం పాడుతూనే ఉండేది'' అని సోఫ్యా చెప్పిన మాటతో ఏకీభవించాడు నికొలాయ్.

సోఫ్యా అప్పుడే ముట్టించిన సిగరెట్టును అవతల పారేసి తల్లికేసి తిరిగి:

''నేను చేసే ఈ గొడవ మీకేమీ చిరాకెత్తించడం లేదుకదా?'' అని అడిగింది.

తల్లి తన కడుపులోని వేదనను దాచుకోలేకపోయింది.

"నన్ను గురించి మీరేమీ పట్టించుకోకండి. నాకేమీ అర్థం కాదు. నేనిక్కడ కూచుని వింటూ ఉంటాను. నా ఆలోచనలు నాకు నిండుగా ఉండనే ఉన్నాయి...." అంది.

"కాని, మీరర్థం చేసుకోవాలి.... స్త్రీ సంగీతాన్ని అర్థం చేసుకోకుండా ఉండేందుకు వీల్లేదు! ముఖ్యంగా ఆమె విచారంగా ఉన్నప్పుడు" అంది సోఫ్యా.

ఆమె పియానో మెట్లను బాగా చురుకుగా మీటింది. భయంకరమైన దుర్వార్త విన్నవాళ్లలాగ పియానో మ్రోగింది. అలాటి ఉద్వేగమైన ధ్వని వెలువడేందుకు హృదయ విదారకమైన దెబ్బ ఎవరికో తగిలి ఉండాలి. ఝడుసుకొన్న యువ కంఠాలు గజగజ వణికి ఆదరాబాదరా ఎగిరి వెళ్లిపోయాయి. మరొకసారి ఆగ్రహావేశపూరితమైన కంఠధ్వని బిగ్గరగా గర్జించింది. ఏదో దురదృష్టకరమైన సంఘటన జరిగి ఉండాలి. అది జాలి కలిగించడానికి బదులు కోపాన్ని ప్రకోపింపచేసింది. తర్వాత దయార్ద్రహృదయుడూ బలిష్ఠుడైన వాడెవడో ప్రత్యక్షమై సరళమైన గీతం ఆలాపించుతూ తనవెంట రావలసిందిగా పిలిచినట్టయింది.

ఈ అప్పా తమ్ముళ్లకు ఏదో మంచిమాట చెప్పాలనిపించింది తల్లికి. సంగీతం ఆమె హృదయాన్ని మైమరపించింది. చిరునవ్వు నవ్వింది. అప్పకీ తమ్ముడికీ ఏదో విధంగా తను ఉపయోగపడాలనుకుంది.

ఆమె నాలుగు మూలలా చూసింది. తనేమి చెయ్యగలదు? మెల్లగా వంటింట్లోకి వెళ్లి టీకి సమొవార్ వెలిగించింది.

అంతటితో ఆమెకు తృప్తి కలగలేదు. టీ తయారుచేసుకొచ్చి గ్లాసుల్లో పోస్తూ కలవరపాటుతో చిరునవ్వు నవ్వింది. తన మనస్సంతృప్తికోసం, వాళ్ల సంతృప్తికోసం మాట్లాడ్డం మొదలెట్టింది:

"మూర్ఖులమై, అంధకారయుతమైన జీవితంలో పడున్న మాలాంటివాళ్లకి కూడా అన్నీ తెలుస్తాయి. కాని మా హృదయంలో ఉన్న భావాన్ని మాత్రం పైకి మాటల్లో చెప్ప లేము. అంచేత మాకే సిగ్గేస్తుంది. ఆ సిగ్గుచేత మా ఆలోచనలపట్ల విసుగు జనిస్తుంది. జీవితం నాలుగు మూలల్నుంచీ పోట్లు పొడుస్తూ ఉంటుంది. ప్రాణం విశ్రాంతిని కోరు తుంది. కాని మా ఆలోచనలు విశ్రాంతి నివ్వవు."

నికొలాయ్ కళ్లజోడు తుడుచుకుంటూ తల్లి చెప్పే మాటలను శ్రద్ధగా వింటున్నాడు. సోఫ్యా చేతిలో ఆరిపోతున్న సిగరెట్టు సంగతి కూడా మరచిపోయి గుడ్లప్పగించి వింటోంది. ఆమె తమ్ముడికేసి సగం తిరిగి పియానో దగ్గరే కూచుంది. మధ్యమధ్య బహు సున్నితంగా కుడిచేత్తో పియానో మెట్లను మీటుతోంది. తల్లి హృదయంలోనుంచి వచ్చే మాటలకు, సన్నని ఆ స్వరం శ్రుతి కలుపుతోంది.

"ఇప్పుడిప్పుడే నాకు జీవిత రహస్యం తెలుస్తోంది. అంచేత, నన్ను గురించీ, ప్రజల్ని గురించీ కొంచెం చెప్పగలుగుతున్నాను. ఇంతకు ముందు అర్థంచేసుకోవడం, పోల్చి చూడటం చేతనయేది కాదు. మాలో అందరూ ఒకలాగే బతుకుతూ ఉండేవారు. కాని ఇప్పుడు ఇత రులెలా జీవిస్తున్నారో చూస్తూ, నేనెలా జీవించానో జ్ఞప్తికితెచ్చుకుంటే, పాలపాలమంటూ అది ఎంత బాధగానో ఉంటుంది." ఆమె కంఠస్వరాన్ని తగ్గించింది. "బహుశా నేను సరిగా చెప్పలేకపోతున్నాననుకుంటాను. అసలా విషయం చెప్పడంలో కూడా అర్థం లేకపోవచ్చు. ఏమంటే, మీకిందులో కొత్త లేదుకదా!" ఆమె కంఠస్వరంలో కన్నీరగుపడింది. కాని కళ్లల్లో మాత్రం చిరునవ్వు ద్యోతకమైంది. "నేను నా హృదయకవాటాన్ని మీకు తెరుస్తున్నాను. మీ కెంతో సుఖం, మంచీ కలగాలని నేనెంతగా కోరుకుంటున్నానో మీకు తెలియాలి!"

"ఆ సంగతి మాకు బాగానే తెలుసు" అని మెల్లగా నికొలాయ్ అన్నాడు.

తన తపనను తృప్తిపరచలేకపోయినట్లు ఆమె కనిపించింది. అందుచేత ఎన్నో కొత్త విషయాలను, అమూల్యమైనట్టి అతి ముఖ్యమైన విషయాలను వాళ్లకు చెప్పింది. నికృష్టమైన తన గత జీవితాన్ని గురించీ, ఓర్మితో పడిన బాధను గురించీ ఏవిధమైన కసీ లేకుండా పెదవులను మాత్రం వంకరగా పెట్టి చెప్పింది. తన భర్త అకారణంగా తన్ను చితగ్గొట్టడమూ, దాన్ని తానెదిరించలేకపోవడమూ తనకిప్పుడు ఆశ్చర్యం కల్గించింది.

వాళ్లు నిశ్శబ్దంగా ఆమె గాధంతా విన్నారు. పశువుగా పరిగణింపబడి అందుకొడబడిన ఆమె జీవిత కథలోని అంతరార్థాన్ని గమనించి ఆశ్చర్యచకితులయారు. ఆమె మాట్లాడు తుంటే వేలాదిమంది ఆమెద్వారా మాట్లాడుతున్నట్లుంది. ఆమె జీవిత విధానం చాలా సాధారణమైనదే, మామూలుగా ఈ ప్రపంచంలో అత్యధిక సంఖ్యాకుల బతుకు వంటిదే. కనుక ఆమె కథ ఒక చిహ్నమైంది. నికొలాయ్ బల్లమీద మోచేతులను మోపి చేతుల్లో తలాన్చి, చిట్లించిన కళ్లతో సులోచనాల్లోంచి ఆమెకేసి చూశాడు. సోఫ్యా కుర్చీలో వెనక్కు తలాన్చి కూచుంది. అప్పుడప్పుడు అసంతృప్తిసూచకంగా తలూపేది. ఆమె ముఖం వెల్లబారి చిక్కిపోయినట్లగుపడింది. ఆమె సిగరెట్టు కాల్చలేదు.

"ఒకప్పుడు నేను చాలా దురదృష్టవంతురాలిననుకున్నాను. సంధించిన అవస్థలో వున్నట్లనిపించేది. ఒక చిన్న పట్టణంలో నేను ప్రవాసంలో ఉన్నప్పటి మాట యిది. నాకేమీ పని పాట్లుండేవి కావు. నన్ను గురించి నేనే ఆలోచించుకోవడం తప్ప వేరే ఆలోచనేమీ ఉండేది కాదు. కాలహరణంకోసం, పదేపదే నా కష్టాలను గురించే ఆలోచించుకుంటూ ఉండేదాన్ని. నేనెంతగానో ప్రేమించిన తండ్రితో తగాదాపడ్డాను. నన్ను బడిలోంచి వెళ్ల గొట్టి నన్నొక సిగ్గుచేటైన ఉదాహరణగా చూపించేవారు. జైల్లో పెట్టేరు. బాగా సన్నిహి తుడైన ఒక స్నేహితుడు నాకు మోసంచేసి అప్పగించాడు. నా భర్తను అరెస్టుచేశారు. మళ్లీ నన్ను జైల్లో పెట్టి ప్రవాసం పంపేరు. అప్పుడు నా భర్త చనిపోయాడు. ఈ

ప్రపంచంలోకల్లా నేనే నిర్భాగ్యురాలననుకునేదాన్ని. కాని నా కష్టాలన్నీ, పది రెట్లయినా కూడా, మీ జీవితంలో ఒక్క నెలకు సరి రావు! మీ జీవితం రోజూ యమబాధే.... అలాటి రోజులు ఏళ్ల తరబడి గడిచాయి. ఇలాటి బాధలను సహించే ఓర్పు జనాని కెక్కడినుంచి వస్తుందో కదా?'' అని మెల్లగా సోఫ్యా చెప్పింది.

''వాళ్ల కదే అలవాటై పోతుంది'' అని నిట్టూరుస్తూ పెలగేయా నీలొవ్నా చెప్పింది.

''నాకు జీవితం సంగతి బాగా తెలుసునన్న అతిశయం వుండేది నాకు. కాని ఇలాంటి ప్రత్యక్షమైన కథ వింటే మాత్రం చాలా ఘోరంగా కనిపిస్తుంది. ఇది పుస్తకాల్లోని కథ కాదు. నా ఊహ కాదు. ఇలాంటి చిన్న చిన్న ఘోరసంఘటనలే ఏళ్లతరబడి జరగడం....'' అని ఆలోచనాపూర్వకంగా నికొలాయ్ అన్నాడు.

వాళ్లలా మాట్లాడుతూనే కూచున్నారు. కష్టభూయిష్టమైన జీవిత పార్శ్వాలన్నిటినీ వారు చర్చించుకున్నారు. తన యౌవనాన్ని భయంకరంగా చేసిన నిత్య అవమానాలన్నిటినీ జ్ఞాపకం తెచ్చుకుని అమ్మ తన్నుతానే మరచిపోయింది. చివరకు:

''మీకు పడుకునే వేళైనా నేనిలా మాట్లాడుతూనే ఉన్నాను. చెప్పవలసిందంతా చెప్పడం సాధ్యం కానే కాదు....'' అంది పెలగేయా నీలొవ్నా.

అప్పా, తమ్ముడూ నిశ్శబ్దంగా ఆమెదగ్గర శలవు తీసుకున్నారు. నికొలాయ్ మామూలు కన్న ఎక్కువగా వంగి నమస్కరించి చాలా ఆప్యాయతతో ఆమె చేతిని పట్టుకుని నొక్కేడు. సోఫ్యా ఆమెను గదిదాకా సాగనంపింది.

''హాయిగా నిద్రపోండి'' అని చెప్పి సోఫ్యా శలవు తీసుకుంది.

ఆమె కంఠస్వరమెంతో భావగర్భితంగా ఉంది. కరుణాపూరితమైన కళ్లతో ఆమె తల్లి ముఖంకేసి చూసింది.

తల్లి సోఫ్యా చేతిని తన చేతుల్లోకి తీసుకుని:

''ధన్యవాదాలు!'' అంది.

## 4

కొద్ది రోజులు పోయినతర్వాత, తల్లీ, సోఫ్యా పేదవారైన పట్టణస్త్రీల వేషం ధరించి నికొలాయ్ ఎదుట నిలబడ్డారు. వాళ్లు చిరిగిపోయిన నూలు దుస్తులూ, జాకెట్లూ ధరించారు. భుజాన సంచులు వేసుకుని చేతుల్లో కర్రలు పుచ్చుకున్నారు. ఈ వేషంలో సోఫ్యా కొంచెం పొట్టిగా కనబడింది. వెలవెలబారే ఆమె ముఖం మరింత కఠినంగా ఉంది.

అప్పగారి చేతిని పట్టుకుని గట్టిగా నొక్కి నికొలాయ్ సాగనంపేడు. వాళ్లిద్దరి మధ్యా

నిరాడంబరానుబంధం తల్లికెంతో అబ్బురమనిపించింది. వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు ముద్దెట్టుకో లేదు. తియ్యని మాటలు మాట్లాడుకోలేదు. కాని ఒకరి క్షేమాన్ని గురించి ఇంకొకరు ఎంతో ఆదుర్దాపడుతుండేవారు. తానిదివరకుండే ప్రపంచంలో జనం ఒకరినొకరు ముద్దులె ట్టుకునేవారు. తేనెలొలికే మాటలు మాట్లాడుకునేవారు. కాని సమయమొచ్చినప్పుడు ఆకలితో వున్న కుక్కల్లాగ ఒకర్నొకరు కరుచుకునేవారు.

ఈ స్త్రీలిద్దరూ పట్టణంలోని వీధుల్లోంచి నెమ్మదిగా నడచిపోయి పొలాల్లో పడ్డారు. పక్క పక్కగా నడుచుకుంటూ, ఇరు పక్కలా పురాతన భూర్జవృక్షాలున్న వెడల్పాటి పుంతలో నడక సాగించారు.

"మీకు అలసట కలగడం లేదా?" అని తల్లి సోఫ్యా నడిగింది.

"నేను నా రోజుల్లో చాలా నడిచాను. నాకు అలవాటే."

సోఫ్యా, తన చిన్నతనం నాటి చిలిపి చేష్టలను యాకరువు పెట్టినట్లుగా, విప్లవో ద్యమంలో తను చేసిన పనులను ఉషారుగా చెప్పడం ప్రారంభించింది. ఆమె అనేక సార్లు పేర్లు మార్చుకుంది. దొంగ ప్యాస్‌పోర్టులతో కాలక్షేపం చేసింది. గూఢచారులనుండి తప్పిం చుకోడానికి ఎన్నో వేషాలు మార్చింది. ఒక పట్టణంనుంచి మరొక పట్టణానికి నిషిద్ధ కరపత్రాలను కట్టలుకట్టలుగా చేరవేసింది. ప్రవాసంలో ఉన్న కామ్రేడ్ను తప్పించుకు పారి పోయేందుకు ఏర్పాట్లు చేసింది. వాళ్లను విదేశాల్లోని నగరాలకు కూడా వెళ్లి సాగనంపింది. ఒకసారి తన మకాంలో రహస్యంగా ఒక అచ్చుయంత్రాన్ని నెలకొల్పింది. పోలీసులకా సంగతి తెలిసి సోదాచెయ్యడాని కొచ్చేసరికి, ఆమె దాసీ వేషం వేసుకుని గుమ్మంలో నిలబడ్డున్న పోలీసుల్ని తప్పించుకుపోయింది. అది శీతాకాలం. చలి బాగా వేస్తున్న రోజు. తేలికైన దుస్తులు ధరించి, తలకొక నూలు రుమాలను చుట్టుకుని, కిరసనాయిలు కొను క్కొవేందుకు వెడుతున్నట్లుగా ఒక డబ్బా చేత్తో పుచ్చుకుని నగరం ఈ కొసనుండి ఆ కొసకు వెళ్లింది. మరోసారి కొందరు స్నేహితులను కలుసుకోవడానికి ఒక కొత్త నగరం వెళ్లింది. తీరా వాళ్ళుండే మేడ మెట్లెక్కుతుండేసరికి, అక్కడ పోలీసులు సోదాచేస్తున్నట్లు తెలుసుకుంది. వెనక్కొళ్లడానికి సావకాశం మించిపోయింది. కనుక సాహసం చేసి కింది అంతస్తులో ఉన్న ఒకరింటి వాకిట్లోని గంటవాయించి, సామానుతో సహితంగా ముక్కూ మొగమూ ఎరగని వారింట్లో బైతాయించింది.

"కావాలంటే నన్ను పోలీసులకు పట్టిచెప్పవచ్చు మీరు. కాని మీరు అలాటి పని చేయరనుకుంటాను" అని నిస్సంకోచంగా సంగతంతా ఉన్నదున్నట్లు చెప్పింది.

వాళ్ళు చాలా భయపడిపోయారు. రాత్రంతా ఒక్క కునుకైనా పోకుండా మెలకువగా ఏ నిమిషంలో పోలీసువాళ్లొచ్చి తలుపు కొడతారోనని ఆదటుతో కూచున్నారు. కాని వాళ్ళు పోలీసులకు మాత్రం పట్టిచెప్పలేదు. మరునాడు ఉదయం ఈ సాహసాని కందరూ హృదయ

పూర్వకంగా నవ్వుకున్నారు. ఇంకోసారి ఆమె నన్* వేషం ధరించి, తనను వెంటాడిస్తున్న గూఢచారి కూర్చున్న రైలుబండిలోనే కూచుని ప్రయాణం చేసింది. ఆమెను తనెంత తెలివితేటలుగా వెంటాడిస్తున్నదీ, అతడు బడాయిగా ఆమెతో చెప్పేడు. ఆ రైల్లోనే రెండవ తరగతి బండిలో ప్రయాణంచేస్తోందని అనుకున్నాడు. రైలాగిన ప్రతి స్టేషన్‌లోనూ దిగి ఆమెకోసం వెతుక్కునేవాడు. తిరిగొచ్చి, సన్యాసినితో:

“ఎక్కడా కనబడ్డం లేదు. బహుశా నిద్రపోయి ఉంటుంది. వాళ్ళూ అలిసి పోతూం టారు. మా బతుకుల్లాగే వాళ్లవీ సులభమైన జీవితాలు కావు” అన్నాడు.

ఈ కథలన్నీ వింటుంటే తల్లికి నవ్వొచ్చింది. ఎంతో ఆప్యాయతతో ఆమెకేసి చూసింది. పొడుగ్గా సన్నంగా ఉండే సోఫ్యా, తన అందమైన పాదాలతో నాజూకుగా నడుస్తూ ఆమెతో అడుగు కలిపి నడిచింది. ఆమె నడకలో, మాటల తీరులో, సంతోషం ఉట్టిపడే బొంగురు గొంతుకలో, అన్నిటికన్నా పొడుగాటి ఆమె విగ్రహంలో తల్లి కొక విందుతనమూ, సాహసమూ గోచరించాయి. ప్రతి విషయాన్నీ ఆమె యువజన సహజమైన దృష్టితో పరిశీలించేది. ఎక్కడ చూసినా ఆమెకు సంతోషకరమైన సంగతే కనబడేది.

“ఈ దేవదారు వృక్షమెంత బాగుందో చూడండి!” అని సోఫ్యా ఒక దేవదారు చెట్టును తల్లికి చూపించింది. తల్లి నిలబడి ఆ చెట్టుకేసి చూసింది. ఆ చెట్టు మిగతా దేవదారు చెట్లలాగే ఉంది.

“అవును. చాలా అందంగా ఉంది” అని ఆమె నవ్వింది. సోఫ్యా చెంపలమీద వెరసిన వెంట్రుకలు గాలి కెగరడం చూసింది.

“భరద్వాజపక్షి!” అంది సోఫ్యా. ఆమె కళ్ళు కనికరంతో చమక్‌మన్నాయి. ఆకాశం మీదనుండి అదృశ్యంగా వస్తున్న ఆ పాటను వినడాని కామె శరీరాన్నంతా శ్రమింపజేసింది. ఒక్కొక్కప్పుడు చలాకీయైన ఆమె శరీరాన్ని వంచి ఒక అడవి పువ్వును కోసేది. ఆ పూరేకులను సున్నితమైన తన వేళ్లతో నిమురుతూ ఒక పాట పాడుతూ ఉండేది.

ఇదంతా తల్లికి ఈ కచికవన్నె కళ్ల స్త్రీమీద ఆప్యాయతను మరింత ఎక్కువ చేసింది. ఆమెకు దగ్గరగా పక్కనే అడుగు కలిపి నడిచింది. అయితే ఒక్కొక్కప్పుడు సోఫ్యా చాలా దురుసుగా మాట్లాడేది. అందుకు తల్లి చాలా నొచ్చుకునేది.

“రీబిన్‌కి ఈమె నచ్చదు” అని ఆత్రంగా అనుకుంది.

మరుక్షణంలోనే సోఫ్యా నిరాడంబరంగానూ, ప్రేమతోనూ మాట్లాడింది. తల్లి ఆమెకేసి తేరిపారజూసి నవ్వింది.

“మీరింకా చిన్న పిల్లలానే ఉన్నారు!” అని నిట్టూర్చింది.

“అప్పుడే నాకు ముప్పైరెండేళ్లు పైన బడ్డాయి” అంది సోఫ్యా.

---

* క్రిస్టియన్ సన్యాసిని. — సం.

వ్లాసోవా చిరునవ్వు నవ్వింది.

"నా అభిప్రాయమది కాదు. మీ ఆకారం చూస్తే మీకింకా ఎక్కువ వయస్సున్నట్లే అనుకోవచ్చు. కాని మీ కళ్లకేసి చూస్తుంటే, మీ మాటలు వింటుంటే మాత్రం నాకు ఆశ్చర్యం కలుగుతోంది. చిన్న పిల్లలా ఉంటారు. మీరు చాలా కష్టమైన, ప్రమాదభరితమైన జీవితాన్ని గడుపుతున్నారు. కాని మీ హృదయం మాత్రమెప్పుడూ చిరునవ్వు నవ్వుతూ ఉంటుంది."

"నాకేమీ కష్టమనిపించడం లేదు. నా జీవితంకంటె మేలైన జీవితం, చిత్రమైన జీవితం మరొకటి లేదనిపిస్తుంది. మిమ్మల్ని నీలొవ్నా అనే పేరుతోనే పిలుస్తాను. ఎందు చేతనో కాని పెలగేయా అనే పేరు మీకు తగినట్లుగా లేదు."

"మీ యిష్టమొచ్చిన పేరెట్టి పిలవండి — మీ యిష్టం. మిమ్మల్ని చూస్తూన్నాను, మీ మాటలు వింటూన్నాను, ఆలోచించుతున్నాను. మీరు మనిషి హృదయాన్ని సమీపించే మార్గాన్ని తెలుసుకున్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. ఏ మనిషైనా, నిర్భయంగా తన అంతరంగంలో మెదుల్తున్న విషయాలను మీకు చెప్పకుంటాడు. తనంతట తానే తన హృదయంలో ఉన్న సంగతులను మీకు వెల్లడిస్తాడు. మీ అందర్నీ గురించీ ఆలోచిస్తూంటే, జీవితంలోని చెడుగును మీరు జయిస్తారనే విశ్వాసం నాకు రూఢిగా కలుగుతోంది. అందుకు నాకేమీ సంశయం లేదు" అని ఆలోచనాపూర్వకంగా చెప్పింది తల్లి.

"తప్పకుండా జయిస్తాం! ఏమంటే మేమంతా కష్టపడి పనిచేసేవాళ్లతో ఏకమైపోయాం! వాళ్లలో ఒక గొప్ప శక్తి నిబిడీకృతమై ఉంది. వాళ్లేపనైనా చెయ్యగలరు! వాళ్లెంత గొప్పవారో మాత్రం మేము వాళ్లకి తెలియచెప్పాలి. అందువల్ల వాళ్లకు అభివృద్ధిచెందే స్వేచ్ఛ లభిస్తుంది" అని దృఢమైన విశ్వాసంతో సోఫ్యా చెప్పింది.

ఆమె చెప్పిన మాటలు తల్లి హృదయంలో సంతోషం, జాలీ కలిసిన భావాలను రేకెత్తించాయి. ఆమె ఇంతకన్న సులభమైన మాటలు మాట్లాడుతుంటే వినాలనిపించింది.

"ఎవరైనా ఎప్పటికైనా మీ శ్రమకు తగిన పారితోషికాన్నిస్తారా?" అని మెల్లగా విచారంతో సోఫ్యా నడిగింది.

"మా కిదివరకే పారితోషికం ముట్టింది. మాకు సరిపోయిన జీవిత పంథాను మేము తెలుసుకున్నాం. ఆత్మకుండే బలమంతటితో మేము జీవిస్తున్నాం. ఇంతకన్న మాకు జీవితంలో కావలసిందేముంది?" అని సోఫ్యా జవాబిచ్చింది. ఆమె కంఠస్వరంలో ఒక విధమైన గర్వం తల్లికి ద్యోతకమైంది.

తల్లి మళ్లీ ఆమెకేసి ఒక్కసారి దృష్టి సారించి తలవంచుకుని:

"రీబిన్‌కి ఈమె నచ్చదు" అనుకుంది.

వాళ్లిద్దరూ చరచర అడుగులేశారు. కాని తొందరపాటేమీ లేకుండా, చల్ల గాలి పీలుస్తూ

నడక సాగించారు. తల్లి తను యాత్రకెడుతున్నానని ఊహించుకుంది. తన చిన్న నాటి సంఘటన నొకదాన్ని సంతోషంతో జ్ఞప్తికి తెచ్చుకుంది. తన ఊరికి దూరంగా ఉన్న ఒక గ్రామంలో, ఒక మఠంలో అద్భుతచర్యలు చేసే విగ్రహ మొకటుండేది. ఆ మఠంలో కలవు రోజున జరిగే ప్రార్థనలకు హాజరుకావడానికి తను నడచి వెళ్లిన సంగతి స్మరణకు వచ్చింది.

ఒక్కొక్కప్పుడు సోఫ్యా, ఆకాశాన్ని గురించో, ప్రేమను గురించో, మృదుమధుర స్వరంలో ఒక కొత్త పాటను పాడుతుండేది. ఇంకొకప్పుడు ఆమె పొలాలను గురించీ, అడవు లను గురించీ, వోల్గనదిని గురించీ పద్యాలు చదువుతుండేది. తల్లి వాటిని వింటూ చిరునవ్వు నవ్వుతుండేది. అప్రయత్నంగా ఆ కవితామాధుర్యానికి మైమరచిపోయి పద్యానికి లయగా తలూపేది.

తల్లి లోలోపల ఆలోచిస్తూ ఎంతో ప్రశాంతతనూ, సంతుష్టినీ పొందింది. వేసవి సాయంసమయంలో, చిన్న తోటలో హాయిగా ఒక మూలగా కూచున్నట్లనిపించింది.

## 5

మూడవ నాడు వాళ్లు తమ గమ్యస్థానాన్ని చేరుకున్నారు. తల్లి పొలంలో పనిచేస్తున్న ఒక రైతుని, తారు పరిశ్రమ ఎక్కడుందని అడిగింది. దారి తెలుసుకుని వాళ్లొక ఏటవాలుగా ఉండే అడవి బాటవెంట దిగారు. చెట్లవేళ్లే సదుపాయమైన మెట్లుగా ఏర్పడ్డాయి. చివరకొక గుండ్రని సమ ప్రదేశానికి చేరుకున్నారు. రాతిసిబొగ్గు, చిన్నచిన్న చెక్కపేళ్లూ అక్కడ చెల్లాచెదురుగా పడున్నాయి. ప్రదేశం తారుతో అట్టలుకట్టి ఉంది.

"సరి. వచ్చేశాం!" అంది తల్లి నాలుగు వైపులా గాభరాగా పరకాయించి చూస్తూ.

కర్ర స్తంభాలతో, కొమ్మలతో ఆకులతో వేసిన ఒక పందిరి ఎదుట, మూడు బల్ల చెక్కలతో ఒక బల్ల అమారు చేయబడి వుంది. దాని దగ్గర, బొత్తాములు పెట్టుకోని తారు మరకల చొక్కాతొడుక్కున్న రీబిన్, యెఫీమ్‌తోనూ, ఇంకా ఇద్దరు కుర్రవాళ్లతోనూ కలసి మధ్యాహ్న భోజనం చేస్తున్నాడు. ఆడవాళ్లిద్దరి రాకనూ ముందుగా రీబిన్ చూశాడు. ఎండకు చెయ్యి అడ్డం పెట్టుకుని చూస్తూ మాట్లాడకుండా వాళ్ల రాక కెదురుచూశాడు.

"అన్నా! మిహాయీల్! నమస్కారం!" అని దూరాన్నుంచే తల్లి పలకరించింది.

అతడు లేచి నింపాదిగా వాళ్ల కెదురెళ్లేడు. ఆమెను గుర్తుపట్టడంతోనే ఆగి, నల్ల బారిన చేత్తో గడ్డం సవరించుకుంటూ చిరునవ్వు నవ్వేడు.

తల్లి దగ్గరకొస్తూ:

"మేము యాత్రకు బయలుదేరేం. ఈమె నా స్నేహితురాలు. పేరు అన్నా. మీదగ్గర కొచ్చి మీరెలా ఉన్నారో చూసిపోదామని వచ్చాను."

తన సమయస్ఫూర్తికి గర్వపడుతూ, ఓరకంటితో చాలా తీవ్రంగానూ, కఠినంగానూ ఉన్న సోఫ్యా ముఖంకేసి చూసింది.

"ఏమమ్మా! క్షేమంగా ఉన్నావా?" అని రీబిన్ కరచాలనం చేస్తూ వంకర నవ్వు నవ్వేడు. సోఫ్యాకు వంగి నమస్కారం చేశాడు. "ఇది నగరం కాదు — అబద్ధాలాడక్కర్లేదులే. ఇక్కడున్న వాళ్లంతా మనవాళ్లే" అన్నాడు.

యెఫీమ్ బల్లమీద కూర్చున్న చోటునుంచి కదలకుండానే, యాత్రికులను పరిశీలించాడు. పక్కనున్న స్నేహితుల చెవిలో గుసగుసలాడేడు. ఆ స్త్రీలిద్దరూ దగ్గరకు రావడంతోనే లేచి మౌనంగా వంగి నమస్కారం చేశాడు. అతడి పక్కనున్న మిత్రులు ఈ అతిధుల సంగతేమీ పట్టించుకోనట్లుగా కదలకుండా కూచున్నారు.

రీబిన్ తల్లి భుజాన్ని మెల్లగా తట్టుతూ,

"ఇక్కడ మేము సన్యాసుల్లాగ జీవిస్తున్నాం. మా దగ్గర కొచ్చి మమ్మల్ని పలకరించేవాళ్లెవరూ లేరు. మా యజమాని ఊళ్లో లేడు. అతడి భార్య ఆస్పత్రిలో ఉంది. దాదాపుగా యిదంతా ప్రస్తుతం నా అదుపులోనే వుంది. కూచోండి. బహుశా తినడానికేమైనా కావాలనుకుంటాను. యెఫీమ్! కొంచెం పాలు పట్టుకురా!"

యెఫీమ్ పందిట్లో కెళ్లేడు. యాత్రికులు వీపులమీదనున్న సంచులు కిందపెట్టేరు. పొడుగ్గా పల్చగా ఉన్న కుర్రవాడొకడు లేచి వాళ్లకు సాయంచేశాడు. లావుగా చిరాకుగా ఉన్న రెండోవాడు మాత్రం మోచేతులు బల్లమీద పెట్టుకుని తల గోక్కుంటూ కూనిరాగం తీస్తూ, వాళ్లని పరిశీలనగా చూస్తూ కూచున్నాడు.

తారు ఘాటులోనూ కుళ్లిపోయిన ఆకుల దుర్వాసనలోనూ అతిధుల తలలు దిమ్మెక్కిపోయాయి.

"ఇతని పేరు యాకొవ్. అతను ఇగ్నాతియ్" అని వరుసగా పొడుగాటి పిల్లవాడినీ, లావుపాటి అతన్నీ రీబిన్ పరిచయం చేశాడు. "సరి, మీ అబ్బాయి ఎలా ఉన్నాడు?" అని అడిగేడు.

"అతను జైల్లో ఉన్నాడు" అని తల్లి నిట్టూర్చింది.

"మళ్లీనా? అదే బాగుంది కాబోలు" అని ఆశ్చర్యపడ్డాడు.

ఇగ్నాతియ్ పాట కట్టిపెట్టేడు. యాకొవ్ తల్లి చేతుల్లోని కర్ర అందుకున్నాడు. "కూర్చో" అన్నాడు.

"అలా నిలబడున్నారేమిటి? కూర్చోండి" అన్నాడు రీబిన్ సోఫ్యాతో. ఒక మోడుమీద ఆమె కూర్చుని రీబిన్‌ను శ్రద్ధగా పరిశీలించింది.

రీబిన్ తల్లి కెదురుగా కూర్చుని తలవంకిస్తూ,

''అతన్నెప్పుడు పట్టుకున్నారేమిటి? పిలొవ్నా నువ్వు దురదృష్టవంతురాలివిసుమా!'' అన్నాడు.

''అదేంలేదు!'' అంది ఆమె.

''నువ్వు అలవాటు పడినట్లుంది. ఔనా?''

''నా కలవాటు కాలేదు. కాని మనం చేసేదేముంది, తప్పని సరి.''

''ఊహూ! ఆ సంగతేమిటో మాకు చెప్పు.''

యెఫీమ్ ఒక జాడీతో పాలు పట్టుకొచ్చాడు. బల్లమీదనున్న కప్పు తీసి అందులో పాలు పోసి సోఫ్యా కందిచ్చాడు. ఆ పని చేస్తూనే ఏమీ చెప్పడు కాకుండా తల్లి చెపుతున్న కథను శ్రద్ధగా విన్నాడు. తల్లి ముక్తసరిగా తన కథంతా చెప్పిన తర్వాత, ఒక్క క్షణం పాటు ఎవరూ నోరు మెదపలేదు. ఒకళ్లకేసి ఇంకొకళ్లు చూడలేదు. ఇగ్నాతియ్ బల్ల దగ్గరే కూచుని బల్లమీద గోళ్లతో బొమ్మలేశాడు. యెఫీమ్, రీబిన్ వెనకాల అతడి భుజంమీద మోచే యానించి నిలబడ్డాడు. యాకొవ్ చేతులు కట్టుకుని తలవంచుకుని చెట్టు మొదలు కాను కున్నాడు. సోఫ్యా ఈ రైతులను కనుబొమల సందులోంచి పరీక్షగా చూస్తూ కూచుంది.

''ఊహూ. అదల్లా జరిగిందన్నమాట. బహిరంగంగా!...'' అని నెమ్మదిగా నిరుత్సాహంగా అన్నాడు రీబిన్.

''మనమే అలాటి ఊరేగింపు నెప్పుడైనా జరిపితేనా, రైతులు మనల్ని కొట్టి చంపుతారు'' అని ముసిముసి నవ్వుతో యెఫీమ్ అన్నాడు.

''తప్పకుండా వాళ్లు చంపుతారు'' అని ఇగ్నాతియ్ తలూపేడు. ''నేను ఫ్యాక్టరీ పని లోకి పోతాను. అక్కడింతకన్న నయం.''

''పావెల్‌ను న్యాయస్థానంలో విచారణ చేస్తారంటున్నావు కదూ? ఏమి శిక్ష వేస్తారంటాన్? నువ్వేమైనా విన్నావా?'' అని రీబిన్ తల్లి నడిగేడు.

''కఠిన శిక్ష. లేకపోతే సైబీరియాకు శాశ్వత ప్రవాసం....'' అని ఆమె మెల్లగా జవాబిచ్చింది.

ఆ ముగ్గురు యువకులూ ఒక్కసారిగా ఆమెకేసి చూశారు.

రీబిన్ తలొంచుకుని,

''అతడా పని చేసినప్పుడు, దాని పర్యవసాన మేమిటో తెలుసుకున్నాడా?'' అని అడిగేడు.

''ఆ, తెలుసుకున్నాడు!'' అంది సోఫ్యా, పెద్ద గొంతుకతో.

అందరూ మౌనం వహించారు. ఈ మాటలోని భావం తెలుసుకుని గడ్డ కట్టుకుపోయి నట్లు ప్రతి ఒకరూ నిశ్చేష్టులైపోయారు.

''హుఁ!'' అంటూ రీబిన్ గంభీరంగా మాట్లాడ్డం మొదలెట్టేడు. ''అతను పర్యవసానం తెలుసుకోనిదే గుడ్డిగా దూకడు. వాకావంగతి కచ్చితంగా తెలుసు. చాలా ఆలోచనా

పరుడు. కుర్రాళ్లూ, వింటున్నారా? వాళ్లు నన్నిలతో పొడుస్తారనీ, సైబీరియాకు పంపుతారనీ అతనికి తెలుసు. అయినా అతను వెనుకంజవెయ్యలేదు. సాక్షాత్తూ తల్లి దారి కడ్డంగా పడుకున్నా, ఆమెను తొక్కుకునైనా ముందుకెళ్లేవాడే. అంతేకాదూ, నీలొవ్నా?"

"అవును. అంతే" అంది తల్లి, ఉలిక్కిపడి. ఒకసారి నిట్టూర్చి సోఫ్యా వైపు చూసింది. సోఫ్యా నిశ్శబ్దంగా ఆమె చేతిని తట్టుతూ, కనుబొమలు ముడుచుకుని రీబిన్‌కేసి చూసింది.

రీబిన్ నల్లటి కళ్లతో నెమ్మదిగా అందర్నీ చూశాడు.

"చూశారా, మనిషంటే అతను!" అన్నాడు. ఆరుగురు మనుష్యులూ మరోమారు మౌనంగా ఉండిపోయారు. బంగారురంగు పీలికల్లాగా సన్నని సూర్య కిరణాలు ప్రసరిస్తున్నాయి. ఎక్కడనుంచో ఒక కాకి కావుమంది. మే దినోత్సవం నాటి సంఘటనలు తలపుకొచ్చి తల్లి ఆందోళనపడింది. ఆమె మనసంతా పావెల్ అన్‌ద్రేయ్‌లమీదకు పోయింది. ఆ చిన్న ఖాళీ జాగాలో ఖాళీ తారుపీపాలు చెల్లాచెదురుగా పడున్నాయి, తీసేసిన చెట్టు మొదళ్లు విరజిమ్మబడున్నాయి. ఓక్ చెట్లూ, భూర్జవృక్షాలూ ఆ ప్రదేశం చుట్టూ నిశ్శబ్దంగా ఆవరించి ఉన్నాయి. వాటి వెచ్చని నల్లని నీడలు నేలమీద పడుతున్నాయి.

చెట్టు నానుకున్న యాకొవ్ గభాలున ముందుకు తోసుకుని ఓ పక్క కొచ్చాడు.

"నేనూ, యెఫీమ్ సైన్యంలో చేరితే మమ్మల్ని ఇలాంటివాళ్ల మీదకే పంపుతారు, ఔనా?" అని తల వెనక్కి వాల్చి, బిగ్గరగా అన్నాడు.

"మరెవరి మీదికి పంపుతారనుకుంటున్నావ్? మన గొంతుకను మన చేతుల్తోనే పిసుకుతారు.... అదే తమాషా!" అని రీబిన్ జవాబుచెప్పేడు.

"ఏమైనా సరే నేను సిపాయిగా చేరిపోతాను" అన్నాడు యెఫీమ్, ఖచ్చితంగా.

"నిన్నిప్పుడెవరు వద్దన్నారు? పో. చేరు!" అని ఇగ్నాతియ్ నవ్వుతూ ఇలా అన్నాడు: "నన్ను కాల్చేటప్పుడు మాత్రం నా తలకే బారు పెట్టు. ఒక్క దెబ్బతో చచ్చిపోయేటట్లు కొట్టు. కాని కుంటివాణ్ణి చేయకు."

"ఇదివరకోసారి ఆ మాట చెప్పేవు!" అని యెఫీమ్ బదులుచెప్పేడు చిరాగ్గా.

"ఒరబ్బాయిలూ! ఒక నిముష మూరుకోండి!" అని రీబిన్ చెయ్యెత్తేడు. తల్లికేసి వేలెట్టి చూపిస్తూ, "ఇదిగో ఒక స్త్రీ.... ఆమె కొడుకు బహుశా ఇక ఆమెకు దక్కడు...." అన్నాడు.

"అలా ఎందు కంటున్నావు?" అని తల్లి బాధతో అడిగింది.

"ఆ సంగతి చెప్పక తప్పదు" అని అతడు జవాబుచెప్పాడు గంభీరంగా. "అకారణంగా నీ తల నెరియకూడదు. ఆమె కొడుకును ఈవిధంగా హింసపెట్టి వాళ్లు ఆమెను చంపగలిగేరా? నీలొవ్నా, కరపత్రాలు పట్టుకొచ్చావా?"

తల్లి అతనికేసి రెప్పవాల్చకుండా చూసింది. ఒక్క క్షణం ఆగి:

"పట్టుకొచ్చాను...." అంది.

రీబిన్ పిడికిలితో బల్లమీద గుద్దేడు:

"చూశారా? నిన్ను చూడ్డంతోనే నాకా సంగతి తెలిసింది. అందుకు కాకపోతే మరెందుకు నువ్విక్కడికొస్తావ్? చూశారా? ఆమె కొడుకుని రంగంలోనుంచి వాళ్లు తప్పించారు — ఆ స్థానాన్ని అతని తల్లి ఆక్రమించింది!" అన్నాడు.

రీబిన్ పిడికిలి ఝాడించి గట్టిగా కసిగా తిట్టేడు.

తల్లి భయపడి అతని ముఖాన్ని తేరిపారజూసింది. ముఖం మారిపోయింది. పల్చబారింది. గడ్డం చింపిరిగా ఉంది. దాని కింద దవడ ఎముకలు కోసుగా కనబడ్డాయి. నీలి కళ్లలో సన్నగా ఎర్రని రక్తనాళాలు కనబడ్డాయి. చాలా కాలంనుంచి నిద్ర లేనట్లుగునడ్డాయి. ముక్కు కోసుగా వంకర తిరిగి, గద్ద ముక్కులా ఉంది. ఒకప్పుడు ఎర్రగా వుండి, యిప్పుడు తారుకొట్టుకొని నల్లబడి, తెరిచివున్న అతని చొక్కా కాలరు సందులోంచి మెడ ఎముకలగు పడుతున్నాయి. గుండెలమీద నల్లని బొచ్చు అగుపడుతోంది. స్థూలంగా అతని ఆకారం ఎప్పటికంటే విషాదసూచకంగా భోరుమంటూ ఉంది. వాచిన కళ్లలోంచి కోపాగ్నులు రగుల్కొని నల్లని అతడి ముఖాన్ని ప్రకాశింపజేశాయి. సోఫ్యా తెల్లబోయి నిశ్శబ్దంగా రైతుల ముఖాలను చూస్తూ కూచుంది. ఇగ్నాతియ్ తలూపుతూ, ఆశ్చర్యంతో ఓరచూపులు చూశాడు. యాకొవ్ పందిట్లోకెళ్లి కోపంతో పందిరి గుంజలమీద బెరడును చిన్నచిన్న ముక్కలుగా వొలుస్తూ నిలబడ్డాడు. యెఫీమ్ బల్లపక్కగా తల్లికి వెనుకగా పచార్లు చేశాడు. రీబిన్ మళ్లీ మాట్లాడ్డం మొదలెట్టేడు:

"ఈ మధ్యనే, మా జిల్లా ప్రధానాధికారి నన్ను పిలిపించి, 'తుంటరి వెధవా! మతగురువుతో ఏం చెప్పేవు?' అని అడిగేడు. దానిమీద, 'తుంటరివా! నేను చెమటోడ్చి నా బతుకు నేను బతుకుతున్నాను. నేనెవరికీ చెడుగు చెయ్యను' అని చెప్పేను. అతడు నామీద హుంకరించి, పళ్లూడేట్లు దవడమీద కొట్టేడు. మూడు రోజులు నన్ను జైల్లో పెట్టేరు. 'అయితే, సాధారణమైన జనంతో మీరిలాగే నన్న మాట, మాట్లాడేది?' అని అనుకున్నాను. 'అలాగైతే మేమిదంతా మరచిపోతామనుకోకురా మువలిదయ్యం! నేను చెయ్యకపోయినా, ఎవళ్లో ఒకళ్లు మీకో, మీ సంతతివాళ్లకో తగిన శాస్తి చేస్తారు. ఆ సంగతి గుర్తుంచుకోండి! మీ ఇనుపగోళ్లతో ప్రజల హృదయాలను మీరు దున్ని అక్కడ ద్వేషబీజం నాటేరు. కనుక పాపిష్ఠి ముండాకొడుకుల్లారా, మిమ్మల్ని జాలి తలుస్తారనుకోకండి!' అని అనుకున్నాను. అంతే మరి!"

అతని హృదయం కోపంతో తుకతుకలాడింది. ముఖం ఎర్రబారింది. అతని కంఠధ్వనులు వింటుంటే తల్లికి చాలా భయమేసింది.

"ఇంతకీ, నేను మతగురువుతో ఏం చెప్పానో తెలుసా?" అని రీబిన్ కొంచెం నిదానంగా

ఇలా అన్నాడు: "ఒక రోజున మతగురువు గ్రామమంతా తిరిగొచ్చి కొందరు రైతులతో కబుర్లు చెప్పడం మొదలెట్టేడు. మామూలు జనం ఉట్టి గొర్రెల మందల్లాంటి వాళ్లనీ, వాళ్లని కాపలా కాసే గొల్లడొకడుండాలనీ చెపుతున్నాడు. నేను వేళాకోళంగా, 'జంతువులమీద నక్కకి పెత్తనం కట్టబెడితే, అప్పుడిక ఈకలెగురుతుంటాయి కాని పశులుండవు' అన్నాను. అతను నాకేసి పొగరుగా చూసి, ప్రజలు చాలా కాలం బాధలు పడవలసి వస్తుందనీ వాటిని భరించే శక్తిని ప్రసాదించమని దేవుని ప్రార్థించాలనీ ఏమేమిటో చెప్పేడు. దానిమీద, ప్రజలు ఇప్పటికే దేవుడిని చాలా ఎక్కువగా ప్రార్థిస్తున్నారనీ, వాళ్ల మొరలు ఆలకించడానికి దేవుడికి తీరిక లేకుండా ఉందనీ చెప్పేను. ఓహో! అయితే నువ్వు దేవుడిని ఏమి ప్రార్థిస్తున్నావు అని నన్నడిగేడు. 'నేను సామాన్య జనమందరిలాగే జీవితమంతా ఒకే ప్రార్థన చేస్తున్నాను. ఓ భగవంతుడా! పెద్దమనుష్యులకోసం, రాళ్లు తిని దుంగలను మోసే సూత్రాన్ని నాకు బోధించవయ్యా' అన్నాను. పూర్తిచేసేందుకు నాకు అతడు సావకాశ మివ్వలేదు." హఠాత్తుగా రీబిన్, సోఫ్యాకేసి తిరిగి "మీరు కూడా పెద్దమనుషుల వర్గంలోని వారేనా?" అని అడిగేడు.

"పెద్దమనుషుల వర్గమనెందుకంటారు?" అని సోఫ్యా చటుక్కున ఆశ్చర్యంగా అడిగింది.

"ఎందుకంటావా?" అని రీబిన్ బునకొట్టాడు. "మీరు కూడా ఆ వర్గంలోనే జన్మించారనుకుంటున్నాను. ఎవరైనా సరే, ఏ వర్గంలో జన్మిస్తే, వాళ్ల కర్మమంతే. మీరు రైతుల్లాగ రుమాలు తలకు చుట్టుకున్నంత మాత్రాన, ధనిక వర్గాలవారి పాపాలను దాని కింద దాచగలరనుకుంటున్నారా? మతగురువును చూడ్డంతోనే, అతడు గోగుడ్డలు కట్టుకున్నా, చటుక్కున గుర్తుపడతాం. బల్లమీద చిందిన పదార్థానికి మీ మోచెయ్యి తగిలేసరికి, మీరు ఉలికిపడి ముఖం చిట్లించుకున్నారు. కూలి పనిచేసే మనుషులైతే మీ నడుమింత నిటారుగా ఉండదు" అన్నాడు రీబిన్.

అతని మోటు వెటకారంతో సోఫ్యా మనసు నెక్కడ నొప్పిస్తాడో ననే భయంతో తల్లి అతని మాటకడ్డొచ్చింది.

"మిహయీల్ ఇవానొవిచ్! ఆమె నా స్నేహితురాలు. చాలా మంచి మనిషి. మన లక్ష్యంకోసం ఆమె తల నెరిసిపోయింది. నువ్వు కొంచెం దురుసుగా మాట్లాడుతున్నావు."

రీబిన్ దీర్ఘంగా నిట్టూర్చేడు.

"నేనేమైనా దారి తప్పి మాట్లాడేనా?"

"మీరేదో నాకు చెప్పాలనుకున్నారే?" అని సోఫ్యా పొడిగా అడిగింది.

"అలాగా? అవునవును. ఈ మధ్యనే యాకొవ్ దాయాదొకడు ఇక్కడికొచ్చాడు. అతనికి క్షయవ్యాధి. అతన్ని రమ్మని కబురంపనా?"

"పోనీ, పిలవండి" అంది సోఫ్యా.

రీబిన్ కళ్లు చిట్లించి, ఆమెకేసి ఒక నిముషం చూశాడు.

"నువ్వు వెళ్లి, అతన్ని సాయంకాలం రమ్మనమని చెప్పు" అన్నాడు రీబిన్ యెఫీమ్‌తో.

యెఫీమ్ టోపీపెట్టుకుని, ఎవరికేసీ చూడకుండా, ఎవరితోనూ మాట్లాడకుండా నరాసరి అడవిలోకెళ్లేడు. రీబిన్ అతన్ని ఉద్దేశించి తల ఎగరేస్తూ:

"అతను చాలా బాధపడుతున్నాడు. యాకొవ్‌ని, అతన్నీ త్వరలో సైన్యంలోకి తీసుకుంటారు. అయితే యాకొవ్ మాత్రం వెళ్లనంటున్నాడు! ఆ పని తనకు సరిపడదంటాడు. నిజానికి యెఫీమ్‌కి కూడా అది సరిపడదు. కాని అతడు పోతానంటున్నాడు. తను సైనికుల్లో కలవరం పుట్టించగలనని అనుకుంటున్నాడు. తలకాయతో గోడను బద్దలు కొట్టడం సాధ్యంకాదని నేనంటాను.... ఏ మనిషికైనా తుపాకి చేతికిస్తే, అడుగు కలిపి ముందుకు నడుస్తాడు. ఇదీ సంగతి, యెఫీమ్ చాలా ఆవేదన పడుతున్నాడు. ఇగ్నాతియ్ అతన్ని ఉడికిస్తున్నాడు. అలా చెయ్యడంలో అర్థంలేదు."

"ఉంది. తప్పకుండా ఉంది.... వాళ్లు అతనికి సన్నిహితులవడానికి ముందు తదితరు లలాగే, అతడు వాళ్ల తరవున తుపాకులు కాలుస్తాడు" అన్నాడు ఇగ్నాతియ్, రీబిన్‌కేసి విషాదంగా చూస్తూ.

"ఆ మాట నేను నమ్మను...." అన్నాడు రీబిన్, ఆలోచిస్తూ "కాని అతడు వెళ్లక పోవడమే మంచిది. రష్యా చాలా విస్తృతమైన దేశం. వాళ్లతన్ని ఎక్కడ పట్టుకోగలరు? మారు పేరుతో ప్యాన్‌పోర్టును సంపాదించి గ్రామగ్రామమూ తిరుగుతుంటాడు...."

"నేనా పనే చేయబోతున్నాను...." అన్నాడు ఇగ్నాతియ్, కఱ్ఱ పుల్లతో తన పాదాన్ని చరుస్తూ. "ఒక సారి, వాళ్లకు వ్యతిరేకంగా పనిచెయ్యాలని మనసులో నిశ్చయం చేసుకుంటే, సూటిగా ముందుకెడుతూనే ఉండాలి."

అంతటితో ఆ సంభాషణ ఆగిపోయింది. తేనెటీగలు, కందిరీగలు బుజ్ మంటూ లేచి వాళ్ల చుట్టూ ముసిరేయి. పొలాలమీదనుంచి పాట హాయిగా వినబడింది.

రీబిన్ ఒక క్షణమాగి,

"మాకు పనిలోకెళ్లే వేళైంది. మీరు కాస్త విశ్రాంతి తీసుకోవాలనుకుంటే, తీసుకోండి. ఆ పాకలో కొన్ని బల్లకూరువులున్నాయి. యాకొవ్, వెళ్లి ఎండాకులు కాసివి పట్టుకురా. నీలొవ్నా, పుస్తకాలు మాకియ్యి" అన్నాడు.

తల్లీ, సోఫ్యా తమ మూటలు ఊడదియ్యడం మొదలెట్టేరు. రీబిన్ సంతోషంతో వాటిమీదకు వంగి ఆశ్చర్యంగా:

"చాలానే పట్టుకొచ్చారే! చాలా కాలంనుంచి ఈ పని చేస్తున్నట్లున్నారేమో కదూ?... మీ పేరేమిటన్నారు?" అని సోఫ్యా నడిగేడు.

"అన్నా ఇవానొవ్నా.... పన్నెండేళ్లుగా చేస్తున్నాను. ఎందుకలా అడుగుతున్నారు?" అని సోఫ్యా జవాబుచెప్పింది.

"ప్రత్యేకమైన కారణమేమీ లేదు. జైల్లో కెళ్లేరా?"

"వెళ్లేను."

"చూశావా? నువ్వామెతో ఎంతో దురుసుగా మాట్లాడేవు" అని తల్లి కొంచెం మందలించినట్లుగా చెప్పింది.

రీబిన్ ఒక పుస్తకాల కట్టను తీసుకుని:

"నా మాటలేమీ పట్టించుకోకండి. ధనికులూ, రైతులూ తారూ నీళ్లూ లాటివాళ్లు. వాళ్లిద్దరూ కలవరు!"

"నేనేమీ పెద్దమనుషుల వర్గానికి చెందినదాన్ని కాను.... నేను మామూలు మనిషిని" అంటూ సోఫ్యా చిరునవ్వు నవ్వి మాటకడ్డొచ్చింది.

"కావచ్చు.... కుక్కలు ఒకప్పుడు తోడేళ్లంటారు.... నేనెళ్లి ఈ సరుకును దాచేస్తాను" అని రీబిన్ జవాబిచ్చాడు.

ఇగ్నాతియ్, యాకొవ్ చేతులు చాచుకుని రీబిన్ దగ్గర కెళ్లేరు.

"మమ్మల్ని చూడనియ్యి" అన్నాడు ఇగ్నాతియ్.

"అవన్నీ ఒక రకమేనా?" అని రీబిన్ సోఫ్యా నడిగేడు.

"కాదు. కొన్ని వార్తాపత్రికలు కూడా ఉన్నాయి."

"అయితే మంచిదే!"

మగాళ్లు ముగ్గురూ పాకలో కెళ్లేరు.

రీబిన్ కేసి తల్లి ఆలోచనాపూర్వకంగా చూస్తూ:

"మనిషిలో సంచలనం కలిగింది" అంది మెల్లగా.

"అవును. నేనిదివరకెన్నడూ ఇలాటి ముఖం చూడలేదు.... ఆత్మార్పణం చెయ్యగల వీరుడు. వాళ్లేమి చేస్తారో చూడాలి. మనం కూడా లోపలికి వెడదాం" అంది సోఫ్యా.

"అతడు మోటుగా మాట్లాడితే, మీరేమీ బాధపడకండి" అంది తల్లి, మెల్లగా.

సోఫ్యా నవ్వింది.

"నీలొవ్నా! ఎంత ప్రేమమయురాలివమ్మా!"

వాళ్లు గుమ్మం దగ్గర కెళ్లేసరికి, ఇగ్నాతియ్ తలెత్తి వాళ్లకేసి చటుక్కున చూశాడు. తర్వాత తన వేళ్లతో ఉంగరాల జుట్టు సవరించుకుని, మోకాళ్లమీద వున్న పత్రికను తలొంచుకుని చూస్తున్నాడు. రీబిన్ పత్రికను చేత్తో పుచ్చుకుని పైకప్పు సందుల్లోనుంచి పడుతున్న సూర్యకిరణాల వెలుతురులో పెదవులు మెదపుతూ పత్రికను చదువుతూ,

చదువుతున్నాడు. యాకొవ్ మోకాళ్లమీద నిలబడి బల్లమీద వున్న కరపత్రాల కట్టను పరిశీలిస్తున్నాడు.

తల్లి పాకలో ఒక మూలకు చేరి కూచుంది. సోఫ్యా ఆమె భుజాలమీద చెయ్యి వేసి, వెనకాల నిలబడి, నిశ్శబ్దంగా మగవాళ్లను చూస్తోంది.

"మిహయిల్ మామా! వాళ్లు మన రైతులను తప్పుపడుతున్నారు" అన్నాడు యాకొవ్. రీబిన్ అతనికేసి చూసి నవ్వి,

"వాళ్లకు మనమంటే ఇష్టం కనుక" అన్నాడు.

ఇగ్నాతియ్ దీర్ఘంగా ఊపిరి తీసుకుని తలెత్తేడు.

"ఇక్కడేమన్నారో చూడు. 'రైతిప్పుడు మనిషిగా కనబడ్డం లేదు.' కనబడని మాట నిజమే." నిష్కపటమైన అతని ముఖం చిన్నబుచ్చుకుంది. అతనికి కష్టం తోచినట్లు కనబడింది. "సరే, కాస్సేపు నా చర్మంలోకి దూరు, నువ్వు ఎలా కనబడతావో మేం చూస్తామయ్యా, వీటుకాడా!"

"నాకు అలసటగా ఉంది. పడుకోవాలని ఉంది. ఈ వాసన నా తలకు తిక్కెత్తిస్తోంది. మరి మీ సంగతేమిటి?" అని తల్లి సోఫ్యా నడిగింది.

"నాకేమీ విశ్రాంతి అక్కర్లేదు."

తల్లి ఒక బల్లకూరపుమీద పడుకుని కునికిపాట్లు పడసాగింది. సోఫ్యా ఆమె పక్కన కూర్చుని కందిరీగలూ, తేనెటీగలూ ఆమెకు నిద్రాభంగం కలిగించకుండా వాటిని తోలుతూ, మగవాళ్లను పరిశీలిస్తోంది. ఆమె చేస్తున్న పరిచర్యకు ఆనందపడుతూ తల్లి అర్ధనిమీలిత నేత్రాలతో ఆమెను చూసింది.

రీబిన్ తల్లిని సమీపించి,

"నిద్రపోతోందా?" గుసగుసగా అడిగేడు.

"అవును."

తల్లి ముఖాన్ని మౌనంగా పరిశీలిస్తూ అతడు కాసేపలాగే నిలబడ్డాడు. పిమ్మట నిట్టూర్చి,

"బహుశా ఇలాంటి పనికి కొడుకుననుసరించిన తల్లులలో ఈమే మొదటిదేమో" అన్నాడు.

"ఆమెకు నిద్రాభంగం చెయ్యొద్దు. మనం బయటికి పోదాం" అంది సోఫ్యా.

"మేము పనిలోకి పోవాలి. మీతో మాట్లాడాలనే ఉంది. కాని సాయంత్రం మాట్లాడదాం. అబ్బాయిలూ, రండి పోదాం!"

సోఫ్యాను పాకవద్ద వదిలేసి ముగ్గురు మొగాళ్లూ బయటికి పోయారు.

"వాళ్లిద్దరూ స్నేహితులయారు. సంతోషం" అనుకుంది తల్లి.

అడవుల్లోంచి వచ్చే ఘాటైన వాసనలూ, తారు వాసనలూ పీలుస్తూ ఆమె నిద్రపోయింది.

## 6

పనిచెయ్యవలసిన సమయం ముగిసిందనే సంతోషంతో తారు పనివాళ్ళు ఇంటికి తిరిగొచ్చారు.

వాళ్ల మాటలతో తల్లికి మెలుకువ వచ్చింది. చిరునవ్వు నవ్వుతూ, ఆవులిస్తూ, పాక బయటి కొచ్చింది. వాళ్లకేసి ఆప్యాయంగా చూస్తూ,

''మీరంతా పనిచేయడం, నేను దొరసానమ్మలాగున నిద్రపోవడమూనా?'' అంది.

''దానిలో ఏమీ తప్పులేదు'' అన్నాడు రీబిన్. అలసటచేత అతడు చాలా నిదానంగా ఉన్నాడు.

''ఇగ్నాతియ్, టీ మాటేమిటి? ఇంటి పనులు చేసుకోవడంలో మేము వంతులేసుకుంటాం. ఇవ్వేళ భోజనం, టీ, వగైరాలను సప్లయి చేయడం ఇగ్నాతియ్ వంతు.''

''ఈ వేళ నా వంతును మార్చుకునే వాళ్లుంటే, నేను సిద్ధంగా ఉన్నాను!'' అన్నాడు ఇగ్నాతియ్. పొయ్యిలోకి కొమ్మలను, కర్రపేళ్లను ఏరుకొచ్చాడు.

సోఫ్యా పక్కన కూర్చున్న యెఫీమ్,

''అతిథులతో కాలక్షేపం చెయ్యాలనుకునేవాడిని నువ్వొక్కడివే కాదులే'' అన్నాడు.

''ఇగ్నాతియ్, నేను నీకు సహాయం చేస్తాను'' అన్నాడు యాకొవ్. అతడు పాకలో కెళ్లి బ్రెడ్డు పట్టుకొచ్చి ముక్కలుగా కోసి బల్లమీద పెట్టేడు.

''ఇదిగో దగ్గుతున్నాడు. వినండి!'' అన్నాడు యెఫీమ్.

రీబిన్ చెవులు నిక్క పొడుచుకుని విని తలూపేడు:

''అదిగో సాక్షి వస్తున్నాడు. నా మాట వినేవాళ్లుంటే నేనతన్ని ఊరూరా తిప్పుతాను. జనమంతా వినేలాగున ప్రతి సంతలోనూ నిలబెట్టి, మాట్లాడిస్తాను. అతనెప్పుడూ ఒకే విషయాన్ని చెపుతూ ఉంటాడు. కాని అది అందరూ విని తీరవలసిన విషయం....'' అన్నాడు సోఫ్యాతో.

సంధ్య చీకటి దట్టమైంది. నిశ్శబ్దం కూడా హెచ్చింది. సోఫ్యా, తల్లీ మగవాళ్లను పరీక్షగా చూస్తున్నారు. వాళ్లు ఏదో నెమ్మదిగా భారంగా చిత్రమైన హెచ్చరికతో అటూ ఇటూ తిరుగుతున్నారు. వాళ్లు కూడా అతిథులైన స్త్రీలను పరికిస్తున్నారు.

అడవిలోంచి పొడుగుపాటి వ్యక్తి నడుం వంచి కర్ర నూతంగా చేసుకుని అక్కడికొచ్చాడు. అతడాయాసపడుతుండడం అందరూ గమనించారు.

''నేను చేరుకున్నాను'' అంటూ ఉక్కిరిబిక్కిరై దగ్గేడు.

అతడు నేలను అంటుతుండే చిరుగుల చొక్కా తొడుక్కున్నాడు. సొట్టలుడి అణిగిపోయిన గుండ్రని టోపీకిందమంచి పసుపురంగు జుట్టు పల్చని జడలుజడలుగా బయట

కొచ్చింది, ఎముకలు కనపడుతున్న పసుపురంగు ముఖంమీద లేత గోధుమ రంగు గడ్డం గుబురుగా పెరిగింది. పెదవులు శాశ్వతంగా విప్పారిపోయాయి. నల్లని గుంటల్లోకి దిగ బడిపోయిన కనుగుడ్లు జ్వరమొచ్చినట్లుగా మిలమిల మెరుస్తున్నాయి.

రీబిన్ అతన్ని సోఫ్యాకు పరిచయం చెయ్యడంతోనే,

"మీరు పుస్తకాలు పట్టుకొచ్చారని విన్నాను" అన్నాడు.

"అవును" అంది సోఫ్యా.

"ప్రజలందరి తరఫునా కృతజ్ఞతాభివందనాలర్పిస్తున్నా. వాళ్లింకా సత్యాన్ని గుర్తించ లేరు. కాని తెలిసిన నా తోటివాడు వాళ్ల తరఫున ధన్యవాదాలర్పించాలి."

అతడు ఆయాసంచేత గబగబ ఆబతో ఊపిరి పీల్చుకున్నాడు. గొంతు లేవడం లేదు. రక్తమాంసాలెండిపోయి ఎముకలు మాత్రమే ఉన్న వేళ్లను చొక్కాకు బొత్తాములు పెట్టు కోవడానికి గుండెలమీద ఆడించాడు.

"ఇంత పొద్దు పోయాక అడవిలో వుండడం మీకు మంచిది కాదు. చెట్లవల్ల గాలి తేమతో బరువెక్కుతుంది" అంది సోఫ్యా.

"ఇక నాకు మంచిదనేదేదీ లేదు. నాకు మంచిదల్లా చావే" అని ఊపిరి బిగపట్టి జవా బుచెప్పేడు.

అతని స్వరం వింటుంటే చాలా బాధనిపించింది. అతడి శరీరం ఆపాదమస్తకం అపారమైన జాలి గొల్పింది. అందువల్ల ఏమీ ప్రయోజనం లేదని గుర్తుకు రావడంతోనే విచారకరమైన రోషం రేకెత్తింది. విరిగిపోతాయా అని భయపడుతున్నట్లుగా మోకాళ్లు వంచి నెమ్మదిగా అతడు పీపామీద కూచుని నొసటిమీది చెమటను తుడుచుకున్నాడు. అతని జుట్టు పెటపెటలాడుతూ నిర్జీవంగా వేలాడుతోంది.

నిప్పు ఒక్కసారి రగుల్కొని గుప్ మంది. పరిసరాలన్నీ ఒక్కసారి ఎగిరి గంతేసినట్లు నిపించింది. కమలిన నీడలు చరచరా అడవిలోకి లేచాయి. గుండ్రంగా ఉండే ఇగ్నాతియ్ ముఖం మంటపైన ప్రకాశించింది. మంట చల్లారింది. పొగ వాసన బయలుదేరింది. క్రమక్రమంగా ఆ బయలు జాగా అంతా చీకటైపోయింది. జబ్బుగా ఉన్న అతని మాటలు వినడానికి అందరూ మౌనం దాల్చేరు.

"జరిగిపోయిన ఒక మహా అపరాధానికి సాక్షిగా నేనిప్పటికీ జనానికుపయోగ పడగలను.... ఇప్పుడు నాకేసి చూడండి.... నా వయస్సు ఇరవైఎనిమిది ఏళ్లు మాత్రమే. కాని నేను చచ్చిపోతున్నాను! పదేళ్ల క్రిందట నేను అవలీలగా మూలుగైనా లేకుండా మూడువందల ఏభై సోలలు బరువెత్తేసేవాణ్ణి! నాలాటి బలవంతుడు సామాన్యంగా డెబ్బై ఏళ్లైనా బతకాలి. కాని నేను మరో పదేళ్లు మాత్రమే బతికేను. ఇప్పుడంతా అయిపోయింది. నా యజ మానులు నన్ను దోచేశారు.... నలభై ఏళ్ల నా జీవితాన్ని దోపిడి చేశారు.... నలభై ఏళ్లు!"

"ఆ పాటనే అతనెప్పుడూ పాడుతుంటాడు" బొంగురుగా అన్నాడు రీబిన్.

మంట మళ్లీ పైకి గుప్ మంది. ఈ సారి మునుపటికన్న జోరుగా ప్రకాశవంతంగా లేచింది. నీడలు అడవుల్లోకి పరుగులెత్తి తిరిగి వచ్చి మంట చుట్టూ వెర్రిగా నాట్యం చేస్తున్నాయి. తడి దుంగలు బుస్సుమన్నాయి, చిటపట శబ్దం చేశాయి. చెట్లమీద ఆకులు వేడిగాలికి కదలి ఆవేశంతో గుసగుసలాడుతున్నాయి. ఎరుపురంగు, పసుపురంగు మంటలు పైకి లేచి ఆడుతూ ఒకదాని నొకటి పెనవేసుకుని, నిప్పు కణాలను విరజల్లుతూ పైకి లేచాయి. మండుతున్న ఆకు ఒకటి గాలికెగిరింది. మంటలమీదనుండి పైకి లేస్తున్న నెరుసులను చూచి ఆకాశంమీద నక్షత్రాలు నవ్వుతూ, పైకి రమ్మని సౌంజ్ఞలు చేస్తున్నాయి....

"అది నా పాట కాదు. వేలాది ప్రజలు పాడే పాటే. వాళ్ల దౌర్భాగ్యం వేలాది ప్రజలకు గుణపాఠమౌతుందనే గుర్తులేకుండానే ఆ పాట పాడుతుంటారు. ఎంతమంది పనులు చేస్తున్నప్పుడు కాళ్ళూ చేతులూ విరగ్గొట్టుకుని, నిస్సహాయులై ఆకలిచేత చస్తుంటారో...." అంటూ దగ్గు తెరొచ్చి అతడు నేలమీద కొంగిపోయాడు.

యాకొవ్ ఒక జాడీతో క్వాస్*, ఒక గుత్తి తొలకరి ఉల్లిగడ్డలను తీసుకొచ్చి బల్లమీద పెట్టేడు.

"సవేలియ్, నీకు కొంచెం పాలు తెచ్చాను. ఇలారా!" అన్నాడు.

సవేలియ్ వద్దని తలూపేడు. కాని యాకొవ్ అతని చెయ్యి పట్టుకుని బల్లదగ్గరకు తీసుకొచ్చి కూచోపెట్టేడు.

"అతన్నిక్కడికెందుకు తీసుకొచ్చినట్లు? ఏ క్షణంలోనైనా అతడు చచ్చిపోవచ్చు" అని సోఫ్యా రీబిన్ నడిగింది.

"ఆ సంగతి నాకు తెలుసు. కాని ఎంతవరకూ ఓపికుంటుందో అంతవరకూ మాట్లాడ నిద్దాం.... అతని జీవితం వృథాగా పనికిమాలిన పనికి బలియైపోయింది. ఒక మంచి పనికి కొంచెమైనా ఓపిక పట్టనియ్యి. బాగానే ఉంది. అతన్ని గురించి అదుర్దా పడనక్కర్లేదు" అని జవాబుచెప్పేడు.

"మీకిది సరదాగా ఉన్నట్లుందే" అంది సోఫ్యా ఆశ్చర్యంగా.

రీబిన్ ఆమెకేసి తేరిపారజూసి చిరచిరలాడుతూ జవాబిచ్చాడు:

"పెద్దమనుషు లనిపించుకునేవాళ్లు, శిలువమీద మూలుగుతున్న జీసస్‌ను ప్రశంసించ డానికి కుతూహలపడుతుంటారు. ఇతడి దగ్గరనుండి మేము పాఠం నేర్చుకో దలచుకున్నాం. మిమ్మల్ని కూడా నేర్చుకోమంటున్నాం."

తల్లి ఒక కనుబొమ పైకెత్తి అతడికేసి చూస్తూ:

---

* క్వాస్ – ఒక రష్యన్ పానీయం. – సం.

''ఇక చాలు'' అంది.

బల్లదగ్గర కూచున్న రోగిష్టి మళ్లీ మాట్లాడ్డం మొదలెట్టేడు:

''వాళ్లు జవాన్ని పనితో చంపడమెందుకు? ఒక మనిషి ప్రాణాలను వాళ్లు హరించడ మెందుకు? నేను నెఫేదొవ్ ఫ్యాక్టరీలో పనిచేశాను. మా యజమాని, ఒక నాట్యకత్తెకు బంగారపు స్నానాల తొట్టెనూ, బంగారపు మూత్ర పాత్రనూ చేయించి ఇచ్చాడు. నా బలమూ, నా జీవితం ఆ పాత్రలోకి పోయింది! నా జీవితాన్ని దాని కంకితం చేశాడన్నమాట. ఒక మనిషి నా రక్తంతో తన ఉంపుడుకత్తె నానంద పరచడానికి, పనితో నా ప్రాణం తీశాడన్నమాట! నా జీవ రక్తంతో ఆమెకొక బంగారు మూత్ర పాత్రను కొన్నాడన్నమాట!''

''భగవంతుని ఆకారంలో, ఆయన పోలికల్లో మనిషి సృష్టింపబడతాడు. మనిషికి వాళ్లు చేసే పని ఇది....'' అని యెఫీమ్ వెటకారంగా అన్నాడు.

''మనం నోరు మూసుకుని ఊరుకోకూడదు!'' అని అరచేత్తో బల్లగుద్ది రీబిన్ అన్నాడు.

''మనం సహించకూడదు!'' అన్నాడు మెల్లగా యాకొవ్.

ఇగ్నాతియ్ ఒక నవ్వు నవ్వేశాడు. ఈ ముగ్గురు యువకులూ, రీబిన్ మాట్లాడినప్పు డల్లా ఆకలిగొన్నవారిలాగ, తృప్తినెరగని ఆత్రుతతో ఆయన్ని చూస్తున్నట్లు తల్లి గ్రహిం చింది. సవేలియ్ చెప్పిన మాటలు వాళ్ల ముఖంలో ఒక చిత్రమైన హేళన భావాన్ని రేకె త్తించాయి. జబ్బుగా ఉన్న మనిషిమీద వాళ్ల కేమీ జాలి వున్నట్లు కనిపించలేదు.

తల్లి, సోఫ్యాకేసి తిరిగి,

''ఇతడు చెప్పిందంతా నిజమేనంటారా?'' అని ఆమె చెవిలో అడిగింది.

''అవును. నిజమే. మాస్కో పత్రికల్లో ఆ బహుమానాలను గురించి రాశారు కూడా'' అని సోఫ్యా బిగ్గరగా జవాబుచెప్పింది.

''కాని, నేరస్థుడిని శిక్షించడమంటూ జరగదు.... అలాంటివాడిని తప్పకుండా శిక్షించాలి. జనానికెదురుగా నిలబెట్టి వాణ్ణి ముక్కలుముక్కలు కింద కోసెయ్యాలి! వాడి కుళ్లిన మాంసాన్ని కుక్కలకెయ్యాలి! ఆహా! ఒకసారి ప్రజల్లో చైతన్యం కలిగి తిరగబడ్డా రంటే వాళ్లంతటి శిక్షా విధిస్తారు! తమకు జరిగిన అన్యాయాన్ని కడిగెయ్యడానికి జనం చాలా రక్తాన్ని కారుస్తారు! ఆ రక్తం వాళ్ల రక్తనాళాల్లోంచి కార్చినదే. ఆ రక్తం వాళ్ల స్వంతమే కనుక దాన్ని వాళ్లిష్టమొచ్చినట్లు ఉపయోగించే హక్కు వాళ్ల కుంది!'' అన్నాడు రీబిన్, బొంగురు గొంతుకతో.

''వాకు చలేస్తోంది'' అన్నాడు జబ్బు మనిషి.

యాకొవ్ అతన్ని లేవదీసి మంటదగ్గరకు తీసుకొచ్చాడు.

మంట బాగా మండుతోంది. లీలగా లేచిన వాటి నీడలు మంట చుట్టూ నృత్యం చేయగా, జ్వాలల క్రీడను మంట కనిపెట్టుతూన్నట్టనిపించింది. సవేలియ్ చెట్టు మోడు

మీద కూచుని వెటవెటలాడే అద్దంలాటి చేతులను వెష్క చేసుకున్నాడు. రీబిన్, రోగి కేసి తలూపుతూ సోఫ్యాతో ఇలా అన్నాడు:

"పుస్తకాలకన్న విస్పష్టంగా రుజావుచేస్తున్నాడు. యంత్రం మనిషిని చంపేసినా, ఒక చేతిని నరికేసినా, వాళ్లు కార్మికుడిదే తప్పంటారు. కాని వాళ్లు కార్మికుని రక్తమంతా పీల్చేసి, వాడివి చెత్త కింద పారేస్తే, దానికేమీ సమాధానమివ్వనక్కర్లేదు. ఒక్కసారిగా మనిషిని హత్యచేయడమంటే నాకర్థమవుతుంది. కాని కేవలం సరదాకోసం, ఒక మనిషిని చచ్చేదాకా హింసపెట్టడ మెందుకో నా కర్థం కాదు. జనాన్ని వాళ్లెందుకిలా హింసపెడతారు? మన్నందరినీ ఎందుకీ హింసపెట్టడం? ఉత్తి తమాషాకి. కేవలం వాళ్ల ఆనందంకోసం. మానవ రక్తంతో ఏమి కావలిస్తే దాన్ని కొనుక్కునేటందుకు. నటీమణులు, పందెపు గుర్రాలు, వెండి కత్తులు, బంగారపు పళ్లేలు, వాళ్ల పిల్లలకు విలువైన ఆటవస్తువులు వగైరాలన్నీ కొనుక్కునేటందుకు. యజమాని, 'బాగా పనిచెయ్యండి. కష్టపడి పనిచెయ్యండి. మీ కష్టంలోంచి నేను బాగా డబ్బు సంపాదించి నా ఉంపుడుకత్తెకు బంగారపు మూత్ర పాత్రను కొంటాను!' అంటాడు."

తల్లి అతనికేసి చూస్తూ ఆ మాటలు వింటుంటే, ఆ చీకట్లో పావెల్, అతని సహచరులూ అవలంబించిన వెలుగు బాట ఆమెకు మెరుస్తూ కనబడింది.

రాత్రి భోజనం చేసినతర్వాత అందరూ మంటచుట్టూ కూచున్నారు. మంటలు దుంగలను ఆవురావురని దహించేస్తున్నాయి. వాటి వెనకనుంచి అడవినీ, ఆకాశాన్నీ మరుగు పరుస్తూ చీకటి తెరకమ్మింది. రోగి బాగా కళ్లు తెరుచుకుని మంటకేసి రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు. నిర్విరామంగా దగ్గుతున్నాడు. జబ్బుచే శుష్కించిపోయిన శరీరంలోనుంచి అతడి ప్రాణం తప్పించుకుపోడానికి గిజగిజలాడుతున్నట్లుగా వణికిపోతున్నాడు. మంటల వెలుగు నిర్జీవమైన అతని చర్మంమీద పడినా దాన్ని చైతన్యవంతం చెయ్యలేక పోయింది. ఆరిపోవడానికి సిద్ధంగా ఉన్న మంటలాగ అతడి కళ్లు మాత్రం ప్రకాశించాయి.

యాకొవ్ అతన్ని సమీపించి, అతనిమీద వంగి,

"సవేలియ్, నువ్వు పాకలో కెళ్లడం మంచిదేమో?" అడిగాడు.

జబ్బు మనిషి చాలా ప్రయాసపడుతూ,

"ఎందుకూ? నేనెంతో సేపు మనుషుల మధ్య ఉండను!" అన్నాడు.

అతడు నాలుగు మూలలా చూశాడు. ఒక క్షణమాగి పాలిపోయిన చిరునవ్వొకటి నవ్వేడు.

"మీతో ఉండడం మంచిది. మిమ్మల్ని చూస్తుంటే, మనుషులను దోపిడిచేసి చంపిన దురాశాపరులమీద కసితీర్చుకుంటారని ఆశపడుతుంటాను" అన్నాడు.

ఎవరూ అతనికి బదులుచెప్పలేదు. కొద్ది క్షణాల్లో అతడు నిద్రపోయాడు. తల గుండెలమీదకు నిర్జీవంగా వాల్చేశాడు. రీబిన్ అతనికేసి చూస్తూ మెల్లగా ఇలా అన్నాడు:

''రోజూ ఇతనిక్కడకొచ్చి కూచుని ఎప్పుడూ ఒకే సంగతి మాట్లాడుతూవుంటాడు. ఈ మోసం గురించే. అతని ఆత్మంతా దీనితోనే నిండిపోయివుంది. మరొకటేమీ చూడ లేడు. అదొక్కటే అతని కంటికి కట్టినట్లుంటుంది.''

''అతను మరొకటేమి చూడాలి?... యజమానులు, రకరకాలైన తమ విలాసాలకు తగలెయ్యడానికి, వేలాది ప్రజలను పనితో చంపేస్తూంటే, చూడ్డానికి మరేముంది?'' అని ఆలోచనాపూర్వకంగా అంది తల్లి.

''అతడు అదేపనిగా చెప్తుంటే వినడానికి వినుగ్గా ఉంటుంది. ఒక్కసారి వింటే దాన్ని మరచిపోలేవు. కాని, ఎప్పుడూ అతడా పాటే పాడుతుంటాడు'' అన్నాడు ఇగ్నాతియ్.

''అతడి జీవితమంతా ఆ రాగంలోనే మడదొక్కేడు.... మన మా సంగతి తెలును కోవాలి. నేను అతని కథ పన్నెండు మాట్లయినా విన్నాను. అయినప్పటికీ ఒక్కొక్కప్పుడు నాకింకా అనుమానాలుంటూనే ఉన్నాయి. జనమంతా మూర్ఖులూ, పనికి రానివాళ్లూ కారని అనుకునే మంచి సమయాలు కొన్ని ఉన్నాయి. పేదలనూ, ధనికులనూ కూడా సమా నంగా ప్రేమించిన ఘడియలు కొన్ని ఉంటాయి. ధనికులు కూడా తప్పు మార్గానికి తరుమ బడతారు! కొందరు అక్కరకొదీ గుడ్డివాళ్లవుతారు. మరికొందరు ఆశకొదీ గుడ్డివాళ్లవు తారు — అదీ సంగతి! 'అహో, అంతా మంచివాళ్లే. అందరూ మన సోదరులే. కనుక ఓ సత్పు రుషులారా, న్యాయ మాలోచించండి. మీ స్వార్థంకోసం చూసుకోకండి!' అని అనుకుంటూ ఉంటాం.''

జబ్బు మనిషి ఊగిసలాడి కళ్లు తెరిచి చూశాడు. అక్కడే నేలమీద పడుకున్నాడు. యాకొవ్ నిశ్శబ్దంగా పాకలోకి వెళ్లి, ఒక గొర్రెతోలు కోటు తెచ్చి, తన దాయాదిమీద కప్పేడు. పిమ్మట, మళ్లీ సోఫ్యా పక్కనే కూర్చున్నాడు.

మంటలు ఎగిరి గంతులేస్తూ నవ్వుతూన్న చిరునవ్వు చుట్టూ కూచున్న జనం ముఖాలను ప్రకాశింపచేసింది. ఆలోచనాపూర్వకమైన వాళ్ల కంఠస్వరాలు అగ్ని జ్వాలల మెల్లని చిటపట రెపరెప ధ్వనులలో మిళితమైపోయాయి.

ప్రపంచంలోని సామాన్య ప్రజలు తమ జీవితంకోసం సాగించిన పోరాటాలను గురించి వాళ్లకు సోఫ్యా విశదంగా చెప్పింది. చాలా కాలంకింద జర్మనీ దేశంలో రైతుల తిరుగుబాటును గురించీ, ఐర్లండులోని ప్రజల కడగళ్లను గురించీ, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం ఫ్రెంచి దేశపు కార్మికులు సలిపిన అనేక పోరాటాలను గురించీ ఆమె చెప్పింది....

నిశిరాత్రి వర్ణపు ముఖములు వలువలు ధరించిన ఈ అడవిలో చెట్లే గోడలుగా ఉన్న చిన్న ఆవరణలో, అర్ధరాత్రి వేళ ఆకాశమే ఆచ్ఛాదనగా, చలిమంటల వెల్తురులో వికృష్టులైన ధనికుల ప్రపంచాన్ని కదలించిన అపూర్వ సంఘటనల చరిత్ర చెప్పబడింది. సత్యంకోసం, స్వేచ్ఛకోసం పోరాడిన వీరుల పేర్లు స్మరింపబడ్డాయి. పోరాటాల్లో అలసిపోయి,

రక్తసిక్తమైన శరీరాలతో, అనేక దేశాలకు చెందిన ప్రజలు ఒకరి వెంట ఒకరు ఎదుటనుంచి సాగిపోయారు.

సోఫ్యా బొంగురు గొంతుక సన్నగిలింది. ఆమె కంఠధ్వని ఎక్కడో గతంలోంచి వచ్చి, ఇతర దేశాల్లోని తమ సోదరుల విషాద గాథలను మౌనంగా వింటున్న ఈ మనుషుల హృదయాల్లో ఆశనూ, విశ్వాసాన్నీ రగుల్కొల్పింది. తెల్లగా చిక్కి ఉన్న సోఫ్యా ముఖంకేసి వాళ్ళు రెప్ప వాల్చకుండా చూస్తుంటే, స్వేచ్ఛకోసం ప్రపంచంలోని ప్రజలంతా సాగిస్తున్న అనంతమైన పోరాటంయొక్క పవిత్రతను వారు స్పష్టంగా తెలుసుకోగలిగేరు. ఎప్పుడో పూర్వకాలపు చరిత్రయొక్క చీకట్లలో లీనమైపోయిన అజ్ఞాతజాతుల ఆశలకూ, లక్ష్యాలకూ, నేడు తమ కలలకూ లక్ష్యాలకూ ఏమీ తేడాలేదని వారు తెలుసుకున్నారు. వాళ్ల హృదయాలతోనూ, మనసులతోనూ మహిశాలమైన ఈ ప్రపంచాన్నంతా చుట్టివచ్చారు. భూమిమీద న్యాయాన్ని స్థాపించడంకోసం దృఢనిశ్చయం చేసుకుని సంఘటితులైన మిత్రుల నెందరినో వారు పరిచయంచేసుకున్నారు. ఆ మిత్రులు ఉత్తమ జీవిత విధానాన్ని స్థాపించేటందుకు తాము తీసుకున్న ప్రతిజ్ఞను తాము ఓర్చిన బాధలతోనూ, కార్చిన రక్తంతోనూ పునీతం చేశారు. ప్రపంచంలోని ప్రజలంతా ఒకటే అనే హార్దికమైన ఐక్యతాభావం వారిలో రగుల్కొంది. ప్రపంచానికే కొత్త హృదయం ఆవిర్భవించింది. సర్వవిషయాలనూ తెలుసుకోవాలనీ, వాటి నన్నిటినీ ఆకళింపుచేసుకోవాలనీ ఒక గాఢమైన కోరికతో ఆ హృదయం స్పందించింది.

"అన్ని దేశాల్లోని కార్మికులూ తలెత్తి 'ఇక చాలు! ఈ జీవితంతో మాకు మొహం మొత్తిపోయింది!' అని గట్టిగా చెప్పే రోజు అచిరకాలంలోనే వస్తుంది. అప్పుడు కేవలం తమ దురాశే తమ ఆయుధంగా కల్గిన వారి బలం కుంగిపోతుంది. వాళ్ల కాళ్లకిందనున్న మట్టి జారిపోతుంది. వాళ్ళు పట్టుకొమ్మనేది లేకుండా నిరాధారులైపోతారు" అని సోఫ్యా విశ్వాసంతో ఉద్ఘాటించింది.

"నిజం. అలాగే జరుగుతుంది! స్వార్థమనేది చూసుకోకుండా, మనకున్నదంతా సమర్పించిననాడు, మనం సాధించలేనిదేదీ ఉండదు!" అని తలవంచి అన్నాడు రీబిన్.

తల్లి కనుబొమలు పైకెత్తి, చిరునవ్వు నవ్వుతూ ఈ సంభాషణను వింది. సోఫ్యా ఈ కథలన్నీ చెప్పేటప్పుడు, దురుసుగా ఉన్నదనీ, బిగ్గరగా చెపుతోందనీ, విచక్షణా రహితంగా విసిరేస్తున్నదనీ తాననుకున్న భావాలన్నీ ఏమ్యమైపోయాయి. ఆమె సాఫీగా చెప్పిన ఆ కథకు ఆ భావాలన్నీ సరిపోయాయనుకుంది. రాత్రి ప్రశాంతత, చలిమంట జ్వాలల నాట్యాలు, సోఫ్యా ముఖం అన్నీ ఆమెకు బాగా నచ్చాయి. అన్నిటికన్న రైతు యువకుల శ్రద్ధాసక్తులు ఆమెకు చాలా సంతుష్టిని కలిగించాయి. ధారావాహినిగా ఆమె చెప్పే కథను మాట్లాడకుండా, కదలకుండా వాళ్ళు విన్నారు. ఆమె మాటకడ్డొస్తే, నిఖిలప్రపంచానికీ వారిని లంకెవేసే తాడు తెగిపోతుందేమోనని వాళ్ళు భయపడ్డట్టున్నారు. మధ్యమధ్య వాళ్లలో ఒకడు లేచివెళ్ళి

ఒక దుంగను మంటకు తగిలిస్తుండేవాడు. నెరుసులు, పొగ ఆడవాళ్లమీదకు వెళ్లకుండా చేత్తో తోసేస్తూవుండేవాడు.

ఒకసారి యాకొవ్ లేచి:

''ఒక నిముషం....'' అన్నాడు మెల్లగా.

పాకలోకి పరుగెత్తి వెళ్లి రగ్గులు పట్టుకొచ్చాడు. అతనూ, ఇగ్నాతియ్ వాటిని అతిధుల భుజాలమీదా మోకాళ్లమీదా కప్పేరు. సిమ్మట సోఫ్యా విజయోత్సవం చేసే రోజును గురించి చక్కగా వర్ణించడం మొదలెట్టింది. తద్వారా శ్రోతలకు తమ శక్తియందు విశ్వాసాన్ని రగుల్కొలిపింది. ప్రపంచమంతటిలోనూ, అంతులేని ధనికుల మూర్ఖపు కోర్కెల సంతృప్తికోసం వృథాగా తమ శరీరాలను కష్టపెట్టి ప్రాణాలర్పించే జనానికీ తమకూ ఉండే సన్నిహిత సంబంధాన్ని వారు తెలుసుకునేటట్లు చేసింది. సోఫ్యా మాటలవల్ల తల్లికేమీ అలజడి కలగలేదు. కాని, రోజా వారి కాయకష్ట శృంఖలాబద్ధులైన జనానికి, తమ ప్రాణాలకు తెగించి, ప్రేమ, సత్యము, విజాయితీ వంటి అపూర్వమైన బహుమానాల నందిచ్చే వారిపట్ల కృతజ్ఞతాపూర్వకమైన సోదరభావాన్ని కలిగించాయి.

''భగవంతుడు వాళ్లననుగ్రహించుమగాక!'' అనుకుంటూ కళ్లు మూసుకుంది.

అరుణోదయమవుతుంటే, అలసట చెందిన సోఫ్యా తనచుట్టూ ఆలోచనలతో వికసించిన ముఖాలకేసి నవ్వుతూ చూసి తన కథను ముగించింది.

''ఇక మనం వెళ్లాలి'' అంది తల్లి.

''అవును'' జవాబుచెప్పింది సోఫ్యా.

ఒక కుర్రవాడు నిట్టూర్పు విడిచాడు.

''మీరు వెళ్లిపోవలసిరావడం చాలా బాధగా ఉంది.... మీరు చెప్పే మాటలు వింటుంటే బాగా ఉంది. ప్రజలంతా ఒకటేనవే భావం వాళ్లకు కలిగించడం చాలా గొప్ప సంగతి! మనం చేస్తున్న పనినే లక్షలాది ప్రజలు చేయదలచుకున్నారని తెలిస్తే, నీ హృదయానికెంతో దయ కలుగుతుంది. మరి దయ చాలా బ్రహ్మాండమైన శక్తి కదా!'' అన్నాడు రీబిన్ మెత్తని స్వరంతో.

''ఎదటివాడు నీ షిరమీద తన్నడానికి సీలుగా దయ చూపించవలసిందే'' అని యెఫీమ్ నవ్వుతూ లేచి అన్నాడు. ''మిహాయీల్ మామా, ఎవరూ చూడకముందే వాళ్లని పంపేయడం మంచిది. మనం ఈ పుస్తకాలను పంచిపెట్టడం ప్రారంభించగానే, వాటి నెవరు పట్టుకొచ్చారనే ఆరా తియ్యక మానరు. 'వాళ్ల దగ్గర కొచ్చిన యాత్రికుల సంగతి కను క్కోండి!' అని ఎవరో ఒక రనకమానేరు.''

రీబిన్ అతని మాటకడ్డొచ్చి,

''ధన్యవాదాలమ్మా! నువ్వు చాలా శ్రమపడ్డావు. నిన్ను చూసినప్పుడల్లా నాకు పావెల్ జ్ఞాపకమొస్తాడు. ఎంత మంచిపని చేస్తున్నావమ్మా!'' అన్నాడు.

రీబిన్ ఇప్పుడు చాలా నెమ్మదిగా ఉన్నాడు. కులాసాగా చిరునవ్వు నవ్వుతున్నాడు. చలి గాలేస్తున్నది కాని అతను చొక్కాకు బొత్తాములు పెట్టుకోకుండా కోటేసుకోకుండా అలాగే నిలబడున్నాడు. తల్లి అతని దృఢమైన శరీరాన్ని చూసి ఆనందించింది.

''చలిగా ఉంది. ఏదైనా కప్పుకో'' అంది నెమ్మదిగా.

''నాకు లోపల వెచ్చగా ఉంది'' అని అతడు జవాబుచెప్పేడు.

కుర్రవాళ్ళు ముగ్గురూ చలిమంట దగ్గర కూచుని నెమ్మదిగా మాట్లాడుకున్నారు. వాళ్ల కాళ్లముందర జబ్బు మనిషి గొర్రెతోలు కప్పుకుని పడుకుని ఉన్నాడు. ఆకాశం వెల వెలభారింది. నీడలు ఏవ్యమైపోయాయి. సూర్యోదయాన్ని సూచిస్తూ ఆకులల్లల్లాడేయి.

రీబిన్ సోఫ్యాతో కరచాలనం చేసి,

''మరిక శలవివ్వండి'' అన్నాడు. ''పట్టణంలో మిమ్మల్ని కలుసుకోవడం ఎల్లాగ?'' అని అడిగేడు.

''నువ్వు నన్ను కలుసుకోవాలి'' అంది తల్లి.

యువకులు ముగ్గురూ లేచి వచ్చి మర్యాదగా సోఫ్యాతో కరచాలనం చేశారు. వాళ్లందరి అంతర్యాల్లోనూ ఆమెపట్ల చక్కని మైత్రీపూర్వకమైన అపూర్వానందం కలిగింది. ఈ భావమే దాని నవ్యతవల్ల వాళ్లకు తత్తరపాటు కలిగించింది. నిద్రలేని కళ్లతో బరువుగా వాళ్లు ఆమెను చిరునవ్వుతో చూశారు.

''బయల్దేరేముందు కాసిన పాలు తాగకూడదూ?'' అని యాకొవ్ అడిగేడు.

''ఏమైనా ఉన్నాయూ?'' అన్నాడు యెఫీమ్.

''లేవు. నేను ఒలకబోసేశాను'' అన్నాడు ఇగ్నాతియ్, బిడియంతో జుట్టును చేత్తో వెనక్కి దువ్వుకుంటూ.

యువకులు ముగ్గురూ నవ్వుకున్నారు.

వాళ్లు పాల సంగతి ప్రస్తావించారు. కాని తల్లి మరొక సంగతి ఆలోచిస్తోంది. తన మీదా, సోఫ్యామీదా వాళ్ల కెంత సద్భావముందా అని సంతోషిస్తోంది. సోఫ్యాక్కూడా అలాటి ఆలోచనే కలిగింది. అందువల్ల ఆమె కొంచెం కలవరపడింది. వినయంగా

''కామ్రేడ్స్, ధన్యవాదాలు'' అని మాత్రమే అనగలిగింది.

ఆ మాట యువకులకు ఒక పోటు పొడిచినట్లనిపించింది. ఒకరి ముఖాలకేసి ఒకళ్లు చూసుకున్నారు.

జబ్బు మనిషి బాధపడుతూ దగ్గేడు. చలి మంటదగ్గర నిప్పులు జ్వలించడం లేదు.

''శలవు'' అన్నారు రైతులు మెల్లగా. విషాదభరితమైన ఆ మాట వాళ్ల చెవిన పడింది.

ఆ స్త్రీలిద్దర్నూ, అరుణోదయానికి పూర్వం తెలివెలుగులో నిదానంగా అడవిదారిని పుచ్చుకున్నారు. సోఫ్యా వెనుక నడుస్తున్న తల్లి:

"ఎంత బాగా ఉందో చూశారా? కలంత చిత్రంగా ఉంది. ప్రజలకు సత్యాన్ని తెలుసుకోవాలని ఉంది అమ్మాయ్. అందుకేమీ సందేహం లేదు. ఇది చర్చిలో ఉన్నట్టు ఉంది. క్రిస్మస్ పండగకూ ఈస్టర్ పండగకూ చర్చిలో జరిగే ప్రార్థనలాగే జరుగుతోంది. ఫాదరీ ఇంకా రాడు. అంతా చీకటిగా, నిశ్శబ్దంగా, భయంగా ఉంటుంది. అయితే జనం మాత్రం ఒక్కరొక్కరే చేరుకుంటూ ఉంటారు. ఒక విగ్రహానికి ముందు ఒక కొవ్వొత్తిని వెలిగిస్తారు. మరొకచోట ఇంకొకటి వెలిగిస్తారు. అలాగే క్రమక్రమంగా చీకటి తొలగిపోతుంది. భగవంతుని గృహమంతటా వెలుగుతో నిండిపోతుంది" అంది.

సోఫ్యా పరమానంద భరితురాలై,

"అంతా నిజమేనమ్మా. ఇక్కడ దేవుని గృహమంటే ప్రపంచమంతా అని అర్థం!" అంది.

తల్లి ఆలోచనాపూర్వకంగా

"ప్రపంచమంతా!" అని రెట్టించింది."ఆ మాట చాలా సత్యం. నమ్మడానికి వీల్లేనంతటి సత్యం. అమ్మాయీ! మీరు చాలా బాగా మాట్లాడేరు. చాలా బాగా! వాళ్ళు మీరంటే ఇష్టపడరేమోనని చాలా భయపడ్డాను."

సోఫ్యా కొంచెం సేపు మౌనం దాల్చింది. చివరకు మెల్లగా నిదానంగా,

"వాళ్ళతో ఉంటే ఏ మనిషైనా చాలా నిరాడంబరంగా తయారవుతాడు" అంది.

దారిలో వాళ్ళు రీబిన్ గురించీ, జబ్బు మనిషిని గురించీ, చాలా శ్రద్ధగా విషయాలను తెలుసుకుంటూ, చిన్నచిన్న ఉపకారాలకు కూడా ఎంతో కృతజ్ఞత వెలిబుచ్చే ఆ యువకులను గురించీ మాట్లాడుకున్నారు. ఇలా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తూ పొలాల దగ్గరకు చేరుకున్నారు. సూర్యుడు పైకెక్కి వాళ్ళ కెదురయ్యాడు. సూర్యుడింకా కనిపించకుండావే ఆకాశంమీద తన గులాబిరంగు కిరణాలను విసనకర్రలా విప్పేశాడు. ఆ కిరణాలు గడ్డి పరకలమీద నున్న మంచు బిందువులమీద పడి, రంగురంగుల కణాలుగా ప్రకాశించాయి. పక్షులు మేల్కొని సంతోషకరమైన పాటలతో ప్రాతఃకాలాన్ని ఉత్తేజపరిచాయి. బలిసిన కాకులు కావుకావు మంటూ ఎగురుతున్నాయి. పసుపురంగు మామిడి పిట్ట ఈల వేసింది. సుదూర ప్రదేశాలు కొండలమీదనుండి రాత్రి తాలూకు చీకటి ముసుగులను తొలగించి ఉదయభానుని ఆహ్వానిస్తున్నాయి.

"ఒక్కొక్కప్పుడు, మనిషి మాట్లాడుతూనే ఉంటాడు. ఏదో ఒక సూక్ష్మమైన మాట చెప్పేవరకూ అతన్ని అర్థంచేసుకోవడానికి వీలుండదు. ఆ ఒక్క సూక్ష్మమైన మాటతో హఠాత్తుగా అంతా తేటతెల్లమైపోతుంది.... ఆ జబ్బు మనిషి సంగతంతే. నేను

చాలాచాలా విన్నాను. ఫ్యాక్టరీల్లోనూ, ఇతర చోట్లా కూడా కార్మికులను పనికెలా తరుముతారో నేను స్వయంగానే ఎరుగుదును. అది మీకెంతగా అలవాటై పోతుందంటే, దాని స్పృహ కూడా మీకుండదు. కాని అతను చెప్పిన సంగతులు మాత్రం చాలా దారుణంగా ఉన్నాయి. చాలా సిగ్గుచేటుగా ఉన్నాయి. ఓరి దేవుడా! వాళ్ల యజమానుల విలాసంకోసం జనం ఈవిధంగా తమ ప్రాణాలను సమర్పించడం సాధ్యమేనా? అందులో న్యాయమనేది ఎంత మాత్రమూ లేదు!'' అని ఎంతో ప్రార్థనాపూర్వకంగా తల్లి చెప్పింది.

తల్లి ఆలోచనలన్నీ ఆ మనిషి కథమీదనే లగ్నమయ్యాయి. ఇలాటి అపహాస్యకరమైన విషయాలనామె ఇదివరకెన్నో వింది. కాని మరచిపోయింది. ఈతని కథ ఆ కథలన్నిటినీ ఆలోచనలోకి తెచ్చింది.

''వాళ్లు పీకలమొయ్యా మెక్కడంవల్ల జబ్బుపడిపోతారు.... నేనొక పల్లెటూరి ఉద్యోగస్థుడి నెరుగుదును. గ్రామంలో తన గుర్రం వెడుతుంటే, రైతులంతా దానికి వంగి సలాం చెయ్యాలనేవాడు. అలా చెయ్యనివాళ్లను అరెస్టుచేయించేవాడు. అతడలా ఎందుకు చేశాడని అడిగితే, దానికేమీ సమాధానం లేదు.''

ప్రాతఃకాలమెంత నవనవలాడుతోందో, అంతటి నవనవలాడే చక్కని పాటను సోఫ్యా మధురస్వరంతో పాడటం మొదలెట్టింది.

## 7

తల్లి జీవితం ప్రశాంతంగా గడిచిపోతోంది. చిత్రమైన ఈ ప్రశాంతత ఆమెకే ఆశ్చర్యాన్ని కలిగించేది. ఆమె కొడుకు జైల్లో ఉన్నాడు. అతడికి చాలా కఠినశిక్ష విధిస్తారని ఆమెకు తెలును. అయినప్పటికీ ఆ విషయ మాలోచించేసరికి, ఆమెకు అన్‌ద్రేయ్, ఫ్యోదార్ మొదలైనవాళ్లందరూ తలపుకొచ్చేవారు. తన కొడుకూ, అతని సహచరులూ ఒక్కటిగా ఆమె కళ్ల కగుపడేవారు. అతన్ని తలచుకున్నప్పుడల్లా అప్రయత్నంగా ఆమె మనస్సు వాళ్లందరి మీదకూ పోయేది. పన్నని కిరణాలు సర్వత్రా వ్యాపించినట్టు ఆమె ఆలోచన అందరిమీదా అన్ని విషయాలమీదా ఒకే సమదృష్టితో సాగేది. అందుచేత ఆమె మనసు ఒకే ఒక విషయంమీద లగ్నంకాకుండా ఉండేది. ముఖ్యంగా తన కొడుకుమీదా అతనికి సంభవించే ప్రమాదంమీదా తదేకంగా లగ్నమయేది కాదు.

సోఫ్యా ఎక్కడికో వెళ్లిపోయి, అయిదు రోజులైనాక కేరింతాలు కొడుతూ ఇంటి కొచ్చింది. వెంటనే కొన్ని గంటలసేపట్లో వెళ్లిపోయి రెండు వారాలదాకా రాలేదు. ఆమె విశాలమైన వలయాల్లో జీవితాన్ని గడుపుతున్నట్లనిపించింది. అప్పుడప్పుడు ఆమె తమ్ముడింటి కొచ్చి ఆ ఇంటిని తన ధైర్యంతోనూ, సంగీతంతోనూ నింపుతుండేది.

తల్లికి సంగీతమంటే అభిరుచి కలిగింది. సంగీతం వింటుంటే, వెచ్చని కెరటాలామె గుండెలను తాకి, ఆమె హృదయాన్ని ఆర్ద్రంచేస్తూ మరింత లయగా కొట్టుకునేటట్లు చేస్తున్నాయనిపించింది. భూమిలో లోతుగా పాతబడిన విత్తనాలమీద బాగా నీళ్లు చల్లితే, బలంగా మొలకలెత్తినట్లు, సంగీత ప్రభావంవల్ల బ్రహ్మాండమైన ఆలోచనలు మొలకలెత్తి మాటలుగా వికసిస్తున్నాయి.

సోఫ్యా అశుభ్రతను భరించడం తల్లికి చాలా కష్టమైంది. ఇల్లంతా ఆమె బట్టలు చెత్తగా పడుండేవి. సిగరెట్టు పీకెలు, నుసీ ఎక్కడ పడితే అక్కడే ఉండేవి. అంతకన్నా కూడా సోఫ్యా ఆవేశపూరితమైన ఉపన్యాసాలను తల్లి హర్షించలేకపోయేది. నికొలాయ్ ఆత్మ విశ్వాసంతో, నిదానంగా, మృదుగాంభీర్యంతో మాట్లాడేవాడు. అంచేత ఇద్దరి పద్ధతులకే తేడా స్ఫుటంగా కనబడేది. సోఫ్యా, యువకుడుగా ఉండేవాడు పెద్దవాళ్లవలె మన్నింపబడాలని ఉబలాట పడుతూ, జనాన్ని ఆటవస్తువులుగా పరిగణించే అహంకారంగల మనిషిలాగున తల్లికి తోచింది. ఆమె కాయకష్టంయొక్క పవిత్రతను గురించి విశేషంగా మాట్లాడేది. కాని తన అపరిశుభ్రతవల్ల తల్లికి అధికంగా పని కల్పించేది. ఆమె స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను గురించి ధారాళంగా మాట్లాడేది. కాని, ఇతరులను మాట్లాడ నివ్వకుండా, అనంతమైన వాదంతో బాధపెట్టడం తల్లి కనిపెట్టింది. సోఫ్యాలో ఎన్నో పరస్పర విరుద్ధమైన లక్షణాలుండేవి. ఆ సంగతి గ్రహించి, తల్లి ఆమెతో మాట్లాడేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండేది. నికొలాయ్ యెడల ఉండేటంత అచంచలమైన ఆప్యాయత తల్లికి సోఫ్యా పట్ల ఉండేది కాదు.

నికొలాయ్ రోజూ ఒకే విధంగా నిముగుపుట్టే జీవితాన్ని గడుపుతున్నప్పటికీ, ఇతరుల కష్టసుఖాలను ఎక్కువగా ఆలోచించేవాడు. ఉదయం ఎనిమిది గంటలకు టీ తాగేవాడు. అప్పుడే వార్తాపత్రిక చదివి, తల్లికి వార్తలు తెలియచెప్పేవాడు. అతడు చెప్పే మాటలు వింటుంటే, జీవితమనే యంత్రం, నిర్దాక్షిణ్యంగా డబ్బుకోసం ప్రజలనెలా రాసి రంపాన పెడుతుందో స్పష్టంగా గ్రహించగలిగేది. నికొలాయ్‌కి అన్‌ద్రేయ్ పోలికలు చాలా ఉన్నట్లామె గమనించింది. హొహోల్‌లాగే, జనాన్ని గురించి మనసులో ఏవిధమైన ద్వేషమూ లేకుండానే, ప్రపంచంలోని బాధలన్నిటికీ ప్రజలే కారణమంటాడు. కాని నవజీవనంలో అన్‌ద్రేయ్‌కుండే విశ్వాసమంత దృఢంగానూ సుందరంగానూ నికొలాయ్‌కు లేదు. అతడెప్పుడు మాట్లాడినా కరుకుదనమూ నిజాయితీగల న్యాయాధిపతిలాగ నిశ్చలమైన కంఠస్వరంతో మాట్లాడేవాడు. చాలా భయంకరమైన విషయాలను చర్చించేటప్పుడు కూడా అతని పెదవులమీద విచారకరమైన చిరునవ్వు తొణికిసలాడేది. కళ్లలో నిశితమైన తేజస్సు ఉండేది. దాన్ని చూసి, అతడెన్నడూ ఎవరు చేసిన అపరాధాన్నీ క్షమించడనీ, క్షమించలేడనీ తల్లి గ్రహించింది. అందుకామె అతడిమీద జాలిపడింది. అతడెవరిపట్లా కఠినంగా ప్రవర్తించలేడని ఆమె తెలుసుకోవడమే అందుకు కారణం. తల్లికి అతని యెడల ఆప్యాయత రోజురోజుకీ అధికమైంది.

ప్రతి రోజూ నికొలాయ్ ఉదయం తొమ్మిది గంటలకు పనిలో కెడతాడు. అతను వెళ్ళడంతోనే తల్లి, ఇల్లంతా తుడిచి శుభ్రంచేస్తుంది. మధ్యాహ్నం వంటచేస్తుంది. తర్వాత స్నానంచేసి పరిశుభ్రమైన బట్టలు కట్టుకుని, పుస్తకాల్లో ఉన్న బొమ్మలు చూస్తూ తన గదిలో కూచుంటుంది. అప్పటికి ఆమె చదవడం నేర్చుకుంది. కాని చాలా ప్రయాస పడవలసి వచ్చేది. కాస్సేపు చదివేసరికి అలసటొచ్చి ఒక మాటకూ ఇంకొక మాటకూ సంబంధం తెలిగ్గా అర్థమయేది కాదు. అయితే, బొమ్మలు చూడ్డానికి మాత్రం చిన్న పిల్లల్లాగ సరదాపడేది. ఆ బొమ్మల్లో ఆమె కొక కొత్తదైన అద్భుత ప్రపంచం గోచరించేది. దాని యదార్థం ఆమె కర్థమైంది. ప్రకృతి సృష్టించిన రకరకాలైన అద్భుత వస్తువులు, మానవులు తమ చేతుల్తో ఉత్పత్తిచేసిన అపార సంపద, పెద్దపెద్ద నగరాలు, సుందరమైన భవనాలు, యంత్రాలు, ఓడలు, విగ్రహాలు మొదలైనవన్నీ ఆమెకు ప్రత్యక్షంగా కనబడేవి. జీవితం అనంతంగా పెరుగుతోంది. అద్భుతవిషయా లెన్నిటినో ఒకటొకటిగా ఆమెకు తెలియచెపుతోంది. జీవితం మానవునికి లభ్యమైన అమూల్య సంపద, అనంతమైన దాని సౌందర్యమూ ఆమెలో జ్ఞాన పిపాసను రేకెత్తించాయి. జంతుశాస్త్ర సంబంధమైన బొమ్మల పుస్తకాలను చూస్తూ ఉండడం ఆమె కెంతో సరదా. ఆ పుస్తకాలు విదేశీయ భాషల్లో అచ్చుపడున్నా, బొమ్మలు చూస్తుంటే, ఈ భూమియొక్క అనంత వైశాల్యమూ, సౌందర్య సంపదలూ ఆమెకు బాగా అవగాహనయేవి. ఒక రోజున నికొలాయ్‌తో,

''అబ్బ! ఈ ప్రపంచ మెంత విశాలమైనదో!'' అంది.

ఆమెకు పురుగులంటే, ముఖ్యంగా సీతాకోకచిలుకలంటే ఎంతో సరదా. ఆశ్చర్యంతో ఆ బొమ్మలన్నీ పరిశీలనగా చూసింది.

''నికొలాయ్ ఇవానొవిచ్, ఇవెంత బాగున్నాయో చూశారా? ఇలాటి సౌందర్యం ప్రతిచోటా ఎంతగా ఉందో కదా! మన కళ్ళ ముందర ఎగురుతున్నా మనకేమీ తెలియడం లేదు. మనుషులు ఊరికే పరుగులెడుతూ ఉంటారు. ఏమీ తెలుసుకోరు. ఏమీ చూడరు. వాళ్ళకందుకు తీరికా లేదు, కోరికా లేదు. ఈ భూమిమీద ఉండే ఐశ్వర్యం ఎంత గొప్పదో, ఎన్ని అద్భుత జీవాలు దానిమీద నివసిస్తున్నాయో మనం తెలుసుకుంటే ఎంత ఆనందం కలుగుతుందో? అన్ని వస్తువులూ అందరికోసమూ, ప్రతి వస్తువూ అందరికీ.... అదంతే కదూ?'' అంది తల్లి.

''అంతేనమ్మా. అవును'' అని నికొలాయ్ చిరునవ్వు నవ్వి, మరొక బొమ్మల పుస్తకం ఆమె ముందు పడేశాడు.

సాయంకాలమప్పుడు, తరుచుగా జనం అతన్ని చూడ్డానికొచ్చేవారు. అలా వచ్చే అతిథుల్లో ఒకడు, అలెక్సేయ్ వసీల్యెవిచ్. తెల్లని ముఖం, నల్లని గెడ్డం గల అందగాడు. మితభాషి, గంభీరమైన వ్యక్తి. మరొకడు రొమాన్ పెత్రోవిచ్. గుండ్రని తలకాయ,

మొటిమల ముఖం గల అతడు తరుచుగా ఏదో పొరబాటు జరిగినట్లు "అరరె...." అని నాలుక కరుచుకునేవాడు. ఇంకొకడు ఇవాన్ దనీలొవిచ్. పొట్టిగా సన్నంగా ఉండేవాడు. కోసుగెడ్డం.. గొంతుక మాత్రం పెద్దది. లొడలొడ మాట్లాడుతూ కత్తిలా చలాకీగా ఉండేవాడు. నాలుగోవాడు యెగోర్. అతడెప్పుడూ తనను చూసుకునీ, తన స్నేహితులను చూసుకునీ నవ్వుతూ ఉండేవాడు. రోజురోజూ హెచ్చవుతుండిన తన రోగాన్ని గురించి కూడా నవ్వుతుండేవాడు. వీళ్లు కాక, దూరంగా ఉండే పట్టణాలనుంచి కూడా వస్తుండేవారు. నికొలాయ్ వాళ్లతో చాలా సేపు నిదానంగా మాట్లాడుతుండేవాడు. ఎప్పుడు మాట్లాడినా విషయమొక్కటే — ప్రపంచంలోని శ్రమజీవులను గురించి. వాళ్లు చాలా ఆవేశంతో చేతులెగరేసుకుంటూ వాదిస్తుండేవాళ్లు. ఎక్కువగా టీ తాగేస్తుండేవాళ్లు. ఒక్కొక్కప్పుడు వాళ్లు మాట్లాడుతుంటే, నికొలాయ్ ప్రకటనలు రాసి వాళ్లకు చదివి వినిపించేవాడు: వాళ్లు వెంటనే వాటి నకళ్లు రాసుకునేవాళ్లు. చింపి పారేసిన ఆ ముసాయిదాల కాగితపు ముక్కలను తల్లి జాగ్రత్తగా ఏరి తగలబెట్టేది.

అతిథులకు కప్పుల్లో టీ పోస్తూ, కార్మికుల జీవితాన్ని గురించీ, కడగండ్లను గురించీ, వాళ్లకి జీవితంలోని అంతర్యాన్ని తెలియచేసి త్వరగా చైతన్యవంతులను చేసే మార్గాలను గురించీ, వాళ్లను సంఘటితపరచడం గురించీ, వాళ్లు మాట్లాడుకునే తీవ్రతను చూసీ, ఆమె ఆశ్చర్యపడుతుండేది. తరుచుగా వాళ్లు వాదించుకుంటున్నప్పుడు ఆగ్రహావేశపర వశులై ఒకళ్లపై వొకళ్లు నిందాపూర్వకమైన మాటలను దొర్లించుకునేవారు. కాని వాదన మాత్రం మానేవారు కారు.

కార్మికుల జీవితాన్ని గురించి, వాళ్లకన్న తనకే బాగా తెలుసుననుకుంది తల్లి. వాళ్లు చెయ్యదలచుకున్న పనియొక్క భారం తనకే బాగా తెలుసునని ఆమెకు తోచింది. అందుచేత ఆమె వారినొక విధమైన అనుగ్రహంతో జాలితో చూడగలిగేది. చిన్న పిల్లలు, భార్యా భర్తల సంబంధం సర్వసామ మేమిటో తెలియకుండా భార్యాభర్తల ఆట ఆడుకుంటున్నప్పుడు, పెద్దవాళ్లు విషాదంతో చూసినట్లుగా తల్లి వాళ్లను చూస్తుండేది. అప్రయత్నంగా ఆమె వాళ్ల ఉపన్యాసాలను అన్‌ద్రేయ్, పావెల్ ఇస్తూ ఉండిన ఉపన్యాసాలతో పోల్చి చూసేది. మొదట్లో తేడా తెలియకపోయినా, తర్వాత వాటిలోని భేదం ఆమె గుర్తించింది. కూలీ పేటలోని జనంకన్న ఇక్కడివాళ్లెక్కువగా అరుస్తారని ఆమెకు తోచింది.

"వీళ్లకు ఎక్కువ విషయాలు తెలుసు గనుక, బిగ్గరగా మాట్లాడతారు" అని తనలో తాను సమర్థించుకునేది.

అయితే, వీళ్లలో వీళ్లు, ఒకర్ని మించి ఇంకొకరు, తమ లక్ష్యశుద్ధిని ప్రదర్శించుకో వడంకోసం, ఈవిధంగా ఒకళ్లమీద ఒకళ్లు బుద్ధిపూర్వకంగా రెచ్చిపోతుంటారని తరుచుగా అనుకునేది. ఈ సత్యంపట్ల ఎదుటి వారికన్న తనకే ఎక్కువ గౌరవముందని రుజువు చేయాలనే

ఆవేశం వారిపి విధంగా పురిగొల్పుతోందనుకుంది. ఇందుకు కొందరికి బాధగా ఉండేది. అందుచేత వుల్లి విరిచినట్లుగా మోటు వాదనకు దిగి, కార్మికోద్యమంలోని సత్యంపట్ల తమకే ఎక్కువ ఆసక్తి ఉన్నదని వాదించేవారు. అందరూ ఒకరిని మించి ఒకరు ముందుకు గంతెయ్యాలని ఆతురత పడుతుండేవారు. అందుకామెకు చాలా విచారంగా ఉండేది.

"పిల్ల పావెల్‌ను, అతని మిత్రులనూ మరచిపోయినట్లుంది" అని వాళ్లకేసి చూస్తూ అనుకునేది. అప్పుడామె కనుబొమలు అదిరేవి. కళ్లు అర్ధిస్తున్నట్లుండేవి.

వాళ్ల వాదోపవాదాలన్నిటినీ ఆమె ఎంతో శ్రద్ధగా వినేది. కాని అవేమీ ఆమె కర్థమయేవి కావు. అయితే, వాళ్ల మాట్లాడే మాటల్లోని భావాన్ని గ్రహించడానికామె ప్రయత్నం చేసేది. ఒక్క విషయం మాత్రం ఆమెకు స్పష్టమైంది. కూలీపేటలో మంచిదనంయొక్క స్వరూపాన్ని చిత్రించేటప్పుడు దానికొక పూర్ణత్వమూ సమగ్రతా ఉన్నట్టు అంగీకరించబడేది. ఇక్కడ అది ముక్కముక్కలు చెయ్యబడుతోంది. అక్కడ భావాలు గాఢంగానూ పుష్టిగానూ ఉండేవి. ఇక్కడ బహుసునిశితంగా ఆలోచిస్తున్న కారణంచేత అవి తునకలు తునకలైపోయాయి. ఇక్కడ పాత విషయాలను విధ్వంసం చేసే ప్రస్తావన లెక్కువగా ఉన్నాయి. అక్కడ ఎక్కువగా నవ జీవనాన్ని గురించిన కలలు కంటూ ఉండేవాళ్లు. అందుచేత తన కొడుకూ, అన్‌ద్రేయ్ మాట్లాడిన మాటలామెకు మరింత ప్రీతిపాత్రమై, బాగా అవగాహనైనాయి.

నికొలాయ్‌ని చూడ్డానికెవరైనా కార్మికుడు వచ్చినప్పుడు, అతని వైఖరి చాలా స్వేచ్ఛగా పాయిలాపాయిలాగా ఉండేది. అతని ముఖంలో ఒక విధమైన మధుర భావం ద్యోతకమయేది. అతనొక అలవాటు లేని కొత్త పద్ధతిలో — కచ్చాగా, బహు అనాలోచితంగా — మాట్లాడేవాడు.

"ఎదుటివాడికి అర్థమయేటట్టు మాట్లాడ్డానికి ప్రయత్నం చేస్తున్నాడు" అని ఆమె అనుకునేది.

కాని ఈ సమాధానంతో ఆమె సంతృప్తి చెందలేదు. అతడి దగ్గర కొచ్చిన కార్మికుడు కూడా అంత సంతుష్టి పడినట్లామెకు తోచలేదు, అతనిలో ఏవో కొన్ని మినహాయింపులు, సంకోచాలూ ఉన్నట్లు ఆమె గమనించింది. అమాయిక కార్మికస్త్రీయైన తనతో మాట్లాడినంత స్వేచ్ఛగా, ధారాళంగా నికొలాయ్‌తో మాట్లాడలేకపోయేవాడు. ఒకసారి నికొలాయ్ గదిలోంచి వెళ్లిపోయాక, అక్కడ కొచ్చిన ఒక యువకుణ్ణి:

"ఎందుకలా భయపడిపోతావు? బడిపంతులు ముందు పాఠాన్ని అప్పజెప్పే పిల్లవాడివి కాదు కదా?" అని అడిగింది.

ఆ కార్మిక యువకుడి ముఖంనిండా చిరునవ్వు వెలిగింది.

"పీతలు కూడా వాటి కనువైన వాతావరణంలో లేకపోతే ఎర్రబడి పోతాయి.... ఇంతకూ, అతడు మాలాటివాడు కాదుగదా!" అన్నాడు.

అప్పుడప్పుడు సాషా వచ్చేది. చాలా సేపు ఉండేది కాదు. ముక్తసరిగా మాట్లాడేది. నవ్వూ త్రుళ్ళూ ఉండేది కాదు. వెళ్ళిపోయేటప్పుడు మాత్రం విధిగా తల్లిని పలకరించేది:

"పావెల్ మిహాయ్‌లొవిచ్ ఎలా ఉన్నాడమ్మా?"

"బాగానే ఉన్నాడు. దేవుడి దయవల్ల కులాసాగానే ఉన్నాడు."

"నేనడిగేనని చెప్పండి" అని చెప్పి సాషా వెళ్ళిపోతుండేది.

ఒకసారి తల్లి ఆమెతో పావెల్‌ను విచారణ లేకుండా చాలా కాలం నిర్బంధించారని బాధతో చెప్పింది. సాషా కనుబొమలు ముడిపడ్డాయి, వేళ్ళు అదిరేయి.

"నువ్వతడిని ప్రేమిస్తున్నావని నేనెరుగుదునమ్మాయీ" అని ఆమెతో చెప్పుదామని తల్లి ఉబలాటపడింది. కాని ఆమెకు ధైర్యం చాలింది కాదు. అమ్మాయి విషాదకరమైన ముఖం, గిట్టకరచుకున్న పెదిమలు, ముక్తసరి మాటలూ చూస్తే తల్లికి ఆమెయెడల ప్రేమ భావం స్ఫురించలేదు. సాషా చెయ్యి చాచేసరికి, తల్లి మాట్లాడకుండా ఆమె చేతిని పట్టుకుని:

"అయ్యో నా తల్లీ, ఎంత కష్టపడుతున్నావమ్మా!" అనుకుంది.

ఒకనాడు నతాషా వచ్చింది. తల్లి అక్కడుండటం చూసి ఆమె చాలా సంతోషించింది. తల్లిని ముద్దెట్టుకుని,

"మా అమ్మ చచ్చిపోయింది. వెర్రి తల్లి!" అని ఆకస్మికంగా చెప్పింది. తలూపి గభాలున కళ్ళు తుడుచుకుని చెప్పడం మొదలెట్టింది: "అయ్యో, పాపం! ఆమెకు ఏభై ఏళ్ళైనా నిండలేదు. ఇంకా చాలా కాలం బతకవలసిందే. అయితేనేమి? ఆమె బతికే బతుకుకన్న చచ్చిపోవడమే మేలనుకుంటున్నాను. ఆమె దెప్పుడూ ఒంటరి బతుకే. ఆమెను ప్రేమించే ఆప్తులెవరూ లేరు. ఎవరికీ ఆమె పనికి రాదు. మా నాన్న నిరంతరం ఆవిడ మీద కేకలేస్తూ హడలగొడుతూనే ఉండేవాడు. అలాటి బతుకూ ఒక బతుకే నంటారా? ఏదో ముందుముందు మంచి కలుగుతుందనే ఆశతో బతుకుతుంటారు. మా అమ్మకు బతికున్న కొద్దీ అవమానాలే కాని మంచి ఆశించడానికేమీ లేదు."

"మీరు చెప్పే మాట నిజమే నతాషా! ప్రజలు ఏదో ముందుముందు మేలు కలుగుతుందనే ఆశతోనే బతుకుతుంటారు. అలాటి ఆశ లేకపోతే, వాళ్ళ బతుకెందుకు?... అయితే, ఇప్పుడు మీరు ఒంటరిగానే ఉంటున్నారా?" అని అడిగింది తల్లి.

"ఆహా, ఒంటరిగానే" అంది నతాషా నువాయాసంగా.

ఒక్క క్షణమాగి, తర్వాత తల్లి చిరునవ్వు నవ్వి:

"ఏం చేస్తాం.... కాని మంచివాళ్ళెప్పుడూ చాలా కాలం ఒంటరిగా ఉండరులెండి. వాళ్ళ నెప్పుడూ ఇతరులంటిపెట్టుకునే ఉంటారు" అంది తల్లి.

# 8

నతాషా ఒక జౌళి మిల్లువారు నడిపించే పాఠశాలలో ఉపాధ్యాయినిగా చేరింది. తల్లి ఆమెకు నిషిద్ధ పుస్తకాలను, ప్రకటనలను, వార్తాపత్రికలను అందిచ్చేది.

తల్లికిదే పనైంది. ప్రతి నెలా అనేక సార్లు మారువేషాలు ధరించి, వీపున మూట పెట్టుకునో, సూట్‌కేసు చేత్తో పుచ్చుకునో రాష్ట్రమంతటా సంచారం చేసివచ్చేది. సన్యాసిని వేషం, అల్లిక వస్తువులమ్మే విక్రేత వేషం, పట్టణంలో ఉండే ధనికురాలి వేషం, దైవ భక్తురాలైన యాత్రికురాలి వేషం, మొదలైన వేషాలెన్నో ధరించింది. రైళ్లల్లో, పడవల్లో, హోటళ్లలో నిరాడంబరంగా నెమ్మదిగా ఉంటూ తోటివారిని ముందుగా పలకరించి పరిచయం చేసుకునేది. తన జీవితంలో అనేక విషయాలను స్వయంగా తెలుసుకున్న ఆత్మ విశ్వాసంతో, చనువుగా మాట్లాడే నేర్పుతో ఆమె నిర్భయంగా జనాన్ని ఆకర్షించగలిగేది.

జనంతో మాట్లాడ్డానికీ, వాళ్ల కథనూ కష్టాలూ వినడానికీ ఆమె ఎంతో కుతూహల పడుతుండేది. వాళ్ల సమస్యలేమిటో తెలుసుకోడానికాత్రుత పడేది. అసంతృప్తితో బాధ పడుతుండే వ్యక్తిని కలుసుకున్నప్పుడామెకు చాలా సంతోషం కలిగేది. అసంతృప్తి పీడితులైన వారు, ఒక పక్కనుంచి తమ ప్రారబ్ధాన్ని నిందిస్తూనే, నిష్పష్టమైన తమ ప్రశ్నలకు జవాబును కోరుతూంటారు. ఏరోజుకారోజు పొట్టపోసుకునే నిమిత్తం, మానవులు ఏవిధంగా గిజగిజలాడుతుంటారో, ఆ దృశ్యాలన్నీ ఆమె కళ్ల కగపడుతుండేవి. ఎక్కడ చూసినా, ప్రజలను మోసగించడానికి సిగ్గుబిడియాలు లేకుండా చేసే పనులు, ఏదో వంకన వాళ్లకు బాధలు కల్పించడం, వాళ్ల రక్తాన్ని పీల్చి దానిలోంచి లాభం సంపాదించే బహిరంగ ప్రయత్నాలు ఆమె కళ్ల కగపడేవి. ప్రపంచంలో సర్వ సంపదలూ సమృద్ధిగా వున్నప్పటికీ సామాన్య జనం ఏమీ దొరక్క అర్ధాకలితో బాధపడుతుండటం ఆమె చూసింది. పట్టణాల్లోని చర్చీలలో దేవుడి కక్కర్లేని వెండి బంగారాలు లెక్క లేకుండా ఉన్నా, వాటి గుమ్మాలదగ్గర ముష్టి వాళ్లు ఎవరైనా రెండు రాగి డబ్బులు పడేస్తారేమోననే ఆశతో చేతులు చాచుకుని వణుకుతూ నిలబడుంటారు. ధనంతో నిండిన చర్చీలూ, మతగురువుల బంగారపు జరీ అంచుల దుస్తులు, పేద ప్రజల గుడిసెలు, వాళ్లు ధరించే సిగ్గుచేటైన చినిగిన బట్టలూ, అన్నీ ఇదివరకూ చూసినవే. అయితే అప్పుడవన్నీ సహజంగా ఉండేవే అనుకుంది. కాని ఇప్పుడు, చర్చీలూ, వాటి వైభవమూ పేదలకు భరించరాని అగౌరవమని తెలుసుకుంది. నిజానికి భాగ్యవంతులకన్న పేదలే చర్చికెక్కువ సన్నిహితులనీ, దాని అవసరం వాళ్లకే ఎక్కువగా ఉందనీ ఆమె గ్రహించింది.

తను చూసిన బొమ్మలను బట్టీ, తను విన్న కథలను బట్టీ క్రీస్తు చాలా నిరాడంబరమైన బట్టలు ధరించేవాడనీ, పేద ప్రజలకు పరమ మిత్రుడనీ ఆమెకు తెలుసు. కాని

తను చూస్తున్న చర్చీలలో ఆయన విగ్రహం బంగారపు అలంకరణలతోనూ, పట్టు బట్టలతోనూ కనుబడుతోంది. మనశ్శాంతికోసం ఆయన దగ్గర కొచ్చిన పేద ప్రజలకు ఆ అలంకరణలు కొట్టొచ్చినట్లు పెళపెళలాడుతుంటాయి. అప్రయత్నంగా రీబిన్ చెప్పిన మాటలు ఆమెకు స్ఫురణ కొచ్చాయి:

"భగవంతుని విషయంలో కూడా వాళ్ళు మనల్ని మోసం చేశారు!"

తనకు తెలియకుండానే ఆమె ప్రార్థనలు చెయ్యడం తగ్గించింది. క్రీస్తును గురించీ, ఆయన పేరు చెప్పకుండానే, ఆయన్ను గురించి తెలుసుకుంటున్నట్లగుపడకుండానే, ఆయన సిద్ధాంతాల ప్రకారం, ఆయన మార్గంలో, ప్రపంచాన్ని పేదల రాజ్యంగా భావించి సర్వ సంపదలనూ సమంగా పంచుకుని అనుభవించాలనే భావంతో జీవిస్తున్నవారిని గురించీ విశేషంగా ఆలోచించడం మొదలెట్టింది. దీన్ని గురించి చాలా ఎక్కువగా ఆలోచించింది. ఆమె ఆలోచనలు వేరుతన్ని విస్తరించాయి. తను విన్న విషయాలనూ చూసిన సంగతులనూ బాగా ఆకళింపుచేసుకుంది. ఆ ఆలోచనలన్నీ ఒక ప్రార్థనగా వెలుగొంది, అంధకారబంధురమైన యావత్ప్రపంచాన్ని, యావత్తు జీవితాన్ని, ప్రజలందరినీ ప్రకాశింప చేశాయి. తను అనిర్దిష్టమైన ఆప్యాయతతో ప్రేమించే క్రీస్తు ఇప్పుడు మరింత ప్రేమాస్పదుడైనట్లామెకు తోచింది. ఇదివరకు ఆశ, భయమూ, సుఖమూ, దుఃఖమూ కలగాపులగంగా ఉండేవి. ఇప్పుడా క్రీస్తు మారిపోయాడు. అతడెక్కువ ఉన్నతుడయాడు. ఎక్కువ అందుబాటులో కొచ్చాడు. ఎక్కువ ప్రకాశవంతంగానూ సంతోషంగానూ ఉన్నాడు. నిజానికి, వినయం కొద్దీ, "మానవ మిత్రుడు" అన్న ఆయన పేరు చెప్పకుండా ఆయన కోసం ధారాళంగా ప్రాణాలర్పించిన వారి రక్తంతో పునీతుడై, క్రీస్తు పునర్జన్మ నెత్తేడనుకుంది. ఒక్కొక్క సారి సంచారం చేసి, తాను చూసిన విషయాలతోనూ, దారిలో విన్న మాటలతోనూ, చాలా సంతోషంతో ఉత్సాహంతో నికొలాయ్ దగ్గరికి వచ్చేది. తను తన ధర్మాన్ని నిర్వర్తించిన సంతృప్తిని పొందేది.

"ఇలా సంచారంచేసి ప్రపంచాన్ని చూడ్డం చాలా మంచిది" అని ఆమె ఒకరోజు సాయంకాలం, నికొలాయ్‌తో అంది. "అందువల్ల నీకు జీవితమంటే ఏమిటో బాగా తెలిసొస్తుంది. జీవితంలో సామాన్య ప్రజలను వెనక్కి నెట్టెయ్యడం జరుగుతోంది. జీవితాంతం వరకూ నెట్టేస్తే, వాళ్ళు అంధకారంలో పడి దేవులాడుతూ ఇదేమిటని అడుగుతుంటారు. వాళ్ళ నెందుకలా నెట్టెయ్యాలి? ఇంత ఆహారముంటుండగా వాళ్ళెందుకాకలితో బాధపడాలి? ఇంత విజ్ఞానం ఉంటుండగా వాళ్ళెందుకు అజ్ఞానంలో ఉండాలి? ధనికులు, పేదలు అనే తేడాలేమీ లేకుండా అందరినీ తన ప్రేమాస్పదులైన బిడ్డలుగానే భావించుకునే పరమ దయాళువైన భగవంతుడెక్కడున్నాడు? తమ జీవితాలను గురించి ఆలోచించుకుంటుంటే జనానికి ఆవేశం కలుగుతుంది. ఏదో ప్రతీకారం చేయకపోతే, అన్యాయం తమని తుడిచి పెట్టేస్తుందని వాళ్ళకి అనిపిస్తుంది."

ప్రజల జీవితాల్లో వాళ్లకు జరుగుతున్న అన్యాయాలను గురించి వాళ్లతో తను స్వయంగా మాట్లాడాలనే కుతూహలం అంతకంతకు తరచుగా ఆమెకు కలుగుతుండేది. ఒక్కొక్కప్పుడు ఈ కోరికను అపుకోవడం ఆమెకు చాలా కష్టమైపోయేది.

తల్లి బొమ్మల పుస్తకాలను తదేక దీక్షతో చూస్తుంటే, నికొలాయ్ నవ్వుతూ వచ్చి, ప్రపంచంలో జరిగిన ఏదో గొప్ప వింతను గురించి చెప్పేవాడు. మనిషి చెయ్యదలచుకున్న సాహసాలకామె ఆశ్చర్యచకితురాలయేది.

"అలాటి పని సాధ్యమే?" అని అనుమానంతో అడిగేది.

తాను చెప్పిన జోస్యంయొక్క సత్యాన్ని గురించి అకుంఠితమైన విశ్వాసంతో, తన సులోచనాల్లోనుంచి ఆమెను దయార్ద్ర దృష్టితో చూసి, భవిష్యత్తులో జరుగబోయే కథలను నికొలాయ్ చెపుతూ ఉండేవాడు.

"మానవుని కోరికలకు హద్దంటూ లేదు. అతని శక్తిక్కూడా అంతమంటూ లేదు. కాని ఆత్మిక సంపదను చేకూర్చుకోవడంలో మాత్రం ప్రపంచం చాలా నెమ్మదిగా నడుస్తోంది. ఎందుచేతనంటే, ఇప్పుడు స్వతంత్రంగా బతక దలచినవారంతా జ్ఞానాన్ని సంపాదించుకు నేందుకు బదులు ధనాన్ని మూటగట్టుకోవలసి వస్తోంది. ప్రజలు దురాశను వదులుకొని, నిర్బంధ శ్రమ చేయించడం మానేస్తే...."

తల్లి అతని మాటలను మొదట్లో బాగా అర్థం చేసుకోలేకపోయేది. కాని క్రమ క్రమంగా ఆ మాటలను ప్రేరేపించే నిర్మలమైన విశ్వాసాన్ని అవగాహనచేసుకుంది.

"భూమిమీద తగినంతమంది స్వేచ్ఛాజీవులు లేరు.... అదే ఇప్పుడున్న బాధ!" అన్నాడు నికొలాయ్.

ఆమె కీ మాట అర్థమైంది. దురాశనూ, ద్వేషాన్నీ జయించిన మనుషులతో ఆమెకు పరిచయమున్నది. అలాటి వాళ్లింకా చాలామంది ఉన్నట్లయితే, జీవితమింత అంధకారంగానూ, భయంకరంగానూ ఉండదని ఆమెకు తెలుసు. అది చాలా ఆర్భాటరహితంగా, తేజోవంతంగా, ఉదారంగా పరిణామం చెందుతుంది.

"మనుషులు విధిలేక క్రూరంగా ఉండవలసివస్తోంది" అన్నాడు నికొలాయ్ విషాదంగా.

ఆమె అవునన్నట్లు తలూపింది. హొహోల్ చెప్పిన మాటలామెకు జ్ఞప్తికివచ్చాయి.

## 9

ఒకరోజున, సాధారణంగా వేళ తప్పకుండా ఇంటి కొచ్చే నికొలాయ్, ఆలస్యంగా వచ్చాడు. కోటు తీసెయ్యకుండానే, బెదురుతూ చేతులు నలుపుకుంటూ:

"నీలొవ్నా, ఈవేళ మన స్నేహితుడొకడు జైలునుంచి తప్పించుకుపోయాడు.... అదెవరై ఉంటారో? నేను కనుక్కోలేకపోయాను" అన్నాడు.

తల్లి కాళ్ళ వణికాయి.

"పావెల్ అయి వుంటాడా?" అని మెల్లగా అని చతికిలపడింది.

"కావచ్చు" అని భుజాలెగరేస్తూ అతడు జవాబిచ్చాడు. "కాని అతన్ని దాచడం ఎలాగనేదే సమస్య. ఇప్పుడు అతన్నెక్కడ పట్టుకోగలం? అతడెక్కడైనా కనబడతాడేమోనని ఇంతవరకు వీధులన్నీ తిరిగేను. అది తెలివితక్కువే అనుకోండి. కాని మనమేదో చెయ్యాలి. నేను మళ్లీ బయటికి పోతున్నాను...."

"నేనూ వెడుతున్నాను" అంది తల్లి.

నికొలాయ్ తొందరగా బయటికి వెడుతూ,

"మీరు యెగోర్ దగ్గర కెళ్లి అతడి కేమైనా తెలుసునేమో కనుక్కోండి" అని సూచించేడు.

అతను వెళ్లిపోయిన తరువాత తల్లి తలమీద ఒక రుమాలు కప్పుకుని, ఎంతో ఆశతో, నడక సాగించింది. ఆమె కళ్ల ముందర ఎర్రటి మచ్చలు నాట్యం చేశాయి. దడ దడ కొట్టుకుంటూన్న గుండె ఆమెను పరుగెత్తించింది. తలొంచుకుని, చుట్టుపక్కలేమి జరుగుతోందో కూడా చూసుకోకుండా, సంభవమనుకొనే సంఘటనకోసం ఎదురుచూస్తూ ముందుకెళ్లింది.

"అతడు నాకక్కడ కనిపిస్తేనో!" అనే ఆశ ఆమెను ముందుకు తోసింది.

వాతావరణం వేడిగా ఉంది. అలసటతో ఆమె ఒగిర్చింది. యెగోర్ యింటివాటా మెట్లదగ్గర కొచ్చేసరికి ఆమె ముందుకు సాగలేకపోయింది. అక్కడ ఆగిపోయి వెనక్కు తిరిగి చటుక్కున చిన్న కేక వేసి కళ్ళ మూసుకుంది. ఆ యింటి ముందర జేబుల్లో చేతులు పెట్టుకుని నికొలాయ్ వెసొవ్ శ్చికోవ్ నిలబడినట్లామెకగుపించింది. కాని మళ్లీ చూసేసరికి అక్కడెవరూ కనబడలేదు.

"నేనలా ఊహించుకున్నాను కాబోలు" అని అనుకుంటూ మెట్లెక్కుతూ వింటోంది. దొడ్లో ఎవరివో మెల్లని అడుగుల చప్పుడు ఆమె చెవిని పడుతోంది. మెట్లెక్కి, పెద్దమెట్టు పైన ఆగి కిందకు చూసింది. తనకేసి చూసి నవ్వుతున్న స్ఫోటకం మచ్చల ముఖాన్నామె మరల చూసింది.

"నికొలాయ్! నికొలాయ్!" అని అరుస్తూ అతన్ని కలుసుకోడానికి మెట్లు గబగబ దిగింది. హృదయానికి మాత్రం ఆశాభంగంవల్ల బాధ కలిగింది.

"వెళ్ళు, వెళ్ళు!" మెల్లగా అని అతడు చెయ్యి ఊపేడు.

త్వరత్వరగా ఆమె మెట్లెక్కి యెగోర్ గదిలో ప్రవేశించింది. సోఫామీద పడుకుని ఉన్న యెగోర్‌ను చూసింది.

"నికొలాయ్ — తప్పించుకొచ్చాడు — జైల్లోంచి!" అని ఆయాసపడుతూ చెప్పింది.

యెగోర్ తలగడమీదనుంచి తలెత్తి:

"ఏ నికొలాయ్? వాళ్లిద్దరున్నారు" అని బొంగురు గొంతుకతో అడిగేడు.

"వెసొవ్ శ్చికోవ్. అతనిక్కడికే వస్తున్నాడు!"

"మంచిది!"

అదే క్షణంలో నికొలాయ్ గదిలో ప్రవేశించాడు. తలుపు గడియవేసి టోపీ తీసేసి జుట్టు సవరించుకున్నాడు. యెగోర్ మోచేతులమీద లేచి తల పంకించి:

"స్వాగతం" అన్నాడు.

నికొలాయ్ మెల్లగా నవ్వుతూ తల్లి దగ్గర కొచ్చి ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"నువ్వు నాకు కనిపించకపోతే, నేను మళ్లీ జైలుకే పోయి ఉండేవాడిని. ఈ పట్టణంలో నేనెవ్వరినీ ఎరగను. పేటలో కెడితే ఒక్క నిముషంలో పట్టేస్తారు. అంచేత వీధుల్లో తిరుగుతూ తప్పించుకు రావడం ఎంత పొరబాటాయని పశ్చాత్తాపపడుతున్నాను. హఠాత్తుగా నీలొవ్నా చరచరా నడుస్తుండడం చూశాను. వెంటనే ఆమె వెంటబడ్డాను."

"నువ్వు ఎలా పారిపోయొచ్చావ్?" అని తల్లి అడిగింది.

అతడు సోఫా అంచున వ్యాకులపడుతూ కూచుని, బుజాలు ఎగరేసి అన్నాడు:

"అనుకోకుండా ఒక సావకాశం లభించింది. నేను షికారు తిరుగుతుండగా మామూలు ఖైదీలు తమ కావలాదారుని బజాయించ మొదలెట్టారు. ఆ గార్డు ఒకప్పుడు సాయుధ పోలీసు దళంలో ఉండేవాడు. దొంగతనం చేసినందుకు అతడిని ఆ ఉద్యోగంలోంచి తొలగించారు. ఇప్పుడతను అందర్నీ రహస్యంగా కావలా కాస్తుంటాడు. ఎప్పుడూ అందరి కూపీలూ బయట పెట్టేస్తూంటాడు, ఎవరినీ ప్రశాంతంగా బ్రతక నివ్వడు. అంచేత వాళ్లు అతన్నక్కడ పట్టుకుని బాగా తన్నడం మొదలెట్టేరు. గార్డులందరూ ఈలలూదుకుంటూ అటూ ఇటూ పరుగెత్తుతుండడంచేత అంతా గోల్మాలుగా ఉంది. నేను తల పైకెత్తి చూసేసరికి గేటు తలుపులు తెరిచి ఉన్నాయి. బయట నాలుగురోడ్ల కూడలి, పట్టణం ఎదురుగా కనిపించాయి. నిద్రలోలాగున నెమ్మదిగా నడచి బయటికొచ్చి వీధిలో కొంత దూరం సాగివచ్చాక, నాకు స్పృహ వచ్చింది. ఎక్కడికెళ్లాలా అని ఆలోచించాను. తీరా వెనక్కి చూసేసరికి అప్పుడే గేటు తలుపులు మూతబడున్నాయి."

"హూం! మళ్లీ వెనక్కి వెళ్లలేకపోయావ్? మర్యాదగా గేటుతలుపు తట్టి, 'నన్ను లోపలికి రానివ్వండయ్యా! నేనొక చిన్న పొరబాటు చేశాను. క్షమించండి' అని అనలేకపోయావూ?" అన్నాడు యెగోర్.

"అవును" అని నవ్వేశాడు నికొలాయ్. "అది తెలివితక్కువే కాని, నా స్నేహితులకది సరియైనదిగా తోచదు, ఎవరికీ ఏమీ చెప్పకుండా రావడం. కాని ముందుకు నడుస్తూనే ఉన్నాను. దారిలో చిన్నపిల్ల శవంవెంట జనం ఊరేగింపుగా పోతూండటం చూశాను.

తలకాయ వంచుకుని ఎవరికేసీ చూడకుండా శవపేటిక వెనకాలే నడిచాను. శ్మశానంలో గాలి పీలుస్తూ కాస్సేపు కూచున్నాను. చటుక్కున నాకొక ఆలోచన తట్టింది...."

"ఒక్కటేనా? నీ తలలో దానికి ఇరుకైపోలేదుకదా?" అన్నాడు యెగోర్ నిట్టూరుస్తూ.

వెసొవ్ష్చికోవ్ అమాయకంగా నవ్వి తలూపేడు.

"నా తల మునుపటంత ఖాళీగా లేదయ్యోయ్! యెగోర్ ఇవానొవిచ్, నువ్వింకా జబ్బుగానే ఉన్నట్లుందే."

యెగోర్ శ్లేష్మమడ్డొచ్చి దగ్గుతూ:

"ఏం చేసేది! నీ కథ కానియ్యి" అని జవాబిచ్చాడు.

"నేను స్థానిక వస్తుప్రదర్శనశాలలో కెళ్లేను. తర్వాత ఎక్కడికెళ్లాలా అని ఆలోచించుకుంటూ, అక్కడున్న వస్తువులను చూస్తూ అటూ ఇటూ తిరిగేను. నాకు పిచ్చెత్తినట్లయింది. ఎలుగ్గొడ్డులాగున ఆకలేసింది. బయటికొచ్చి నీరసంతో వీధిలో నడుస్తున్నాను. పోలీసులు మొగంమీద కొచ్చి జనాన్ని పరీక్షగా చూస్తున్నారు. నా మొగం అలా ఉండటం చూసి నన్ను లాక్కుపోయి కోర్టు ఎదుట హాజరు పెడతారనుకున్నాను. ఇంతలో హఠాత్తుగా నిలొవ్నా కనబడింది. ఆమె గబగబా నా వైపుకే వచ్చింది. నేను పక్కకు తప్పుకుని ఆమె వెనకాల పడ్డాను. అంతే."

"నేను నిన్ను చూడనే లేదే!" అని తల్లి ఏదో పొరబాటు చేసినట్లు అంది. కొంచెం పరీక్షగా చూసిన తర్వాత వెసొవ్ష్చికోవ్ చిక్కిపోయాడని గ్రహించింది.

వెసొవ్ష్చికోవ్ తలకాయ గోక్కుంటూ,

"కామ్రేడ్లు ఆదుర్దాపడుతూంటారు...." అన్నాడు.

"మరి అధికారుల మాటేమిటి? వాళ్లను గురించి నీకు జాలెయ్యడం లేదా? వాళ్లు కూడా ఆదుర్దాపడుతూనే ఉంటారు" అన్నాడు యెగోర్. నోరు తెరుచుకుని గాలి నములుతున్నట్లు పెదవులు మెదపడం మొదలెట్టేడు. "సరే. వేళాకోళాలు కట్టిపెట్టి నిన్నెక్కడో దాచాలి. ఇది సంతోషమైన పనే కాని తేలిక మాత్రం కాదు. నేను లేవగలిగితే బాగుండును!" అని, ఆయాసపడుతూ గుండెలను అరచేతుల్తో మెల్లగా మర్దనాచేసుకున్నాడు.

నికొలాయ్ తలొంచుకుని,

"యెగోర్ ఇవానొవిచ్, నువ్వు చాలా సుస్తీగా కనబడుతున్నావు" అన్నాడు. తల్లి నిట్టూర్చి, క్రిక్కిరిసి ఉన్న ఆ చిన్న గదిని ఆత్రంగా కలచూచింది.

"అది నా స్వవిషయం" అన్నాడు యెగోర్. తల్లికేసి చూసి, "అమ్మా! ఇక ఆట్టే డాబు చెయ్యకుండా అతన్ని పావెల్ సంగతి అడగండి."

వెసొవ్ష్చికోవ్ ఇకిలించాడు.

"పావెల్ బాగానే ఉన్నాడు. ఆరోగ్యంగా ఉన్నాడు. అతను మాకందరికీ పెద్ద. అతనే

అధికారులతో మాట్లాడుతుంటాడు. పెత్తనమంతా అతనిదే. అందరూ కూడా అతన్ని గౌరవంగా చూస్తుంటారు.''

వెసొవ్‌శ్చికోవ్ మాటలు వింటూ నీలొవ్నా తలూపింది. ఓరకంటితో, యెగోర్ వాచిన ముఖంకేసి చూసింది. చిత్రంగా అతని నీలిరంగు ముఖం చదునుగా ఉంది. ఎక్కడా చలనం లేదు. భావప్రదర్శనం లేదు. కళ్లు మాత్రం చలాకీగా తేజోవంతంగా ఉన్నాయి.

''తినడానికేమైనా పెట్టండి — నాకు విపరీతంగా ఆకలేస్తోంది!'' అన్నాడు నికొలాయ్ హఠాత్తుగా.

''అమ్మా! ఆ అలమారాలో పైన కొంచెం రొట్టె ఉంటుంది.... ఆ తర్వాత సావిడిలోకి వెళ్లి, ఎడమ వైపు రెండవ తలుపు తట్టండి. ఒక ఆడమనిషి తలుపు తీస్తుంది. తినడానికేముంటే వాటిన్నిటినీ పట్టుకుని ఇక్కడికి రమ్మనండి'' అన్నాడు యెగోర్.

''అన్నీ ఎందుకు?'' అన్నాడు నికొలాయ్.

''ఎన్నో వుండవులే. బెంగెట్టుకోకు.''

తల్లి బయటికెళ్లి తలుపు తట్టింది. తలుపు తీసేలోగా,

''యెగోర్ చచ్చిపోతున్నాడు....'' అనుకుంది.

''ఎవరు వారు?'' అని గదిలోంచి ఎవరో అడిగేరు.

''యెగోర్ ఇవానొవిచ్ పంపేడు.... మిమ్మల్ని తన గదిలోకి రమ్మంటున్నాడు'' అని విదావంగా తల్లి బదులు చెప్పింది.

''ఇప్పుడే'' అని తలుపు తీయకుండానే ఆ స్త్రీ చెప్పింది. తల్లి ఒక్క క్షణమాగి మళ్లీ తలుపు తట్టింది. వెంటనే తలుపు తెరుచుకుని సులోచనాలు ధరించిన ఒక పొడుగాటి స్త్రీ సావిట్లోకొచ్చింది. తొందరగా చొక్కాచేతుల ముడతలను సాపు చేసుకుంది.

''ఏం కావాలి?'' అని కఠినంగా అడిగింది.

''యెగోర్ ఇవానొవిచ్ పంపించాడు.''

''రండి, వెళ్దాం. అయితే మిమ్మల్ని నేను ఎరుగుదుననుకుంటాను. అవునా? కులాసాగా ఉన్నారా? ఇక్కడ చీకటి'' అని ఆ స్త్రీ తల్లిని మృదువుగా పలకరించింది.

తల్లి ఆమెకేసి పరిశీలనగా చూసి, అప్పుడప్పుడామెను నికొలాయ్ ఇంటి దగ్గర చూసిన సంగతి జ్ఞాపకానికి తెచ్చుకుంది.

''పిల్లంతా మనవాళ్లే'' అనుకుంది.

ఆ స్త్రీ, నీలొవ్నాను ముందు నడిపించింది.

''అతడికేమైనా జబ్బెక్కువగా ఉందా?'' అని అడిగింది.

''అవును. పడుకునే ఉన్నాడు. తినడానికేమైనా పట్టుకురమ్మని మీతో చెప్పమన్నాడు.''

''అదేమీ అవసరం లేదు.''

వాళ్లిద్దరూ యెగోర్ గదిలో ప్రవేశించడంతోనే అతడు గురకతో ఊపిరి పీలు స్తుండడం విన్నారు.

"లుద్మిలా వసీల్యేవ్నా! నేను మా పెద్దల దగ్గరకెళ్లిపోతున్నాను. చూడండి. ఈ యువకుడు అధికారుల అనుజ్ఞ లేకుండా జైల్లోనుంచి చక్కగా నడిచి వచ్చేశాడు. ముంద తనికి తినడానికేమైనా పెట్టి, తర్వాత ఎక్కడో దాచెయ్యండి."

ఆ స్త్రీ తలూపి, చటుక్కున జబ్బు మనిషికేసి తేరిపారజూసింది.

"యెగోర్, వాళ్లు రావడంతోనే నాకు కబురు చెయ్యవలసింది" అంది. "ఇదిగో యెగోర్! మీరు రెండుపార్లు మందు పుచ్చుకోవడం మానేశారు. సిగ్గు లేదూ! అంత నిర్లక్ష్యం కూడదు! నాతో రండి. యెగోర్‌ను ఆసుపత్రికి తీసుకుపోడానికి మనుషు లొస్తున్నారు. ఏక్షణంలోనైనా వాళ్లు రావచ్చు."

"అయితే ఇంతకీ నన్ను ఆసుపత్రిలో చేర్పడానికి సంకల్పించుకున్నారన్నమాట."

"అవును. అక్కడ కూడా మీతో నేనూ ఉంటాను."

"మీరు కూడానా! అయ్యో దేవుడా!"

"తెలివితక్కువగా మాట్లాడకండి!"

మాట్లాడుతూనే ఆమె కంబళిని యెగోర్ గుండెలమీదకు లాగింది. నికొలాయ్‌ని బాగా పరిశీలించింది. మందు ఇంకా ఎంత మిగిలిందో చూడడానికి సీసాలు పైకెత్తి చూసింది. ఆమె ఒడుదుడుకులు లేకుండా మంద్రస్వరంతో మాట్లాడింది. హుందాగా సంచరించింది. ఆమె ముఖం వెలవెలబారుతోంది. నల్లని కనుబొమలు ముక్కుమొదట్లో దాదాపు కలుసు కుపోయాయి. తల్లికామె ముఖం నచ్చలేదు. కొంచెం కోపదారి ముఖంలా కనబడింది. ఆమె కళ్లలో చిరునవ్వు కాని, బెణుకుగాని కనబడలేదు. మాటలో అధికార లక్షణం కనబడుతోంది.

"ఇప్పుడు మిమ్మల్నిక్కడ వదిలేసి పోతున్నాం. కాని నేను త్వరలోనే తిరిగి వస్తాను. యెగోర్‌కు ఈ మందొక చెంచా యియ్యండి. అతన్ని మాట్లాడనివ్వకండి" అని చెప్పింది.

నికొలాయ్‌ని వెంటపెట్టుకుని ఆమె బయటికి వెళ్లిపోయింది.

యెగోర్ నిట్టూర్పి:

"బలే మంచి స్త్రీ.... అద్భుతమైన మనిషి నిజంగా!... అమ్మా, మిమ్మల్ని ఆమెకి అప్పజెప్పాలి. ఆమె ఎక్కువగా అలసిపోతోంది...." అన్నాడు.

"నువ్వు మాట్లాడకూడదు. ఈ మందు తీసుకో" అని తల్లి మెల్లగా బుజ్జగించింది.

అతడు మందు తీసుకుని ఒక కన్ను మూశాడు.

"నేను నోరు మూసుకుని కూచున్నా చచ్చిపోతాను" అన్నాడు.

రెండవ కంటితో తల్లిని చూశాడు. పెదవులమీద చిన్ననవ్వు తొణికిసలాడింది. తల్లి తలవంచుకుంది, జాలి పొంగుకొచ్చి కన్నీరు కార్చింది.

''దానికేమిటిలెండి. అది సహజమే. బతుకు సుఖం రుచి చూడాలంటే మరణించడం అవసరం'' అన్నాడు యెగోర్.

తల్లి అతడి నుదుటిమీద చెయ్యి వేసింది.

''కొంచెం నేవు మాట్లాడకుండా ఉండలేవూ?'' అని మెల్లగా అంది.

తన గుండెల్లోని గురగుర శబ్దాన్ని వింటున్నట్లుగా అతడు కళ్ళు మూసుకున్నాడు.

''మాట్లాడకూరుకోవడంలో అర్థమేమీ లేదమ్మా! అందువల్ల నాకొచ్చే లాభమేముంది? మరి కొన్ని క్షణాలు చావకుండా ఉంటాను. కాని, మీలాంటి మంచి మనిషితో మాట్లాడే ఆనందాన్ని పోగొట్టుకుంటాను. మరొక ప్రపంచంలో ఉండే మనుషులింత మంచివాళ్ళు కారనుకుంటాను'' అన్నాడు మొండిగా.

తల్లి ఆత్రంగా మాటకడ్డొచ్చి,

''ఆ కులీన స్త్రీ తిరిగి వచ్చి, నిన్ను మాట్లాడనిచ్చినందుకు నన్ను చివాట్లు పెడుతుంది'' అంది.

''ఆమె కులీన స్త్రీ కాదు. ఆమె విప్లవవాది. కామ్రేడ్. చాలా అద్భుతమైన స్త్రీ. ఆమె మిమ్మల్ని చివాట్లు పెట్టేమాట నిజమే. మిమ్మల్నే కాదు, ఆమె అందర్నీ చివాట్లు పెడుతుంది....''

చాలా ప్రయాసపడుతూ, ఆమె జీవిత కథను యెగోర్ చెప్పడం మొదలెట్టేడు. అతని కంటిలో ఒక చెమక్ కనిపించింది. ఇతడు తనను ఉడికిస్తున్నాడని ఆమె గ్రహించింది. పాలిపోయి, చెమటతో చెమ్మగిలిన అతడి ముఖం చూసి తల్లి:

''ఇతను చచ్చిపోతున్నాడు'' అనుకుంది.

లుద్మీలా తిరిగి వచ్చింది. తలుపు గడియ వేసి తల్లికేసి తిరిగింది.

''మీ పరిచితుడు బట్టలు మార్చుకుని, నా గదిలోంచి వెళ్ళిపోవాలి. కనుక మీరు వెళ్ళి అతనికి కట్టుకునేందుకేవో బట్టలు పట్టుకురావాలి. వాటినిక్కడికే తీసుకురండి. సోఫ్యా ఇక్కడ లేకపోవడం ఏమీ బాగా లేదు — జనాన్ని దాచడంలో ఆమె ప్రజ్ఞ చాలా ప్రత్యేకం.''

''ఆమె రేపొస్తోంది'' అంది తల్లి తన శాలువను భుజాలమీద వేసుకుంటూ.

తల్లికి ఏ పనైనా అప్పచెప్తే, దానిమీద మనసంతా లగ్నంచేసి త్వరగా జయప్రదంగా నెరవేర్చాలని ఆమె ఆత్రపడేది.

''అతనికి ఏవిధమైన వేషం వెయ్యాలని మీ అభిప్రాయం?'' అని తల్లి ముక్తసరిగా అడిగింది.

''ఏదైనా సరే. అతను రాత్రే వెళ్ళిపోతాడు.''

''రాత్రి మరింత ప్రమాదం — వీధుల్లో జనం తక్కువగా ఉంటారు. పోలీసు లెక్కువ ఉషారుగా ఉంటారు. అతడేమంత జిత్తులమారి కాడు....''

యెగోర్ బొంగురుగా నవ్వేడు.

"నిన్ను చూడ్డానికి నేను ఆస్పత్రికి రావచ్చునా?" అని తల్లి అతన్నడిగింది.

అతను తలూపి దగ్గేడు.

"అతని మంచం దగ్గర కావలా ఉండడానికి నాతో వంతుకొస్తారా?" అని లుద్మిలా తన నల్లని కళ్లతో ఆమెకేసి తేరి చూచి అడిగింది. "అయితే మంచిదే. కాని ఇప్పుడు మాత్రం మీరు ఎంత త్వరగా వెళ్లగలిగితే అంత త్వరగా వెళ్లండి" అంది లుద్మిలా.

ఆప్యాయంగానే గాని ధాష్ట్యకంగా లుద్మిలా తల్లి భుజం పట్టుకుని గుమ్మం దాకా తీసుకెళ్లింది.

"మిమ్మల్ని ఈవిధంగా బయటికి పంపేస్తున్నానని ఏమీ అనుకోకండి.... ఏమంటే అతను మాట్లాడకూడదు. బ్రతుకుతాడనే ఆశ నాకింకా ఉంది" అని బయటికెళ్లేక చెప్పింది.

ఆమె మెటికలు విరుచుకుంది. అలసటగా కళ్లు మూసింది. ఆమె బాధను ప్రకటించడంతో తల్లి కొంచెం తడబడింది.

"అమ్మాయ్! ఏమంటున్నావ్?" అని గొణిగింది.

"గూఢచారులెవరూ లేకుండా చూసుకోండి!" అని లుద్మిలా మెల్లగా చెప్పింది. చేతులు కణతలమీదకు పోనిచ్చి రుద్దుకుంది. పెదవులు వణికేయి. ముఖం మృదువుగా కనబడింది.

"వాళ్ల సంగతంతా నాకు బాగా తెలుసులే!" అంది తల్లి, కొంచెం గర్వంతో.

గేటులోంచి బయటికొస్తూ ఆమె ఒక క్షణం ఆగి శాలువ సద్దుకుంటూ నాలుగు వైపులా పరికించింది. ఎంత గుంపులోనైనా గూఢచారులను గుర్తుపట్టడంలో ఆమె ఎన్నడూ పొరబాటు పడలేదు. పొగరుపోతుతనం ఉట్టిపడే వాళ్ల నడక తీరీ, వాళ్ల హావభావ విలాసాల్లో ఉండే అసహజత్వం, వాళ్ల ముఖాలమీద కనబడే అలసటా విసుగూ, బెదురుబెదురుగా అనుమానంతో చూస్తుండే వాళ్ల కళ్లూ ఇవన్నీ ఆమెకు బాగా గుర్తే.

ఈ రకమైన జనమెవరూ కనబడకపోవడంతో ఆమె వీధిలో హడావిడిగా నడక సాగించింది. ఒక గుర్రపు బండిని కేకేసి మార్కెట్ దగ్గరకు తీసుకెళ్లమంది. అక్కడ బట్టల దుకాణంలో నికొలాయ్‌కోసం ఒక కోటుమా, టోపీని బేరం చేసింది. తన భర్త తాగుబోతనీ, తనే నెలనెలా అతనికి కొత్త బట్టలు కొనవలసొస్తోందనీ, కట్టుకథ అల్లి, ఆ కల్పిత భర్తను ఆడిపోసింది. ఈ కథవల్ల ఆ దుకాణదార్లలో ఏమీ మార్పు కలగలేదు కాని తనే చాలా సంతోషించింది. బండిలో కూచున్నప్పుడు, నికొలాయ్‌కి బట్టలు మార్చుకోవలసిన అవసరముంటుంది కనుక, పోలీసులు మార్కెట్టులో తప్పకుండా గూఢచారులనుంచుతారనుకుంది. అంత జాగరూకతతోటే, ఆమె యెగోర్ మకాం దగ్గర కొచ్చింది. తర్వాత పట్టణం

పొలిమేర దాకా నికొలాయ్‌ని సాగనంపింది. వాళ్లిద్దరూ వీధికి చెరో పక్కగా నడిచారు. నికొలాయ్ తలొంచుకుని మెల్లగా నడుస్తున్నాడు, కోటు కాళ్ల కడ్డంపడుతూంది. ముందుకు జారిపోతున్న టోపీని సర్దుకుంటుండే దృశ్యాన్ని చూసి తల్లి నవ్వుకుంది. నిర్మానుష్యమైన ఒక సందులో సాషా వారి కెదురైంది. తల్లి వెసొవ్‌శ్చికోవ్‌కు వీడ్కోలు సూచకంగా తల వూపి తను ఇంటికి వెనక్కు మళ్లింది.

"పావెల్ ఇంకా జైల్లోనే ఉన్నాడు.... అన్‌ద్రేయ్ కూడా...." అని విషాదమైన ఆలోచనలో పడింది.

## 10

తల్లి ఇంట్లోకి వచ్చేసరికి నికొలాయ్ ఆమెను చాలా ఉద్రిక్త స్థితిలో కలుసుకున్నాడు.

"యెగోర్ జబ్బు బాగా ముదిరిపోయింది! చాలా జబ్బుగా ఉన్నాడు! అతన్ని ఆస్పత్రికి తీసుకెళ్లేరు. ల్యుద్మీలా ఇక్కడ కొచ్చి మిమ్మల్ని రమ్మనమని చెప్పింది...."

"ఆస్పత్రికా?"

నికొలాయ్ సులోచనాలను సర్దుకుని తల్లికి కోటు తొడుక్కువేందుకు తోడ్పడ్డాడు. తల్లి చేతిని తన వెచ్చటి పొడి చేతుల్లోకి తీసుకుని నొక్కేడు.

"ఇదిగో ఈ ప్యాకెట్టు మీతో తీసుకెళ్లండి. వెసొవ్‌శ్చికోవ్‌తో ఏర్పాట్లు చేశారా?" అని వణుకుతున్న గొంతుకతో అడిగేడు.

"చేశా...."

"నేనూ యెగోర్‌ను చూడ్డానికొస్తాను...."

తల్లి చాలా అలసిపోయింది. నికొలాయ్ ఉద్రిక్తత, రాబోయే విషాదాంతాన్ని ఆమెకు స్ఫురింపజేసింది.

"అతను చచ్చిపోతున్నాడు" అనే ఆలోచనే ఆమె మనస్సులో కొట్టుకుంటోంది.

పరిశుభ్రమైన చిన్న గదిలో, యెగోర్ తెల్లని తలగడల గుట్టమీద ఆనుకుని బొంగురుగా నవ్వుతూ ఉండడం ఆమె చూచి అమ్మయ్య అనుకుంది. గుమ్మం దగ్గర నిలబడి అతను డాక్టరుతో ఏమి చెప్తున్నాడో వింది.

"జబ్బువాళ్లకి వైద్యం చేయడం, సంస్కరణలు చెయ్యడం లాంటిది."

"యెగోర్! వేళాకోళం పట్టించకు" అని డాక్టర్ ఆత్రుత వెలిబుచ్చుతూ చెప్పేడు.

"నేను విప్లవకారుడిని, కనుక నాకు సంస్కరణలు గిట్టవు."

డాక్టరు నెమ్మదిగా యెగోర్ చేతిని రజాయిపైన ఉంచి, లేచి నిలబడ్డాడు. ఆలోచనలో పడి ఒక చేత్తో తన గడ్డాన్ని సవరించుకుంటూ, రోగి ముఖంమీది వాపులు నొక్కి చూశాడు.

తల్లి ఆ డాక్టరు నెరుగును. అతడు నికొలాయ్ దగ్గర స్నేహితుల్లో ఒకడు. అతని పేరు ఇవాన్ దనీలొవిచ్. తల్లి యెగోర్‌కు దగ్గరగా వెళ్లింది. అతడు నాలుక బయటపెట్టి హాస్యంగా ఆమెకు స్వాగతం చెప్పేడు. డాక్టరు వెనక్కి తిరిగేడు.

"ఆహా నీలొవ్నా! ఏమమ్మోయ్! మీ చేతుల్లో వేమిటి?"

"పుస్తకాలనుకుంటాను" అన్నాడు యెగోర్.

"అతను చదవకూడదు" అన్నాడు పొట్టిగా వున్న డాక్టరు.

"ఆయనగారు నన్ను మూర్ఖుణ్ణిగా మార్చెయ్యాలనుకుంటున్నాడు!" అని రోగి ఫిర్యాదు చేశాడు.

అతడు ఆయాసపడుతూ కొంచెంకొంచెంగా ఊపిరి పీలుస్తుంటే, గుండెల్లోంచి గురగుర శబ్దం బయలుదేరింది. మొగమంతా చిరుచెమటలు కమ్మేయి. ఎంతో శ్రమపడితే కాని చెయ్యి పైకెత్తి నుదుటిమీది చెమట తుడుచుకోలేకపోయాడు. ఉబ్బిన దవడలు, దయ ఉట్టిపడే అతని విశాల ముఖాన్ని చైతన్యహీనంగా మార్చేశాయి. కళ్లు మాత్రం ఎంత లోతుకు పోయినా, బహంతేటగా చిరునవ్వు లొలికిస్తున్నాయి.

"ఏమయ్యోయి ధన్వంతరీ! నేను చాలా అలసిపోయాను. పడుకోవచ్చునా?"

"వద్దు. పడుకునేందుకు వల్ల కాదు" అన్నాడు డాక్టరు, ఖచ్చితంగా.

"నువ్వు వెళ్లిపోయిన ఉత్తరక్షణంలో నేను పడుకుని తీరుతాను!"

"నీలొవ్నా అతడిని పడుకోనివ్వద్దు, తలగడలు కుదిపి బొద్దుగా చేయండి, దయచేసి అతన్ని మాట్లాడనివ్వకండి. అది చాలా ప్రమాదకరం."

తల్లి అలాగే నన్నట్లు తలూపింది. డాక్టరు చరచర అడుగులువేస్తూ బయటి కెళ్లేడు. యెగోర్ తల వెనక్కి వాల్చేశాడు. కళ్లు మూసేశాడు. శరీరం కొయ్యబారిపోయింది. వేళ్లు మాత్రం లాక్కుపోతున్నాయి. ఆ చిన్న గదిలోని తెల్లగోడలు కఠినంగానూ, మనిషిని కుంగదీసేస్తున్నట్లుగానూ ఉన్నాయి. పెద్ద కిటికీలోనుంచి, లిండెన్ వృక్షాగ్రాలపైన నడికొప్పు లనున్న దుమ్ముపట్టి ఉంగరాలు తిరిగిన నల్లని ఆకుల మధ్య పసుపుపచ్చని మచ్చలు — శరత్కాల హిమశీతల స్పర్శలు — అగుపడుతున్నాయి.

"మృత్యువు అయిష్టంగా, మెల్లిగా నన్ను తీసుకుపోవాలనుకుంటోంది. నన్ను చూస్తే దానికి జాలేస్తున్నట్లుంది. నేనందరితోనూ పాయిలాపాయిలాగా ఉండే మనిషిని" అని కళ్లు తెరవకుండానే అన్నాడు యెగోర్.

"యెగోర్ ఇవానొవిచ్, మాట్లాడకు" అని మెల్లగా అతని చేతిని తట్టి తల్లి బతిమాలింది.

"మానేస్తాను.... త్వరలోనే."

ఎంతో ప్రయాసపడి ఊపిరిపీలుస్తూ మధ్యమధ్య మాట్లాడలేక చాలా సేపు విరమిస్తూ యెగోర్ మాట్లాడ్డం కొనసాగించాడు.

''మీరు మాతో ఉండడమనేది చాలా గొప్ప సంగతి — మీ ముఖం చూట్టాని కెంతో సంతోషంగా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు మీరేమై పోతారోనని అనుకుంటూంటాము. అందరి లాగే — మీరు కూడా — జైలులో కెళ్ళాలి.... బాధలు పడాలి కాబోలని అనుకుంటే చాలా విచారం కలుగుతుంది.... మీకు జైలు కెళ్ళడం అంటే భయమా?''

''లేదు!'' అని తల్లి మామూలుగా జవాబుచెప్పింది.

''అవును. అందుకేమీ సందేహం లేదు. కాని ఎన్ని చెప్పినా జైలు అసహ్యంగా ఉంటుంది. జైలే నన్నింత కాడికి తెచ్చింది. నిజం చెప్పాలంటే, నాకు చచ్చిపోవాలని లేదు....''

''నువ్వు చచ్చిపోవేమో'' అని తల్లి అనాలనుకుంది. కాని అతడి ముఖంకేసి చూడ్డం తోనే మనసు మార్చుకుంది.

''నేను ఇంకా పనిచెయ్యగలను.... పనిచెయ్యలేకపోతే బ్రతకడంలో అర్థమేమీ లేదు....''

తల్లి నిట్టూర్చి:

''ఇది అక్షరాలా నిజం. కాని ఇది మనసేమీ ఓదార్చదు'' అని అన్ద్రేయ్ తరుచుగా అంటుండే మాటలు జ్ఞప్తికి తెచ్చుకుంది. రోజల్లా ఆమె చాలా అలిసిపోయింది. ఆకలి బాగా వేస్తోంది. జబ్బు మనిషి విసుగొచ్చేటట్లు సణుక్కుంటున్నాడు. కిటికీ బయట లిండెన్ చెట్ల నడినెత్తులు కిందుగా పోతున్న మేఘాల్లా, బెదరగొట్టేటంతటి నల్లగా విషాదసూచ కంగా ఉన్నాయి. ఆ నిస్తబ్ద సంధ్యారాగంలో, అన్ని వస్తువులూ రాత్రి రాకను దుఃఖంతో ముందుగానే నిరీక్షించుతూ చిత్రంగా నిశ్చలంగా ఉన్నాయి.

''అబ్బ, నాకెంత బాధగా ఉందో!'' అని యెగోర్ కళ్ళు మూసుకుని అన్నాడు.

''నిద్రపో. కాస్త నయంగా ఉంటుందేమో?'' అంది తల్లి.

అతడూపిరి పీల్చుకోవడం ఆమె వింది. నాలుగు వైపులా చూసింది, కొద్ది నిముషాలు విశ్చేష్టురాలై కూచుంది. విచారంలో మునిగి అలాగే ఒక కునుకు తీసింది.

ఇంతలో తలుపు దగ్గరేదో నెమ్మదిగా శబ్దమవడంచేత ఆమెకు మెళకువ వచ్చింది. ఉలిక్కిపడి చూసేసరికి యెగోర్ కళ్ళు బాగా తెరిచిగా ఉన్నాయి.

''నాకు నిద్రపట్టేసింది. క్షమించాలి'' అని ఆమె నెమ్మదిగా అంది.

''క్షమింపబడవలసింది నేను!'' అని అతడు కూడా అంత మెల్లగానే చెప్పేడు.

చీకటి కిటికీలోనుంచి తేరిచూస్తోంది. గది చల్లగా ఉంది, అన్నీ చిత్రంగా మబ్బు గమ్మినట్లుగపడ్డాయి. జబ్బు మనిషి ముఖం నల్లబారింది.

తల్లి గొను చప్పుడూ, లుద్మీలా కంఠస్వరమూ వింది.

''చీకట్లో మీరిద్దరూ ఏదో గుసగుసలాడుకుంటున్నట్లుందే? స్విచ్ ఎక్కడుంది?''

చటుక్కున గదంతా వెలుగొచ్చింది, నిటార్గా పొడవుగా ఉండే లుద్మీలా నల్లని విగ్రహం గదిమధ్యనుంది.

యెగోర్ శరీరమంతా ఒక్కసారి వణికింది. అతడు గుండెల దాకా చెయ్యెత్తేడు.

"ఏమిటది?" అని అరుస్తూ ఉర్మిలా అతడి దగ్గరకు పరుగెత్తింది.

అతడు తల్లికేసి రెప్ప వాల్చకుండా చూశాడు. అవిప్పుడు పెద్దవిగా, తేజోవంతంగా అగుపడ్డాయి.

నోరు బాగా తెరిచి తల బాగా పైకెత్తి చెయ్యి బాగా చాచాడు. తల్లి తన చేత్తో అతని తల పట్టుకుని ముఖంకేసి చూసింది. ఆమెకు ఊపిరి ఆడలేదు. ఇంతలో ఒక్క విసురుతో తల వెనక్కు వాల్చేసి పెద్ద గొంతుకతో:

"ఇక నా వల్ల కాదు! అంతా అయిపోయింది!" అన్నాడు.

అతని శరీరమంతా ఒక్కసారి కొంచెం వణికింది. తల భుజంమీదకు వాలిపోయింది. పైన నిరుత్సాహంగా వెలుగుతూన్న దీపపు వెల్తురు బాగా తెరిచి ఉన్న అతని కళ్లలో నిర్జీవంగా ప్రతిఫలించింది.

"అయ్యో నాయనా!" అంది మెల్లగా తల్లి.

ఉర్మిలా కిటికీ దగ్గర కెళ్లి బయటికి చూస్తూ నిలబడిపోయింది.

"చచ్చిపోయాడు!" అని ఉలికిపడచేటంతటి పెద్ద గొంతుకతో అంది: కిటికీగడపమీద మోచేతులాన్చి వంగి నిలబడింది. తర్వాత ఎవరో తలమీద కొడితే పడిపోయినట్టుగా గభాలున మోకాళ్లమీద కూలబడి, ఏడుస్తూ రెండు చేతుల్తో ముఖాన్ని కప్పుకుంది.

యెగోర్ చేతులు ఒకదానిపై ఒకటి అడ్డంగా ఉండేటట్టు వాటిని తల్లి అతని గుండెలమీద సర్దింది. తలను తలగడమీద తిన్నగా మోపింది. తన కన్నీటిని తుడుచుకుని ఉర్మిలా దగ్గర కెళ్లింది. కొంచెం వంగి బరువైన ఆమె జుట్టును నిమిరింది. ఉర్మిలా నెమ్మదిగా తలెత్తి, విచారంతో నిండిన కళ్లు బాగా తెరచి ఆమెకేసి చూస్తూ లేచింది.

"మే మిద్దరం ప్రవాసంలో కలిసి ఉన్నాం. ఇద్దరం కలిసి వెళ్లేం.... కలిసే శిక్షను భరించాం.... ఒక్కొక్కప్పుడు యమబాధగా ఉండేది.... నిజంగా దుర్భరంగా ఉండేది. చాలామందికి గుండెలు జారిపోయాయి...." అని ఆమె హీనమైన కంఠస్వరంతో చెప్పింది.

ఆమెకు కళ్లు పొడారిపోయాయి, బిగ్గరగా ఏడవాలనే ఆవేశం వచ్చింది కాని మనో నిబ్బరంచేత దాన్ని నిగ్రహించుకుంది. విషాదపూరితమైన మృదువైన ముఖంతో, ఆమె తల్లిని సమీపించింది. దుఃఖంతో కోమలంగా ఉన్న ఆమె ముఖాన్ని చూస్తుంటే ఆమె చిన్నపిల్లలా కనబడింది.

"ఎప్పుడు చూసినా అతడు సంతోషంగా ఉండేవాడు. గుండె నిబ్బరం లేనివాళ్లను ప్రోత్సాహపరచేందుకని, తన బాధను కప్పిపుచ్చి నవ్వుతూ వేళాకోళాలు చేస్తుండేవాడు. అందరిపట్లా దయగానూ మంచిగానూ ఉండేవాడు. అందరి సంగతీ ఆలోచిస్తుండేవాడు. ఆ సైబీరియాలో పామరితనంవల్ల జనం అవినీతికి పాల్పడుతుంటారు. నీచమైన వాంఛలకు

లోనై పోతుంటారు. ఈ అవలక్షణాల్నెదుర్కోడం అతడికి చాలా బాగా తెలును. అతడెంత అద్భుతమైన కామ్రేడో మీకు తెలుస్తే-నా! వ్యక్తిగతంగా అతని జీవితం చాలా అసౌఖ్యకరమైనది. కాని దాన్ని గురించి అతని నోటి వెంట ఎన్నడూ ఫిర్యాదు రూపమైన పల్లెత్తుమాట నెవ్వరూ విని ఎరుగరు! ఎన్నడూ! వేనతనికి సన్నిహిత స్నేహితురాలిని. అతడు చూపిన దయకెంతో ఋణపడున్నాను. బహుగొప్పదైన అతని ధీశక్తినుండి తానివ్వగలిగిందంతా నాకిచ్చాడు. కాని దానికి బదులుగా ఎన్నడూ ఏవిధమైన ఆప్యాయతను గాని, వ్యక్తిగతమైన పరామరికను గాని కోరలేదు'' అంటూ విషాదభరితమైన ఆపేక్షతో తల్లితో చెప్పింది.

లుద్మీలా యెగోర్ దగ్గర కెళ్ళి అతడి చేతిని ముద్దెట్టుకునేందుకు వంగింది.

''మిత్రమా, ప్రియమిత్రమా – ధన్యవాదాలు.... హృదయపూర్వక ధన్యవాదాలు.... శలవు. నువ్వెలా విసుగూ విరామం లేకుండా అకుంఠిత విశ్వాసంతో పనిచేశావో, అలాగే నేను నా జీవితాంతం వరకూ పనిచేస్తాను!'' అంటూ పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకొని శలవు తీసుకుంది.

ఎక్కెక్కి ఏడ్వడంచేత ఆమె శరీరమంతా వణికింది. ఆమె తలను యెగోర్ మంచం మీద అతని కాళ్ల దగ్గర పెట్టింది. తల్లి మౌనంగా రోదించింది. ఏ కారణంచేతనో ఆమె ఏడుపు నాపుకోవడానికి చాలా ప్రయత్నించింది. ప్రేమపూరితమూ విచారపూరితమూనైన మాటలతో లుద్మీలాకు ధైర్యం చెప్పాలనుకుంది. కన్నీటి తెరల్లోనుంచే కుంగిపోయిన యెగోర్ ముఖంకేసి చూసింది. సగం తెరిచి ఉన్న కళ్లను చూసింది. నిద్రపోతున్నట్లే ఉన్నాడు. నీలి పెదవులమీద సన్నని నవ్వు తొణికిసలాడుతోంది. సర్వమూ నిశ్శబ్దంగా వుంది, బాధాకలితంగా ప్రకాశించుతూంది.

ఇవాన్ దనీలొవిచ్ చిన్నచిన్న అడుగులు గబగబ వేసుకుంటూ వచ్చి చటుక్కున గది మధ్యలో ఆగిపోయి జేబుల్లో చేతులెట్టుకుని నిలబడిపోయాడు.

''ఎప్పుడు జరిగింది?'' అని గాభరా స్వరంలో బిగ్గరగా అడిగేడు.

ఎవరూ జవాబుచెప్పలేదు. అతడు నుదుటిమీద చెమటను తుడుచుకుని, యెగోర్ దగ్గర కొచ్చి అతడి చేతిని నొక్కి పక్కకు తప్పుకున్నాడు.

''ఇందులో అనుకోనిదేమీలేదు. అతని కున్న గుండెజబ్బుకు అధమం, ఇది ఆర్నెల్ల కిందట జరగాల్సింది.''

సమయోచితం కాని ఉత్సాహాన్నీ కృత్రిమమైన నిశ్చలతనూ కల్గిన అతని తారాస్థాయి కంఠస్వరం గభాలున జీరబోయింది. గోడకానుకుని గెడ్డం సవరించుకుంటూ పదేపదే కళ్లు మిటకరించుతూ అతను మంచం దగ్గరున్న జనాన్ని పరికించాడు.

''మరొక డెళ్ళిపోయాడు'' అన్నాడు మెల్లగా.

లుద్మీలా లేచి, కిటికీతలుపు తెరవడానికి వెళ్ళింది. వెంటనే అందరూ లేచి దగ్గర

దగ్గరగా నిలబడ్డారు. శరద్రాత్రి నీల వదనాన్ని అందరూ తేరిపారి పరికించారు. నల్లని చెట్లగుబురులమీద నక్షత్రాలు ఆకాశంలోని అనంతాంతరాళాలను మరింత ప్రగాఢం చేస్తూ చమక్ మంటున్నాయి.

లుద్మిలా తల్లి చెయ్యి పట్టుకుని మౌనంగా ఆమె భుజంమీద వాలింది. డాక్టరు సులో చనాలను తుడుచుకుంటూ తల వాల్చి నిలబడ్డాడు. ఆ నిశ్శబ్దాన్ని భేదించుకుని నగరంలోని ధ్వనులు వినబడుతున్నాయి. చల్లని గాలి విసురొచ్చి వాళ్ల ముఖాలకు తాకి జుట్టును రేగ గొట్టింది. లుద్మిలా చెక్కిలిమీదనుండి కన్నీటి బిందువు జాలువారగా ఆమె శరీరం కంపిం చింది. బయట నడవలో గుసగుసలు, మూలుగులు, అడుగుల చప్పుళ్లు వినబడుతున్నాయి. గదిలో ముగ్గురూ కిటికీ దగ్గర నిశ్చలంగానూ నిశ్శబ్దంగానూ నిలబడి ఆకాశంకేసి రెప్ప వాల్చకుండా చూస్తున్నారు.

ఇక్కడ తను వాళ్ల కడ్డుగా ఉన్నానేమోననే సంకోచంతో, తల్లి మెల్లగా తన చేతిని లాక్కుని, తలుపు దగ్గర కెళ్లి అక్కడనుంచి యెగోర్‌కు తలవంచి నమస్క రించింది.

"మీరెళ్లిపోతున్నారా?" అని డాక్టరు వెనక్కి తిరగకుండానే అడిగేడు.

"అవును."

బయటకెళ్లడంతోనే ఆమె లుద్మిలాను తలుచుకుంది. ఆమె తన ఏడుపునెలా ఉగ్గబట్టుకుందా అనుకుంది.

"పాపం ఆమెకు ఏడవడం ఎలాగో కూడా తెలియదు."

చచ్చిపోయే ముందు యెగోర్ చెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకుని ఆమె నిట్టూర్పు విడిచింది. వీధి వెంట నడుస్తూ, మిలమిలలాడే అతని కళ్లనూ అతని ఆనందాన్నీ, సరదాగా అతడు చెప్పుతుండే కథలనూ తలుచుకుంది.

"మంచివాళ్లు బతకడం చాలా కష్టం, చచ్చిపోవడం సులభం. నేనెలా చచ్చిపోతానో కదా!" అనుకుంది.

తెల్లగా, వెలుగుతో నిండిన ఆ గదిలో, డాక్టరూ, లుద్మిలా కిటికీ దగ్గర నిలబడి చీకట్లోకి చూస్తూండడం, వారి వెనుక యెగోర్ నిర్జీవమైన కళ్లూ – ఆ దృశ్యం ఆమె మనో నేత్రాని కగుపడింది. హఠాత్తుగా ఆమెకు మానవజాతియందు గొప్ప జాలి కలిగి ఆమెను పరవశురాలిని చేసింది. దీర్ఘంగా నిట్టూర్చి, గబగబ అడుగేసింది. ఏదో అనిర్దిష్టమైన ఆవేదన ఆమెను తొందర పెట్టింది.

"త్వరగా వెళ్లాలి!" అనుకుంది. దిగులుతో కూడినదే అయినా ధైర్యంతో కూడిన అంతశ్శక్తి ఈవిధంగా ఆమెను ప్రేరేపించింది.

## 11

మరునటి రోజంతా శవసంస్కార ప్రయత్నాలతోనే సరిపోయింది తల్లికి. సాయంత్రం ఆమె, సోఫ్యా, నికొలాయ్ టీ తాగుతుంటే, సాషా వచ్చింది. మామూలుకన్న ఉషారుగా, బడబడ మాట్లాడే వైఖరిలో ప్రవేశించింది. ఆమె బుగ్గలు గులాబీరంగులో పొంగి ఉన్నాయి. కళ్లు ఉల్లాసంతో మిలమిల్లాడుతున్నాయి. ఏదో సంతోషదాయకమైన ఆశ ఆమె నావహించినట్లుంది. యెగోర్‌ను గురించి మెల్లగా విషాదపూరితంగా మాట్లాడుకుంటూన్న వారి ప్రశాంతత నామె మనస్థితి మోటుగా భంగపరిచింది. ఈవిధమైన తోక్యం వాళ్లకు కష్టం కలిగించింది. నిబిడాంధకారంలో హఠాత్తుగా మంటలు రేగి కళ్లను మిరుమిట్లు గొల్పినట్లయింది.

నికొలాయ్ కొంచెం ఆలోచిస్తూ వేళ్లతో బల్లమీద వాయించాడు.

"ఏమిటి సాషా, ఈ వేళ మీరు మామూలుగా లేరే!" అని అడిగేడు.

"అలాగా? అయితే కావచ్చు!" సంతోషసూచకంగా చిరునవ్వు నవ్వింది.

అసమ్మతిసూచకంగా తల్లి ఆమెకేసి రెప్ప వాల్చకుండా చూసింది.

"మేమిప్పుడు యెగోర్ ఇవానొవిచ్ గురించి మాట్లాడుకుంటున్నాం" అని సోఫ్యా జ్ఞాపకంచేసింది.

"అతను చాలా అద్భుతమైన మనిషి! మొగంమీద నవ్వులేకుండా నేనెప్పుడూ చూడలేదు. ఎప్పుడూ వేళాకోళాలాడుతూ ఉండేవాడు. పనెంత బాగా చేసేవాడో! విప్లవాన్ని తీర్చిదిద్దిన కళావేత్త, విప్లవాత్మకమైన భావ ప్రకటన చేయడంలో సిద్ధుడు. హింస, అసత్యం, అన్యాయం, వీటిని గురించి అతిసూక్ష్మమైన భాషలో చాలా బలంగా చిత్రించేవాడు!" అని ఆశ్చర్యకరంగా సాషా వర్ణించింది.

ఆమె మెల్లగా, చిరునవ్వు నవ్వుతూ ఆలోచనాయుతంగా మాట్లాడింది. కాని ఆమె హృదయంలోంచి పొంగి వస్తున్న ఆనందానికి హద్దులేకుండా ఉన్నదని కనబడిపోతోంది.

యెగోర్‌ను గురించి వాళ్లు పడుతుండే సంతాపం స్థానే సాషా ఆనందాన్ని ప్రవేశపెట్టడం వాళ్ల అభిమతం కాదు. ఆమెను కూడా తమ విచార స్థితిలోకి లాక్కురావడానికి ప్రయత్నించారు.

"సరి. ఇప్పుడతడు మరణించాడు" అంది సోఫ్యా పరిశీలనగా సాషాను చూస్తూ.

సాషా అందరి ముఖాలనూ గబగబా చూసి చిరచిరలాడింది. తలవంచుకుని మౌనం దాల్చింది. మెల్లగా జుట్టు సవరించుకుంది. అలా కొంచెం సేపు ఉగ్గ పట్టుకుని గభాలున పైకి చూసింది.

"అతడు చనిపోయాడూ! చనిపోవడమంటే ఏమిటర్థం? చనిపోయిన దేమిటి? యెగోర్

యడల నాకుండే గౌరవం చచ్చిందా? అతనిమీద నాకుండే సోదర ప్రేమ చచ్చిందా? అతని అభిప్రాయాలను గ్రహించే శక్తి నాలో చచ్చిందా? నా హృదయంలో అతడు రేకెత్తించిన భావాలు నశించాయా? అతడు నిజాయితీపరుడైన ధైర్యశాలి అనే జ్ఞానం నాలో చచ్చిందా? ఇదంతా చచ్చినట్లా? నాకు సంబంధించినంతవరకు ఇవేమీ ఎన్నటికీ చావవు. ఒక వ్యక్తిని గురించి మనం చాలా తొందరగా 'అతడు చచ్చిపోయాడ'ంటూ ఉంటాం. 'అతడి పెదవులు నిర్జీవములే అయిన నేమి? అతడి మాటలు సజీవుల హృదయాల్లో చిరస్థాయిలే!'" అటువంటి ఉద్వేగస్థితిలో, మరల ఆమె బల్లదగ్గర కూచుని, మోచేతులు బల్లమీద ఆన్చి, మరింత తాపీగా, ఆలోచనాయుతంగా మాట్లాడింది. ఆర్ద్రమైన కళ్లతో మిత్రులను పరికించి చిరునవ్వు నవ్వింది: "బహుశా నేను చెప్పేదంతా తెలివితక్కువ ప్రసంగంగా కనబడవచ్చు. కాని నిజాయితీపరులైనవారు అమరజీవులని నా నమ్మకం. నాకు ఇటువంటి అద్భుతమైన జీవితాన్ని గడపడానికి మార్గదర్శకులైనవారి అమరత్వంలో నాకు విశ్వాసముంది. ఏ జీవితం, ఆశ్చర్యకరమైన తికమకలతో నన్నుత్తేజపరుస్తోందో, అమూల్యమైన విషయాలను చూపిస్తోందో, నా హృదయం నాకెంత ప్రేమాస్పదమో నాకంత ప్రేమాస్పదమైన భావాలను పెంపొందింపజేస్తోందో, అలాటి జీవితాన్ని నాకిచ్చినవారు అమరులే. బహుశా మనం మన ఆవేశాలను చాలా తక్కువగా వెలిబుచ్చుతాం. ఎక్కువగా ఆలోచనా ప్రపంచంలో నివసిస్తుంటాం. అంచేతనే మన వ్యక్తిత్వాలు పెరగవు. అనుభవించడానికి బదులు అంచనాలు వేస్తుంటాము."

సోఫ్యా మెల్లగా నవ్వుతూ,

"ఏమిటి పాషా! మీకీ రోజున ఏదో మంచి జరిగినట్లుందే?" అని అడిగింది.

"అవును. చాలా మంచి సంగతనిపిస్తోంది! రాత్రంతా వెసొవ్‌శ్చికోవ్‌తో మాట్లాడుతూనే ఉన్నాను. అతనంటే నాకెప్పుడూ గిట్టేది కాదు. అతను చాలా మోటు మనిషి, అజ్ఞాని అనుకునేదాన్ని. నిజానికి అతడలాగే ఉండేవాడు. తనను రోగం పట్టుకుని పీడించుతూన్నట్టుగా అందరిపట్లా అకారణమైన శత్రుత్వం అతన్ని పట్టుకుని పీడించుతూండేది. ఎప్పుడూ ఏ విషయాన్ని గురించి మాట్లాడినా తననే కట్టుకొయ్యగా పెట్టుకుని, 'నేను, నేను' అంటూ మోటుగా చెడ్డగా ప్రసంగించేవాడు. చాలా అసహ్యమైన సంకుచితత్వం అతడిలో ఉండేది" అంది పాషా. ఆమె చిన్న నవ్వు నవ్వి, మిలమిలలాడే కళ్లతో వాళ్లందరినీ చూసింది. "కాని ఇప్పుడతను 'కామ్రేడ్స్!' అంటున్నాడు. అతడు ఆ మాటంటే విని తీరాలి! మాటలతో చెప్పడానికి వీల్లేని బిడియం, సాధుత్వం అతని మాటల్లో ద్యోతకమవుతున్నాయి. ఇప్పుడతను చాలా నిరాడంబరంగా నిష్కపటంగా ఉన్నాడు. బ్రహ్మాండమైన కార్యదీక్షతో వున్నాడు. తన్ను తాను తెలుసుకున్నాడు — తనలో ఉన్న మంచి గుణాలనూ లోపాలనూ

గ్రహించుకున్నాడు. అన్నిటికన్న గొప్ప విశేషమేమంటే, అతనిలో చాలా గొప్ప నికార్సైన సోదరభావం ఉత్పన్నమైంది.''

సాషా మాటలు వింటుంటే, ఖచ్చితంగా నిష్ఠగా ఉండే అమ్మాయి కూడా సాధువుగా సంతోషంగా ఉండడం తల్లికి ఆనందాన్ని కలిగించింది. కాని ఆమె హృదయపు లోతుల్లో ''పావెల్ సంగతేమిట''నే ఈర్ష్యాలోచన మాత్రం వేధిస్తూనే ఉంది.

సాషా మాట్లాడుతూనే ఉంది.

''అతనెప్పుడూ కామ్రేడ్సును గురించే ఆలోచిస్తుంటాడు. అతను నాకు ఏం నచ్చ జెప్పడానికి ప్రయత్నించాడో తెలుసా? వాళ్ళ తప్పించుకుని పారిపోవడానికి మనం సాయపడా లంటాడు. ఆ పని చెయ్యడం చాలా సూక్ష్మమనీ, తేలికనీ అంటాడు.''

సోఫ్యా తలెత్తింది.

''బలే ఆలోచనే, సాషా! ఏం అంటారు?'' అని ఆదుర్దాగా అడిగింది.

తల్లి చేతిలోని టీకప్పు వణికింది. సాషా రెండు బొమలూ ముడిచి, తన ఆవేశాన్ని కప్పిపుచ్చాలని ప్రయత్నించింది. ఒక క్షణమాగి కులాసాగా నవ్వుతూ:

''అతను చెప్పిన మాటలు నిజమైతే, మనం తప్పకుండా ప్రయత్నంచెయ్యాలి. అది మన ధర్మం'' అంది.

చటుక్కున ఆమె ముఖం జేవురించింది, మాట్లాడకుండా కూచుంది.

''అయ్యో నా తల్లీ!'' అనుకుని తల్లి చిరునవ్వు నవ్వింది. సోఫ్యా కూడా మందహాసం చేసింది. నికొలాయ్ సాషాను చూసి తనలో తనే నవ్వుకున్నాడు. ఆ అమ్మాయి తల పైకెత్తి అందర్నీ చురచుర చూసింది. ఆమె ముఖం వెలవెలబోయింది. కళ్ళు చమక్ మన్నాయి. గొంతుక పొడారిపోయి, ధ్వని కొంచెం కోపంగా వచ్చింది.

''మీరెందుకు నవ్వుతున్నారో నాకు తెలిసింది. ఈ పని చెయ్యడంలో, నాకేదో స్వార్థ ముందనుకుంటున్నారు'' అంది.

''అలా ఎందుకనుకుంటారు, సాషా?'' అంది కొంటెగా సోఫ్యా, లేచి ఆమె దగ్గర కెళ్ళి నిలబడింది. సాషాకు బాధగా ఉండడం తల్లి చూసింది. సోఫ్యా అలా అనకుండా ఉంటే బాగుండేదనుకుంది. ఒక నిట్టూర్పు తీసి, ఆమెను మందలిస్తున్నట్లుగా చూసింది.

''అలాగైతే, నేనావనిలో ఎంత మాత్రం కలగజేసుకోను. మీరలా అనుకుంటే నేనిం దులో జోక్యం పుచ్చుకోను!'' అంది సాషా.

''అబ్బే, అదేమిటి, సాషా!'' అన్నాడు మెల్లగా నికొలాయ్.

తల్లి ఆమె దగ్గర కెళ్ళి జుట్టు నిమిరింది. సాషా ఆమె చేతిని పట్టుకుని, వికసించిన ముఖాన్ని పైకెత్తింది. తల్లి మందహాసం చేసి నిట్టూర్చింది. ఆమెకు మాటలు స్ఫురించ

లేదు. సోఫ్యా సాషా ప్రక్కనున్న కుర్చీలో కూర్చుని ఆమె భుజాలమీద చెయ్యేసింది. ప్రశ్న పూర్వకమైన చిరునవ్వుతో ఆమె కళ్లలోకి చూస్తూ:

"బలే తమాషా పిల్లలండీ మీరు!" అంది.

"బహుశా నేను చాలా తెలివితక్కువ...."

"మీరెప్పుడైనా అలా ఎందుకాలోచించి ఉంటారు?" అంది సోఫ్యా. నికొలాయ్ యధాలాపంగా కలుగ చేసుకుని:

"అది సాధ్యమైతే వాళ్లు పారిపోయే ఏర్పాట్లు చేసితీరాలి. కాని అసలు జైల్లో ఉన్న వాళ్లకది అంగీకారమో కాదో మనం తెలుసుకోవాలి కదా!"

సాషా తలొంచుకుంది.

సోఫ్యా సిగరెట్టు ముట్టించి, తమ్ముడికేసి చూస్తూ అగ్గి పుల్లనొక మూలకు విసిరేసింది.

"వాళ్లెందుకభ్యంతరం చెప్తారు? కాని అది సాధ్యమని మాత్రం నేననుకోవడం లేదు" అని తల్లి నిట్టూర్పు విడిచింది.

అది సాధ్యమేనని వాళ్లు ధైర్యంగా చెప్తారని ఆమె ఆశించింది. కాని వాళ్లా మాట చెప్పలేదు.

"నేను వెసొవ్‌శ్చికోవ్‌ని చూడాలి" అంది సోఫ్యా.

"ఎప్పుడు ఎక్కడ అతన్ని చూడ్డానికి పిలవుతుందో రేపు చెప్తాను" అంది సాషా.

సోఫ్యా గదిలో పచారు చేస్తూ:

"అతని కార్యక్రమమేమిటి?" అని అడిగింది.

"కొత్తగా స్థాపించబోయే ప్రెస్సులో అతడు కంపోజిటరుగా పనిచేస్తాడు. ఈలోగా అతను అడవి కావలాదారుతో ఉంటాడు."

సాషా ధుమధుమలాడింది. ఆమె ముఖం వెనుకటి తీవ్రతలో కొచ్చేసింది. ఆమె కరుగ్గా మాట్లాడింది.

నికొలాయ్, కప్పులు కడుగుతున్న తల్లి దగ్గర కెళ్లి:

"మీరు ఎల్లుండి పావెల్‌ను చూడ్డానికెళ్లినప్పుడు ఒక చీటీ నందివ్వాలి.... వాళ్ల అభిప్రాయమేమిటో మనకు తెలియాలి...." అన్నాడు.

"అలాగే, అదా!... నేనెలాగో అందించే ఏర్పాటుచేస్తాలే" అని తల్లి ఖరారుచేసింది.

"ఇక నే వెడుతున్నాను" అంటూ సాషా అందరితో నిశ్శబ్దంగా చరచర కరచాలనం చేసి బిరబిగుసుకున్నట్టు నిటారుగా నిల్చుని, మామూలుకంటె మరీ దృఢంగా అడుగులు వేసుకుంటూ బయటికెళ్లింది.

ఆమె వెళ్లిపోవడంతోనే సోఫ్యా తల్లి భుజాలమీద చేతులు వేసి కుర్చీలోనే ఆమెను ముందుకీ వెనక్కీ ఊగిసలాడించింది.

"అలాంటి కోడల్ని మీరు ప్రేమించగలరా, నిలొవ్నా?" అని అడిగింది.

"ఒక్క రోజు పాటైనా వాళ్ళిద్దరూ కలసి సుఖంగా ఉండగా నేను చూడ కలుగు తానా!" తల్లి అంది. అప్రయత్నంగా ఆమెకు ఏడుపు వచ్చింది.

"అవును. కాస్తంత సుఖం అందరికీ మంచిదే. కాని కొంచెం సుఖంతో ఎవరూ సంతృప్తి చెందరు. ఆ సుఖం చాలా ఎక్కువైతే చవకైపోతుంది" అన్నాడు నికొలాయ్, నిదానంగా.

సోఫ్యా పియానో దగ్గర కెళ్లి ఒక విషాద గీతాన్ని ఆలాపన చేసింది.

## 12

మర్నాటి ఉదయం, ముప్పయి నలభై మంది జనం, తమ స్నేహితుడి శవపేటికకోసం హాస్పటలు గేటు దగ్గర కనిపెట్టుకుని నిలబడ్డారు. జనంమధ్య గూఢచారులు తిరుగుతూ ఉన్నారు. వాళ్ల మాటలు వింటూ, వాళ్ల ముఖాలనూ చెహరాలనూ మనస్సుకు పట్టించు కుంటున్నారు. తుంటిమీద రివాల్వర్లను వేలాడేసుకున్న పోలీసు ముఠా వీధి చెరో వైపూ నిలబడుంది. గూఢచారుల జోరావరికీ, తమ బలాన్ని ప్రదర్శించడంకోసం సిద్ధంగా కాచుకు కూచున్న పోలీసుల వెటకారపు నవ్వులకూ ప్రజలు రెచ్చిపోతున్నారు. వాళ్లలో కలిగిన చిరా కును కప్పి పుచ్చుకోవడానికి కొందరు జనం వేళాకోళాలు చేసుకున్నారు. మరికొందరు పరాభవాలనేమీ కళ్లతో చూడకుండా ఉండేటందుకు చిరచిరలాడుతూ నేలచూపులు చూస్తు న్నారు. తమ ఆగ్రహావేశాలను హద్దుల్లో పెట్టుకోలేనివాళ్లు ఇంకా కొందరు, మాటలు తప్ప వేరే ఆయుధాలేమీ చేతుల్లో లేని జనాన్ని చూసి భయపడే అధికారులను గురించి చాలా కఠినమైన మాటలను ప్రయోగిస్తున్నారు. లేత నీల వర్ణపు శరత్కాలాకాశం పండుటాకులు విరజిమ్మబడిన గచ్చకాయ రంగు చప్టారాళ్లపైన తళ్కులీనుతూ ప్రకాశిస్తూంది. పండు టాకులు గాలి కెగిరివచ్చి జనం కాళ్ల కడ్డొస్తున్నాయి.

తల్లి గుంపు మధ్యన నిలబడింది.

"పిళ్లాట్టే మంది లేరే. ఎక్కువమంది లేరు. కార్మికులు అసలే లేరు" అని, ఎరు గున్న ముఖాలకేసి చూస్తూ ఆమె అనుకుంది.

గేటు తలుపులు తెరవడంతోనే గేటులోనుండి శవపేటిక మూతను మనుషులు మోసు కొచ్చారు. ఆ మూతంతా ఎర్ర రిబ్బన్లతో కట్టిన పూల గుత్తులతో కప్పబడింది. కని పెట్టుకున్న జనం ఒక్క క్షణంలో టోపీలన్నీ పైకెత్తేరు. చూచేవాళ్ల కా దృశ్యం నల్లని పక్షులొక్కసారిగా గభాలున ఎగిరిపోతున్నాయా అనిపించేటట్టుంది. ఎర్రని ముఖంమీద నల్లని బొద్దు మీసాలు కలిగిన ఒక పోలీసు ఆఫీసరు గబగబ గుంపులో చొరబడ్డాడు. అతని వెనకాలే సిపాయిలు, జనాన్ని ముందు వెనుకలాలోచించకుండా పక్కకు నెట్టేస్తూ బరువైన జోళ్లను నేలకు తాటిస్తూ చొచ్చుకొచ్చారు.

''ఆ ఎర్ర రిబ్బన్లు తీసెయ్యండి!'' అని ఆఫీసరు బొంగురుగొంతుకతో ఆజ్ఞాపించాడు.

స్త్రీలూ పురుషులూ అతన్ని చుట్టేసి ఒత్తుకొచ్చారు. చేతులాడించుకుంటూ ఒకరి నొకరు తోసుకుంటూ, ఆవేశంతో మాట్లాడేరు. ఆవేదనతో వెలవెలలాడే ముఖాలు, వణికే పెదవులు తల్లికి కనబడ్డాయి. ఒక స్త్రీ చెక్కిళ్లమీద కన్నీరు కాలువగట్టింది.

''దౌర్జన్యం నశించు గాక!'' అని ఒక యువకుడు అరిచాడు. వాద ప్రతివాదాల గలభాలో ఆ అరుపు ఏవ్యమైపోయింది.

తల్లి హృదయాన్ని పొడిచినట్లైంది. తన పక్కనే, చవకబారు సూటులో ఉన్న యువకునికేసి తిరిగి:

''అదేమిటి? ఇష్టమొచ్చిన మాదిరిగా శవసంస్కారం కూడా చేసుకోనివ్వరన్నమాట!'' అని తీవ్రమైన కోపంతో అంది.

ప్రతికూలభావం పెరిగిపోయింది. ప్రజల తలలమీద శవపేటిక మూత ఊగిసలాడుతోంది. దానికి చుట్టబడిన రిబ్బన్లన్నీ గాలి కెగిరి మనుషుల ముఖాలకు పట్టుకున్నాయి. పట్టు రిబ్బన్ల రెపరెప వినవచ్చింది.

ఏదో సంఘర్షణ జరిగేటట్లున్నదని తల్లి భయపడింది. ఏదో గబగబ గొణుక్కుంటూ ఎడమ పక్కకూ కుడి పక్కకూ తిరిగింది:

''వాళ్ల అదే కావాలంటే, ఆ దెయ్యాల మాటే సాగనివ్వండి! రిబ్బన్లను వాళ్లకే వదిలెయ్యండి. మనమే అందుకొడబడదాం'' అంది.

ఎవరిదో గొంతుక కీచుమని బిగ్గరగా లేచింది:

''మా కామ్రేడ్‌ని తుది విశ్రాంతి స్థలానికి తీసుకెళ్లే హక్కు మాకుండాలి. మీరె వర్ని హింసపెట్టి ప్రాణాలు తీసేరో ఆ మా కామ్రేడ్‌ని తుది యాత్రకి సాగనంపే హక్కు మాకుండాలి.''

''మహత్తర త్యాగం చేశావూ....''

అంటూ ఎవరో బిగ్గరగా పాట మొదలెట్టేడు.

''రిబ్బన్లు లాగెయ్, యాకొవ్‌లెవ్! కోసిపారెయ్యి!''

ఖడ్గ మొకటి గాలిలో ఝుణఝుణమంది. జనం కెవ్వుమంటారనుకుని తల్లి కళ్లు మూసుకుంది. కాని ప్రజలు మాత్రం గొణుక్కున్నారు. కోపంతో ఉన్న తోడేళ్లలాగ గురగురలాడేరు. పాదాల చప్పుడు మార్మోగుతూండగా తలలు వంచుకుని మౌనంగా, ముందుకు సాగేరు.

శవపేటిక మూత, నలిగిపోయిన పూలదండలతోనూ తెగిపోయిన రిబ్బను ముక్కలతోనూ జనం తలలమీద తేలి ఆడుతోంది. వారి పక్కనే గుర్రాలమీద పోలీసురౌతులు ఊగిసలాడు

తున్నారు. పక్కనున్న చప్టామీద నడుస్తూన్న తల్లికి శవపేటిక కనబడటమేలేదు. దాని చుట్టూ జనం క్రమేణా మూగిపోయి వీధంతా నిండిపోయారు. బూడిదరంగు దుస్తులను ధరించిన పోలీసురౌతులు వెనుకకు మోహరించారు. రెండు పక్కలా పోలీసులు కత్తుల పిడులపై చేతులు ఉంచి నడుస్తున్నారు. ఎక్కడ చూసినా గూఢచారుల వాడిచూపులు మనుషుల ముఖాలను పరీక్షగా చూస్తూండడం తల్లి గమనించింది.

"శలవు మిత్రమా! శలవు!"

అంటూ విషాద గీతాన్ని రెండు స్వరాలు ఆలపించాయి.

"ఆ పాటా వొద్దు. మౌనంగా నడుద్దామండి" అని ఎవరో కేక వేశాడు.

ఆ కేకలో భయసంభ్రమాలను స్ఫురింపజేసేదేదో ఉంది. విషాద గీతం ఆగిపోయింది. సంభాషణలు సర్దుణిగిపోయాయి. చప్టారాళ్లమీద అడుగుల చప్పుళ్ల మాత్రమే వినబడుతున్నాయి. ఈ చప్పుడు జనంమీదనుంచి పైకి లేచి పారదర్శకంగా ఉన్న ఆకాశం దాకా వ్యాపించి దూరాన ఉన్న తుపాను పంపిన తొలి ఉరుములాగున గాలిని గజగజ వణికించింది. క్రమక్రమంగా హెచ్చవుతుండిన చలిగాలి వీధుల్లోని దుమ్మునూ చెత్తనూ మనుషులమీదికి చిమ్ముతోంది. ఆ గాలి విసురు తలవెంట్రుకలను లేవగొట్టింది. దుస్తులను చింపేసింది. గుండెలమీద కొట్టింది. కళ్ల మూతలు పడజేసింది. పాదాల చుట్టూ సుళ్లు తిరిగింది.

మతగురువులు లేని, ఆత్మానందం కలిగించే సంగీత మేమీలేని ఈ శవసంస్కారం, నిశ్శబ్దంగా ఆలోచనా నిమగ్నమైన ముఖాలూ, ముడిపడిన బొమలూ తల్లికి తీవ్రమైన బాధను కలిగించాయి. ఆమెకు మనసులో నిదానంగా ఆలోచనలు రేకెత్తాయి. ఆమె వాటిని విషాదపూరితమైన మాటల్లోకి మార్చింది:

"సత్యంకోసం నిలబడే మీరు ఎంతోమంది లేరు...."

తలవంచుకుని ముందుకెళ్లింది. ఆరోజున సమాధి చేస్తున్నది యెగోర్‌ని కాదు — తనకెంతో సన్నిహితమూ ఆప్యాయమైన, ముఖ్యమైన దేన్నో పూడ్చిపెడుతున్నట్లామె కనిపించింది. ఆమె దిగులుతో అస్థిమితంతో కలతచెందింది. యెగోర్‌ని సమాధి చేస్తుండే వారివట్ల అస్పష్టమైన భయంకరమైన అసమ్మతి భావమేదో ఆమె హృదయాన్ని ఆవరించింది.

"యెగోర్‌కి దేవునియందు నమ్మకం లేదు.... వీళ్లెవరికీ కూడా...." అనుకుంది.

ఆ ఆలోచనను కొనసాగించడానికామె ఇష్టపడలేదు. ఆత్మనావహించిన భారాన్ని దులుపుకునేందుకా అన్నట్లు నిట్టూర్పు విడిచింది.

"ఓ భగవంతుడా! ఓ జీసస్! నా గతి కూడా ఇంతేనా...."

అంతా స్మశానానికి చేరుకున్నారు. సమాధులమధ్య కొంతసేపు దారిచేసుకుని నడిచారు.

చిన్నచిన్న శిలువగుర్తులున్న బయలుజాగా చేరుకున్నారు. అక్కడ తవ్వబడున్న గోతి చుట్టూ జనమంతా నిశ్శబ్దంగా మూగేరు. సమాధులమధ్య సజీవులైన వారి కఠిన మౌనం భయంకర మైనదేదో ముందు జరుగబోతుందని సూచించుతూ తల్లి హృదయాన్ని స్తంభింపజేసింది. శిలువలమధ్య గాలి హోరుగా వీస్తూ, శవపేటిక మూతమీద వున్న వలిగిపోయిన పువ్వులను రేగగొట్టింది.

పోలీసులు తమ అధికారికేసి చూస్తూ బారు తీరి ఠంచన్‌గా నిలబడ్డారు. పొడుగాటి జుట్టు, నల్లని కనుబొమలు, వెల్లబారిన ముఖంగల ఒక పొడుగాటి యువకుడు సమాధి మొగను నిలబడ్డాడు.

"ఏమయ్యా పెద్దమనుషులూ!" అని బొంగురు గొంతుకతో పోలీసు ఆఫీసరు అరిచాడు.

"కామ్రేడ్స్" అంటూ ఒక యువకుడు విస్పష్టమైన కంఠధ్వనితో ప్రారంభించాడు.

"ఒక్క నిముషంలో ముగించాలి! ఉపన్యాసాలేమీ ఇవ్వడానికి వీల్లేదని ముందుగానే హెచ్చరిస్తున్నాను!" అంటూ ఆఫీసరు అరిచాడు.

"నేను కొద్ది మాటలు మాత్రమే చెప్తాను" అని ఆ యువకుడు తొణుకూ బెణుకూ లేకుండా బదులుచెప్పేడు. "కామ్రేడ్స్! మన స్నేహితుడూ, గురువూ మనకు నేర్పిన సంగతులను మన జీవితంలో ఎన్నడూ విస్మరించమనీ, మన జన్మభూమి నావహించిన సమస్త అరిష్టాలకూ మూలకారణమైన ఏ నిరంకుశ ప్రభుత్వమున్నదో దానికి గోరీ తవ్వడానికి మన మందరమూ మన జీవితాంతం వరకూ నిర్విరామంగా కృషిచేస్తామనీ, ఈ సమాధి దగ్గర మనమంతా ప్రతిజ్ఞను స్వీకరించాలి!"

"అతన్ని అరెస్టు చెయ్యండి!" అన్నాడు ఆఫీసరు.

"నిరంకుశత్వం నశించుగాక!" అనే కేకల్లో ఆ ఉత్తరువు ఏమ్యమైపోయింది.

పోలీసులు గుంపులోంచి ముందుకు తోసుకొచ్చి ఉపన్యాసకునిమీద పడ్డారు. అతని స్నేహితులు అతడి రక్షణకోసం దగ్గరగా కడియం కట్టేరు.

"స్వేచ్ఛ వర్ధిల్లుగాక!" అని అతడు చెయ్యి పైకెత్తి ఊపుతూ నినాదం చేశాడు.

తల్లిని ఒక పక్కకు తోసేశారు. ఆమె భయపడి ఒక శిలువ కానుకుని, ఒక దెబ్బ మీద పడబోతున్నదనుకుంటూ కళ్ళు మూసుకుంది. రణగొణధ్వనిలో ఆమె చెవులు గడియలుపడి పోయాయి. కాళ్లకింద నేల జారిపోతున్నట్లనిపించింది. గాలి హోరువల్లా, భయంవల్లా ఊపిరాడ్డం కష్టమైపోయింది. పోలీసువాళ్ల ఈలలు రేగేయి. కరుకైన కంఠధ్వనులతో ఉత్తరువులు విజృంభించాయి. స్త్రీల ఉన్మత్త కంఠస్వరాలు కెవ్వుమన్నాయి. కట్టవ క్రరలు పెళపెళ విరిగిపోయాయి. ఎండు నేలపై బోళ్ళ టకటక శబ్దం చేశాయి. తల్లి కళ్ళు మూసుకుని భయపడుతూ యిక నిలబడలేనంత సేపటిదాకా ఈ హంగామా జరిగింది.

ఆమె కళ్ళు తెరచి చూసి చేతులు చాపి ఒక్క కేక వేసి ముందుకు పరుగెత్తింది. సమాధులమధ్య సన్నని బాటపైన పోలీసులు ఆ యువకుణ్ణి ముట్టడించి, అతన్ని కాపాడేందుకు అతని దగ్గర కొత్తుకొచ్చే జనాన్ని వెనక్కి తరిమికొడుతున్నారు. విచ్చుకత్తులు తెల్లగా క్రూరంగా తళతళలాడుతూ మనుషుల తలలమీద నృత్యంచేస్తున్నాయి. అప్పుడప్పుడు వాళ్ల మీదకు దూకుతున్నాయి. బెత్తాలు, కంచె చెక్కలూ ఆయుధాలుగా మారిపోయాయి. జనం కేకలేసుకుంటూ ఉద్రిక్తంగా గంతు లేస్తున్నారు. గుంపులో ఆ యువకుని వెలవెలలాడే ముఖం ప్రముఖంగా కనిపిస్తోంది. ఈ ఉద్రిక్త ప్రవృత్తుల తుపానులోంచి అతని దృఢ స్వరం పైకి లేచింది.

"కామ్రేడ్స్! మీ శక్తిని వృథా చెయ్యకండి!"

అతని మాటలు మన్నింపబడ్డాయి. జనం కర్రలు విసిరిపారేసి పారిపోసాగారు. తల్లి మాత్రం ముందుకు సాగుతూనే ఉంది. ఏదో ఒక అతీతమైన శక్తి ఆమెను ముందుకు నడిపించింది. నికొలాయ్ టోపీ వెనక్కి పెట్టుకుని ఆగ్రహావేశపరవశులైన జనాన్ని తోసే స్తూండడం ఆమె చూసింది.

"మీకేమైనా మతిపోయిందా? శాంతించండి!" అని జనాన్ని అతడు మందలించాడు.

అతని చేతికి రక్తమైనట్లు తల్లికగుపడింది.

"నికొలాయ్ ఇవానొవిచ్ మీరిక్కడనుంచి వెళ్లిపోండి!" అని ఆమె అతని దగ్గర కెళ్లి చెప్పింది.

"ఎక్కడి కెడుతున్నారు? వాళ్లు మిమ్మల్ని కొడతారు!"

ఆమె భుజంమీద ఎవరో చెయ్యివేశారు. సోఫ్యా నెత్తిన టోపీలేకుండా జుట్టంతా రేగిపోయి, తల్లి పక్కనే నిలబడుంది. ఒక పిల్లవాడిని చేత్తో పట్టుకుంది. ఆ పిల్లవాడు ముఖంమీద రక్తాన్ని చేత్తో తుడుచుకుంటున్నాడు.

"నన్ను పోనియ్యండి.... దీనికేమీ ఫరవాలేదు" అని వణుకుతున్న పెదవులతో అతడు గొణిగేడు.

"ఆ పిల్లవాడిని జాగ్రత్త పెట్టండి.... వాడిని మనింటికి తీసుకెళ్లండి. ఇదిగో ఈ చేతి రుమాలుతో అతని ముఖానికి కట్టు కట్టండి" అంది సోఫ్యా తొందరగా. ఆ పిల్లవాని చేతిని తల్లి చేతిలో పెట్టి సోఫ్యా పరుగెత్తి వెళ్లిపోయింది.

"త్వరగా వెళ్లండి లేకపోతే మిమ్మల్ని అరెస్టుచేస్తారు!" అని వెనక్కి తిరిగి హెచ్చరించింది.

జనం శ్మశానవాటికలో వాల్గుమూలలా చెల్లాచెదరైపోయారు. పోలీసువాళ్లు కత్తులు ఝుళిపించుకుంటూ తిట్టుకుంటూ, అల్లల్లాడుతూన్న ఓవర్‌కోటు అంచులు కాళ్లలో పడగా శ్మశానవాటికను కలదొక్కేశారు. ఆ పిల్లవాడు వాళ్లను తోడేలులాగున కోరచూపులు చూశాడు.

"త్వరగా నడు" అంటూ తల్లి చేతి రుమాలుతో అతడి ముఖాన్ని తుడిచింది.

"నన్ను గురించి మీరేమీ కంగారుపడకండి.... నాకేమీ నొప్పిపెట్టడం లేదు. వాడు నన్ను కత్తి పిడితో కొట్టేడు. కాని వాడికి శాస్తి అయిందిలెండి! నేను కర్రతో ఒక్క ఊపు ఊపి కొట్టేసరికి వాడు మొర్రోమన్నాడు!" అని రక్తాన్ని ఊసేస్తూ అన్నాడు కుర్రాడు. "కొంచెం ఆగండి, రాబోయే దానిముందు ఇదేపాటిది! మా కార్మికులంతా ఒక్కసారి లేస్తే, పోరాటమనేదక్కర్లేకుండానే మిమ్మల్ని తుడిచేస్తాం!" అని రక్తసిక్తమైన పిడికిలిని ఝళిపిస్తూ అన్నాడు.

"తొందరగా నడు" అంటూ తల్లి స్మశానవాటిక కట్టవ గేటు దాకా వచ్చింది. కట్టవ అవతల వెల్లడిగా ఉన్న పొలంలో పోలీసులు దాక్కుని ఉంటారనీ, వాళ్ళు మీదకొచ్చి కొడతారనీ ఆమె ఊహించుకుంది. కాని ఆమె గేటు దగ్గర కొచ్చి, శరత్కాలపు సంధ్య యొక్క ధూసర వస్త్రం విస్తరించి ఉన్న పొలంకేసి చూసేసరికి ఆమెకు శూన్యం, నిశ్శబ్దం ఎదురయ్యాయి.

"నీ ముఖానికి ఇక్కడ కట్టు కడతాను" అంది.

"ఆ గొడవ పెట్టుకోకండి" దానికోసం నేనేమీ బిడియపడ్డం లేదు. మేము చాలా నిజాయితీగా దెబ్బలాడుకున్నాం. నాకు తగలవలసినవి నాకు తగలేయి. వాడి కివ్వవలసినవి వాడికిచ్చాను" అన్నాడు కుర్రాడు.

తల్లి అతని గాయానికి చకచక కట్టు కట్టింది. ఆ పిల్లవాని రక్తం చూసేసరికి ఆమెకెంతో జాలి కలిగింది. ఆ రక్తం వెచ్చగా చేతికి జిగురుగా అంటుకునేసరికి ఆమె గుండె భయంతో ఝల్లుమంది. మాట్లాడకుండా పొలానికి అడ్డపడి ఆమె తొందరగా అతన్ని నడిపించింది.

"కామ్రేడ్! నన్నెక్కడికి తీసుకుపోతున్నారు? మీ సహాయ మక్కర్లేకుండా నేనే వెళ్ళిపో గలను" అని నోటికి కట్టిన కట్టును తప్పించుకుని అడిగేడు.

కాని ఆమె అతని చెయ్యి వణకడం గమనించింది, అతడు పాదాలమీద ఊగిసలాడ్డం కనిపెట్టింది. అతను జవాబులకోసం ఆగకుండానే ప్రశ్న మీద ప్రశ్నలడిగేడు. అతని కంఠ స్వరం క్రమక్రమంగా నీరసపడింది.

"మీరెవరు? నేను తగరపు పనివాడిని. నా పేరు ఇవాన్. యెగోర్ ఇవానొవిచ్ అధ్యయన బృందపు పదకొండుగురిలోనూ మేము ముగ్గురం తగరపు పనివాళ్ళం. మాకు ఆయనంటే ఎంత ప్రీతో చెప్పడానికి వీల్లేదు. నాకు దేవుడంటే నమ్మకం లేదు కాని.... అయినా ఆయన ఆత్మ శాంతించుగాక."

ఒక వీధిలో తల్లికొక గుర్రపు బండి కనబడింది. ఇవాన్‌ను దానిలో కూర్చోబెట్టి, "నోరు మెదపద్దు" అని గుసగుస గొంతుకతో చెప్పి, చేతి రుమాలుతో నోటికి అడ్డం కట్టింది.

అతడు చేతిని ముఖందాకా పైకెత్తేడు. కాని అప్రయత్నంగా చెయ్యి ఒడిలోకి జారి పోయింది. ముఖంమీద కట్టును ఊడదీసుకునేందుకు శక్తి చాల లేదు. కాని కట్టులోంచే గొణిగేడు.

"నేనీ దెబ్బల్ని మరచిపోతాననుకోకండి!... ఈయన రాక పూర్వం తీతొవిచ్ అనే విద్యార్థి ఒకడుండేవాడు.... అతడు మాకు.... అర్థశాస్త్రాన్ని గురించి పాఠాలు చెపుతుండే వాడు.... అతన్ని వాళ్లు అరెస్టు చేశారు...."

తల్లి ఇవాన్‌ను చేత్తో దగ్గరకు లాక్కొని అతని తలను రొమ్ముమీద అన్చుకుంది. హఠాత్తుగా ఆ పిల్లవాడు అలాగే కూలబడిపోయేడు. ఆమె భయపడి నాలుగు మూలలా చూసింది. ఏమూలనుంచైనా పోలీసులొచ్చి, ఇవాన్ తలకు కట్టిన కట్టు చూసి, అతడిని పట్టుకు చంపేస్తారేమోనని ఆమె భయం.

బండివాడు వెనక్కి తిరిగి చూసి నవ్వుతూ,

"తాగేడా?" అడిగేడు.

"అవును. భరించగలిగినదానికంటే ఎక్కువ పుచ్చుకున్నాడు" అని తల్లి నిట్టూర్చింది.

"నీ కొడుకా?"

"అవును. చెప్పులు కుడతాడు. నేను వంటపని చేస్తాను."

"పాపం, నీ బతుకు కష్టమైనదే! ఉహూ."

ఒక్కసారి కొరడా ఝళిపించి బండివాడు మరల వెనక్కి తిరిగి మెల్లగా చెప్పడం ప్రారంభించాడు.

"విన్నావా స్మశానంలో జరిగిన కొట్లాటసంగతి? రాజకీయాల్లో పనిచేసే అతెవెవరినో సమాధి చేశారుట. పైనుండే గొప్పవాళ్ల కతడు వ్యతిరేకిట. వాళ్లతో ఏదో పేచీ పడుతూ ఉంటాట్ట. అతన్ని సమాధి చెయ్యడానికొచ్చిన వాళ్లంతా ఒకే రకం మనుష్యులట — అంటే వాళ్లంతా స్నేహితులు అన్నమాట. వాళ్లంతా 'హేమా హేమీలు నశించాలి! వీళ్లే ప్రజలను దోచుకుంటున్నారు!' అని అరిచారుట. వెంటనే పోలీసువాళ్లొచ్చి జనాన్ని కొట్టడం ప్రారంభించారుట. కొందరిని పట్టాకత్తులతో చీరేసి చంపేశారని అంటున్నారు మరి. కాని పోలీసువాళ్లకు కూడా బాగానే తగిలేయటలే!" అతడొక్క క్షణం మౌనం దాల్చేడు. "చచ్చిపోయిన వాళ్లను లేపడమంటే ఇదే!" తలూపుతూ "చచ్చిపోయినవాళ్లకు కూడా శాంతి నివ్వరు!" అన్నాడు.

ఎగుడుదిగుడుగా ఉండే చప్టామీద బండి నడుస్తుంటే ఆ కుదుపులో ఇవాన్ తల తల్లి గుండెలకు మెల్లగా కొట్టుకుంది. బండివాడు తన పెట్టెమీద సగం అడ్డంగా తిరిగి గొణగొణలాడ్డం మొదలెట్టేడు.

"జనంలో అశాంతి ప్రబలిపోయింది.... అరాజకం వ్యాపించిపోతోంది. నిన్న రాత్రి

పోలీసులు మా ఇంటిపక్కవాళ్లింటి కొచ్చి తెల్లవారేవరకు వాళ్ల ఇల్లంతా నానా గల్లంతూ చేశారు. చివర కొక కమ్మరి పనివాడిని పట్టుకుపోయారు. అతడిని అర్ధ రాత్రి వేళ నదికి తీసుకుపోయి, అందులో ముంచేస్తారని జనం చెప్పుకుంటున్నారు. ఆ కమ్మరతను చాలా మంచివాడు.''

''అతడి పేరేమిటి?'' అని తల్లి అడిగింది.

''కమ్మరి పేరా? సవేలియ్. సవేలియ్ యేవ్‌చెన్కో. చిన్నవాడే. కాని అతనికి చాలా సంగతులు తెలుసు. సంగతులు ఎక్కువగా తెలుసుకోవడం కూడా అపరాధమే ననుకుంటాను. అతడు తరుచుగా మా దగ్గర కొచ్చి, 'బండివాళ్ల జీవితం ఏమి జీవితం?' అనేవాడు. 'కుక్కల జీవితంకన్న కనాకష్టమవాలి' అంటూ ఉండేవాళ్లం.''

''ఆవు. ఇంటికొచ్చాం'' అంది తల్లి.

బండి కుదుపుతో ఇవాన్‌కు మెళకువ వచ్చింది. నెమ్మదిగా మూలిగేడు.

''బాగా పుచ్చుకున్నాడు. వోద్కా మహిమంటే అదే'' అన్నాడు బండివాడు.

ఎంతో ప్రయాసమీద ఇవాన్ ఇంటిముంగిట్లోకి నడవగల్గాడు.

''నాకేమీ ఫరవాలేదు. ఒక్కడినే నడవగలను'' అంటూనే ఉన్నాడు.

## 13

అప్పటికప్పుడే సోఫ్యా ఇంటికి చేరుకుంది. ఆమె కంగారుగా, ఉద్విగ్నంగా వుంది. పళ్లతో సిగరెట్టును కరుచుకుంది.

గాయాలు తగిలిన పిల్లవాడిని సోఫామీద పడుకో పెట్టడంతోనే, సోఫ్యా అతని కట్లు విప్పేసి, సిగరెట్టు పొగలోంచి కళ్లు తిప్పుకుంటూ, ఉత్తరువు లివ్వడం ప్రారంభించింది.

''ఇవాన్ దనీలొవిచ్! అతన్ని తీసుకొచ్చారు! అలిసిపోయారా నీలొవ్నా? భయపడ్డారా? కొంచెం సేపు విశ్రాంతి తీసుకోండి. నికొలాయ్! నీలొవ్నాకు పోర్ట్‌వైను కొంచెం ఇయ్యి.''

జరిగిన సంఘటనలవల్ల తల్లిని భయం ఆవహించింది. ఊపిరి ఆడలేదు. గుండెల్లో తీవ్రమైన పోటు పొడుస్తోంది.

''నన్ను గురించి మీరేమీ ఆత్రపడకండి'' అని మెల్లగా గొణిగింది. కాని నిజానికి ఆమె దేహం కొంత ఉపచారాన్ని కోరింది. ప్రేమపూరితమైన సేవను ఆమె శరీరం కాంక్షిస్తోంది.

పక్క గదిలోంచి నికొలాయ్ వచ్చాడు. అతడి చేతికి కట్టు కట్టబడుండడం తల్లి చూసింది. డాక్టరు ఇవాన్ దనీలొవిచ్ అతనితో కూడా వచ్చాడు. చింపిరి జుట్టుతో ఏదుపంది లాగ ఉన్న డాక్టరు పరాపరి ఇవాన్ దగ్గర కెళ్లి అతనిమీదకు వంగి చూశాడు.

"నీళ్ళు.... చాలా నీళ్ళు కావాలి. శుభ్రమైన దూది, పరిశుభ్రమైన గుడ్డ, తీసుకు రండి" అన్నాడు.

తల్లి వంటింట్లోకి బయల్దేరింది. కాని నికొలాయ్ ఆమె చెయ్యి పట్టుకుని భోజనాల గదిలోకి తీసుకుపోయాడు.

"ఆ మాట చెప్పింది మీకు కాదు.... సోఫ్యాకు.... అమ్మా, మీరు చాలా హడలిపోయినట్లున్నారు. ఔనా?" అని అడిగేడు.

తల్లి సానుభూతియుతమైన అతని కళ్లను చూడ్డంతోనే, వశం తప్పిపోయింది.

"అబ్బ! ఏం ఘోరం జరిగిందయ్యా! వాళ్ళు ప్రజల ఒళ్ళు చీల్చేశారు, నరికి పారేశారు...." అని ఏడ్చింది.

"నేనంతా చూశాను" అంటూ తలూపుతూ ఆమె కొక గ్లాసు ద్రాక్షసారాయ మిచ్చాడు. "ఉభయపక్షాలవారికీ మతిపోయింది. దాన్ని గురించి మీరు ఏమీ బెంగ పెట్టుకోకండి. వాళ్ళు కత్తులు ఉపయోగించారు. ఒక్కడికే బాగా ప్రమాదమైన గాయాలు తగిలేయి. అతడికి దెబ్బలు తగలడం నేను చూశాను. పోట్లాటలోంచి వెనక్కి లాగేశాను."

నికొలాయ్ మాటలవల్ల కొంత ఉపశమనం కలిగింది. గదిలోని వెల్తురు, వెచ్చదనం కూడా కొంత మనశ్శాంతికి తోడ్పడ్డాయి. తల్లి అతనికేసి కృతజ్ఞతతో దృష్టి సారించింది.

"మిమ్మల్ని కూడా కొట్టేరా?" అని అడిగింది.

"ఆ పని నేనే చేశాననుకుంటాను, అలక్ష్యంగా నా చేతిని దానికీ దీనికీ కొట్టేను. అంచేత చర్మమూడింది. ఇదిగో కొంచెం టీ తాగండి. బయట చలిగా ఉంది, మీ దుస్తులు చలిని ఆపేవిగా లేవు.

ఆమె టీ కప్పును చేత్తో అందుకుంటుంటే తన వేళ్లమీద రక్తం పేరుకుని ఉండడం చూచింది. వెంటనే చేతిని ఒడిలో పెట్టుకుంది. ఆమె పావడ తడితడిగా ఉంది. కళ్ళు బాగా తెరిచి వేళ్లను చూసుకుంది. గుండెలు దబదబా కొట్టుకున్నాయి. తల తిరిగిపోయింది.

"పావెల్ని కూడా ఇంతే—అతన్ని కూడా ఇలాగే చేస్తారు కాబోలు!" అనుకుంది.

ఇవాన్ దనీలొవిచ్, చొక్కా చేతులు పైకి మడత పెట్టుకుని, వేస్టు కోటుతో గదిలో కొచ్చాడు: నికొలాయ్ మౌన ప్రశ్నకు గట్టిగా ఇలా సమాధానం చెప్పేడు:

"ముఖంమీది గాయమేమంత ప్రమాదం కాదు. కాని మూతి పగిలింది. అయితే అంత ఎక్కువగా పగల్లేదు. చాలా బండమనిషి, కాని చాలా రక్తం పోయింది. హాస్పిటల్‌కి పంపిద్దామా?"

"ఎందుకూ? ఇక్కడే ఉండనియ్యి" అన్నాడు నికొలాయ్.

"ఇవేళా, రేపూ ఉండనిద్దాం. కాని ఇతను హాస్పిటల్లో ఉంటే వాకెక్కువ సౌకర్యంగా ఉంటుంది. నేను తరుచుగా ఇక్కడికి రావడానికి వీలుండదు. శ్మశానవాటికలో జరిగిన కథంతా ఒక కరపత్రంగా రాస్తావా?"

''తప్పకుండా'' అన్నాడు నికొలాయ్.

తల్లి మెల్లగా లేచి వంటింటికేసి ప్రయాణమైంది.

''ఎక్కడి కెడుతున్నారు? నీలొవ్నా!'' అంటూ ఆప్యాయంగా నికొలాయ్ ఆమె వావుచేసి ''మీ సహాయం అక్కర్లేకుండానే సోఫ్యా అన్ని పనులూ చేసుకోగలదులెండి'' అన్నాడు.

ఆమె అతనికేసి తేరిపారజూసింది. ఆమె ఒళ్ళు కొంచెం కంపించింది. చిత్రంగా నవ్వుతూ:

''నా వొళ్ళంతా రక్తమైంది'' అంది.

తన గదిలో కెళ్ళి బట్టలు మార్చుకుంటూ, ఇలాంటి భయంకరమైన విషయాలను వీళ్ళింత తేలికగా, తొణుకూ బెణుకూ లేకుండా ఎలా భరిస్తూన్నారా అని ఆశ్చర్యపడింది. ఈ ఆలోచనలతో ఆమెకుండే భయమంతా పోయి, మనసు కుదుటబడింది. గాయపడిన పిల్లవాడు పడున్న గదిలోకి ఆమె వెళ్లేసరికి సోఫ్యా అతడిమీదకు వంగి చూస్తోంది.

''కామ్రేడ్! ఆదేమిటూ పిచ్చి మాట!'' అంది.

''నేను మీకడ్డెందుకూ?'' అన్నాడు నీరసంగా ఆ పిల్లాడు.

''మాట్లాడకండి – మౌనం మీకు మంచి చేస్తుంది.''

తల్లి సోఫ్యా వెనకాల, ఆమె భుజంమీద చెయ్యివేసి నిలబడింది. ఆ పిల్లవాడి ముఖం చూసి నవ్వుతూ, బండిలో అతడు గొణిగిన ప్రమాదకరమైన మాటలవల్ల తనకెంత భయమేసిందో చెప్పింది. ఇవాన్ కళ్ళు జ్వరతాపంలో మండిపోతున్నాయి.

''నేనెంత అవివేకిని!'' అని సిగ్గుపడుతూ అన్నాడు.

సోఫ్యా అతని దుప్పటిని మీదకు లాగి:

''మేము గదిలోంచి వెళ్లిపోతున్నాం! నిద్రపొండి'' అంది.

వాళ్లంతా భోజనాలగదిలో కెళ్లి చాలా సేపు దాకా ఆనాడు జరిగిన సంఘటనలను చర్చిస్తూ కూచున్నారు. ఆ సంఘటనలన్నీ ఎప్పుడో గతంలో జరిగిన వాటినిగా భావించి మర్నాటి కర్తవ్యానికై పథకం వేసుకుంటూ భవిష్యత్తును విశ్వాసంతో నిరీక్షించుతున్నారు. వాళ్ల ముఖాలు బడలికగా ఉన్నా, ఆలోచనలు మాత్రం చాలా సాహసికంగా ఉన్నాయి. జరిగిన పనిని సమీక్ష చేసుకున్నప్పుడు, తమపట్ల అసంతృప్తిని వారేమీ దాచలేదు. డాక్టరు సంక్షోభంతో కుర్చీమీద ఇటూ అటూ జరిగేడు.

''ఈనాడు మనం చేస్తున్న ప్రచారం చాలదు, కార్మికులు చెప్పే ఈ మాట నిజం! మన ఆందోళనయొక్క స్థాయిని పెంచాలి. మన కార్యకర్తలు చెప్పేమాటలు నిజం!''

నికొలాయ్ చిరచిరలాడి, డాక్టరులాగున మాట్లాడ్డం మొదలెట్టేడు.

''కరపత్రసాహిత్యం సరిపోవడం లేదని అందరూ అంటారు కాని, ఇంతవరకూ మనం కాస్త చక్కని ముద్రణాలయాన్ని నెలకొల్పలేకపోయాం. పాపం లుద్మిలా ఒక్కతే శ్రమపడుతోంది. ఆమెకు కొంచెం సాయం చెయ్యకపోతే, ఆమె పడిపోతుంది.''

"మరి వెసొవ్ష్చికోవ్ మాటేమిటి?" అని సోఫ్యా అడిగింది.

"అతడు పట్టణంలో ఉండేందుకు వీల్లేదు. కొత్త ముద్రణాలయాన్ని ప్రారంభించాకే అతడు పనికందుకుంటాడు. కాని ప్రారంభించడానికి ముందే మనకింకో మనిషి కావాలి."

"ఆ పనికి నేను పనికిరానా?" అని తల్లి మెల్లగా అడిగింది.

ఆ ముగ్గురూ ఒకే సారి నిశ్శబ్దంగా ఒక క్షణం ఆమెకేసి చూశారు.

"అదీ ఒక మంచి ఆలోచనే!" అంది సోఫ్యా.

"నీలొవ్నా! ఆ పని మీకు చాలా కష్టం" అన్నాడు నికొలాయ్ పొడిగా. "మీరు పట్టణం బయట నివసించాలి. అంటే పావెల్‌ని చూడ్డానికి వీలుండదు. మొత్తంమీద...." అని నికొలాయ్ చెప్పబోతుంటే తల్లి నిట్టూర్చి మాటకడ్డొచ్చింది.

"నేను చూడకపోతే పావెల్‌కి నష్టమేమీ లేదు కదా! నిజం చెప్పాలంటే నాకైనా ఈ చూపులు నా ప్రాణానికొక పరీక్షలా వున్నాయి. నన్నతనితో ఏమీ మాట్లాడ నివ్వరు – అత నికేసి మాటామంతీ లేకుండా చూస్తూ బొమ్మలా నిలబడాలి. అంతలో చెప్పకూడని మాటే మైనా చెప్పిపోతానేమో అన్నట్లుగా వాళ్ల కళ్లన్నీ నా నోటిమీదే ఉంటాయి."

ఇటీవల కొద్ది రోజులనుండి జరుగుతున్న సంఘటనలతో ఆమె అలిసిపోయింది. పట్టణానికి కొంచెం దూరంగా ఉండే సావకాశం లభించింది కనుక దాని నుపయోగించుకోవాల నిపించింది.

నికొలాయ్ మాటతప్పించాడు. డాక్టరుకేసి చూసి:

"ఇవాన్, నీవేమిటి ఆలోచిస్తున్నావు?" అని అడిగేడు.

డాక్టర్ వంచిన తల పైకెత్తేడు.

"మనం ఇంత తక్కువమంది ఉన్నామే అని ఆలోచిస్తున్నాను. మనం యింతకన్న ఎక్కువ ఉత్సాహంతో పట్టుదలతో పనిచేయవలసిన అవసరముంది. పావెల్ అన్‌ద్రేయ్‌లు తప్పించుకు రావలసిన అగత్యాన్ని గురించి వాళ్లకు నచ్చచెప్పాలి. వాళ్ళు పనిపాటలు లేకుండా గోళ్లు గిల్లుకుంటూ కూచోవలసినవాళ్లు కారు. వాళ్లు చేయవలసిన అమూల్యమైన కృషి చాలా ఉంది" అని విచారంగా అన్నాడు.

నికొలాయ్ చిరాకుగా తలూపి, తల్లికేసి చూశాడు. తన కొడుకును గురించి తన ఎదుట మాట్లాడ్డానికి వాళ్లు సంకోచిస్తున్నారనే సంగతి ఆమె గ్రహించి చటుక్కున లేచి వెళ్లి పోయింది. తన కోరికను వాళ్లు మన్నించలేదని కూడా ఆమెకు కష్టం తోచింది. ఆమె మంచంమీద పడుకుని, కళ్లు తెరచుకుని వాళ్ల గుసగుసలను వినేసరికి ఆమెను ఆందోళన ఆవహించింది.

ఆ రోజును గురించి ఆమె తలుచుకునేసరికి కారు మబ్బులగుపడ్డాయి. అంతా చెడుగే ముందున్నట్లగుపడింది. ఆమెకా విషయాలను గురించి ఆలోచించాలని లేదు. మనసును

చికాకుపరచే భావముద్రలను ఒక పక్కకు నెట్టివేయడానికి ప్రయత్నించింది. పావెల్‌మీదనే తన మనసంతా లగ్నంచేసింది. అతడు తప్పించుకొస్తే బాగుండుననుకుంది. కాని అదేసమయంలో భయం కలుగుతోంది. తన చుట్టూ జరుగుతున్న సంఘటనలన్నీ ఒక చరమావస్థకు వస్తున్నట్టూ, తీవ్ర సంఘర్షణకు దారితీస్తూన్నట్టూ ఆమెకు తోచింది. ప్రజలు మౌనంగా చూపుతున్న ఓరిమి స్థానంలో ఉద్రేకపూరితమైన నిరీక్షణ ప్రవేశించుతూంది. వాళ్ల కోపం గమనీయంగా హెచ్చింది. ఎక్కడికెళ్లినా తీవ్రమైన మాటలు ఆమె చెవిని బడుతున్నాయి. ఎక్కడ చూసినా అశాంతి ప్రబలమైపోయింది. ప్రతి ప్రకటన గురించీ, బజారుల్లోనూ, దుకాణాల్లోనూ, నౌకర్లలోనూ, పనివాళ్లలోనూ చాలా ఆవేశపూరితమైన చర్చలు జరుగుతున్నాయి. పట్టణంలో అరెస్టు జరిగినప్పుడల్లా వెనువెంటనే దాని కారణం గురించి బెదురుపాటు వ్యాఖ్యానాలూ, గందరగోళపు వ్యాఖ్యానాలూ, ఒక్కొక్కప్పుడు అప్రయత్నంగా సానుభూతితో కూడిన వ్యాఖ్యానాలూ బయల్దేరేవి. ఒకప్పుడు ఆమె భయపడుతూ విన్న తిరుగుబాటు, సోషలిస్టులు, రాజకీయాలువంటి మాటలను సామాన్య ప్రజలు మాట్లాడుకుంటూంటే ఆమె చాలా తరుచుగా వింటోంది. వాటిని వెటకారంగా ప్రయోగిస్తే, ఆ వెటకారం వెనక విషయాన్ని తెలుసుకోవాలనే కుతూహలముంది. దురుద్దేశంతో ఆ మాటలు ఉపయోగింపబడినప్పుడు ఆ దురుద్దేశం వెనక భయం కనబడుతోంది. ఆలోచనాపూర్వకంగా ఆ మాటలప్రస్తావన జరిగితే ఆ ఆలోచనలో ఆశ, బెదరింపు ద్యోతకమవుతున్నాయి. ఈ విస్తబ్ధ జీవిత తటాకపు కారునలుపు జలాలమీద అశాంతి వలయాలు మెల్లగా విస్తరించడం ప్రారంభించాయి. నిద్రాణంగా ఉన్న అభిప్రాయాలు మేలుకోనారంభించాయి. రోజురోజూ జరుగుతుండే సంఘటనలకు నెమ్మదిగా తలొగ్గే వైఖరి తొలగిపోతూంది. దీన్ని తల్లి ఇతరులకన్న మరింత స్పష్టంగా చూడగలిగింది. ఏమంటే, జీవితంయొక్క కఠోర స్వరూపం ఆమెకు వీరికంటె బాగా తెలుసు. ఇప్పుడు ఆలోచన అనంతృప్తులతో కూడిన యీ జీవితాన్ని చూస్తూంటే ఆమెకు సంతోషమూ, భయమూ, రెండూ కల్గాయి: ఇందులో తన కొడుకు కృషి ఉండడం చూసింది కాబట్టి ఆమెకు సంతోషం కలిగింది, అతడు జైలునుంచి బయటకు వస్తే మొదటి వరుసలో ప్రమాదం అత్యధికంగా ఉండే స్థానంలో నిలబడతాడనీ, అందుచేత అతడు నశించిపోతాడనీ ఆమె ఎరుగును కాబట్టి భయం కలిగింది.

ఒక్కొక్కప్పుడు తన కొడుకును గురించి ఆలోచించుకుంటుంటే, అతడు వీరగాథల్లోని వీరుని ఉన్నతిలో ఆమెకగుపడేవాడు. తను విన్న అన్ని చక్కని మాటలూ, మనసును ఉద్విగ్నంచేసే అన్ని పలుకులూ, తను ప్రశంసించిన అందరు వ్యక్తులూ, తను ఎరిగిన సర్వ తేజస్సూ, శౌర్యమూ — అన్నీ ఆ మూర్తిలో సాక్షాత్కారమయేవి. అలాంటప్పుడు ఆమె హృదయం గర్వంతోనూ, ఆర్ద్రతతోనూ నిండిపోయేది. అతన్ని గురించి ప్రశాంతమైన ఆనందపారవశ్యంతో ఆలోచించుకుంటూ ఉండేది.

"అన్నీ సరిగానే సర్దుకుంటాయి" అనుకునేది.

కాని ఆమెలోని మాతృత్వం ప్రకోపించి విశాల మహత్తర మానవతా భావాలను అగ్ని హోత్రంలాగున హుతం చేసివేసి, తీవ్రవేదనతో స్పందించుతున్న ఒక్క ఆలోచనను మాత్రమే ఆ పారవశ్యతా భస్మంలో మిగుల్చుతూండేది.

"వాడిని చంపుతారు.... చంపేస్తారు."

## 14

ఒక రోజున మధ్యాహ్న సమయంలో ఆమె జైలు కార్యాలయంలో పావెల్ కెదురుగా కూచుని, గెడ్డం పెరిగిన అతని ముఖంకేసి, నీరు కమ్మిన కళ్లతో తదేక ధ్యానతో చూసింది. వేళ్ల మధ్యన ఉండగా నలిపి ఉంచిన కాగితం ముక్కను అతడి కందివ్వడానికి సమయ మెప్పుడా అని ఆమె చూస్తోంది.

"నేను కులాసాగానే ఉన్నాను. మిత్రులంతా కూడా బాగానే ఉన్నారు. నువ్వెలా ఉన్నావు?" అన్నాడు పావెల్ మెల్లగా.

"బాగానే ఉన్నాను. యెగోర్ ఇవానొవిచ్ చచ్చిపోయాడు."

"అలాగా!" అని అతడు మెల్లగా తలొంచుకున్నాడు.

"సమాధి జరిగేటప్పుడు పోలీసులు దెబ్బలాటకొచ్చారు. ఒకడిని అరెస్టు కూడా చేశారు" అంటూ తల్లి అమాయకంగా చెప్పడం మొదలెట్టింది. అసిస్టెంటు జైలరు నాలుక కరుచుకుని గభాలున లేచి నుంచున్నాడు.

"అలాంటి సంగతులు మాట్లాడకూడదని తెలియదుటమ్మా? రాజకీయాలు మాట్లాడ కూడదు" అని వణికేడు.

తల్లి కూడా లేచి నిలబడింది.

"నేనేమీ రాజకీయాలు మాట్లాడ్డం లేదు. ఒక దెబ్బలాట గురించి చెబుతున్నాను. వాళ్లు దెబ్బలాడుకున్న మాట నిజం. ఒక కుర్రవాడి నెత్తి కూడా బద్దలుకొట్టారు...." అని క్షమాపణ చెబుతూన్నట్టు అంది.

"అదంతా ఒకటే.... ఆ ప్రస్తావన తేవద్దు. మీ వ్యక్తిగతమైన సంగతులు, అంటే మీ యిల్లు, కుటుంబం — ఇలాంటి వాటి గురించే మాట్లాడాలి తప్ప ఇతర వ్యవహారాలేమీ మాట్లాడకూడదు."

ఇందులో తను ఇరుక్కుంటున్నానేమోననే సంకోచంతో అతడు బల్లదగ్గర కూచుని కాగితాలు తిరగెయ్యడం మొదలెట్టేడు.

"ఇలాంటి విషయాల్లో ఏ చిక్కులొచ్చినా నేను సమాధానం చెప్పుకోవాలి" అని విసుక్కున్నాడు.

తల్లి పావెల్‌కేసి చూస్తూనే తన చేతిలోని కాగితం అతడి కందిచ్చి అమ్మయ్య అనుకుంది.

"ఏం మాట్లాడవచ్చునో ఏం మాట్లాడకూడదో నాకు తెలియదు" అంది.

"నాకూ తెలియదు" అని పావెల్ నవ్వేడు.

"అలాంటప్పుడు ఇక్కడికి రావడంలో ఏమీ అర్థం లేదు. ఏం మాట్లాడాలో తెలియకుండా ఇక్కడికొచ్చి జనాన్ని బాధపెట్టడమవుతోంది" అని చిరాకు పడ్డాడు అసిస్టెంటు జైలరు.

"త్వరలో విచారణ ప్రారంభిస్తారా?" అని తల్లి అడిగింది.

"ప్రోసెక్యూటరు ఈమధ్యనే వచ్చి వెళ్లేడు. విచారణ త్వరలోనే జరుగుతుందన్నాడు...."

వాళ్లిద్దరూ ఏవో చిల్లరమల్లర ప్రస్తావనలు చేసుకున్నారు. పావెల్ ఎంతో ఆప్యాయంగా తనకేసి తేరిపారచూడ్డం తల్లి గమనించింది. ఎప్పటిలాగే అతడు తొణుకూబెణుకూ లేకుండా నిదానంగా ఉన్నాడు. చేతులు కొంచెం తెల్లబడడం, గెడ్డం బాగా పెరగడం తప్ప అతనిలో పెద్ద మార్పేమీ లేదు. గెడ్డం పెరగడంవల్ల వయసు మళ్లినవాడులా కనబడ్డాడు. అతనికి ఏదో శుభ వర్తమానం చెప్పాలని ఆమె అనుకుంది. నికొలాయ్ సంగతి తెలియచెయ్యాలని అభిలాషపడింది. కనుక ఏమీ ఎరగనట్లుగానే అమాయకంగా:

"ఈమధ్యనే నీ పెంపుడు కొడుకు కనబడ్డాడు" అంది.

పావెల్ ఎవరా అన్నట్లుగా కళ్లు చిట్లించాడు. వెసొవ్‌శ్చికోవ్ ముఖంమీది మశూచికపు మచ్చలను గుర్తుకు తెస్తూ ఆమె తన చెక్కిళ్లమీద సౌంజ్ఞ చేసింది.

"ఆ కుర్రాడు బాగానే కాలక్షేపం చేస్తున్నాడు. త్వరలో అతని కొక పని వస్తు చెపుతున్నారు."

పావెల్ ఆ సంకేతాన్ని అర్థంచేసుకుని తలూపేడు. కళ్లలోనే నవ్వు తొణికిసలాడింది.

"చాలా బాగుంది" అన్నాడు.

"ఇంతే సంగతులు!" అంది. తను చేసిన పనికామె చాలా సంతృప్తిపడింది. పావెల్ సంతోషంగా ఉన్నందుకు సంతోషించింది.

"ధన్యవాదాలు అమ్మా!" అంటూ అతడు ఆమె చెయ్యి గట్టిగా పట్టుకుని శలవు తీసుకున్నాడు.

తమకిద్దరికీ ఉండే సన్నిహితత్వంయొక్క సుఖానుభూతి మద్యంలాగ ఆమె తలకెక్కింది. అతనికి జవాబుచెప్పడానికి మాటరాక మౌనంగా అతడి చెయ్యి గట్టిగా నొక్కింది.

ఇంటికి చేరడంతోనే సాషా తనకోసం కాసుకు కూచోవడం చూసింది. సాధారణంగా తను జైలుకు వెళ్లొచ్చిన రోజున సాషా తనను చూడ్డానికొచ్చేది. ఆమె ఎప్పుడూ పావెల్ సంగతి అడిగేది కాదు. తల్లి తనంతట తానే అతని సంగతి చెప్పకపోతే, తల్లి కళ్లకేసి చిత్రంగా చూసి సంతుష్టిచెందేది. కాని ఈసారి మాత్రం ఆమె రావడంతోనే ఆత్రంగా:

"అతనెలా ఉన్నాడు?" అని అడిగింది.

"బాగానే ఉన్నాడు."

"చీటిని అందిచ్చారా?"

"ఆ! దాన్ని అతని చేతికెల్లా అందిచ్చానో మీరు చూసి ఉండవలసింది!"

"అతడు దాన్ని చదువుకున్నాడా?"

"అక్కడా? అదెలా సాధ్యం?"

"అవునవును. మరిచేపోయాను. మన మొక వారంరోజులు ఆగాలి.... ఆ, పూర్తిగా వారం! అతడు ఒప్పుకుంటాడంటారా?"

సాషా ముఖం చిట్లించి, తల్లికేసి రెప్పవాల్చకుండా చూసింది.

"ఆ సంగతి నేను చెప్పలేను.... అందులో ప్రమాదం లేకపోతే ఎందుకొప్పుకోడు?" అంది తల్లి.

సాషా తల ఎగరేసింది.

"రోగికి తినడానికేమివ్వవచ్చునో మీకు తెలుసా?" అని అడిగింది. "అతనికి చాలా ఆకలేస్తోంది."

"అతనన్నీ తినచ్చు. ఒక క్షణం ఆగండి.... నేను...." అంటూ తల్లి వంటింట్లో కెళ్లింది. సాషా వెంట వెళ్లి,

"మీకు సాయం చెయ్యమంటారా?"

"సరి. సరి. వద్దులెండి."

తల్లి నడుం వంచి ఓవెన్‌లోంచి ఒక గిన్నె తీసింది.

"ఆగండి...." అని సాషా నెమ్మదిగా అంది.

ఆమె ముఖం వెల్లబారింది. కళ్లు నొప్పితో పెద్దవైనాయి. వణుకుతున్న పెదవులతో తల్లి చెవిలో ఇలా గుసగుసలాడింది:

"మీకొక మాట చెపుదామనుకుంటున్నాను.... అతడు అంగీకరించడని నా నమ్మకం — ఆ విషయమై మీరు అతనితో మాట్లాడి అతన్ని ఒప్పించాలని నేను ప్రాధేయపడుతున్నాను! ఇక్కడ మనకతని అవసరం చాలా ఉంది! మన పనికోసమే అతడు ఇక్కడుండవలసిన అవసరమని చెప్పాలి. అతని ఆరోగ్యాన్ని గురించి కూడా నాకు చాలా భయంగా ఉందని చెప్పండి. ఆ సంగతి మీరే చూస్తున్నారు కదా! — ఇంతవరకు విచారణ తేదీ కూడా నిర్ధారణ కాలేదు...."

ఈ మాటలు చెప్పడానికి ఆమె ఎంతో శ్రమపడినట్లు స్పష్టమవుతూనే ఉంది. ఆమె కంఠస్వరం గద్గదమైంది, నిటారుగా నిలబడి కళ్లు పక్కకు తిప్పుకుంది, తర్వాత అలసటతో కళ్లు మూసుకుని పెదవి కొరుక్కుంది. ఆమె మెటికెల కిరకిర ధ్వని తల్లికి వినిపించింది.

పిలొవ్నాను ఈ ఉద్వేగం కలవరపరచింది. ఆమె సాషాను అర్థంచేసుకుని ఆమెను కౌగలించుకుంది.

"అయ్యో నా తల్లీ! అతడు తనకు తోస్తే తప్ప ఎవరి మాటా వినడు కదా! ఎవరి మాటా వినడు" అని విచారంగా చెప్పింది.

వాళ్లిద్దరూ ఒకరి నొకరు హత్తుకుని నిశ్శబ్దంగా నిలబడ్డారు.

సాషా మెల్లగా తల్లి కౌగిట్లోంచి తప్పించుకుని,

"మీరు చెప్పిన మాట నిజమేనమ్మా. ఇది తెలివితక్కువ. నరాల బడలిక" అని కంపిస్తూ చెప్పింది. తర్వాత కుదుటపడి వ్యవహార సరళిలో "సరే.... మనం రోగికి కొంచెం ఆహార మిద్దాం" అంది.

ఆమె ఇవాన్ పక్కన కూచుని, తలనొప్పిగా వుందా అని అడిగింది.

"అంతలేదు. కాని ఇంకా అంతా ఏదో అస్పష్టంగా ఉంది. చాలా నీరసంగా ఉంది" అని ఇవాన్ జవాబుచెప్పేడు. తత్తరపాటుతో దుప్పటి పైకి లాక్కున్నాడు. దీపం వెలుతురు కళ్లలో పడుతున్నదా అన్నట్లు కళ్లు చిట్లించాడు. తన ముందట తినడానికతడు బిడియ పడుతున్నాడని సాషా గ్రహించి, లేచి బయటి కెళ్లింది. ఇవాన్ లేచి కూచుని ఆమెకేసి తదే కంగా చూచాడు.

"ఎంత అందమైన మనిషి!" అని గొణిగాడు.

అతడి నీలికళ్లు ఉల్లాసంగా ఉన్నాయి. చిన్న పళ్లవరుస అందంగా ఉంది. కంఠస్వరం ఇంకా మార్పుచెందుతోంది.

"నీకెన్నేళ్లు?" అని తల్లి అతన్నడిగింది.

"పదిహేడు."

"తలిదండ్రులెక్కడున్నారు?"

"గ్రామంలో. నాకు పదేళ్లొచ్చినప్పటినుంచీ నేనిక్కడే ఉంటున్నాను. స్కూలు వదలిపెట్టడంతోనే ఇక్కడ కొచ్చేశాను. మీ పేరేమిటి, కామ్రేడ్?"

ఎవరైనా "కామ్రేడ్" అని తన్ను పిలిస్తే తల్లికి సరదాగా వుండేది, పట్టరాని సంతోషం కలిగేది.

"నా పేరు నీకెందుకు?" అని చిరునవ్వుతో అతడి నడిగింది.

అతడు కొంచెం ఇరుకునపడి తటపటాయిస్తూ ఇలా చెప్పేడు:

"చూశారా? మా అధ్యయన బృందంలోని విద్యార్థి ఒకడు — అంటే మాకు చదువు చెప్పే అతడు — కార్మికుడైన పావెల్ వ్లాసావ్ తల్లిని గురించి చెప్పేడు. మే ఒకటవ తేదీన జరిగిన ప్రదర్శనం జ్ఞాపకముందా?"

తల్లి వెంటనే తలూపింది.

"మన జెండాను వీధుల్లో ఊరేగించినప్పుడు ముందు నిలబడినవాడతనే" అని ఆ పిల్ల వాడు సగర్వంగా ప్రకటించాడు. ఆ గర్వం తల్లి హృదయంలో ప్రతిధ్వనించింది.

"నేనప్పుడక్కడ లేను. మా ప్రదర్శనాన్ని మేము వేరుగా చెయ్యాలనుకున్నాం. కాని అది సాగలేదు. మేము చాలా కొద్దిమందిమైపోయాం. మళ్ళీ సంవత్సరం మేం తప్పకుండా చేస్తాం, మీరు చూస్తారుకదా!"

ముందు సంగతి తల్చుకునేసరికి అతనికి సరిగా ఊపిరి ఆడలేదు.

"ఇదిగో, ఆ వ్లాసావ్ తల్లిని గురించే నే చెప్తున్నది.... దాని తర్వాత ఆమె పార్టీలో చేరింది కూడా. ఆమె చాలా అద్భుతమైన మనిషని అంటారు!" అని చెమ్మాను ఆడించతూ ముగించాడు.

తల్లి నోరారా చిరునవ్వు నవ్వింది. ఆ పిల్లవాడి పొగడ్త వినడానికి ఆనందంగానే ఉంది. కాని కొంచెం బాధగా మాత్రం తోచింది. "నేనే ఆ వ్లాసావ్ తల్లిని" అని చెప్పాలనుకుంది. కాని తటపటాయించి తనలో తానే కొంచెం వెటకారంగా "తెలివితక్కువ ముసలమ్మవు. అంతే" అనుకుంది.

"ఇదిగో, ఇంకా కొంచెం తిను. మన మంచి పనికోసం నువ్వు తొందరగా కోలుకో వాలి" అని చటుక్కున ఆందోళనగా అతని శరీరంమీదకు వంగి చెప్పింది.

ఇంతలో వీధితలుపు తెరుచుకుంది. తేమగా చల్లని శరత్కాలపు నిశ్వాస లోపలికి చొరబడింది. సోఫ్యా చిరునవ్వుతో గులాబి పువ్వులా నిలబడి ఉండడం తల్లి చూచింది.

"అబ్బ! ఏమి చెప్పమంటారు! గూఢచారులు నావెంట పడుతున్న పద్ధతి చూస్తే, నేనొక ధనికురాలైన పెళ్లికూతురు కాబోలనుకుంటారు మీరు. నేనింక వెళ్లిపోవాలి.... ఇవాన్ ఎలా ఉన్నావు? బాగా ఉన్నావా?... నీలొవ్నా, పావెల్ కబుర్లేమిటి?... సాషె ఇక్కడుందా?"

తన బూడిదెరంగు కళ్లతో ఆమె తల్లికేసీ, పిల్లవానికేసీ చాలా ఆప్యాయంగా చూసింది. ఒక సిగరెట్టు ముట్టించి, జవాబులొస్తాయని ఆశించకుండానే ప్రశ్నలడిగింది. తల్లి ఆమెను గమనిస్తూ చిరునవ్వు నవ్వింది.

"నన్ను కూడా ఈ మంచివాళ్లందరిలోనూ ఒకదాన్నిగా లెక్క వేసుకుంటున్నారు!" అని అనుకుంది.

మరొకసారి పిల్లవానిమీదకు వంగి,

"త్వరగా ఒళ్లు నయంచేసుకోవాలి నాయనా!" అంది.

తర్వాత ఆమె భోజనాలగదిలో కెళ్లింది. అక్కడ సోఫ్యా సాషాతో మాట్లాడ్డం చూసింది.

"ఆమె అప్పుడే మూడు వందల కాపీలు తయారుచేసింది. ఇలా ఆమె పనిచేస్తే ఆత్మ

హత్య చేసుకున్నట్లే అవుతుంది. చాలా గొప్పగా చేస్తోందిలే. పాషా! అలాంటి మనుషులతో తిరుగుతూ వాళ్లతో కలిసి పనిచెయ్యడం చాలా గొప్ప అదృష్టం సుమండీ!''

''విప్పండేహాంగా!'' అని మెల్లగా పాషా జవాబుచెప్పింది.

ఆరోజు సాయంకాలం టీ తాగేటప్పుడు సోఫ్యా తల్లికేసి తిరిగి: ''నీలొవ్నా! మీరు మరొకసారి పల్లెటూళ్లు తిరిగిరావలసుంటుంది'' అని చెప్పింది.

''సరే. ఎప్పుడు?''

''మూడు రోజుల్లో వెళ్లగలరా?''

''వెళ్లగలను.''

''ఈ సారి మీరు తపాలా గుర్రపుబండిలో ప్రయాణం చెయ్యాలి. మరొక దారిని వెళ్లాలి. నికోల్స్కాయె ప్రాంతం మీదుగా వెళ్లాలి'' అన్నాడు నికొలాయ్. అతడు రుసరుసలాడుతున్నాడు. సాధారణంగా అతడలాటి స్వభావం కలవాడు కాదు. అతడి మామూలు దయార్ద్ర ప్రశాంతతకు యీ రుసరుస సరిపడినట్లు లేదు.

''నికోల్స్కాయె ద్వారా వెళ్లడం దూరమే.... పైగా, గుర్రాలను అద్దెకు తీసుకోవడం ఖర్చు ఎక్కువ....'' అంది తల్లి.

''నిజం చెప్పాలంటే, నేనీ ప్రయాణానికి వ్యతిరేకిని. అక్కడ వ్యవహారాలేమీ సాఫీగా లేవు. కొన్ని అరెస్టులు జరిగాయి. ఎవరో ఒక ఉపాధ్యాయుణ్ణి పట్టుకున్నారుట. మనం ఇంకా కొంచెం జాగ్రత్తగా ఉండాలి. కొంత కాలం ఆగితే బాగుంటుందేమో?''

''వాళ్లకు మనం నిరంతరం సాహిత్యాన్ని అందిస్తూనే ఉండాలి'' అంది సోఫ్యా, బల్లమీద వేళ్లతో చప్పుడు చేస్తూ. ''మీకేమైనా వెళ్లడానికి భయమేస్తోందా, నీలొవ్నా?'' అని గభాలున తల్లి నడిగింది.

తల్లి నొచ్చుకుంది.

''నేనెప్పుడైనా భయపడ్డానా? మొదటి సారి వెళ్లినప్పుడే నేను భయపడలేదు కదా! ఇప్పుడు మీరెందుకు —'' అని వాక్యాన్ని ముగించకుండానే తలొంచుకుంది. మీరు భయపడుతున్నారా అని కాని, ఈ పని చెయ్యడానికి మీకేమీ అభ్యంతరం లేదుకదా అనిగాని, ఫలానా పని మీరు చెయ్యగలననుకుంటున్నారా అనిగాని ఎవరైనా ఆమె నడిగినప్పుడు, వాళ్లు తననేదో మెహర్బానీ చెయ్యమన్నట్లడుగుతున్నారనీ వాళ్లందరితోపాటు తనను చూడకుండా, తననేదో ప్రత్యేకంగా చూస్తున్నారనీ ఆమె భావించుకునేది.

''నేను భయపడుతున్నానా అని మీరు నన్నడగడమెందుకు? మీరు ఒకళ్ల నొకళ్లు ఆవిధంగా ప్రశ్నించుకోరుకదా?'' అని ఆమె గద్గదస్వరంతో అడిగింది.

నికొలాయ్ తన సోదరిని తదేక దీక్షతో చూస్తూ సులోచనాలను తీసి మరల ధరించాడు.

ఎబ్బెట్టుగా ఉన్న వాళ్ల మౌనాన్ని భరించలేక తల్లి ఏదో తప్పు చేసినట్లుగా లేచి నిలబడి ఏవో కొన్ని మాటలు చెప్పబోయింది. సోఫ్యా ఆమె చేతిని పట్టుకుని ఆపుచేసింది.

"క్షమించండి. ఇక ముందెప్పుడూ ఇలాంటి పొరపాటు చెయ్యను" అని మెల్లగా చెప్పింది.

తల్లి ముఖంమీద చిరునవ్వు తొణికిసలాడింది. కొద్ది నిమిషాల్లో వాళ్లు ముగ్గురు హడావిడిగా జరగాల్సిన ప్రయాణం సంగతి చర్చించుకుంటున్నారు.

## 15

అరుణోదయం వేళ తల్లి శరత్కాలవర్షాలవల్ల గతుకులు పడిన రోడ్డుమీద తపాలా బగ్గీలో ఊగిసలాడుతూ ప్రయాణం సాగిస్తోంది. ఈదర గాలి విసురుగా వీస్తోంది. అందరి చేతులమీదా బురద చిందుతోంది. బండివాడు తన స్థానంలోంచి వెనక్కి తిరిగి ముక్కు మాటతో ఆమెతో ఫిర్యాదు చేశాడు:

"మా అన్నయ్యతో చెప్పేను. ఏమనంటే మనం పంచుకుందామని—కనుక పంచుకోవడం మొదలెట్టేం...." గభాలున కొరడాతో దాపటి గుర్రానికొక చురకేశాడు. కోపంతో అరుస్తూ, "ఏయ్ మాయముండా నడు!" అని అదిలించాడు.

ఆకురాలు కాలపు బలిసిన కాకులు ఖాళీగా ఉన్న నాగటిచాళ్లమీద గంతులేస్తున్నాయి. శీతగాలి రయ్యిమని వీస్తోంది. గాలిదెబ్బల నెదుర్కోవడానికి కాకులు దృఢంగా నిలబడ్డాయి. గాలి వాటి రెక్కల నెగరగొట్టి పైకి లేవనెత్తుతుంటే బలవంతంగా రెక్కలను తపతప కొట్టుకుంటూ బద్ధకంగా మరొక చోటికి చేరుకుంటున్నాయి.

బండివాడు తన సొద మళ్లీ మొదలెట్టేడు:

"ఆ మీద మా అన్నయ్య నా వాటాను కాజేశాడు. కనుక ఇక నాదన్నదేమీ లేదు...."

తల్లి అతడి సొద నంతటినీ కలలో లాగున వింది. కడచిన కొద్ది సంవత్సరాల సంఘటనలు ఆమె స్మృతిపథాని కొచ్చాయి. వాటన్నిటిలోనూ తాను జోరుగా పనిచేస్తున్నట్లామె కగుపడింది. ఇదివరలో జీవిత పరిస్థితులన్నిటినీ ఎవరో, ఎక్కడో దూరాన, ఎందుకో రూపొందించేవారు. కాని ఇప్పుడా స్థితిగతులనేకం తన కళ్ల ముందర మారిపోతున్నాయి. తన సహాయంతో మారిపోతున్నాయి. కాని తన శక్తియందింకా నమ్మకం కుదరలేదు, ఏం చెయ్యాలో తోచక విచారభరితురాలైంది....

ఆమె పరిసరవస్తువులన్నీ మెల్లగా కదుల్తున్నాయి. నల్లని మేఘాలు ఆకాశంమీద ఒకదాని నొకటి తరుముతున్నాయి. రోడ్డు కిరువక్కలా ఉండే తడిసిపోయిన చెట్లు పక్కనుండి కదిలిపోతూ మోళ్లైపోయిన కొమ్మలనాడిస్తున్నాయి. పొలాలు వెళ్లిపోయి, వాటి

స్థానంలో మట్టిగుట్టలు చేరుకుంటున్నాయి, వాటి సమయమొచ్చేసరికి మాయమైపోతున్నాయి.

బండివాడి ముక్కిడి గొంతుక, గుర్రపు జీనుగంటలు, శీతగాలిహోరు అన్నీ మిళితమై, పొలాలమీద జలజలమంటూ నిలకడగా పారే ఏరులాగ ప్రవహించాయి.

బండివాడు తన స్థానంలో ఊగిసలాడుతూ కథ సాగించాడు:

"డబ్బున్నవాడికి స్వర్గం కూడా చాలా స్వల్పంగా కనుబడుతుంది.... అతడు నన్ను పిండేస్తున్నాడు.... అధికారులందరూ అతని స్నేహితులే...."

స్టేషను చేరగానే బండివాడు గుర్రాలను విప్పేశాడు.

"తాగడానికొక అయిదు కోపెక్కులియ్యండి" అని తల్లిని బతిమాలుకున్నాడు.

ఆమె ఇచ్చిన నాణేన్ని అతడు అరచేతిలో ఎగరేసి ఆడించాడు.

"మూడు సారాకి పోతాయి. రెండు రొట్టెకి...." అన్నాడు.

మధ్యాహ్నం, తల్లి చాలా అలసిపోయి, చలితో వణుకుతూ పెద్ద గ్రామమైన నికోల్స్కాయె చేరుకుంది. ఒక గ్లాసు టీ తాగాలని స్టేషన్‌లో కెళ్లి కిటికీ పక్కనే కూచుంది. బరువుగా ఉన్న పెట్టెను బల్లకింద పెట్టుకుంది. కిటికీలోంచి చూస్తుంటే ఎదట చిన్న మైదానం కనబడింది. మైదానంపైన మొలిచిన పసుపుపచ్చని గడ్డి తొక్కుడు పడి ఉంది. దాని దగ్గరగానే, కూలిపోతున్న కప్పుగల బూడిదరంగు భవనం అగుపడింది. అది స్థానిక ప్రభుత్వ కార్యాలయం. ఆ భవనపు వరండాలో, కోటులేకుండా చొక్కా మాత్రం ధరించిన బట్టతల, గెడ్డంగల రైతు కూచుని పొగగొట్టం పీలుస్తున్నాడు. ఆ మైదానంలో ఒక పంది గడ్డి మేస్తోంది. అది చిరాకుగా చెవులు టపటపలాడించింది. తలాడిస్తూ ముట్టెను భూమిలోకి దూర్చింది.

ఆకాశంమీద పెద్దపెద్ద నల్లని మేఘాలు పరుగులెడుతున్నాయి. అంతా నిశ్శబ్దంగానూ, అంధకారయుతంగానూ, నిరుత్సాహంగానూ ఉంది. జీవితమే స్తంభించిపోయినట్లుంది.

గభాలున ఒక పోలీసు సార్జెంటు గుర్రంమీద దౌడు తీస్తూ మైదానంమీద కొచ్చి ప్రభుత్వ కార్యాలయం దగ్గర ఆగేడు. కొరడాను గాలిలో ఝుళిపించి, రైతుమీద కేకలేశాడు. అతడి అరుపులు కంపించుతూ కిటికీ అద్దాన్ని తాకాయి. కాని మాటలు వినబడలేదు. రైతు లేచి నిలబడి దూరానికి వేలు చూపించాడు. సార్జెంటు గుర్రంమీంచి దిగి, కళ్లేలు రైతు చేతుల్లోకి విసిరి, తూలుతూ మెట్ల దగ్గరకు చేరి కమ్మీపట్టుకుని వసారామీద కెక్కి గుమ్మంలోనుంచి అదృశ్యమయాడు.

మళ్లీ అంతా నిశ్శబ్దమైపోయింది. రెండుసార్లు గుర్రం గిట్టలతో మెత్తటి నేలను తవ్వింది. పసుపుపచ్చని జుట్టును పొట్టిజడగా ధరించి, గుండ్రని ముఖం, ఆర్ద్రమైన కళ్లూ గల పదమూడు పధ్నాలుగేళ్ల యువతి తల్లి కూచున్న గదిలో కొచ్చింది. పొట్టలు పడిన

పళ్లెంనిండా తినుబండారాల ప్లేట్లను పేర్చుకుని పెదవులు కరుచుకుని తలూపుతూ ప్రవేశించింది.

"అమ్మాయీ! నీకు మేలగుగాక!" అని తల్లి ఆమెను పలకరించింది.

"నమస్కారం!"

ఆమె టీ సరుకులన్నిటినీ బల్లమీద పెట్టి హఠాత్తుగా ఆవేశంతో,

"వాళ్లొక దొంగను పట్టుకున్నారు. ఇప్పుడే ఇక్కడికే తీసుకొస్తున్నారు!" అని చెప్పింది.

"ఎవరతను?"

"నాకు తెలియదు...."

"అతను ఎవరి సొత్తును దొంగిలించాడు?"

"అది నాకు తెలియదు. వాళ్లు అతన్ని పట్టుకున్నారని మాత్రమే నాకు తెలుసు. పోలీసు అధికారిని తీసుకు రావడానికి కాపలామనిషి వెళ్లేడు."

తల్లి కిటికీలోంచి తదేక ధ్యాసతో చూసింది. మైదానంమీద రైతులు చేరుతుండడం గమనించింది. కొందరు నిదానంగా మందకొడిగా చేరుకుంటున్నారు. మరికొందరు గొర్రె తోళ్లకోట్లను పైకెగబట్టుకుని గబగబ నడుస్తూ వస్తున్నారు. వాళ్లందరూ ఆ భవనం ముందర చేరి ఎడమవైపుకు చూస్తున్నారు.

ఆ యువతి కూడా కిటికీలోంచి తొంగిచూసింది. భళ్లున తలుపు వేసి బయటికి పరుగెత్తింది. ఆ చప్పుడుకు తల్లి అదరిపడింది. తన పెట్టెను బల్ల కింద లోపలికి తోసేసి, తలమీద శాలువ కప్పుకుని, త్వరత్వరగా తలుపు తోసుకుని బయటి కెళ్లింది. ఏ కారణం చేతనో పరుగెత్తాలనిపించిన కోరికను మాత్రం అణుచుకుంది.

ఆమె వసారాలో కెళ్లేసరికి శీతగాలి విసురుగా వచ్చి కళ్లమీదా, గుండెలమీదా కొట్టినట్లయింది. ఊపిరి తీసుకోలేక ఉక్కిరిబిక్కిరైంది. కాళ్లు తడబడ్డాయి. మైదానానికి అడ్డం పడి రీబిన్ వచ్చాడు. అతని చేతులు వెనక్కు విరగదీసి కట్టబడున్నాయి. ఇరువక్కలా పోలీసులు నేలమీద కర్రలను తాటిస్తూ నడుస్తున్నారు. గుంపుగా జనం వసారా కెదురుగా నిశ్శబ్దంగా కాచుకు నిలబడ్డారు.

తల్లి నిశ్చేష్టురాలై తన చూపును అటువైపునుండి మరల్చడానికి శక్తిలేక అలా చూస్తూ నిలబడిపోయింది. రీబిన్ ఏదో మాట్లాడుతున్నాడు. అతని కంఠస్వరమైతే ఆమెకు వినబడుతోంది కాని అంధకారబంధురమైన ఆమె శూన్యహృదయానికి మాటలందడంలేదు.

ఆమె దీర్ఘంగా నిట్టూర్చి మనసును కుదురుపరుచుకుంది. వసారా దగ్గర విశాలమైన నీలి నేత్రాలుగల రైతు నిలబడున్నాడు. వెడల్పాటి గోధుమవన్నె గడ్డంగల అతడు తల్లికేసి తదేక ధ్యాసతో చూస్తున్నాడు. ఆమె దగ్గి, భయంచేత బలహీనంగా ఉన్న చేతులతో మెడను మర్దన చేసుకుంది.

''ఏం జరిగింది?'' అని కష్టంమీద అతడి నడిగింది.

''మీరే చూడండి'' అని జవాబుచెప్పి అతడు వెళ్లిపోయాడు. మరొక రైతొచ్చి ఆమె పక్కన నిలబడ్డాడు.

రీబిన్‌ను తీసుకొస్తున్న పోలీసులు గుంపుకెదురుగా ఆగిపోయారు. గుంపు క్రమక్రమంగా పెరుగుతోంది. కాని ప్రజలు మాత్రం నిశ్శబ్దంగా ఉన్నారు. హఠాత్తుగా రీబిన్ కంఠం పైకి లేచింది.

''సోదరులారా! మన రైతుల జీవితంయొక్క వాస్తవికతను విశదపరచే కరపత్రాలను గురించి మీరు విన్నారా? సరే కానివ్వండి. ఆ కరపత్రాల కారణంచేతనే నేనీ శిక్షననుభవి స్తున్నాను. నేనే వాటిని ప్రజల్లో వ్యాప్తంచేశాను!''

జనం రీబిన్‌కు దగ్గరగా చేరేరు. అతని కంఠధ్వని ప్రశాంతంగా తొణుకూ బెణుకూ లేకుండా ఉంది. దానితో తల్లికి బాగా స్పృహ వచ్చింది.

''విన్నావా ఆ సంగతి?'' అని రెండవ రైతు నీలి నేత్రాల రైతునొక పోటు పొడిచి మెల్లగా అడిగేడు. అతడు తల పైకెత్తి, జవాబుచెప్పకుండానే తల్లికేసి తేరిపారజూశాడు. రెండవవాడు కూడా ఆమెకేసి చూశాడు. మొదటివాడికన్న ఇతను చిన్నవాడు. అతనికి మచ్చలు గల ఒక్కపలచని ముఖంమీద ఒత్తుగాలేని నల్లటి గెడ్డముంది. వాళ్లిద్దరూ కూడా అక్కడ నుంచి వెళ్లిపోయారు.

''వీళ్లకు భయం కాబోలు'' అనుకుంది తల్లి.

ఆమె మరింత శ్రద్ధగా చూడసాగింది. తను నిలబడున్న వసారామీదనుంచి చూస్తుంటే, మిహాయిల్ ఇవానొవిచ్‌యొక్క నల్లని గాయపడిన ముఖం స్పష్టంగా కనబడింది. అతని కళ్లలోని ఉత్సాహపూరితమైన తేజస్సు నామె గుర్తించింది. అతడు కూడా తనను చూడా లనే కోరిక ఆమెకు కలిగింది. అంచేత ఆమె వేళ్లమీద నిలబడి మెడ బాగా సాచింది.

జనం అతన్ని విషాదపూరితమైన అనుమానంతో చూశారు. కాని ఏమీ మాట్లాడలేదు. గుంపు వెనక మాత్రం గుసగుసలు వినబడుతున్నాయి. రీబిన్ కష్టంమీద గొంతెత్తి మాట్లాడేడు:

''రైతులారా! ఆ కరపత్రాల్లో రాసిన సంగతులను నమ్మండి. బహుశా నేను వాటి కోసం నా ప్రాణాలను అర్పించవలసివుంటుందేమో. అవి ఎక్కడనుంచి వచ్చాయో చెప్ప మని నన్ను కొట్టేరు. నానా హింసలూ పెట్టేరు. మళ్లీ కొడతారు కూడా. కాని ఎలాటి బాధలు పెట్టినా భరించడానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఏమంటే, అందులో చెప్పిన మాటలన్నీ నిజం. రోజూ అవసరమైన బ్రెడ్డుకన్న కూడా సత్యం మనకి చాలా ఆప్యాయమై నదిగా ఉండాలి — అదీ సంగతి!''

''అతడా మాట ఎందుకు చెప్పాలి?'' అని వసారా దగ్గరున్న ఒక రైతు ఆశ్చర్యంగా అడిగేడు.

''ఇప్పుడేం చెప్పినా ఒకటే'' అని నీలి నేత్రాల రైతు బదులుచెప్పేడు.

జనం మాత్రం మాట్లాడకుండా కదలకుండా, రీబిన్‌కేసి చిరచిర చూస్తూ అలాగే నిలబడున్నారు. అగోచరమైన భారమేదో వాళ్లను ఆవిధంగా అణచిపెట్టిందా అన్నట్లుంది.

పోలీసు సార్జెంటు తూలుతూ వసారాలో కొచ్చాడు.

''ఎవరిక్కడ మాట్లాడేది?'' అని అతడు తాగుబోతులాగ అరిచాడు.

చటుక్కున అతడు మెట్లమీదనుంచి జారి రీబిన్ జుట్టు పట్టుకుని కుదిపేశాడు.

''అరి కుక్కలకొడకా! నువ్వేనా ఆ మాట్లాడుతూన్నది?'' అని అరిచేడు.

జనంలో కదలిక ప్రారంభమై, గొణగడం మొదలెట్టేరు. తల్లి ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో బాధపడుతూ తలొంచుకుంది. మళ్లీ రీబిన్ గొంతుక లేచింది:

''సత్పురుషులారా! చూడండి!...''

''నోర్ముయ్!'' అంటూ సార్జెంటు అతడి గూబమీద ఒక్క దెబ్బ కొట్టేడు. రీబిన్ అదిరిపోయాడు, భుజాలను కుంచించుకున్నాడు.

''వాళ్ళు మనిషిని చేతులు వెనక్కు విరిచికట్టి ఏపనైనా చేస్తారు....''

''ఏయ్ పోలీసులూ! వీణ్ణి తీసుకు పొండి. ఏమ్రోయ్ జనం, ఇళ్లకు పొండి!'' ఎముకను కరుచుకున్న కుక్కలాగ సార్జెంటు, రీబిన్ ఎదుట గంతులేస్తూ రీబిన్ని ముఖంమీద, గుండెలమీద, పొట్టమీద పిడికిలితో పొడిచాడు.

ఎవరో గుంపులోంచి,

''అతడిని కొట్టడం మానెయ్యి!'' అని కేకేశాడు.

''అతన్నెందుకలా కొట్టడం?'' అని ఇంకొకడు వత్తాసు పలికాడు.

''మనం పోదాం పద'' అంటూ నీలి నేత్రాల రైతు తన స్నేహితుడికి సౌంజ్ఞ చేశాడు. వాళ్లిద్దరూ నెమ్మదిగా జారిపోయారు. తల్లి వాళ్లను దయార్ద్ర దృష్టులతో అనుసరించింది. పోలీసు సార్జెంటు మోటుగా వసారా మెట్లెక్కడంతోనే ఆమె అమ్మయ్య అనుకుని నిట్టూర్పు విడిచింది.

''వాడినిక్కడికి తీసుకురా! నా తడాఖా చూపిస్తాను!'' అని అరుస్తూ సార్జెంటు పిడికిలి ఝాడించాడు. జనంలోంచి బిగ్గరగా:

''ఆ పని చెయ్యకు'' అనే దృఢ స్వరం వినవచ్చింది. నీలి నేత్రాల రైతే ఆ మాటనడం తల్లి చూచింది. ''సోదరులారా! అతడిని తీసుకుపోనివ్వకండి! తీసుకెళ్లనిస్తే వాళ్లు అతన్ని చచ్చే దాకా కొడతారు. అప్పుడా పని మనమే చేశామంటారు. తీసుకెళ్లనివ్వకండి!''

''రైతులారా!'' అంటూ రీబిన్ బిగ్గరగా గొంతెత్తేడు. ''మీ జీవితాలెలా ఉన్నాయో మీరు చూడలేకపోతున్నారా? వాళ్లు మీ సొత్తు నెలా దొంగిలించి, దగాచేసి, మీ రక్తాన్నెలా పీలుస్తున్నారో మీకు కనుబడ్డం లేదా? సర్వమూ మీదగ్గర్నుంచే వస్తుంది — ప్రపంచంలో మీ

శక్తి అన్నిటికన్న గొప్పది — కాని మీకున్న హక్కులేమిటి? ఆకలి బాధచే చావడమే మీకున్న హక్కు!''

హఠాత్తుగా రైతులు ఒకరి మాటకొకరు అడ్డొస్తూ కేకలెయ్యడం ప్రారంభించారు:

''అతను నిజం చెబుతున్నాడు!''

''పోలీసు ప్రధానాధికారిని పిలవండి! ప్రధానాధికారి ఎక్కడున్నాడు?''

''ఆయనకోసం పోలీసు సార్జెంటు వెళ్లేడు.''

''ఎవరు? ఆ తాగుబోతా?''

''అధికారులను పిలవవలసిన పని మనకేముంది?''

గలభా ఎక్కువైపోయింది.

''చెప్పవయ్యా చెప్పు! నీమీద ఎవడినీ చెయ్యి వెయ్యనివ్వం!''

''అతని చేతులకు కట్టిన బంధనాలను ఇప్పెయ్యండి!''

''మీరు దొరికిపోకుండా చూసుకోండి!''

ఈ కంఠధ్వనులన్నిటినీ ముంచేసేటంత బిగ్గరగా ఖంగుమనే గొంతుకతో రీబిన్ ఇలా అన్నాడు:

''ఈ తాళ్లు నా చేతులకు బాధని కలిగిస్తున్నాయి. రైతు మిత్రుల్లారా! నేను పారిపోను. నేను సత్యాన్ని తప్పించుకుని దాక్కోలేను. సత్యం నాలోనే నివసిస్తోంది!''

కొంతమంది మనుషులు గుంపులోంచి తప్పుకుని, పక్కగా నిలబడి, తలలూపుతూ ఏవో మాటలంటున్నారు. కాని చాలామంది చినిగిన గుడ్డలు ధరించినవారు ఆవేశంతో పరుగులెత్తుకుంటూ వచ్చి గుంపులో చేరేరు. వాళ్లంతా రీబిన్ చుట్టూ హడావడి పడుతూ చేరేరు. వాళ్ల మధ్య అతను అడవిలో దేవాలయంలాగున నిలబడి చేతులు పైకెత్తి ఆడిస్తూ బిగ్గరగా మాట్లాడేడు:

''ధన్యవాదాలు! సత్పురుషుల్లారా, మీకు ధన్యవాదాలు! మనం ఒకళ్ల చేతులకున్న బంధనాలను ఇంకొకరు ఛేదించుకోకపోతే, మనకా పని ఇంకెవరు చేస్తారు?''

అతడు తన గెడ్డాన్ని తడుముకుని రక్తసిక్తమైన చేతిని పైకెత్తేడు.

''ఇదిగో నా రక్తం.... సత్యంకోసం నేను దీని నోడ్చేను!''

తల్లి వసారా మెట్లు దిగింది. గుంపులో ఉన్న రీబిన్‌ని ఆమె చూడలేకపోవడంచేత మళ్లీ వసారాపైకెక్కింది. ఆమె హృదయంలో ఏదో అనిర్వాచ్యమైన సంతోషం రెపరెప కొట్టుకుంది.

''రైతు సోదరుల్లారా! ఆ కరపత్రాలకోసం ఎదురుచూడండి! వాటిని చదవండి! ఈ కరపత్రాల్లోని ప్రచారం చేసేవారంతా దేవునియందు నమ్మకంలేనివారనీ, తిరుగుబాటు దారులనీ చెప్పే మతగురువుల్నీ, అధికారుల మాటల్నీ నమ్మకండి. సత్యం భూమిమీద

రహస్యంగా సంచారం చేస్తోంది. ప్రజల్లో గూడు కట్టుకుని నివసించాలని కాంక్షిస్తోంది. అధికారులకు మాత్రం అది నిప్పులాంటిది. ఖడ్గంలాంటిది. వాళ్ళు సత్యాన్ని ఒప్పుకోలేరు. సత్యం వాళ్ళని ఖండించేస్తుంది, దహించేస్తుంది! మీకు మాత్రం సత్యం చాలా గొప్ప మిత్రుడులాంటిది. వాళ్ల పాలిట ప్రబలమైన శత్రువు. అంచేతనే అది భూమిమీద రహస్యంగా సంచారం చేస్తోంది!''

మరొకసారి ప్రజల్లోంచి రకరకాల హాహాకారాలు రేగేయి:

''సోదరులారా! వినండి!''

''సోదరా! నీవు చాలా అధమస్థితిలో పడిపోతావు కదా!''

''నిన్ను పోలీసులకు పట్టిచెప్పిందెవరు?''

''మతగురువు!'' అని ఒక పోలీసు జవాబుచెప్పేడు.

ఇద్దరు రైతులు కసితీరా గట్టిగా తిట్టేరు.

''జాగ్రత్తగా చూచుకోండ్రా!'' అని ఎవరో హెచ్చరించారు.

## 16

పోలీసు ప్రధానాధికారి గుంపుకేసి వస్తున్నాడు. అతడు పొడుగ్గా లావుగా ఉన్నాడు. గుండ్రని ముఖం. అతడు తన టోపీని ఒక చెవిమీదకు ఒరిగేట్టు ధరించాడు. ఒక వైపు మీసం పైకి మెలేశాడు, రెండవది కిందకు మెలేశాడు. అంచేత అతని ముఖం మీదెప్పుడూ ఆనందరహితమైన చిరునవ్వు కనబడుతుంది. ఎడమ చేత్తో కత్తిని పట్టుకున్నాడు. కుడి చేత్తో జోరుగా సౌంజ్ఞలు చేస్తున్నాడు. వచ్చేటప్పుడు ఆయన అడుగుల చప్పుడు ఖచ్చితంగా అందరూ విన్నారు. జనం పాయగా చీలి అతనికి దారిచేశారు. నీళ్ళు భూమిలో ఇంకిపోయినట్లు, జనం గోలంతా అణిగిపోయింది. అందరి ముఖాల్లోనూ కోపం కనబడింది. తల్లికి కళ్ళు మండుతున్నట్లనిపించింది, నుదుటి కండరాలు అదిరినట్లనిపించింది. ఆమె మళ్ళీ గుంపులో చేరాలనుకుంది. ముందుకు వంగి నరాలు బిగపట్టుకుని కదలకుండా నిలబడింది.

పోలీసు ప్రధానాధికారి రీబిన్ ముందర నిలబడి అతన్ని గర్వంగా చూశాడు.

''ఇదంతా ఏమిటి? అతని చేతులెందుకు కట్టేయ్యలేదు? ఏయ్! కట్టేయ్యండి!'' అన్నాడు.

అతను గట్టిగా ఖంగుమనేట్టు మాట్లాడేడు. కాని అందులో ఏ భావమూ కనబడలేదు.

''కట్టేం. జనం విప్పేశారు'' అని ఒక పోలీసు జవాబుచెప్పేడు.

''ఏమిటీ? జనమా? ఏ జనం?''

పోలీసు అధికారి తన ఎదుట అర్ధచంద్రాకారంగా నిలబడ్డ గుంపుకేసి తీక్షణంగా చూశాడు.

"జనమా? ఎవరు వాళ్లు?" అని కంఠస్వరంలో ఏ వాడుపూ లేకుండా ప్రశ్నించాడు. అతను నీలి నేత్రాల రైతును, కత్తి పిడితో తాకాడు.

"చుమకోవ్, జనమంటే నువ్వేననుకుంటానేం? ఇంకా ఎవరు? మిషిన్, నువ్వు కూడానా?" కుడి చేత్తో ఒకరిని గడ్డం పట్టుకుని లాగి: "మీరు వెంటనే వెళ్లిపోవడం మంచిది. లేదంటారా, లంజాకొడుకుల్లారా! మీకు గట్టిగా తగిలిస్తా. నా తడాఖా చూపిస్తా!" అన్నాడు.

అతడి ధోరణి చూస్తే కోపంగానూ లేదు. బెదరిస్తున్నట్లూ లేదు. అతడు నిదానంగా మాట్లాడేడు. జవాన్ని కొట్టేటప్పుడు మామూలుగానే పొడుగాటి చేతుల్ని ఊచి కొట్టేవాడు. అతని ముందర జనం తలలొంచుకుని ముఖాలు చాటేసి వెనక్కి తగ్గిపోయారు.

అతను పోలీసులకేసి చూసి:

"మీరిక్కడ వున్నదెందుకు? నే చెప్తున్నాను. అతని చేతులు విరిచి కట్టండి!" అన్నాడు.

ఒక వరస తిట్లు కురిపిస్తూ మరల రీబిన్‌ను చూచాడు.

"చేతులు వెనక్కు పెట్టు. నీకే చెప్పేది!" అని బిగ్గరగా అరిచాడు.

"నా చేతులు కట్టనక్కర్లేదు. నేను పారిపోయేవాడినికాను. తిరగబడి దెబ్బలాడను. కనుక నా చేతులు కట్టెయ్యడమెందుకు?" అన్నాడు రీబిన్.

"ఏమంటావ్?" అంటూ పోలీసు అధికారి రీబిన్‌ను సమీపించాడు.

"ఒరి పశువుల్లారా! ఇక మీరు ప్రజలను హింస పెట్టడం మానెయ్యవలసిన సమయం వచ్చింది!... త్వరలోనే మీ వంతొస్తుంది!" అన్నాడు రీబిన్ బిగ్గరగా.

వణుకుతున్న మీసాలతో పోలీసు అధికారి రీబిన్ ముఖంకేసి చూస్తూ నిలబడ్డాడు.

"ఒరి కుక్కలకొడకా! అలాగే నన్నుమాట మాట్లాడ్డం?" అని ఆశ్చర్యంతో బుస కొట్టి, ఒక అడుగు వెనక్కేశాడు.

చటుక్కున అతడు రీబిన్ ముఖంమీదొక దెబ్బ కొట్టేడు.

"పిడికిలితో సత్యాన్ని హత్య చెయ్యలేవు" అని రీబిన్ బిగ్గరగా అరిచాడు. "ఒరి కుళ్లు కుక్కా! నన్ను కొట్టడానికి నీకు హక్కు లేదుసుమా!" అని అతడిమీద కెళ్లి చెప్పేడు.

"నాకు హక్కు లేదూ? నాకు?" అంటూ పోలీసు అధికారి మొరిగేడు.

రీబిన్ తలమీద కొట్టడానికి గురిచూసి పోలీసు తన పిడికిలిని విసురుగా ఎత్తేడు. రీబిన్ గభాలున తప్పుకునేసరికి దెబ్బ తప్పిపోయింది. పోలీసు అధికారి దాదాపుగా పల్టీ కొట్టేసంత పని జరిగింది. జనంలోనుంచి ఎవరో బుస కొట్టేరు. మరల ఆగ్రహంతో కూడిన రీబిన్ కంఠధ్వని రేగింది.

''నా ఒంటిమీద చెయ్యేశావంటే జాగ్రత్త! ఏయ్ దెయ్యం!''

పోలీసు అధికారి వత్తుగా ఆగ్రహంతో మీదకు చుట్టుకొస్తున్న జన సమూహాన్ని పరిశీలనగా చూశాడు.

''నికీత! ఏయ్ నికీత!'' అని కేకేశాడు.

పొట్టిగా బొద్దుగా ఉండే రైతొకడు గొర్రెతోలు కోటు తొడుక్కుని జనంలోనుంచి ముందు కొచ్చాడు. పెద్దదైన చింపిరి జుట్టు తలను వంచేశాడు.

''నికీత! వాడి గూబమీద ఒక్క దెబ్బ వుచ్చుకో – గట్టిగా వెయ్యాలి సుమా!'' అని నిదానంగా మీసాలు మెలేసుకుంటూ పోలీసాఫీసరు ఆజ్ఞాపించాడు.

ఆ రైతు ముందుకొచ్చి రిబిన్ ముందర నిలబడి తల పైకెత్తేడు. రిబిన్ అతడి ముఖంమీదికి మాటలు సూటిగా విసిరేడు:

''సోదరులారా! చూడండి. ఈ పశువులు మన చేతుల్తో మన గొంతుక నులిమేస్తున్నారు! బాగా చూడండి! జాగ్రత్తగా ఆలోచించుకోండి!'' అన్నాడు.

రైతు నెమ్మదిగా చెయ్యెత్తి రిబిన్ తలమీద మెల్లగా ఒక దెబ్బ కొట్టేడు.

''లంజకొడకా! అల్లాగేరా కొట్టడం?'' అని పోలీసాఫీసరు హుంకరించాడు.

''ఏయ్ నికీత! దేవుడున్నాడనే మాట మరచిపోకు!'' అని గుంపులోంచి ఎవరో కేకేశాడు.

పోలీసాఫీసరు వెనకనుంచి నికీత మెడ పట్టుకుని,

''కొట్టు! నేను చెప్తున్నాను. కొట్టు!'' అని అరిచాడు. కాని నికీత తలొంచుకుని ఇవతల కొచ్చేశాడు.

''ఈ చేసిన పని చాలు'' అని అతను గొణుక్కున్నాడు.

''ఏమిటీ?''

పోలీసు అధికారి ముఖం కోపంతో కందగడ్డ అయింది. బూటు కాలితో నేలమీద ఒక్క చరువు చరిచి తిడుతూ రిబిన్‌మీద కురికేడు. తప్‌మని ఒక్క దెబ్బ కొట్టేసరికి రిబిన్‌కి తల తిరిగింది. అతను కూడా చెయ్యెత్తేడు. కాని రెండో దెబ్బ తగిలేసరికి కింద పడిపోయాడు. పోలీసు అధికారి అతన్ని తలమీద, గుండెలమీద, పక్కలోనూ బూటుకాలితో తన్నడం మొదలెట్టేడు.

జనంలోంచి కోపఘూర్ణితమైన గొణుగుడు లేచింది. జనం పోలీసుమీద కొత్తుకురావడం ప్రారంభించారు. అతనా సంగతి గ్రహించి ఒరలోంచి కత్తి దూసి ఝుళిపిస్తూ వెనక్కు గంతేశాడు.

''ఏమిటిది? తిరుగుబాటా? ఆహాఁ, అదన్నమాట సంగతి!''

అతని కంఠధ్వని వణికింది. మాట సరిగా రాలేదు. కీచుమన్నాడు. కాని ప్రయోజనం లేకపోయింది. మాట రాలేదు. బలం కూడా ఉడిగింది. తల ఒరిగింది. భుజాలు పట్టుడిగి నడలిచ్చాయి. నాలుగు వైపులా చూసుకుంటూ, వెనక్కెళ్ళిపోయాడు.

"సరే. బాగానే ఉంది.... అతన్ని తీసుకు పొండి. నే వెళ్లిపోతున్నాను. చెప్పే మాట వినండి, లంజకొడకల్లారా! వాడు రాజకీయ నేరస్థుడనే సంగతి మీకు తెలియదా? జార్ చక్రవర్తిమీద వాడు తిరుగుబాటు చేయిస్తున్నాడని మీరెరగరా? అలాంటి వాడికి మీరు రక్షణనిస్తున్నారు! అంటే మీరు కూడా తిరుగుబాటుదారులే అన్నమాట! అంతేనా?" అని అతడు బొంగురుపోయిన గొంతుకతో అరిచాడు.

తల్లి కదలకుండా అలాగే నిలబడిపోయింది. బలమంతా ఉడిగిపోయింది. మనసంతా శూన్యమైపోయింది. భయం, జాలీ ఆమెను నిశ్చేష్టురాలిని చేశాయి. జనంలోంచి విషాదం, బాధ, ఆగ్రహంతో కూడిన కేకలు కందిరీగల తుట్టలాగున ఆమె తలలో జొంయ్ మనే శబ్దాన్ని చేశాయి. పోలీసు అధికారి మాటలను ఆమె విన్నది. ఎవరో అనుకుంటున్న గుసగుసలు కూడా ఆమె చెవిన పడ్డాయి.

"అతడు నేరస్థుడైతే, కోర్టుకు తీసుకెళ్లు!..."

"అతన్ని కొంచెం అనుగ్రహించండి, దొరా!"

"నిజమంతే. ఏ చట్టమూ అలాటి దౌర్జన్యాన్ని సహించదు!"

"సందేహమేమిటి? అలాటి చట్టమే ఉంటే ఎవరైనా ఎవరినైనా కొట్టెయ్యవచ్చు. బలే సంగతే!..."

జనం రెండు గుంపులుగా విడిపోయారు. ఒక గుంపు పోలీసు అధికారిని చుట్టు ముట్టేరు. కొందరు కేక లెట్టేరు. కొందరు వాదించారు. రెండవ గుంపు తక్కువమంది నేలమీద సాచుకు పడిపోయిన మనిషి చుట్టూ చిరాకుతో గొణుక్కుంటున్నారు. చిన్న గుంపులోని జనం రీబిన్‌ను లేవదీయడానికి సాయపడ్డారు. పోలీసువాళ్లు మళ్లీ అతని చేతులు కట్టెయ్యడానికి ప్రయత్నిస్తుంటే:

"దెయ్యాల్లారా! తొందర పడకండి!" అని కేకలేశారు.

రీబిన్ తన ముఖంమీదా గడ్డంమీదా ఉన్న మట్టినీ, రక్తాన్నీ తుడుచుకుని మాట్లాడ కుండా నాలుగు వైపులా చూశాడు. అతని దృష్టి తల్లిమీద పడింది. ఆమె అదిరిపడి అతని వైపుకు వంగి అప్రయత్నంగా చెయ్యి వూపింది. కాని అతను తల పక్కకు తిప్పేశాడు. కొద్ది నిముషాలైన తర్వాత అతని కళ్లు ఆమె ముఖంకోసం వెతుకుతున్నట్లనిపించింది. అతను లేచి తల పైకెత్తేసరికి రక్తపు మరకలుగల చెక్కిళ్లు కంపించినట్లు కనుపించింది.

"అతను నన్ను గుర్తు పట్టేడు — నిజంగా పట్టి ఉంటాడా అని?" అనుకుంది.

విపరీతమైన ఆసక్తితో వణికిపోతూ ఆమె తలూపింది. మరుక్షణంలోనే, నీలి కళ్ల రైతు తన పక్కనే నిలబడి తనకేసి చూస్తున్నట్లామె గుర్తించింది. ఒక్క నిముషం పాటు అతని దృష్టి ఆమెకు చాలా భయం కలిగించింది.

"నేనేం చేస్తున్నట్లు? వాళ్లు నన్ను కూడా పట్టుకుపోతారు!"

ఆ రైతు రీబిన్‌తో ఏదో చెప్పేడు. అతను తలూపేడు.

"సరే, బాగానే ఉంది.... ఈ భూమిమీద నేనొక్కడినే కాదు! వాళ్లొక్క సారిగా సత్యాన్నంతనీ ఎన్నడూ బంధించలేరు. నేనెక్కడి కెళ్లిపోయినా నా స్మృతి ఉండనే ఉంటుంది. గూటినంతటినీ ఛిన్నాభిన్నం చేసి పారేసినా.... క్రమేడ్పునందర్నీ బంధించినా...." అన్నాడు రీబిన్. వణుకుతున్నా, అతని కంఠం స్పష్టంగా ధైర్యంగా ఉంది.

"ఈ మాటలన్నీ నాకే చెపుతున్నాడు" అని ఊహించుకుంది తల్లి.

"కాని గరుడపక్షులు స్వేచ్ఛగా ఎగిరే రోజొస్తుంది — జనం తమ సంకెళ్లను బద్దలు కొట్టేసుకుంటారు!"

ఒక స్త్రీ చెంబుతో నీళ్లు పట్టుకొచ్చి ఏడుస్తూ రీబిన్ ముఖం కడిగింది. ఆమె బిగ్గరగా ఏడుస్తూ ఉండడంవల్ల రీబిన్ మాటలందులో లీనమైపోయాయి. కనుక తల్లి వాటిని వినలేకపోయింది. పోలీసు ప్రధానాధికారిని ముందు పెట్టుకుని కొందరు రైతులక్కడి కొచ్చారు.

"ఖైదీని తీసుకుపోవడానికి బండిని తీసుకురండి! ఈ సారి ఎవరి వంతు?" అని ఎవరో కేకేశారు.

ఇంతలో పోలీసు అధికారి గొంతుక లేచింది — కంఠధ్వనిలో స్పష్టమైన మార్పు తెలుస్తోంది — బాగా చిన్నబుచ్చుకున్న ధోరణిలో ఉంది.

"నేను నిన్ను కొట్టగలను, కాని నువ్వు నన్ను కొట్టలేవు. ఒరి దద్దమ్మా! అలాటి సాహసం చెయ్యకు!" అన్నాడతడు.

"అలాగా? నువ్వేమైనా దేవుణ్ణనుకుంటున్నావా?" అని రీబిన్ గట్టిగా అరిచాడు.

ఒక్కసారిగా అనేకమైన హాహాకారాలు లేచినందున అతని మాటలు అందులో మునిగి పోయాయి.

ఆయనతో వాదించకు సోదరా!.... ఆయనొక అధికారి."

"దొరా, అతనిమీద కోపగించకండి! అతనికి ఒళ్లు తెలియడం లేదు."

"ఊరుకోవయ్యా, బాబూ!"

"నిన్ను ఇప్పుడు పట్టణానికి తీసుకుపోబోతున్నారు!"

"పట్టణంలో ఎక్కువ న్యాయం ఉంది!"

ప్రజల కేకలు వేడుకోలు ధోరణిలో రాజీకి అనుకూలంగా ఉన్నాయి. అవన్నీ అస్పష్టమైన రొదగా ఉన్నాయి. ఆశాజనకంగా లేవు. పోలీసులు రీబిన్ చేతులు పట్టుకుని నెమ్మదిగా ఆఫీసు మెట్లెక్కించి లోపలికి తీసుకెళ్లేరు. రైతులు ఒక్కరొక్కరే వెళ్లిపోయారు. కాని నీలి నేత్రాల రైతు మాత్రం కనుబొమలు ముడిచి తనకేసి చూస్తూ తన దగ్గరకు రావడం తల్లి చూసింది. ఆమె మోకాళ్లు వణికేయి. అపారమైన నిస్పృహ గుండెల్ని పీల్చేసింది. కడుపులో తిప్పు ముంచుకొచ్చింది.

"నేను వెళ్లిపోకూడదు.... కూడదు" అని తనలో తనే అనుకుంది.

కట్టవ కమ్మీ గట్టిగా పట్టుకుని అక్కడే నిలబడిపోయింది.

పోలీసు అధికారి వసారాలో నిలబడి చేతులూపుకుంటూ అందర్నీ చివాట్లు పెడుతున్నాడు. అతని కంఠధ్వని మందంగా నిరుత్సాహంగా ఉంది.

"మీరంతా మూర్ఖులురా, లంజకొడుకుల్లారా! మీకు తెలియని విషయాల్లో తలలు దూరుస్తున్నారు. ఇదంతా ప్రభుత్వ వ్యవహారం రా, పందుల్లారా! నిజానికి మీరు నాకు ధన్యవాదాలర్పించాలి. మీతో ఇంత మంచిగా ప్రవర్తించినందుకు నా కాళ్లకు మొక్కుకోవాలి. తలుచుకుంటే మిమ్మల్నందరినీ కఠిన శిక్షా శిబిరానికి పంపించేసేవాడిని."

పాతికమంది రైతులు టోపీలు తీసేసి ఆ మాటలు వింటూ నిలబడ్డారు. మబ్బులు కిందికి వాలినకొద్దీ, చీకటి ముదరసాగింది. నీలి కళ్ల రైతు తల్లి నిలబడున్న వసారాలో కొచ్చి,

"ఏం జరుగుతోందో చూశావా?" అన్నాడు.

"ఆహా" అంది తల్లి మెల్లగా.

"ఇక్కడేమి పనిచేస్తున్నావు?"

"రైతుల ఆడవాళ్ల దగ్గరనుంచి లేసులూ, చేనేత నారగుడ్డలూ ఖరీదుచేస్తాను."

రైతు మెల్లగా గడ్డం దులువుకున్నాడు.

"మా ఆడవాళ్లు లేసులల్లరు" అని నిరుత్సాహంగా తలుపుకేసి చూస్తూ చెప్పేడు.

తల్లి అతనికేసి చటుక్కున ఒక చూపు విసిరింది. లోపలికెళ్లడానికి వీలైన సమయంకోసం చూసింది. ఆ రైతు ముఖం అందంగా ఉంది, ఆలోచనాపరుడి లక్షణాలున్నాయి. కళ్లలో విషాదచ్ఛాయలున్నాయి. మంచి పొడగరి. విశాలమైన భుజాలు కలవాడు. శుభ్రమైన నూలు షర్టుమీద అతుకు వేసిన జుబ్బా, గోధుమరంగు చేనేత నారగుడ్డ లాగూ ధరించాడు. మేజోళ్లు లేకుండా అరిగిపోయిన బూట్సు వేసుకున్నాడు.

ఏ కారణంచేతనోకాని, తల్లి "అమ్మయ్య" అని నిట్టూర్పు విడిచింది. తనలో తచ్చాడుతున్న ఆలోచనలచేతకంటె త్వరగా సహజజ్ఞానంచేత ప్రేరితురాలై, చటుక్కున:

"ఈ రాత్రికి మీ ఇంట్లో ఉండ నిస్తావా?" అని అడిగింది.

ఈ మాట అంటుండగానే ఆమె శరీరమంతా — ఎముకలూ నరాలూ — బిగుసుకుపోయాయి. కష్టంమీద నిబ్బరంగా నిలబడి అతడికేసి నిశ్చలంగా చూసింది. కాని ములుకు ల్లాంటి ఆలోచనలు ఆమె మనస్సును వేధించాయి: "నికొలాయ్ ఇవానొవిచ్ నాశనానికి నేను కారణమవుతాను. చాలా కాలానికి కాని పావెల్‌ను చూడను. వాళ్లు నన్ను కొడతారు."

ఆ రైతు నేలకేసి చూస్తూ జుబ్బాను గుండెలమీదకు లాక్కుని తాపీగా జవాబు చెప్పేడు:

"రాత్రి మా యింట్లో ఉండనివ్వమంటావా? ఎందుకుండనివ్వకూడదు? కాకపోతే నాది చాలా చిన్న గుడిసె."

"నేనంతకన్న మంచి ఇళ్లకు అలవాటు పడినదాన్ని కానులే" అంది తల్లి.

"అయితే సరే" అని రైతు తలెత్తి ఒక్కసారి ఆమెను నఖశిఖ పర్యంతం చూసి, అంగీకరించాడు. అప్పటికి చాలా పొద్దుపోయింది. సంధ్య చీకటిలో అతని కళ్లు మిలమిల మెరిసేయి అతని ముఖం వెలవెలబారినట్లు కనిపించింది.

"అయితే నేను త్వరగా వచ్చేస్తాను. నా పెట్టె పట్టుకొస్తానుకుంటాను" అని మెల్లగా చెప్పింది. తను కొండమీదనుంచి జారిపోతున్నట్లామెకు అనిపించింది.

"అలాగే" అని భుజాలు పైకెత్తి కోటు దగ్గరగా లాక్కున్నాడు.

"ఇదిగో బండి యిలాగే వస్తోంది" అన్నాడు.

రీబిన్ వసారాలో కొచ్చాడు. అతని తలకూ ముఖానికీ బూడిదరంగు కట్టు కట్టి ఉంది. చేతులు కట్టేసి ఉన్నాయి.

ఆ శీతకాలపు సంజ చీకట్లోనుంచి అతడి గొంతుక లేచింది:

"సత్పురుషులారా! శలవు!... సత్యాన్ని అన్వేషించి దాన్ని భద్రపరచండి! విజాయితీ గల మాట నెవ్వరు చెపుతారో అతన్ని నమ్మండి. సత్యాన్ని పరిరక్షించవలసినప్పుడు మీరేమీ వెనకాడకండి."

"నోరు ముయ్!" అని పోలీసు అధికారి అరిచాడు. "ఎవ్వరా బుద్ధితక్కువ పోలీస్! గుర్రాలకొక చురక తగలనియ్యి."

"మీకు పోయే దేముంది? మీరెలా జీవిస్తున్నారో చూసుకోండి!"

బండి నడక సాగింది. ఇద్దరు పోలీసులమధ్య కూచున్న రీబిన్ బిగ్గరగా కేకేశాడు. "చచ్చేదాకా కడుపు మాడ్చుకోడమెందుకు? మీకు స్వేచ్ఛ లభిస్తే, రొట్టె దొరుకుతుంది, న్యాయం దొరుకుతుంది! శలవు, సత్పురుషులారా! శలవు!"

బండిచక్రాల కిరకిర ధ్వనిలోనూ, గుర్రపు డెక్కల టకటక శబ్దంలోనూ, పోలీసు అధికారి అరుపుల్లోనూ, రీబిన్ కంఠధ్వని ఏమ్నమైపోయింది.

రైతు తలవంకిస్తూ తల్లికేసి తిరిగి:

"ఇక అంతా అయిపోయినట్లే. నాకోసం స్టేషను దగ్గర కనిపెట్టుకుండు. నేను తర్వాత వస్తాను" అన్నాడు.

తల్లి గదిలో కెళ్లి బల్లదగ్గర సమొవార్ కెదురుగా కూచుంది. ఒక బ్రెడ్డుముక్కను చేత్తో పుచ్చుకు చూసి మరల పళ్లెంలో పెట్టేసింది. ఆమెకు ఆహారమేమీ తినాలనే వాంఛ కలగలేదు. కడుపులో తిప్పు మళ్లీ మొదలెడుతూంది. ఉక్క ఉండి అసౌకర్యంగా ఉన్నట్ట నిపించింది. ఈ బాధ ఆమె నెంతో బలహీనపరిచింది. హృదయంలోంచి రక్తం కారిపోతు న్నట్లనిపించింది. తల దిమ్మెక్కింది. ఆమె నీలి కళ్ల రైతు ముఖాన్ని చూస్తూనే ఉంది — అతని ముఖం ఏదో చిత్రంగా కనబడింది. ఎంచేతనో ఆ ముఖంలో అసంపూర్ణత

గోచరించింది. ఒకవిధమైన అపనమ్మకాన్ని స్ఫురింపచేసింది. అతడు తనను మోసం చేస్తాడనుకోడానికి మనస్కరించలేదు. కాని ఆ భావం మాత్రం మనసులో ప్రవేశించి, గుండెను బరువుగా నొక్కుతోంది.

"అతడు నన్ను గుర్తించాడు. గుర్తించి – ఊహించాడు" నీరసంగా అనుకుంది.

ఆ ఆలోచన బాధా విస్పృహల ఊబిలో తగులుకున్నట్టుగా అంతకన్న ముందుకు పోలేదు.

మైదానంమీద జరిగిన గలభా చప్పగా సర్దుకుపోవడంతో గ్రామస్థులు భయపడిపోయారని తేలిపోయింది. అంచేత తాను ఒంటరిదానినైపోయాననే భావం, ఆమె ఆత్మను బూడిదలా మెత్తగా వెలవెలబోతూన్నట్టి దిగులుతో నింపింది.

ఆ అమ్మాయి మళ్లీ గుమ్మంలో కొచ్చింది.

"కోడిగుడ్ల వేపుడు తెమ్మంటారా?" అని అడిగింది.

"వద్దులే. నాకేమీ తినాలని లేదు. వాళ్ల కేకలతోనూ అరుపులతోనూ నన్ను భయపెట్టేశారు" అంది తల్లి.

ఆ అమ్మాయి బల్లదగ్గర కొచ్చి, ఆవేశంతో గుసగుస చెప్పింది:

"పోలీసు అధికారి అతన్ని కొట్టినప్పుడు మీరు చూడవలసింది!... నే నప్పుడు దగ్గరే నిలబడున్నాను. పళ్లు ఊడేటట్లు కొట్టేడు. అతడు రక్తాన్ని ఉమ్ముతుంటే నేను చూశాను – చిక్కగా అతి ఎర్రగా ఉంది. కనుగుడ్లు అంతంత వాచిపోయాయి! అతను తారుమని చేస్తుంటాడు. పోలీసు సార్జెంటు మేడమీద తప్పతాగిపడుకున్నాడు. ఇంకా కావాలంటున్నాడు. ఇలాంటి వాళ్ళ పెద్దబృంద మొకటుందని, గెడ్డం ఉన్నతను వాళ్లకు నాయకుడని – అంటే వాళ్లకి అటమాన్ అన్నమాట – అంటున్నాడు. వాళ్లలో ముగ్గుర్ని పట్టుకున్నారు. కాని ఒకడు తప్పించుకుని పారిపోయాడు. వాళ్ల జట్టులోనివాడే ఒక బడిపంతుల్ని కూడా పట్టుకున్నారు. వాళ్లకి దేవుడున్నాడనే నమ్మకం లేదు. నమ్మకమున్న వాళ్ల నమ్మకాన్ని పోగొట్టేటట్లు బోధిస్తుంటారు. అలా చేసి చర్చిలను దోచుకొమ్మని ఇతరులను పురికొల్పుతున్నారు. అలాంటి మనుషులు వాళ్ళు! మన రైతులు కొందరు అతనికోసం జాలిపడుతున్నారు. కాని ఇతరులు మాత్రం అతగాడిని ఉరితీయాలంటారు. అటువంటి అసహ్యమైన మనుషులు మన రైతుల్లో ఉన్నారు!"

గబగబా మాటకూ మాటకూ సంబంధంలేకుండా ఆ అమ్మాయి చెప్పిన మాటలన్నిటినీ తల్లి శ్రద్ధగా ఆలకించింది. ఈవిధంగానైనా తన భయాన్నీ, విషాదకరమైన ప్రతీక్షణలను గురించిన ఆలోచనలనూ పోగొట్టుకోవడానికి ఆమె ప్రయత్నించింది. తను చెపుతుంటే వినే మనిషి ఒకర్తె దొరకినందు కా పిల్ల చాలా సంతోషించి, మరింత ఉత్సాహంగా తన ధోరణి సాగించింది:

''ఈ గొడవలన్నీ పంటలు పోవడం మూలాన వస్తున్నాయంటాడు మా నాన్న. రెండేళ్ల నుంచి పంటలేమీ పండడంలేదు. రైతులు చాలా కటకటలాడిపోతున్నారు. అందుచేత వాళ్లు ఇంత అసహ్యమైన స్థితిలో ఉన్నారు. గ్రామస్థుల సమావేశాల్లో కేకలేసుకుంటూ దెబ్బలాడుకుంటారు. ఒకరోజున వస్యుకోవ్ చేసిన అప్పులను తీర్చే నిమిత్తం అతని ఆస్తిని అమ్మడానికి వాళ్లు సమావేశమైనప్పుడు, గ్రామ పెద్దను అతను ఫెళ్లుమని ఒక్క చెంప కాయకొట్టేడు, 'నా అప్పు ఇదే తీసుకో' అన్నాడు.''

తలుపు అవతల బరువుగా అడుగుల చప్పుడైంది. తల్లి ఆసరాకోసమని ఎదుట నున్న బల్లను గట్టిగా పట్టుకుని లేచి నిలబడింది.

నీలి కళ్ల రైతు గదిలోకొస్తూనే టోపీ తియ్యకుండానే:

''నీ పెట్టె ఏదీ?'' అని అడిగేడు.

తేలిగ్గా దాన్ని పైకెత్తి కదిపి చూశాడు.

''ఖాళీ పెట్టే! మార్యా! ఈమెను మా యింటికి తీసుకెళ్లు.''

వెనక్కి తిరిగి చూడకుండానే అతడు పెట్టె పట్టుకెళ్లిపోయాడు.

''నువ్వు రాత్రి ఇక్కడే ఉంటావమ్మా?'' అని ఆ పిల్ల అడిగింది.

''అవును. నేను లేసులకోసం వచ్చాను — నేను వాటిని కొంటాను.''

''ఇక్కడ లేసులు తయారుచేయరు. తిన్‌కోవొ, దార్యినొల్లో అల్లుతారు కాని ఇక్కడ కాదు'' అని విశదపరిచింది ఆ పిల్ల.

''అయితే, రేపక్కడి కెడతాను.''

తల్లి టీకి డబ్బిచ్చేసి మూడుకోపెక్కుల బిళ్ల నామెకు ఇనాంగా ఇచ్చి సంతోష పెట్టింది. ఇద్దరూ బయటికెళ్లేరు. ఆ పిల్ల కాలికి జోళ్లు లేకుండానే తడినేలమీద తేలిగ్గా అడుగు లేసుకుంటూ దారితీసింది.

''కావాలంటే, నేను దార్యినొకు వెళ్లి, లేసులమ్మే ఆడవాళ్లను వాటినిక్కడికే తెమ్మని చెప్తాను. మీరక్కడ కెళ్లవలసిన శ్రమ తప్పుతుంది. ఎంతైనా ఎనిమిది మైళ్ల ప్రయాణం మీకు'' అంది ఆ అమ్మాయి.

''దాన్ని గురించి బాధపడొద్దులే'' అని తల్లి బదులుచెప్పింది. ఆ అమ్మాయితో అడుగు కలపడానికి తొందరగా నడిచింది. చల్లని గాలి ఆమెకు హాయి నిచ్చింది. ఆమె మన స్సులో అస్పష్టమైన నిర్ణయం ఒక రూపం తాల్చుతోంది. అది మెల్లగా అస్పష్టంగా, పెరుగుతోంది. కాని అది ఆశాజనకంగా ఉంది, దాని నింకా తొందర పెట్టడానికా అన్నట్లు తనలో తానే:

''నేనేం చెయ్యాలి? ఇదంతా ఏమీ దాచకుండా చెప్పేస్తేనో?...'' అని ప్రశ్నించుకుంది.

రాత్రి చల్లగా తేమగా ఉంది. మిణుకరింపు లేని ఎర్రని దీపాలు గుడిసెల కిటికీల్లో

వెలుగుతున్నాయి. గొర్రెలు పశువులను అదలిస్తున్న కేకలూ, పశువుల మెల్లని నిద్దరమత్తు అరుపులూ రాత్రి నిశ్శబ్దాన్ని ఛేదిస్తున్నాయి. గ్రామమంతా అంధకారమయమూ, చింతాక్రాంత మైన ధ్యానావస్థలో మునిగి ఉంది.

"ఇదే ఇల్లు. ఈ రాత్రి ఉండడానికి మీరు చాలా అధ్వాన్నమైన స్థలాన్ని ఎంచుకున్నారు.... అతడు చాలా పేద రైతు...." అని చెప్పింది ఆ అమ్మాయి.

ఆమె తలుపుకోసం తడిమి తలుపు తెరిచింది.

"తత్యానా! అత్తా!" అని ధైర్యంగా కేక వేసింది.

వెంటనే పరుగెత్తు కెళ్ళిపోయింది. చీకట్లోనుంచి:

"శలవు" అని ఆమె మాట వినబడింది.

## 17

తల్లి లోపలికెళ్ళి, కనుబొమలమీదకు చెయ్యెత్తి, గుడిసె నాలుగు మూలలూ పరకాయించి చూసింది. అది చిన్నదే కాని పరిశుభ్రంగా ఉండడం ఆమె కాశ్చర్యమేసింది. చిన్న వయస్కురాలైన ఒక స్త్రీ పొయ్యి వెనకనుంచి ఆమెను చూసి తలూపి మాట్లాడకుండానే అంతర్థానమైపోయింది. బల్లమీద ఒక దీపం వెలుగుతోంది.

గుడిసె యజమాని బల్లదగ్గర కూచుని, కంగారుగా వేళ్లతో బల్లమీద చప్పుడు చేస్తూ తల్లి కళ్లను పరిశోధనగా చూశాడు.

"రండి. తత్యానా! వెళ్ళి ప్యోత్రను పిలుచుకురా. త్వరగా వెళ్ళు."

ఆ స్త్రీ తల్లికేసి చూడకుండానే బయటి కెళ్ళిపోయింది. తల్లి యజమాని కెదురుగా వున్న బెంచీమీద కూచుని నాలుగు మూలలా చూస్తోంది. ఆమె పెట్టె ఎక్కడా కనబడ్డంలేదు. గుడిసెలో భయంకరమైన నిశ్శబ్దం ఏర్పడింది. మధ్యమధ్య దీపం మాత్రం టుప్‌టుప్‌మని శబ్దం చేస్తోంది. తన కళ్ల ముందర వచ్చినట్టే వచ్చి వెళ్ళిపోయిన రైతుయొక్క చిరచిరలాడే ముఖం చూసి ఆమెకు చిరాకెత్తింది.

"నా పెట్టె ఎక్కడ?" అని చటుక్కున తత్తర పాటుతో ప్రశ్నించింది.

రైతు భుజాలెగరేశాడు.

"అదెక్కడికీ పోదులే. స్టేషన్ దగ్గర, అది ఖాళీగా ఉందని ఆ పిల్ల వినాలనే బుద్ధిపూర్వకంగానే అన్నాను. కాని అది ఖాళీగా లేదు. చాలా బరువుగా ఉంది" అని మెల్లగా జవాబిచ్చాడు.

"సరే. ఉంటేనేమి?" అని తల్లి అడిగింది.

అతడు లేచి తల్లి దగ్గర కెళ్లేడు.

"ఆ మనిషిని మీరెరుగుదురా?" అని బాగా వంగి నెమ్మదిగా చెవిలో అడిగేడు.

హఠాత్తుగా వేయబడిన ఆ ప్రశ్నకామె కొంచె మాశ్చర్యపడి,

"ఎరుగుదును" అని దృఢమైన గొంతుకతో జవాబుచెప్పింది.

ఆ ఒక్క మాటా, గభాలున ఒక్క వెలుగులా వెలిగి పరిసరాలన్నిటినీ విస్పష్టం చేసింది. ఆమెకు మనశ్శాంతి కలిగి, అమ్మయ్య అనుకుని బెంచీమీద సావకాశంగా కూచుంది.

రైతు నోరారా నవ్వుకున్నాడు.

"అక్కడ మీరు అతనికి సౌంజ్ఞ చేయడం, మళ్లీ అతను మీకు సౌంజ్ఞ చేయడం చూడ్డంతోనే నేనా సంగతి గ్రహించాను. 'ఆ వసారామీద నిలబడిన వ్యక్తిని మీరెరుగుదురా?' అని చెవిలో అడిగేను."

"అతడేమన్నాడు?" అని వెంటనే తల్లి ప్రశ్నించింది.

"'మేము చాలామందిమి ఉన్నాం.... చాలామందిమే' అన్నాడు."

రైతు అతిథి కళ్లను ప్రశ్నపూర్వకంగా పరికించాడు. చిరునవ్వు నవ్వుతూ,

"దిట్టమైన మనిషంటే అతగాడే! మంచి ధైర్యశాలి కూడా! నేనే ఆ పని చేశానని నిస్సంకోచంగా చెప్పేశాడు — వాళ్లెంత కొట్టినా, తను చెప్పదలచుకున్నదంతా చెప్పుకుంటూనే వచ్చాడు" అన్నాడు.

నిస్సత్తువగానూ, సంకోచించుతూనూ ఉన్న అతని గొంతుక, అసంపూర్ణంగా ఉన్నట్లగుపడే అతడి ముఖం, దాపరికమెరుగని కళ్లు, తల్లికి క్రమంగా ధైర్యాన్ని చేకూర్చేయి. ఆమెకుండిన భయ సంకోచాలు, నిస్పృహ క్రమక్రమంగా తొలగిపోయి, రీబిన్‌పట్ల గాఢమైన దయా, జాలీ కలిగాయి.

"దుర్మార్గులు! పశువులు!" అని అపారమైన క్రోధంతో ఏడవడం మొదలెట్టింది.

రైతు కొంచెం దూరంగా తొలగి, విచారంగా తల పంకిస్తూ:

"ఇటువంటివాళ్లే అధికార్ల స్నేహితులు!" అన్నాడు.

మరల తల్లికేసి తిరిగి నెమ్మదిగా:

"చూడు. ఆ పెట్టెలో వార్తాపత్రికలు లేవా?" అని అడిగేడు.

"ఉన్నాయి. అతనికోసమే వాటిని తెచ్చాను" అని కన్నీళ్లు తుడుచుకుంటూ తల్లి ముక్తసరిగా జవాబుచెప్పింది.

అతడు చిరచిరలాడుతూ గడ్డాన్ని చేత్తో పుచ్చుకుని ఒక మూలకు తేరిపారజూస్తూ నిలబడ్డాడు.

"అవి మాకోసమే వచ్చాయి.... పుస్తకాలు కూడా మాకోసమే వచ్చాయి.... మేమతని నెరుగుదుము.... ఇదివరలో చూశాం."

ఒక నిముషం సేపు ఆగి అలాగే ఆలోచిస్తూ నిలబడ్డాడు.

"అయితే—ఆ పెట్టె నేమి చెయ్యాలనుకుంటున్నారు?" అని తల్లి నడిగేడు.

ఆమె అతడికేసి ఏమంటావన్నట్లుగా చూస్తూ:

"ఇక్కడ మీదగ్గర వదలిపెట్టేస్తాను" అంది.

అందుకతడేమీ అభ్యంతరమూ చెప్పలేదు, ఆశ్చర్యాన్నీ వెలిబుచ్చలేదు.

"మంచిదే" అన్నాడతను.

అంగీకారసూచకంగా తలాడిస్తూ, వేళ్లతో గడ్డం దువ్వుకుంటూ బల్లదగ్గర కూచున్నాడు.

రక్తసిక్తమై దెబ్బలు తిన్న రీబిన్ మూర్తి అదేపనిగా తల్లి మనోనేత్రానికగుపడ సాగింది. మరొక ఆలోచనేమీ ఆమెకు తోచలేదు. బాధ, కోపమూ, తదితర భావాల కెక్కడా చోటు లేకుండా చేశాయి. పెట్టె సంగతి కాని మరే సంగతి కాని ఆమె తలలో కెక్కడం లేదు. కన్నీరు ధారగట్టింది. ముఖం మాత్రం కఠినంగా ఉంది. సాఫీయైన గొంతుకతో:

"మనుష్యుల్ని ఈవిధంగా అగౌరవపరచి దోచేస్తున్నందుకు వాళ్ల పాపం బద్దలై పోవాలి!" అంది.

"వాళ్లు బలవంతులు! చాలా బలవంతులు!" అని రైతు మెల్లగా జవాబుచెప్పేడు.

"వాళ్లకా బలం ఎక్కడనుంచి వచ్చిందేమిటి?" అని తల్లి కోపంతో అడిగింది. "వాళ్లకి ఆ బలం మన దగ్గరనుంచే—సామాన్య జనం దగ్గరనుంచే—వస్తుంది. అంతా మన దగ్గరనుంచే వస్తుంది!" అని తనే జవాబుచెప్పింది.

ముఖం దయాపూర్వకంగా ఉన్నా అంతర్యం చాలా గహనంగా ఉన్న ఆ రైతుపట్ల ఆమెకు చిరాకు కలిగింది.

ఆలోచనాపూర్వకంగా మాట ఈడుస్తూ:

"అవును.... కాలచక్రం...." అన్నాడు.

హఠాత్తుగా చెవులు నిక్కబొడుచుకుని తలుపు కాచి,

"వాళ్లొస్తున్నారు" అన్నాడు.

"ఎవరు?"

"మనవాళ్లనుకుంటాను."

అతని భార్య మరొక రైతును వెంటపెట్టుకొచ్చింది. అతడు వస్తూనే టోపీనొక మూలకు విసిరేసి, బల్ల దగ్గరికి గబగబ వచ్చి,

"ఏమిటి సంగతి?" అడిగాడు.

మొదటి రైతు తలూపేడు. పొయ్యి దగ్గర నిలబడున్న అతని భార్య,

"స్త్రైపాన్, మన అతిథికి ఆకలేస్తున్నదేమో?" అంది.

"లేదు. నాకు ఆకలి వెయ్యడం లేదు!" అని తల్లి బదులుచెప్పింది.

రెండవ రైతు తల్లికేసి తిరిగి, గబగబా, గద్గద స్వరంతో ఇలా అన్నాడు:

''నన్ను నేనే పరిచయం చేసుకుంటున్నాను.... నా పేరు ప్యోత్ర్ యెగోరొవ్ ర్యబీనిన్. అందరూ వేళాకోళంగా 'కంటాణి' అంటారు. మీ వ్యవహారం గురించి కొన్ని సంగతులు నాకు తెలుసు. నాకు చదవడం రాయడం వచ్చు. కేవలం తెలివితక్కువవాడిని కాను.'

తల్లి అందిచ్చిన చేతి నతడు పట్టుకుని,

''స్తెపాన్, చూడు! వర్వారా నికొలాయెవ్నా మంచి ఆవిడే అనుకుంటాను. కాని ఈ వ్యాపారమంతా తెలివితక్కువ పనసీ, వెకిలిపనసీ అంటోంది. కుర్రవాళ్లూ, విద్యార్థులూ, ఈ చెత్తనంతా ప్రజల బుర్రల్లో కెక్కిస్తున్నారంటోంది. కాని ఈవేళ వాళ్లు అరెస్టు చేసిన రైతు బాగా ఢక్కామొక్కీలు తిని ఆరితేరినవాడని నీకూ నాకూ తెలుస్తూనే ఉంది. మరి ఈమె సంగతి చూడు. నడి వయస్సులో ఉంది. ధనిక వర్గానికి చెందిన మనిషి కాదనుకుంటాము. ఏమమ్మా! కాదుకదూ?'' అన్నాడు.

అతడు గబగబా, గుక్క త్రిప్పుకోకుండా విస్పష్టంగా మాట్లాడేడు. అతని గెడ్డం కంగారులో అదిరింది. తల్లి ముఖంకేసీ, విగ్రహంకేసీ పరీక్షగా చూస్తూ మాట్లాడేడు. గుడ్డలు చిరిగి పీలికలు వేలాడుతున్నాయి. జుట్టు జడలుకట్టేసింది. అవతారమంతా చూస్తే, ఇప్పుడే దెబ్బలాటనుంచి విజయోత్సాహంతో వచ్చినవాడిలాగున్నాడు. తల్లికి అతని ఉత్సాహ ధోరణి నచ్చింది. మనసులో ఉన్న సంగతులను సూక్ష్మంగా దాపరికం లేకుండా మాట్లాడి నందుకామె సంతృప్తిపడింది. చిరునవ్వు నవ్వుతూ తల్లి అతని ప్రశ్నకు జవాబుచెప్పింది. అతడామెతో కరచాలనం చేస్తూ పకపక నవ్వేడు.

''స్తెపాన్! ఇది పరిశుద్ధమైన పని. చాలా మంచి పని. ఇదంతా ప్రజల్లోనుంచే వస్తుందని నేను చెప్పలేదా? కాని ఆ గొప్పావిడ నీకు నిజం చెప్పడం లేదు. నీకు నిజమంతా తెలిస్తే, ఆమెకే ప్రమాదం సంభవిస్తుంది. నిజానికి నేను ఆమెను చాలా గౌరవిస్తాను. అందుకేమీ సందేహం లేదు. ఆమె హృదయం చాలా మంచిది. మనకు సహాయం చెయ్యాల నుకుంటోంది. తనకేమాత్రమూ హాని జరగకుండా ఏదో కొంచెం చెయ్యాలనుకుంటోంది. కాని సామాన్య జనం, తమకేమి ప్రమాదం సంభవిస్తుందోననే భయం లేకుండా సరాసరి పనిలో మునిగిపోతారు. తేడా చూశావా? వాళ్లు ఏ పనిచేసినా వాళ్లకే దెబ్బలు తగులుతుంటాయి. అంచేత వాళ్లకి ఏదైనా ఒకటే. వాళ్లు ఏ మార్గాన నడవదలచినా వాళ్లకు వినబడే మాటొ కటే: 'ఆగండి!' '' అన్నాడు.

''అవును. ఈమె పెట్టె గురించి చాలా ఆత్రుతపడుతోంది'' అన్నాడు తలూపుతూ స్తెపాన్.

ప్యోత్ర్ తల్లికి కనుసైగ చేశాడు.

''దాన్ని గురించి బెంగ పెట్టుకోకండి'' అని ధైర్యం చెప్పేడు. ''అమ్మా! అన్నీ సక్రమంగానే జరుగుతాయి. మీ పెట్టె మా యింట్లో ఉంది. ఈవేళ ఇతను మీ సంగతి

చెప్పినప్పుడు – ఈ వ్యవహారంతో మీకు చాలా సంబంధమున్నదనీ, ఆ మనిషిని మీరు ఎరు గుదురనీ చెప్పినప్పుడు – 'ఇటువంటి వ్యవహారంలో మనమేమీ పొరబాటు చెయ్యకూడదు. కనుక త్వరగా కానియ్యి, స్త్రెపాన్' అని చెప్పేను. అయితే, అక్కడ మీపక్కనే మేము విల బడున్నాం కనుక మేమెవరమో మీరు కనిపెట్టినట్లే తోచింది. నిజాయితీగల ముఖం కన బడినప్పుడు వదలిపెట్టకూడదు. నిజానికి, చూద్దామన్నా అలాటివాళ్లెందరో కనబడ్డం లేదు. మీ పెట్టె కోసం మరేమీ బెంగపడకండి.''

అతడామె పక్కనే కూచుని ఆమెను ప్రశ్నించుతూన్నట్టు చూశాడు.

''ఆ పెట్టెలో ఉండే సరుకును వదిలించుకోవాలని అనుకుంటే, మేము పరమ సంతోషంతో మీకు తోడ్పడతాం. ఆ పుస్తకాలను మేం ఉపయోగించుకోగలం.''

''వాటన్నిటినీ మన కిచ్చెయ్యాలనే ఆమె అనుకుంటోంది'' అన్నాడు స్త్రెపాన్.

''అలాగైతే చాలా బాగుంది, అమ్మా!... వాటన్నిటికీ తగిన చోటు చూద్దాం!'' అంటూ సన్నగా నవ్వి, చెంగున లేచి నిలబడి పచారుచెయ్యడం మొదలెట్టేడు.

''ఇదొక గొప్ప అదృష్టం! అయితే అందులో వింతేమీ లేదనుకో. తాడు ఒక చోట పుటుక్కుమంది. మరొకచోట గట్టిగా నిలబడింది. అమ్మా! వార్తాపత్రిక చాలా మంచిది. బాగా పనిచేస్తోంది. కళ్లకు కట్టబడిన గంతలను తీసిపారేస్తోంది. పెద్దమనుషులకి అదేమీ గిట్టడంలేదు. ఇక్కడికేడు మైళ్ల దూరంలో ఉన్న ధనికురాలైన ఒకావిడ దగ్గర నేను వడ్రంగిపని చేస్తుంటాను. ఆమె మంచిదనే చెప్పాలి. ఆవిడ మాకు చదువుకోడానికి పుస్త కాలూ అవీ ఇస్తూ ఉంటుంది. అప్పుడప్పుడు ఆ పుస్తకాల్లో కళ్ల తెరిపించే విషయాలను చదువుతుంటాం! మొత్తంమీద మేము ఆమెకు చాలా కృతజ్ఞులమే. కాని ఒకసారి ఆమెకు ఈ వార్తాపత్రికను చూపించాను. దాని నామె ఎలా పుచ్చుకుందో చూచితీరాలి. 'ఈ చెత్తంతా చదవకు ప్యోత్' అంది. 'ఈలాటి చెత్తంతా ఏమీ తెలియని బడి పిల్లలు రాస్తుం టారు. వాటిని చదివితే నీకు కష్టాలొస్తాయి. జైలు, సైబీరియా ప్రవాసం' అంది.''

అతడొక నిమిషం నిశ్శబ్దంగా ఉన్నాడు.

''ఈవేళ వచ్చిన ఆ మనిషి, మీకు చుట్టమా అమ్మా?'' అని అడిగేడు.

''కాదు'' అని తల్లి బదులు చెప్పింది.

ప్యోత్ మెల్లగా నవ్వి, ఎందుకో చాలా సంతృప్తి చెందినట్లుగా తలూపేడు.

''అతడు నాకు బంధువు కాదు. కాని చాలా కాలంనుంచి ఎరుగుదును. మా పెద్ద న్నగా భావించి గౌరవిస్తాము!'' అని వెంటనే చెప్పింది. రీబిన్‌ను బంధువు కాదనడం ఆమెకు తప్పనిపించింది.

మనస్సులోని భావాలను వ్యక్తపరచడానికి తగిన మాటలు స్ఫురించకపోవడంచేత అందుకు బాధపడి ఆమె మళ్లీ ఏడ్వడం మొదలెట్టింది. ఆ గుడిసె అంతా బాధాకరమైన

ప్రతీక్షణా నిశ్శబ్దంతో నిండిపోయింది. ప్యోత్ర్ ఏదో వింటున్నట్టుగా తలొంచుకుని మంచున్నాడు. స్తెపాన్ ముంజేతులు బల్లమీదాన్చి, సాలోచనగా బల్లమీద దరువేస్తున్నాడు. అతడి భార్య పొయ్యిగూటిని ఆనుకుని తల్లికేసి చూస్తోంది. తల్లి కూడా అప్పుడప్పుడు ఆమె ముఖాన్ని శ్రద్ధగా పరిశీలించింది. ఆమె ముఖం చామనచాయగా కోలగా ఉంది. ముక్కు కోసుగా ఉంది. గడ్డం దృఢంగా మలచబడి ఉంది. ఆకుపచ్చగా ఉండే ఆమె కళ్లు మంచి తేటుగా ఉన్నాయి.

"అయితే అతను మీకు స్నేహితుడన్నమాటే.... బలే మనిషి! స్వంతంగా ఆలోచన చెయ్యగలవాడే! తన విలువను హెచ్చుగానే ఉంచాడు. అది చాలా నబబే. తత్యానా! ఏమంటావు?... నువ్వంటూ ఉంటావ్ –" అని ప్యోత్ర్ మెల్లగా అన్నాడు. తత్యానా తన చిరువోటి పెదవులు నొక్కుకుని మాటకడ్డొచ్చింది.

"అతనికి పెళ్లయిందా?"

"భార్య చచ్చిపోయింది" అని విచారంగా తల్లి జవాబుచెప్పింది.

"అందుకే అతడంత ధైర్యంగా ఉన్నాడు.... పెళ్లైనవాడు అలాటి మార్గాన్నను సరించలేడు.... భయపడతాడు" అని తత్యానా ఖంగుమనే కంఠంతో చెప్పింది.

"అయితే నామాటేమిటి? నాకు పెళ్లి కాలేదా?" అన్నాడు ప్యోత్ర్.

తత్యానా వంకరనవ్వు నవ్వి పెడమొగం పెట్టి:

"ఛ! చాల్లేవయ్యా! నువ్వేం చేస్తున్నావు? ఊరికే మాట్లాడతావు. అప్పుడప్పుడు ఒకటి రెండు పుస్తకాలు చదువుతావు. నువ్వూ, స్తెపాన్ ఒక మూల చీకట్లో కూచుని గుసగుసలాడుతుంటే జనానికేమీ ప్రయోజనం కలగదు" అంది.

ఆమె ఈసడింపుగా అన్న మాటలకు రైతుకు ఉలుకొచ్చి:

"నా మాటలు చాలామందే వింటున్నార్లే. వేనిక్కడే గుడుగుడు కుంచంలా పని చేస్తున్నాననవచ్చు.... అయినా నువ్వామాట...."

స్తెపాన్ నోరు మెదపకుండా భార్యకేసి చూసి తలొంచుకున్నాడు.

"రైతు పెళ్లిచేసుకోవడ మెందుకు? తనకు పనిలోకి పనికొస్తుంది కనుకనే. ఏం పని?" అని తత్యానా అడిగింది.

"నీకు తగినంత పని లేదా?" అని స్తెపాన్ నిరుత్సాహంగా అడిగేడు.

"ఈ పనిలో ఏమంత తెలివుంది? ఏరోజుకారోజు అర్ధాకలితో బ్రతుకుతుండడమే కదా? పిల్లలుంటే వాళ్ల మంచీ చెడ్డా చూడడానికి కూడా ఈ చాకిరీ మూలాన సావకాశ ముండదు. ఇంతైనా, కడుపునిండా తినడానికి తిండి వుండదు."

తత్యానా తల్లి పక్కన చేరి కూర్చుంది. విచార మనేది లేకుండా మాట్లాడేసింది. ఆమె స్వరంలో ఫిర్యాదుగాని, విచారంగాని ధ్వనించలేదు.

"నాకిద్దరు పిల్లలు పుట్టేరు. ఒకడు రెండేళ్ల వయస్సులో ఒళ్లు కాలి చచ్చి పోయాడు. రెండో పిల్ల ప్రాణం లేకుండానే పుట్టింది. ఈ దిక్కుమాలిన చాకిరితోటే అలాటి అవస్థ కలిగింది. నాకేమైనా సుఖమనేదుందా? అందుకనే రైతనేవాడు పెళ్లి చేసు కోవడంలో అర్థమేమీ లేదంటాను. మంచి జీవితంకోసం కృషిచేస్తూ బతక్కుండా చేతులను కట్టేసుకుంటున్నాడు. పెళ్లిచేసుకోకపోతే, అదిగో, ఆ మనిషిలాగ, సత్యాన్ని అన్వేషించడానికి సూటిగా కృషిచెయ్యగలుగుతాడు. అంతే కదమ్మా?"

"అవును. నిజమే, అమ్మాయీ! అంతే. లేకపోతే ఈ జీవితాన్ని మనం మార్చగలమనే ఆశ మనకెన్నటికీ వుండదు" అంది తల్లి.

"మీ భర్త ఉన్నాడా?"

"చచ్చిపోయాడు. ఒక కొడుకున్నాడు...."

"అతను మీతోటే ఉంటాడా?"

"జైల్లో ఉన్నాడు" అంది తల్లి.

ఈ మాటలంటుంటే ఆమెకు మామూలుగా కల్గే విచారంతోబాటు ఇప్పుడు గర్వం కూడా కలిగింది.

"అతన్ని రెండో సారి వాళ్లు జైల్లో పెట్టేరు. భగవంతుని సత్యాన్ని ప్రజల్లో చాటు తున్నందుకే ఆ పని చేశారు. అతను అందచందాలుగల యువకుడు. తెలివైనవాడు. మీ వార్తాపత్రిక సంగతి ఆలోచించినవాడు అతనే. మిహాయిల్ ఇవానొవిచ్‌కి సరైన దారిని చూపినవాడతనే, మిహాయిల్ వయస్సు అతని వయస్సుకు రెట్టింపు ఉన్నా కూడా! త్వర లోనే విచారణ జరుగుతుంది, నా కొడుకును సైబీరియా పంపేస్తారు. కాని అతడు పారి పోయి వచ్చేసి ఈ పని కొనసాగిస్తాడు...."

ఆమెకు మాట్లాడుతున్న కొద్దీ గర్వం హెచ్చింది. తన కాపుదైన వీరుని రూపం కళ్లకు కట్టినట్లయి, ఆ రూపాన్ని వర్ణించడానికి మాటలు పెదవుల్లోనుంచి ఉక్కిరిబిక్కి రియేటంతగా దొర్లుకుంటూ వచ్చాయి. ఆ నాటి అంధకారబంధురమైన సంఘటనలమూ, ఘాతుక చర్యలవల్ల ఆమెకు కలిగిన దుఃఖభారాన్నీ మరపించగలిగిన మంచి దృశ్యాలను కొన్నిటిని విధిగా ఆమె ఆలోచించవలసొచ్చింది. ఆ కోరిక ననుసరించి, పవిత్రమైనట్టిన్నీ, తేజోవంతమైనట్టిన్నీ ఆలోచనలన్నిటినీ చేకూర్చుకుని ఒక గొప్ప మంటగా ఊహించుకుంది. ఆ మంటయొక్క తేజస్సు కామె కళ్లు మూతలు పడ్డాయి.

"అతనిలాంటివాళ్లెందరో ఉన్నారు. ఇంకా చాలామంది పుట్టుకొస్తున్నారు. వాళ్లు జీవించి ఉన్నంత కాలం సత్యంకోసం, ప్రజల స్వేచ్ఛకోసం, నిలబడుతూనే ఉంటారు...."

ఆమె ముందుజాగ్రత్తను గాలికొదిలేసింది. పేర్లు చెప్పలేదుకాని, సామాన్య ప్రజల కడగళ్లను తొలగించడానికి రహస్యంగా జరుగుతున్న పనిని తానెరుగున్నంత వరకు ధారా

శంగా విశదీకరించింది. ఆమె హృదయానికి సన్నిహితులుగా ఉండే వాళ్లను గురించి చెప్పే టప్పుడు, జీవితంలోని మార్పులమూలంగా ఇంత ఆలస్యంగా తనలో ప్రేరేపింపబడిన ఆప్యా యతనంతనూ ఆ మాటల్లోకి చొప్పించింది. తన భావాలచే ప్రకాశితమై ప్రవృత్తించబడి తన మనోనేత్రం ఎదుట ప్రత్యక్షమైన మనుషులను ఆమె ఆనందంతో వీక్షించింది.

"ప్రపంచమంతటా, ప్రతి పల్లెలోనూ, ప్రతి పట్టణంలోనూ ఈ పని జరుగుతోంది. సత్పురుషుల శక్తికి పరిమితంటూ లేదు. అదింకా పెరుగుతూనే ఉంది. విజయం లభించే ఘడియ వచ్చేవరకూ అది పెరుగుతూనే ఉంటుంది."

ఆమె కంఠధ్వని సాఫీగా సాగింది. మాటలకోసం తడుముకోవలసిన అవసరం లేక పోయింది. ఆనాటి రక్తాన్నీ మలినాన్నీ తన హృదయంనుంచి తొలగించాలనే గాఢమైన కోరిక అనే తాడుతో ఈ మాటలనే రంగు పూసలను గుదిగుచ్చింది. తను చెప్పిన మాటలను రైతులు ముగ్ధులై వింటున్నారని ఆమె గ్రహించింది. వాళ్లు తనవంక గుడ్లప్పగించి నిశ్శే ష్టులై వింటున్నారు. తన పక్కనున్న తల్యానాయొక్క గాఢమైన నిట్టూర్పులనామె వింటూనే ఉంది. అంచేత తను చెప్పే మాటలయందూ, ఈ మనుషులకు తను చేసే వాగ్దానాల్లోనూ మరింత విశ్వాసం బలపడింది.

"కష్టపడి జీవిస్తుండే వారంతా — లేమిచేత కటకటలాడే వారంతా, ధనికులచేతా వారి నౌకరులచేతా అన్యాయంగా అణగద్రొక్కబడిన వారంతా — తమ సోదరులకోసం జైళ్లల్లో చిత్రహింసలపాలై చస్తూన్నవాళ్లతో చేతులు కలపాలి. తమ స్వార్థాన్ని గురించిన ఆలోచన పిసరంతైనా లేకుండా, ప్రజలందరికీ క్షేమకరమైన మార్గాన్ని వాళ్లు చూపిస్తున్నారు. వాళ్లకు ఎవరినీ మోసం చెయ్యాలనే ఉద్దేశం లేకపోవడంచేత, 'ఈ మార్గం కఠినమైనద'ని స్పష్టంచేస్తున్నారు. ఈ మార్గాన నడవమని వాళ్లెవరినీ బలవంతం చేయడంలేదు! కాని ఒక్కసారి ఎవరైనా వాళ్ల పక్కన నిలబడినట్లైతే, అలాటివాడు వాళ్లను మరి వదలిపెట్టడు! ఏమంటే, అదే సరియైన మార్గమనీ, మరొక మార్గం లేదనీ అతను తెలుసుకో గలుగుతాడు!"

చిరకాలంగా తను చెయ్యాలని కోరికపడుతుండిన పనిని, ఈనాడు చెయ్యగలుగుతున్నందు కామె హృదయం ఆనందంతో పులకరించింది. తను కూడా ప్రజలకు సత్యాన్ని తెలియ జేస్తోంది!

"ఇటువంటివారి వెంట మీరు సురక్షితంగా నడవచ్చు. స్వల్ప లాభాలతో వాళ్ళు సంతుష్టిపడరు. యావత్తు మోసాన్నీ, దురాశనూ, దౌష్ట్యాన్నీ నాశనంచేసేవరకూ వాళ్లు ఊరుకోరు. జనమంతా ఒక్కటై ఏకగ్రీవంగా 'నేనే యజమానిని! అందరికీ సమానంగా వర్తించే చట్టాలను నేనే చేస్తాను!' అని అనేదాకా వాళ్లు చేతులు కట్టుకు కూచోరు."

హఠాత్తుగా ఆమెకు అలసట వచ్చింది. మాట్లాడ్డం మానేసి శ్రోతలకేసి తదేక ధ్యానతో చూసింది. తను మాట్లాడిన మాటలు వృధాపోలేదని గుర్తించి సంతోషపడింది.

ఇంకా ఏమైనా చెపుతుందేమోననే ఆసక్తితో మగవాళ్లు ఆమెకేసి చూశారు. ప్యోత్ గుండెల మీద చేతులు కట్టుకుని పెదవులపై జీరాడుతున్న చిరునవ్వుతో కళ్లు చిట్లించుకుంటూ చూస్తూన్నాడు. స్తెపాన్ ఒక ముంజేతిని బల్లమీద పెట్టి ఇంకా వింటున్నట్లుగానే శరీరాన్నంతటినీ ముందుకు వాల్చి చూస్తూన్నాడు. అతని ముఖం నీడలో ఉండడంచేత కాబోలు దానియందొక పరిపూర్ణత గోచరించింది. తల్లి పక్కనే కూర్చుని ఉన్న అతని భార్య ముంజేతులను మోకాటి చిప్పలమీద ఆన్చి కూచుని నేలను పరిశీలిస్తోంది.

"అదీ సంగతి" అని మెల్లగా అంటూ ప్యోత్ బెంచీమీద కూలబడ్డాడు.

స్తెపాన్ నిటాగ్గా కూచుని భార్యకేసి చూసి రెండు చేతులూ బారసాచేడు. అక్కడున్న వాళ్లనందర్నీ కౌగలించుకుంటాడా అనిపించింది.

"ఒక్కసారి ఇలాంటి వ్యాపారంలోకి దిగేమంటే, సర్వాత్మనా దానితో ఏకమైపోవాలి" అని ఆలోచనాపూర్వకంగా అన్నాడు.

"ఇక మళ్లీ వెనక్కి తిరిగి చూడకూడదు" అని కొంచెం సంకోచిస్తూ ప్యోత్ చెప్పేడు.

"ఈ పనికి చాలామందే కావలసి వచ్చేట్లున్నారు" అన్నాడు స్తెపాన్.

"ప్రపంచానికంతకీ పని చెప్తుంది" అన్నాడు ప్యోత్.

## 18

తల్లి గోడకానుకు కూచుని మెడ వెనక్కి వాల్చి, వాళ్లీ విషయాలను గురించి నెమ్మదిగా అనుకునే మాటలను శ్రద్ధగా వింది. తత్యానా లేచి నాలుగు వైపులా పరికించి మళ్లీ కూచుంది. ఆమె అసంతుష్టితోనూ అవహేళనగానూ రైతులకేసి తేరిపారజూస్తుంటే ఆమె ఆకుపచ్చని నేత్రాలు కాఠిన్యతతో తళుక్కుమన్నాయి. చటుక్కున ఆమె తల్లికేసి తిరిగింది.

"అమ్మా! మీ రోజుల్లో మీరు చాలా కష్టాలననుభవించి ఉండాలి!" అంది.

"అనుభవించాను" అని తల్లి బదులుచెప్పింది.

"మీరు మాట్లాడుతుంటే నాకు వినాలనుంది. మీ మాటలు హృదయతంతులను కదిలిస్తున్నాయి. మీ మాటలు విన్నప్పుడు, 'ఓ దేవుడా! ఈమె చెప్పేటటువంటి మనుషులను చూడడానికి ఏమిమ్మన్నా ఇస్తాను!' అనుకున్నాను. బతుకు సంగతి ఆలోచించాను. ఇక్కడేముంది. మేమంతా ఉఠి గొర్రెల మంద, అంతే. మాట వరసకు నా సంగతే చూడండి! నాకు చదవడం రాయడం వచ్చు. నేను పుస్తకాలు చదువుతుంటాను. చాలా చాలా ఆలోచనలు చేస్తుంటాను. ఒక్కొక్కప్పుడు ఆ ఆలోచనలవల్ల రాత్రిళ్లు నిద్ర కూడా పట్టదు. కాని ఇందువల్ల ప్రయోజన మేముంది? ఆలోచించకపోతే వృధాగా వాడిపోతాను. ఆలోచించినా ఏమీ కనబడదు."

ఆమె నేత్రాల్లో వ్యంగ్యం కనబడింది. అప్పుడప్పుడామె, మాటలను దారాన్ని మాదిరిగా కొరికినట్లు కనిపించింది. రైతు లేమీ మాట్లాడలేదు. గాలి కిటికీ అద్దాలను కొట్టింది, పొగగొట్టంలోంచి మెల్లగా గొణిగింది, కప్పుమీద గడ్డిని బిలబిలలాడించింది. కుక్క మొరిగింది. అప్పుడప్పుడు వర్షపు చినుకు ఒకటి కిటికీ అద్దాలమీద టపటప శబ్దం చేసింది. దీపం మిణుకుమిణుకు మంది. ఆరిపోయినట్లే కనబడి మరల బాగా తేటుగా నిదానంగా వెలిగింది.

"మీ మాటలు వింటుంటే నాలో నేననుకున్నాను: అందుకే మనుషులు పుట్టినది! తమాషా ఏమంటే, అదంతా నేనెరుగున్నట్లే అనిపించింది. కాని ఇంతకు పూర్వం నేనెన్నడూ అలాటి విషయం వినలేదు. నా కల్లాంటి అభిప్రాయాలెన్నడూ లేమా లేవు."

"తత్యానా, మనం ఏదైనా కొంత తిని దీపమార్పెయ్యడం మంచిదనుకుంటాను. మామూలుకన్న చాలా రాత్రివరకూ చుమకోవ్ ఇంట్లో దీపాలు వెలుగుతున్నట్లు జనం గ్రహిస్తారు. అందువల్ల మనకు కలిగే బాధేమీ లేదు. కాని ఆమెకు బాధ కలగవచ్చు" అని స్తెపాన్ కనుబొమలు చిట్లిస్తూ మెల్లగా చెప్పేడు.

తత్యానా లేచి పొయ్యిదగ్గర కెళ్లింది.

"అవును. ఈ రోజుల్లో అడుగేసేటప్పుడు ముందూ వెనకా చూసుకుంటూ ఉండాలి.... ఈ వార్తాపత్రికలిక్కడ కనబడ్డంతోనే...." అంటూ ప్యోత్ర్ చిరునవ్వు నవ్వేడు.

"నేను నా సంగతి ఆలోచించుకోవడం లేదు. నన్ను అరెస్టుచేస్తే కలిగే ప్రమాదం ఏమీ లేదు."

అతడి భార్య బల్ల దగ్గర కొచ్చి,

"లేవండి" అంది.

అతను లేచి, ఆమె బల్లను సర్దుతుంటే చూస్తూ నిలబడ్డాడు. వెటకారంగా నవ్వుతూ,

"సోదరులారా, మీరూ, నేనూ — మన విలువ, గెంట అయిదు కోపెక్కులే. అదైనా గెంటకు మారుంటేనే" అన్నాడు.

తల్లికి అతన్ని చూస్తే జాలేసింది. అతన్ని చూసినకొద్దీ ఆమెకు అతనిపట్ల అభిమానం ఎక్కువైంది. తను మాట్లాడిన తర్వాత, ఆ రోజు మకిలంతా కడిగేసినట్లనిపించింది. తను చేసిన పనికామె పూర్ణమైన సంతుష్టి పొందింది. అందరిమీదా సద్భావం కలిగింది.

"మీరు పొరపాటు పడుతున్నారు. మీ రక్తం పీల్చేవాళ్లు కట్టే మీ విలువను మీరు ఒప్పుకోకూడదు, మీ విలువను మీరే నిర్ణయించుకోవాలి. మీ అంతర్యాన్ని బట్టి మీ విలువ మీరే నిర్ణయించుకోవాలి. మీ స్నేహితులు కట్టిన విలువే ప్రధానం కాని శత్రువులు కట్టే విలువ కాదు" అంది తల్లి.

"మాకు స్నేహితులెవరు?... మేమెప్పుడూ బ్రెడ్డుమీద పెన్నుకోసం తగవులాడుకుంటూనే ఉంటాం" అన్నాడు ప్యోత్ర్.

"కాని నేను చెపుతున్నానుగా మనకి స్నేహితులున్నారు."

"ఎక్కడైనా ఉండవచ్చునేమోగాని ఇక్కడ కాదు" అన్నాడు స్త్రేపాన్ పాలోచనగా.

"వాళ్ల నిక్కడే కనుక్కోవడానికెందుకు ప్రయత్నించకూడదు?"

స్త్రేపాన్ ఒక్క క్షణమాలోచించి జవాబుచెప్పేడు:

"హుం! అవును. ఆ పనే మనం చెయ్యాలనుకుంటాను."

"కూచోండి. భోజనం సిద్ధంగా ఉంది" అంది తత్యానా.

వాళ్ళు భోజనం చేస్తుంటే, తల్లి చెప్పిన మాటలవల్ల ప్రభావితుడైన ప్యోత్ర్, మళ్లీ హుషారుగా మాట్లాడ్డం ప్రారంభించాడు.

"అమ్మా! ఎవరూ మిమ్మల్ని చూడకుండానే, తెల్లవారకుండా, మీరిక్కడనుంచి వెళ్లిపోవాలి. పట్టణానికి వెళ్లకుండా తిన్నగా ముందు స్టేషన్‌కే వెళ్లండి. అక్కడ తపాలా బగ్గీ ఎక్కండి" అన్నాడు.

"ఎందుకు? నేనామెను నా బండిమీద తీసుకెడతాను" అన్నాడు స్త్రేపాన్.

"వద్దు. ఆ పని చెయ్యద్దు. వాళ్ళు నిన్ను 'ఆమె రాత్రి మీ ఇంట్లో ఉందా?' అని అడుగుతారు. 'అవును' అంటావు. 'ఇప్పుడెక్కడుంది?' అని అడుగుతారు. 'నేను స్టేషన్‌కు బండిమీద తోలు కెళ్లి దిగబెట్టే' నంటావు. 'ఆహా! అయితే ఆమె తప్పించుకుపోవడానికి నువ్వు తోడ్పడ్డావన్నమాట!' అని నిన్ను జైలుకు పంపుతారు. తెలిసిందా? జైల్లో కెళ్లడానికి తొందర పడడంలో అర్థమేమీ లేదు. ఏ పనైనా సరైన కాలంలో చెయ్యాలి. 'చక్రవర్తైనా కాలం తోసుకొస్తే మరణిస్తాడ'ని సామెతుంది. దీనికి సమాధానం ఇలా చెప్పుకోవాలి. ఆమె రాత్రి మా యింట్లో పడుకుంది. పొద్దున్నే గుర్రాలను బాడుగకు కుదుర్చుకుని వెళ్లిపోయింది. మా వూరు రహదారి పక్కనే ఉంది కనుక ఎంతోమంది రాత్రిళ్ళు ఇక్కడ పడుకుంటారు."

"ప్యోత్ర్, ఇంత పిరికితనం నీకెవరు నేర్పేరయ్యా?" అని తత్యానా వ్యంగ్యంగా అడిగింది.

"ఏమమ్మోయ్! మనిషైనవాడు అన్ని సంగతులూ తెలుసుకుని ఉండాలి. ఎప్పుడు పిరికితనం చూపాలో, ఎప్పుడు ధైర్యంగా ఉండాలో తెలుసుకోవాలి" అని ప్యోత్ర్ మోకాటి చిప్పమీద కొట్టుకుంటూ చెప్పడం మొదలెట్టేడు: "ఆ వార్తాపత్రికతో వగానావ్ దొరికిపోయినప్పుడు వాళ్లెలా కంటబెట్టేశారో జ్ఞాపకం లేదూ? ఇప్పుడు బతిమాలి గాని, డబ్బిచ్చి గాని ఒక పుస్తకాన్ని అతడిచేత పట్టించలేము. తల్లీ! నా మాట నమ్మండి. నేను చురుకైన మోసగాణ్ణి. మీరు తెచ్చిన కరపత్రాలనూ, వార్తాపత్రికలనూ నేను జాగ్రత్తగా పంచిపెడతాను. మీ యిష్టమొచ్చినన్నిటిని సరైన చోట పంచిపెడతాను. మా జనంలో చాలామందికి చదవడం

రానిమాట నిజమే. పైగా భయం కూడాను. ఒక్కొక్కప్పుడు మీరెలాంటి ఇరుకున పడ తారంటే, తప్పనిసరిగా కళ్లు తెరిచి, దీన్నేం చెయ్యాలి అనే సందిగ్ధంలో పడతారు. ఈ కరపత్రాలు నీకు విస్పష్టంగా ఆలోచించు, బుర్రనుపయోగించు అని చెప్తాయి. చదవ డంచేతగాని కొందరికి, చదివేవారికన్న ఎక్కువ సంగతులు తెలుసు. ముఖ్యంగా కడుపు నిండిన వారికన్న. నేను ఈ ప్రాంతాన్నంతటినీ కాలినడకన తొక్కి అన్ని సంగతులూ చూశాను. మేమెలాగో ఈ వ్యవహారాన్ని సర్దుబాటు చేసుకోగలుగుతాం. అయితే కొంచెం బుద్ధినుపయో గించాలి. మొదట్లోనే దొరికిపోకుండా ఉండాలంటే, కొంచెం యుక్తిగా ప్రవర్తించాలి. రైతులు అధికారులపట్ల సుహృద్భావంతో లేరని అధికారులప్పుడే పసికట్టినట్టుంది. రైతు మునుపటిలా చిరునవ్వులు నవ్వడం లేదనీ, ఆప్యాయతతో లేడనీ, మొత్తంమీద అధికారులతో తెగతెంపులు చేసుకోవాల నుకుంటున్నాడనీ వాళ్లకు వాసనేసింది. ఈ మధ్య దగ్గర్లోనే ఉన్న స్మోల్యకోవా అనే గ్రామానికి వాళ్లు పన్నులు వసూలు చెయ్యడానికి వచ్చారు. రైతులు దుడ్డుకర్రలతో వాళ్లకెదురయారు! పోలీసు ప్రధానాధికారి ఏమీ ఊరుకోలేదు. 'ఒరి తుంటరి వెధవల్లారా! మీరు జార్‌చక్రవర్తికి విరోధులన్నమాట?' అని అరిచాడు. స్పివాకిన్ అనే ఒక రైతు, అతడి వెనుకనుంచే 'మీరూ, మీ జారూ ఏ గోతిలో దిగితే ఎవరికయ్యా?' అన్నాడు. 'నీ వంటిమీద చొక్కాను దొంగిలించేవాడు ఏమున్న చక్రవర్తయ్యా?' అన్నాడు. అమ్మా! ఇక్కడి వ్యవహారాలంతదాకా వచ్చాయి. స్పివాకిన్‌ను జైల్లో పెట్టేరనుకో, కాని అతని మాటలను బంధించలేరు కదా. చిన్న పిల్లలకు కూడా అతనన్న మాటలు బాగా జ్ఞాపకమున్నాయి. ఆ మాటలు అలా మార్మోగుతూనేవున్నాయి!"

అతడేమీ తినలేదు. మిలమిలలాడే నల్లని కళ్లతో నాలుగు మూలలా పరికిస్తూ చిన్న గొంతుకతో గబగబ మాట్లాడుతూనే ఉన్నాడు. రైతుల జీవితాన్ని గురించి, తన అభిప్రాయా లను, సంచిలోంచి వొలకపోసిన వాణేల్లాగ తల్లికి ధారాళంగా సమర్పించాడు.

రెండు సార్లు స్త్రెపాన్ అతని మాటకడ్డొచ్చి, "నువ్వేదో ఒకటి కొంచెం తినవయ్యా" అని హెచ్చరికలు చేశాడు.

రెండు సార్లూ కూడా ప్యోత్ర్ బ్రెడ్డుమా చెంచామా పుచ్చుకుని, భరద్వాజపిట్ట పాటపాడినంత సుళువుగా కథలు చెప్పేడు. భోజనం అవడంతోనే, అతడు గభాలున లేచి నిలబడ్డాడు.

"సరి. నేనిక ఇంటికి పోయే వేళైంది. అమ్మా! శలవు" అని కరచాలనం చేస్తూ ఇలా అన్నాడు: "మనమిక ముందు ఎప్పుడూ కలవక పోవచ్చు. కాని ఈ జరిగిందంతా చాలా బాగుందని నేననుకుంటున్నాను. మిమ్మల్ని కలుసుకోవడం, మీతో మాట్లాడ్డం చాలా బాగా ఉంది. కాగితాలు కాక మీ పెట్టెలో ఏదైనా ఉందా? ఉన్ని శాలువా? సరే. ఉన్ని శాలువ.

స్టైపాన్ జ్ఞాపక ముంచుకో. నీ పెళ్ళైనతడు ఒక నిముషంలో పట్టుకొస్తాడు. రా స్టైపాన్. శలవు. మీకు అదృష్టం కలిసిరావాలి!"

వాళ్ళు విశ్రమించిన పిమ్మట, బొద్దింకలు దొలుస్తున్న శబ్దం వినబడింది. ఇంటి కప్పుమీద గాలి రంయ్యిమని కొడుతోంది. పొగ గొట్టంలో బొంయ్యిమంటోంది. మంచి వర్షపు జల్లులు కిటికీ తలుపులను కొడుతున్నాయి. తల్యానా పొయ్యిపైన సామాను కొట్టుకు కట్టిన తెరలను తెంపుకొచ్చి బెంచీమీద మడతలు పెట్టి తల్లికి పడకను అమారుచేసింది.

"అతడు ఉత్సాహవంతుడైన యువకుడే" అంది తల్లి. రెండవ స్త్రీ ఆమెకేసి చిరాకుగా చూసింది.

"చాలా గడబిడ చేస్తాడు. కాని కార్యతూరత్వం లేదు."

"మీ భర్త సంగతేమిటి?" అని అడిగింది తల్లి.

"అతను మంచివాడే. తాగడు. మేమిద్దరం సయోధ్యగానే ఉంటాం. కాని మనిషికి స్థిర సంకల్పం లేదు."

లేచి నిటాగ్గా నిలబడింది. ఒక క్షణం ఊరుకుని,

"ఇప్పుడు మనమేం చెయ్యాలి?" అని అడిగింది. "తిరుగుబాటు చెయ్యకూడదా? నిజంగా చెయ్యవలసిందే. ప్రతివాళ్లూ అలాగే అనుకుంటున్నారు. కాని ఎవరి మట్టుకు వాళ్లే అనుకుంటున్నారు. అందరూ బహిరంగంగా ఆలోచించుకోవాలి" అని బెంచీమీద కూచుని ఇలా చెప్పింది:

"పెద్ద ఇళ్ల తాలూకు యువతులు ఇలాంటి పనికి పూనుకుని, కార్మికులతో కలిసి మెలిసి తిరుగుతూ, వాళ్లకు పుస్తకాలు చదివి వినిపిస్తున్నారని చెప్పేరు కదా. వాళ్లు సుకుమారులు కాదూ? అలాటి పని వాళ్లు చెయ్యగలరూ? వాళ్లకి భయం లేదా?"

తల్లి జవాబు విన్నాక ఆమె దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది. కిందకు చూస్తూ తల వాల్చుకుంది.

"నేను చదివిన ఒక పుస్తకంలో 'అర్థరహితమైన జీవితం' అనే మాటను చూశాను. చటుక్కున దాని భావాన్ని గ్రహించాను. అదంటే ఏమిటో నాకు చాలా బాగా తెలును — దానికి అర్థాలు లేకపోలేదు. కాని ఒకదాని కొకటి సంబంధ ముండదు — కాపరి లేని గొర్రెల మందన్నమాట. అర్థరహితమైన జీవితమంటే అదే. నాకు పావకాశముంటే, అలాటి జీవితాన్నుంచి, వెనక్కైనా తిరిగి చూడకుండా పారిపోతాను. విషయాలను తెలుసుకున్నాక మనసుకు చాలా బాధగా ఉంటుంది."

పాడారిపోయిన ఆమె ఆకుపచ్చని కళ్లలోని వెలుగును బట్టి తల్లి ఆమె దుస్థితినీ, బాధనూ గ్రహించింది. ఆ బాధనామె కంఠస్వరంలోనే తల్లి వినగలిగింది. ఆమెను ఓదార్చాలనుకుంది.

"ఈ బాధకు నివారణ మార్గాన్ని మీరు చూస్తూనే ఉన్నారుకదా అమ్మాయీ...."

"అంత మాత్రాన సరిపోదు.... ఎలాగో తెలియాలి" అని తత్యానా మెల్లగా మాట కడ్డొచ్చింది. "మీకు పక్కేశానమ్మా."

తత్యానా పొయ్యిదగ్గర కెళ్లి మాట్లాడకుండా, ఆలోచిస్తూ నిటాగ్గా నిలబడింది. తల్లి కట్టుబట్టలతోనే పడుకుంది. అలసటవేత ఒళ్లంతా సలపరించినట్లయి ఒక్కసారి మెల్లగా మూలిగింది. తత్యానా దీపం తగ్గించేసింది. గుడిసె అంతా చీకటి మయమవడంతోనే, హీనస్వరంలో మెల్లగా గొణిగింది. ఆ మాటలతో అంధకారంయొక్క ముఖంమీదనుంచి ఏదో తుడిచేసినట్లనిపించింది.

"మీరు ప్రార్థన చెయ్యరన్నమాట. నాకూ దేవుడిలోగాని, మాయమంత్రాల్లోకాని నమ్మకం లేదు" అంది.

తల్లి ఆమె పక్కకు తిరిగింది. అగాధమైన చీకటి కిటికీలోంచి ఆమెకేసి తేరి చూచింది. చిన్నచిన్న శబ్దాలు, కదలికలు ఆ నిశ్శబ్దంలో ఆమె చెవిని పడ్డాయి. భయ పడుతూ, చెవిలో గుసగుసలాడినట్లుగా ఆమె తత్యానాకు జవాబుచెప్పింది:

"దేవుడి విషయంలో – నాకేమీ ఇదమిద్ధమని తెలియదు. కాని నాకు క్రీస్తుయందు నమ్మకముంది. అతడు చెప్పిన 'నీ పొరుగువారిని నీవలెనే ప్రేమించు' అనే మాటల్లో నాకు విశ్వాసముంది."

తత్యానా మాట్లాడలేదు. నల్లగా ఉన్న పొయ్యి కాంతుని ఉన్న నిడుపాటి ఆమె గోధుమ రంగు విగ్రహాన్ని తల్లి లీలగా చూసింది. ఆమె కదలిక లేకుండా నిలుచుంది. తల్లి విచారంతో కళ్లు మూసుకుంది. హఠాత్తుగా తత్యానా అన్న కఠోరమైన మాటలు ఆమె చెవిలో పడ్డాయి:

"నా బిడ్డలు చనిపోయినందుకు నేను దేవుడినీ క్షమించను, మానవుడినీ క్షమించను.... ఎన్నటికీ క్షమించను!"

నీలొవ్నా ఆత్రంగా లేచింది. ఆ మాటల్లో ఉండే బాధను ఆమె గ్రహించింది.

"మీరింకా చిన్నవాళ్లే కదా. ముందు ముందు పుడతారు" అని మెల్లగా చెప్పింది.

"ఎప్పటికీ పుట్టరు. నాలో ఏదో లోపముంది. నాకింక పిల్లలు పుట్టరని డాక్టరు చెప్పేడు."

ఒక ఎలుక నేలమీద అడ్డంగా పరుగెత్తింది. ఏదో పగిలినట్టు శబ్దమైంది – నిశ్చలంగా ఉన్న నిశ్శబ్దాన్ని అగోచరమైన మెరుపు పటాపంచలు చెయ్యడం వినబడింది. పూరితో నేసిన పైకప్పులోకి అదురుతూ సన్నంగా ఉన్న వేళ్లను జొనిపి కెలుకుతూ, వర్షం ఇంటి కప్పుమీద చప్పుడుచేసింది. బావురమంటూ పడుతూన్న నీటిబొట్ల చప్పుడు శరద్రాత్రి మందగమనాన్ని చాటుతూంది.

తల్లికి మగతనిద్ర పట్టింది. ఆ నిద్దలో వాకిట్లోనూ లోపలా అడుగుల చప్పుడు వినిపించింది. మెల్లగా తలుపు తెరుచుకుంది.

"పడుకున్నావా తల్యావా?" అని మగగొంతుక వినబడింది.

"లేదు."

"ఆమె నిద్రపోయిందా?"

"నిద్రపోయిందనుకుంటాను."

ఒక దీపం గబ్బుమని వెలిగి ఆరిపోయింది. రైతు తల్లి పక్క దగ్గరకొచ్చి ఆమె కాళ్ల మీద వేసుకున్న కోటును ఒళ్లంతా కప్పేడు. అతడు తనపట్ల తీసుకుంటున్న శ్రద్ధకామె చాలా సంతోషపడింది. చిరునవ్వు నవ్వి కళ్ళు మూసుకుంది. స్త్రెపాన్ దుస్తులు వదిలేసి మాట్లాడకుండా చిట్టి అటకమీద కెక్కేడు. అంతా నిశ్శబ్దమైంది.

తల్లి కదలకుండా పడుకుంది. వ్యవస్థలో ఉన్న నిశ్శబ్దంయొక్క రకరకాల మార్పులను వింటోంది. రక్తసిక్తమైన రీబిన్ ముఖం ఆమె కళ్లముందర మసలుతూనే ఉంది.

అటకమీద కొంచెం కదలిక కలిగింది.

"ఎలాంటి తరహా మనుషులీ పని చేస్తున్నారో చూశావా? జీవితమంతా కష్టపడి పనిచేసి జీవించి, అనేక బాధల ననుభవించిన పెద్దవాళ్ళు ఈ పనికి అంకితమైనారు. వాళ్ళు న్యాయంగా విశ్రాంతి తీసుకోవలసినవాళ్ళు. అలా కాకుండా వాళ్ళు ఈ పని చేస్తున్నారు. ఓ, స్త్రెపాన్! నువ్వు చిన్నవాడివి. తెలివైనవాడివి...."

"ముందు నేను బాగా ఆలోచించుకోవాలి" అని స్ఫుటమైన గొంతుకతో చెప్పేడా రైతు.

"ఆమాట ఇదివరకు విన్నాను."

వాళ్లిద్దరూ ఒక నిముషం మౌనం దాల్చేరు. తర్వాత స్త్రెపాన్ మాట్లాడ్డం సాగించాడు:

"పని మొదలుపెట్టే పద్ధతుంది. ముందుగా రైతులతో వేర్వేరుగా మాట్లాడాలి. మాటవరసకి అలెక్సేయ్ మాకొవ్ ఉన్నాడు. అతను చదవగలడు. చాలా ఉత్సాహవంతుడు. అధికారులమీద చాలా కసిగా ఉన్నాడు. సెర్గేయ్ షోరిన్ కూడ తెలివైన రైతే. క్న్యాజెవ్ చాలా నిజాయితీపరుడు. భయం లేనివాడు. పని మొదలుపెట్టడానికి వీళ్ళు చాలు. ఆమె చెప్పిన మనుషులవంటివాళ్లతో ముందుగా మేము మాట్లాడాలనుకుంటున్నాము. నేను గొడ్డలి భుజాన వేసుకుని, పుల్లలు కొట్టి అదనంగా నాలుగు డబ్బులు సంపాదించుకునేవాడిలాగ పట్నానికెడతాను. మనం చాలా జాగ్రత్తగా ఉండాలి! మనిషి తన విలువను తానే గుర్తించు కోవాలని ఆమె చెప్పిన మాట నిజం. ఈ వేళ, ఆ రైతు సంగతి చూడు. దేవుడి ఎదుట నిలబడినా అతడు లొంగేటట్లు లేదు. ఆ నికీత సంగతి చూశావా? తనకొక అంతరాత్మ ఉందనిపించాడు. అతడు అలా నిలబడగలడని ఎవరనుకున్నారు!"

"మనిషిని ఎదురుగా నిలబెట్టి వాళ్లల్లా కొడుతుంటే, తెల్లబోయి చూస్తూ నిలబడ్డమే కదా మీరు చేసే పని!"

"సరేలే! అతగాడిని మేము కొట్టలేదు! అందుకే సంతోషించాలి!"

చాలా సేపటివరకూ, అతడలా గుసగుసలాడుతూనే ఉన్నాడు. మధ్యమధ్య అతని మాటలు తల్లికి వినబడనంత మెల్లగా మాట్లాడేవాడు. ఒక్కొక్కప్పుడు కొంచెం బిగ్గరగా మాట్లాడు తుంటే:

"ఇష్, ఆమెకు నిద్రాభంగం కలుగుతుంద"ని భార్య వారించేది.

తనపై మేఘంలా వాలి తనను తన రెక్కలమీద ఎక్కించుకుని ఎగిరిపోయిన గాఢ నిద్రలో తల్లి మునిగిపోయింది.

ధూసరవర్ణపు వేకువ కిటికీల్లోంచి తొంగిచూడ్డంతోనే, రాత్రి కడపటి జాము అంత మైందని నిద్రమత్తుతో తెలియజేస్తూన్న చర్చిగంటల మోత భయంకరమైన చీకటిలోనుంచి తేలుతూ రావడంతోనే, తత్యానా తల్లిని మేల్కొల్పింది.

"సమొవార్ ముట్టించాను. ఒక గ్లాసు టీ తాగి బయల్దేరండి. లేచీ లేవడంతోనే బండెక్కితే మరీ చలి అనిపిస్తుంది."

స్తెపాన్ చిక్కుబడిన గడ్డాన్ని నిమురుకుంటూ, తల్లి నడిగి పట్టణంలోని ఆమె చిరునామాను తెలుసుకున్నాడు. రాత్రి విశ్రాంతితో అతడి ముఖం తేటగా ఉండడం ఆమె చూసింది.

"ఇది ఇలా జరగడం చాలా చిత్రంగా ఉంది సుమండీ!" అన్నాడు, టీ తాగుతూ.

"ఏమిటి?" అని తత్యానా అడిగింది.

"ఇంత సులువుగా మనం పరిచయం కావడం."

"మన పనికి సంబంధించిన అన్ని విషయాల్లోనూ అద్భుతమైన నిరాడంబరత్వముంది" అంది తల్లి సాలోచనగా.

భార్యాభర్తలిరువురూ తల్లి వెళ్లిపోతుంటే చాలా బాధపడ్డారు. వాళ్లేమీ పైకి అనలేదు కాని, అనేక చిన్నచిన్న విషయాల్లో ఆమె సౌకర్యాన్ని గురించి ఆత్రుత వ్యక్తపరిచారు.

తల్లి తపాలాబండిలో కూచుని తనలో ఆలోచించుకోవడం ప్రారంభించింది. స్తెపాన్ మెల్లగా జాగ్రత్తగా పని ప్రారంభిస్తాడనీ, కాని అలుపులేకుండా పని చేస్తాడనీ ఊహించు కుంది. అతని భార్య ఆరోపణ లెప్పుడూ అతని చెవుల్లో గింగురుమంటూ ఉంటాయని అనుకుంది. ఆమె ఆకుపచ్చని కళ్లు నిప్పులు కక్కుతూనే ఉంటాయనీ, ఆమె బతికున్నంత కాలం, చచ్చిపోయిన తన బిడ్డలకోసం తల్లికి వుండే దారుణమైన కసితో కూడిన శోకం ఆమెను విడువదనీ అనుకుంది.

తల్లి రీబిన్‌ను జ్ఞాపకానికి తెచ్చుకుంది. అతని ముఖం, గాయాలూ, జ్యోతుల్లాంటి కళ్ళూ, అతని మాటలూ అన్నీ జ్ఞప్తికొచ్చాయి. అటువంటి ఘోరమైన పశుత్వ ప్రదర్శనం కళ్ల ముందర జరుగుతుంటే దారుణమైన నిస్సహాయతచేత నిస్పృహ కలిగి ఆమె హృదయాన్ని

నలిపేసినట్లయింది. పట్టణం చేరేవరకు దారి పొడుగునా బూడిదెరంగుతో మకమకలాడు తూన్న ఆ దిన పూర్వరంగం పైన రీబిన్ మూర్తి నిలిచే ఉంది. బలమైన అతని మూర్తి, నల్లని గెడ్డం, చినిగిపోయిన చొక్కా, రక్తం ప్రవహిస్తున్న తల, వెనక్కు విరిచి కట్టబడిన చేతులు ఆమె కళ్లకు కట్టినట్లగుపడ్డాయి. కోపోద్దీపితుడైన మనిషి, తాను నమ్మిన సత్యంకోసం చివరంటా పోరాడే దీక్షతో, ఆమె ఎదుట నిలబడినట్లే కనబడింది. భూమిలో కుంగిపోతున్న అసంఖ్యాకమైన గ్రామాలు ఆమె తలపుకొచ్చాయి. ముందు లభించబోయే న్యాయంకోసం ఆత్రంగా కాచుకున్న అనేకమంది ప్రజలు ఆమె స్ఫురణకొచ్చారు. మాటా మంతీ లేకుండా, అర్థంపర్థం లేకుండా, ఇంతకంటె మెరుగైన బతుకుకోసం ఏవిధమైన ఆశా లేకుండా, జీవితమంతా శ్రమపడుతుండే వేలాది ప్రజలను గురించి ఆమె ఆలోచించు కుంది.

జీవితం, దున్నేవాడికోసం మూగపోయి ఆత్రంగా కాచుకున్న మిట్టపల్లాల పొలంవలె ఉన్నట్లామెకు తోచింది.

"నామీద సత్యాన్నీ ధర్మాన్నీ వెదజల్లండి. మీ కష్టానికి నూరు రెట్లు ఫలితాన్ని స్తాను!" అని ఆ పొలం విజాయితీగల స్వేచ్ఛాళువులను ఆహ్వానిస్తున్నట్లు ఆమెకు స్ఫురిం చింది.

తను చేసిన కృషి సఫలీకృతమైన సంగతి నామె స్ఫురణకు తెచ్చుకునేసరికి ఆనందం వెల్లువగా వచ్చింది. కాని ఆమె వినయంతో దాన్ని లోలోపల అణుచుకుంది.

## 19

నికొలాయ్, బట్టలు సరిగా సర్దుకోకుండానే ఒక పుస్తకం చేత్తో పుచ్చుకుని తల్లికి తలుపు తీశాడు.

"ఇంత త్వరగా వచ్చేశారా? మీరింత త్వరగా వస్తారనుకోలేదు" అని సంతోషంతో పలకరించాడు.

కళ్లద్దాలవెనుక దయార్ద్రమైన అతని కళ్లు మిలమిల్లాడేయి. ఆమె తన శాలువనూ కోటునూ విప్పుకొంటూండగా ఆమెకు సాయంచేస్తూ ఆప్యాయంగా చిరునవ్వు నవ్వుతూ, ఆమెకేసి తేరిపారజూశాడు.

"నిన్న రాత్రి వాళ్లు మన ఇంటిని సోదా చేశారు. మీకు ఏదో జరిగి ఉండవచ్చునని నేను భయపడ్డాను. అయితే, నన్ను వాళ్లు అరెస్టుచెయ్యలేదు. మిమ్మల్ని అరెస్టుచేసి ఉంటే, తప్పకుండా వాళ్లు నన్ను పట్టుకుపోయేవాళ్లే" అన్నాడు.

ఆమెను భోజనాల గదిలోకి తీసుకెడుతూ కబుర్లు చెప్పేడు.

"నన్ను పనిలోంచి బర్తరఫు చేస్తారనడంలో సందేహం లేదు. అందుకు నేనేమీ తబ్బిబ్బవడంలేదు. స్వంత గుర్రాలు లేని రైతులను లెక్కపెడుతూ బల్లదగ్గర కూచోవడం నాకూ విసుగ్గానే ఉంది."

గదంతా రాక్షసుడెవడో వచ్చి కోపంతో గోడలను కుదిపేసి ఇల్లంతా తలకిందులు చేసినట్లుంది. గోడమీద చిత్రపటాలన్నీ నేలమీద చిందరవందరగా పడివున్నాయి. గోడల కంటించిన కాగితాలన్నీ ఊడపీకబడి, పీలికలుగా వేలాడుతున్నాయి. ఒక చోట చెప్టా బల్ల పీకేయబడింది. కిటికీ తలుపులు ఊడబెరికి ఉన్నాయి. పొయ్యిలో బూడిదంతా నేలమీద విరజిమ్మబడింది. ఇలాటి దృశ్యం తల్లి కలవాటే కనుక ఆమె తలూపుతూ నికొలాయ్‌కేసి ఒకే ధ్యాసతో చూసింది. అతనిలో ఏదో ఓ కొత్త విశేషాన్ని గమనించింది.

బల్లమీద కడగని టీకప్పుల మధ్య చల్లారిపోయిన సమొవార్ ఉంది. చీజ్, సాసేజీ పళ్లేలలో కాక కాగితాలమీద పడున్నాయి. టేబిల్ గుడ్డమీద పుస్తకాలు, బ్రెడ్డుముక్కలు, బొగ్గులూ పడున్నాయి. తల్లి చిన్ననవ్వు నవ్వింది. నికొలాయ్ తను చేసిన తప్పుకు విచారపడుతూ చిరునవ్వు నవ్వేడు.

"వాళ్లు చేసిన గలభా కాకుండా ఈ గత్తరకు నేనూ కొంత కారణమే ననుకోండి. దానికేమిలెండి నీలొవ్నా! వాళ్లు మళ్లీ వస్తారేమోనని ఇంతలో సర్దుకోవడమెందుకని శుభ్రం చెయ్యలేదు. సరే కాని, మీ ప్రయాణ మెలా జరిగింది?"

ఆ ప్రశ్న ఆమె హృదయానికి భారంగా తగిలింది. మరల రీబిన్ మూర్తి ఆమె ఎదుట సాక్షాత్కరించింది. వస్తూనే ఆ విషయాన్ని అతనికి చెప్పనందుకు కొంచెం సిగ్గుపడింది. ముందుకు వంగి తొట్రుపాటేమీ పడకుండా ఏ సంగతీ మరచిపోకుండా ఉండాలని ప్రయత్నించుతూ కథంతా చెప్పడం మొదలెట్టింది.

"వాళ్లు అతడి నరెస్టు చేశారు."

నికొలాయ్ తల వాల్చేశాడు.

"నిజంగానే?" అన్నాడు.

తల్లి ఆగమని సౌంజ్ఞచేసి, సాక్షాత్తూ న్యాయం ఎదుట నిలబడి, తన కళ్ల ఎదుట ఒక మానవుని పెట్టిన దారుణ హింసకు అసమ్మతిని తెలియచేస్తున్నట్లుగా చెప్పింది. నికొలాయ్ తెల్లబోయి, కుర్చీలో జార్లపడిపోయి, పెదవులు కొరుక్కున్నాడు. మెల్లగా మలోచనాలను తీసేసి బల్లమీద పెట్టి, ఏదో కంటికగపడని బూజును తుడుచుకున్నట్లు ముఖాన్ని తుడుచుకున్నాడు.

అతడి ముఖ కవళికలు హఠాత్తుగా కోపోద్దీపితమైనాయి. చెక్కిళ్లు పొంగేయి. ముక్కుపుటాలు అదిరేయి. ఆ స్థితిలో తల్లి అతడి నెప్పుడూ చూడలేదు. అందుచేత ఆమెకు కొంచెం భయమేసింది.

ఆమె చెప్పిన సంగతంతా విన్నాక, నికొలాయ్ లేచి నిలబడి పిడికిళ్లను జేబులో పెట్టుకుని పచారు చేశాడు. పళ్లు బిగబట్టి:

"అతను చాలా గొప్ప వ్యక్తి అని చెప్పాలి. అతను జైల్లో చాలా బాధపడతాడు. అలాంటివాళ్లు తేలిగ్గా దాన్ని భరించలేరు" అన్నాడు.

ఉద్రిక్తమైన నాడులకు ఉపశమనం కలగడానికి అతడు ముంజేతులను నలువుకున్నాడు. తల్లి అతని ఆవేశాన్ని గుర్తించి తను కూడా కొంత భాగం పంచుకుంది. కత్తి మొనల్లాగయేటంత వరకూ కళ్లు చిట్లించాడు. పచారు చేస్తూనే, తీవ్రమైన కోపంతో మాట్లాడేడు:

"ఈ సంగతి ఎంత దారుణమో ఆలోచించండి! నాశనహేతువైన తమ అధికారాన్ని జనంమీద చలాయించడంకోసం, కొద్దిమంది మూర్ఖులు వారిష్టమొచ్చినవారి నెవరినైనా సరే కొడతారు, చంపుతారు! కిరాతకం అధికమవుతుంది, క్రౌర్యమే దేశ చట్ట మవుతుంది. ఏమిటిది? అందులో కొందరు తాము చట్టాని కతీతులమనే ధీమాతో అడవి జంతువుల్లాగ క్రూరంగా విజృంభిస్తారు. చిత్రహింసలపాల్జేయడం వాళ్లకొక సహజాత వాంఛ — సంకెళ్లు లేని బానిసలు తమ బానిస భావాలనూ, పశు ప్రవృత్తులనూ వ్యక్తంచేసేందుకు క్షుద్రవాంఛ. ప్రతీకార బుద్ధితో కొందరి హృదయాలు విషపూరితమవుతున్నాయి. కొందరు తాము స్వయంగా తిన్న కొరడా దెబ్బలవల్ల మొద్దుబారిపోతున్నారు. జనాన్ని నీతిహీనులను చేసేస్తున్నారు — యావత్తు జనాన్నీ!"

అతను నిలబడిపోయి పళ్లు బిగించాడు.

"ఈ పశుజీవితంలో మనిషి అప్రయత్నంగా పశువైపోతున్నాడు."

ఎంతో ప్రయత్నంమీద అతడు తన ఆగ్రహాన్ని జయించి, తనలో తాను ఏడుస్తున్న తల్లికేసి ఇంచుమించు ప్రశాంతంగా చూశాడు. అతని కళ్లలో నిశ్చలమైన కాంతి వెలుగుతూంది.

"మనకిక అట్టే వేళలేదు, నీలొవ్నా! మనం స్థిమితపడాలమ్మా!"

విచారంగా ఒక చిన్ననవ్వు నవ్వి అతడు తల్లిని సమీపించి ఆమె చేతిని పట్టుకుని,

"మీ పెట్టె ఎక్కడుంది?" అని అడిగేడు.

"వంటింట్లో."

"మన గుమ్మం దగ్గర గూఢచారులున్నారు. వాళ్ల కళ్ల బడకుండా ఇన్ని కాగితాలను బయటికి దాటించలేము. వాటిని దాచడానికిక్కడ చోటు కూడా లేదు. ఈ రాత్రి వాళ్లింకొక సారి సోదాచేస్తారని అనుకుంటున్నాను. కనుక మన కెంత కష్టంగా ఉన్నా, వాటినన్నిటినీ తగలెయ్యక తప్పదు."

"వేటిని తగలెయ్యాలి?" అని తల్లి అడిగింది.

"మీ పెట్టెలో ఉన్న సరుకును."

చటుక్కున అతనే మనుకుంటున్నాడో ఆమె గుర్తుకు తెచ్చుకుని, అంత విచారంలో కూడా సగర్వంగా చిన్ననవ్వు నవ్వింది.

"అందులో ఏమీ లేవు — ఒక్క కరపత్రం కూడా లేదు" అంది. తర్వాత అక్కడ జరిగినదంతా చెప్పడం మొదలెట్టింది. దానితో ఆమెకు క్రమక్రమంగా బలం చేకూరింది.

మొదట్లో నికొలాయ్ ఆత్రంగా చిరచిరలాడేడు. పిమ్మట ఆశ్చర్యచకితుడయాడు. చివరకు ఆవేశంతో ఆమె మాటకడ్డెళ్లేడు.

"అద్భుతం! మీ అదృష్టం ఎంత గొప్పదో! ప్రజలమీద మీకుండే విశ్వాసం అమోఘం. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను — నా కన్నతల్లిలాగే ప్రేమిస్తున్నాను!" అని ఆమె చేతులను గట్టిగా పట్టుకున్నాడు.

ఎందుకితడింత హఠాత్తుగా సంతోషంతో ఉత్తేజితుడైనాడాయని ఆమె ఆశ్చర్యంతో అతనికేసి చూస్తూ చిరునవ్వు నవ్వింది.

"మొత్తంమీద మన వ్యవహారాలు ఆశావహంగానే కనుబడుతున్నాయి" చేతులు రుద్దుకుంటూ తనలో తానే నవ్వుకుంటూ నికొలాయ్ అన్నాడు. "నేను గడచిన కొద్ది రోజుల్నుంచీ కార్మికులకు పుస్తకాలను చదవడం, వాళ్లతో మాట్లాడ్డం, వాళ్లని పరిశీలనగా చూస్తుండడంతో హాయిగా కాలం గడుపుతున్నాను. వాళ్లతో స్నేహం పరిశుభ్రమైన, హితవైన సంతృప్తినిస్తోంది. వాళ్లు చాలా ఉత్తమోత్తములు, నీలొవ్నా! నేను యువ కార్మికుల విషయం చెపుతున్నాను. వాళ్లు దృఢనిశ్చయులు. సూక్ష్మగ్రాహులు. నేర్చుకోవాలనే ఆసక్తి గలవాళ్లు! వాళ్లను చూస్తుంటే ఎప్పుడో ఒకనాడు రష్యా ప్రపంచంలోకల్లా అత్యంత ప్రజాస్వామిక దేశమై తీరుతుందనే భావం కలగక మానదు!"

అతడొక క్షణమాగి ప్రమాణం చేస్తున్నట్లుగా చెయ్యి పైకెత్తేడు.

"దాదాపు సంవత్సరంనుంచి పుస్తకాల ముందరా అంకెల ముందరా కూచుని పని చేస్తుంటే, నాకు తిక్కెత్తిపోయింది. అబ్బ! నాకు కార్మికులమధ్య జీవించడం అలవాటైంది. ఇతర ప్రదేశాల్లో ఉండడమంటే నాకు సరిపడదు.... ఏమిటో ఉద్రిక్తంగా, భారంగా ఉంటుంది. ఇప్పుడిక మళ్లీ నేను స్వేచ్ఛగా జీవిస్తాను. రోజంతా వాళ్లతోనే ఉండి పనిచేస్తాను. తెలిసిందా? నవ భావాలు ఉత్పన్నమయే చోట నేనుంటాను. యువ, సృజనాత్మక శక్తి సమక్షంలో నేనుంటాను. అది నిరాడంబరంగా, అందంగా, ఉత్తేజకరంగా ఉంటుంది. ఏ వ్యక్తినైనా అది యువకుడ్ని చేస్తుంది. బలాన్నిస్తుంది. అది చాలా సంపత్కరమైన జీవిత విధానం, నీలొవ్నా!"

అతడు సంతోషంతో నవ్వేడు. తల్లి అతని సంతోషాన్ని గుర్తించి అందులో పాల్గొంది.

"సరి, మీ సంగతో? మీరు అద్భుతమైన వ్యక్తి. ఎంత విస్పష్టంగా మీరు మనుషులను

వర్ణిస్తారో కదా! వాళ్ల వెంత బాగా అవగాహనచేసుకుంటున్నారో!" అని తన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు నికొలాయ్.

అతడు తల్లి పక్కన కూర్చుని ముఖం పక్కకు తిప్పి, తన తత్తరపాటును ఆమె చూడకుండా ఉండాలని, చేత్తో తలవెంట్రుకలను నిమురుకున్నాడు. తరువాత ఆమె ఉషారునిచ్చే అనుభవాలను, సూక్ష్మంగా చెపుతుంటే ఆమెకేసి ఆశ్చర్యంగా చూసేవాడు.

"చాలా గొప్ప అదృష్టమనుకోండి!" అని సంతోషం వెలిబుచ్చాడు. "మీరు కూడా తేలిగ్గా దొరికిపోయేవారే.... దానికి బదులు.... అవునులెండి. రైతులు మేల్కొంటున్నారు—అదీ సహజమే. ఆ స్త్రీ—ఆమె మూర్తి నా కళ్ల ఎదుట మెదుల్తోంది.... గ్రామాల్లో పనిచేయడానికి, మనం ప్రత్యేకమైన మనుషులను పంపవలసిన ఆగత్యముంది. అయితే మనుషులేరి? చాలినంతమంది లేరు. మనకు వందలాదిగా కావాలి!"

"పాషయే బయట ఉంటేనా! అన్‌ద్రేయ్ కూడా!" అంది మెల్లగా తల్లి.

అతడామెకేసి చూసి, తల వాల్చేశాడు.

"నీలొవ్నా! నేను చెప్పే మాట మీకు చాలా కష్టంగా ఉండవచ్చు. కాని నేను పావెల్‌ను బాగా అర్థంచేసుకున్నాను. అతడు జైలునుంచి తప్పించుకు రావడానికి ఇష్టపడడు. అతడు విచారణే కోరుకుంటాడు. తలెత్తుకుని నిలబడి తను చెప్పవలసినదంతా చెప్పడానికి అతనికొక సావకాశం కావాలి. అలాటి సావకాశాన్ని అతను వదలుకోడు. ఎందుకు వదులుకోవాలి? సైబీరియానుంచే పారిపోయి వస్తాడు."

"సరే. ఏది మంచిదో అతనికే తెలుసుననుకుంటాను" అంది తల్లి నిట్టూరుస్తూ.

ఒక్క క్షణమాగి, నికొలాయ్ సులోచనాల్లోనుంచి తల్లికేసి చూస్తూ:

"మీ రైతు త్వరగా ఇక్కడికొస్తే బాగుండును! రీబిన్‌ను గురించి మనం ప్రత్యేకంగా రైతులకోసం ఒక కరపత్రాన్ని తయారుచెయ్యాలి. అతనే చాలా నిర్భయంగా మాట్లాడేడు. కనుక ఈ కరపత్రంవల్ల అతని కేమీ అపాయం కలగదు. నేను ఈవేళే రాసేస్తాను. ల్యుద్మీలా వెంటనే అచ్చు వేసేస్తుంది. కాని అవి వాళ్ల కందే దెల్లాగ?" అన్నాడు.

"నేను తీసుకెడతాను."

"ధన్యవాదాలు. కాని వద్దు. వెసొవ్‌శ్చికోవ్ ఆ పనెందుకు చెయ్యకూడదూ?" అన్నాడు నికొలాయ్.

"నేను అతనితో మాట్లాడుతాను."

"మాట్లాడండి. ఆ పని ఎట్లా చెయ్యాలో నేర్పండి."

"కాని నే చేసే పనేమిటి?"

"ఓ! అదా! మీ కేదో ఒక పని చూస్తాంలెండి!"

నికొలాయ్ బల్లదగ్గర కూచుని రాయడం మొదలెట్టేడు. బల్లను నర్దుతూ, అతడికేసి

చూసీ చూడనట్లుగా చూసింది. అతని చేతిలోని కలం వణకడం ఆమె గ్రహించింది. మధ్యమధ్య కంఠంమీది నరాలు అదురుతుండడం చూసింది. తల వెనక్కి వాల్చి, కళ్లు మూసుకుని ఆలోచిస్తుంటే, అతని గెడ్డం వణుకుతుండడం చూసి తల్లి చాలా కటకట పడేది.

చివరకు అతడు లేచి నిలబడి:

"తయారైంది. ఇదిగో ఈ కాగితాన్ని మీ వంటిమీద దుస్తుల్లో ఎక్కడో రహస్యంగా దాచండి. కాని గూఢచారులొస్తే మిమ్మల్ని కూడా సోదా చేస్తారు సుమండీ!"

"వాళ్ల కర్మకు వాళ్ల నోదిలేద్దురూ!" అని అలక్ష్యంగా జవాబుచెప్పింది.

ఆ సాయంకాలం డాక్టర్ ఇవాన్ దనీలొవిచ్ వచ్చాడు.

"హఠాత్తుగా అధికారులింత ఖంగారు పడుతున్నారేమిటి? నిన్న రాత్రి ఏడు ఇళ్లను సోదాచేశారు. నేను చికిత్స చేసే రోగి ఏడీ?" అని గబగబా అటూ ఇటూ తిరుగుతూ అడిగేడు.

"నిన్ననే వెళ్లిపోయాడు. ఈవేళ శనివారం కదా. అధ్యయన బృందపు సమావేశానికి వెళ్లి తీరాలన్నాడు" అని నికొలాయ్ జవాబుచెప్పేడు.

"ఉత్త తెలివితక్కువతనం.... బద్దలైన తలతో గోష్ఠిలో కూచోవడమేమిటి?"

"నేనెన్నో విధాలుగా మాట్లాడి చూశాను. నావల్ల కాలేదు."

"'నాకేసి చూడండి.... నే నప్పుడే గాయపడ్డాను!' అని అతడు గొప్పచెప్పుకోవాల నుకున్నాడు. అందుకేమీ సందేహం లేదు" అంది తల్లి.

డాక్టరు కోపం నటిస్తూ ఆమెకేసి చురచుర చూశాడు.

"ఎంత కఠిన హృదయురాలివమ్మా!" అన్నాడు.

"సరే, ఇవాన్! నీకిక్కడేమీ పనిలేదు. అతిథులొస్తారనుకుంటున్నాం. వెళ్లిపో! నీలొవ్నా, కరపత్రాన్ని అతని కియ్యండి."

"ఇంకొక కరపత్రమా!" అని డాక్టర్ ఆశ్చర్యపడ్డాడు.

"అవును. దీన్ని తీసుకెళ్లి అచ్చాఫీసులో ఇచ్చెయ్యి."

"అలాగే ఇచ్చేస్తాను. ఇంకేమైనా పనుందా?"

"ఇంకేమీ లేదు. గేటు దగ్గర గూఢచారి నిలబడ్డాడు."

"నేను చూశాను. నా ఇంటి గుమ్మం దగ్గర కూడా ఒకడున్నాడు. సరే. మరి వెళ్లొస్తాను. కఠిన హృదయురాలా! శలవు. సరే కాని, మరొక సంగతి. శ్మశానం దగ్గర జరిగిన దెబ్బలాట మంచికే వచ్చింది సుమా! ఊరంతా ఆ సంగతే చెప్పుకుంటున్నారు. నువ్వు రాసిన కరపత్రం బాగుంది. పైగా, సరైన సమయాని కందింది. అందుచేతనే నేనెప్పుడూ నిరర్థకమైన శాంతికన్న, ఉపయుక్తమైన పోరాటం మేలంటూ ఉంటాను."

"సరేలే. వెళ్లు."

"నువ్వు ఎక్కువ ఆతిథ్య గౌరవాన్నిచ్చావని నేను చెప్పను. నిలొవ్నా, చెయ్యియ్యండి. ఆ కుర్రవాడు మాత్రం చాలా అవివేకమైన పనిచేశాడు. అతడెక్కడుంటాడో నీకు తెలుసునా?"

నికొలాయ్ ఆ యువకుని చిరునామా ఇచ్చాడు.

"నేను రేపు అతనింటికెళ్లి చూస్తాను. అతడు చాలా మంచి కుర్రాడు కదూ?"

"చాలా మంచివాడు."

"అతని విషయంలో మనం శ్రద్ధవహించాలి. తెలివైన బుర్ర. అలాంటివాళ్లే శ్రమ జీవుల్లోనుంచి దిట్టమైన మేధావంతులుగా రూపొందాలి. మనం వర్గభేదాలు లేని లోకాల కెళ్లిపోయినప్పుడు వాళ్లే మన స్థానాల నాక్రమిస్తారు" అన్నాడు డాక్టర్, వెళ్లిపోతూ.

"ఇవాన్, ఈమధ్య నీకు వాగుడెక్కువైంది సుమా!"

"దానికి కారణం ఉంది. నేను ఉత్సాహంలో ఉన్నాను. అయితే నువ్వు జైల్లోకి వెడదా మనుకుంటున్నావా? మంచి విశ్రాంతి తీసుకో!"

"ధన్యవాదాలు. కాని నేనేమీ అలిసిపోలేదు."

తల్లి వాళ్ల సంభాషణను విని, కార్మికవర్గానికి చెందిన ఆ పిల్లవాడి విషయంలో వాళ్లు పడుతున్న ఆదుర్దాకు చాలా సంతోషపడింది.

డాక్టర్ వెళ్లిపోయాక, తల్లీ, నికొలాయ్ మెల్లగా పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ భోజనానికి కూచున్నారు. గూఢచారులు సోదా కొస్తారని అనుకున్నారు. నికొలాయ్ ప్రవాసంలోనున్న మిత్రులను గురించి ఆమెకెన్నో కథలు చెప్పేడు. అక్కడనుంచి తప్పించుకొచ్చి మారుపేర్లతో పనిచేస్తున్నవాళ్లను గురించి చెప్పేడు. ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించ డానికి ప్రాణత్యాగం చేసిన సామాన్యులైన వీరుల గాథలు నమ్మదగినవిగా లేవని ఖాళీ గోడలు వాటిని తిరగ్గొట్టినట్లుగా ప్రతిధ్వనించాయి. మలివెచ్చని ఛాయలు ఆప్యాయంగా తల్లిని వావహించాయి. ఆమె హృదయం. తానెరుగని ఈ జనంపట్ల ప్రేమపూరితమైంది. ఆమె ఊహలో ఈ జనమంతా ఒకే ఒక ధైర్యశాలియైన గొప్పవ్యక్తిగా ఐక్యమైపోయి మెల్లగా ముందుకు నడుస్తున్నట్లనిపించింది. శతాబ్దాలపాటు గడ్డకట్టుకుపోయిన అబద్ధాల పుట్టలను తొలగించుతూ, జీవితంయొక్క పరమసత్యాన్ని జనానికి విస్పష్టంగా చూపుతూ ముందుకు సాగుతున్నట్లనిపించింది. ప్రపంచాన్ని బీభత్సంచేసి, దాస్యకూపంలో పడవేసే ఆశ, ద్వేషం, అసత్యం అనే మూడు రాక్షసత్వాలనుండీ తప్పించడానికి, నూతనంగా ఆవిర్భవించిన ఈ మహనీయ సత్యం జనాన్నందరినీ సంఘటిత పరుస్తుంది. ఊహాప్రపంచంలో సాక్షాత్కరించిన ఈ మూర్తిని చూస్తున్నప్పుడు ఆమె మనసులో కల్గిన భావాలు, తాను పడుకోబోయేట ప్పుడు దేవుని విగ్రహం ముందర మోకరించినప్పుడు కలిగిన భావాలవలెనే ఉన్నాయి. అపురూ పమైన ఆ రోజులిప్పుడు మరచిపోవడం జరిగింది. కాని ఆనాడుత్పన్నమైన భావాలిప్పుడు

విస్తృతమయ్యాయి, ఎక్కువ ప్రకాశవంతమూ సంతోషదాయకమూ అయ్యాయి, ఆమె హృదయంలో మరింత గాఢంగా నాటుకుని సజీవంగా వికసిస్తున్నాయి.

"ఇక పోలీసులు రారన్నమాటే!" అన్నాడు హఠాత్తుగా నికొలాయ్.

"వాళ్ల కర్మం వాళ్లదే! మనకెందుకూ?" అని తల్లి నికొలాయ్‌కేసి తేరిపారి చూచింది.

"సరే. మీకు నిద్రపోయే వేళైంది. నీలొవ్నా, మీరు బాగా అలసిపోయి ఉండాలి. మీ శరీరం చాలా గట్టిదై ఉండాలమ్మా! ఇంత ప్రమాదంలో – ఇంత ఆవేశంలో కూడా మీరు తొణుకూబెణుకూ లేకుండా ఉన్నారు. కాని మీ జుట్టు మాత్రం నెరుస్తోంది. సరే. పోయి పడుకోండి, నిద్రపట్టించుకోండి."

## 20

వంటింటి తలుపును గట్టిగా ఎవరో తట్టడంతో తల్లికి మెళకువ వచ్చింది. తట్టే వారెవరో కాని విడవకుండా ఓపికతో తట్టుతూనే ఉన్నారు. అప్పటికింకా చీకటిగానే ఉంది. అంత మొండిగా ఆ తలుపు తట్టే పద్ధతి ఏదో ప్రమాదాన్ని సూచిస్తోంది. తొందరగా భుజాలమీద గుడ్డ కప్పుకుని, వంటింట్లో కెళ్లి తలుపుదగ్గర నిలబడింది.

"ఎవరు వారు?" అని అడిగింది.

"నేను" అని అపరిచితమైన కంఠం జవాబిచ్చింది.

"నే నంటే?"

"తలుపు తియ్యవమ్మా!" అని సన్నని గొంతుకతో అతడు ప్రాధేయపడ్డాడు.

తల్లి గడియ పైకెత్తి కాలితో తలుపు తోసి తెరిచింది. ఇగ్నాతియ్ లోపలికొచ్చాడు.

"అయితే, నేనేమీ పొరబాటు పడలేదన్నమాటే!" అని సంతోషంతో కేకేశాడు.

అతనికి మొలదాకా అడుసు చిందులున్నాయి. ముఖం వెలవెలబారింది. కళ్లు గుంట లట్టాయి. ఉంగరాలజుట్టు టోపీలోనుంచి వాల్గు వైపులా బయటికొచ్చింది. వెనకనుంచి తలుపేస్తూ,

"మేము ప్రమాదంలో పడ్డాం!" అని చెవిలో చెప్పేడు.

"నాకు తెలుసు."

ఆమాట చెప్తూంటే, యువకుడు ఆశ్చర్యపోయాడు.

"మీకెలా తెలిసింది?" అని కళ్లు చిట్లిస్తూ అడిగేడు.

క్లుప్తంగా ఆమె కథంతా చెప్పింది.

"మీ కామ్రేడ్లున్నారే, వాళ్లిద్దర్నీ కూడా వాళ్లు పట్టుకున్నారా?"

"వాళ్లక్కడ లేరు. వాళ్లు సైన్యంలో చేరేరు. హాజరు చెప్పుకునేందుకు వెళ్లిపోయారు. మిహాయీల్ మామతో కలిసి అయిదుగుర్ని పట్టుకుపోయారు."

అతను గాఢమైన నిట్టూర్పు విడిచి, చిన్ననవ్వు నవ్వి,

"మిగిలింది నేనొక్కడ్నే. నాకోసం వాళ్లు వెతుక్కుంటూ ఉంటారనుకుంటాను."

"నువ్వెలా తప్పించుకు రాగలిగేవు?" అని తల్లి అడిగింది.

పక్క గదిలో కెళ్లే తలుపు కొద్దిగా తెరువబడింది.

"నేనా?" అంటూ ఇగ్నాతియ్ బెంచీమీద కూచుని గది నాలుగు మూలలా పరీక్షగా చూశాడు. "వాళ్లు రావడానికి ఒకటి రెండు నిముషాలకు ముందు, అడవి కాపలాదారు పరుగెత్తుకుంటూ వచ్చి కిటికీ తలుపు తట్టి 'అబ్బాయిలూ! జాగ్రత్తగా చూసుకోండి. వాళ్లు మీకోసం గాలిస్తున్నారు' అన్నాడు."

మెల్లగా అతడు నవ్వి, కోటుతో ముఖం తుడుచుకున్నాడు.

"ఏంతయినా మిహాయిల్‌మామ వెనుకాడలేదు. 'ఇగ్నాతియ్, నువ్వు వెంటనే పట్నానికెళ్లు! త్వరగా! ఆ అవ్వ నెరుగుదువుకదా?' అంటూనే కాగితంమీద గొలికేడు. 'ఇదిగో ఈ వుత్తరం తీసుకెళ్లి ఆమెకియ్యి' అన్నాడు. వెంటనే నేను పొదల్లో దూరిపోయాను. వాళ్లు వస్తున్న చప్పుడు విన్నాను. నాలుగు మూలలనుంచీ పాక్కుంటూ వాళ్లు చాలామంది వచ్చారు. పిశాచపు వెధవలు! అంతా మా తారుకార్ఖానాను ముట్టడించారు. నేను పొదల్లో నేలబారుగా పడుకుని దాక్కున్నాను. వాళ్లు నా పక్కనుంచే దాటిపోయారు. వాళ్లంతా దాటిపోయాక, లేచి సరాసరి నడక లంకించుకున్నాను. శక్తివంచనలేకుండా ఎక్కడా ఆగకుండా రెండు రాత్రిళ్లూ ఒక పగలూ నడిచి వచ్చాను."

ఈ పని చేసినందుకు అతని ముఖంమీద సంతృప్తిని తల్లి గుర్తించింది. అతడి లేడి చూపుల్లో చిరునవ్వు తొణికిసలాడింది. ఎర్రటి పెదవులు అదిరేయి.

"ఒక్క నిముషంలో నీకు టీ చేసిస్తాను" అంటూ తల్లి సమొవార్ అందుకుంది.

"ఇదిగో చీటీ" అంటూ ఎంతో కష్టంగా బాధతో రొజుకుంటూ ముఖం చిట్లిస్తూ అతడు తన పాదాన్ని బల్లమీద మోపేడు.

నికొలాయ్ గుమ్మంలోంచి ప్రవేశించాడు.

"నమస్తే కామ్రేడ్, నేను సాయం చేస్తానుండు" అన్నాడు కళ్లు కుంచిస్తూ.

ముందుకు వంగి ఇగ్నాతియ్ పాదానికి చుట్టబడి ఉన్న గుడ్డ పీలికలన్నిటినీ విప్పెయ్యడం మొదలెట్టేడు.

"వొద్దొద్దు" అన్నాడు బాధతో ఆ కుర్రవాడు, తన పాదాన్ని బల్లమీదనుండి లాగేసుకుని, తల్లికేసి ఆశ్చర్యంతో చూస్తూ.

"ఇతడి పాదాన్ని ఆల్కహాలుతో మర్దనా చెయ్యాలి" అంది తల్లి అతని చూపుని లెక్కచేయకుండా.

"అహా" అని నికొలాయ్ ప్రత్యుత్తరం ఇచ్చాడు.

ఇగ్నాతియ్ కొంచెం కటుకటుపడ్డాడు.

చీటీనందుకుని నలిగిపోయి ఉన్న ఆ గచ్చకాయరంగు కాగితాన్ని సాఫ్‌చేసి కళ్లకు దగ్గరగా పెట్టుకుని నికొలాయ్ చదివేడు:

"అమ్మా! ఈ పని మానకు. ఆ పొడుగాటి ఆవిడతో మన వ్యవహారాన్ని గురించి రాయడం మానద్దని చెప్పు. శలవు. రీబిన్."

ఆ చీటీని పట్టుకున్న చేతిని నికొలాయ్ కిందకు వాల్చేశాడు.

"అద్భుతం!" అని గొణుక్కున్నాడు.

ఇగ్నాతియ్ వాళ్లని పరీక్షగా చూస్తూ, మట్టితో ఉన్న కాలివేళ్లను ఆడించుతున్నాడు. తల్లి తన కన్నీటిని కనబడకుండా తుడుచుకుంటూ ఒక బేసిన్‌లో నీరు పట్టుకొచ్చింది. కిందకు వంగి అతని పాదం పట్టుకోబోయింది.

"నువ్వొద్దమ్మా!" అంటూ అతడు ఉలిక్కిపడి పాదాన్ని బల్లకిందకు లాక్కున్నాడు.

"పాదమిలా పెట్టు. త్వరగా!"

"నేను కొంచెం ఆల్కహాల్ పట్టుకొస్తాను" అన్నాడు నికొలాయ్.

ఆ పిల్లవాడు, అన్నకొద్దీ పాదాన్ని బల్లకిందకు లాక్కున్నాడు.

"ఏమిటిది! హాస్పిటలా?" అని సణిగేడు.

తల్లి అతని రెండవ పాదంమీద ఉన్న గుడ్డ పీలికలను విప్పడం మొదలెట్టింది.

ఇగ్నాతియ్ తల్లికేసి కిందకు చూస్తూ తల తిప్పుతూ గట్టిగా ముక్కేడు.

"మిహాయిల్ ఇవానొవిచ్‌ను వాళ్లు కొట్టేరు" అని వణుకుతున్న కంఠస్వరంతో తల్లి చెప్పింది.

"కొట్టేరా?" అని తెల్లబోతూ మెల్లగా అడిగేడు.

"అవును. నికోల్‌స్కొయెకి అతన్ని తీసుకొచ్చేప్పటికే అతని స్థితేమీ బాగాలేదు. అక్కడ పోలీసు సార్జెంటు, పోలీసు అధికారి అతడిని ముఖంమీద కొట్టేరు — తన్నేరు. ఒళ్లంతా రక్తం ధారలుగా కారేదాకా కొట్టేరు!"

"ఆ పని వాళ్లకు బాగా తెలును!" చిరచిరలాడుతూ ఇగ్నాతియ్ అన్నాడు. అతని భుజాలు అదిరేయి. "వెయ్యి పిశాచాలంటేకన్న వాళ్లని చూస్తే నాకు ఎక్కువ భయం. రైతులు కూడా అతన్ని కొట్టేరా?"

"పోలీసు అధికారి ఆజ్ఞాపిస్తే ఒక్కడు మాత్రం కొట్టేడు. మిగతా వాళ్లేమీ చెయ్యలేదు. కొందరు అతని పక్షంగా మాట్లాడేరు, అతన్ని కొట్టడానికి హక్కెవరికీ లేదని కేకలేశారు."

"ఊహుం! ఎవరు ఎందుకే పక్షం ఉన్నారో రైతులు కూడా తెలుసుకుంటున్నారు."

"వాళ్లలోనూ బుద్ధిమంతులున్నారు."

"బుద్ధిమంతులు ప్రతిచోటా ఉన్నారు. లేమి వాళ్లనలా చేస్తోంది. వాళ్ళు ఉండడ మైతే ఉన్నారు. కాని వాళ్లని వెతికిపట్టుకోవడం కష్టం."

నికొలాయ్ ఒక ఆల్కహాల్ సీసాను పట్టుకొచ్చాడు. సమొవార్‌లో కాసిని బొగ్గులు వేశాడు. మాట్లాడకుండా బయటికి వెళ్లిపోయాడు. ఇగ్నాతియ్ మౌనంగా అతన్ని పరిశీలిస్తున్నాడు.

"ఎవరా కులీనుడు? డాక్టరా?" అని నికొలాయ్ బయటికి వెళ్లడంతోనే, అతడు తల్లిని అడిగేడు.

"ఇక్కడ కులీనులెవరూ లేరు. మేమంతా కామ్రేడ్సుమే."

"ఇదంతా తమాషాగా ఉందే" అని ఇగ్నాతియ్ చిరునవ్వు నవ్వేడు. ఆ నవ్వులోనే అతని సంకోచం వ్యక్తమైంది.

"ఏమిటి తమాషా?"

"అన్నీని. కొందరు ముక్కు వెంబడి రక్తాలు కారేదాకా కొడతారు. మరికొందరు నీ పాదాలు కడుగుతారు. ఈ రెంటికీ మధ్య ఏముంది?"

నికొలాయ్ తలుపు తోసుకుని లోపలికొచ్చి ఇలా అన్నాడు:

"రెండింటికీ మధ్య ఏముందా? ఎవరు నీ ముక్కుమీద గుద్ది నీ రక్తం కారుస్తున్నారో వాళ్ల చేతులు నాకే వాళ్ళున్నారు. ముక్కు వెంబడి రక్తం కారుతుంటే దాన్ని పీల్చేవాళ్ళున్నారు."

ఇగ్నాతియ్ అతనికేసి చాలా గౌరవంతో చూశాడు. ఒక్క క్షణమాగి:

"అలాగే కనబడుతూంది!" అన్నాడు.

లేచి నిలబడి మెల్లగా నాలుగడుగు లేశాడు.

"ధన్యవాదాలు. కొత్తగా కాళ్లొచ్చినట్లుంది" అన్నాడు.

తర్వాత అందరూ టీకోసం భోజనాల గదిలో కెళ్లేరు. అక్కడ ఇగ్నాతియ్ చాలా స్ఫుటమైన కంఠంతో తన జీవితగాథవంతా చెప్పేడు.

"నేను మన వార్తాపత్రికను పంచిపెడుతుండేవాడిని. నేను నడవడంలో చాలా ఘటికుడిని."

"పల్లెటూళ్లలో మన పత్రికను చాలామంది చదువుతారా?" అని నికొలాయ్ ప్రశ్నించాడు.

"ఆహా. చదువొచ్చినవాళ్లంతా చదువుతున్నారు. ధనికులు కూడా. కాని, ధనికులు పత్రికను మనదగ్గరనుంచి పుచ్చుకోరే. భూఖామందులనుంచి భూమిని లాక్కునేందుకు రైతులు ఖామందుల రక్తాన్ని ప్రవహింపచేయడానికి సంసిద్ధులే నన్న సంగతిని తెలుసుకోగలిగిన బుద్ధిశాలితనం వారికుంది. ఆ పని జరిగిన తర్వాత వాళ్లు భూమిని పంచుకుంటారు. అందువల్ల భూఖామందులు, కూలీలు అని వేరుగా ఉండరు. ఆ సంగతి స్పష్టంగానే ఉంది. అలాంటప్పుడిక పోరాటం మొదలెట్టడమెందుకు?"

అతడికి కొంచెం కోపం వచ్చినట్లుగుపడ్డాడు. నికొలాయ్‌కేసి అపనమ్మక దృష్టితోనూ, విషయం తెలుసుకోవాలనే కుతూహలంతోనూ చూశాడు. నికొలాయ్ ఏమీ మాట్లాడకుండా చిన్ననవ్వు నవ్వేశాడు.

"ఈ రోజున ప్రపంచాన్నంతటినీ ఎదిరించి విజయం సాధించిన తర్వాత కూడా మళ్లీ పేదవారూ ధనికులూ అనే తారతమ్యాలుంటే, అందులో అర్థ మేముంది? లేదు. మీకు నమస్కారాలు! మీరు మమ్మల్ని మూర్ఖులను చెయ్యవద్దు — ఐశ్వర్యం పొడి ఇసుకలాటిది — అదొక చోట స్థిరంగా ఉండదు. నాలుగు వైపులకు చెదిరిపోతూ ఉంటుంది. అబ్బ! వద్దు. మాకది అక్కర్లేదు!"

"అబ్బాయీ! కోపం తెచ్చుకోకు, ఆవేశపడకు" అంటూ తల్లి నవ్వింది.

"ప్రస్తుతం నన్ను కలవరపరచే విషయం, రీబిన్ అరెస్టు గురించిన కరపత్రాన్ని మీ జనానికి సాధ్యమైనంత త్వరలో అందివ్వడం ఎట్లాగా అని" అన్నాడు సాలోచనగా నికొలాయ్.

ఇగ్నాతియ్ చెవులు నిగిడ్చి విన్నాడు.

"అలాంటి కరపత్రముందా?"

"ఉంది."

"నా కివ్వండి. నేను తీసుకెళ్లి అందిస్తాను!" అని చేతులు రుద్దుకుంటూ చెప్పేడు.

తల్లి అతనికేసి చూడకుండానే మెల్లగా నవ్వింది.

"నువ్వు చాలా అలసిపోయి ఉన్నావే. పైగా, నీకు భయమని కూడా చెప్పేవే."

"దానికేమిటి? భయం వేరు. వ్యవహారం వేరు" అని వ్యవహారదక్షుడులా, అరచేతితో ఉంగరాల జుట్టును వెనక్కి దువ్వుకుంటూ జవాబుచెప్పేడు.

"నవ్వుతున్నారెందుకు? బలేవారే మీరు కూడా!" అన్నాడు ఆ కుర్రాడు.

తల్లి తన ఆనందాన్ని దాచిపెట్టాలని ప్రయత్నిస్తూ,

"ఓరి పిచ్చి పిల్లాడా!" అని గట్టిగా బుజ్జగించింది.

"ఓహో పిల్లవాడినా!" అని అతడు గుర్రుమన్నాడు.

"నువ్వు అక్కడికి మళ్లీ పోకూడదు" అన్నాడు నికొలాయ్, ఆప్యాయంగా కన్నుగీటుతూ.

"ఎందు కెళ్లకూడదు? మరి నేనెక్కడి కెళ్లాలి?" అని కొంచెం ఆందోళనగా ఇగ్నాతియ్ అడిగేడు.

"మరొకరు ఆ కరపత్రాలను తీసుకెడతారు. నువ్వు మాత్రం అతనికి ఏవిధంగా ఏమేమి చెయ్యాలో వివరంగా తెలియజెప్పాలి. చెప్తావా?"

"సరే" అన్నాడు ఇగ్నాతియ్ ఆశాభంగంతో.

"నీకు ఒక కొత్త ప్యాస్‌పోర్టు ఇస్తాం. ఇచ్చి మరొక పని నప్పచెపుతాం. అడవి కావలాదారుగా ఒక పనిని నీకు సంపాదిస్తాం."

అతడు చటుక్కున పైకి చూశాడు.

"రైతులు వంటచెరుకును దొంగతనం చేస్తుంటే, నేను వాళ్లను పట్టుకుని చెప్పాలా? ఆ పని నాకు సరిపడదు" అన్నాడు ఆ కుర్రాడు చికాగ్గా.

తల్లీ, నికొలాయ్ నవ్వుకున్నారు. దానితో ఆ యువకునికి మళ్లీ బాధ కలిగింది, మళ్లీ చికాకుపడ్డాడు.

"నువ్వు రైతులను పట్టుకోనక్కర్లేదులే. ఆ విషయంలో నువ్వేమీ చింతపడకు" అని నికొలాయ్ సమాధానపరిచాడు.

"అయితే మంచిదే" అని ఇగ్నాతియ్ ఎంతో తేలికపడ్డాడు. "కాని ఫ్యాక్టరీలో పని దొరికితేనే నాకిష్టం. ఫ్యాక్టరీలో పనిచేసేవాళ్లు మంచి తెలివైనవాళ్లంటారు" అన్నాడు.

తల్లి లేచి కిటికీ దగ్గర కెళ్లింది.

"జీవితం తమాషాగా ఉంటుంది. రోజు కైదుసార్లు నవ్వడం; అయిదుసార్లు ఏడవడం" అని మెల్లగా అంది. "ఇగ్నాతియ్, ఇంకా నీకు నిద్ర రావడం లేదా? పడుకునే వేళైంది."

"నాకింకా నిద్ర రావడం లేదు."

"రా! రా! లే."

"మీరు చాలా కరుకైనవారే. ఔనా? సరే. వస్తున్నాలెండి. మీరిచ్చిన టీకి ధన్యవాదాలు.... మీ దయకు కూడా...."

తల్లి పడుకునే మంచంమీద పడుకుని, అతను తల గోక్కుంటూ తనలో తానే సణిగేడు. "ఈ వస్తువులన్నీ తారు వాసనేస్తున్నాయి.... ఈ గందరగోళానికి ఏమీ అర్థం లేదు.... నాకు నిద్ర రావడం లేదు.... ఆ మధ్యస్థుల విషయం ఆయనెంత సులువుగా చెప్పేడు.... పిశాచాలు...."

అప్రయత్నంగా అతను గుర్రుపెట్టి నిద్రపోయాడు. నోరు సగం తెరుచుకుంది. కనుబొమలు పైకి లేచాయి.

## 21

ఆ రోజు సాయంకాలం, ఒక వేంకొట్టులో వెసొవ్‌శ్చికోవ్‌కు ఎదురుగా ఇగ్నాతియ్ కూర్చుని నిగూఢంగా చెప్తున్నాడు:

"మధ్య కిటికీని నాల్గుసార్లు...."

"నాలుగు సార్లా?" అని ఆత్రంగా నికొలాయ్ అడిగేడు.

"ఇదిగో ఇలా మూడు సార్లు. ఒకటి, రెండు, మూడు. ఒక క్షణమాగి మరొక సారి ఇలా తట్టు" అని ఇగ్నాతియ్ బల్లమీద తట్టి చూపించాడు.

''సరే.''

''ఒక ఎర్ర తలకాయగల రైతు తలుపు తెరిచి, 'నువ్వు మంత్రసానికోసం వచ్చావా?' అని అడుగుతాడు. నువ్వు 'ఔను, ఫ్యాక్టరీ యజమాని భార్యకోసం' అని చెప్పు. అంతే. అతని కర్థమవుతుంది.''

ఇద్దరూ బలమైన మనుషులు, దృఢంగా ఉన్నారు. తలలు దగ్గరగా పెట్టుకుని గుసగుసలాడుకుంటూ ఉంటే, తల్లి చేతులు కట్టుకు నిలబడి పరిశీలనగా చూసింది. గూఢంగా తట్టడం, సాంకేతికంగా మాట్లాడుకోవడం ఆమె కెంతో తమాషాగా తోచింది.

''నిజంగా, వీళ్లు చిన్నపిల్లలే'' అని తనలో అనుకుంది.

గోడ దీపం వెలుగులో ఆ గదిలో చితికిపోయిన గిన్నెలు, ఇనుప రేకులు నేలమీద పడు న్నాయి. గదంతా తుప్పు, రంగులు, తేమ వాసనలమ విరజల్లుతోంది.

ఇగ్నాతియ్ ఉన్నితో తయారైన ఒక బరువైన కోటుని ధరించాడు. అదంటే అతనికెంతో ఇష్టంలా కనబడింది. అతను మురిసిపోతూ తన కోటు ముందేతిని తట్టుతూ, కోటును సంతృప్తితో చూసుకోవడం తల్లి కనిపెట్టింది.

''ఉత్త చిన్నపిల్లలు.... మంచి పిల్లలు....'' అనుకుంది.

ఇగ్నాతియ్ లేచి నిలబడి:

''అంతే సంగతి. ముందుగా మురాతొవ్ దగ్గరకు వెళ్లి తాతని అడగడం మరచిపోకు'' అన్నాడు.

''మరచిపోను'' అని వెసావ్‌ష్చికోవ్ బదులు చెప్పేడు.

అంతటితో ఇగ్నాతియ్ సంతృప్తి పడలేదు. కిటికీ తట్టడం, గుర్తులు, సాంకేతికపు మాటలూ అన్నీ మళ్లీ చెప్పి చెయ్యి అందిచ్చాడు.

''వాళ్లకి నా నమస్కారాలందియ్యి. అక్కడివాళ్లు చాలా మంచివాళ్లని నీకే తెలుస్తుంది'' అన్నాడు.

ఇగ్నాతియ్ తన కోటుకేసి చూస్తూ అంగీకారసూచకంగా దాన్ని తడిమాడు.

''నేను వెళ్లవలసిన టైమయిందా?'' అని తల్లి నడిగేడు.

''దారి తెలుసుకోగలవా?''

''ఓ, కామ్రేడ్స్! శలవివ్వండి.''

అతడు ఛాతీ విరుచుకుని, చేతులు జేబులో పెట్టుకుని, టోపీని ఓరగా ధరించి బయటి కెళ్లేడు. బంగారురంగు ఉంగరాల జుట్టు కణతలమీద నాట్యం చేస్తోంది. మెల్లగా తలి దగ్గర కొచ్చి,

''అంటే, నాకు కూడా పని చెప్పేరన్నమాట. పనీ పాటూ లేక నాకు విసుగెత్తు తోంది. జైలునుంచి ఎందుకు పారిపోయివచ్చానా అనిపిస్తోంది. అక్కడ నేనేదో ఒకటి

నేర్చుకుంటూ ఉండేవాడిని. ఇక్కడ రాత్రింబగళ్లు దాక్కోవడంతో సరిపోతోంది. పావెల్ మాకు ఆలోచించడం నేర్పేడు. వాళ్లని జైల్లోనుంచి తప్పించడం మాట ఏం చేస్తారు, నీలొవ్నా?'' అన్నాడు వెసొవ్‌శ్చికోవ్.

''నాకేమీ తెలియదు'' అని అప్రయత్నంగా నిట్టూర్పు విడిచింది.

నికొలాయ్ ఆమెకేసి ఒరిగి భుజంమీద బలంగా తన చేతిని మోపేడు.

''వాళ్లతో మాట్లాడు. నీ మాట వింటారు. ఆ పనేమంత కష్టమైన పని కాదు. చూడు. ఇదే జైలు గోడనుకో. దాని పక్కనే వీధి లాంతరుంటుంది. వీధికెదురుగా అంతా ఖాళీ స్థలమే. ఎడమ వైపున స్మశానం, కుడి వైపున వీధులూ ఇళ్లూ ఉన్నాయి. ప్రతి రోజూ దీపాలు తుడిచేవాడొస్తూ ఉంటాడు. అతను గోడకు నిచ్చెన వేసి గోడమీద కెక్కుతాడు. గోడపైన ఉన్న ఇటుకకు నిచ్చెన తాడు తగిలిస్తాడు. ఆ తాడును జైలు గోడమీదనుంచి లోపలికి జారవిడుస్తాడు. ఇంకేముంది! జైలు లోపల ఉన్నవాళ్లకీ పని ఎప్పుడు జరుగుతుందో తెలుసుకదా. ఆ సమయానికేదో గంద్రగోళం లేవతీయమని మామూలు ఖైదీలను రెచ్చగొడతారు. అలా కాకపోతే తామేదో గలభా సాగించి, కాపలా వాళ్లందరూ ఆ గొడవలో నిమగ్నులయ్యేటట్లు చేస్తారు. ఈలోగా పారిపోయేవాళ్లు నిచ్చెన ఎక్కేస్తారు. ఒకటి, రెండు, మూడు — అంతే. అంతా అయిపోయిందనుకో. బహు తేలిక!'' అన్నాడు.

ఈ ప్లానంతా చెపుతూ అతను సౌంజ్ఞలు చేశాడు. వింటుంటే పైకి ఈ ప్లానంతా బహు స్పష్టంగా, అతిసూక్ష్మంగా, బాగా ఆలోచించినట్టుగా కనబడింది. అతనెప్పుడూ మందకొడిగా ఏదో ఆలోచిస్తూ ఉండడం ఆమె చూసింది. అన్ని విషయాలనూ అపనమ్మకంతోనూ, ద్వేషంతోనూ చూస్తుండేవాడు. ఇప్పుడతని చూపులో మార్పు కనబడింది. ఆమెను ప్రోత్సహిస్తుంటే, అతని కళ్లు వెచ్చని నిశ్చల తేజస్సుతో తళతళలాడేయి.

''ముఖ్యమైన సంగతేమంటే, వాళ్లీ పనంతా పగటివేళే చేస్తారు. పట్టపగలు జైలంతా మేల్కొని ఉంటుంటే ఖైదీ పారిపోడానికి ప్రయత్నం చేస్తాడని ఎవరనుకుంటారు?''

''తుపాకితో కాలుస్తారేమో?'' అని హడలిపోతూ తల్లి అడిగింది.

''ఎవరు? అక్కడ సైనికులు లేరు. కాపలా కాసే వార్డర్లు తమ రివాల్వర్లను గోడలకు మేకులు కొట్టడానికే ఉపయోగిస్తారు.''

''అయితే ఇది మరీ తేలికైన వ్యవహారంలా కనబడుతోంది.''

''కావి మువ్వే చూస్తావుగా. మనవాళ్లతో తప్పకుండా మాట్లాడు. నా దగ్గరన్నీ సిద్ధంగానే ఉన్నాయి. తాడు, నిచ్చెన, పైన తగిలించడానికి కొక్కేమూ ఉన్నాయి. మా ఖామందు దీపాలు వెలిగించేవాడవుతాడు.''

తలుపు వెనకాల అడుగుల చప్పుడైంది. దగ్గు వినబడింది. లోహపు ముక్కల గణగణ శబ్దమైంది.

"అతనే" అన్నాడు నికొలాయ్.

ఒక సీనారేకు స్నానాల తొట్టె గుమ్మంలోంచి తోసుకొచ్చింది. బొంగురు గొంతుకతో, "దూరు పాత డొక్కా" అంటూ మాటలు వినబడ్డాయి.

తొట్టె ఎగువ ఒక సహృదయుడైన వ్యక్తి ముఖం కనిపించింది. మిడిగుడ్లు, నెరిసి పోయిన జుట్టూ, మీసాలూ స్ఫుటంగా కనిపించాయి.

తొట్టెను లోపలికీడ్వడానికి నికొలాయ్ తోడ్పడ్డాడు. కొద్దిగా గూనున్న పొడుగాటి మనిషి లోపల ప్రవేశించాడు. గడ్డంలేని బుగ్గలు పూరించి ఖంగుమంటూ దగ్గి, కళ్లనుమ్మేశాడు. తర్వాత బొంగురు గొంతుకతో అతిధులను పలకరించాడు.

"క్షేమమా?"

"అయస్నడగవమ్మా!" అన్నాడు నికొలాయ్.

"నన్నడిగేదేమిటి?"

"జైల్లోనుంచి తప్పించడం గురించి."

"అదా" అంటూ మాల్సేవాడు మసితో ఉన్న వేళ్లతో మీసాలొత్తుకున్నాడు.

"యాకొవ్ వసీల్యెవిచ్, ఆ పనంత సులభమని ఆమె నమ్మలేకపోతోంది."

"నమ్మలేకపోతోందా? అయితే నమ్మదలచుకోలేదని నేననుకుంటాను. కాని, నీకూ నాకూ నమ్మాలని ఉంది, అందుకని మనం నమ్ముతాం!" అన్నాడు మాల్సేవాడు చటుక్కున దగ్గు తెరొచ్చి నేలమీద కొంగేడు. దగ్గు తెరనుంచి తేరుకున్నాక, గది మధ్యన నిలబడి ఛాతీ నిమురుకుంటూ మిడిగుడ్లతో తల్లిని పరిశీలించాడు.

"ఆ విషయాన్ని పావెలూ, అతని స్నేహితులూ నిర్ణయించుకుంటారు" అంది తల్లి.

నికొలాయ్ తలొంచుకున్నాడు.

"ఎవరు — పావెల్?" అని మాల్సేవాడు కూచుంటూ ప్రశ్నించాడు.

"నా కొడుకు."

"ఇంటి పేరు?"

"వ్లాసొవ్."

అతను తలూపి, చిన్న సంచిలోనుంచి పొగాకు తీసుకుని గొట్టంలో దట్టించడం మొదలెట్టేడు.

"అతన్ని గురించి విన్నాను. నా మేనల్లుడు అతన్ని బాగా ఎరుగును. మావాడు — యేవ్ చెన్కొ — కూడా జైల్లో ఉన్నాడు. వాడి గురించి ఎప్పుడైనా విన్నావా? నా పేరు గొబూన్. త్వరలో యువకుల నందర్నీ జైళ్లలోకి తోసేస్తారు. అప్పుడు మన ముసలాళ్లకు చాలా చోటుంటుంది! నా మేనల్లుడిని సైబీరియా పంపేస్తారని పోలీసుల్లో ఒకడు చెప్పేడు. వాళ్ళు అంత పనీ చేస్తారు, పంది వెధవలు!"

అతను నికొలాయ్‌కేసి తిరిగి, గొట్టంలోంచి పొగలాగుతూ తరుచు నేలమీద ఉమ్మేడు.

"అంటే, నమ్మడం ఆమెకిష్టం లేదన్నమాట. అంటేనా? ఆ సంగతామె తెల్సు కోవాలి.... మనిషి స్వేచ్ఛగా ఉన్నప్పుడు కూచోడం విసుగ్గా ఉంటే, నడవడం మొదలెట్టచ్చు. నడకతో అలసట చెందితే, కూచోవచ్చు. నిన్ను దోచేస్తుంటే కళ్లు మూసుకో. కొడుతుంటే ఏడవకు. చంపితే అలా పడుండు. ఈమాత్రం అందరికీ తెలుసు, నా మేనల్లుడిని మాత్రం బయటికి లాక్కొస్తాను! అందుకేమీ సందేహం లేదు!"

ముక్తసరిగా అతనా మాటలు బిగ్గరగా చెప్తూంటే, తల్లి ఇరుకున పడింది. ఏమీ తోచలేదు. అతడన్న ఆఖరు మాటల్లోని విశ్వాసం, ఆమెలో కొంచెం ఈర్ష్యను పురి గొల్పింది.

చలిగాలి, వర్షం ముఖాన కొడుతుంటే ఆమె వీధిలోనుంచి నడచి వెళ్తూ, నికొలాయ్ గురించి ఆలోచించింది.

"అతనెంత మారిపోయాడు! నమ్మడానికి అశక్యంగా వుందే!"

మాల్కోపేవాడి సంగతి జ్ఞాపకమొచ్చి, ఆమె దాదాపు ప్రార్థనాపూర్వకంగా తనలో తానే అనుకుంది: "ఈ కొత్త జీవితాన్ని అవలంబిస్తున్నదాన్ని నేనొక్కర్తినే కాదన్నమాట!" తర్వాత ఆమె ఆలోచన కొడుకుమీదకు పోయింది. "అతనొప్పుకుంటేనా!" అనుకుంది.

## 22

మరుసటి ఆదివారం, జైలాఫీసులో పావెల్‌తో మాట్లాడి వచ్చేస్తుంటే, తల్లి చేతిని తడు పట్టుకుని చిన్న కాగితపు ఉండను అందిచ్చాడు. చెయ్యికాలితే చురుక్కుమన్నట్లు అనిపించింది. ఏమిటదన్నట్లుగా అతడి ముఖంకేసి చూసింది. అక్కడ జవాబేమీ కనబడ లేదు. కాని అతని నీలి కళ్లలో మామూలుగానే నిశ్చలమూ, నిశ్చితమైన చిరునవ్వు గోచ రించింది.

"వెళ్లొస్తా" అని తల్లి నిట్టూర్చింది.

అతను మళ్లీ చెయ్యి అందిచ్చాడు. అతని ముఖంమీద ప్రేమ ద్యోతకమైంది.

"అమ్మా, వెళ్లిరా!" అన్నాడు.

ఆమె చెయ్యి పట్టుకుని అలాగే నిలబడిపోయింది.

"బెంగపెట్టుకోకమ్మా. కోపం తెచ్చుకోకు" అన్నాడు.

ఈ మాటలూ, అతని కనుబొమల నడుమ నిటారు మొండి రేఖా ఆమెకు జవాబు చెప్పాయి.

తలొంచుకుని "నాయనా, ఏమంటున్నావు?" అని గొణిగింది.

మరల అతనికేసి చూడకుండానే బయటి కొచ్చేసింది. తన కళ్లలోని నీటి బిందువులను, పెదవుల అదురుబాటును అతడు చూడకూడదనుకుంది. ఇంటి కొచ్చేదాకా, కాగితాన్ని అందుకున్న చెయ్యి నొప్పి పెడుతూనే ఉంది. భుజానికి బలమైన దెబ్బ తగిలినట్లు చెయ్యి బరువుగా లాగేసింది. ఇంటికి వచ్చీ రావడంతోనే ఆ చీటీని నికొలాయ్ కిచ్చి, అతను దాన్ని సాపు చేసి చదివేవరకూ మనసులో ఆశ తపతప కొట్టుకుంది. కాని నికొలాయ్ అలాటి ఆశకు తావివ్వలేదు.

"నాకా సంగతి తెలుసు. అతను రాసింది వినండి. 'కామ్రేడ్స్! మేము తప్పించుకు పారిరావడానికి ప్రయత్నం చెయ్యం. చెయ్యలేము. మాలో ఎవ్వరూ అందుకొడబడరు. అలాటి ప్రయత్నం చేస్తే మా ఆత్మగౌరవానికి భంగం. కాని ఈ మధ్యనే అరెస్టయిన రైతుకు మాత్రం సహాయం చెయ్యండి. అతనికి మీ సహాయం ఎంతయినా కావాలి. ఎంత చేసినా చెయ్యదగినవాడు. ఇక్కడతను చాలా చిక్కుల్లో ఉన్నాడు. ప్రతి రోజూ అధికారులతో దెబ్బలాడుతున్నాడు. అప్పుడే ఇరవై నాలుగు గంటలు చీకటి కొట్లో ఉన్నాడు. వాళ్లు అతన్ని చిత్రహింస పెట్టి చంపేస్తారు. అతనికి సహాయం చెయ్యాలని మేమందరం మిమ్మల్ని కోరుతున్నాం. మా అమ్మను ఓదార్చండి. ఆమె కంతా చెపితే, అర్థంచేసుకుంటుంది."

తల్లి తల పైకెత్తింది.

"చెప్పడానికేముంది? నా కప్పుడే అర్థమైపోయింది" అని గద్గద స్వరంతో చెప్పింది.

నికొలాయ్ పక్కకు తిరిగి, జేబు రుమాలు పైకి తీసి, ముక్కు చీదుకున్నాడు.

"నాకు పడిసెం పట్టినట్లుంది...." అని నసుగుతూ సులోచనాలు పైకెత్తి సవారు చేశాడు. "నిజానికి మాకు టైము కూడా సరిపోదనుకుంటాను" అన్నాడు.

"సరే. మంచిదే. వాళ్ల విచారణ జరగనివ్వండి" అంది, చిరచిరలాడుతూ. ఆమె హృదయాన్ని మాత్రం విచారం పొగమంచులా ఆవహించింది.

"ఇదిగో, ఇప్పుడే సెంట్ పీటర్స్‌బుర్గునుంచి ఒక స్నేహితుడి ఉత్తరమందింది...."

"పోనీలే. సైబీరియానుంచి పారిపోయి రావచ్చు కదా! వీలుండదా?"

"తప్పకుండా వీలుంటుంది. త్వరలో విచారణ జరుగుతుందనీ, అందరినీ సైబీరియాకు ప్రవాసం పంపడానికి కూడా నిర్ణయం జరిగిపోయిందనీ ఈ స్నేహితుడు రాశాడు. ఈ దుష్టులు తమ న్యాయస్థానాలను కూడా వేళాకోళ స్థితికి దిగ జార్చేశారు. చూడండి! ఇంకా విచారణ ప్రారంభం కాకుండానే సెంట్ పీటర్స్‌బుర్గులో శిక్ష నిర్ణయమైపోయింది!"

"నికొలాయ్ ఇవానొవిచ్! నన్ను గురించి మీరేమీ ఆదుర్దాపడకండి. నాకు మీరేమీ విపులంగా చెప్పనక్కర్లేదు. ఓదార్చనక్కర్లేదు. పావెల్ సరైన పనే చేస్తాడు. వాడు తననూ తన స్నేహితులనూ వృథాగా బాధపడనివ్వడు. వాడికి నేనంటే ఎంతో ప్రేమ. నన్ను

గురించి ఎంతగా ఆలోచిస్తున్నాడో మీకే కనబడుతోంది. 'ఆమెకు విశదంగా తెలియపరచండి, ఓదార్చండి'...."

ఆమె గుండె దడదడ కొట్టుకుంది, తల తిరిగింది.

"మీ కొడుకు అద్భుతమైనవాడమ్మా! అతనంటే నాకెంత గౌరవమో చెప్పలేను" అని అసహజంగా బిగ్గరగా అన్నాడు నికొలాయ్.

"రీబిన్‌కు సహాయం చేసే మార్గమేమిటో ఆలోచిద్దాం" అని తల్లి సూచించింది.

ఆ క్షణమే ఆమె ఏదో పనిలో పడాలనుకుంది, ఎక్కడకో పోవాలనుకుంది, అలసటొచ్చి పడిపోయేవరకూ నడవాలనుకుంది.

"మంచిది. ఇప్పుడు సాషె ఉంటే బాగుండును...." అన్నాడు నికొలాయ్, ఇంకా పచారు చేస్తూ.

"ఆమె వస్తుంది. నేను పావెల్‌ని చూడ్డానికెళ్లిన రోజున తప్పకుండా వస్తుంది."

నికొలాయ్ తల్లి పక్కనే సోఫామీద కూచున్నాడు. ఆలోచిస్తూ తలొంచుకున్నాడు. పెదవులు కొరుక్కుంటూ గెడ్డం మెలేశాడు.

"మా అక్క ఇక్కడ లేకపోవడం బాగా లేదు...."

"సాష అక్కడుండగానే మనమా పని చెయ్యగలిగితే మహ బాగా ఉంటుంది – అతను చాలా ఆనందపడతాడు" అంది తల్లి.

కొంచెం సేపు ఎవరూ మాట్లాడలేదు.

"వాడెందుకు రానంటాడో నా కర్థం కావడం లేదు...." అంది తల్లి చటుక్కున.

నికొలాయ్ గభాలున లేచాడు. ఇంతలో గంట మోగింది. ఒకరి మొగమొకరు చూసు కున్నారు.

"బహుశా సాషె వచ్చిందనుకుంటాను" అన్నాడు మెల్లగా నికొలాయ్.

"ఆమెతో ఏమని చెపుదాం?" అని తల్లి అడిగింది అంత మెల్లగానే.

"హూం...."

"ఆమెను చూస్తే నాకు చాలా విచారం కలుగుతుంది."

గంట మళ్లీ మోగింది. ఈ సారి అంత గణగణ మోగలేదు. లోపలి కొద్దామా వద్దా అనే సంకోచంతో గంట నొక్కినట్లనిపించింది. ఇద్దరూ తలుపు తియ్యాలని బయల్దేరారు. తీరా వంటింటి దగ్గర కొచ్చేవరికి నికొలాయ్ పక్కకు తప్పుకుని,

"మీరే వెళ్లండి" అన్నాడు.

తల్లి తలుపు తియ్యడంతోనే,

"అతను నిరాకరించాడా?" అని ఆ పిల్ల అడిగింది.

"ఔను."

"ఆ సంగతి నాకు ముందే తెలుసు" అంది సాషా. కాని ఆమె ముఖం మాత్రం వెల్ల బడింది. కోటు బొత్తాములు విప్పింది. మళ్లీ కొన్ని పెట్టుకుంది. కోటును విప్పేయాలని ప్రయత్నించింది. అది ఆమెవల్ల కాలేదు.

"గాలీ, వానా–బహు చికాగ్గా ఉంది.... అతను కులాసాగా ఉన్నాడా?" అని అడిగింది.

"ఆ ఉన్నాడు."

"కులాసాగా, సంతోషంగా" అంది సాషా మెల్లగా. తన అరచేతిని పరీక్షగా చూసు కుంటూ నిలబడింది.

"మనం రీబిన్‌ను విడిపించాలని రాశాడు" అని తల్లి ఆమెకేసి చూడకుండానే చెప్పింది.

"అలాగా? ఆ పని చెయ్యాలంటే, మనం పాత పథకాన్నే ఉపయోగించాలి" అంది సాషా.

నికొలాయ్ చటుక్కున గుమ్మంలో కొచ్చి,

"నేమా అలాగే అనుకుంటున్నాను. ఏం సాషా!"

ఆమె చెయ్యి అందిచ్చింది.

"ఎందు కుపయోగించకూడదు? అందరూ అది మంచి పథకమే అంటున్నారు."

"కాని ఆ పనెవరు కొనసాగిస్తారు? మనందరికీ చేతినిండా పనుంది కదా?"

"నన్ను చెయ్యనివ్వండి. నాకు టైముంది" అని సాషా చటాలున లేచి చెప్పింది.

"సరే. కాని మీరు మిగిలినవాళ్లందర్నీ కలుసుకుని సంప్రదించాలి...."

"తప్పకుండా. ఇదిగో ఇప్పుడే వెడతాను."

ఆమె మరల కోటు బొత్తాములను పెట్టుకుంది. ఈ సారి తన సన్నని వేళ్లతో, తడబడకుండా సర్దుకుంది.

"ముందు కాసేపు విశ్రాంతి తీసుకో" అంది తల్లి.

"నేనేమీ అలిసిపోలేదు" అని చిరునవ్వుతో జవాబిచ్చింది ఆ అమ్మాయి.

మాట్లాడకుండా కరచాలనం చేసి, యథాప్రకారంగానే కరకుగా ఉలుకూ పలుకూ లేకుండా బయటి కెళ్లిపోయింది.

తల్లీ, నికొలాయ్ కిటికీ దగ్గరకెళ్లారు, ఆమె తోటను దాటి గేటు తీసుకెళ్లిపోవడం కిటికీలోంచి చూచారు. నికొలాయ్ మెల్లగా ఈల వేశాడు, బల్లదగ్గర కూచుని రాయడం మొదలెట్టేడు.

"ఆమెకు చేతినిండా పనుంటేనే ఆమెకు నయంగా ఉంటుంది" అంది తల్లి ఆలోచిస్తూ.

"అవును. ఆ మాట నిజమే" అని నికొలాయ్ బదులు చెప్పేడు. తర్వాత తన దయార్ద్ర వదనంపై చిరునవ్వు తొణికిసలాడగా ఆమెకేసి తిరిగి, "నీలొవ్నా, అలాటి అనుభూతిని

మీరెప్పుడూ పొందలేదనుకుంటాను – మీరు ప్రేమించిన మనిషికోసం బాధపడ్డం. పడ్డారా?" అన్నాడు.

"ఉహ్" అని చెయ్యూడిస్తూ, "నాకు తెలిసినదల్లా పెళ్ళిచేస్తారనే భయమొక్కటే!" అంది.

"మీరెప్పుడూ ఎవర్నీ ప్రేమించలేదా?"

"నా కేమీ జ్ఞాపకం లేదు. నేనూ ఎవరినో ప్రేమించాననుకుంటాను. అయితే నాకి ప్పుడేమీ జ్ఞాపకం లేదు. నా భర్త నన్ను కొట్టిన దెబ్బలతో పెళ్లిముందు జరిగిన సంఘట నలన్నీ తల్లోంచి ఎగిరిపోయాయి" అని తేలిగ్గా, తొణుకూబెణుకూ లేకుండా చెప్పింది.

నికొలాయ్ మళ్లీ బల్లకేసి తిరిగి రాతలో పడ్డాడు. తల్లి కాసేపు బయటి కెళ్లింది. తిరిగి వచ్చేసరికి అతడు పాత కథలను జ్ఞాపకం చేసుకోవడంలో పరవశమైనాడు.

"నాకు మాత్రం సాషాకు జరిగిన అనుభవంలాంటిదే జరిగింది...." అంటూ అతడు ఆమెకేసి ఆప్యాయంగా చూస్తూ అన్నాడు. "నేనొక అమ్మాయిని ప్రేమించాను – చాలా అద్భుతమైన పిల్ల. ఇరవై ఏళ్ల వయస్సులో నాకామెతో పరిచయమైంది. అప్పటినుంచీ నేనామెను ప్రేమించాను. ఇప్పటికీ ప్రేమిస్తూనే ఉన్నాను. హృదయపూర్వకంగా, కృత జ్ఞతతో ప్రేమిస్తున్నాను. ఎప్పటికీ ప్రేమిస్తాను."

అతని పక్కనే నిలబడున్న తల్లి అతని కళ్లలో వెచ్చని తేటు వెలుగు చూడగలిగింది. అతడు కుర్చీకానుకుని, చేతుల్లో తల పెట్టుకుని ఎక్కడో దూరంగా ఉన్నదాన్ని చూస్తు న్నట్లు చూపు నిగిడ్చాడు. సన్నంగా బలంగా ఉండే అతని శరీరం, సూర్యునికేసి పుష్పం సాగినట్లు ఏదో ఒక దృశ్యం వైపుకు సాగింది.

"ఆమె నెందుకు పెళ్లిచేసుకోకూడదు?" అని తల్లి సూచించింది.

"ఆమెకు నాలుగేళ్ల కిందట పెళ్లి అయిపోయింది."

"మీరే ముందుగా ఎందుకు పెళ్లిచేసుకోలేదూ?"

అతడొక క్షణం ఆలోచించాడు.

"ఏమైతే నేమి. ఆ పని జరగలేదు. నేను బయట ఉన్నప్పుడు ఆమె జైల్లోనో, ప్రవా సంలోనో ఉండేది. ఆమె స్వేచ్ఛగా ఉన్నప్పుడు నేను జైల్లో ఉండేవాడిని. సాషా, పావెల్ వ్యవహారంలాగే. ఔనా? చివరకు ఆమెను పదేళ్ల పాటు సైబీరియాకు, బాగా దూర ప్రాంతా నికి పంపేరు. నేను కూడా ఆమె వెంట పోవాలనుకున్నాను. కాని సిగ్గుపడ్డాను. ఆమె కూడా అంతే. అక్కడ ఆమె కింకొకడితో పరిచయమైంది. అతనూ మంచివాడే – నా కామ్రే డ్సులో ఒకడే. వాళ్లిద్దరూ కలిసి ప్రవాసంనుంచి పారిపోయారు. ప్రస్తుతం వాళ్లు పర దేశంలో ఉంటున్నారు."

నికొలాయ్ మలోచవాలను తీసి గుడ్డతో తుడిచి, వెలుతురులో చూసి మళ్లీ తుడిచాడు.

"అయ్యో నాయనా!" అని తల్లి ఆప్యాయంగా తలపంకిస్తూ అంది. అతన్ని చూస్తే ఆమెకెంతో విచారం కలిగింది. కాని అతనిలో ఏదో వింత స్ఫురించి, తల్లి బిడ్డను చూసి నవ్వినట్లు చిరునవ్వు నవ్వింది. అతను స్థలం మారి, కలం తీసుకుని తను మాటాడే మాటలకు లయబద్ధంగా ఊపుతూ ఇలా అన్నాడు:

"కుటుంబ జీవితం విప్లవకారుని సత్తానంతనీ పీల్చేస్తుంది. దానికి దోహదమివ్వదు. పిల్లలు, రక్షణ లేకపోవడం, కుటుంబపోషణకోసం పనిచెయ్యవలసిన అగత్యమేర్పడడం, మొదలైనవన్నీ ప్రతిబంధకాలే. విప్లవకారుడు తన శక్తిని నిలవచేసుకుని తన కార్యక్రమాలను విస్తరింపచెయ్యాలి. ప్రస్తుత కాలాన్ని బట్టి అలా చెయ్యక తప్పదు. పాత ప్రపంచాన్ని నాశనం చేసి కొత్త ప్రపంచాన్ని నిర్మించడానికి చరిత్ర మనల్ని — కార్మికులను — ఎన్నుకొన్న కారణంచేత, మనం మిగిలిన వాళ్ళందరికన్నా ఎల్లప్పుడూ ముందే అడుగెయ్యాలి. ఈ విషయంలో, అలసటవల్లనో, స్వల్ప విజయాల నాశించో మనం వెనకాడితే, అపరాధం చేసిన వాళ్ళ మవుతాం. దాదాపు మన లక్ష్యానికి ద్రోహం చేసినవాళ్ళ మవుతాం. మన లక్ష్యానికి నష్టం కలుగకుండా, పక్కపక్కగా నడవ దగినవారెవరూ లేరు. మన లక్ష్యం చిన్నచిన్న విజయాలు సాధించడం కాదనీ పరిపూర్ణమైన విజయం సాధించడమేననీ ఎన్నటికీ మరచిపోకూడదు."

అతని కంఠధ్వని చాలా స్పుటమైంది. ముఖం వెల్లబారింది. కళ్ళు మామూలుగానే నిర్మలంగా ప్రకాశించాయి. తలుపుగంట మోగింది. చలిచేత బుగ్గలెర్రబడి, శరీరమంతా వణుకుతూ లుద్మీలా ప్రవేశించింది. ఆమె కోటు చలికాలానికి పనికొచ్చేటట్లు లేదు.

"వచ్చేవారం విచారణ జరుగుతుంది" చినిగిన రబ్బరు జోళ్ళు విప్పేస్తూ చెప్పింది.

"మీకు నిశ్చయంగా తెలుసా?" అని పక్కగదిలోనుంచి నికొలాయ్ కేకేశాడు.

తల్లి అతని దగ్గరకు పరుగెత్తింది. తన హృదయాన్ని కలచివేస్తున్నది భయమో, సంభ్రమమో ఆమెకు తెలియడం లేదు. ఆమెతో కూడా లుద్మీలా వెళ్ళింది.

"అవును, తెలుసు. శిక్ష కూడా అప్పుడే నిశ్చయమైపోయిందని కోర్టు భవనంలో ధారాళంగా చెప్పుకుంటున్నారు" అంది. ఆమె మాటలో కొంచెం వ్యంగ్యం స్ఫురించింది. "ఎలా ఉందంటారు ఈ సంగతి? తన శత్రువులపట్ల తన ఉద్యోగులు దాక్షిణ్యంతో ప్రవర్తిస్తారేమోనని ప్రభుత్వం భయపడుతోందా? వాళ్ళ మనసులను వికృతం చెయ్యడానికి ప్రభుత్వం ఎంతో ధనాన్నీ, శక్తినీ ఖర్చు చేసినప్పటికీ, తుదకు వాళ్ళు మంచివాళ్ళైపోతారేమోనని భయపడుతోందా?"

ఆమె సోఫామీద కూచుని చేతుల్తో బుగ్గలు రాసుకుంది. ఆమె కళ్లలో అధికారుల మీద అపారమైన అసహ్యం కనబడుతోంది. కంఠధ్వని క్రమక్రమంగా కోపపూరితమైంది.

"మీ శక్తిని వృథాచెయ్యకండి, లుద్మీలా. మీ మాటలు వాళ్లకి వినబడవు కదా" అని నికొలాయ్ ఆమెను శాంతింపచెయ్యడానికి ప్రయత్నించాడు.

తల్లి ఆమె మాటలు విన్నది కాని ఆమె కవేమీ అర్థం కాలేదు. "మళ్లీవారం విచారణ" అనే ఆలోచన ఒక్కటే ఆమె మనసు నావహించింది.

హఠాత్తుగా, కనికర మెరుగని అమానుష శక్తి ఒకటేదో మీద కొస్తున్నట్లామెకు తోచింది.

## 23

మూడు రోజులపాటు తల్లి ఏమీ తోచక విచారంగానూ, ఆదుర్దాగానూ కాలక్షేపం చేసింది. మూడవ నాడు సాషా ప్రత్యక్షమైంది.

"సర్వం సంసిద్ధమైంది. ఇవ్వేళే ఒంటి గంటకు" అంది నికొలాయ్‌తో.

"ఇంత త్వరలోనే?" అని అతను ఆశ్చర్యపడి, అన్నాడు.

"ఇది త్వరలోనా? రీబిన్ కట్టుకునేందుకు బట్టలూ, ఉండేటందుకు స్థలమూ ఇవ్వడు మేము చూడాలి. మిగిలిన పనంతా గొబూన్ చేసేశాడు. రీబిన్ ఒక ఫర్లాంగు నడిచి వెళ్లాలి. వెసావ్‌శ్చికోవ్ అతన్ని కలుసుకుని కోటూ, టోపీ ఇచ్చి, దారి చూపిస్తాడు. కొంచెం ముందుకు పోగేక, మేము ఇతర బట్టలతో కనిపెట్టుకుంటాను."

"బాగుంది. కాని ఈ గొబూన్ ఎవరు?"

"అతన్ని మీరెరుగుదురు. మెకావిక్‌లతో మీ అధ్యయన గోష్ఠి అతడి గదిలోనే జరుగుతుండేది."

"ఔనౌను. జ్ఞాపకమొచ్చింది. చాలా తమాషా మనిషే."

"అతను సింహము పుచ్చుకున్న సిపాయి. ప్రస్తుతం మాట్లేస్తుంటాడు. చాలా అమాయకుడు. కాని హింస పేరు చెపితే అతనికి పరమ అసహ్యం. ఒక విధమైన తత్వజ్ఞాని" అంది, కిటికీలోంచి తొంగిచూస్తూ సాషా. తల్లికి ఆ మాటలు వింటుంటే మనసులో ఏదో లీలగా ఒక నిర్ణయం తట్టింది.

"గొబూన్ తన మేనల్లుడిని విడిపించాలనుకుంటున్నాడు. యేవ్‌చెన్కొ, జ్ఞాపకమున్నాడా? మంచి నీటుగా చలాకీగా ఉంటాడు. మీరు మెచ్చుకున్నారు కూడా."

నికొలాయ్ తలూపేడు. సాషా చెప్పసాగింది.

"అతను ఏర్పాట్లన్నీ చేశాడు.... కాని ఈ ప్రయత్నం సఫలమవుతుందనే విషయంలో నాకింకా అనుమానమే. ఖైదీలు తీరికగా విశ్రాంతి తీసుకునే సమయంలో ఇది జరగాలి. అయితే, గోడమీద నిచ్చెన చూసేసరికి, చాలామందికి దాని నుపయోగించాలని బుద్ధి పుట్టవచ్చు...."

పాషె కళ్ళు మూసుకుని మౌనం వహించింది. తల్లి మరింత దగ్గరకు చేరింది.

"ఆ తోపులాటలో ఎవరికీ కాకుండా పోతుంది."

ముగ్గురూ కిటికీ దగ్గర నిలబడ్డారు. నికొలాయ్ పాషెల వెనుక తల్లి నిలబడింది. వాళ్ళు గబగబ మాట్లాడుకుంటుంటే ఆమె హృదయంలో భయమూ, సంతోషమూ కలిగేయి. చటుక్కున:

"నేనూ వెడతాను" అంది.

"ఎందుకు?" అని పాషె అడిగింది.

"అమ్మా! మీరెళ్ళవద్దులెండి. మీ కేదైనా ప్రమాదం రావచ్చు. మీరెళ్ళద్దు" అని సలహా చెప్పేడు నికొలాయ్.

తల్లి అతనికేసి చూసి, మెల్లగానే అయినా పట్టుదలతో అంది:

"కాదు. నేను వెడతాను."

వాళ్ళిద్దరూ ఒకళ్ళ ముఖాలొకళ్ళు చూసుకున్నారు.

"నాకర్థమైంది" అంటూ పాషె భుజాలెగరేసింది. తల్లికేసి తిరిగి ఆమె చెయ్యి పట్టుకుంది.

"ఊరికే ఆతవడడంవల్ల ఏమీ లాభం లేదు" అని మృదువుగా ఆమె హృదయానికి హత్తుకునే లాగ చెప్పింది.

తల్లి వణుకుతున్న చేత్తో ఆమెను సమీపించి:

"అమ్మాయీ! ఆ సంగతి నాకు తెలుసు.... కాని మీతో నన్ను తీసుకెళ్ళండి. మీకు నేనేమీ అడ్డురాను! నేను వెళ్ళితీరాలి! పారిపోయి రావడం సాధ్యమని నాకు నమ్మకం కలగడం లేదు."

"ఆమె కూడా మనతో వస్తుంది" అంది పాషె నికొలాయ్‌తో.

"సరే. మీ యిష్టం మొచ్చినట్లే కానియ్యండి" అన్నాడు తలొంచుకుని నికొలాయ్.

"ఏమమ్మోయ్, మనమిద్దరం కలిసి మాత్రం కనబడకూడదు. మీరు ఖాళీజాగాలో ఉండండి. అక్కడనుంచి జైలు గోడ కనబడుతుంది. కాని మిమ్మల్నెవరైనా అడిగితే ఏమి చెవుతారు?"

"ఏదో వంక చెప్తానులే!"

"జైలు వార్డర్లు మిమ్మల్ని ఎరుగుదురనే సంగతి మరచిపోకండి! మిమ్మల్ని వాళ్ళక్కడ చూస్తే...." అని పాషె తల్లిని హెచ్చరించింది.

"వాళ్ళు నన్నక్కడ చూడరులే!"

కొన్నాళ్ళనుంచి ఆమె గుండెల్లో కుములుతున్న ఆశ, ఒక్క సారిగా పైకి ఉబికొచ్చింది.

"వాడు కూడా పారిపోయి వస్తాడేమో!" అనుకుంది.

ఒక గంటైన తర్వాత ఆమె జైలు దగ్గర ఉన్న ఖాళీ జాగా మధ్యకు చేరుకుంది. గాలి జోరుగా వీచి పావడమీద కొట్టింది, ఆమె నడుస్తున్న తోటయొక్క పాత కంచెను ఊగిసలాడించింది, తన శక్తి అంతటితోనూ గాలి జోరుగా జైలు గోడమీద విరుచుకుపడింది. జైలు ఆవరణలోంచి మనుషుల కేకలను ఈ గాలి మేఘావృతమైన ఆకాశానికి ఎగరేసింది.

తల్లి వెనక తోట ఉంది. ముందు స్మశాన భూమి ఉంది. కుడి వైపున సుమారు డెబ్బై అడుగుల్లో జైలుంది. స్మశానం దగ్గర ఒక సిపాయి గుర్రానికి కవాతు నేర్పుతున్నాడు. మరొక సిపాయి అతని పక్కనే నిలబడి, అరుస్తూ, నవ్వుతూ, ఈలేసుకుంటూ నేలను కాలితో గట్టిగా తట్టుతున్నాడు. జైలు సమీపాన మరెవ్వరూ లేరు.

తల్లి వాళ్ల పక్కనుంచే, వెనక్కీ పక్కకూ దొంగచూపులు చూసుకుంటూ, స్మశానం కంచెదాకా వెళ్లింది. హఠాత్తుగా ఆమె మోకాళ్ల వణికాయి. పాదాలు గడ్డకట్టి భూమి కంటుకు పోయినట్లయినాయి. ఆ మలుపులోకి దీపాలు వెలిగించే గూని మనిషి ఒక భుజాన నిచ్చెన వేసుకుని తొందరగా వచ్చాడు. సాధారణంగా దీపాలు వెలిగించేవాళ్లు అలాగే తొందర పడుతుంటారు. భయంచేత బిత్తరచూపులు చూస్తూ, తల్లి సిపాయిలకేసి చూసింది: వాళ్లు ఒకే చోట నిలబడున్నారు. గుర్రం వాళ్ల చుట్టూ దవుడు తీస్తోంది. తల్లి, నిచ్చెన భుజాన వేసుకున్న మనిషిని చూసింది. అతనప్పుడే నిచ్చెనను గోడకాన్చి, తాపీగా పైకెక్కుతున్నాడు. గోడమీద కెళ్లిన తర్వాత, అతను చేతిని విసిరేడు. వెంటనే కిందకు దిగిపోయి మలుపు తిరిగి అదృశ్యమైపోయాడు. తల్లి గుండె దడదడ కొట్టుకుంది. క్షణాలు యుగాల్లా గడుస్తున్నాయి. డాగులు పడి రంగు పోయి, పెల్లులూడిపోయి, ఇటికలు అగుపడుతూ, మచ్చలతో నల్లగా ఉన్న జైలు గోడమీద, నిచ్చెన ఎక్కడా ఆనవాలు అగుపడ్డం లేదు. ఆక స్మాత్తుగా గోడపైన నల్లని తల కనపడింది. తర్వాత ఒక ఆకారం గోడమీద అడ్డుగా కూచుని కిందకు జారిపోయింది. బొచ్చు టోపీతో మరొక తల కనపడింది. నల్లని ఉండలాటి దొకటి భూమిమీదకు దొర్లి మలుపులో మాయమైపోయింది. మిహయీల్ లేచి నిలబడి ఒళ్లు విరుచుకుని, వాలుగు మూలలా చూసి తలాడించాడు....

తల్లి పాదాన్ని నేలమీద తట్టుతూ:

"పరుగెత్తు! పరుగెత్తు!" అని గొణిగింది.

ఆమె చెవులు గింగురు మన్నాయి. పెద్ద పెద్ద అరుపులామె వింది. గోడమీద మూడవ తలకాయ అగుపడింది. తల్లి రొమ్ము గట్టిగా నొక్కుకుని ఊపిరి ఉగ్గ బట్టి చూసింది. గెడ్డం లేని యువకుని గోధుమవన్నె తల పైకి లేచింది. కాని వెంటనే గోడ వెనకనే మాయమై పోయింది. కేకలు మరింత పెద్దవైనాయి. మరింత ఆవేశపూరితంగా ఉన్నాయి. కుంయ్యిమని ఈలలు గాలిలోకి జోరుగా లేచాయి. మిహయీల్ గోడ పక్కగానే పొడుగువా నడిచాడు.

ఆమె ముందునుంచే వెళ్లి జైలుకూ, నగరంలోని ఇళ్లకూ మధ్యవున్న ఖాళీ స్థలాన్ని దాటే శాడు. అతను కొంచెం చురుకుగా నడిచి తలంత పై కెత్తకుండా ఉంటే బాగుండును! ఒకసారి అతని ముఖం చూసిన వారెవ్వరూ దాన్ని మరచిపోలేరు.

"త్వరగా, త్వరగా!" అని ఆమె గొణుక్కుంది.

జైలు గోడ వెనకాల ఏదో ఖంగుమని శబ్దమైంది. అద్దం బద్దలైన చప్పుడామెకు వినబడింది. ఒక సిపాయి పాదాలను నేలమీద నిలదొక్కుకుని గుర్రం తాడును లాక్కు న్నాడు. రెండవ సిపాయి నోటి దగ్గర చెయ్యి పెట్టుకుని జైలుకేసి తిరిగి బిగ్గరగా అరిచాడు. జవాబుకోసం గాలి వైపుకు చెవొగ్గేడు.

తల్లి ఎంతో కష్టంమీద, వాళ్లు వైపులా చూస్తూ నిలబడింది. ఆమె కళ్లకన్నీ కనబడుతున్నాయి, కాని అవి దేన్నీ నమ్మడం లేదు. ఎంతో క్లిష్టమైనదీ, ప్రమాద భరిత మైనదీ అనుకున్న వ్యవహారం, అతి చురుగ్గానూ సూక్ష్మంగానూ జరిగిపోయింది. ఈ చురుకుతనం ఆమెను పరవశురాలను చేసి, ఏమీ తోచకుండా చేసింది. రీబిన్ మాయమై పోయాడు. పెద్ద కోటు తొడుక్కున్న పొడుగాటి మనిషి వీధంట నడుచుకుంటూ వచ్చాడు. చిన్న పిల్ల ఒకామె అతనికన్న ముందు పరుగెత్తింది. ముగ్గురు జైలు వార్డర్లు పరుగెత్తు కుంటూ వచ్చి జైలు మూల మళుపు తిరిగేరు. వాళ్లు కుడి చేతులను చాపుకుని ఒకరికొకరు దగ్గరగానే పరుగెత్తేరు. సిపాయిల్లో ఒకడు పరుగెత్తుకొచ్చి వాళ్ల కెదురైనాడు. రెండవ వాడు గుర్రం మీదెక్కడానికి గంతులేస్తున్నాడు. కాని గుర్రం స్వాధీనం కావడం లేదు, గాలిలో కెగురుతోంది. దానితోపాటంతా ఎగురుతున్నట్టే ఉంది. ఈలలు మళ్లీ అదే పనిగా కంగారుగా ధ్వని చేస్తున్నాయి. నిరాశతో కూడిన ఆ కీచు ధ్వనులు తల్లికి ప్రమాదాన్ని గుర్తుకు తెచ్చేయి. ఆమె వణుకుతూ స్మశానపు కంచె పక్కగా నడక సాగించింది. కళ్లు మాత్రం వార్డర్లమీదనే ఉన్నాయి. వాళ్లు సిపాయిలతో కలసి జైలు మరో మూల అదృశ్య మైపోయారు. కోటు బొత్తాములు పెట్టుకోని మరొక మనిషి వారిని వెంటాడించాడు. అతను అసిస్టెంటు జైలరని ఆమె గుర్తు పట్టింది. పోలీసులు రంగంమీద కొచ్చారు. జనం గుంపులుగా మూగడం మొదలెట్టేరు.

గాలి ఆనందించుతూన్నట్టు సుళ్లు తిరుగుతూ నాట్యం చేసింది. అరుపులు, కేకలు, ఈలలు తల్లి చెవులకు చేర్చింది. ఈ గందరగోళం తల్లికి సంతోషాన్ని కలిగించింది. ఆమె చురుగ్గా అడుగులేసింది.

"అతను కూడా ఇంత తేలిగ్గానూ చెయ్యగల్గేవాడే" అనుకుంది. చటుక్కున ఇద్దరు పోలీసులు మళుపు తిరిగి ఎదురొచ్చారు. అందులో ఒకడు ఒగుర్చుకుంటూ,

"ఆగు! గెడ్డం ఉన్న మనిషిని చూశావా?" అని అడిగేడు.

ఆమె తోటకేసి వేలు చూపిస్తూ,

''అలా పరుగెత్తేడు. ఎందుకూ?'' అని నిదానంగా అడిగింది.

''యెగోరొవ్! ఈల ఊదు!''

తల్లి ఇంటికి చేరుకుంది. దేన్ని గురించో ఆమె విచారపడుతోంది. మనసుకు కష్టం, పశ్చాత్తాపం కలిగాయి. ఆ ఖాళీ జాగా దాటి వీధిలోకి రావడంతోనే ఆమె కొక బండి కని పించింది. అందులోకి చూసేసరికి గోధుమవన్నె మీసాల యువకుడొకడు కంటబడ్డాడు. అలసట చేత అతడి ముఖం వెలవెలలాడుతోంది. అతను కూడా ఆమెను చూశాడు. అతను పక్కకు తిరిగి కూచున్నాడు. అందుచేత ఎడమ భుజంకన్న కుడి భుజం ఎత్తుగా కనబడింది.

నికొలాయ్ సంతోషంగా ఆమెను పలకరించాడు.

''సరి. ఏమైంది?''

''అంతా బాగానే జరిగింది.''

ఆమె ప్రతి చిన్న విషయాన్నీ జ్ఞాపకం తెచ్చుకుని జైలునుంచి పారిపోయినవాళ్ల కథంతా పూసగుచ్చినట్లు చెప్పింది. కాని, దాని నిజాన్ని శంకిస్తున్నట్లుగా, ఎవరి కథో తాను మళ్లీ చెప్పినట్లు చెప్పింది.

''అదృష్టం మనపాలిట ఉంది'' అన్నాడు నికొలాయ్, చేతులు నులువుకుంటూ. ''మీకేం ప్రమాదమొస్తుందోనని నేను ఎంత ఆదుర్దాపడుతున్నానో దేవుడికే తెలియాలి. వినవమ్మా నీలొవ్నా! స్నేహితుడు చెప్పే సలహా వినండి. ఆ విచారణ గురించి భయపడకండి. అదెంత త్వరగా జరిగిపోతే పావెల్ అంత త్వరగా స్వేచ్ఛను పొందుతాడు. బహుశా ప్రవాసానికెళ్లే దారిలోంచే అతను పారిపోయి వస్తాడు. ఇక కేసు విచారణ మాటకేమిలే. అది యిలా జరుగు తుంది....''

అతను విచారణ విధానాన్నంతనీ వర్ణించాడు. అతను మాట్లాడుతుంటే, ఆమెకు ధైర్యం చెప్పాలని ప్రయత్నిస్తున్నప్పటికీ, అతనికే ఏదో భయమున్నట్లు ఆమె గ్రహించింది.

''కోర్టులో చెప్పకూడని మాటేదైనా చెపుతానని మీకు భయంగా ఉందా? లేక వాళ్లనేదైనా అడుగుతాననుకుంటున్నారా?'' అని చటుక్కున అడిగింది.

నికొలాయ్ గభాలున లేచి నిలబడ్డాడు. కాదన్నట్లు చెయ్యి ఊపుతూ,

''అలాటి సంకోచమేమీ లేదు'' అన్నాడు కష్టంతోచినట్లున్న స్వరంలో.

''నాకు భయంగానే ఉంది. కాదనను. కాని ఎందుకు భయంగా వుందో మాత్రం నాకు తెలియడం లేదు.'' ఆమె మాట్లాడ్డం మానింది. గదంతా వాల్గు మూలలా చూసింది.

''వాళ్లు పావెల్‌తో మోటుగా మాట్లాడతారేమోనని అప్పుడప్పుడు నాకు భయమే స్తుంది. 'ఒరి రైతోడా! రైతు నాకొడకా! ఏమిట్రా నువ్వు చేస్తున్నది?' అని అంటారేమో! పావెల్ చాలా పౌరుషంగల కుర్రాడు. అతను వాళ్లకు తగిన సమాధానం చెపుతాడు.

లేకపోతే, అన్‌ద్రేయ్ చురుగ్గా జవాబిస్తాడు. అవతలివాళ్ళు కూడా గర్విష్ఠులే. వీళ్ల సమా ధానాలను భరించలేక, వాళ్లు మరొక శిక్ష విధిస్తే, ఇక మనం వాళ్లని చూడ్డమంటూ ఉండదేమో?''

నికొలాయ్ జవాబుచెప్పకుండానే, చిరచిరలాడేడు. గెడ్డం పీక్కున్నాడు.

''నేను అలాంటి ఆలోచనలు చెయ్యకుండా ఉండలేకపోతున్నాను....'' అందామె మెల్లగా. ''అంచేతనే నాకు విచారణంటే భయమేస్తోంది.... వాళ్లన్నీ పరిశీలనగా చూసి, సుళువు బరువులు తూకం వేస్తే! అబ్బ! భయంకరం! నాకు శిక్షంటే భయమెయ్యడం లేదు. విచారణంటేనే భయంగా ఉంది. దానినెలా వ్యక్తపరచాలో నాకు తెలియడం లేదు....''

నికొలాయ్ తనను అర్థం చేసుకున్నట్లు లేదని ఆమె నిశ్చయించుకుంది. అందుచేత ఆమె భయాన్ని మాటల్లో విశదీకరించడం ఆమెకు మరింత కష్టమైంది.

## 24

భయం, కడుపులో ఒక దిమ్మ పెరిగినట్లు పెరిగి ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసింది. విచారణ రోజున కోర్టు కెడుతుంటే, ఆమెకు తల పైకెత్తడం కష్టమనిపించింది. నిటాగ్గా నిలబడి నడవలేకపోయింది.

ఫ్యాక్టరీ పేటలోనుంచి వచ్చిన పరిచితులు ఆమెను పలకరించారు. విచారంగా ఉన్న ఆ జనంలోనుంచి వస్తూ, వారికి జవాబుగా ఊరికే తలూపింది. కోర్టు వరండాల్లోనూ, కోర్టు హాలులోనూ విచారణలోవున్న వ్యక్తుల తాలూకు బంధువులను ఆమె కలుసుకుంది. వాళ్లు లోగొంతులో ఆమెతో మాట్లాడేరు. తల్లికి మాటలనవసరమనిపించింది. అవి ఆమె కర్థం కావడం లేదు. అందరూ ఒకే విధమైన దుఃఖంతో బాధపడుతున్నారు. ఆ సంగ తామె చూసింది. ఆమెనది మరింత కుంగదీసేసింది.

''కూర్చో'' అంటూ సిజోవ్ బెంచీమీద ముందుకు జరిగేడు.

తల్లి మాట్లాడకుండా కూచుని పావడా సాపు చేసుకుంది. ఆకుపచ్చనివి, ఎర్రని చుక్కలు, చారలు, సన్నని పసుపుపచ్చని దారాలు ఆమె కళ్ల ముందర నాట్యం చేశాయి.

ఒక స్త్రీ ఆమె పక్కనే కూర్చుని:

''నీ కొడుకే మా గ్రీషనీకాడికి తెచ్చాడు'' అని సణిగింది.

''ఆ మాటలు కట్టిపెట్టు, నతాల్యా'' అన్నాడు సిజోవ్ చిరచిరలాడుతూ.

తల్లి ఆ స్త్రీకేసి చూసింది. ఆమె సమోయ్‌లొవ్ తల్లి. ఆమె పక్కనే ఆమె భర్త కూచున్నాడు. అతను బట్టతల, పలుచని ముఖం, ఎర్రని జీరాడుతూన్న గడ్డంగల అంద గాడు. కళ్లు చిట్లించి ముందుకు తేరిపారజూస్తుంటే, బాధతో అతడి గడ్డం వణికింది.

మంచు కమ్మిన ఎత్తు కిటికీల్లోనుంచి కోర్టు హాల్లోకి దిమ్ముగా వెలుతురు పడింది. కిటికీకీ కిటికీకీ మధ్య, నిగనిగలాడుతుండే గిల్టు చట్రంలో జారు బొమ్మ వేలాడుతోంది. కిటికీతెరల రెండు పక్కలా లేత ఎర్ర రంగు గుడ్డ మడతలున్నాయి. ఆ బొమ్మ కెదురుగా దాదాపుగా ఆ గోడనుంచి ఈ గోడవరకూ ఒక పెద్ద బల్ల ఆవరించింది. దానిమీద ఆకుపచ్చని బనాతు గుడ్డ కప్పబడుంది. కుడి పక్క గోడ దగ్గర, కమ్ముల వెనుక, రెండు కుర్ర బెంచీలున్నాయి. ఎడమ వైపు గోడకు చేర్చి రెండు వరుసలు ఎర్ర రంగు సోఫా కుర్చీలు అమర్చబడున్నాయి. ఆకుపచ్చని మెడ పట్టీలనూ, కిందదాకా బంగారు బొత్తాముల యూనిఫారాలనూ ధరించిన బంట్రోతులు నిశ్శబ్దంగా ముందుకూ వెనక్కూ తిరుగుతున్నారు. మబ్బుగమ్మినట్లున్న ఆ హాలు, గుసగుసలతో నిండిపోయింది. మందు వాసన కొట్టింది. ఈ రంగులూ, ఈ నిగనిగలూ, ఈ గుసగుస ధ్వనులూ, ఈ వాసనలూ తల్లి కంటికీ, చెవికీ ఎంతో బాధ కలిగించాయి. ఊపిరి పీల్చినప్పుడల్లా అవి ఆమె శరీరంలో ప్రవేశించి, శూన్యమైనట్టి నొప్పిపెట్టేటట్టి భయంతో నింపేశాయి.

గభాలున ఎవరో పెద్ద గొంతుకతో ఏమిటో అన్నాడు. తల్లి ఉలికిపడింది. అందరూ లేవడంచేత, ఆమె కూడా సిజోవ్ చెయ్యి పట్టుకుని నిలబడింది.

ఎడమ పక్క ఒక ఎత్తయిన తలుపు తెరుచుకుంది. సులోచనాలు పెట్టుకున్న ఒక ముసలాయన కాళ్లీడ్చుకుంటూ లోపలి కొచ్చాడు. ఆయన గౌరవర్ణపు బుగ్గలమీద సన్నని మీసాలు అదురుతున్నాయి. మీసం లేని పై పెదవి పళ్లు లేని చిగుళ్ల నంటిపెట్టుకుంది. కింది దవడలూ, గెడ్డం ఆయన ఎత్తయిన యూనిఫారం కోటు కాలరుమీద ఆనుకున్నాయి. చూడ్డానికి ఆయనకసలు మెడ అనేది లేదా అన్నట్లుంది. ఎర్రగా గుండ్రంగా ఉండే పింగాణీ ముఖంగల ఒక పొడుగాటి యువకుడు ఆయనకు ఊతం ఇస్తూ ఆయన్ని తీసుకువచ్చాడు. ఆయన వెనకాల, బంగారపు అల్లికలుగల దుస్తులను ధరించిన ముగ్గురు మనుషులు ప్రవేశించారు. వాళ్ల వెనక మామూలు దుస్తులను ధరించిన ముగ్గురొచ్చారు.

పొడుగాటి బల్లదగ్గర వాళ్లందరూ తమతమ స్థానాల్లో కూచునేటప్పటికి చాలా సేపైంది. అది జరిగిన తర్వాత, నిర్దాక్షిణ్యమైన ముఖంతో ఒక గడ్డం లేని మనిషి, ముందుకు వంగి ముసలాయన చెవిలో ఏదో గుసగుసలాడుతూ దట్టంగా ఉండే పెదవులను మెదిపాడు. అతని మాటలు వింటూ ముసలాయన చిత్రంగా నిలువుగా బిర్రుగా కూచున్నాడు. ఆయన సులోచనాల జోడులో, ఏరంగూ లేని రెండు చుక్కలను తల్లి చూసింది.

బల్లకు ఒక చివరనున్న రాత బల్లదగ్గర ఒక పొడుగాటి బట్టతల పెద్దమనిషి నిలబడి, గొంతుక సవరించుకుంటూ కాగితాలు తిరగేస్తున్నాడు.

ముసలాయన ముందుకు వంగి, మాట్లాడ్డం మొదలెట్టేడు. మొదట్లో ఆయన

మాట్లాడిన మాటలు స్పష్టంగానే వినిపించాయి. కాని రానురాను అవి ఒకదానికొకటి సంబంధంలేకుండా పోయాయి.

"నేను విచారణ ప్రారంభిస్తున్నాను.... వాళ్లని తీసుకురండి...."

"చూడు" అంటూ సిజోవ్ మెల్లగా తల్లిని తట్టి, లేచి నిలబడ్డాడు.

కమ్మీల వెనుకనున్న తలుపు తెరవబడింది. ఒక సిపాయి తళతళలాడే కత్తిని భుజాన పెట్టుకుని లోపలి కొచ్చాడు. అతని వెంట పావెల్, అన్‌ద్రేయ్, ఫ్యోదొర్ మాజిన్, గూసెవ్ సోదరులు, సమోయ్‌లొవ్, బూకిన్, సోమొవ్, ఇంకా తల్లికి పేర్లు తెలియనివాళ్లు అయిదు గురు యువకులు ప్రవేశించారు. పావెల్ ఆమెను చూసి ఒక చిరునవ్వు నవ్వేడు. అన్‌ద్రేయ్ చిన్న నవ్వు నవ్వి తలాడించాడు. ఎందుచేతనైతేనేమి, వాళ్ల చిరునవ్వులు, ఉత్సాహ పూరిత మైన ముఖాలు, సౌంజ్ఞలూ, కృతకంగా ఎబ్బెట్టుగా ఉన్న కోర్టుహాలు వాతావరణాన్ని కొంత తేలికపరచినట్లనిపించింది. బంగారపు అల్లికల తళతళలు మాయమైపోయాయి. ముద్దాయిలు ప్రదర్శించిన ఆత్మవిశ్వాసమూ, ధైర్యస్థైర్యాలూ చూసేసరికి తల్లికి మళ్లీ ధైర్యం చేకూరింది. ఇంతవరకూ వెనుక బెంచీలమీద నిస్పృహతో కాచుకు కూచున్న జనంలో నుంచి మెల్లగా గొణగొణలు రేగేయి.

"వాళ్లేమీ భయపడ్డం లేదు!" అని మెల్లగా చెవిలో చెప్పేడు సిజోవ్. సమోయ్‌లొవ్ తల్లి ముక్కడం మొదలెట్టింది.

"నిశ్శబ్దం!" అని కేక వినబడింది.

"నేను ముందుగానే హెచ్చరిస్తున్నాను...." అన్నాడు ముసలాయన.

ముందు బెంచీమీద పావెల్, అన్‌ద్రేయ్‌లు పక్కపక్కనే కూచున్నారు. వాళ్లతో పాటే మాజిన్, సమోయ్‌లొవ్, గూసెవ్ సోదరులూ కూచున్నారు. అన్‌ద్రేయ్ గెడ్డం తీసేశాడు, కాని మీసాలు పెంచాడు. ఆ మీసాలు కిందకు వాలడంచేత గుండ్రంగా ఉండే అతని ముఖం పిల్లి ముఖంలా కనబడింది. అతని ముఖంలోని హావభావాల్లో ఏదో నవ్యత్వం గోచరించింది. అతని పెదవులపైన ఏదో ఒక రకమైన చురుకుదనం, కరుకుదనం కనబడ్డాయి. కళ్లలో వాలుచూపేర్పడింది. మాజిన్ పై పెదవిమీద నల్లని గీత అగుపడింది. ముఖం గుండ్రపడింది. సమోయ్‌లొవ్ ఉంగరాల జుట్టు ఎప్పటిలాగే ఉంది. ఇవాన్ గూసెవ్ మామూలుగానే నోరారా నవ్వుతూనే ఉన్నాడు.

"ఆ! ఫ్యోదొర్, ఫ్యోదొర్" అంటూ తలొంచుకుని సిజోవ్ మూలిగేడు.

ముసలాయన తలను మెడ పట్టీమీద మోపి, చలనమేదీ లేకుండా, ఖైదీలకేసి చూడ కుండానే, అవ్యక్తంగా ధ్వనించే ప్రశ్నలను వాళ్ల నడుగుతూ ఉంటే తల్లి ఆలకించింది. తన కొడుకు తొణుకూ బెణుకూ లేకుండా క్లుప్తంగా ఇచ్చే సమాధానాలను వింది. ప్రధాన న్యాయమూర్తీ, ఆయన సహాయకులూ, అతని పట్ల క్రూరంగా ఉండలేరనిపించింది. ఈ

విచారణ ఫలితమేమవుతుందా అని ఊహించే అభిప్రాయంతో, పొడుగాటి బల్లదగ్గర కూచున్నవాళ్ల ముఖాలను ఆమె పరిశీలనగా చూసేసరికి, హృదయంలో కొంత ఆశ కలుగుతున్నట్లనిపించింది.

పింగాణీ ముఖంగల ఉద్యోగి కీచు గొంతుకతో ఒక పత్రాన్ని చదివేడు. దాన్ని వింటుంటే విసుగెత్తి జనం విమూఢులైపోయినట్లు కూర్చున్నారు. నలుగురు న్యాయవాదులు ముద్దాయిలతో చాలా ఆవేశంతో చర్చచేశారు. వాళ్లు చాలా చురుగ్గానూ దృఢంగానూ వ్యవహరించారు. వాళ్లను చూస్తుంటే తల్లికి నల్లగా పెద్దవిగా ఉండే పక్షులు జ్ఞప్తికి వచ్చాయి.

ముసలాయన కొక పక్కనున్న కుర్చీలో స్థూలకాయుడైన న్యాయమూర్తి కుర్చీ పట్టకుండా కూచున్నాడు. చిన్నవిగా ఉండే ఆయన కళ్లు కొవ్వుచేత కప్పడిపోయాయి. రెండో పక్క కుర్చీలో బలిసి గుండ్రబారిన భుజాలుకల న్యాయాధిపతి కూర్చున్నాడు. వెలవెలబారిన అతని ముఖంమీద లేత ఎరుపురంగు బుగ్గమీసాలున్నాయి. ఆయన అలసటతో తల కుర్చీ వెనక్కాన్చి, సగం కళ్లు మూసి ఏవో ఆలోచనల్లో పడ్డాడు. ప్రాసెక్యూటరు కూడా అలసటగా విసుగ్గా కనబడ్డాడు. జడ్జీలవెనక మేయర్ కూచున్నాడు. ఆయన లావుగా ఉన్నాడు. మంచి గంభీరమైన మనిషి. సాలోచనగా బుగ్గను నిమురుకొంటూ కూచున్నాడు. ఆయన పక్కన ప్రభువుల ప్రతినిధి — మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ — కూర్చున్నాడు. అతని జుట్టు నెరిసిపోయింది. బుగ్గ లెర్రగా ఉన్నాయి. పొడుగాటి గెడ్డం, సౌమ్యమైన పెద్ద కళ్లున్నాయి. తర్వాత జిల్లా పరిపాలనాధికారి ఆసీనుడయాడు. అతిభారమైన అతని బొజ్జ అతనికి బాధ కల్గించుతూన్నట్టే ఉంది. ఏమంటే, బొజ్జమీదనుండి జారిపోతున్న చొక్కా కొనలను సర్దుకోవడంతోనే అతనికి సరిపోయింది.

"ఇక్కడ నేరస్థులూ లేరు, న్యాయాధిపతులూ లేరు.... బంధితులూ, బంధించే వాళ్లూ మాత్రమే ఉన్నారు" అని పావెల్ గంభీర స్వరంతో అన్నాడు.

హాలంతా నిశ్శబ్దమైంది. కొన్ని క్షణాల పాటు తల్లికి, కలంతో గబగబ రాస్తున్న శబ్దం, తన హృదయం కొట్టుకుంటున్న శబ్దం తప్ప మరేమీ వినబడలేదు.

ప్రధాన న్యాయమూర్తి కూడా శ్రద్ధగా వింటున్నట్లే కనబడ్డాడు. సహాయ న్యాయాధిపతుల్లో చంచలనం పుట్టింది. చివరకి ఆయన:

"హుం. అన్ద్రేయ్ నహోద్కా! మీరు దోషినని అంగీకరిస్తారా?" అని అడిగేడు.

అన్ద్రేయ్ నెమ్మదిగా లేచి నిటారుగా నిలబడ్డాడు. మీసాలు సవరించుకుని, కనుబొమల్లోంచి ముసలాయనకేసి చూశాడు. నెమ్మదిగా మధుర స్వరంతో జవాబుచెప్పేడు:

"నేను దోషినని ఎలా అంగీకరిస్తాను? నేనెవరినీ చంపలేదు. ఎవరి సొమ్మునూ దొంగిలించలేదు. జనం ఒకరినొకరు దోచుకుని చంపుకునేందుకు దారితీసే జీవిత విధానానికి నేను వ్యతిరేకిని. అంతే."

''క్లుప్తంగా జవాబులు చెప్పాలి'' అన్నాడు ప్రయత్నంమీద ముసలాయన.

వెనక బెంచీల్లోంచి సణుగుడు బయల్దేరింది. గుసగుసలాడుతూ జనం అటూ ఇటూ తిరగడం మొదలెట్టేరు. పింగాణీ ముఖం మనిషి అల్లిన కల్లబొల్లి మాటల సాలెపట్టునుండి వారు విడిపించేసుకున్నట్లయింది.

''విన్నావా వాళ్లేమంటున్నారో?'' అని సిజోవ్ తల్లి చెవిలో చెప్పేడు.

''ఫ్యోదొర్ మాజిన్, మీ జవాబు చెప్పండి....''

''నేనేమీ చెప్పను'' అని అతను చటుక్కున లేచి చెప్పేడు. అతని ముఖం వికసించి ఎర్రబారింది. కళ్లు జ్యోతుల్లా ప్రకాశించాయి. ఎందుకో చేతులు వెనక్కు కట్టుకున్నాడు.

సిజోవ్ గట్టిగా ఊపిరి తీసుకున్నాడు. తల్లి కళ్లు ఆశ్చర్యంతో వికసించాయి.

''నా తరపున వాదించడానికి నేను వకీలును పెట్టుకోను. నేనేమీ చెప్పదలచుకోలేదు! ఈ విచారణ చట్టవిరుద్ధమని నా అభిప్రాయం! మీరెవరు? మమ్మల్ని విచారించడానికి ప్రజలు మీకేమైనా అధికార మిచ్చారా? లేదు! వాళ్లేమీ ఇవ్వలేదు. మీ అధికారాన్ని నేను గుర్తించదలుచుకోలేదు!''

అంతటితో అతడు కూచుని వికసించిన ముఖాన్ని అన్‌ద్రేయ్ భుజాల వెనక్కి లాక్కున్నాడు.

లావుపాటి న్యాయాధిపతి ప్రధాన న్యాయాధిపతి చెవిలో గుసగుసలాడి తలూపేడు. వెల్లబారిన ముఖంగల జడ్జీ, కళ్లు బాగా తెరిచి ముద్దాయిలకేసి తేరిపారజూసి, తన ఎదుటనున్న కాగితంమీద పెన్సిలుతో ఏదో రాసుకున్నాడు. జిల్లా పరిపాలనాధికారి తలూపి, పొట్ట మోకాళ్లమీద కాన్చడానికి వీలుగా పాదాలు సర్దుకున్నాడు. ముసలాయన తల కదపకుండా శరీరాన్నంతనీ వెల్లముఖం జడ్జీకేసి తిప్పి పెదవులు మెదిల్చేడు. ఆయన నమస్కారపూర్వకంగా తలొంచాడు. మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ ప్రొసెక్యూటరుతో ఏదో చెప్పేడు. మేయరు దవడ తట్టుకుంటూ ఆయన చెప్పిన మాటలు వింటున్నాడు. తర్వాత, ప్రధాన న్యాయమూర్తి ఈడుపు స్వరంతో మాట్లాడ్డం మొదలెట్టేడు.

''విన్నావా మావాడు వాళ్ల కెలా జవాబుచెప్పేడో? అందరికన్న బాగా చెప్పేడు'' అని సిజోవ్ తల్లి చెవిలో చెప్పేడు.

తల్లి చిరునవ్వు నవ్వింది. కలవరపడింది. అక్కడ జరుగుతున్నదంతా అనవసరమైన విసుగుపుట్టించే తంతులా కనబడింది. తన క్రౌర్యంతో అందర్నీ భయభ్రాంతులను చేసి అణగ్గొట్టే భయంకరమైన సంఘటనలకిది నాంది కాబోలనుకుంది. కాని పావెల్ అన్‌ద్రేయ్‌ల మాటలు నిర్భయంగానూ, దృఢంగానూ ఉన్నాయి. అవి న్యాయస్థానంలో మాట్లాడినట్టుగా కాక, ఫ్యాక్టరీ పేటలోని వాళ్ల ఇంట్లో మాట్లాడినట్లే ఉన్నాయి. ఫ్యోదొర్ ఆవేశంతో చెప్పిన మాటల కామె ఉప్పొంగింది. ఈ విచారణంతా ధైర్యస్థైర్యాలతో కూడిన వ్యవహారంగా

సాగుతున్నదనిపించింది. తన వెనక కూర్చున్న జనంలో ఉండే ఉత్సాహాన్ని చూస్తుంటే, అందరూ ఆ అభిప్రాయంలోనే ఉన్నట్లు స్పష్టమైంది. మునలాయన:

"మీ అభిప్రాయ మేమిటి?" అని అడిగేడు.

బట్టతల ప్రాసెక్యూటరు నిలబడి ఒక చేతిని బల్లమీద మోపి, గబగబా అంకెలు ఉదహరిస్తూ ఉపన్యసించాడు. అతడి కంఠధ్వని ఏమంత భయంకరంగా లేదు.

అయినప్పటికీ, తల్లికి హృదయంలో మాత్రం ఏదో గుచ్చుకుంటున్నట్లే ఉంది. ఆ వాతావరణంలో ఏదో శత్రుత్వమున్నట్లామెకు ఛాయగా గోచరించింది. అది, పిడికిలి ఊపుతూ అరవడం లేదు కాని, చాప కింద నీరులాగ పైకి కనబడకుండానే, పెరుగుతున్న ట్లుంది. అది జడ్జీల చుట్టూ తిరుగుతూ వాళ్లను అభేద్యమైన మేఘంలా ఆవరించి బయట జరిగే సంగతులేమీ వాళ్లకు తెలియకుండా కమ్మేసింది. జడ్జీల సంగతి ఆమెకు అంతు చిక్క లేదు. ఆమె అనుకున్నట్లు వాళ్లు పావెల్‌మీదా, ఫ్యోదొర్‌మీదా ఆగ్రహపడలేదు. వాళ్లనేమీ కించపరచలేదు. వాళ్లు అడిగిన ప్రశ్నలు అవసరమైనవిగా కనిపించలేదు. వాళ్ల ధోరణి చూస్తే ఏ విషయాన్నీ పట్టించుకున్నట్లు లేదు. ముద్దాయి జవాబులను విధిలేక విన్నారు. వాళ్లకు అన్ని విషయాలూ ముందే తెలుసునన్నట్లు ప్రవర్తించారు.

తర్వాత, వాళ్ల ఎదుట ఒక పోలీసు నిలబడి బొంగురు గొంతుకతో,

"పావెల్ వ్లాసావ్ ప్రధానమైన ప్రోత్సాహకుడని చెప్తారు" అన్నాడు.

"నహోద్కా మాటేమిటి?" అని లావుపాటి జడ్జీ ప్రశ్నవేశాడు.

"అతను కూడా...."

ఒక న్యాయవాది లేచి,

"నన్నొక మాట చెప్పనిస్తారా?" అని అడిగేడు.

"ఏమైనా అభ్యంతరాలున్నాయా?" అని మునలాయన అడిగేడు.

న్యాయాధీశులందరూ ఏదో రుగ్మతతో బాధపడుతున్నట్లే కనబడుతున్నారు. వాళ్ల వైఖరిని చూసినా మాటలను చూసినా అనారోగ్యంతో ఎంతో అలసిపోయినట్లున్నారు. ముఖంమీద కూడా విసుగూ, నీరసమే గోచరించాయి. ఈ జరుగుతున్న తంతు — దుస్తులు, కోర్టు హాలు, పోలీసులు, న్యాయవాదులు, ఈ కుర్చీలలో కదలకుండా కూచుని ప్రశ్నలెయ్యడం, వాటికి సమాధానాలు వినడం — అంతా తమకు చాలా శ్రమతో కూడిన వ్యవహారంగా వాళ్లు భావిస్తున్నారన్న విషయం స్పష్టం.

తల్లికిదివరకు పరిచితుడైన పసుపుపచ్చని ముఖంగల ఉద్యోగస్తుడు, న్యాయమూర్తుల ఎదుట నిలబడి, బిగ్గరగా దీర్ఘాలుతీస్తూ పావెల్ అన్‌ద్రేయ్‌లను గురించి తనకు తెలిసిన విషయాలను చెపుతున్నాడు. తల్లి ఆ మాటలను వింటున్నప్పుడు,

"వాళ్లను గురించి నీకు బాగా తెలియదులే" అనుకుంది.

ఆమె కమ్మిల వెనకాల ఉన్నవాళ్లని ఏవిధమైన భయమూ లేకుండా చూసింది. వాళ్లంటే జాలి కలుగలేదు. ఆమెకు ప్రేమ, ఆశ్చర్యమూ రెండే అనుభూతులు కలిగేయి. పైకి ఎక్కువగా ప్రకటితం కాని ఆశ్చర్యం, బాధాకరమైన ప్రేమ — రెండే అనుభవంలో కొచ్చాయి. ఎదురుగా గోడకానుకుని యువకులూ, బలవంతులూ ఐన ముద్దాయిలు కూర్చున్నారు. సాక్షులూ జడ్జీలూ మాట్లాడుకునే మాటలనుగాని, న్యాయవాదులు ప్రాసెక్యూటరుతో సాగిస్తున్న వాదోపవాదాలను కాని వారేమీ పట్టించుకోవడం లేదు. అప్పుడప్పుడు మాత్రం వాళ్లలో ఒకడు పక్కనున్న మిత్రునితో, వెటకారంగా నవ్వుతూ ఏదో మాటంటున్నాడు. దానికి అంత అవహేళనగానే, పక్కవాడు కూడా అలాగే వెటకారంగా నవ్వుతున్నాడు. పావెల్, అన్ద్రేయ్ ఇద్దరూ ముద్దాయిల తరఫు న్యాయవాది చెవిలో నిర్విరామంగా గుసగుసలాడేరు. ఆ న్యాయవాదిని నికొలాయ్ ఇంట్లో తల్లి గత రాత్రి చూసింది. మిగతావాళ్లందరికన్నా ఎక్కువ ఆవేశపడుతున్న మాజిన్ వాళ్ల సంభాషణలను వింటున్నాడు. అప్పుడప్పుడు సమోయ్‌లొవ్, ఇవాన్ గూసెవ్‌తో ఏదో అనేవాడు. ఇవాన్ అతన్నొక పోటు పొడిచి, నవ్వాపుకునేందుకు ఎంతో ప్రయత్నించేవాడు. అందుచేత ముఖమంతా ఎర్రబారి బుగ్గలు పొంగేవి; తలొంచుకోవలసి వచ్చేది. రెండు సార్లు నవ్వాపుకోలేక ఫక్కున నవ్వేడు. తర్వాత శరీరాన్ని వశంలో ఉంచుకోడానికి ప్రయత్నిస్తూ ముందుకు బాగా వంగి కూర్చో వలసివచ్చింది. ముద్దాయిలంతా యువకులు. యౌవనోద్రేకం సజీవంగా మరుగులతో పొంగుతుంటే, దాన్ని అణచిపెట్టడానికి జరిగే ప్రయత్నాలను వాళ్లు ఎదుర్కొంటున్నారు.

సిజోవ్, తల్లి మోచేతిని మెల్లగా తట్టేసరికి, ఆమె అతని పక్కకు తిరిగింది. అతను చాలా సంతుష్టిగానే ఉన్నాడు కాని కొంచెం ఆదుర్దాగా ఉన్నట్టు గమనించింది.

"ఆ యువకు లెంత ధైర్యంగా ఉన్నారో చూడు!... కులీనుల్లా ఉన్నారనుకో!" అతడు తల్లి చెవిలో చెప్పేడు.

కోర్టు హాల్లో సాక్షులు గబగబా హావభావశూన్యంగా మాట్లాడుతున్నారు. జడ్జీలు ఇదంతా ఎందుకొచ్చిందిరా భగవంతుడా అన్నట్టు అనాసక్తితో వింటున్నారు. లావుపాటి జడ్జీ నోటికి కొవ్వుతో దళమెక్కిన చెయ్యి అడ్డుపెట్టుకుని ఆవులించాడు. ఎర్రమీసాల జడ్జీ ముఖం మామూలుకన్న వెలవెలబారింది. ఆయన పదేపదే, వేలితో కణతను నొక్కుకుంటూ, కళ్లు మూసుకుని పైకి సరంబీకేసి ఏదో బాధగా చూస్తుండేవాడు. ప్రాసెక్యూటరు మధ్య మధ్య కాగితంమీద గొలుక్కుంటూ, మార్షల్ ఆఫ్ ది నొబిలిటీతో విరామం లేకుండా మాట్లాడుతున్నాడు. ఆయన నెరిసిన గెడ్డాన్ని సవరించుకుంటూ చక్రాల్లాంటి కళ్లు తిప్పుతూ చిరునవ్వు నవ్వుకుంటున్నాడు. మేయర్ కాలిమీద కాలేసుకు కూచుని వేళ్లతో మోకాటి చిప్పమీద మద్దెల వాయించుకుంటూ చూస్తున్నాడు. జిల్లా పరిపాలనాధికారి ఒక్కడే బొజ్జను మోకాటి చిప్పలకు దాపెట్టి, దానికి చేతుల్తో కడియం కట్టి, నిమగ్నిత్రించే

ఈ రణగొణ ధ్వనులను వింటున్నట్లనుపించాడు. ముసలాయన కూడా అలాగే కదలకుండా గాలిలేని రోజున వాయులక్షణం తెలియజేసే కోడిబొమ్మలా నిశ్చలంగా కూచున్నాడు. ప్రేక్షకులకు విసుగు పుట్టి తల దిమ్మెక్కేటంతవరకూ, ఆ స్థితి అలాగే ఉంది. ముసలాయన లేచి,

"మేము ప్రకటించేదేమిటంటే...." అని ఏమో అన్నాడు. ఆ మాటలాయన పెదవిమీదే ఉండిపోయాయి.

అవ్‌లు, ఉవ్‌లు, దగ్గులు, కాళ్ల చప్పుళ్లు వినవచ్చాయి. ఖైదీలను బయటికి తీసుకెళ్లేరు. బంధువులను, స్నేహితులను చూసి వాళ్లు చిరునవ్వులు నవ్వేరు.

"యెగోర్! ఏమీ భయపడకు" అని ఇవాన్ గూసెవ్ కేకేశాడు.

తల్లీ, సిజోవ్ నడవాలో కెళ్లేరు.

"హోటల్ కెళ్లి ఓ కప్పు టీ తాగుదామా?" అన్నాడు సిజోవ్. "గంటన్నర వ్యవధి ఉంది మనకి."

"నాకు తాగాలని లేదు."

"నాకూ లేదు. ఆ కుర్రాళ్లను గురించి నువ్వేమనుకుంటున్నావేం? భూమిమీద వాళ్లొక్కళ్లే మనుషుల్లాగా, మిగతావాళ్లేమీ కారు అన్నట్లుగా కూచున్నారు. ఆ ఫ్యోదొర్‌ను చూశావూ?"

సమోయ్‌లొవ్ తండ్రి కూడా వాళ్లతో చేరేడు. టోపీ చేత్తో పుచ్చుకుని:

"మా గ్రిగోరియ్‌ని చూశావూ?" అని విచారంతో నవ్వుతూ అడిగేడు. "అతను ప్రతివాదమే మానేశాడు. వాళ్లతో మాట్లాడ్డానికి కూడా నిరాకరించాడు. అందరికన్న ముందు ఆ పని చేసినది మావాడే. పెలగేయా, నీ కొడుకు న్యాయవాదులు కావాలంటాడు. మావాడదేమీ పనికి రాదంటాడు. వాడి తర్వాత నలుగురు నిరాకరించారు."

అతని పక్కనే అతని భార్య నిలబడింది. ఆమె కళ్లు మిటకరించుతూ జేబురుమాలు కొనతో ముక్కు తుడుచుకుంది.

సమోయ్‌లొవ్ నేలకేసి చూస్తూ గెడ్డం పట్టుకుని మాట్లాడ్డం మొదలెట్టేడు:

"ఇదంతా తమాషాగానే ఉంది. మన కుర్రవెధవల్ని చూస్తుంటే, వీళ్లు ఇలాంటి వ్యవహారంలో చిక్కుకున్నారేమిట్రా అని జాలేస్తుంది. కాని కొంచెం ఆలోచించేసరికి వాళ్లు చేసే పనే మంచిదిగా కనబడుతుంది! ముఖ్యంగా, ఫ్యాక్టరీలో వాళ్ల సంఖ్య పెరుగుతూండడం చూస్తుంటే అలాగే అనిపిస్తోంది. పోలీసులు ఒకళ్ల వెనకాల ఒకళ్లని అరెస్టుచేస్తున్నారు. అయినప్పటికీ ఏట్లో చేపల్లాగ వాళ్ల సంఖ్య అపారంగా పెరుగుతూనే ఉంది. అందుచేతనే బలం వాళ్లపక్షాన్నే ఎక్కువగా ఉన్నట్లు తోస్తుంది."

"స్తెపాన్ పెత్రోవిచ్! ఇలాటి విషయాలను గురించి మనకు తలా తోకా తెలియదు" అన్నాడు సిజోవ్.

''అవునవును. కష్టమే'' అని సమోయ్‌లొవ్ ఏకీభవించాడు.

''బలే గట్టివెధవలు మనవాళ్లు'' అని అతని భార్య బిగ్గరగా ముక్కుతూ అంది. తర్వాత చిరునవ్వుతో విప్పారిన ముఖంతో తల్లికేసి చూసి:

''నీలొవ్నా, నామీద కోప్పడకు.... ఇంతకు ముందు నేను ఈ తప్పంతా మీవాడి దనుకునేదాన్ని. కాని తప్పెవరిదో ఆ దేవుడికే తెలియాలి. పోలీసులూ, వేగుల వాళ్లూ మా గ్రిగోరియ్‌ని గురించి ఏమి చెప్పేరో విన్నావా? ఎర్ర తలకాయ వెధవ! వాడూ చేతనైనంత పనిచేశాడు!'' అంది.

తన బాధతో నిమిత్తం లేకుండానే, ఆమె తన కొడుకు చర్యలకు గర్వపడింది. తల్లి అందుకు సంతోషపడి, చిరునవ్వు నవ్వుతూ హృదయపూర్వకంగా జవాబుచెప్పింది.

''యువ హృదయాలు ఎక్కువత్వరగా సత్యాన్ని గ్రహిస్తాయి.''

జనం వరండాలో తిరుగుతూ బృందాలుగా చేరి ఆవేశంతో మెల్లగా మాట్లాడుకున్నారు. మొత్తంమీద ఒంటరిగా ఎవడూ నిలబడలేదు. అందరూ ఏదో మాట్లాడాలనీ, ప్రశ్నలు వెయ్యాలనీ, ఇతరులు చెప్పే సంగతులు వినాలనీ ఆతురపడుతున్నారు. సన్నంగా తెల్లగా ఉన్న ఆ నడవాలో గోడల మధ్య జనం పెద్ద గాలికి విసిరేసినట్లు వెనక్కీ ముందుకూ నడు స్తూనే ఉన్నారు. తాము నిలబడడానికి వీలైన స్థలమేదైనా దొరుకుతుందా అని ఆత్రత పడుతున్నట్లగుపించారు.

బూకిన్‌లాగే పొడుగ్గా తెల్లగా ఉండే అతని అన్న, జోరుగా చేతులు ఊపుతూ ఏదో రుజావుచేయడానికి ప్రయత్నిస్తున్నాడు.

''క్లెపానొవ్, జిల్లా పరిపాలనాధికారి, అక్కడ ఉండ దగ్గ మనిషి కాడు....''

''కొన్‌స్తన్‌తీన్, నోరు మూసుకో'' అన్నాడు పొట్టిగా అర్భకంగా ఉన్న అతని తండ్రి నాలుగు మూలలా అనుమానంగా చూస్తూ.

''మూసుకోను! నిరుడు అతను తన గుమాస్తా భార్యకోసం గుమాస్తాను చంపేశాడని చెప్పుకున్నారు. ఇప్పుడు ఆమెతో ఉంటున్నాడు. దాన్నేమనాలి? పైగా అతను దొంగ అని అందరికీ తెలును....''

''నీకు పుణ్యముంటుంది ఊరుకోరా!'' అన్నాడు తండ్రి.

''నిజమే, నిజమే. ఈ విచారణ న్యాయంగా జరుగుతోందని చెప్పడానికి వీల్లేదు'' అన్నాడు సమోయ్‌లొవ్.

బూకిన్ అతని మాటలు విని దగ్గరకొచ్చాడు. ఇతరులను కూడా ముందుకు లాగేడు. అతని ముఖం ఎర్రబారింది. చేతులూపుతూ ఇలా అన్నాడు:

''హత్యానేరానికో, దొంగతనానికో అయితే, అపరాధం చేసినవారిని జ్యూరీ ఎదుట విచారణ చేస్తారు. సామాన్య ప్రజలు — రైతులు, కార్మికులు — జ్యూరీలో సభ్యులుగా ఉంటారు....

కాని ప్రజలు అధికారులకెదురు తిరిగినప్పుడు అధికారులే విచారణ జరుపడమా! దీన్నేమం టావ్? నువ్వు నన్ను అగౌరవం చేస్తే, నేనొక చెంపకాయ ఇచ్చాననుకో, అప్పుడు నువ్వే తీర్పు చెప్పాలపొస్తే, నన్ను తప్పకుండా నేరస్థుడని తీర్పు చెప్తావు. కాని ముందు ఎవరు తప్పు చేశారు? నువ్వే కదా!''

ఇంతలో నెరిసిన తల, గేలంలాంటి ముక్కూ, ఛాతీనిండా పతకాలుగల ఒక కాపలా దారు, జనాన్ని చెదరగొట్టి బూకిన్‌మీద వేలాడించాడు.

''అరవకు! ఇదేమైనా సారాదుకాణమనుకున్నావా?'' అన్నాడు.

''సరేలే. నాకు తెలుసు. అయితే నేనే నిన్ను దెబ్బకొట్టి, నేనే న్యాయాధిపతిగా ఉంటే ఏమవుతుందంటావ్?''

''నిన్నిక్కడనుంచి గెంటేస్తేనే నయమనుకుంటాను!'' అని కాపలామనిషి బెదిరించాడు.

''గెంటెయ్యాలా? ఎందుకు?''

''ఇంతగా శబ్దం చేస్తున్నందుకు. వీధిలోకి గెంటేస్తాను.''

బూకిన్ చుట్టూ ఉన్నవాళ్లకేసి చూశాడు.

''ప్రజలను నోరు మూయించడమే వాళ్లు చేయదలచుకున్న పని!'' అని మెల్లగా అన్నాడు.

''అంతే. మరేమనుకున్నావు నువ్వు?'' అన్నాడు ముసలాయన మోటుగా.

బూకిన్ భుజాలెగరేసి, బాగా మృదువుగా మాట్లాడ్డం మొదలెట్టేడు.

''విచారణ తతంగాన్ని చూడ్డానికి ప్రజలనెందుకు రానివ్వరు? బంధువులను మాత్రమే ఎందుకు రానివ్వాలి? మీరు న్యాయంగా విచారణ జరుపుతున్నట్లయితే, అందరినీ విననివ్వండి! మీకు భయం దేనికి?''

''విచారణ న్యాయంగా జరగడంలేదు. అందుకేమీ సందేహం లేదు'' అని సమోయ్‌లొవ్ బిగ్గరగా ధ్రువపరిచాడు.

విచారణ విషయంలో నికొలాయ్ చెప్పగా విన్న మాటలను తల్లి అతనితో చెప్పాలను కుంది. కాని అతను చెప్పినదంతా తనకర్థం కాలేదు. పైగా కొన్ని మాటలను మరచిపోయింది కూడా. వాటిని జ్ఞాపకంచేసుకోవాలని ముందుకు సాగింది. గోధుమవన్నె మీసంగల యువకు డొకడు తనను కనిపెట్టి చూస్తూ ఉండడం గమనించింది. అతను కుడి చేతిని లాగుజేబులో పెట్టుకున్నాడు. అందుచేత అతడి ఎడమ భుజం, కుడి చేతికన్న కిందుగా ఉన్నట్లనిపిం చింది. ఈ విశేషం ఇదివరకెక్కడో చూసినట్లనిపించింది. కాని అతను చటుక్కున వెనక్కు తిరిగేడు. ఆమె తన స్వంత ఆలోచనల్లో నిమగ్నమై, అతని సంగతి మరచిపోయింది.

ఒక నిమిషమైనాక ఎవరో ఆమెను గురించి అడగడం వినిపించింది.

''ఆమేనా?''

''అవును'' అని ఎవడో బిగ్గరగా, సంతోషంగా జవాబిచ్చాడు.

ఆమె నాల్గు మూలలా చూసింది. ఎగుడుదిగుడు భుజాలమనిషి పక్కనే నిలబడి, నల్లని గడ్డం, పొట్టికోటు, మోకాలివరకూ బూట్సు ధరించిన ఒక యువకునితో మాట్లా డుతున్నాడు.

ఆమె కలవరపడి, అతనెవడా అని జ్ఞాపకం తెచ్చుకోవేందుకు ప్రయత్నించింది. కాని తెచ్చుకోలేకపోయింది. తన కొడుకు సాగిస్తున్న పనిని గురించి జనానికి తెలియచెప్పాలనే కోరిక అపుకోలేనంతగా ఆమెకు కలిగింది. దానికి భిన్నంగా వాళ్లేమి చెపుతారో వినాలను కుంది, అందువల్ల తుది తీర్పు ఎలా ఉంటుందో నిర్ణయం చేసుకోవాలనుకుంది.

''విచారణ జరిగించడమీ విధంగానేనా?'' అంటూ సిజోవ్‌తో చెప్పడం మొదలెట్టింది. ''ఎంతసేపూ ఎవరు ఏ పని చేశారో చెప్పడంతో కాలక్షేపం చేస్తున్నారు కాని, ఎందుకు చేస్తున్నారనే విషయాన్ని తెలుసుకోవాలనుకోవడం లేదు. వాళ్లంతా ముసలివాళ్లే. యువకులను యువకులే విచారించాలి.''

''అవును. అలాగే. అలాటి విషయాలను అర్థంచేసుకోవడం మనబోటి వాళ్లకు కష్టం.... చాలా కష్టం'' అని సిజోవ్ ఆమెతో ఏకీభవించాడు. ఆలోచిస్తూ అతను తల పంకించాడు.

కాపలాదారు కోర్టు హాలు తలుపులు తెరిచాడు.

''చుట్టాలూ! మీ టిక్కెట్లు చూపించండి!'' అని కేకేశాడు.

''టిక్కెట్లట!'' అని ఎవరో వెటకారంగా వ్యాఖ్యానించాడు. ''ఇదేదో సర్కస్ అన్నట్లు!''

ప్రజల్లో అవ్యక్తమైన ఆవేశం రేగినట్లగుపడింది. ఎక్కువగా మాటల్లో పడ్డారు. ఉద్రిక్తత తగ్గింది. కాపలాదార్లతో వాదోపవాదాలు వేసుకున్నారు.

## 25

సిజోవ్ బెంచీమీద యథాస్థానంలో కూచుంటూ ఏదో గొణుక్కున్నాడు.

''ఏమిటది?'' అని తల్లి అడిగింది.

''ఏమీ విశేషం లేదు. జనం మూర్ఖులు....''

గంట మోగింది.

''నిశ్శబ్దం....''

జడ్జీలు వరసగా ప్రవేశించి ఇదివరకు మల్లేనే తమతమ స్థానాల్లో ఆసీనులయ్యేవరకు అందరూ లేచి నిలబడ్డారు. ఖైదీలు వారి స్థానాల్లోకి తీసుకు రాబడ్డారు.

''మనస్సు చిక్కబట్టుకో! ప్రాసెక్యూటరు వాదించబోతున్నాడు'' అన్నాడు సిజోవ్.

ఏదో గొప్ప భయంకరమైన సంగతి జరగబోతున్నట్లుగా తల్లి శరీరాన్నంతనీ ముందుకు వంచింది.

ప్రాసెక్యూటరు జడ్జీలకు కుడి వైపున నిలబడ్డాడు. ఒక మోచెయ్యి బల్లమీద ఆన్చి దీర్ఘంగా నిట్టూర్చి, కుడి చేతిని పైకి విసిరి ఉపన్యాసం ప్రారంభించాడు. మొదట్లో అతను చెప్పిన మాటలను తల్లి గ్రహించలేకపోయింది. అతని కంఠధ్వని బొంగురుగా, సాఫీగా కాని అసమంగా సాగింది. ఒక్కొక్కప్పుడు గబగబ నడిచేది. మరొకప్పుడు బహు నెమ్మదిగా సాగేది. కొంత సేపు మాటలు బాధాకరమైన డొక్కపోటుల్లా మెల్లగా విసుగ్గా వచ్చేవి. కొంచెం సేపట్లో చటుక్కున గబగబ దొర్లుకుంటూ, బెల్లం చుట్టూ ఈగలు ముసిరినట్లు ఝుమ్మంటూ వచ్చేవి. వాటిలో తల్లికి భయంకరమైనదేదీ కనబడలేదు. ఆ మాటలు గదంతా మంచంత చల్లగా ఆవరించి, క్రమంగా వెలుగు బూడిదెలాంటి సన్నని దుమ్ము రేగినంత అసౌకర్యంగా వ్యాపించాయి. ఆ ఉపన్యాసం ధారాళంగా సాగినా నిర్జీవంగా ఉంది. పావెల్‌నూ, అతని మిత్రులనూ అదేమీ కదలించినట్లు లేదు. వాళ్లదేమీ పట్టించుకున్నట్లే లేదు. వాళ్లు నదురూబెదురూ లేకుండా, తమలో తాము మాట్లాడుకుంటూ, నవ్వు కుంటూ కూచున్నారు.

''అతను బొంకుతున్నాడు'' అని సిజోవ్ ఆమె చెవిలో చెప్పేడు.

ఆమెకలా అనుపడలేదు. ప్రాసెక్యూటరు మినహాయింపులేమీ లేకుండా అందరిమీదా నేరారోపణ చేస్తున్నాడు. పావెల్‌ను గురించి చెప్పిన తర్వాత ఫ్యొదొర్ గురించి చెప్పేడు. తర్వాత బూకిన్ గురించి ప్రస్తావించాడు. వాళ్లందరినీ చక్కగా ఒకే సంచీలో మడతొక్కే స్తున్నట్లున్నాడు. తల్లికి అతడు చెప్పే మాటల వ్యవహారిక అర్థం సంతృప్తిని కలిగించలేదు. ఆ మాటలామెను ఆవేశపరవశురాలిని చెయ్యలేదు. భయపెట్టనూ లేదు. ఇంకా భయంకర మైన విషయమేదో వస్తుందనుకుంటూ వినడానికి సిద్ధమైంది. దాని కోసం అతని ముఖతా వచ్చే మాటలనే కాకుండా ముఖాన్ని, కళ్లను, గొంతుకను, అందంగా సౌంజ్ఞలను చేస్తున్న తెల్లని చేతినీ పరీక్షగా చూసింది. ఇంతకూ ఇక్కడేదో భయంకరమైన విషయముంది. ఆ సంగతి ఆమెకు తెలుసు. హృదయం హెచ్చరికలు చేస్తున్నప్పటికీ, ఆ ప్రమాదాన్ని గుర్తు పట్టి ఇదమిద్ధమని తేల్చలేకపోయింది.

ఆమె న్యాయాధిపతులకేసి చూసింది. ప్రాసెక్యూటరు ఉపన్యాసంతో వాళ్లకు విసుగెత్తింది. నిర్జీవంగా పసుప్పచ్చగా ఉన్న వాళ్ల ముఖాల్లో ఏ భావమూ ద్యోతకమవడం లేదు. ప్రాసెక్యూటరు చెప్పిన మాటలు, కంటికి కనుపడని పొగమంచులాగ జడ్జీల నావరిం చాయి. వారిని విసుగు, నిర్లక్ష్యం ఆవహించాయి. ప్రధాన న్యాయమూర్తి నడుం వంచ కుండా, కొయ్యబారినట్టు కూచున్నాడు. కళ్లద్దాలవెనుక ఉండే గౌరవర్ణపు కనుపాపలు తరుచుగా అతని వెడద ముఖంలో ఏమ్యమైపోయేవి.

తల్లి వారి లక్ష్య శూన్యతనూ, భావ శూన్యమైన నిర్లిప్తతనూ చూసి, "వీళ్లు నిజంగా విచారణ చేస్తున్నారా?" అని తనను తానే ప్రశ్నించుకుంది.

ఆ ప్రశ్న ఆమె హృదయాన్ని కుంచింపజేసింది. క్రమక్రమంగా హృదయంలో ఉండే భయాన్ని పైకి పిండేసింది. హృదయంలో మిగిలినది గాయపు అనుభూతి మాత్రమే.

ప్రాసెక్యూటరు ఉపన్యాసం అనుకున్న దానికన్న ముందుగా చటుక్కున ముగిసింది. ఏవో కొన్ని నగిషీ మాటలతో ఉపన్యాసాన్ని ముగించి, జడ్జీలకు వంగి నమస్కారం చేసి చేతులు నలుపుకుంటూ కూచున్నాడు. మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ, అతనికేసి చూచి తలూపేడు. మేయర్ చెయ్యి చాచాడు. జిల్లా పరిపాలనాధికారి తన బొజ్జకేసి తేరిపారజూసుకుని చిరునవ్వు నవ్వేడు.

జడ్జీలు అతడి ఉపన్యాసంతో తృప్తిపడినట్లు కనుపించలేదు. వాళ్లలో ఏమీ చలనం కలుగలేదు. ముసలి జడ్జీ ఒక కాగితాన్ని ముఖాని కడ్డు పెట్టుకుని,

"ఇప్పుడింక కోర్టువారు, ముద్దాయిలైన ఫెదొసేయెవ్, మార్కొవ్, జగారొవ్‌ల తరఫున న్యాయవాది వాదాన్ని వింటారు" అన్నాడు.

తల్లి, నికొలాయ్ ఇంట్లో చూచిన న్యాయవాది లేచి నిలబడ్డాడు. అతడి విశాలమైన ముఖం చూడడానికి చాలా ఇంపుగా ఉంది. ఎర్రటి కనుబొమల్లోంచి చిన్న కళ్లు తళుక్కుమంటూ గాలిని కత్తిరించుతూన్న కత్తెర తాలూకు రెండు దారుల్లా దూసుకొచ్చినట్లున్నాయి. అతడు బిగ్గరగా, స్పష్టంగా నిదానంగా మాట్లాడేడు. తల్లి అతని ఉపన్యాసాన్ని అర్థం చేసుకోలేకపోయింది.

"అర్థమైందా అతనేమి చెప్పేడో?" అని సిజోవ్ ఆమె చెవిలో గొణిగాడు. "అర్థమైందా? ఖైదీలు మతి తప్పినవారని చెప్పేడు. మా ఫ్యొదొర్ మతితప్పినవాడా?"

ఆమె మనస్తాపంచేత జవాబుచెప్పలేకపోయింది. హృదయానికి తగిలిన గాయం పెద్దదై భారాన్ని హెచ్చించింది. న్యాయం జరుగుతుందని తాను ఆశించినట్లామెకు స్పష్టమైంది. తన కొడుకుమీద చేయబడిన నేరారోపణలను, నిష్పక్షపాతంతోనూ నిజాయితీతోనూ తూకం వేస్తారనుకుంది. జడ్జీలు అతనిని చాలా సేపు జాగ్రత్తగా ప్రశ్నలు వేసి, అతని అంతర్యమేమిటో తెలుసుకుంటారనుకుంది. అతడి ఆలోచనలనూ, చేతలనూ చాలా సూక్ష్మదృష్టితో పరిశీలిస్తారనుకుంది. వాళ్లు నిజాన్ని తెలుసుకోవడంతోనే, న్యాయంగా:

"ఇతడు చెప్పినది సరియైనదే!" అని ఎలుగెత్తి చాటుతారనుకుంది.

కాని అలాటిదేమీ జరుగలేదు. విచారింపబడే ఖైదీలకూ, విచారించే జడ్జీలకూ మధ్య, చెప్పడానికి వీలులేనంత దూరమున్నట్లు ఆమెకు గోచరించింది. ఖైదీలకు ఈ జడ్జీలవల్ల ఏమీ ప్రయోజనం ఉండదని కూడా స్పష్టమవుతోంది. అలసటచేత తల్లికి

వినుగుపుట్టి, విచారణయందు ఆసక్తి పోయింది. తర్వాత జరిగిన సంగతుల నామె వినిపించుకోనే లేదు.

"దీని నొక విచారణంటారా?" అని అసమ్మతిగా తనకు తానే ప్రశ్న వేసుకుంది.

"బాగా ఇచ్చుకో!" సిజోవ్ సమ్మతిసూచకంగా గొణిగాడు.

ఇంతలో మరొక న్యాయవాది లేచి మాట్లాడడం మొదలెట్టేడు. అతడు పొట్టిగా ఉన్నాడు. ముఖం తెల్లగా చురుకుగా వెటకారంగా ఉంది. జడ్జీలు అతడు మాట్లాడుతుంటే తరుచుగా మాటకడ్డం తగుల్తూ వచ్చారు.

ప్రాసెక్యూటరు గభాలున కోపంతో గంతేసి లేచాడు. విచారణ జరుగ వలసిన క్రమాన్ని గురించి ఏమిటో చెప్పేడు. దానికి ముసలాయన సన్నసన్నంగా అతడిని మందలించాడు. ముద్దాయిల తరపు న్యాయవాది గౌరవపురస్సరంగా తలొంచి విన్నాడు. తర్వాత అతను తన ఉపన్యాసాన్ని సాగించాడు.

"దాని మూలంలో కెళ్లి చెప్పు" అన్నాడు సిజోవ్.

ప్రేక్షకులలో ఆవేశ మెక్కువై తీవ్రరూపం దాల్చింది. న్యాయవాది చేసిన నిశితమైన ఆరోపణలతో దళసరి చర్మంగల జడ్జీలు కూడా అదిరిపోయారు. పోట్లు పొడుస్తున్నట్లున్న అతని వాగ్ధోరణికి తట్టుకోలేక జడ్జీలందరూ కట్టకట్టుకున్నట్లుండి ధుమధుమలాడుతూ చిరచిరలాడేరు.

ఇంతట్లో పావెల్ లేచి నిలబడ్డాడు. కోర్టు హాలంతా నిశ్శబ్దమైంది. తల్లి బాగా ముందుకు నడుము వాల్చింది. పావెల్ ప్రశాంతంగా మాట్లాడేడు.

"పార్టీ మెంబరుగా నేను నా పార్టీవారి తీర్పునే గుర్తిస్తాను. కనుక నా కేసువరంగా నేనేమీ చెప్ప దలచుకోలేదు. కాని నావలెనే వాదించడానికి నిరాకరించిన మిత్రుల కోరికపైన, మీరు అర్థంచేసుకోని కొన్ని విషయాలను మీకు తెలియచెప్పడానికి ప్రయత్నిస్తాను. సోషల్-డెమోక్రటిక్ పార్టీ పతాకం ఆధ్వర్యాన మేము జరిపిన ప్రదర్శన ప్రభుత్వాధికారంమీద తిరుగుబాటని ప్రాసెక్యూటర్ అన్నాడు. జారును కూలదోసేందుకు ప్రయత్నించే వాళ్లమగానే ఆయనెప్పుడూ మమ్మల్ని పరిగణించాడు. నిరంకుశ ప్రభుత్వమొక్కటే మాత్రమే మన దేశాన్ని బంధిస్తున్న గొలుసని మా అభిప్రాయం కాదని ఇందుమూలంగా స్పష్టీకరిస్తున్నాను. అది మొదటి బంధనం మాత్రమే. ప్రజలను ఆ సంకెళ్లనుంచి తప్పించడం మా విధియని భావిస్తున్నాం."

పావెల్ గంభీరంగా మాట్లాడుతుంటే నిశ్శబ్దం మరింత ప్రగాఢమైంది. హాలు పెద్దదైనట్లనిపించింది. పావెల్‌ను పైకెత్తి ఉన్నతాసనంమీద కూర్చోపెట్టినట్లనిపించింది.

జడ్జీలు కలవరపాటుతో తమ కుర్చీల్లో అటూ ఇటూ కదిలేరు. మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ సానుభూతి రహితమైన జడ్జీ చెవిలో ఏదో గుసగుసలాడేడు. అతడు తలూపుతూ మున

లాయన కుడిచెవిలో గుసగుసలాడేడు. అస్వస్థుడుగా వున్న జడ్జీ ముసలాయన ఎడమ చెవిలో ఏదో చెప్పేడు. ఇద్దరిమధ్యా నలుగుతున్న ముసలాయన, ఏదో బిగ్గరగా అన్నాడు. కాని విశాలంగా తాపీగా నిండు ప్రవాహంలా గంభీరంగా సాగిన పావెల్ ఉపన్యాసంలో ఆయన మాటలు ఏవ్యమైపోయాయి.

''మేము సోషలిస్టులం, అంటే సొంత ఆస్తి సంపాదనకు వ్యతిరేకులం. సొంత ఆస్తి వ్యవస్థవల్ల సంఘం విచ్ఛిన్నమవుతుంది. ప్రజలు ఒకరితో ఒకరు కలహిస్తారు.... వ్యక్తిగత మైన లాభంకోసం, జనం ఒకరితో ఒకరు కలవకుండా విరోధపడుతూ ఉంటారు. ఈ శత్రు వైరుధ్యాన్ని కప్పిపుచ్చడానికీ, సమర్థించడానికీ అబద్ధాలాడతారు. సొంత ఆస్తి జనాన్ని అబద్ధాలాడిస్తుంది. అవినీతిపరులను చేస్తుంది. దగా చేయిస్తుంది. ద్వేషాన్ని పెంచు తుంది. ఏ సంఘమైతే, వ్యక్తిని కేవలం కొద్దిమందిని ధనవంతులను చేసే సాధనంగా మాత్రమే భావిస్తుందో, ఆ సంఘం అమానుషమైనదనీ, మా ప్రయోజనాలకు భంగకర మైనదనీ మా విశ్వాసం. అలాటి సంఘం చెప్పే నీతులు శుద్ధ అబద్ధాలనీ, మోస పూరిత ములనీ భావిస్తూ వాటిని మేము తిరస్కరిస్తున్నాం. వ్యక్తిపట్ల ఈ సంఘం వ్యక్త పరచే విద్వేషాన్నీ, దౌష్ట్యాన్నీ మేము ఖండిస్తున్నాం. ఈ సంఘం, వ్యక్తులను దాస్య శృంఖలాలతో బంధించడానికి చేసే సకలప్రయత్నాలనూ మేము ఎదుర్కొంటాం. స్వార్థపరమైన ఆశకోసం మానవులను అణగదొక్కడానికి చేసే పనులను ప్రతిఘటిస్తాం. మేము కార్మికులం. అనగా ఎవరి కాయకష్టంచేత, పిల్లల ఆటవస్తువులు మొదలు పెద్ద పెద్ద భారీ యంత్రాలవరకూ తయారవుతున్నాయో, ఆ కార్మికులం. అయినప్పటికీ మా మానవ ఔన్నత్యాన్ని సంరక్షిం చుకునే హక్కు మాకు లేకుండా చెయ్యబడింది. తమ స్వార్థంకోసం ఎవరైనా మమ్మల్ని ఉపయోగించుకో గలుగుతున్నారు. ప్రస్తుతానికి కొంత స్వేచ్ఛను సంపాదించుకోవా లనుకుం టున్నాం. ఆ స్వేచ్ఛద్వారా, యావత్తు అధికారాన్నీ మా కైవసం చేసుకోవా లనుకుంటున్నాం. మా నినాదాలు చాలా సరళమైనవి. 'సొంత ఆస్తి నశించుగాక!' 'ఉత్పత్తి సాధనాలన్నీ ప్రజల చేతుల్లోకి రావాలి!', 'రాజకీయ అధికారమంతా ప్రజల చేతుల్లోకి రావాలి!', 'అందరూ పనిచేసితీరాలి!' ఈ నినాదాలవల్ల మేము కేవలం తిరుగుబాటుదారులం కామని మీరు తెలుసు కోగలరు!''

పావెల్ ఒక చిన్న నవ్వు నవ్వేడు. నెమ్మదిగా వేళ్లతో జుట్టు సవరించుకున్నాడు. అతని నీలి కళ్లలో వెలుగు ఎన్నడూ లేనంతగా ప్రకాశించింది.

''అసలు విషయానికి పరిమితం కమ్మని చెప్తున్నాను'' అని ముసలాయన బిగ్గరగా, విస్ప ష్టంగా హెచ్చరించాడు. ఆయన పావెల్‌కేసి ముఖం తిప్పేడు. అతడి ఎడమ కంట్లోంచి దురాశాపూరితమైన, దుష్టమైన వెలుగు తళ్లుకగుపడింది. జడ్జీలందరూ తన కొడుకు ముఖంకేసి దృష్టులు సారించారు. ఆ దృష్టులతో, అతని శక్తినంతా చూరగొని, అతని

రక్తాన్ని పీల్చి, తమ శుష్క శరీరాలకు పుష్టికలిగించుకుంటున్నట్లనిపించింది. కాని అతను పొడుగ్గా నిటారుగ్గా, బలంగా, ధైర్యంగా అలాగే నిలబడి చెయ్యి పైకెత్తి చెప్పేడు:

"మేము విప్లవకారులం. ఎంతకాలమైతే, కొందరు ఏ పనిపాటులూ తాము చేయకుండా ఇతరులను ఆజ్ఞాపిస్తూ ఉంటారో, మరికొందరు పనిచేయడం తప్ప ఇంకేమీ చేయకుండా ఉంటారో, అంతకాలం వరకూ మేము విప్లవకారులుగానే ఉంటాం. జడ్జీలైన మీరు ఏ సంఘంయొక్క క్షేమలాభాలను సంరక్షించడానికి ఆజ్ఞాబద్ధులై ఉన్నారో, ఆ సంఘానికి మేము బద్ధ విరోధులం. ఆ సంఘానికీ మీకూ కూడా మేము విరోధులం. మా పోరాటంలో మేము విజయాన్ని సాధించే వరకూ మనకు ఏవిధమైన రాజీ సాధ్యంకాదు. కార్మికులమైన మేము జయించి తీరుతాం! మీ అధికారులు తామనుకునేటంత బలవంతులు కారు. దేన్ని పోగుచేసుకుని రక్షించుకోవడంకోసం తమ అధీనంలో ఉన్న లక్షలాది జీవుల ప్రాణాలను వారు ఆహుతి చేస్తున్నారో, ఏదైతే మాపై అధికారం చలాయించే శక్తిని వారికిస్తున్నదో, ఆ సొంత ఆస్తే, వాళ్లలో వాళ్లకు సంఘర్షణ కారణమవుతుంది. దాని మూలంగానే వారు శారీరకంగానూ నైతికంగానూ కూడా నాశనమవుతారు. సొంత ఆస్తిని సంరక్షించుకోవడం చాలా ఖర్చుతో కూడిన వ్యవహారం. నిజానికి మా యజమానులైన మీరంతా, మాకన్న కూడా ఎక్కువ బానిసల వంటి వాళ్లు. మేము శారీరకంగానే బానిసలం. మీరు మానసికంగా బానిసలు. అలవాట్లు, దురభిప్రాయాలు అనే కాడిని మీ మెడమీదనుంచి మీరు తొలగించలేకుండా ఉన్నారు. ఆ కాడే మిమ్మల్ని మానసికంగా చంపేసింది. మానసికమైన స్వేచ్ఛ ననుభవించ డానికి మా కడ్డేమీ లేదు. మీరు మాచేత తినిపించే విషాలు మీరు ఇష్టంలేకపోయినా మా తలకెక్కించే విరుగుళ్లకన్న బలహీనమైనవి. సత్యాన్ని గురించి మా విజ్ఞానం రోజుకు రోజూ పెరుగుతోంది. మానసికమైన పవిత్రతగల వాళ్లందరినీ, మీ వర్గాల్లోనుంచి కూడా ఉత్తములైన వారిని – ఈ సత్యం ఆకర్షిస్తోంది. కొంచెం పరిశీలించండి. మీ వర్గంయొక్క భావాలను సమర్థించగలవాడెవ్వడూ మీలో ఇప్పటికే లేడు. చారిత్రక న్యాయంయొక్క వత్తిడినుండి మీరు అణిగిపోకుండా రక్షించుకోగల వాదనాసమర్థత మీలో ఏన్నమైపోయింది. మీరు నూతన భావాలను సృష్టించలేకపోతున్నారు. మానసికంగా మీరు పట్టిపోయారు. మా భావాలు పెరుగుతున్నాయి, బలాన్ని పుంజుకుంటున్నాయి, సామాన్య జనాన్ని ఉత్తేజపరచి వాళ్లను స్వాతంత్ర్య పోరాటానికి సమీకరిస్తున్నాయి. కార్మికవర్గం తను వహించ వలసిన పాత్రను గుర్తించిన కారణంచేత ప్రపంచ కార్మికులందరూ ఒక మహాశక్తిగా ఏక మైపోతున్నారు. ప్రపంచానికి వాళ్లు తెస్తున్న పునరుజ్జీవనాన్ని ఆపడానికి క్రౌర్యమూ, పరిహాసమూ తప్ప మీదగ్గర మరే సాధనమూ లేదు. అపహాసం స్పష్టంగానే కనబడుతోంది. క్రౌర్యం మరింత రేచ్చెడుతుంది. ఈనాడు మా కుత్తుకలమీద వెయ్యబడిన చేతులే రేపు మమ్మల్ని సోదర భావంతో కౌగలించుకుంటాయి. మీ శక్తి బంగారాన్ని పెంచే యాంత్రిక

శక్తి మాత్రమే. ఆ శక్తే మిమ్మల్ని పరస్పరం గుటకాయస్వాహా చేసుకోవలసిన మితాలుగా చీలుస్తుంది. శ్రమజీవులందరి సౌభ్రాతృత్వం పట్ల రోజుకు రోజూ ప్రవృద్ధమవుతూన్న సజీవమైన మా చైతన్యంలోనే మా శక్తి యిమిడి ఉంది. మీరు చేస్తున్నదంతా అపరాధం. ఏమంటే, అది ప్రజలను బానిసలుగా చేస్తుంది. మీ అబద్ధాలు, మీ దురాశ, మీ దుర్మార్గం ప్రజలను భయపెట్టే పిశాచాలూ రాక్షసులూ ఉండే ప్రపంచాన్ని సృష్టించాయి. ఈ రాక్షసుల బారినుండి జనాన్ని తప్పించడం మా వంతు. మీరు మానవుడిని జీవితాన్నుంచి విడదీసి నాశనంచేశారు. మీరు నాశనంచేసిన ప్రపంచాన్ని సోషలిజం చేపట్టి, దాన్నొక మహత్తరమైన ఏక ప్రపంచంగా పునర్నిర్మాణం చేస్తుంది. దాని నాపడానికి మీరేమీ చెయ్యలేరు!''

పావెల్ ఒక్క క్షణమాగి మెల్లగానే అయినా, దృఢ స్వరంతో ఆ మాటే మళ్లీ ఉద్ఘాటించాడు.

''దాని నాపడానికి మీరేమీ చెయ్యలేరు!''

జడ్జీలందరూ కలిసి గుసగుసలాడేరు. పావెల్‌నుండి తమ దుర్వీక్షణాలు మళ్లించకుండా వికారమైన ముఖభంగిమలు పెట్టారు. పావెల్ ఆరోగ్యానికీ, బలానికీ, తాజాతనానికీ వాళ్ల ఈర్ష్యచెంది, తమ దృష్టులతో అతని శరీరాన్ని కలుషితం చేస్తున్నారేమోనని తల్లి అనుకుంది. ఖైదీలు తమ కామ్రేడ్ ఉపన్యాసాన్ని అతిశ్రద్ధగా విన్నారు. వారి ముఖాలు వెల్లబారేయి. కళ్లు సంతోషంతో మిలమిలలాడేయి. తల్లి అతని మాటలను ఆసక్తితో ఆస్వాదించింది. అవి ఆమె మనసులో బాగా హత్తుకుపోయాయి. చాలా సార్లు ముసలాయన పావెల్ మాట కడ్డుతగిలేడు. ఏదో విషయాన్ని స్పష్టీకరించడానికి ప్రయత్నించాడు. ఒక సారి విచారంగా చిరునవ్వు కూడా నవ్వేడు. ప్రతి సారీ పావెల్ ఆగి, మరల శాంతంగా, దృఢంగా, ప్రజలు ఎక్కువ శ్రద్ధాసక్తులతో వినేట్లుగా ఉపన్యసించాడు. జడ్జీల యిచ్ఛను తన యిచ్ఛకు లోబరచి ఉంచాడు. కాని చివరకు ముసలాయన అరిచి, తన చేతిని చాచాడు. అప్పుడు పావెల్ కంఠస్వరం వ్యంగ్య ధోరణిలో పడింది.

''నేను దాదాపు ముగింపు కొచ్చాను. మిమ్మల్ని నేను వ్యక్తిగతంగా అగౌరవపరచదలచుకోలేదు. పైగా, విచారణ పేరిట మీరు జరిపే ఈ తమాషాను — నా కిష్టంలేక పోయినా — ఇక్కడ కూర్చుని చూస్తుంటే, మీ యెడల నాకు సానుభూతి కూడా కలిగింది. ఇంతకీ, మీరూ మానవులే. మానవులైనవాళ్లు, మా లక్ష్యానికి వ్యతిరేకులైనవారైనా, ఇంత సిగ్గుశరాలు లేకుండా, మానవ ప్రతిష్ఠకు భంగకరంగా, పశు శక్తికి గులాములు కావడం చూస్తుంటే రోత అనిపిస్తోంది....''

జడ్జీలకేసి చూడకుండానే, పావెల్ కూచున్నాడు. తల్లి ఊపిరి ఉగ్గపట్టుకుని వాళ్లను పరిశీలనగా చూసింది.

పావెల్ చేతిని గట్టిగా నొక్కుతుంటే, అన్‌[్రదేయ్ ముఖం ఎంతో వికసించింది. సమోయ్‌లొవ్, మాజిన్ మొదలైనవారందరూ అతడికేసి వంగేసరికి పావెల్ చిరునవ్వు నవ్వేడు. వాళ్ళ ప్రశంసలు అతనికి కొంచెం బిడియం కలిగించాయి. అతను తల్లికేసి దృష్టి సారించి "నీకు తృప్తిగా ఉందా?" అని అడిగినట్లుగా తలూపేడు.

సంతోషపూర్వకమైన నిట్టూర్పుతో ఆమె జవాబుచెప్పింది. ఆమె ముఖం నులి వెచ్చని ప్రేమతో వికసించింది.

"ఇప్పుడు నిజమైన విచారణ ప్రారంభమయింది! అతను దెబ్బ తెగేసినట్లు చెప్పేడు. ఏమంటావ్?" అని సిజోవ్ ఆమె చెవిలో అన్నాడు.

ఆమె నోటితో జవాబుచెప్పకుండానే తలూపింది. తన కొడుకంత ధైర్యంగా చెప్పినందుకు చాలా సంతోషించింది. బహుశా అతడు ముగించినందుకు ఆమెకు మరింత సంతోషం కలిగి ఉండవచ్చు. కాని ఒకే ప్రశ్న ఆమె మనసులో అడ్డం మొదలెట్టింది: "వాళ్ళిప్పుడేం చేస్తారు?"

## 26

తనకు తెలియని విషయాలేమీ తన కొడుకు చెప్పలేదు. అతని భావాలు ఆమెకేమీ కొత్త కాదు. కాని కోర్టు సముఖాన ప్రప్రథమంగా ఆమెకొక విచిత్రమైన ఆకర్షణ కలిగింది. పావెల్ ప్రశాంతత ఆమెకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. అతని ఉపన్యాసం, అతను పూనుకున్న కార్యంలోనూ దాని అంతిమ విజయంలోనూ అతనికుండే విశ్వాసానికి చిహ్నంగా తేజోవంతమైన నక్షత్రంలా తోచింది. జడ్జీలు ఇప్పుడతనితో తీవ్రమైన వాగ్వివాదానికి పూనుకుంటారనీ, అతను చెప్పిన మాటలను కోపంతో ఖండిస్తారనీ, వాళ్ల నిశ్చితాభిప్రాయాలను తెలియపరుస్తారనీ ఆమె ఊహించుకుంది. కాని ఇంతలో అన్‌ద్రేయ్ లేచి ముందుకు వంగి కనుబొమల కిందనుంచి జడ్జీలకేసి దృష్టి సారించి,

"గౌరవనీయులైన ప్రతివాదులారా!" అన్నాడు.

అస్పష్టంగా ఉన్న జడ్జీ బిగ్గరగా కోపభరితమైన గొంతుకతో,

"మీరు జడ్జీలను సంబోధిస్తున్నారు, కాని ప్రతివాదులను కాదు" అన్నాడు. తల్లికి అన్‌ద్రేయ్ ముఖంలో ఏదో టక్కరితనం కనబడింది. అతని మీసాలు అదిరాయి. అతని కళ్లలో, ఆమెకు పరిచితమైన జిత్తులమారి చూపగుపడింది. అతను తన పొడుగాటి చేతుల్తో గట్టిగా తల రుద్దుకుని, నిట్టూర్పు విడిచాడు.

"అలాగా?... మీరు నాకు జడ్జీలుగా కనపడ్డం లేదు. మీరు ప్రతివాదులుగా మాత్రమే కనబడుతున్నారు" అన్నాడు తలూపుతూ అన్‌ద్రేయ్.

''విషయాన్ని గురించి మాట్లాడాలి!'' ముసలి జడ్జీ కరుగ్గా చెప్పేడు.

''విషయాన్ని గురించా? బాగానే ఉంది. మంచిదే. మీరు నిజంగానే న్యాయమూర్తులనీ, గౌరవనీయులనీ, స్వతంత్రులనీ నేను నమ్మేనే అనుకుందాం....''

''కోర్టువారికి మీ శిఫార్సు అక్కర్లేదు!''

''అలాగా? అయినప్పటికీ చెప్తాను. కనుక, మీరు నిష్పక్షపాతులైనవారనీ, ద్వేషరహితులనీ, 'మీది,' 'నాది' అనే భేదం లేనివారనే అనుకుందాం. ఇద్దరు మనుషులు మీ ఎదుట నిల బడ్డారు. ఒకడు, రెండోవాడు తనను పచ్చడి కింద కొట్టి, సొత్తును దొంగిలించాడంటున్నాడు. రెండోవాడు, తన చేతుల్లో కొరడా ఉంది కనక జనాన్ని పచ్చడి కింద కొట్టి సొత్తును అపహ రించే హక్కు తనకుందంటున్నాడు....''

''అసలు విషయాన్ని గురించి చెప్పడానికి మీకేమీ లేదా?'' అని ముసలాయన బిగ్గరగా అడిగేడు. ఆయన చెయ్యి వణుకుతోంది. ఆయనకు అంత కోపం వచ్చినందుకు తల్లి సంతో షించింది. కాని అన్‌ద్రేయ్ నడవడి ఆమెకు నచ్చలేదు. తన కొడుకు ఉపన్యాసానికది అనుగు ణంగా లేదు. వాళ్ల వాదనలు గంభీరంగానూ హుందాగానూ ఉండాలని ఆమె కోరిక.

హొహోల్ మాట్లాడ్డానికి ముందు నిశ్శబ్దంగా ముసలాయనకేసి చూశాడు. నుదురును తుడుచుకుంటూ నిదానంతో ఇలా అన్నాడు:

''విషయాన్ని సూటిగా చెప్పాలా?... మీతో నేను విషయాన్ని సూటిగా ఎందుకు చెప్పాలి? ప్రస్తుతానికి మీరు తెలుసుకోవలసిన విషయాన్నంతటినీ నా కామ్రేడ్ అప్పుడే చెప్పనే చెప్పేడు. సమయమొచ్చినప్పుడు మిగిలిన విషయాలను ఇతరులు చెప్తారు.''

ముసలాయన కుర్చీలోంచి కొద్దిగా లేచి, ''కూర్చోండి! తర్వాత గ్రిగోరియ్ సమోయ్ లొవ్!'' అని బిగ్గరగా అరిచాడు.

హొహోల్ పెదవులు బిగించి తాపీగా కూచున్నాడు. సమోయ్‌లొవ్ లేచి, తన ఉంగరాల జుట్టును విదిలించుకుని, అతని పక్కనే నిలబడ్డాడు.

''ప్రాసెక్యూటరు నా మిత్రులను ఆటవికులనీ, నాగరికతకు శత్రువులనీ అన్నాడు....''

''మీ విచారణకు సంబంధించని సంగతులను చెప్పకండి!''

''ఇది దానికి సంబంధించినదే. నిజాయితీపరులైన జనానికి సంబంధంలేని విషయముం డదు. దయచేసి నా మాట కడ్డుతగులకండి. మీరు దేన్ని నాగరికతంటారో తెలుసుకోవా లనుకుంటున్నాను?''

''మేమిక్కడ మీతో చర్చించడానికి కాదు వున్నది! పెడదారులు తొక్కొద్దు!'' అన్నాడు ముసలాయన తన కింది వరుస పళ్లు ప్రదర్శించుతూ.

అన్‌ద్రేయ్ ప్రవర్తన జడ్జీల వైఖరిలో మార్పును తెచ్చింది. పై చర్మాన్ని ఒలిచేసిన ట్లయింది. వాళ్ల వెల్లముఖాలు పొంగేయి. కళ్లలో ఆకుపచ్చని విస్ఫులింగాలు మెరిశాయి. పావెల్

ఉపన్యాసం వాళ్లను కలవరపరచి నొప్పించింది. కాని ఆ మాటల్లో ఉండే శక్తిచేత వాళ్ల తన్ని గౌరవించక తప్పలేదు. అందుచేత పైకి గుంభితంగా ఉండవలసొచ్చింది. పోపోల్ ఆ గుంభనలోని పొరను ఒలిచేసి లోపలున్న వాస్తవికతను బయటపెట్టేశాడు. వాళ్లలో వాళ్ళు గుసగుసలాడేరు. వాళ్ల శక్తికి మించి సౌంజ్ఞలు చేసుకున్నారు, వికారంగా చూసుకున్నారు.

"మీరు గూఢచారులను తర్ఫీదుచేస్తారు. ఆడవాళ్లను, పిల్లలను అవినీతిపరులనుగా చేస్తారు. మనుషులను దొంగలుగానూ, హంతకులుగానూ మారుస్తారు. మత్తు పదార్థాలతోనూ, అంతర్జాతీయ యుద్ధాలతోనూ, అబద్ధాలతోనూ, వ్యభిచారంతోనూ, పశుత్వంతోనూ వాళ్లకు విషమెక్కిస్తారు. ఇదే మీ నాగరికత! అలాటి నాగరికతకు మేము శత్రువులం!"

"ఇదిగో చెప్తున్నాను...." అని ముసలాయన హుంకరించాడు. సమోయ్‌లొవ్ ముఖం ఎర్రబారింది. కళ్లు తేజోపూరితమయాయి. అతను కూడా తిరిగి హుంకరించాడు:

"మీరెవరిని జైళ్లలో పారేసి మగ్గపెడుతున్నారో, పిచ్చివాళ్లనుగా చేసేస్తున్నారో, వాళ్లు రూపొందిస్తున్న నాగరికతను మేము గౌరవిస్తాం. దాన్ని అమూల్యమైనదిగా భావిస్తున్నాం...."

"కూర్చోండి! తర్వాత – ఫ్యోదొర్ మాజిన్."

చిన్నవాడైన ఫ్యోదొర్ చటుక్కున లేచి నిటాగ్గా కత్తిలా నిలబడ్డాడు.

"నేనెల్లప్పుడూ ఇలాగే పనిచేస్తూ ఉంటానని దేవుని సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను" అని దీర్ఘంగా ఊపిరి పీల్చుకున్నాడు. కళ్లు తప్ప మరేమీ కనబడనంతగా ముఖం వెల్లబారింది. "మీరిదివరకే నాకు శిక్ష విధించారని నేనెరుగుదును. కాని మీరు నన్ను ఎక్కడికి పంపినా తప్పించుకు పారిపోతాననీ, ఎల్లకాలం, జీవితాంతం వరకూ పనిచేస్తూనే ఉంటాననీ దేవుని సమక్షంలో ప్రమాణం చేస్తున్నాను." అతను ప్రమాణం చేస్తున్నట్లు చెయ్యి పైకెత్తి, "నేను ప్రమాణం చేస్తున్నాను" అన్నాడు.

సిజోవ్ బిగ్గరగా మూలిగి తన స్థానంలోంచి కదిలేడు. ఉవ్వెత్తున పొంగుతూన్న ఉద్రేక తరంగంపై ఓలలాడుతూన్న ప్రేక్షకులు ప్రమాదసూచకంగా గొణగొణలాడేరు. ఒక స్త్రీ ఎక్కెక్కి ఏడ్చింది. మరొకళ్లకు దగ్గుతెర వచ్చింది. పోలీసులు ఖైదీలకేసి విస్తుపోయి చూశారు. జనంకేసి కోపంతో చురచుర చూశారు. జడ్జీలు ముందుకూ వెనక్కూ ఊగిసలాడేరు.

"తర్వాత – ఇవాన్ గూసెవ్!" అని కేకేశాడు ముసలాయన.

"నేనేమీ చెప్పదలచుకోలేదు."

"తర్వాత – వసీలియ్ గూసెవ్!"

"నేనూ ఏమీ చెప్పదలచుకోలేదు!"

"ఫ్యోదొర్ బూకిన్!"

పాలినట్టుండే బూకిన్ భారంగా లేచి, తల ఆడిస్తూ చెప్పడం మొదలెట్టేడు:

''మిమ్మల్ని చూసుకుని మీరే సిగ్గుపడాలి. నేను విషయాలను తెలుసుకోవడంలో కొంచెం మందకొడివాడినే. కాని నేను కూడా న్యాయం ఏదో చూడగలుగుతున్నాను.'' అతను చేతిని తలమీద కెత్తి, దూరంగా ఉన్నదాన్ని దేన్నో చూస్తున్నట్లుగా కళ్ళు సగం మూసుకుని మౌనం దాల్చేడు.

మునలాయన ఆశ్చర్యపడ్డాడు. చిరాకుపడ్డాడు. కుర్చీ వెనక్కి వాలి,

''ఏమిటది?'' అని అరిచాడు.

''పోవయ్యా! పో!''

బూకిన్ నిశ్శబ్దంగా కూచున్నాడు. అతడి మాటల్లో ఏదో నిష్కపటమైన గొప్ప విశేషముంది. అందరూ దాని అనుభూతిని పొందేరు. జడ్జీలు కూడా చెవులు నిక్కపొడుచుకు విన్నారు. బూకిన్ చెప్పిన మాటలకన్న విపులమైన సంగతులు ప్రతిధ్వనిస్తాయా అన్నట్లు విన్నారు. హాలంతా గడ్డకట్టుకుపోయినట్లు నిశ్శబ్దమైపోయింది. అప్పుడప్పుడు ఏడుస్తున్న చిన్నెలు మాత్రం వినబడ్డాయి. చివరకు ప్రాసెక్యూటరు భుజాలెగరేసి చిన్నవవ్వు నవ్వేడు. మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ దగ్గేడు. జనం గుసగుసలు మొదలెట్టేరు.

''జడ్జీలు మాట్లాడుతారా?'' అని సిజోవ్‌ని తల్లి మెల్లగా అడిగింది.

''అంతా అయిపోయింది. శిక్ష చెప్పడమే తరువాయి'' అన్నాడు.

''అంతా?''

''అంతా అయిపోయిది.''

ఆ మాటనామె నమ్మలేకపోయింది.

సమోయ్‌లొవ్ తల్లి బెంచిమీద గిలగిలలాడి భుజంతోటీ, మోచేత్తోటీ పెలగేయా నీలొవ్నాను పొడిచింది.

''ఏమంటావ్? అంతా అయిపోయిందీ! నిజమే?'' అని భర్తనడిగింది.

''అయిపోయింది. ఇదిగో ఇప్పుడే చూద్దువుగాని.''

''మన గ్రిష కేమి వేస్తారంటావ్?''

''మాట్లాడకూరుకో.''

అందరికీ ఏదో ఒక అతిక్రమణం జరిగిందనిపించింది. ఏదో స్థానభంగమైనట్లూ, తెగిపోయినట్లూ గుర్తించారు. ఏమీ తెలుసుకోలేక విస్తుబోయి చూశారు. హద్దులు తెంచుకుని రేగుతున్న మంటలను చూస్తున్నట్లు తెల్లబోయి చూస్తున్నారు. ఈ గుంపుయొక్క విశేషం అగమ్యగోచరంగానే ఉన్నా, దాని శక్తి అభేద్యంగా ఉంది. హఠాత్తుగా తమకు బహిర్గతం చేయబడిన ఆ మహనీయ విశేషాన్ని అవగాహనచేసుకోలేక తమకు తెలిసిన చిన్న విషయాలను గురించి వ్యాఖ్యానిస్తూ తమ భావాలను వెలిబుచ్చారు.

''చూడండి! వాళ్లని మాట్లాడ నివ్వలేదేమిటి? ప్రాసెక్యూటరును ఇష్టమొచ్చినట్లు

ఎంత సేపైనా మాట్లాడనిచ్చారు'' అని పెద్ద బూకిన్ వినిపించీ వినిపించనట్లుడిగేడు.

బెంచీల దగ్గర నిలబడిన ఉద్యోగి చెయ్యి పైకెత్తి అడిస్తూ,

''నిశ్శబ్దం, నిశ్శబ్దం!'' అని మందలించాడు.

సమోయ్‌లొవ్, భార్య వీపు వెనక అనుకుని సగంసగం మాటలు గొణిగేడు.

''సరేనయ్యా. వాళ్ళు దోషులనే అనుకుందాం. కాని వాళ్లకు చెప్పుకునేందుకు అవకాశమివ్వాలి కదా! వాళ్లెవరికి వ్యతిరేకులు? నేనదే తెలుసుకోవాలనుకుంటున్నాను!''

ఉద్యోగి సమోయ్‌లొవ్‌కేసి వేలు చూపెడుతూ ''ఇష్!'' అని హెచ్చరించాడు.

సిజోవ్ విచారంగా తలూపేడు.

తల్లి జడ్జీలకేసి చూస్తూ కూచుంది. వాళ్లలో వాళ్ళు మాట్లాడుకుంటుంటే వాళ్ళ ఆవేశం పెరిగిపోతున్నట్లామె గ్రహించింది. సానుభూతి శూన్యమై బంకలా సాగుతూన్న వాళ్ల కంఠధ్వనులామె ముఖాన్ని కొట్టినట్లయింది. ఆమె చెక్కిళ్ళు వణికేయి. నోటికి వెగటనిపించింది. ఏ కారణంచేతనైతేనేమి, వాళ్ళు తన కొడుకు శరీరాన్ని గురించీ, అతని స్నేహితుల శరీరాలను గురించీ మాట్లాడుకుంటున్నారని ఆమెకు తోచింది. వేడి రక్తంతో యవ్వనంతో శక్తిపూరితమైన వాళ్ల అవయవాలను గురించీ కండరాలను గురించీ చర్చించుకుంటున్నారనుకుంది. అలాటి పుష్టికరమైన దేహాలను చూసినప్పుడు, నీచులైన బిచ్చగాళ్ల ఈర్ష్యా, రోగిష్టులూ బలహీనుల దురాశా వాళ్లలో ప్రకోపించాయని ఆమెకు స్ఫురించింది. పనిపాటులు చేసి భాగ్యవంతం కాగలిగినట్టివీ, సుఖ సంతోషాలను సృష్టించి అనుభవించగలిగినట్టివీ, ఆ యువకుల శరీరాలను జడ్జీలు పెదవులు చప్పరించి కాంక్షిస్తున్నారు. అలాటి శరీరాలనిప్పుడు నిత్యజీవితంలోంచి ఉపసంహరిస్తున్నారు. వాటిని తోసిపారేస్తున్నారు. అంటే వాటినింక తమ చేతిలోకి తెచ్చుకోలేరు, దోపిడిచేయలేరు, తమ స్వార్థానికి ఉపయోగించుకోలేరు. ఆ కారణంచేతనే ముసలి జడ్జీలలో ఆ యువకులు పేరాశను రగుల్కొల్పేరు. ముసలి జంతువులకు తమ కళ్ల ముందర నవనవలాడే ఆహారం కనిపిస్తుంది. కాని దాన్ని గ్రహించే శక్తి వాటికుండదు. అప్పుడవి తమను దహించివేస్తున్నట్టి కసితో నిండిన కోపంతో నిస్సహాయతతో పళ్ళు పటపట కొరుక్కుంటాయి. ఇతర జంతువుల దారుఢ్యాన్ని కడుపారా భుజించే శక్తిలేని క్రూరజంతువులు, తమ ఆకలిని తీర్చగల ఆహారం కళ్ల ముందునుంచి తప్పించుకుపోతుంటే, ఏమీ చెయ్యలేక ముక్కుతూ మూలుగుతాయి. జడ్జీలు ఆ స్థితిలోనే ఉన్నారనుకుంది.

అప్పటికప్పుడు స్ఫురించిన ఈ చిత్రమైన మోటు ఆలోచనలన్నీ, ఆమె జడ్జీల ముఖంకేసి శ్రద్ధగా చూస్తున్న సమయంలో, ఒక స్పష్టమైన రూపం దాల్చేయి. సుష్టుగా భోజనం చేయ మరిగినవారు బలహీనులై, అశక్తులైన తర్వాత, వారికుండే దురాశను కప్పిపుచ్చడానికి వారేమీ ప్రయత్నిస్తున్నట్లామెకు కనబడలేదు. స్త్రీ, తల్లి అయిన ఆమెకు, ఆత్మ

అని పిలువబడేదానికన్న, కొడుకు శరీరం చాలా ఆప్యాయమైనది. అలాటప్పుడు, వాళ్ల తమ ఈర్ష్యాపూరిత నేత్రాలతో, తన కొడుకు ముఖాన్ని, ఛాతీని, భుజాలను, చేతులను చూస్తుండడం, ఆమెకు భయమేసింది. అతని శరీరాన్ని చూపులతో రుద్దుతూ అందువల్ల కలిగిన వేడితో, గట్టిబడిపోయిన తమ రక్త నాళాలనూ, నీరసించిన కండరాలనూ వెచ్చచేసు కోవాలనుకుంటున్నారాయని భయపడింది. ఈ యువకులకు శిక్ష విధించి, వాళ్ల శరీరాలను శాశ్వతంగా తమకు దూరం చేసుకుంటున్నామనే ఆలోచనవల్ల ప్రేరితమైన దురాశా, ఈర్ష్యా వాళ్లను కొంత తేర్చాయి. తేమగిలి అనప్యామైన ఈ స్పర్శను గ్రహించాడనీ, పావెల్ వణుకుతూ తనకేసి చూస్తున్నాడనీ ఊహించుకుంది.

పావెల్ ఆమెను ఆప్యాయతతో ప్రశాంతంగా పరికించాడు. అతని చూపులో కాస్తంత అలసట కనబడింది. మధ్యమధ్య ఆమెకేసి చూసి తలూపుతూ చిరునవ్వు నవ్వేవాడు.

''త్వరలో – స్వేచ్ఛ!'' అనే మాటలున్న ఆ నవ్వుతో తనను పావెల్ బుజ్జగిస్తున్న ట్లూహించుకుంది.

ఆ సమయంలో జడ్జీలు లేచారు. తల్లి కూడా లేచింది.

''వాళ్లెళ్లిపోతున్నారు'' అన్నాడు సిజోవ్.

''శిక్ష గురించి చర్చించుకోడానికా?'' అని ఆమె అడిగింది.

''ఔను.''

ఇంతవరకూ బిగపట్టుకు కూచున్న నరాల బిగువు హఠాత్తుగా సడలిపోయింది. అలసటతో ఆమె సొమ్మసిలింది. కనుబొమలు అదిరేయి, నుదుటిమీద చెమట బిందువులు చేరేయి. క్లేశమూ, ఆశాభంగమూ ఓ పెద్ద బండలా ఆమె హృదయానికి తగిలి, కోర్టుపట్లా జడ్జీలపట్లా ధిక్కారంగా మారిపోయాయి. తలనొప్పితో బాధపడుతూన్నట్టు గ్రహించి నుదుటిని చేత్తో గట్టిగా నొక్కుకుని పైకి చూసింది. ఖైదీల తాలూకు బంధువులందరూ, కమ్మీల దగ్గరకు చేరుకున్నారు. కోర్టు హాలంతా సంభాషణలతో జుమ్ముమంటోంది. ఆమె కూడా పావెల్ దగ్గర కెళ్లి అతని చెయ్యి పట్టుకుని, బాధాసంతోషాలు రెండిటివల్లా ఉత్పన్న మైన పరస్పర విరుద్ధమైన భావాల్లో ఇరుక్కుని ఏడ్చింది. పావెల్ ఆమెతో మృదువుగా మాట్లాడేడు. హొహోల్ నవ్వుతూ పరిహాసమాడేడు.

ఆడవాళ్లందరూ, దుఃఖంచేత కాకపోయినా, అలవాటు కొద్దీ ఏడ్చేరు. దిగ్భ్రమ కలి గించేటంత దుఃఖమేమీ లేదక్కడ. ఊహించలేనంత విచార మెవ్వరికీ కలగలేదు. కాకపోతే, బిడ్డలను వదిలేసి వెళ్లక తప్పదనే విచారం ఉంది. కోర్టులో జరిగిన విషయాలనాలోచించు కుంటుంటే ఆ బాధ కూడా చాలావరకు నివారణైంది. తల్లులూ, తండ్రులూ తమ కొడు కులను మిశ్రమ భావాలతో పరికించారు. యువకులపట్ల అపనమ్మకం, సాధారణంగా పెద్ద వాళ్లకు తమ ఆధిక్యతను గురించిన అహంకారం, రెండూ చిత్రంగా మిళితమై ఒక

విధమైన గౌరవభావం వంటిది ఏర్పడింది. ఇకముందు బతుకు ఎలా సాగించాలా అనే విచార భావాలు కొంత బాధించినా, మరొక ఉత్తమ జీవితాన్ని గురించి, నిర్భయంగా, ధైర్యంగా ఈ యువకులు చెప్పిన మాటలవల్ల కలిగిన అద్భుతావేశం, ఆ విచారాన్ని మరుగుపరచింది. భావాలను మాటల్లో చెప్పలేక ఆ భావాలను దిగమింగేశారు. మాటలు అమితంగానే వచ్చాయి. కాని అవి గుడ్డలు, వాటి నుతుక్కోవడం, ఆరోగ్యం మొదలైన సామాన్య విషయాలను గురించే ఎక్కువగా వినియోగింపబడ్డాయి.

అన్నగారైన బూకిన్ తమ్ముడితో చేతులూపుకుంటూ మాట్లాడేడు:

"మరేం లేదు! న్యాయం తప్పకుండా జరగాలి!"

"పిల్లను జాగ్రత్తగా చూడు!"

"అలాగే."

సిజోవ్ తన మేనల్లుడి చెయ్యి పట్టుకుని,

"అయితే, ఫ్యోదొర్, మమ్మల్ని వదిలిపెట్టి పోతున్నావు" అన్నాడు.

ఫ్యోదొర్ ముందుకు వంగి కులాసాగా నవ్వుతూ అతని చెవిలో ఏదో చెప్పేడు. కాపలాదారు కూడా చిన్ననవ్వు నవ్వేడు. వెంటనే నవ్వాపుకుని ముఖం కఠినంగా పెట్టాడు.

తల్లి తన కొడుకుతో ఇతర స్త్రీలలాగే గుడ్డలను గురించీ, ఆరోగ్యాన్ని గురించీ మాట్లాడింది. సాషాను గురించీ, తనను గురించీ, అతన్ని గురించీ వెయ్యి ప్రశ్నలడగాలనుకుంది. కాని దీనంతటినీ మించి తన కొడుకుమీద ఉండే అపార ప్రేమ, అతన్ని సంతోష పెట్టాలనీ, అతనికి సన్నిహితంగా ఉండాలనే కోరిక రెక్కలు చాచుకొని ఎగిరింది. ఏదో భయంకరమైన ప్రమాదం సంభవించబోతోందనే భయం క్రమంగా తగ్గిపోయింది. జడ్జీలను తలుచుకున్నప్పుడూ, విచారణలోని విషాద ఘట్టాలు స్ఫురణకొచ్చినప్పుడూ మాత్రం శరీరం కంపించింది. తేజోవంతమైన సంతోషాన్నిచ్చే ఏదో అనుభూతి ఒకటి ఆమెలో ప్రభవించింది. అదేమిటో ఆమె పూర్తిగా గ్రహించలేకపోయింది. కాని సంకోచంతోనే దాన్ని స్వీకరించింది. హోహోల్ జనంతో మాట్లాడ్డం గమనించింది. పావెల్‌కన్న కూడా అతన్ని ఆప్యాయతతో చూడవలసిన అవసరాన్ని గుర్తించి, అతనికేసి తిరిగి,

"ఈ విచారణ గురించి నేనే మంతగా అనుకోలేదు. ఏమంత విశేషంగా ఉంటుందని నేనుకోలేదు!" అంది.

హోహోల్ కృతజ్ఞతాపూర్వకంగా మందహాసం చేసి,

"ఎందుకలా అనుకుంటున్నారు, మామ్మా?... తిరగలి పాతదే కాని, విసురుతూండడం మానదు కదా!" అన్నాడు.

"విచారణ ఎవరినీ భయపెట్టలేదు. అయితే, ఏ సంగతీ తెలియచెప్పనూ లేదు. ఎవరిది తప్పో, ఎవరిది ఒప్పో తేల్చలేదు."

"ఓహో! అంతే మీ కోరిక అదే నన్నమాట!... వాళ్ళు నిజం తెలుసుకోవడానికి ఆత్రపడు తున్నారనుకుంటున్నారా?" అన్నాడు ఆశ్చర్యంగా అన్‌ద్రేయ్.

"ఇదంతా ఏదో బీభత్సంగా ఉంటుందనుకున్నాను" అని దీర్ఘంగా నిట్టూర్చి చిరు నవ్వు నవ్వుతూ తల్లి చెప్పింది.

"కోర్టు ప్రారంభమవుతోంది!"

జనం ఎవరి స్థానాల్లోకి వాళ్ళు గబగబా వెళ్ళిపోయారు.

ప్రధాన న్యాయాధిపతి ఒక చేతిని బల్లమీదాన్చి, రెండో చేత్తో కాగితాన్ని ముఖాని కడ్డెట్టుకుని, అతి మెల్లగా చదవడం మొదలెట్టాడు.

సిజోవ్ ముందుకు వంగి:

"ఆయన శిక్ష చెపుతున్నాడు" అన్నాడు.

హాలంతా మౌనం దాల్చింది. అందరూ ముసలాయనకేసి తదేక ధ్యానతో చూశారు. పొట్టిగా, సన్నంగా, నిటాగ్గా, ఏదో అదృశ్యహస్తం పట్టుకున్న కర్రలాగున ఆయన నిల బడ్డాడు. ఇతర జడ్జీలు కూడా నిలబడ్డారు. జిల్లా పరిపాలనాధికారి తల ఒక వైపుకు వంచి పరంబీకేసి చూస్తూ నిలబడ్డాడు. మేయరు ఛాతీమీద చేతులు కట్టుకు నిలబడ్డాడు. మార్షల్ ఆఫ్ ది నొబిలిటీ గెడ్డం సర్దుకుంటూ నిలబడ్డాడు. రోగిష్టి జడ్జీ, స్థూలకాయుడైన మరొక జడ్జీ, ప్రొసెక్యూటరూ ఖైదీలకేసి తీక్షణంగా చూస్తూ నిలబడ్డారు. జడ్జీల వెనక, గోడమీదవున్న పటంలో ఎర్రని దుస్తులతో ధగధగలాడుతూన్న చక్రవర్తి కిందకు చూస్తున్నాడు. ఉదాసీనతతో చూస్తున్న ఆ తెల్లని ముఖంమీద ఈగ వాలింది.

"ప్రవాసం!" సంతోషంగా నిట్టూరుస్తూ సిజోవ్ చెప్పేడు. "దేవుడికి దణ్ణం పెట్టవచ్చు, అయిపోయింది. కఠిన శిక్ష వేస్తారేమోనని భయపడ్డాను. అమ్మా! ఇది చాలా నయం."

"ఇలాగే జరుగుతుందని నాకు తెలుసు" అంది అలసటగా తల్లి.

"సరి. ఇప్పుడిక తప్పదు. వాళ్లేం చేస్తారో ఎవరూ చెప్పలేరు."

అప్పటికప్పుడే తీసుకుపోబడుతున్న ఖైదీలకేసి సిజోవ్ తిరిగి:

"ఫ్యోదొర్, శలవ్! మిమ్మల్నందరినీ భగవంతుడనుగ్రహించును గాక!" అన్నాడు.

తల్లి మౌనంగా కొడుకునూ, ఇతరులనూ చూసి తలూపింది. ఆమెకు ఏడవాలనిపిం చింది. కాని సిగ్గుపడింది.

## 27

కోర్టు హాలు వదిలి వెళ్లేసరికి రాత్రి కావడం ఆమె కాశ్చర్యమేసింది. వీధుల మొగిని దీపాలు వెలుగుతున్నాయి. ఆకాశంమీద నక్షత్రాలు మెరుస్తున్నాయి. కోర్టు దగ్గర జనం

గుంపులుగుంపులుగా చేరేరు. శీతగాలిలో మంచు కరకరలాడింది. యువకుల కంఠధ్వనులు వినబడుతున్నాయి. బూడిదరంగు టోపీని ధరించిన ఒక మనిషి సిజోవ్‌కేసి చూసి, ఆత్రంగా,

"ఏమిటి శిక్ష?" అని అడిగేడు.

"ప్రవాసం."

"అందరికీనా?"

"ఆహా."

"ధన్యవాదాలు."

ఆ మనిషి చరచర ముందుకు పోయాడు.

"చూశావూ? — వీళ్లందరికీ ఎంత ఆసక్తో!" అన్నాడు సిజోవ్.

హఠాత్తుగా డజనుమంది యువతీ యువకులు వాళ్లను ముట్టడించారు. వాళ్ళు ఉద్రేకంతో బిగ్గరగా మాట్లాడుతుంటే, జనం మూగేరు. తల్లీ, సిజోవ్ ఆగిపోయారు. శిక్ష ఏమిటనీ, ఖైదీలు ఏవిధంగా ప్రవర్తించారనీ, ఎవరెవరు ఉపన్యాసాలిచ్చారనీ ఈ మొదలైన ప్రశ్నల నెన్నిటినో మనస్ఫూర్తిగా, అభిమానంతో అడిగేరు. వాటి కన్నిటికీ తల్లి సంతోషంతో జవాబులుచెప్పింది.

"ఏమండోయ్! ఈవిడ పావెల్ వ్లాసొవ్ తల్లి" అని ఎవరో అన్నారు. వెంటనే అంతా నిశ్శబ్దంగా ఉండిపోయారు.

"మీతో కరచాలనం చెయ్యనియ్యండి అమ్మగారూ!"

ఎవరో బలశాలి చెయ్యి ఆమె వేళ్లను గట్టిగా పట్టుకుంది. "మీ కొడుకు ధైర్యం మా కందరికీ ఆదర్శం" అని ఇంకెవరో ఆవేశంతో అన్నాడు.

"రష్యా కార్మికులు వర్ధిల్లాలి!" అని మరెవరో బిగ్గరగా అరిచారు.

ఆ కేకలు అంతకంతకు ఎక్కువై నాలుగు మూలల్నుంచీ లేచాయి. జనం అన్ని వైపులనుంచీ పరుగులెత్తుకుంటూ వచ్చి, సిజోవ్‌నూ, తల్లినీ ముట్టడించారు. పోలీసులు ఈలలూదేరు. కాని జనం కేకలను అవి మించలేకపోయాయి. సిజోవ్ నవ్వేడు. తల్లికిదంతా సుఖమైన స్వప్నమనిపించింది. ఆమె మందహాసంతో వంగి వందనంచేస్తూ జనంతో కరచాలనం చేసింది. కళ్ల వెంట ఆనందాశ్రువులు రాలేయి. అలసటచేత ఆమె కాళ్ళు లాగేయి. కాని విందు హృదయం స్వచ్ఛమైన సరోవరంలాగ చక్కని భావాలను ప్రతిఫలిస్తోంది.

ఆమెకు దగ్గరగా ఉన్న వారెవరో విస్పష్టమైన గొంతుకతో గాద్గదికంగా మాట్లాడ్డం మొదలెట్టేడు.

"కామ్రేడ్స్! రష్యా దేశపు ప్రజలను చీల్చి చెండాడుతున్న రాక్షసి, తన దవడల మధ్య...."

"అమ్మా! మనం వెళ్లిపోదాం" అన్నాడు సిజోవ్.

ఆ సమయానికి సాషా అక్కడికి వచ్చి తల్లి చెయ్యి పుచ్చుకుని రోడ్డు కవతలి వైపుకు తీసుకెళ్లింది.

"దెబ్బలాట ప్రారంభం కాకముందే, వాళ్లెవరినీ అరెస్టుచెయ్యక ముందే పోదాం.... ప్రవాసమేనా? సైబీరియాకేనా?" అని సాషా అడిగింది.

"అవును."

"అతనెలా మాట్లాడేడు? నాకు తెలుసులే — అందరికన్నా అతడే ధైర్యవంతుడు. నిరాడంబరుడు. అందరికన్నా ఖచ్చితమైనవాడు. సున్నితమైన స్వభావం కలవాడు. కాని ఆ స్వభావాన్ని వెలిబుచ్చడానికి బిడియపడతాడు."

ఎంతో ఆప్యాయతతో తన చెవిలో చెప్పబడిన ఆమె ప్రేమపూరిత వచనాలు తల్లికి నూత్నమైన శక్తినిచ్చాయి.

తల్లి, సాషా చేతిని ఎంతో ప్రేమతో పట్టుకుని:

"అతని దగ్గరకు మీరెప్పుడు చేరుకుంటారు?" అని అడిగింది.

"నే చేస్తున్న పనిని చేయగలిగిన మరొకళ్లు దొరకడంతోనే" అని ఆ అమ్మాయి జవాబుచెప్పి, విశ్వాసంతో ఎదురుగా ధైర్యంగా చూసింది. "నాకూ శిక్ష పడుతుందనే అనుకుంటున్నాను. సైబీరియా ప్రవాసమే అనుకుంటున్నాను కూడా. అలాగైనప్పుడు అతనెక్కడుంటే నన్నూ అక్కడికే పంపమంటాను."

"అలాగైతే అతనికి నా అభినందనాలందచెయ్యి.... సిజోవ్ అభినందనాలని చెప్తే చాలు. ఫ్యోదొర్ మాజిన్ మామనని అతనికి తెలుసు" అన్నాడు సిజోవ్.

సాషా పక్కకు తిరిగి, చెయ్యి అందిచ్చింది.

"ఫ్యోదొర్‌ను నేనెరుగుదును. నా పేరు సాషా."

"మీ తండ్రి పేరు?"

ఆమె నిదానంగా అతనికేసి చూసింది.

"నాకు తండ్రి లేడు" అంది.

"చచ్చిపోయాడా?"

"లేదు. చచ్చిపోలేదు." ఆ అమ్మాయి ముఖం బిర్రబిగిసిపోయింది. కంఠస్వరం కరుగ్గా మారింది. "అతను భూస్వామి. ఇప్పుడు స్థానిక అధికారి. రైతులను దోపిడి చేస్తుంటాడు."

"హూం!" అన్నాడు సిజోవ్ కష్టంగా. మౌనంగా ఆమె పక్కగా నడుస్తూ, ఆమెకేసి ఓర చూపులు చూశాడు. చివరకు:

"సరి. అమ్మా, నాకు శలవియ్యి. ఎడమ వైపుకు పోతాను. అమ్మాయీ, శలవు. మీ నాన్న గురించి చాలా కఠినంగా మాట్లాడావు, అంతేనా? కాని అది మీ వ్యవహారం...."

"మీ కొడుకు మంచివాడు కాడనుకోండి. అతను ప్రజలకుపకారం చేస్తున్నాడనుకోండి. అతను నీచుడని భావిస్తారనుకోండి. అప్పుడు మీరు అతన్ని బాహాటంగా ఆక్షేపించరా?" అని సాషా ఆవేశంతో అడిగింది.

"సరే. అంతే చేస్తానేమో!" సిజోవ్ ఒక్కక్షణమాగి బదులుచెప్పేడు.

"మీ కొడుకుకన్నా న్యాయం ఎక్కువైతే అంతే చెయ్యాలి. నా తండ్రికన్న నాకు న్యాయమే ఎక్కువ."

సిజోవ్ చిరునవ్వు నవ్వి తలూపేడు. ఒకసారి నిట్టూర్చి,

"సరి. మీరు బలే గట్టివారు. మీరు ఈ పట్టుదలనే ఇలా నిలుపుకోగలిగితే పెద్ద వాళ్లను కూడా మార్చెయ్యగలుగుతారు. మీలో చాలా ఆవేశం ఉంది! సరే. శలవు. శుభాకాంక్షలు అందుకోండి, కాని జనాన్ని కొంచెం దయతో చూడకూడదూ? శలవు, నీలొవ్నా! నువ్వు పావెల్‌ని చూసినప్పుడు, నేనతని ఉపన్యాసమంతా విన్నానని చెప్పు. అంతా అవగాహన కాలేదు. కొంత జీర్ణం చేసుకోగలిగేట్లు లేదు. కాని మొత్తంమీద బాగుంది."

టోపీ పైకెత్తి నెమ్మదిగా సిజోవ్ మళుపు తిరిగేడు.

అతను వెడుతుంటే సాషా నవ్వుతూ తన విశాల నేత్రాలతో వెంటాడించి:

"అతను చాలా మంచివాడులాగున్నాడే" అంది.

సాషా ముఖం ఈనాడు రోజూకంటె దయగానూ, నెమ్మదిగానూ ఉన్నట్లు తల్లి గమనించింది.

ఇంటికి చేరడంతోనే సోఫామీద ఇద్దరూ పక్కపక్కనే కూచుని, పావెల్ దగ్గరకు సాషా నిరీక్షిత ప్రయాణాన్ని గురించి మాట్లాడుకున్నారు. తర్వాత మౌనం కొంత విశ్రాంతి నిచ్చింది. సాషా కనుబొమలు పైకెత్తి, స్వప్నావస్థలో ఉన్న విశాల నేత్రాలతో దూరాన్ని చూసింది. వెల్లబారిన ఆమె ముఖం, నిదానమైన ఆలోచనలో ఆమె నిమగ్నురాలైనట్లు సూచిస్తోంది.

"అప్పుడు మీకు పిల్లలు పుట్టినప్పుడు నేనొచ్చి వాళ్లకు దాదిగా ఉంటాను. అక్కడ మన జీవితం, ఇక్కడకన్న ఏమీ అధ్వాన్నంగా ఉండదు. అక్కడ పావెల్‌కు పని దొరకడం ఏమంత కష్టమైన విషయం కాదు.... అతను చేతుల్తో ఏపనైనా చెయ్యగలడు...."

సాషా తల్లిని ప్రశ్నార్థకంగా చూసింది.

"మీరిప్పుడతనితో వెళ్లదలచుకోలేదా?" అని అడిగింది.

"ఇప్పుడు అతనికి నాతో పనేముంది?..." అంది తల్లి నిట్టూర్చి. "అతను తప్పించుకు రావాలనుకుంటే, నేనడ్డొచ్చినదాన్నవుతాను. నన్నతను రావాలని కోరడం లేదు."

సాషా తలూపింది.

"మీరు చెప్పిన మాట నిజమే. అతను ఒప్పుకోడు."

"అంతేకాకుండా, నేనిక్కడ చెయ్యవలసిన పని కూడా ఉంది" అని సగర్వంగా తల్లి చెప్పింది.

"ఔను. ఆ పని చాలా ముఖ్యం" అంది సాషా.

హఠాత్తుగా ఏదో భారాన్ని మీదనుంచి తోసి పారేసినట్లు సౌంజ్ఞచేసి, ఆమె మెల్లగా స్పష్టంగా మాట్లాడ్డం మొదలెట్టింది:

"అతనక్కడే ఉండిపోడు. నిస్సందేహంగా పారిపోయి వస్తాడు."

"అప్పుడు మీ సంగతేమవుతుంది? పిల్ల పుడితే దాని గతేమిటి?"

"ఆ సమయమొచ్చినప్పుడు చూసుకుందాం. అతను నన్ను గురించి ఆట్టే ఆలోచించుకోకూడదు. నేనెప్పుడూ అతని మార్గానికి అడ్డురాను. అతన్ని విడిచి పెట్టి ఉండడం నాకు చాలా కష్టమే. అయినప్పటికీ ఉంటాను. నేనెప్పుడూ అతని పనికి అడ్డు వెళ్లను!"

సాషా అన్నంత పనీ చెయ్యగలిగిన సమర్థురాలేనని తల్లి తెలుసుకుంది. ఆ పిల్లని చూస్తే చాలా జాలేసింది.

"అమ్మాయీ, మీకెంత కష్టమొచ్చింది" అంటూ ఆమెను కౌగిలించుకుంది.

సాషా చిరునవ్వు నవ్వి తల్లి కౌగిలిలో అణిగిపోయింది.

ఆ సమయానికి ఎంతో అలసిపోయి, నికొలాయ్ లోపలికొచ్చాడు. కోటు తీసేస్తూనే,

"పొవకాశముండగానే మీరెళ్లిపోవడం మంచిది సాషా" అన్నాడు. "పొద్దుటినుంచి ఇద్దరు గూఢచారులు నన్ను బహిరంగంగా వెంటాడిస్తున్నారు. ఈ ధోరణి చూస్తే నన్ను అరెస్టుచేస్తారని తోస్తోంది. సాధారణంగా నాకు స్ఫురించిన ఆలోచన వృథాపోదు. ఏదో జరిగింది. ఆ సంగతలా ఉంచు. ఇదిగో పావెల్ ఉపన్యాసం: దీన్ని అచ్చువేయించాలని నిశ్చయించాం. దీన్ని లుద్మిలా దగ్గరకు తీసుకెళ్లి ఎంత త్వరగా తయారుచెయ్యడానికి సాధ్యమైతే అంత త్వరగా సిద్ధం చెయ్యమని చెప్పండి. పావెల్ మంచి ఉపన్యాసమిచ్చాడు, నీలొవ్నా! గూఢచారులను జాగ్రత్తగా చూసుకోండి సాషా...."

మాట్లాడుతూనే చలిచేత గడ్డకట్టుకుపోయిన చేతులను రుద్దుకున్నాడు. రాతబల్ల దగ్గర కెళ్లి సొరుగుల్లోంచి కాగితాలు తియ్యడం మొదలెట్టేడు. కొన్నిటిని అతడు చింపేశాడు. కొన్నిటిని పక్కగా పెట్టేడు. అతడు చాలా అలసట చెంది, ఎంతో కంగారుగా ఉన్నాడు.

"ఈ సొరుగులన్నీ శుభ్రంచేసి ఎన్నో రోజులు కాలేదు. ఇంతలోనే కొత్తగా ఇన్ని కాగితాలు చేరుకున్నాయే! ఇవెక్కడనుంచొస్తాయో దేవుడికే ఎరుక! నీలొవ్నా, ఈ రాత్రి మీరిక్కడుండకపోవడం మంచిదనుకుంటాను. ఏమంటారు? బహుశా ఆ నాటకంతో విసుగెత్తి ఉండాలి.... మిమ్మల్ని కూడా పట్టుకుపోతారేమో. పావెల్ ఉపన్యాసాన్ని పంచిపెట్టుకుంటూ తిరగడానికి మీ అవసరముంది...."

"నన్ను పట్టుకుపోయి వాళ్లేం చేసుకుంటారు?"

నికొలాయ్ చెయ్యి ఊపి ఖచ్చితంగా చెప్పేడు:

"అలాటి విషయాలను నేను బాగా గ్రహించగలను. లుద్మీలాకు మీరు చాలా సాయం చెయ్యగలరు. ఇక్కడనుండి వెళ్లిపోవడం మంచిది."

తన కొడుకు ఉపన్యాసాన్ని అచ్చువేయడానికి తాను తోడ్పడగలననే భావం తల్లి కెంతో ఆనందాన్ని కలిగించింది.

"అలాగైతే, వెడతాను...." అని "దేవుడి దయవల్ల ఇప్పుడిక నాకు దేన్ని గురించీ ఏవిధమైన భయమూ లేదు!" అంది.

"బాగుంది!... కాని నా సూట్‌కేసూ, బట్టలూ ఎక్కడున్నాయో మాత్రం చూపించి మరీ వెళ్లండి. మీరన్నిటినీ మీ చేతుల్లోకి తీసేసుకుని, నా వస్తువులమీద నా అధికారమే లేకుండా చేస్తున్నారు!" అన్నాడు నికొలాయ్.

సాషా కాగితాలన్నీ పొయ్యిలో తగలేసి బూడిదను బొగ్గుల్లో కలిపేస్తోంది.

నికొలాయ్ చటుక్కున చేయెత్తి,

"సాషా, మీరెళ్లిపోవలసిన సమయమైంది. శలవు. మంచి పుస్తకాలేమైనా వస్తే నాకు పంపడం మరచిపోకండి, కామ్రేడ్, శలవు. జాగ్రత్త!" అని చెప్పేడు నికొలాయ్.

"మీకు కూడా దీర్ఘకాల శిక్ష పడుతుందనుకుంటున్నారా?" అని సాషా అడిగింది.

"ఎవరు చెప్పగలరు? బహుశా పడచ్చు. నాకు వ్యతిరేకంగా వాళ్లకి చాలా రుజువు లున్నాయి. పెలగేయా, మీరు కూడా ఆమెతో వెళ్లకూడదూ? ఒకేసారి గూఢచారులు ఇద్దర్నీ వెంబడించడం కష్టం."

"అయితే సరే. నేను కోటూ శాలువా వేసుకుంటాను" తల్లి జవాబిచ్చింది.

ఆమె, నికొలాయ్‌ని పరీక్షగా చూసింది. మామూలుగానే, దయాపూరితమై ప్రశాంతంగా ఉండే ముఖమే. కాని ఏదో ఒక అదుర్దా దాని నావహించినట్లు కనబడింది. తదితరులకన్న ఎంతో ప్రేమాస్పదుడైన అతనిలో భయ చిహ్నాలేమీ లేవు. ఆందోళనపడుతున్న చిహ్నాలు లేవు. అతనెప్పుడూ అందర్నీ సమానంగానే చూస్తూ వచ్చాడు. ఎప్పుడూ దయగానే ఉండే వాడు. కోపతాపాలేమీ లేకుండా నిర్మలంగా ఒంటరిగానే ఉండేవాడు. ఇప్పుడు కూడా ఎప్పటిలాగే అందరికోసం జీవిస్తున్నాడు. ఇతరుల జీవితాలకన్నా ఉత్తమమైన అంతరంగిక జీవితాన్ని గడుపుతున్నాడు. ఆమెలో కూడా అవిధమైన భావాలున్నట్లు అతను గుర్తించిన విషయం ఆమెకు తెలిసింది. ఆమె అతని నెంతగా ప్రేమిస్తున్నదో ఆమెకే తెలియడం లేదు. ఇప్పుడతనిమీద భరించలేనంత జాలి కలిగింది. కాని దాన్ని వ్యక్తపరచడానికి ఆమెకు ధైర్యం చాలలేదు. వ్యక్తపరుస్తే నికొలాయ్ కలవరపడి, చిన్న బుచ్చుకుంటాడేమోనని ఆమె భయ పడింది, అతడు చిన్న బుచ్చుకోవడం ఆమెకు ఏమాత్రం ఇష్టం లేదు.

ఆమె మరల గదిలో ప్రవేశించేసరికి, అతడు పాషె చేతిని పట్టుకుని చెపుతున్నాడు:

"చాలా బాగుంటుంది! అదే మీకూ, అతనికీ కూడా చాలా మంచిది. కొంత స్వీయ సిక్ష్యంవల్ల ఎవరికీ ఏమీ ప్రమాదం రాదు.... పిలొవ్నా, మీరు సిద్ధంగా ఉన్నారా?"

మందహాసం చేస్తూ అతడు తల్లిని సమీపించి మలోచనాలు పైకి పెట్టుకున్నాడు.

"మంచిది. శలవు. మూడునాలుగు నెలలు, తప్పితే ఆరు మాసాలనుకుంటున్నాను. ఆరు మాసాలు! జీవితంలో అది చాలా కాలమే! మీ విషయంలో కొంచెం జాగ్రత్తగా ఉండండి. ఉంటారా? ఒక్కసారి ముద్దెట్టుకోనియ్యండి."

సన్నంగా సున్నితంగా ఉన్న బలమైన చేతులతో నికొలాయ్ ఆమెను కౌగిలించుకుని కళ్లలోకి చూచాడు.

"మిమ్మల్ని ప్రేమిస్తున్నట్లుగా ఉంది యిలా కౌగిలించుకుంటుంటే" అంటూ దగ్గరగా నవ్వేడు.

తల్లి మౌనంగా అతని నుదురుమీదా, బుగ్గలమీదా ముద్దెట్టుకుంది. ఆమె చేతులు మాత్రం వణికేయి. ఆ సంగతి అతనికి తెలియకూడదని తన చేతులను అతని భుజాలపై నుండి తీసేసుకుంది.

"రేపు ప్రత్యేకంగా జాగ్రత్తగా ఉండాలి. పొద్దున్నే ఇక్కడేం జరుగుతుందో చూడ్డానికి ఒక కుర్రవాడిని పంపండి. ఎవరిని పంపాలో లుద్మిలాకు తెలుసు. మంచిది. కామ్రేడ్సు, శలవు. అన్నీ ఎలా జరగాలో అలాగే జరిగేయి."

వాళ్లిద్దరూ బయటికి వెళ్లడంతోనే, పాషె మెల్లగా తల్లితో ఇలా చెప్పింది:

"అతనెప్పుడైనా మృత్యువు నెదుర్కోవలసి వచ్చినా ఇంత అవలీలగానే ఎదుర్కొంటాడు. కొంచెం తొందర మాత్రం పడతాడు. మృత్యువతని ముఖంకేసి చూస్తుంటే, కళ్లద్దాలు పైకెత్తి చనిపోయే ముందు 'క్షేమంగా ఉంది' అంటాడు."

"నాకతనంటే చాలా ప్రేమమ్మా" అంది మెల్లగా తల్లి.

"అతను నన్ను దిగ్భ్రమ చెందిస్తాడు. కాని నేనతన్ని ప్రేమించను. అపారంగా గౌరవిస్తాను. అతను చాలా దయ చూపిస్తాడు. ఒక్కొక్కప్పుడు బహు మృదువుగా ఉంటాడు. కాని అతనిలో ఆర్ద్రత లేదు.... తగినంత మానవత్వం లేదు.... మనల్ని గూఢచారులు వెంబడిస్తున్నట్లున్నారు. కనుక విడిపోతే మంచిది. వాళ్లు మీ వెంట బడుతున్నారని తోస్తే లుద్మిలా ఇంటి కెళ్లకండి."

"వెళ్లను."

"వెళ్లకండి. జాగ్రత్త! నా యింటి కొచ్చెయ్యండి. ప్రస్తుతానికి శలవు!" అని పాషె మళ్లీ చెప్పింది.

ఆమె వెనక్కు తిరిగి చరచర నడచిపోయింది.

కొద్ది నిముషాలైన పిమ్మట, ఉర్మీలా చిన్న గదిలో పొయ్యి దగ్గర కూచుని తల్లి చలికాగుతోంది. ఉర్మీలా నల్లని దుస్తుల్ని ధరించి తోలు పటకా పెట్టుకుని గదిలో పచారు చేస్తోంది. గదంతా తన రాజసపు కంఠధ్వనితోనూ, గౌను రెపరెపలతోనూ నింపేసింది.

పొయ్యిలోని నిప్పు రాజుకుంటూ చిటపట శబ్దం చేస్తోంది. ఆమె స్వరం ఏక స్థాయిలో వినవస్తోంది.

"జనాన్ని దుర్మార్గులనడంకన్న మూర్ఖులని చెప్పాలి. వాళ్ల కళ్ల ముందర ఏమున్నదో దానినే, చటుక్కున చేత్తో దేన్ని తీసుకోగలుగుతారో దాన్నే చూడగలుగుతారు. చేతి కందుబాటులో ఉండే వాటికేమీ విలువ ఉండదు. దూరంగా అందుబాటులో లేకుండా ఉండే వస్తువులకే విలువ హెచ్చు. అసలు మూలాల్లో కెళ్లి ఆలోచిస్తే, జీవితం మరోకలాగుంటే, అందరూ ఇంత కన్న బాగా, సుఖంగా ఉంటారు. జీవితం కొంచెం సులభమై, జనం మరింత హేతుబద్ధంగా ఉంటే బాగుంటుంది. దీన్ని సాధించడానికి చాలా కాలం పడుతుంది."

చటుక్కున ఆమె తల్లి కెదురుగా నిలబడింది.

"నేను తరుచుగా జనాన్ని కలుసుకోను. కలుసుకుంటే మాత్రం, వాళ్లకు గంభీరంగా ఉపన్యసిస్తాను. వాకిదొక పిచ్చి అని మీరనుకో వచ్చు...." అని క్షమాపణపూర్వకంగా చెప్పింది.

"ఏంచేత?" అని తల్లి అడిగింది. ఈవిడ కరపత్రాల నెక్కడ అచ్చువేస్తోందో కనిపెట్టాలనుకుంది. కాని సాధ్యం కాలేదు. ఆ గదికి వీధివైపుకు తెరుచుకునే మూడు కిటికీలున్నాయి. గదిలో ఒక సోఫా, పుస్తకాల బీరువా, ఒక బల్ల, కుర్చీలు, మంచం ఉన్నాయి. ఒక మూల చేతులు కడుక్కునే బేసిన్ ఉంది. ఇంకొక మూల పొయ్యి. గోడమీద ఫొటోలు వేలాడుతున్నాయి. అన్నీ కొత్తగా పరిశుభ్రంగా ఉన్నాయి. అన్నిటికన్నా యజమానురాలి విష్ఫుర విగ్రహం తన నిరుత్సాహ ఛాయతో గదిని నింపేసింది. ఆ గదిలో ఎక్కడో ఏదో దాచబడినట్లు తల్లికి స్ఫురించింది. కాని ఎక్కడో ఊహించలేకపోయింది. ఆమె తలుపుల కేసి చూసింది. ఒక దానిలోనుంచి వెళ్లేసరికి ఒక చిన్న నడవలో ప్రవేశించింది. పొయ్యి పక్కన సన్నంగా ఎత్తుగా ఉన్న మరొక తలుపుంది.

ఉర్మీలా తనని పరీక్షగా చూస్తుండడం ఆమె కనిపెట్టింది.

"నేను పనిమీద వచ్చాను" అని ఆత్మవిశ్వాసంతో చెప్పింది.

"జనం పని లేకుండా నా దగ్గరకు రారని నాకు తెలుసు."

ఉర్మీలా కంఠధ్వనిలో ఏదో విశేషాన్ని తల్లి గమనించింది. ఆమె ముఖంకేసి తదేక ధ్యానతో చూచింది. ఉర్మీలా పలచని పెదవులమీద చిన్ననవ్వును చూసింది. సులోచనాల

వెనుక కళ్ళ మిలమిలలాడేయి. తల్లి పక్కచూపు చూస్తూ, పావెల్ ఉపన్యాసాన్ని వెతికిచ్చింది.

"ఇదిగో. మిమ్మల్ని ఎంత త్వరగా సాధ్యమైతే అంత త్వరగా దీన్ని అచ్చేసి ఇమ్మన్నారు."

తర్వాత, నికొలాయ్ని కూడా అరెస్టుచేస్తారని అనుకుంటున్న విషయం చెప్పింది.

లుద్మీలా మాట్లాడకుండా కాగితాన్ని తన పటకాలో దోపుకుని కూచుంది. నిప్పు బాగా రాజుకుని ఆమె సులోచనాలమీద ఎర్రగా ప్రతిఫలించింది. వెచ్చని వెలుతురు ఆమె చలనరహితమైన ముఖంమీద నృత్యం చేసింది. తల్లి చెప్పిన మాటలు విన్నాక,

"వాళ్ళ నాకోసం వస్తే కాల్చి పారేస్తాను" అని మెల్లగా దృఢనిశ్చయంతో చెప్పింది. "నామీద దౌర్జన్యం సాగించబోతే ఆత్మరక్షణ చేసుకునే అధికారం నాకుంది. నేను వాళ్ళతో పోరాడితీరాలి. ఆ పని చేయవలసిందని ఇతరులకు నేను పిలుపు ఇస్తున్నప్పుడు నేనే ఆ పని చెయ్యకుండా ఎల్లా ఉండగలను?"

నిప్పు వెలుగు ఆమె ముఖంమీదనుంచి జారిపోయింది, ముఖం మామూలుగా బింకంగా చిరాగ్గానే ఉంది.

"ఇది బతకవలసిన మార్గం కాదు" అనుకుంది తల్లి. లుద్మీలాను చూస్తుంటే ఆమెకు జాలి పొంగుకొచ్చింది.

లుద్మీలా అయిష్టంగా పావెల్ ఉపన్యాసాన్ని చదవడం మొదలెట్టింది. కాని చదువుతున్న కొద్దీ ఆమెకు దానియందభిలాష హెచ్చింది. చివరకు ఎంతో ఆసక్తితోనూ ఆత్రంగానూ అన్ని పేజీలూ చదివింది. చదవడం పూర్తిగావడంతోనే భుజాలు కట్టుకుని తల్లి దగ్గర కొచ్చింది.

"చాలా మంచి ఉపన్యాసం!" అంది.

తలొంచుకు నిలబడి ఒక్క క్షణంపాటేదో ఆలోచించింది.

"మీ కొడుకును గురించి మీ దగ్గర మాట్లాడ్డం నాకిష్టం లేకపోయింది. నేనెప్పుడూ అతన్ని కలుసుకోలేదు. కష్టం కలిగించే విషయాలను గురించి మాట్లాడ్డం నా కంతగా ఇష్టముండదు. మీకు చాలా ఆత్మీయుడైన వాడిని ప్రవాసం పంపితే ఎలా ఉంటుందో నాకు తెలుసు. కాని, నా కాశ్చర్యమేస్తోంది. మీ కలాంటి కొడుకున్నందుకు సంతోషిస్తున్నారా?"

"చాలా సంతోషిస్తున్నాను" అంది తల్లి.

"మరి భయం వెయ్యడం లేదా?"

"ఇప్పుడింకేమీ భయం లేదు" అని ప్రశాంతంగా చిన్ననవ్వు నవ్వుతూ జవాబుచెప్పింది.

లుద్మీలా ఒక చేత్తో సాపుగా ఉన్న జుట్టును కిందకు సవరించుకుని కిటికీ దగ్గర కెళ్ళింది. బలవంతంగా ఆపుకుంటున్న నవ్వు లీలగా ఆమె ముఖంమీద నీడలా క్షణమాత్రం మెదిలింది.

"నేను త్వరగానే అచ్చు కూర్చేస్తాను. మీరు పడుకోండి. మీరు రోజంతా కష్టపడ్డా రనుకుంటాను. చాలా అలసిపోయుండాలి. ఈ మంచంమీద పడుకోండి. నేను పడుకోను. రాత్రి నాకు సాయంచెయ్యడానికి అవసరమైతే మిమ్మల్ని కూడా లేపుతాను. పడుకోబోయే టప్పుడు దీప మార్పేయండి."

ఆమె పొయ్యిలో రెండు దుంగలు పడేసి, సన్నంగా ఉన్న తలుపును తెరుచుకుని అవ తలి కెళ్ళి, గట్టిగా తలుపేసుకుంది. తల్లి ఆమె వెళ్లడం చూసి ఆమె సంగతి ఆలోచిస్తూ పైదుస్తులన్నీ విప్పేసుకుంది.

"ఆమె మనసు దేనికోసమో క్షోభిస్తోంది...." అనుకుంది.

తల్లి చాలా అలసిపోయింది. కాని ఏదో చిత్రమైన ప్రశాంతత పొందింది. అంతటా మృదువుగా లలితమైన వెలుగు వ్యాపించి ఆమె హృదయాన్ని ముంచేసినట్లయింది. అలాటి ప్రశాంతత ఇదివరకామె ఎరుగున్నదే. ఎప్పుడైనా ఆవేశం పొంగివచ్చిన అనంతరం, ఆమె కలాటి అనుభూతి కలిగేది. ఆ అనుభూతి కలిగినప్పుడు, ఆమె భయపడిన రోజులుండేవి. ఇప్పుడు ఆ అనుభూతి ఆత్మను వికసింపజేస్తోంది. దృఢమైన మహత్తర భావాలతో బలపరు స్తోంది. ఆమె దీపం ఆర్పేసి చల్లగా ఉన్న మంచంమీద విశ్రాంతిగా పడుకుని కంబళి కప్పుకుంది. త్వరలోనే గాఢమైన నిద్రలో మునిగిపోయింది.

ఆమె కళ్ళు తెరిచేసరికి నిర్మలమైన శీతకాలదినపు చల్లని తేట వెలుతురు గదంతా వ్యాపించి ఉంది. పుస్తకం చేత్తో పుచ్చుకుని సోఫామీద పడుకున్న లుద్మీలా తలెత్తి ఆమెకేసి చూసి తన మామూలు చొప్పున కాకుండా, అదొక మోస్తరుగా మందహాసం చేసింది. తల్లి తత్తరపడి:

"అయ్యో నా తల్లీ! ఏం చేశానో చూశారా? చాలా పొద్దెక్కిందా?" అని ఆశ్చర్య పడింది.

"శుభోదయం!" అంది లుద్మీలా. "దాదాపు పది గంటలైంది. లేవండి, టీ తాగు దాం."

"మీరు నన్నెందుకు లేపలేదు?"

"లేపుదామని వచ్చాను. కాని నిద్రలో మీరు మధురంగా నవ్వుతుంటే, లేపడానికి మనస్కరించలేదు."

సోఫాలోంచి లేచి ఆమె తల్లి మంచం దగ్గర కిందకి వంగింది. ఆమె కళ్లలో తల్లికి తనకు సన్నిహితమై అర్థమైనట్టి భావం ఒకటి కనుబడింది.

"మీకు నిద్రాభంగం కలిగించడం నాకు న్యాయంగా తోచలేదు. బహుశా మీకేదో సంతోషకరమైన కల వచ్చివుండాలి."

"లేదు."

"అయినా ఫరవాలేదులెండి. మీ మందహాసం నా కెంతో నచ్చింది. ఎంతో ప్రశాంతంగా, మంచిగా, సర్వాన్నీ పరివేష్టించినదిగా ఉంది."

ల్యుద్మీలా నవ్వింది. ఆ నవ్వు మృదుమధురంగా ఉంది.

"నిద్రలో మీ నవ్వు మిమ్మల్ని గురించి ఆలోచించేటట్లు చేసింది. మీ జీవితం చాలా కష్టమైనదనుకుంటాను?"

కష్టమైనదవునా కాదా అని ఆశ్చర్యంతో ఆలోచిస్తుంటే తల్లి కనుబొమలు అదిరేయి.

"చాలా కష్టమైనదే అయివుండాలి!" అని ల్యుద్మీలా అంది.

"నేను ఖచ్చితంగా చెప్పలేను...." అని తల్లి మెల్లగా అంది. "ఒక్కొక్కప్పుడు జీవితం చాలా కష్టంగా ఉన్నట్లుంటుంది. కాని అది చాలా పరిపూర్ణంగా ఉంది. ముఖ్యమైనవీ అనుకోనివీ అనేక విషయాలు అందులో ఉన్నాయి. ఒకదాని వెంట ఒకటి చరచర నడుస్తాయి...."

ఇటీవల అనేక సార్లు జరిగినట్లే, ఇప్పుడు కూడా హఠాత్తుగా ఆమెకొక ఆవేశమొచ్చింది. అనేకమైన ఆలోచనలూ, దృశ్యాలూ మనసులో కొచ్చాయి. ఆమె మంచంమీద కూచుని నెమ్మదిగా వాటికి మాటలతో రూపకల్పనచేసింది.

"జీవితం అలాగే గడచిపోతుంది — అంతా చివరకు చేరే గమ్యస్థానం ఒకటే — కాని ఒక్కొక్కప్పుడు అది చాలా కష్టంగా ఉంటుంది. ప్రజలు బాధలు పడుతుంటారు — దెబ్బలు తింటారు — క్రూరమైన దెబ్బల పాలవుతుంటారు — వాళ్లను సుఖపడనివ్వరు. అది చాలా కష్టమైన సంగతి!"

ల్యుద్మీలా తల వెనక్కు వాల్చి ఆమెకేసి ఆప్యాయంగా తేరిపారజూసింది.

"కాని మీరు మాట్లాడే మాటలు మిమ్మల్ని గురించి కాదనుకుంటాను."

తల్లి మంచంమీదనుంచి లేచి బట్టలు వేసుకోవడం మొదలెట్టి,

"మిగతావాళ్లందర్నీ వదిలిపెట్టి నీ ఒక్క సంగతే ఆలోచించుకోవడం ఎల్లాగ? నువ్వు అందర్నీ ప్రేమిస్తున్నావాయె. అందర్ని గురించీ భయపడుతున్నావాయె. అందర్ని గురించీ జాలిపడుతున్నావాయె. ఆ జనాని కందరికీ నీ హృదయంలో స్థాన ముందాయె. అలాటప్పుడు వాళ్లకు దూరంగా ఎలా వుండగలవు?"

ఆమె సగం దుస్తులు మాత్రమే ధరించి ఆలోచనా నిమగ్నురాలై తన మాటలు ఆపి ఒక్క క్షణం గదిమధ్య నిలబడింది. తన కొడుక్కోసం నిరంతరం భయపడుతూ ఉలికిపడుతూ ఉండే ఇదివరకటి స్త్రీ కాదని ఆమెకు అనిపించింది. అతని శరీర రక్షణకోసం తాపత్రయపడే స్త్రీ కాదనిపించింది. ఆ స్త్రీ ఇక లేదు. ఆమె ఎక్కడికో పోయింది. ఎక్కడో అగమ్యగోచరమైన చోటికి పోయింది. లేక బహుశా ఆమెలో బయలుదేరిన ఆవేశాగ్నికి ఆహుతి అయివుండవచ్చు. ఈ ఆలోచనలతో ఆమె భయమంతా పోయి, ఆత్మకొక నూతనోత్తేజం,

బలం కలిగాయి. పాతకాలపు భయాలు మళ్లీ తలెత్తుతాయేమోననే భయంతో గుండె కొట్టు కుంటున్న ధ్వని నాలకిస్తూ ఆమె హృదయాన్ని పరిశోధించుకుంది. లుద్మీలా ఆమె దగ్గర కెళ్లి:

"ఏమిటాలోచిస్తున్నారు?" అని అడిగింది.

"నాకేం తెలియదు" తల్లి జవాబిచ్చింది.

మౌనంగా ఉభయులూ ఒకళ్లకేసి ఒకళ్లు చూసుకుని చిరునవ్వులు నవ్వుకున్నారు.

"నా సమొవార్ ఏమైందో?" అంటూ లుద్మీలా గదిలోంచి బయటి కెళ్లిపోయింది.

తల్లి కిటికీలోంచి బయటికి చూసింది. ఆ రోజున శీతకాలపు ఎండ బాగా కాస్తోంది. ఆమె హృదయం కూడా ఉజ్వలంగా, వెచ్చగా ఉంది. ఆమెకు అనేక విషయాలను గురించి మాట్లాడాలనిపించింది. సుదీర్ఘంగా ఆనందంతో మాట్లాడాలనిపించింది. ఏదో తన ఆత్మలో ప్రవేశించి, అస్తమయానికి ముందుండే సూర్యుని తేజస్సుతో ప్రకాశిస్తున్నందుకు తానెవరికో కృతజ్ఞత చూపాలనే భావం లీలగా ఆమె నావహించింది. ఇటీవల ప్రార్థన చెయ్యాలన్న కోరిక ఆమెకు కలగడం లేదు. ఇప్పుడా కోరిక కలిగింది. ఒక యువకుని ముఖం ఆమె మనోనేత్రంముందు తళుక్కుమంది. ఎవరో "ఈవిడ పావెల్ వ్లాసావ్ తల్లి!" అంటు న్నట్లు స్పష్టంగా వినబడింది. ఆర్ద్రంగానూ, ప్రకాశవంతంగానూ ఉండే సాషా కళ్లనామె చూసింది. రీబిన్ నల్లని విగ్రహం అగుపడింది. తన కుమారుని బలమైన కంచుముఖం కనబడింది. నికొలాయ్ బెదురుచూపులగుపడ్డాయి. హఠాత్తుగా ఇవన్నీ ఒక్క నిట్టూర్పులో మిళితమైపోయాయి. అవన్నీ కలిసి ఇంద్రధనస్సు రంగుకల్గి పారదర్శకమైన మేఘమై పోయి ఆమె ఆలోచనలనావరించి, ప్రశాంతతను ప్రసాదించాయి.

లుద్మీలా మరలా గదిలో ప్రవేశిస్తూనే:

"నికొలాయ్ చెప్పినమాట నిజమే. వాళ్లతన్ని అరెస్టుచేశారు. మీరు చెప్పిన ప్రకారమే ఒక పిల్లవాడి నక్కడకు పంపేను. ఆవరణలో పోలీసులున్నారనీ, గేటు వెనకాల ఒక పోలీసు నక్కి ఉన్నాడనీ అతను చెప్పేడు. అన్నిచోట్లా గూఢచారులున్నారుట. ఆ పిల్లవాడు వాళ్లందరినీ ఎరుగును" అంది.

"పాపం!" అని తల్లి తలూపింది.

ఆమె నిట్టూర్చింది. కాని తనకు దుఃఖం కలగనందుకు ఆమెకు ఆశ్చర్యం కలిగింది.

"ఈ మధ్య అతను పట్టణంలోని కార్మికులకు పాఠాలు చెపుతున్నాడు. పట్టుబడే సమయమొచ్చిందనుకుంటాను" అని లుద్మీలా అషామాషీగా కొంచెం చిరాకుతో చెప్పింది. "అతని స్నేహితులు వెళ్లిపొమ్మని సలహా చెప్పారు. కాని అతడు వినలేదు. అలాంటప్పుడు వాళ్లని బలవంతంగా పంపించెయ్యాలి కాని మెల్లగా చెప్పి లాభం లేదు."

ఆ సమయానికి నల్లని జుట్టు, ఎర్రని బుగ్గలూ, అందమైన నీలిరంగు కళ్లు, కోసైన ముక్కూ గల ఒక పిల్లవాడు లోపలికొచ్చి,

"సమొవార్ పట్టుకొచ్చేదా?" అని అడిగేడు.

"సరే, పట్టుకురా సెర్గేయ్!" లుద్మీలా తల్లికేసి తిరిగి, "అతను నా సంరక్షణలో ఉండే పిల్లవాడు" అని చెప్పింది.

ఈ వేళ లుద్మీలా వైఖరి మామూలుగా లేదని తల్లి గమనించింది. ఆమె చాలా నిరాడంబరంగానూ, సాయిలాపాయిలాగానూ ఉంది. ఆమె శరీరపు కదలికలు చాలా అందంగా, బలంగా, లాలిత్యం ఉట్టిపడుతూ ఉన్నాయి. అందుచేత కరుకుగా వెలవెలబారుతూ ఉండే ఆమె ముఖం ఈనాడు మృదువుగా కనబడింది. రాత్రి అంతా పనిచేస్తుండడం మూలాన ఆమె కళ్లచుట్టూ నల్లని వలయాలేర్పడ్డాయి. ఆమె హృదయంలో ఉద్రిక్తత రేగుతూన్నట్టు హృదయతంత్రి బిగుసుకున్నట్టు ముఖమే చెప్తోంది.

ఆ పిల్లవాడు సమొవార్ పట్టుకొచ్చాడు.

"సెర్గేయ్! నిన్ను పరిచయం చేస్తాను. ఈవిడ పెలగేయా నీలొవ్నా, నిన్నటి రోజున శిక్షించబడిన కార్మికుల్లో ఒకరి తల్లి" అంది లుద్మీలా.

సెర్గేయ్ ఏమీ మాట్లాడకుండానే వంగినమస్కరించి, కరచాలనం చేసి వెళ్లిపోయాడు. మరల ఒక బ్రెడ్డు తీసుకొచ్చి బల్లమీద ఉంచి బల్ల దగ్గర కూచున్నాడు. లుద్మీలా టీని గ్లాసుల్లో పోస్తూ, పోలీసులక్కడ ఎందుకింకా తచ్చాడుతున్నారో తెలుసుకునే వరకూ తల్లి ఇంటికెళ్లకూడదని ఆమెకు నచ్చజెప్పింది.

"బహుశా వాళ్లు మీకోసమే కాచుకుని ఉన్నారనుకుంటాను. మిమ్మల్ని కొన్ని మాటలడగాలని కాచుకునుంటారు."

"అడగనియ్యి. వాళ్లకు కావలిస్తే నన్ను కూడా అరెస్టుచెయ్యనియ్యి. మరేమంత ప్రమాదమేమీలేదు. కాని ముందుగా పావెల్ ఉపన్యాస కరపత్రాన్ని పంచిపెట్టనిస్తే చాలు!" అంది తల్లి.

"అచ్చు కూర్చడమైపోయింది. పట్టణానికీ, కార్మికవాడకూ సరిపోయేటన్ని ప్రతులు రేపటికి తయారవుతాయి. మీరు నతాషా నెరుగుదురా?"

"ఓ! ఎరుగుదును."

"వాటిని ఆమెకందియ్యండి."

ఆ పిల్లవాడు పత్రిక చదువుకుంటూ, వీళ్ల మాటలు వినిపించుకోనట్లున్నాడు. మధ్యమధ్య మాత్రం అతను తల్లి ముఖంకేసి చూస్తుండేవాడు. ప్రకాశమానమైన అతని కళ్లు తల్లి నాకర్షించాయి. ఆమె అతనికేసి చూసి చిరునవ్వు నవ్వేది. లుద్మీలా నికొలాయ్‌ని గురించి

ఏమీ విచారమనేది లేకుండా మాట్లాడింది. తల్లికి అది సహజమే ననిపించింది. కాలం గబగబ గడచిపోయింది. ప్రాతఃకాల భోజనమయేసరికి దాదాపు మధ్యాహ్నమైంది.

"ఎంత ఆలస్యమైంది!" అని లుద్మీలా ఆశ్చర్యపడింది.

ఆ సమయానికి ఎవరో గబగబ తలుపు కొట్టేరు. పిల్లవాడు లేచి లుద్మీలా ముఖం కేసి ఆజ్ఞకోసం చూశాడు.

"సెర్గేయ్, తలుపుతియ్యి. ఎవరై ఉంటారు?"

ఏమీ కలవరపాటు లేకుండా ఆమె చేతిని గౌను జేబులో పెట్టుకుని, తల్లితో:

"పోలీసులైతే ఆ మూల నుంచోండి, పెలగేయా నీలొవ్నా. సెర్గేయ్, నీమాటేమిటి?" అంది.

"నాకు తెలుసు" అన్నాడు పిల్లవాడు బయటికెడుతూ.

తల్లి చిన్న నవ్వు నవ్వింది. ఈ ముందు జాగ్రత్తలన్నీ ఆమెకేమీ విచారం కలిగించ లేదు. ప్రమాదమొచ్చే పూర్వ సూచనలేమీ ఆమె కనుపడలేదు.

ఇంతకూ ఆ వచ్చినాయన పొట్టి డాక్టరే.

"మొదటి సంగతి" అంటూ గబగబ మొదలెట్టేడు. "నికొలాయ్ అరెస్టయాడు. ఓహో! నీలొవ్నా! మీరిక్కడున్నారన్నమాట. అతన్ని పట్టుకున్నప్పుడు మీ రింటిదగ్గర లేరన్నమాట?"

"అతనే నన్నిక్కడకు పంపేడు."

"ఉహూం, అందువల్ల ఏమీ లాభం లేదనుకుంటాను. రెండవ సంగతి. క్రితం రాత్రి కొంతమంది యువకులు పావెల్ ఉపన్యాసాన్ని ఐదు వందల ప్రతులు సైక్లోస్టైల్ తీసేరు. వాటిని నేను చూశాను.... బాగానే ఉన్నాయి. వాళ్లు ఈ రాత్రే వాటిని పట్ట ణంలో పంచి పెట్టాలనుకుంటున్నారు. నేను దానికి వ్యతిరేకిని. అచ్చు ప్రతులను పట్టణంలో పంచిపెట్టి వాటిని మరొక చోట ఉపయోగించాలని నా అభిప్రాయం."

"నేను వాటిని నతాషా దగ్గరకు తీసుకెడతాను. నాకివ్వండి" అని తల్లి ఆత్రంగా అంది.

పావెల్ ఉపన్యాసాన్ని ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా వ్యాపింపచెయ్యాలని ఆమె చాలా తొందరపడుతోంది. తన కొడుకు మాటలను ప్రపంచమంతటా వెదజ ల్లాలని ఉబలాటపడింది. డాక్టరు జవాబుకోసం అతని ముఖంకేసి ప్రాధేయపూర్వకంగా చూసింది.

"ఈ పని మీరు ఇప్పుడు చెయ్యడం మంచిదో కాదో ఆ దేవుడికే తెలియాలి" అని తన గడియారంకేసి చూసుకుంటూ డాక్టర్ అన్నాడు. "ఇప్పుడు ఇరవై నిముషాలు తక్కువ పన్నెండు గంటలైంది. రెండు గంటల ఐదు నిముషాలకు ఒక రైలుంది. ఐదు

గంటల పదిహేను నిముషాలకు ఆ రైలక్కడకు చేరుతుంది. అంటే సాయంత్రమవుతుంది. కాని అంత ఆలస్యం కింద లెక్కకాదు.... అయితే ఆ విషయమంత ప్రధానమైనది కాదు....''

''కాదు. అది కానే కాదు'' అని చిరచిరలాడుతూ లుద్మీలా అంది.

''ఏది ప్రధానమైన విషయం?... ఆ పని బాగా జరగడమే కదా!...'' అని తల్లి అతని దగ్గరగా చేరి అడిగింది.

లుద్మీలా ఆమెను పరిశీలనగా చూసి,

''మీరు ఆ పని చేయడం చాలా అపాయకరం'' అని తన నుదుటిని నిమురుకొంటూ లుద్మీలా చెప్పింది.

''ఎంచేత?'' అని తల్లి కొంత ఉద్రేకంతో ప్రశ్నించింది.

''ఎందుకంటారా?... నికొలాయ్ అరెస్టుకు సరిగా ఒక గంట ముందు మీరు ఇల్లొదిలి పెట్టేరు. ఫ్యాక్టరీ కెళ్లేరు. అక్కడ మిమ్మల్ని నతాషా అత్తయ్యగా అందరూ ఎరుగుదురు. ఆ తర్వాత కాస్సేపట్లో ఫ్యాక్టరీలో నిషిద్ధ కరపత్రాలు దొరికేయి. ఇదంతా కలిపితే, మీ మెడకు చక్కని ఉచ్చు చుట్టుకుంటుంది'' అని డాక్టర్ గబగబా మాటలు విరిచేస్తూ చెప్పేడు.

''నన్నెవరూ గమనించరు. నేను తిరిగొచ్చాక, నువ్వెక్కడున్నావని అడిగితే.... ఏం చెప్పాలో నాకు తెలుసు'' అని గట్టిగా అంది. ''నేను తిన్నగా కూలిపేటలోకి వెళ్లిపోతాను.... అక్కడ నాకు సిజోవ్ అనే మిత్రుడున్నాడు. విచారణైనాక అతని వెంట అతడింటి కెళ్లేనని చెపుతాను. ఎందుకంటే, అతని మేనల్లుడికి కూడా శిక్షవేశారు కనుక ఒకళ్లనొకళ్లు ఓదార్చుకోవడానికని చెప్తాను. అతను నేను చెప్పినదాన్ని బలపరుస్తాడు'' అని తల్లి ఆత్రంగా అంది.

తల్లి తప్పకుండా వాళ్లు తన అభిలాషను మన్నిస్తారనుకుంది. వాళ్లనందుకు తొందర పెట్టాలనుకుని మరీమరీ అడిగింది. చిట్టచివరకి వాళ్లందుకంగీకరించారు.

''సరే. తీసుకెళ్లండి'' అని డాక్టర్ అయిష్టంతో అంగీకరించాడు.

లుద్మీలా ఏమీ మాట్లాడలేదు. ఆలోచనా నిమగ్నురాలై అటూ ఇటూ పచారుచేసింది. ఆమె ముఖం చిక్కిపోయి, కళ్లు దించుకుపోయాయి, బలిష్టమైన మెడనరాలు ముఖాన్ని గుండెలమీదకు వాలిపోకుండా బిగబట్టేయి. తల్లి ఆమె స్థితిని గమనించింది.

''నన్ను గురించి మీరింతగా ఆదుర్దాపడుతున్నారు.... కాని మీ సంగతి మీరు బొత్తిగా ఆలోచించుకోవడమే లేదు....'' అంటూ చిరునవ్వు నవ్వింది.

''చూసుకోకేం, చూసుకుంటూనే ఉన్నాం. చూసుకోవడం విధాయకమైంది.... ఎవరైతే సత్ప్రయోజనానికి కాకుండా ఇతరత్రా తమ శక్తిని వృథాచేస్తుంటారో వాళ్ల విషయంలో చాలా కఠినంగానే ఉంటాం. సరే మరి.... ఉపన్యాసం ప్రతులు రైల్వే స్టేషన్‌లో మీకందుతాయి'' అన్నాడు డాక్టరు.

అదెలా జరుగుతుందో విశదంగా ఆమెకు తెలియచెప్పేడు. చెప్పడమైనాక,

"మీకు అదృష్టం కలిసిరావాలని కోరుకుంటున్నా" అన్నాడు.

వెళ్లిపోతున్నప్పుడు అతనెందుకో కొంత అసంతృప్తిగా ఉన్నట్లనుపించాడు. అతన్ని సాగనంపి ల్యుద్మీలా తల్లి దగ్గరకొచ్చింది.

"మీ సంగతర్థమైంది" అని మెల్లగా నవ్వుతూ చెప్పింది.

ఆమె తల్లి భుజం పుచ్చుకుని పచారుచేస్తూ చెప్పడం మొదలెట్టింది:

"నాకూ ఒక కొడుకున్నాడు. వాడికి పదమూడేళ్లున్నాయి. తండ్రితో ఉంటున్నాడు. నా భర్త అసిస్టెంటు ప్రాసెక్యూటరు ఉద్యోగంలో ఉన్నాడు. పిల్లవాడాయనతోటే ఉన్నాడు. వాడేమైపోతాడో? తరుచుగా నేనదే ఆలోచిస్తుంటాను...." ల్యుద్మీలా కంఠం గద్గదమైంది. "నే నే జనాన్ని ప్రేమిస్తున్నానో, ఎవరిని ఈ ప్రపంచంలో కల్లా ఉత్తములని భావిస్తున్నానో, ఆ జనానికి శత్రువులైనవారి పెంపకంలో ఉన్నాడు. నా కొడుకే నాకు శత్రువు కావచ్చు. నేను వాడిని నాదగ్గర ఉంచుకోవడానికి వీల్లేదు. నేను మారుపేరుతో జీవిస్తున్నాను. నేను ఎనిమిదేళ్లుగా వాడిని చూడలేదు.... ఎనిమిదేళ్లు! ఎంతకాలమైందో కదా!"

ఆమె కిటికీదగ్గర ఆగి, కిటికీలోంచి వెల్లబారిన శూన్యాకాశంకేసి చూసింది.

"వాడు నాతో ఉన్నట్లయితే, నాకెంతో బలంగా ఉండేది. ఇప్పుడు నా హృదయాన్ని విడవకుండా వేధిస్తున్న నొప్పి ఉండేది కాదు.... వాడు చచ్చిపోయి ఉంటే — ఇంతకన్న సుఖంగా ఉండేది...."

"అయ్యో నా తల్లీ!" అని తల్లి తన ఆవేదనను వ్యక్తపరిచింది. జాలిచేత ఆమె హృదయం పగిలిపోయినట్లనిపించింది.

"మీరెంత అదృష్టవంతులండీ!... తల్లీ, కొడుకూ ఒక్కటిగా ఉండడం చాలా అద్భుతమైన విషయం. చాలా అపురూపమైన సంగతి" అని ల్యుద్మీలా కష్టంగా నవ్వుతూ చెప్పింది.

"అవును, చాలా అద్భుతమైన సంగతే" అని తల్లి అప్రయత్నంగా చెప్పింది. తర్వాత ఏదో రహస్యం చెప్పినట్లుగా మెల్లగా ఇలా చెప్పింది: "మనమంతా — మీరూ, నికొలాయ్ ఇవానొవిచ్, సత్యమార్గాన్ని అనుసరించే వాళ్లందరూ — మనమంతా ఒకటిగానే నిలబడుతున్నాం! హఠాత్తుగా మనమంతా బంధువులైపోయాం. మిమ్మల్నందరినీ నేనర్థం చేసుకున్నాను. మీరు చెప్పేవన్నీ ఎల్లప్పుడూ నాకర్థం కావు. కాని నాకు మిగిలిన సంగతులన్నీ అవగాహనైనాయి."

"అవును. అంతే దాని సంగతంతే" అని ల్యుద్మీలా పణికింది.

తల్లి, ల్యుద్మీలా గుండెలమీద చెయ్యేసి, తను చెప్పే మాటలన్నీ తన మనోనేత్రానికి అగుపడుతున్నట్లుగా ఆమె చెవిలో గుసగుసలాడింది.

"మన పిల్లలు ప్రపంచంలో ముందడుగు వేస్తున్నారు.... నాకు అలా కనబడుతోంది. ప్రపంచం నలుమూలలనుంచీ, ఒకే లక్ష్యం దగ్గరికి పిల్లలంతా చేరుకుంటున్నారు. పవిత్ర మైన హృదయాలు కలవాళ్లూ, నిష్కళంకమైన మనస్సులు కలవాళ్లూ అసత్యాన్ని పాదాలతో మట్టేస్తూ, దుర్మార్గాన్ని ఎదుర్కొంటూ ముందుకొచ్చేస్తున్నారు. వాళ్లు మంచి వయస్సులో ఉన్న యువకులు, ఆరోగ్యవంతులు. వాళ్ల బలాన్నంతా ఒకే ఒక లక్ష్యంకోసం అనగా న్యాయాన్ని సాధించడంకోసం వినియోగిస్తున్నారు! మానవుల దుఃఖాన్ని అంతరింప చేయడానికి, భూమిమీద దురదృష్టమనేది లేకుండా చేయడానికి — అసహ్యమనేది లేకుండా చేయడానికి నడుంకట్టి ముందుకెడుతున్నారు.... వాళ్లు తప్పకుండా విజయాన్ని సాధిస్తారు! వాళ్లలో ఒకడన్నట్లు ఒక కొత్త సూర్యుడిని వెలిగిద్దామంటున్నారు. తప్పకుండా వెలిగిస్తారు! పగిలిపోయిన హృదయాలను కలుపుతామని బయలుదేరేరు. తప్పకుండా కలుపుతారు!"

మరచిపోయిన ప్రార్థనల నామె జ్ఞప్తికి తెచ్చుకుంది. అవి ఆమె హృదయంలోంచి నెరుసుల్లా తళతళ లేచాయి. ఓ కొత్త విశ్వాసాన్ని రగుల్కొల్పేయి.

"మన పిల్లలు సబబైన సత్యమార్గాన నడుస్తున్నారు. మానవుల హృదయాలను ప్రేమతో నింపుతున్నారు. నూతనమైన స్వర్గాన్ని చూపెడుతున్నారు. ఒక నూతనమైన అగ్నితో ప్రపంచానికంతకూ వెలుగు చూపెడుతున్నారు. ఆరిపోని అగ్నిని ప్రజ్వలింప చేస్తున్నారు. ఆ జ్వాలల్లోనుంచే, యావన్మంది మానవులనూ సమానంగా ప్రేమించే మన పిల్లల ప్రేమ జ్వాలలోనుంచే — నూతన జీవితం ఉత్పన్నమవుతోంది. ఈ ప్రేమజ్వాల నెవరార్పగలరు? ఎవరు? ఏ శక్తి దాన్ని ధ్వంసం చెయ్యగలదు? ఏ శక్తి దాని నెదుర్కోగలదు? భూమే దానికి మాతృక్షేత్రం. జీవితమే దాని విజయాన్ని కాంక్షిస్తోంది. స్వయంగా జీవితమే!"

ఆవేశంచేత నీరసమొచ్చి, ఆమె దీర్ఘంగా నిశ్వాసం చేస్తూ దూరంగా పోయి కూచుంది. లుద్మీలా కూడా మెల్లగా అడుగుల్లెక్కేట్టుకుంటూ దూరంగా వెళ్లి కూచుంది. చప్పుడైతే ఏదో భంగమయ్యేటంత మెల్లగా నడుస్తూ గదిలో తిరిగింది. తేజో హీనమైన కళ్లతో తల్లిని చూస్తూనే ఉంది. తల్లి, ఇదివరకు కన్న పొడుగ్గా, పలచగా, నిటాగ్గా ఆమె కళ్ల కగుపడింది. కఠినమైన ఆమె పలుచని ముఖంమీద ఏకాగ్రత గోచర మైంది. ఆమె పెదవులు కరుచుకుని అదురుతున్నాయి. గదిలోని నిశ్శబ్దతవల్ల తల్లి త్వర లోనే ప్రశాంతస్థితి కొచ్చింది. లుద్మీలా విభ్రాంతస్థితిని గమనించి,

"బహుశా నేను చెప్పకూడని విషయం చెప్పేను కాబోలు?" అని తల్లి క్షమాపణ పూర్వకంగా అడిగింది.

లుద్మీలా ఆమెకేసి తిరిగి దాదాపు భయపడిపోయినట్లే చూసింది. తర్వాత ఇక చెప్ప ద్దన్నట్లుగా ఆమె చేయి పట్టుకుంది.

"వద్దు! వద్దు! అదంతే. కాని మనమింక ఆ విషయాన్ని గురించి మాట్లాడుకోవద్దు.

మీరేమి చెప్పేరో దాన్నలాగే ఉండనియ్యండి'' అంది. ''మీరు త్వరగా వెళ్లడం మంచిది. చాలా దూరం వెళ్లాలికదా'' అని మెల్లగా చెప్పింది.

''నా కొడుకు చెప్పిన మాటలను, నా రక్తంలో రక్తమూ మాంసంలో మాంసమూ అయిన నా కొడుకు మాటలను ఇతరులకు చెప్తూంటే నాకెంత సంతోషమో మీకు తెలుస్తేనా!... నా ఆత్మను సమర్పిస్తున్నట్లే!''

తల్లి చిరునవ్వు నవ్వింది. కాని అది లుద్మిలా ముఖంమీద స్ఫుటంగా ప్రతిబింబించ లేదు. ఆమె నిగ్రహంవల్ల తన సంతోషం నీరుకారిపోతున్నట్లు తల్లికి తోచింది. తనలో రగుల్తున్న అగ్నితో నిగ్రహంగా ఉన్న ఆమెను ప్రజ్వలింపజెయ్యాలనే గాఢమైన వాంఛ కలిగింది. సంతోషాతిశయంచేత పొంగిపోతున్న తన హృదయావేదనతో ఆమెను చలింప జెయ్యాలనే కోరిక పుట్టింది. ఆమె లుద్మిలా చేతిని గట్టిగా నొక్కిపట్టుకుని ఇలా చెప్పింది:

''అమ్మాయీ! జనానికందరికీ దారి చూపించే గొప్ప వెలుగుందని తెలుసుకున్నప్పుడు ఎంతహాయిగా ఉంటుందో! అందరూ ఆ వెలుగును చూసి, పూర్ణహృదయాలతో ఆ వెలుగు బాట ననుసరించే కాలం వస్తుందని తెలుసుకున్నప్పుడింకా ఎంత సంతోషం కలుగుతుందో!''

దయాపూరితమైన విశాలమైన ఆమె ముఖం ఒక్కసారి కంపించింది. కళ్లు ధగధగ మెరిసేయి. వాటి తేజస్సు రెక్కలతో ఎగురుతూందేమో అన్నట్టు వాటిపైన ఉన్న కను బొమలదిరేయి. తన యావత్తు శరీరాన్నీ తాను నింపివేస్తున్న మహత్తర ఆలోచనలతో, తాను ఎరిగినట్టీ, తాను అనుభవించినట్టీ ప్రతిదానితో ఆమెకు తల తిరిగింది. తదేక ధ్యానతో, మనస్సును కేంద్రీకరించి, ఈ మాటలనే ఆలోచనల సారాన్నంతనీ, ప్రకాశవంతమూ, కఠినమూ అయిన స్ఫటికాలుగా మార్చింది. ఆమె శరత్కాల హృదయాన్ని సృజనాత్మక శక్తి సంపన్నుడైన వసంతసూర్యుడు వెలుగొందించినట్లు, ఆ మాటలు వేనకువేలుగా అభివృద్ధిచెందేయి. వాటి వేడీ, వెలుగూ ఇతోధికంగా వృద్ధిపొందాయి.

''ఇదంతా చూస్తూంటే, మానవుని కడుపున కొత్త దేవుడు అవతారమెత్తినట్లుగానే ఉంది! ప్రతి ఒక్కటే అందరికీ — అంతా ప్రతి ఒక్కడికీ! నేనా దృశ్యాన్నే చూస్తున్నాను. అసలైన నిజం చెప్పాలంటే మనమంతా కామ్రేడ్లం. ఆత్మీయులైన బంధువులం. అందరమూ సత్యమనే తల్లి బిడ్డలం!''

మళ్లీ ఆమెకు ఆవేశం పొంగివచ్చి అందులో చిక్కుకుపోయింది. అలాగే నిలబడిపోయి, నిట్టూర్చి, చేతులు విశాలంగా చాచింది. '''కామ్రేడ్స్' అనే మాటను నాలో నేను స్మరించే సరికి, వారు నా హృదయంలోనుంచి పొంగి వస్తుండడం నేనే వినగలుగుతున్నాను!''

ఆమె చేయదలచుకున్న పని చేసింది: లుద్మిలా ముఖం వెలుగొందింది. పెదవులు వణి కేయి. బుగ్గలమీదనుండి అశ్రుబిందువులు జలజలరాలేయి.

తల్లి మందహాసం చేస్తూ, తను సాధించిన విజయానికి హృదయంలో ఆనందిస్తూ లుద్మిలాను కౌగలించుకుంది.

వాళ్లిద్దరూ విడిపోతుంటే లుద్మిలా తల్లి ముఖంకేసి తేరిపారజూసి మెల్లగా: "మీతో ఉంటే నాకెంత బాగుందో మీకు తెలుసా?" అంది.

## 29

ఆమె బయటికి రావడంతోనే అతి చల్లని గాలి ముఖానికి కొట్టింది. ముక్కు దిబ్బ డేసిపోయింది. అక్కడే ఆగి నాలుగు వైపులా చూసేసరికి ఒక మూల చింపిరి టోపీ ధరించిన బండివాడు నిలబడున్నాడు. కొంచెం పైగా ఒక మనిషి వంగి, తలను భుజాలదాకా వంచుకు నడుస్తున్నాడు. అతని ఎదురుగా ఒక సిపాయి చెవులు రుద్దుకుంటూ పరుగెత్తేడు.

"సిపాయిని దుకాణానికి పంపింనట్లుంది" అనుకుంటూ ముందుకు సాగింది. కాళ్లకింద మంచు కిరకిరలాడుతుంటే బాగానే ఉందనుకుంది. రైలువేళ కన్న చాలా ముందుగానే ఆమె స్టేషనుకు చేరుకుంది. కాని ఉన్న మూడవ తరగతి ప్రయాణీకులు కూర్చునే గది పొగచూరి అసహ్యంగా జనంతో క్రిక్కిరిసిపోయింది. రైలు బద్దీలమీద పనిచేసేవాళ్లంతా చలివేత లోపలకి చేరుకున్నారు. బండ్లుతోలేవాళ్లు, బట్టాపాతా ఇల్లూవాకిలీ లేనివాళ్లు అక్కడికే చేరేరు. ప్రయాణీకులైన కొందరు రైతులు కూడా అందులోనే ఉన్నారు. బొచ్చు కోటు ధరించిన ఒక లావుపాటి వర్తకుడు, మతగురువు, స్ఫోటకం మచ్చలుగల అతని కుమార్తె, అయిదారుగురు సిపాయిలు, అస్థిరులైన కొందరు వ్యాపారస్తులు వగైరాలున్నారు. జనమంతా పొగతాగుతూ మాట్లాడుకుంటున్నారు. టీ, వోద్కాలను తాగేరు. ఫలహారాలమ్మే దుకాణం దగ్గర ఎవడో పకపకా నవ్వేడు. అన్నిటిపైనా పెద్ద కెరటంలా కదుల్తోంది పొగ. తలుపు తెరిచినప్పుడల్లా కిర్రుమని చప్పుడయేది. దభీమని మూసెయ్యడంతోనే కిటికీ అద్దాలు అదిరిపోయేవి. పొగాకు వాసనతోనూ, ఉప్పుచేపల వాసనతోనూ గదంతా గుప్‌మంది.

తల్లి గుమ్మం దగ్గరగా అందరికీ అగుపడే చోట కూర్చుని ఎదురుచూస్తోంది. ఎవరైనా తలుపు తెరచినప్పుడల్లా చల్లని గాలి విసురుగా ఆమెకు తగిలేది. అది ఆమెకు సుఖంగానే ఉంది. అందుచేత గాలి తగిలినప్పుడల్లా దీర్ఘంగా ఊపిరి తీసుకుంది. జనం చాలామంది మూటలు మోసుకొస్తుంటే గుమ్మంలో ఇరుక్కుపోయేవారు. అందుచేత విసుగొచ్చి తిట్టుకుంటూ మూటను బెంచీ మీదనో కిందనో పారేస్తూ ఉండేవారు. చొక్కా చేతులమీదా మెడమీదా, గడ్డంమీదా మీసంమీదా అంటుకున్న మంచు తరకలను పణుక్కుంటూ దులుపుకుంటున్నారు.

ఒక యువకుడు, తోలు పెట్టెను చేత్తో పుచ్చుకుని తలుపు తోసుకు లోపలి కొచ్చాడు. నాలుగు మూలలా చురచుర చూసి తిన్నగా తల్లి దగ్గర కెళ్లేడు.

''మాస్కోకా ప్రయాణం?'' అని అడిగేడు.

''అవును. తాన్యాదగ్గరకి'' తల్లి జవాబుచెప్పింది.

''ఇదిగో!''

అతను పెట్టెను ఆమె పక్కన బెంచీమీద పెట్టేడు. సిగరెట్ ముట్టించి, టోపీ సర్దుకుని రెండవ గుమ్మంలోంచి బయటి కెళ్లిపోయాడు. తల్లి చల్లగా ఉన్న తోలుపెట్టెను తట్టి, దానిమీద మోచేతి వాన్చి, చుట్టూ ఉన్న జనాన్ని తృప్తితో పరిశీలించడం మొదలె ట్టింది. ఒక నిముషమైన తర్వాత అక్కడనుంచి లేచి, బయటికి పోయే గుమ్మం దగ్గరున్న సీటులోకి మారింది. అట్టే అంత బరువుగా లేని తోలుపెట్టెను చేత్తో పుచ్చుకుని, తల పైకెత్తుకుని, ఎదురైన మనుషుల ముఖాలను పరిశీలిస్తూ నీటుగా నడిచి వెళ్లింది.

పొట్టి కోటు తొడుక్కున్న ఒక యువకుడు కాలరు పైకెత్తుకుని దారి కడ్డొచ్చాడు. మౌనంగా అతను పక్కకు తొలగి, చేతిని టోపీదాకా పైకెత్తేడు. తల్లికి అతడి నెప్పుడో చూసి నట్లు జ్ఞాపక మొచ్చింది. ఆమె వెనక్కు తిరిగి చూసేసరికి, అతడామెను మెడనిగిడ్చి ఒంటి కంటితో చూస్తున్నాడు. అతని చూపు కత్తిపోటంత వాడిగా ఉంది. పెట్టెను పట్టుకున్న చేయి అదిరి వణికింది. హఠాత్తుగా పెట్టె బరువెక్కింది.

''ఇంతకు ముందెప్పుడో చూసినట్టుంది'' అని ఆలోచించడం మొదలెట్టింది తల్లి. అతని చూపామెకొక అప్రియమైన భావాన్ని కలిగించింది. క్రమంగా తన హృదయాన్ని గడ్డకట్టిస్తున్న భావాన్ని పక్కకునెట్టి ఆ ఆలోచనను తన మనస్సులో నిలబెట్టుకుంది. కాని ఆ భావమే వ్యాప్తమై కంఠంలో కొచ్చింది. నోరు పొడారిపోయి చేదెక్కింది. వద్దను కున్నా, వెనక్కు తిరిగి అతన్ని మరొకసారి చూడకుండా ఉండలేకపోయింది. అతడు నిల బడిన చోటే నిలబడి ఏమి చెయ్యాలా అని ఆలోచిస్తున్నట్లున్నాడు. ఎడమ చేతిని జేబులో పెట్టుకున్నాడు. కుడి చేతిని కోటు బొత్తాముల మధ్య దోపుకున్నాడు. ఎడమ భుజం కన్న కుడి భుజం పైకి లేచింది.

ఆమె ఒక బెంచీమీద కెళ్లి నెమ్మదిగా కూచుంది. తన లోపల ఉన్నదేదో పగిలిపోతుం దేమో నన్నంత భయంతో కూచుంది. ప్రమాదసూచనం వత్తిడివల్ల ఆమె జ్ఞాపకాలను శోధించింది. చివరకు ఈ మనిషిని తాను ఇదివరలో రెండు పార్లు చూసిన జ్ఞాపకం వచ్చింది. ఒక సారి, రీబిన్ జైల్లోనుండి పారిపోయి వచ్చినప్పుడు ఊరి చివర మైదానంమీద చూసింది. రెండవ సారి, పావెల్ విచారణప్పుడు చూసింది. రీబిన్ వెంటబడ్డప్పుడు తాను తప్పు దారి పట్టించిన పోలీసు ఉద్యోగి పక్కనే కోర్టుహాల్లో నిలబడ్డప్పుడు చూసింది. తనమీద పోలీసు నిఘా ఉందని అప్పుడామె గ్రహించింది. దాని కేమీ సందేహం లేదు.

"దారితప్పిపోయావా ఏమిటి?" అని తన్ను తానే ప్రశ్నించుకుంది.

"ఇంకా లేదేమోలే" అని వణుకుతూ జవాబుచెప్పుకుంది.

ఒక్క క్షణమాగి, ఉన్నదున్నట్లు చెప్పుకోక తప్పదన్నట్లుగా,

"దారితప్పిపోయాను!" అని నిశ్చయించుకుంది.

ఆమె నాలుగు పక్కలా చూసింది. కాని ఏమీ కనబడలేదు. ఆలోచనలు మాత్రం మనసులో మిణుగురుల్లాగ రేగేయి.

"ఈ తోలుపెట్టెనిక్కడ వదిలేసి పోదునా?"

ఈ భావాన్ని మించి మరొక ఆలోచన తళుక్కున మనసుకు తట్టింది.

"ఏమిటీ? నా కొడుకు మాటలను వదిలిపెట్టేయడమే? అలాటివాళ్ల చేతుల్లో వదిలిపెట్టి వెళ్లిపోవడమే?"

ఆమె తోలుపెట్టెను గట్టిగా పట్టుకుంది.

"దీన్ని పుచ్చుకు పారిపోతేనో?... పారిపోవడమే?"

ఇలాంటి ఆలోచనలు పైనుంచి శత్రువుల్లా మీద పడుతున్నాయి. ఆమె మనస్సునవి దహింపచేశాయి. హృదయాన్ని నిప్పు దారంతో కుడుతున్నట్లనిపించింది. ఆ బాధతో ఆమెకు తనకు తానే దూరమైపోయినట్లయింది. పావెల్ దగ్గరనుంచీ, తన కత్యంత ప్రియమైన అన్నిటినుంచీ దూరమైపోతున్నట్లనిపించింది. ఏదో ఒక ప్రతికూల శక్తి తన భుజాలనూ గుండెలనూ నొక్కిపట్టి, ప్రాణాంతకమైన భయంతో ఉక్కిరిబిక్కిరిచేస్తున్నట్లు తోచింది. కణతలమీద రక్తనాళాలు పొంగి తీవ్రంగా కొట్టుకోవడం మొదలెట్టేయి. ఆపాదమస్తకం వేడెక్కిపోయింది.

హఠాత్తుగా ఒక్క గొప్ప ప్రయత్నంతో చేసి, ఈ ఆలోచనలన్నిటినీ ఆమె తోసి పారేసింది. బలహీనమైన నీచమైన ఈ వెరుపులన్నిటినీ తోసేసింది. తనలో తానే "ఛీ! సిగ్గు, సిగ్గు!" అని సగర్వంగా హెచ్చరించుకుంది.

క్షణంలో ఆమె మనస్సు కుదుటబడింది. నిజానికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. "నీ కొడుకుని అవమాన పరచకు! నువ్వు భయపడకు!" అనుకుంది.

ఆమె దృష్టికొక మకమకలాడుతూన్న బెరుకు చూపగుపడింది. మనోనేత్రానికి రీబిన్ ముఖం గోచరించింది. కొద్ది నిముషాల సంకోచం తర్వాత మరింత ధైర్య మొచ్చింది. ఇప్పుడామె గుండెలు నిదానంగా కొట్టుకున్నాయి. నాలుగు మూలలా పరికిస్తూ,

"ఇప్పుడేమవుతుంది?" అనే ఆలోచనలో పడింది.

గూఢచారి, స్టేషన్ గార్డును పిలుచుకొచ్చి, కళ్లతో ఆమెను చూపెడుతూ అతని చెవిలో గుసగుసలాడేడు. గార్డు అతనికేసి చూసి వెనక్కెళ్లిపోయాడు. ఇంతలో మరొక గార్డొచ్చాడు. అతను చెప్పిన మాటలన్నీ విని చిరచిరలాడేడు. అతను ముసలివాడు. నెరి

సిన జుట్టూ, మాసిన గెడ్డంతో పొడుగ్గా ఉన్నాడు. గూఢచారి వంక తలూపి, అతను తల్లి కూర్చున్న బెంచీ వైపుకు బయల్దేరేడు. గూఢచారి అదృశ్యమైపోయాడు.

ముసలి గార్డు చిరచిరలాడుతూ, తల్లికేసి తదేక ధ్యానతో చూస్తూ, తాపీగా దగ్గర కెళ్లేడు. ఆమె బెంచీమీద వెనక్కు చేరబడింది.

"నన్ను కొట్టకుండా ఉంటే బాగుండును!" అనుకుంది.

అతను ఆమె ఎదుట నిలబడ్డాడు. ఒక్క నిమిషం ఏమీ మాట్లాడకుండా నిల బడ్డాడు. చివరకు,

"ఏమిటలా చూస్తున్నావు?" అని అడిగేడు.

"ఏమీ లేదు."

"అలాగా? ఆసి దొంగ! ఈ వయస్సులో ఇలాటి తమాషాలు చేస్తున్నావన్న మాట!"

అతని మాటలామె ముఖాన కొట్టినట్లయింది. ఒకసారి! రెండుసార్లు! అతని మాట ల్లోని మోటుతనం, ద్వేషం, ఆమె దవడను పగలగొట్టినంతగా, గుడ్లు పీకినంతగా బాధించాయి.

"నేనా? నేను దొంగని కాను! నువ్వబద్ధమాడుతున్నావు!" అని గట్టిగా అరిచింది. ఆమెలో ప్రజ్వరిల్లిన నైతికాగ్రహం, చుట్టుపక్కలనున్న వస్తువులన్నిటినీ ఊపేసింది. ఆమె తోలుపెట్టె నొక్క లాగు లాగింది. పెట్టె తెరుచుకుంది.

"అందరూ చూడండయ్యా, చూడండి!" అని ఆమె కేకలేసింది. ఒక గంతేసి లేచి చేతినిండా కరపత్రాలు పుచ్చుకుని చెయ్యి పైకెత్తింది. ఆమె చెవుల్లో అరుపులూ, కేకలూ పడ్డాయి. నాలుగు మూలల్నుంచీ జనం ఆమె దగ్గరకు పరుగెత్తు కొచ్చారు.

"ఏం జరిగింది?"

"అదుగో — గూఢచారి...."

"ఏమిటది?"

"ఈమె దొంగ అంటున్నారు!"

"అంత మర్యాదస్తురాలైన స్త్రీ దొంగా? ఛఛ!"

"నేను దొంగని కాను!" అని తల్లి బిగ్గరగా అరిచింది. జనం ఆమెచుట్టూ మూగ డంతోనే ఆమె ఆవేశం తగ్గింది.

"నిన్నటి రోజున రాజకీయ ఖైదీల విచారణ జరిగింది. నా కొడుకు పావెల్ వ్లాసావ్ వాళ్లలో ఒకడు. అతనొక ఉపన్యాసం ఇచ్చాడు. ఇదిగో అది! నేను దాన్ని జనం దగ్గరికి తీసుకు పోతున్నాను. దాన్ని వాళ్లు చదువుకుని నిజం తెలుసుకోవాలని నా అభిప్రాయం...."

ఎవరో ఒకరు అతి జాగ్రత్తగా ఆమె చేతిలోని కరపత్రాన్నొకదాన్ని తీసుకున్నాడు. ఆమె వాటిని గాలిలో ఊపి జనంమీదకు విసరేసింది.

"అందుకు మీకు తగిన శాస్తి చేస్తారు!" అని భయపడుతూ ఎవరో చెప్పేరు.

జనం కరపత్రాలన్నిటినీ తీసుకుని జేబుల్లోనూ, కోట్లలోపలా కుక్కుకోవడం తల్లి చూసింది. ఈ దృశ్యమామెకు కొత్త బలాన్నిచ్చింది. పొంగిపొరలుతున్న గర్వంతో మాట్లాడ్డం మొదలెట్టింది. మాట్లాడుతూనే, ఆమె ఎంతో ప్రశాంతంగానూ, తీవ్రంగానూ సంతోషంతోనూ పెట్టెలోంచి గుప్పెడేసి కరపత్రాలను పైకి లాగి, కుడి వైపుకూ, ఎడమ వైపుకూ విసిరేసింది. వాటిని జనం ఎంతో ఆసక్తితో పట్టుకున్నారు.

"నా కొడుకునూ, అతని మిత్రులనూ వాళ్ళ కోర్టుకెందుకు లాక్కొచ్చారో తెలుసునా? నేను చెపుతున్నాను వినండి. మాతృహృదయాన్నీ, పండిన నా జుట్టునూ నమ్మండి. వాళ్ళ ప్రజలకు నిజం చెప్పిన చిన్న అపరాధానికే వాళ్ళని కోర్టుకెక్కించారు! ఈ సంగతి నెవరూ కాదనేవాళ్ళు లేరని నిన్న తెలుసుకున్నాను. ఒక్కరు కూడా లేరు!"

గుంపు పెద్దదైంది. నిశ్శబ్దంగా ఉంది. ఆమె చుట్టూ జనం సజీవమైన కడియం కట్టేరు.

"దరిద్రం, ఆకలి, రోగం, ఇవే ప్రజలు పడే కష్టానికి ప్రతిఫలాలు! అంతా మనకు ప్రతికూలమే — మన జీవితకాలమంతా, ప్రతి రోజూ శరీరంలో ఉండే శక్తినంతనీ పనికే ధారపోస్తాం. దరిద్రపు పనికి వినియోగించి దగాపడుతుంటాం. మనల్ని గొలుసులకు కట్టేసిన కుక్కల్లాగ అజ్ఞానంలో పడేసి ఉంచి, మన కష్టంనుంచి లభించిన ఆనందాన్నీ, లాభాలనూ ఇతరులు అనుభవిస్తారు. మనకేమీ తెలియదు. మనలను భయంలో ఉంచుతారు. మనం దేన్ని చూచినా భయపడుతూ ఉంటాం. మన జీవితాలు ఒక సుదీర్ఘమైన చీకటి రాత్రి!"

"ఆ మాట నిజం" అని జనంలోంచి మెల్లగా ఆమోదసూచకంగా మాటలు వినబడ్డాయి.

"ఆమె నోరు మూయించు!"

గుంపు వెనకాల గూఢచారీ, ఇద్దరు పోలీసులు నిలబడి ఉండడం తల్లి కనిపెట్టింది. కరపత్రాలు ఆఖరువరకూ తొందరతొందరగా పంచిపెట్టేసింది. ఆఖరుసారి పెట్టెలో చెయ్యి పెట్టేసరికి, అందులో మరొకరి చెయ్యి తగిలింది.

"తీసుకోండి, తీసుకోండి" అని వంగుని చెప్పింది.

పోలీసులు జనాన్ని పక్కకు తోసేస్తూ,

"పోండి! పోండి!" అని కేకలేశారు. పోలీసుల్ని తోస్తూ జనం అయిష్టంగానే దారిచ్చారు, బహుశా అప్రయత్నంగానే వాళ్లను వెనక్కి దబాయించారు. విశాలమైన విష్కపటమైన నేత్రాలూ, దయామయమైన ముఖమూ కలిగిన ఆ ముసలమ్మ పట్ల జనం అనివార్యంగా ఆకర్షింపబడ్డారు. జీవితంలో ఏకాకులై, ఒకళ్లతో ఒకళ్లకు పడకుండా ఉండే వాళ్లంతా ఇక్కడ ఇప్పుడు ఒకటై, అగ్నిజ్వాలల్లాంటి మాటలను ప్రగాఢమైన అనుభూతితో

వింటున్నారు. బహుశా జీవితంలో అనేక అన్యాయాలకు గురై, వాళ్లలో చాలామంది హృదయాలు అలాటి మాటలను వినడానికి తహతహపడుతున్నాయి కాబోలు. తల్లికి బాగా దగ్గరగా ఉన్నవాళ్ళు, ఆత్రంగా బహుశ్రద్ధగా ఆమెకు గుడ్లప్పగించి మౌనంగా నిలబడి పోయారు. వాళ్ల మలివెచ్చని ఊపిరి ఆమె ముఖానికి కొడుతోంది.

"ముసలమ్మా! వెళ్లిపో!"

"ఒక్క నిముషంలో నిన్ను పట్టేస్తారు!"

"ఆమె ఎంత ధైర్యస్తురాలో!"

"ఇక్కణ్ణుంచి పోండి! ఎవరి చోట్లకు వాళ్ళు వెళ్లిపోండి!" అని పోలీసులు కేక లేను కుంటూ ముందుకు చొచ్చుకొచ్చారు. తల్లి కెదురుగా ఉన్న జనం ఊగుతూ ఒకళ్ల నొకళ్ళు గట్టిగా పట్టుకున్నారు.

జనం తను చెప్పినదంతా అర్థం చేసుకుని నమ్మడానికి సిద్ధంగా ఉన్నట్లామె గుర్తించింది. కనుక తనకు తెలిసిందంతా గబగబ చెప్పెయ్యాలనుకుంది. ఏ ఆలోచనల శక్తిని తను అనుభవించిందో ఆ ఆలోచనలన్నిటినీ శీఘ్రంగా చెప్పెయ్యాలనుకుంది. ఆ ఆలోచనలు హృదయాంతరాళంలోనుంచి లేచి ఒక పాటగా రూపొందేయి. కాని ఆ పాటను తాను పాడ లేనని ఎంతో బాధతో తెలుసుకుంది. ఆమె గొంతుక గద్గదమైంది. మాటలు ధారాళంగా రావడం లేదు.

"నా కొడుకు మాటలు, ఆత్మని అమ్మేసుకోని కార్మికుని నిజాయితీగల మాటలు. వాటిలోని ధైర్యంవల్లనే అవి నిజాయితీగల మాటలని చెప్పవచ్చు!"

భయంతోనూ, తన్మయత్వంతోనూ, ఒక యువకుని కళ్లు ఆమెకేసి తదేక దృష్టితో చూసేయి.

ఎవరో ఆమెను గుండెలమీద గుద్దేరు. ఆమె బెంచీమీద పడిపోయింది. పోలీసుల చేతులు జనం నెత్తిమీద తళతళలాడుతూ నృత్యంచేశాయి. జనాన్ని మెడలు పట్టుకునీ, భుజాలు పట్టుకునీ, తోసిపారేశారు. టోపీలు లాగేసి, గది ఈ చివరనుంచి ఆ చివరకు విసిరిపారేశారు. తల్లి కళ్లు గిరగిర తిరిగిపోయాయి. పోగా మిగిలిన గొంతుకతో, అరిచేందుకుగాను, తన బలహీనతను జయించింది. "ఓ సత్పురుషులారా! కలసికట్టుగా నిలబడి, ప్రబలమైన ఐక్య శక్తి కండి!" అంటూ అరిచింది.

బలిసిన పెద్ద చేత్తో ఒక పోలీసు ఆమె మెడని పట్టుకుని ఊపేశాడు.

"నోర్ముయ్!"

ఆమె తల గోడకు కొట్టుకుంది. ఒక్క క్షణం ఆమె హృదయంలో భయమనే ఘాటు పొగ పుట్టింది. కాని మళ్లీ ధైర్యం భగ్గున లేచి పొగను పారద్రోలింది.

"పిద పద!" అన్నాడు పోలీసు.

"మీరు దేనికీ భయపడకండి! మీరు బతికే బతుకులకన్న కనాకష్టమైనదింకేమీ ఉండదు...."

"నోరు ముయ్ అని చెప్తున్నాను!"

పోలీసు ఆమె చెయ్యి పట్టుకుని ముందుకు గెంటేడు. మరొక పోలీసు రెండో చెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరూ కలిసి ఆమెను లాక్కుపోయారు.

"...ప్రతి రోజూ మీ హృదయాన్ని తినేసే బాధకన్న ఇదెక్కువది కాదు. మీ ఆత్మను నమిలేదాని కన్న ఎక్కువది కాదు!"

గూఢచారి ఆమె ముఖంమీద పిడికిలి ఝుడిపిస్తూ ముందు పరుగెత్తేడు.

"నోరు ముయ్, ముండా!" అని అరిచాడు.

ఆమె కళ్ళు చమక్ మన్నాయి. పెద్దవయ్యాయి. పెదవులు వణికేయి. ఆమె జారుతున్న రాతినేలమీద పాదాలను బిగతన్నింది.

"పునరుత్థానమైన ఆత్మని చంపలేరు!" ఆమె బిగ్గరగా అరిచింది.

"ఓసి ముండా!"

గూఢచారి ఆమె ముఖంమీద ఒక్క దెబ్బ కొట్టేడు.

"మా బాగా జరిగింది మునలిదానికి!" అని ఎవరో ద్వేషంతో అన్నాడు.

ఒక నిముషం నల్లగా ఎర్రగా ఉన్న పదార్థంతో ఆమె కళ్ళు చీకట్లు కమ్మేయి. నోరు ఉప్పగా రక్తాన్ని చవిచూసింది.

నన్నని మాటల ధ్వనితో ఆమె తెప్పరిల్లింది.

"ఆమెని ముట్టుకుంటే జాగ్రత్త!"

"రండయ్యా, రండి!"

"ఓరి దుర్మార్గుడా, నువ్వు!"

"వాడి కివ్వవలసిందే!"

"వాళ్ళు మన మనసులను రక్తసిక్తం చెయ్యలేరు!"

వాళ్ళామెను నడుం పట్టుకు గుంజేరు. మెడ పట్టుకు గెంటేరు. భుజాలమీదా, తలమీదా కొట్టేరు. అంతా ధగధగమంది. కేకలు, బొబ్బలు, ఏడవులు, ఈలల తుపానులో అన్నీ బిగేలుమన్నాయి. ఆమె తల దిమ్మెక్కిపోయింది. చెవులు గడియలు పడిపోయాయి. గొంతుక కేదో అడ్డుపడి ఊపిరాడలేదు. నేలకిందకు దిగిపోయిన్నట్లయింది. ఆమె మోకాళ్ళ పట్టు సడలిపోయాయి. బల్లెపు పోటుల్లాంటి పోట్లతో ఆమె జంకిపోయింది. శరీరం బరువెక్కి నిస్సహాయంగా ఊగిసలాడింది. కాని ఆమె కళ్ళలోని మెరుగు మాత్రం పోలేదు. ఆ కళ్ళతో ఆమె ఇతరుల కళ్ళను, తనకు సుపరిచితమైన, తనెంతగానో ప్రేమించే ఉజ్వల, సాహసిక జ్వాలతో భాస్వంతమైన కళ్ళను చూస్తోంది.

ఆమెను గుమ్మంలోంచి ముందుకు గెంటేరు.

ఆమె ఒక చేతిని వదిలించుకుని దానితో తలుపు గడియని పట్టుకుంది.

"రక్త సముద్రం కూడా సత్యాన్ని ముంచెయ్యలేదు!"

వాళ్లామెను చేతిమీద కొట్టేరు.

"మిమ్మల్నింకా ద్వేషించేటట్లు చేసుకుంటున్నారు! మీరు మూర్ఖులు! ఇదంతా చివరకు మీ నెత్తిమీదే పడుతుంది!"

ఒక పోలీసు ఆమె గొంతుక నొక్కడం మొదలెట్టాడు. ఆమె ఉక్కిరిబిక్కిరైంది.

"ఓరి దౌర్భాగ్యులారా!..."

ఎవరో బిగ్గరగా ఏడుపులో ఆమెకు సమాధానమిచ్చారు.

1906–1907

# ఉపసంహారానికి బదులు
## (గోర్కీ రచించిన "అమ్మ" నవలకు మలిపలుకు)

గోర్కీ నవల "అమ్మ" కథానాయకులను, వారి జీవితంలోని కష్టసమయంలో విడిచి పెట్టేశాం. వెయ్యి మైళ్ల ప్రయాణం — సైబీరియాలో శాశ్వతంగా గడపవలసిన ప్రవాసజీవితం — పావెల్‌కోసం ఎదురుచూస్తోంది. పావెల్ కోర్టులో ఇచ్చిన ఉపన్యాసం అచ్చువేసివున్న నిషిద్ధ కరపత్రాలను సూట్‌కేసునిండా నింపుకొన్న అతని తల్లి నీలొవ్నా పోలీసుల చేతుల్లో చిక్కుకుంది. పోలీసులు ఆమెను నానా తిట్లూ తిడతారు, కొడతారు. కాని వాటిని భరించి, తన చుట్టూ చేరిన జనానికి ఆమె జీవిత సత్యాన్ని గురించి ఆదరాబాదరా చెబుతుంది. తనను హింసించుతూన్న పోలీసు కింకరుల ముఖంమీదనే మాట లను గట్టిగా విసిరేస్తుంది. "రక్త సముద్రం కూడా సత్యాన్ని ముంచెయ్యలేదు!... మీరు మూర్ఖులు! ఇదంతా చివరకు మీ నెత్తిమీదే పడుతుంది!"

గోర్కీ నవలలోని ప్రధానపాత్రల ప్రాగ్రూపవ్యక్తుల — ప్యోత్ర్ జలోమొవ్, అతని తల్లి అన్నా కిరీల్లొవ్నాల — భావిజీవితం ఎట్లా గడిచింది?

ప్యోత్ర్ జలోమొవ్ చాలాకాలం బతికి, డెబ్బైయేళ్ల ముసలివాడై, 1955లో చని పోయాడు. అతని తల్లి, అన్నా కిరీల్లొవ్నా జలోమొవా కూడా చాలాకాలం జీవించింది. ఆమె గురించి గోర్కీ ఇలా రాశాడు:

"1902లో సోర్మొవాలో జరిగిన మేదినోత్సవ ప్రదర్శనలో పాల్గొన్నందుకు శిక్షించ బడిన ప్యోత్ర్ జలోమొవ్ తల్లియొక్క చిత్తరువు నీలొవ్నా. ఆమె కార్మిక ఆర్గనైజేషన్‌లో పనిచేసింది. దేశదిమ్మరి వేషంవేసుకుని సారస్వతాన్ని ఊరూరూ తీసుకెళ్లి అందించింది...."

అన్నా కిరీల్లొవ్నా 1849లో ఒక గొడారి కుటుంబంలో పుట్టింది. ఆమె జీవితం ఎంతో నికృష్టంగా గడిచింది. పెనిమిటి చనిపోవడంతో, ఏడుగురు పిల్లలను పెంచవలసిన బాధ్యత ఆమెపై పడడంచేత ఆమె బతుకు మరింత దుర్భరమైపోయింది. ఒక "వితంతు శరణాలయం"లో నేలమాళిగలో — వణుకెత్తించే చలితో మసకచీకటిగా వున్న చిన్న గదిలో తన పిల్లలతో బతుకు వెళ్లమార్చింది. తల్లి మొండి ధైర్యమూ, పనిపాటులయెడల పట్టు దలా, ఎంత బండచాకిరీనైనా భరించగల్గే శక్తీ — కేవలం ఇవే ఆ కుటుంబాన్ని రక్షించాయి. పిల్లలు పెరిగి పెద్దవాళ్లయారు — పెద్దపిల్లలు పనుల్లో ప్రవేశించారు, చిన్నవాళ్లు బడిలో చదువుకుంటున్నారు. ప్యోత్ర్ విప్లవసమితిలో చేరాడు, ఇక — "మా జీవితంలో ఉల్లాస

కరమైన నూతన వాయువు వీచింది" అంది ప్యోత్ర్ బెల్లెలు వర్వారా, ఆ రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ. ఆ తరువాత జలోమొవ్ కుటుంబం యావత్తూ విప్లవోద్యమంలో పాల్గొని పనిచేసింది.

అక్టోబరు విప్లవం తరువాత, అన్నా కిరీల్లొవ్నా తన పిల్లలదగ్గరే – కొన్నాళ్ళ లెనిన్‌గ్రాడ్‌లో చిన్నకూతురు దగ్గర, కొన్నాళ్ల సొర్మొవొలో కొడుకులదగ్గరా – వుండిపోయింది.

ఆ వృద్ధురాలు ఏమంత పొడగరికాదు, ఆమె కళ్లలో అద్భుతమైన జీవకళ, ముఖంలో దయాపూరితమైన మందహాసం ఉట్టిపడుతూండేవి. నెరసిన తలపై పూర్వకాలపు పంపిణీ నల్లని లేసు శాలువను ఆమె సాధారణంగా కప్పుకొనేది. ఆమె ఇలా ఉండేదని ఆమెను జ్ఞాపకంతెచ్చుకున్నట్టి లెనిన్‌గ్రాడ్‌లోని ఫ్యాక్టరీ కార్మికస్త్రీలూ, నిజ్ని నొవ్‌గొరొద్ స్కూలు పిల్లలూ, సొర్మొవొ కార్మికులూ, వెనుకటి రోజులను గురించీ, తన విప్లవ కార్యకలాపం గురించీ, తన కొడుకు గురించీ ఆమె నిరాడంబరంగా నిష్కపటంగా చెబుతూండగా ఆమెను విన్నవారూ, చూచినవారూ చెప్పారు.

అన్నా కిరీల్లొవ్నా 1938లో చనిపోయింది.

ప్యోత్ర్ జలోమొవ్ గురించి చెప్పుకుందాం. న్యాయస్థానం జారీచేసిన తీర్పు ప్రకారం ప్రవాసశిక్ష అనుభవించేందుకు ప్యోత్ర్ జలోమొవ్ 1903లో కాలినడకన సైబీరియాకు బయల్దేరాడు. మజిలీలు చేసుకుంటూ ఒక యేడాది నడిచిన తర్వాత అతడు ఎనిసేయ్ నదీ తీరం చేరుకుని, క్రస్నొయార్‌స్క్ నగరానికి మూడువందల కిలోమీటర్ల దూరంలో వున్న మక్లకొవ్క అనే కుగ్రామంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు.... "రెండేళ్ల ప్రవాసజీవితం గడిచింది, స్థానిక రైతుల మధ్య ప్రచారం సాగించాము. జిల్లా ఆఫీసు గుమాస్తా, అతని ఇద్దరి అసిస్టెంట్ల మధ్య మేము సాగించిన ప్రచారం సఫలీకృతమైంది. అలెక్సేయ్ మక్సీమొవిచ్ గోర్కీ నాకు నెలవారీ పంపించే ఎనిమిది రూబుల్లూ జిల్లా పోలీసు ఆఫీసరు ప్రతినెలా కాజేసేవాడు. ఆకలితో, వమ్మంతో చివరకు నాకు స్కర్వీ జబ్బు పట్టుకుంది...." అని ఆ రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ రాశాడు ప్యోత్ర్ జలోమొవ్.

అది 1904 మార్చి నెల. ఆ రోజున చక్కగా ఎండకాస్తూంది. ప్యోత్ర్ జీవితంలోని పవిత్రదినాల్లో అదొకటి. బొమ్మరిల్లంతటి తన చిన్నగదిలో ఆవాడతను కూర్చుని, దేవదారు చెక్కతో స్కీలు తయారుచేసుకోగల్గాడు. "నా గుండె నెమ్మదిగా నిదానంగా కొట్టుకుం టూంది.... హఠాత్తుగా గదితలుపు తెరచుకుంది. పాతగిలిపోయిన బొచ్చుకోటు తొడుక్కుని, తుషారానికి రోజారంగుతేరిన ముఖంతో జోసెఫీనా ఎదువార్దొవ్నా నా దగ్గరకు వచ్చింది. నా దగ్గరకి వచ్చేందుకు ఆమె కొన్ని వేల కిలోమీటర్లు ప్రయాణం చెయ్యవలసి వచ్చింది."

అజ్ఞాతవాసజీవితం సాగించుతూ వున్న ఇద్దరు వృత్తి విప్లవకారుల ప్రేమజీవితం కడగండ్లతో బహుకఠినంగా సాగింది. మాస్కోలో ఉపాధ్యాయురాలుగా వుంటూండిన

ఫ్రెంచి సంతతికి చెందిన యువతి జోసెఫీనా గాషేర్‌తో ప్యోత్రకి 1901లోనే పరిచయం కల్గింది. కార్మికుల సభల్లోనూ, సమావేశాల్లోనూ, వారిద్దరూ ఒకరినొకరు చూసుకోడం తటస్థించేది, నీజ్ని నోవ్‌గొరొద్ వీధుల్లో కలుసుకునేవారు, కాని తమ ప్రేమను ఒకరితో ఒకరు వ్యక్తం చేసుకునేందుకు నిశ్చయించుకోలేకపోయారు. కాని ఎప్పుడైతే ప్యోత్ర్ అరెస్టయి, కోర్టు తీర్పుకోసం ఎదురుచూస్తూ, మాస్కోలోని జైల్లో కాలం గడపవలసి వచ్చిందో, అతన్ని చూసేందుకని అతని తల్లి అన్నా కిరిల్లొవ్నా ఎప్పుడైతే జైల్దేరి వెళ్లిందో అప్పుడు ఆమెతో అతని "కాబోయే భార్యగా" జోసెఫీనా గాషేర్ అక్కడకు కూడా వెళ్లింది.

ప్రవాసంనుండి జలోమొవ్ పలాయనం గోర్కీ సహాయంతో ఏర్పాటుచెయ్యబడింది. జలోమొవ్ పీటర్స్‌బర్గ్‌లో అజ్ఞాతవాసంలో వుండి బోల్షివిక్ ఆర్గనైజేషనులో పనిచేస్తూండేవాడు, 1905 విప్లవంలో మాస్కోలో కార్మికుల సాయుధ దళాలను సంఘటితపరచే కార్యంలో పాల్గొన్నాడు.

ప్యోత్ర్ జలోమొవ్ మక్సీమ్ గోర్కీని తొలిసారిగా 1905లో పీటర్స్‌బర్గ్ సమీపంలో వున్న కుఓక్కాల బంగళాలో కలుసుకున్నాడు.

భవిష్యత్ నవలా రచయిత, భవిష్యత్ వ్లాసొవ్ భూమికకు ప్రాగూపుడూ, ఇదివరకే కొన్ని యేళ్లనుండీ పరిచితులే, కాని వ్యక్తిగతంగా కాకుండా కేవలం ఇతరులద్వారానే. సొర్మొవొలో జరిగిన మేదినోత్సవానికి ఇంకా ముందే జలోమొవ్‌ను కలుసుకుందుకు గోర్కీ అవకాశంకోసం అన్వేషించాడు. అయినప్పటికీ ప్యోత్ర్ మాత్రం, పోలీసు రిజిస్టర్లలో తనకి "చెడ్డ పేరు" ఉండడంచేతనూ, విప్లవకారి అయిన రచయితను ఇరుకునపెట్టేందుకు పోలీసులు ఎటువంటి అవకాశాన్నయినా ఉపయోగించుకుంటారనే సంగతి తాను ఎరిగి వుండడంచేతనూ, తనను కలుసుకున్నయెడల గోర్కీకి ఏమి చిక్కులు కల్గుతాయో అని భయపడ్డాడు. మేదినోత్సవ ప్రదర్శన నాయకుల అరెస్టు జరిగిన తరువాత జలోమొవ్ గురించీ అతని కామ్రేడ్ల గురించీ గోర్కీ ఎంతో జాగ్రత్తతో కనుక్కుంటూండేవాడు. వారికి (స్వగ్రామస్థులైన నీజ్ని నోవ్‌గొరొద్ వాసులకు) తన ఊతం ఉంటుందని అతడు ప్యోత్ర్ తల్లి అన్నా జలోమొవా ద్వారా వాగ్దానంచేశాడు. సైబీరియాలో వారి "జీవన భృతి" కోసం డబ్బు పంపడం అతడు ఒక్క నెలైనా మరచిపోలేదు. జలోమొవ్ కుటుంబ అవసరాలను గురించి అతనికి తెలిసిన తరువాత వెనుకటికంటె రెండింతల ఆర్థిక సహాయాన్ని అతడు అందజేస్తూవచ్చాడు. చిట్టచివరకు జలోమొవ్ "పలాయనం కోసమని" గోర్కీ ముప్పై రూబుళ్లు పంపాడు.

పారిపోయివచ్చిన ప్రవాసి పీటర్స్‌బర్గ్ చేరుకున్నాడు. ఆ పట్నంలో అతను తొలుత దర్శించినవారిలో గోర్కీ ఒకడు.

రైల్వే స్టేషనులో దిగకుండా (రైల్వే స్టేషనులో దిగితే పోలీసు గూఢచారులకు దొరికి

పోవడం తప్పదు!), ప్యోత్ర్ అంతకుముందుగానే రైలునుండి దొంగచాటుగా జారుకుని అడవి లోకి వెళ్లిపోయాడు. ఒక బంగళా చిన్నగేటు దగ్గర ఆగాడు. చిత్రపటాలద్వారా తనకు సుపరిచితుడైనట్టి బక్కపలుచని పొడుగాటి వ్యక్తి ముంగిట వుండడం చూశాడు.

"అలెక్సేయ్ మక్సీమొవిచ్!" అని ప్యోత్ర్ ఆ వ్యక్తిని సంబోధించి, తానెవరో చెప్పుకున్నాడు.

తనకు స్వాభావికమైనట్టి మనోహరమైన చిన్న నవ్వు నవ్వుతూ గోర్కీ తన అతిథిని కలుసుకుందుకు ఎదురు వెళ్లాడు. వ్యగ్రామస్థులిద్దరూ ఒకరినొకరు కౌగలించుకున్నారు. గోర్కీ జలోమొవ్ కేసి చూస్తూ ఆనందంతో అన్నాడు:

"మీరు ఇలా వుంటారన్నమాట!"

అతిథిని పోర్చిలోకి తీసుకువెళ్లి సౌఖ్యమైన కుర్చీలో కూచోబెట్టాడు గోర్కీ. ఇక అప్పుడు ఆరంభమైంది సవివరమైన సంభాషణ. తాను రచయిత అవడంచేత గోర్కీ ప్యోత్ర్ని అతని జీవితం గురించీ, అతని తల్లితండ్రులను గురించీ, అతని విప్లవ కార్యకలాపం గురించీ, సోర్మొవొలో జరిగిన ప్రదర్శన గురించీ అడిగాడు. కార్మిక ప్రచారకుడు – తన మనస్థితిని గురించి తక్కువగా, తాను గన్న స్వప్నాలను గురించి అసలు చెప్పకుండా – వాస్తవ విషయాలను గురించి వ్యవహారసరళిలో ముక్తసరిగా వివరించాడు. వారిద్దరూ స్నేహంతోనూ, హృదయపూర్వకంగానూ ఒకరికొకరు వీడ్కోలు చెప్పకొని, తదుపరి సమావేశాలను ఏర్పాటుచేసుకున్నారు. ఆ రోజుల్లో గోర్కీ తన స్నేహితుల్లో ఒకరి పేర ప్యోత్ర్ని గురించి ఇలా రాశాడు: "సోర్మొవొ నగరవాసి ఒకతను నాదగ్గరకు తరుచు వస్తున్నాడు – ఎటువంటి అద్భుతమైన కుర్రవాడనుకున్నావ్!"

అతనికి ముఖ్యమైన పార్టీ బాధ్యతలను ఒప్పగించారు: "మాస్కోలోని సాయుధ దళాలకు ఆర్గనైజరుగా నియామకం జరిగింది.... మాస్కోలో తిరుగుబాటు ప్రారంభానికి కొద్ది దినా లకు ముందు, బాంబులకు కేసింగులను తయారుచేసేవాణ్ణి. పదినెలల కుమార్తెను తీసుకుని సైబీరియానుండి నా దగ్గరకు వచ్చివేసిన నా భార్య జోసెఫీనా ఎదువార్దొవ్నా జలోమొవా ఈ పనిలో నాకు సహాయం చేసింది. తిరుగుబాటు రోజుల్లో బారికేడ్ సంఘర్షణల్లో పాల్గొ న్నాను. 1906 వేసవికాలపు ఉత్తరార్ధంలో నెత్తురు వాంతులూ, పూర్తి నిస్త్రాణ కార ణంగా అజ్ఞాతవాసం వదిలిపెట్టేసి, చట్టసమ్మతమైన జీవితం చేపట్టక తప్పిందికాదు."

ఈవిధంగా నీజ్ని నోవ్‌గొరొద్‌లో జన్మించిన మెకానిక్ ప్యోత్ర్ జలోమొవ్ తన కుటుం బాన్ని తీసుకొని కూర్‌స్క్ రాష్ట్రంలోని సూద్‌జ అనే ఒక చిన్న పట్నంలో ప్రత్యక్షమయాడు. ఆ వూరు దాటి బయటకు వెళ్లడం అతనికి నిషిద్ధమవడం కారణంగానూ, అతను పనిచేయ కూడదని నిషేధించబడిన కారణంగానూ వాస్తవానికి సూద్‌జలో జీవితం ప్యోత్ర్‌కి రెండవ ప్రవాస జీవితమే అయింది. అడుగడుగునా అతనివెంట వుండేవారు పోలీసులు. ఆకలిపస్తులూ, జైలూ, ప్రవాస జీవితమూ కారణంగా క్షీణించిపోయిన అతని ఆరోగ్యం ఆ సంవత్సరాల్లో

మరింత అధ్వాన్నమైపోయింది. కుటుంబ భారం భార్యపైన పడింది. భార్య — జోసెఫీనా ఎదువార్డోవ్నాకి ఆ వూరి హైస్కూల్లో ఉపాధ్యాయురాలుగా పని దొరికింది. ఆ రోజుల్లో గడిపిన జీవితం జ్ఞప్తికితెచ్చుకుని జలోమొవ్ తన స్మృతుల్లో ఇలా రాశాడు: "1917 ఫిబ్రవరి విప్లవం ముందు మళ్ళీ రాజకీయ గూఢచారుల కఠినమూ, రహస్యమైన నిఘా అజమాయిషీలు నాపైన ఉండేవి. రైతుల మధ్య వ్యక్తిగతమైన ప్రచారం చేసేందుకు మాత్రమే వీలుపడింది."

1917 ఫిబ్రవరి వచ్చింది, దాని వెంట అక్టోబరు ప్రజ్వరిల్లింది. సోర్మొవో ధ్వజ ధరుడు, దృఢచిత్తుడైన విప్లవకారుడు — మళ్లీ కార్యంలోకి దూకాడు. పీటర్స్‌బర్గ్‌లో జరుగుతూన్న ఘటనల సారం గురించి మొట్టమొదటి బహిరంగసభలకు వచ్చిన రైతులూ, చేతివనివారల ఎదుట అతను ఉద్రేకపూరితంగా ఉపన్యసించాడు.

తన సోదరుడు అలెక్సాంద్ర్ పేర ప్యోత్ర్ జలోమొవ్ రాసిన వుత్తరంలో, విప్లవ సంవత్సరాల్లోనూ, అంతర్యుద్ధంలోనూ తన జీవితాన్ని ఈవిధంగా జీవకళతో చిత్రించాడు: "...1917లో తాలూకాలలో సోవియట్ ప్రభుత్వాన్ని స్థాపించడంలో పాల్గొన్నాను.... కొద్ది దినాల్లో కార్మిక కమిస్సార్‌గా ఎన్నికయాను.

"వైట్ గార్డ్లు నూద్‌జ పట్నాన్ని స్వాధీనంచేసుకున్న రోజుల్లో నన్ను పట్టుకుని ఉరితీసేందుకు కొన్ని సార్లు ప్రయత్నించారు. కాని ఉచ్చును మూడు సార్లు తప్పించుకుని పారిపోగల్గాను. చివరిసారి మాత్రం దెనీకిన్ మనుషులు నన్ను అరెస్టుచేసి, సైనిక న్యాయస్థానం ఎదుట విచారణకు నిలబెట్టారు. జైలు వార్డర్లు నన్ను చూసి వెటకారా లాడేవారు, నన్ను ఉరికంబానికి ఎక్కించుతామనీ, తుపాకితో కాల్చిపారేస్తామనీ ప్రతిరోజూ జడిపించేవారు.... ఇక వాళ్లు తమ బెదరింపులను, సహజంగానే, అమలుజరిపి ఉండేవారే — ఎర్ర సైన్యం అక్కడ ప్రత్యక్షం కాకపోయి వుంటే."

మృత్యువు నోట పడకుండా జలోమొవ్‌ని ఎర్ర సైన్యం రక్షించింది. కాని అతను చాలా జబ్బువడిపోయాడు: అతి నిదానమైన వైద్యచికిత్స అవసరమైంది. జలోమొవ్ మాస్కోకు వెళ్లి ఆస్పత్రిలో చేరాడు — ఆస్పత్రిలో దీర్ఘకాలం వుండాల్సివచ్చింది. బలం కొద్దిగా చేకూ రింది, తన వెనుకటి మిత్రులతో స్నేహసంబంధాలను స్థాపించుకోగల్గాడు. గోర్కీ కథా నాయకుని జీవితం కొత్త చాలులో నడిచింది.

స్వాభావికంగా మందస్థాయి ఆందోళనాకారుడైన ప్యోత్ర్ జలోమొవ్ రైతులమధ్య గొప్పగా పనిచేశాడు: పత్రిక చదివి వినిపించుతూ, సోవియట్ అధికారం గ్రామాల్లో అను సరించుతూన్న విధానాల గురించీ, ప్రభుత్వం జారీచేసిన కొత్త ఉత్తర్వులను గురించీ తీర్మా నాలను గురించీ ప్రజలకు సులభంగా స్పష్టంగా అర్థమయే రీతిలో చెప్పేవాడు.

వ్యవసాయ సమష్టీకరణోద్యమం ప్రారంభమవడంతో ప్యోత్ర్ నూద్‌జ ప్రాంతంలోని

రైతులను కూడగట్టి వారిచే ఆ ప్రాంతంలో "అరుణ అక్టోబరు" సమష్టి వ్యవసాయ క్షేత్రాన్ని ఆర్గనైజ్ చేశాడు. ఆ సమష్టి క్షేత్రానికి అధ్యక్షుడుగా అతను కొన్ని సంవత్సరాలు పనిచేశాడు, ఆటుతరువాత ఆ సమష్టి క్షేత్ర అధ్యక్ష వర్గంలో సభ్యుడుగా వుంటూండేవాడు.

బాధాకరితమైనట్టి, అమిత నిస్త్రాణకరమైనట్టి జబ్బు తనను పీడించుతూన్నప్పటికీ, వైద్యుల సలహాను లక్ష్యపెట్టకుండా ప్యోత్ర్ జలోమొవ్ పనిచేస్తూనే వచ్చాడు. విప్లవ కార్యాచరణలో గడిచిన తన యవ్వనం గురించీ, గోర్కీతో తన సమావేశాలను గురించీ తన స్మృతులను అతడు రాస్తూవుండేవాడు. గోర్కీ నవల "అమ్మ" పాఠకులతో విస్తృతమైన ఉత్తరప్రత్యుత్తర వ్యాసంగం సాగించుతూవుండేవాడు. జీవితంపట్ల తన అవగాహన గురించి తన స్నేహితుల్లో ఒకరికి రాసిన ఒక ఉత్తరంలో ప్యోత్ర్ జలోమొవ్ ఇలా అన్నాడు: "తన దౌర్భాగ్యపు ప్రాణంకోసం గజగజ హడలే బానిస, తన స్వేచ్ఛకోసం పోరాడేందుకు నిశ్చయించుకున్న బానిస, తనకింకా సంకెళ్ళు ఉన్నప్పటికీ, నా అభిప్రాయంలో స్వేచ్ఛాజీవే అవుతాడు. బానిసలు ఉండనే కూడదు. బానిసలంటే నేను ఇష్టపడను. సమరశీలురంటేనే నా కిష్టం, స్వేచ్ఛాజీవిగా ధైర్యంకల్గిన జనమంటేనే నా కిష్టం."

గోర్కీని మంత్రముగ్ధుణ్ణి చేసినట్టి, సామాన్య శ్రేణికి చెందినట్టి విప్లవ సైనికుడు ప్యోత్ర్ జలోమొవ్ ఆశయాల కారణంగానే, తన నైతిక చిత్తశుద్ధి కారణంగానే మనను కూడా మంత్రముగ్ధులను చేస్తున్నాడు. అతనిలోనూ, అతని జీవితంలోనూ, అతని భవితవ్యంలోనూ చైతన్యవంతుడైన ఇరవయ్యో శతాబ్ది రష్యన్ కార్మిక విప్లవకారుని ఉత్తమ గుణాలు ప్రతిబింబితమయాయి.

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దాని అనువాదం గురించీ మీ అభిప్రాయాలను "రాదుగ" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి.

మీ అభిప్రాయాలను ఈకింది చిరునామాకు పంపండి:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

